# అవతారిక

## గ్రంథం

పోతన భాగవతంలోని పద్యాలు కొన్నిటిని అయినా మననం చేస్తుండటం చాలా మంచిది. మంచి జరుగుతుంది. పిల్లల చేత చదివిస్తుంటే ఎంతో మంచిది. జ్ఞాపక శక్తి పెరుగుతుంది, చదువు బాగా వచ్చి వంట పడుతుంది. అందుకే — "చదువుకుందాం భాగవతం - బాగుపడదాం మనం అందరం" అని పెద్దలు గురువులు అంటారు. అంతటి గొప్ప గ్రంథమిది. అట్టి పోతన భాగవతంలోని "శ్రీ కృష్ణా యదు భూషణా", "అమ్మలగన్న యమ్మ", "మందార మకరందమున దేలు", "ఇంతింతై" . . . లాంటి అద్భుతమైన పద్యాలు కొన్నిటిని అయినా తెలియని వాడు తెలుగు వాడే కాదు అంటారు. ఇది పెద్దల మాట; గురువుల మాట; మహర్షుల మాట. ఎవరు హైందవ ధర్మంలో ఏ ఆధ్యాత్మిక ప్రవచనం తెలుగులో చేయాలన్నా పోతన పద్యం స్మరించక తప్పదు అన్నది ప్రతీతి.

ఇటువంటి పోతన విరచిత భాగవతం సమగ్రంగా, సంపూర్ణంగా, టీక టిప్పణాదులతో తెలుగుభాగవతం.ఆర్గ్ అందిస్తున్నది; విశ్వ వ్యాప్తంగా ఎవరికి, ఎప్పుడు, ఎక్కడ కావాలన్నా సిద్ధంగా అంది స్తున్నది. పెద్ద తరం వారికి, యువ తరానికి, నవ తరానికి మరియు రాబోయే తరతరాలకు కూడ అనుకూ లంగా ఉండేలా చేయబడింది. ససంపూర్ణంగా ప్రతి పద్యం వినటానికి ఉంది. సమగ్రంగా తెలుగుభాగవతా నికి చెందిన సమస్తం, ఒక విజ్ఞానసర్వస్వంలా (ఎన్ సైక్లోపీడియాలా) ఒకే చోట ఉచితంగా అందిస్తోంది మన తెలుగుభాగవతం.ఆర్గ్. అంతేకాదు మంత్రాలు, వ్రతాలు, విగ్రహాలు, వేదవిద్యలు వంటివి కొనుక్కో దగ్గవి కావు, గురువులు పెద్దలు ప్రసాదిస్తే, అందుకొని తరించ దగ్గవని శాస్త్రం చెపుతోంది అంటారు.

## మూల భాగవతం

మరి ఈ ఉద్గ్రంథానికి మూలం సంస్కృత భాగవత పురాణం. మూలం ఎంత గట్టిదైతే చెట్టు అంత గొప్పది అవుతుంది కదా; అంత మంచి ఫలాలను ఇస్తుంది కదా. అలాంటి ఈ తెలుగు భాగవత కల్పవృక్షం బహు అద్భుతమైన ఫలాలను వందల ఏళ్ళ నుండి మన తెలుగులకు అందిస్తోంది. ఈ కల్పవృక్షం మూలం గురించి కొద్దిగా తొంగి చూద్దాం.

శ్రీమద్భాగవతమును పంచమ వేదం అంటారు. అష్టాదశ పురాణాలు లోనూ ముఖ్యమైనది. మూల కర్త వ్యాస మహర్షి. వీరిని, వేదాలను విభాగించిన మహర్షి కనుక, వేద వ్యాసుల వారు అంటారు. వీరు ద్వాపరయుగం చివరి కాలంలోని వారు. అనగా, సుమారు కీ. పూ. 3,000 ప్రాంతం వారు అన్నమాట. అంతటి మహానుభావుడు; మహాభారతంతో పాటు అష్టాదశ పురాణాల కర్త అయినవాడు; ఒకానొక సందర్భంలో ఇన్ని ఉత్కృష్టమైన ధర్మ గ్రంథాలు వ్రాసినా మనసు శాంతి పొందలేదు అని

బాధపడుతున్నాడు. దేవర్షి, త్రికాలజ్ఞుడు, పరమ భాగవతోత్తమ శ్రేష్ఠుడు అయిన నారదుల వారు విచ్చేసి, భాగవత పురాణం చేపట్టు, నీ పట్టులన్నీ విడిపోతాయి; ఆ భాగవతం వలన నువ్వు బాగుపడతావు; మానవజాతికి బాగుపడే మార్గం దొరుకుతుంది; చేపట్టు అని ఆ మహర్షిని ఆజ్ఞాపించాడు. అంతటి గట్టి మూలం ఉన్నది మన ఆంధ్రుల పాలిటి అమృత భాండం అన దగ్గ మన తెలుగు భాగవతం.

## రచన

బమ్మెర పోతనామాత్యుల వారు తెలుగులకు అందించిన అద్భుత వరప్రసాదంగా అ మ్మహా పురాణాన్ని "పోతన భాగవతం" అని ప్రస్తుతిస్తారు. కాని నిజానికి ప్రస్తుతం అందుబాటులో ఉన్న పోతన భాగవతంలో, కారణాలు ఏవైతేనేం కొన్ని పూరణలు, కొన్ని ప్రక్షిప్తాలు ఉన్నాయి. బమ్మెరవారు సంపూర్ణంగా వ్రాసారు కాని శ్రీరాముడికి తప్ప ఇతరులకు అంకితం ఇవ్వనన్న ప్రపత్తితో ఉండటంతో. అప్పటి పాలకుడైన సింగరాజు భూపతి కోపంతో మొత్తం తాళపత్ర కట్టలు అన్నీ భూస్థాపితం చేసాడని, తరువాత బయటకు తీసేసరికి కొన్ని పత్రాలు చెదలు తిని నష్టపోయాయనీ; పోతన కాలధర్మం చేసాకా కొంతకాలానికి వారి కొడుకు పూజామందిరంలో ఈ ఉద్గ్రంథాన్ని కనుగొన్నాడు. పోతన శిష్యుడు, తన సహాధ్యాయి అయిన గంగనతో కలిసి కాల ప్రభావం వలన నష్టపోయిన భాగాలు పూరింప జేసారు అనీ, ఇలా రకరకాల గాథలు ప్రచారంలో ఉన్నాయి. స్థూలంగా చెప్పుకోవాలంటే 1, 2, 3, 4, 7, 8, 9, 10 (రెండు భాగాల) స్కంధాలు (7949 పద్యగద్యలు) పోతనామాత్యుల వనీ; 5వ స్కంధం (352 పద్యగద్యలు) గంగన వారి రచన అనీ; 6వ స్కంధం (531 పద్యగద్యలు) సింగయ రచన అనీ; 11 మరియు 12 స్కంధాలు (182 పద్యగద్యలు) నారయ రచన అనీ ఎక్కువ ప్రచారంలో ఉన్నది. దానినే ప్రమాణంగా తీసుకొని తెలుగుభాగవతం చేపట్టటం జరిగింది. ఇవే కాకుండా 21వ శతాబ్దం వచ్చేసరికి, ఈ ఆరు వందల ఏళ్ళలో కాల ప్రభావం వలన కొన్ని ప్రక్షిప్తాలు కూడా చోటుచేసుకున్నాయి. పై ముగ్గురిలో నారయ ఒక్కరే తన కృతిలో పోతన శిష్యుడను అని ధృవీకరించి చెప్పారు. వీరిలో సింగయ ఒక్కరే తన స్కంధానికి, స్వతంత్ర కావ్యానికి అనుసరించే అప్పటి ప్రమాణాలు అయిన కృతిపతి నిర్ణయం, షష్ఠ్యంతాలు మున్నగునవి వ్రాసారు.

## పోతనామాత్యులు

సహజ కవి అయిన పోతనామాత్యుల వారు వ్యాసుని అపరావతారం. వారు పుట్టుకతోనే స్వభావరీత్యా కవి రత్నం. వారి తల్లిదండ్రులు, గురువుదేవులు, స్వంత సాధనలు అనే సానలమీద సానపెట్ట బడిన జాతి రత్నం లాంటి పండితుడు. వీరు జీవించిన కాలం గురించి ఇప్పటి వరకు ఏదీ నిర్దుష్టంగా నిరూ పితం కాలేదు. కాని, స్థూలంగా కీ. శ. 15వ శతాబ్దం వారు అని చెప్పవచ్చు అంటారు. అసంఖ్యాక గ్రంథాల సారం ఒడిసిపట్టిన మేటి. గంటం పట్టి గ్రంధ రచనా వ్యవసాయం నడిపిన మహా

పండితుడు; హలం పట్టి పొలం పని నడిపిన కృషీవలుడు; పండిత పామరులను మెప్పిస్తూ కథనం నడిపిన కవీశ్వరుడు; నిగర్వ నియోగి; వర శైవ కుటుంబంలో పుట్టి, పెరిగి, వైష్ణవం వంటబట్టించుకుని, శ్రీరామచంద్రుని ఆజ్ఞను శిరసా వహించి, భాగవతరచన సాగించిన మహానుభావుడు. పరమ అద్వైత సిద్ధాంతని శ్రీధరుల వంటి మహా పండిత విమర్శాగ్రేసరులు అంటారు. విశిష్ఠ విశిష్ఠాద్వైతి అని రామానుజార్యుల మంతం వారు అంటారు. వీరి శైలి బహు మృదుమధురం. పంచదార పాకం. జన సామాన్యం నుండి పండిత వరేణ్యుల వరకు అందరిని అలరిస్తుంది. ఇది మంత్రాలలో గాయత్రి వలె బాగా ప్రభావవంతమైనదిగా కాలపరీక్షకు నెగ్గినదని పెద్దలు ఎప్పటినుంచో అంటున్నారు. అందుకే, కల్యాణం ఆలస్యం అవుతుంటే రుక్మిణీ కల్యాణ పారాయణ; కష్టాలుచుట్టుముడుతుంటే నారాయణ కవచం ప్రయోగించట వంటివి ముందునుంచీ ఉన్నవే.

పోతనప్రణీతమైన ఆంధ్రమహాభాగవతమును అనేక మహాపండితులు ప్రసిద్ధ సంస్థలు పుస్తక రూపంలో ముద్రించాయి. అయితే ప్రస్తుత కాలానికి అనువైన అంతర్జాలం, కంప్యూటర్లలో చదువుటకు వీలుగా అందిస్తున్నాము. విండోస్ ఉండి ఎమ్ ఎస్ ఆఫీసు లో యూనికోడ్ లిపితో కావలసిన భాగం సులువుగా చదువుకొనుటకు వీలుగా చేసాము. ఈ మహాగ్రంథంలో 31 రకాల ఛందోప్రక్రియలలో మొత్తం 9048 పద్యగద్యలతో విస్తారమైనది. సీసంక్రింద వాడిన తేటగీతి, ఆటవెలది పద్యాలను కూడ లెక్కలోకి తీసుకుంటే మొత్తం 1061 పద్యగద్యలు. ఛందోప్రక్రియ వారి వీటి గణన కూడ చేయబడ్డాయి. ఏ భాగం కావాలంటే అది కాపీ-పేస్టు, వెదుకుటలకు వీలుగా ఉండేలా చేయబడింది.

## సంకలన కర్త

తూర్పు గోదావరి జిల్లా, ఊలపల్లి గ్రామస్థులు చిట్టిరాజుగారి కుమారుడు అచ్యుత రామయ్య గారు మఱియు విశాఖపట్నంజిల్లా శ్రీరామపురంగ్రామస్థులు సాంబశివరావుగారి కుమార్తె వేంకట రత్నం గారు దంపతులు బహు సాత్వికులు ఉన్నత సంస్కారులు. ఆ దంపతులకు ఇద్దరు కొడుకులు లక్ష్మీ నారాయణ దేవ్ మఱియు సాంబశివ రావు, ఇద్దరు కూతుళ్లు శేష కుమారి, లక్ష్మి. రెండవ కుమారుడు సాంబశివ రావు విరోధి నామ సంవత్సరంలో (క్రీ.శ. 1949) జన్మించాడు. ఆ బాలుడుని తల్లిదండ్రులు, అన్నగారు ఎంతో గారాబంగా పెంచారు. ఆటపాటలలోనే కాదు చదువులలో కూడా ముందుండే అతనిని, అనుగ్రహించి రాయవరం గ్రామస్థులు పూజారి తాతగారు పురాణ, ఆధ్యాత్మిక గ్రంథాల పఠనం పరిచయంచేసారు. ఆ సాంబశివరావు దంపతులకు ఫణి కిరణ్, భాస్కర కిరణ్ అనే ఉత్తములు కలిగారు. ఈ ఊలపల్లి సాంబశివ రావు వృత్తిరీత్యా విద్యుత్తు ఇంజనీరుగా క్రీ.శ. 2007లో పదవీవిరమణ చేసాక, భాగవత గణనధ్యాయం చేప్పట్టారు. గణనాధ్యాయంలో భాగంగా ఈ తెలుగుభాగవతం.ఆర్గ్ నిర్మాణం చేసి అంతర్జాలంలో అందిస్తున్నారు.

గణనాధ్యాయము అను స్వీయ (self) భావసంగ్రహణం (coceptulisation) ప్రకారం ప్రామాణిక మాతృభాషా గ్రంథం తీసుకుని, ప్రమాణికమైన గణని దస్త్రము (ఇ.ఫైల్) చేసి, దానికి అధిక విలువలు ప్రక్షిప్తం చేసి. అనగా, ఛందో, వ్యాకరణ, భాషా విషయానుసార గణనలు, అకారాది వంటివి సంబంధ్యంత గ్రంథాలు, సమాచారం చేర్చడం. తద్వార ఏకగవాక్షంలో సమగ్రంగా అందించడం. దీని అమలు ప్రసంకల్పం (hi-concept) గణనాలయము అను సంస్థ. ఇది 2007-08 లో ఆరంభించబడినది. ఇందు చేపట్టిన ప్రకల్పములు (projects):~అ) పోతన తెలుగు భాగవతం ప్రకల్పం (project) :- పోతన ప్రణీతమైన భాగవత పురాణము. ఇది జయప్రదముగా అయినది. ఇందు తెలుగుభాగవతం.ఆర్గ్, తెలుగు భాగవత ప్రచార సమితి మున్నగు సంస్థలు బాధ్యులు. ఇది 2008 నుండి నడుస్తున్నది. అనేకుల వారి వారి వ్యుత్పన్నములు వచ్చుచున్నవి. ఆ) ప్రబంధములు ప్రకల్పం (project) :- 1. మను చరిత్ర, 2, విజయ విలాసము - మూల పాఠం, లఘుటీక, భావాలు సిద్ధం అయినవి. 2017-19 ఇ) మొల్ల రామాయణము :- మూల పాఠం, లఘుటీక, భావాలు సిద్ధం అయినవి. 2018. ఈ) వాల్మీకి తెలుగు రామాయణము :- మూలపాఠం, ప్రతిపదార్థము, భావము మున్నగునవి తయారగుచున్నవి. 2022-23 (శుభకృత్తు) నందు ఆరంభమైనది.

## కృతజ్ఞతలు

ఈ తెలుగుభాగవతం.ఆర్గ్ ఇలా మనకి ఉచితంగా సర్వ సిద్ధంగా వ్యాపారాత్మక రహితంగా అందుతోంది అంటే; ఈ కృషికి వలసిన పుస్తకముల రచయితలకు, ప్రచురణకర్తలకు, అంతర్జాల సంస్థలకు, ఈ పని ఆరంభించినప్పుడు ప్రోత్సహించి "ఇది నలుగురికి అందుబాటులోకి రావాలి సుమా" అని సహకారం అందించిన సత్యనారాయణ మాష్టారు, తొలి పరిచయం నుండి ఆత్మీయంగా ప్రోత్సహిస్తున్న తెలుగు విశ్వ విద్యాలయ ఆచార్యులు ఎ. ఉషాదేవి గారు, ఆచార్య వెలుదండ నిత్యానంద రావు గారు, ఆచార్యవరేణ్యులు ఎల్చూరి మురళీధరరావు గారు, జాలికలో చూసి ఆత్మీయులైన కవి, అష్టావధాని, జాలజనులు చింతా రామకృష్ణా రావు గారు, ఆత్మీయ మిత్రులు తెలుగుభాగవతం.కం ప్రారంభించడానికి మూల కారకులు జాలజనులు ఛార్టర్డు ఎకౌంటెటు వేంకట కణాద గారు, జాలగూడు పునర్నిర్మాణ నిర్వాహణ బాధ్యతలు చేపట్టిన చిరంజివి మోపూరు ఉమా మహేశ్ ఇలా సహకరించిన ప్రోత్సాహించిన మిత్రులు పేరు పేరునా అందరకు,ఇక్కడ ఒక మరువలేని జ్ఞాపకం మీతో పంచుకుం టాను. ఈ ప్రయత్నారంభంలో చాలా ఇబ్బంది పడుతుంటే, మా వెలుదండ నిత్యానందరావు గారు ఎక్కిరాల కృష్ణమాచార్యులు మాష్టారు వారి భాగవతప్రకాశముతీసుకోమని ఉత్తి మాటలతో వత్తిడి చేయ కుండా పుస్తకాల షాపుయజమాని సాంబశివరావు గారికి చెప్పిమాఇంటికి సెట్టు పంపించేలా చేసారు. ఆ మేలు జన్మజన్మలు మరువలేను. ఇంకా మా తెలుగుభాగవతం అంతర్జాల జాలగూడు ఆదులను నిర్మిం చుట నిర్వహించుట మున్నగు వాటికి అమూల్య సహాయ సహకారాలు అందించిన వారికి అందరికి కృతజ్ఞతలు, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్

విద్యుత్ సంస్థ ఇచ్చే పదవీవిరమణ భృతి లేకపోతే ఈ కార్యం చేపట్టే ధైర్యం ఉండేదే కాదు. ఆ మాతృ సంస్థ, దీనినుండి విడివడిన విద్యుత్తు ప్రసార సంస్థకు కృతజ్ఞతా సహస్రాలు. అంతులేని సహకారం అందించిన కుటుంబ సభ్యులు అందరికి పేరుపేరునా కృతజ్ఞతలు.

ఇలా ఇందరి శ్రమకోర్చి చేసిన సేవా ఫలితమైన ఈ తెలుగుభాగవతం.ఆర్గ్ గణని (గణక యంత్రం, కంప్యూటరు), టాబ్ (టాబ్లెట్టు), సంచారిణి (మొబైలు ఫోను), ఐపోను, ఐపాడ్ మున్నగు సకల పరికరాలలోను అందుబాటులో ఉంటుంది.

ఈ ఉద్గ్రంథంలో 12 స్కంధాలు ఉన్నాయి. పంచమ (5), దశమ స్కంధాలు రెండేసి భాగాలుగా ఉన్నాయి. ఈ పద్యాలుగింటి గురించి చిరు పరిచయం చూద్దాం. మరిన్ని వివరాలు ఆయా స్కంధాల భూమికలలో చూడగలరు.

## ప్రథమ స్కంధము

ప్రథమ స్కంధం పురాణం దశ లక్షణాలలోని ప్రథమ లక్షణం "సర్గ" కు ప్రతీక అంటారు. ఈ స్కంధం గ్రంధానికి పరిచయం లాంటిది, ఆవిష్కరణ లాంటిది. అసలు ఎత్తుగడలోనే “శ్రీ కైవల్య పదంబు జేరుటకునై” అనే ప్రార్థన పద్యంలో భాగవతం మొత్తం సూచించారు. పలికెడిడిది భాగవత మట అనిన భక్తి ప్రపత్తి, అందరిని మెప్పించెద కృతుల అన్న ఆత్మ విశ్వాసం మన పోతన్నది.

శ్రీ కృష్ణ నిర్యాణం ఈ ఆరంభ స్కంధంలో సూచించబడింది. భాగవతానికి శ్రోత పరీక్షిత్తు మహారాజు జననం, ప్రయోక్త శుక ముని ప్రవేశం పరిచయం చెప్పబడ్డాయి. వేద కల్ప వృక్ష విగలిత మై అని భాగవతాన్ని నిర్వచించినది ఈ స్కంధంలోనే.

భీష్మ స్తుతి, కుంతి స్తుతి వంటి అత్యద్భుతమైన వేద సార భరితాలు ఇక్కడ అందించారు. శ్రీ కృష్ణా యదు భూషణా, గురు భీష్మాదులు గూడి వంటి అమృతగుళికలు లాంటి పద్యాలు రుచి ఇక్కడ ఆస్వాదించగలము.

## ద్వితీయ స్కంధము

ద్వితీయ స్కంధంలో పోతనగారి తెలుగు సేతలో యోగ, భక్తి తత్వాలు, భగవత్తత్త్వం, ప్రపంచోద్భవం, వివిధ ధర్మాలు, పురాణ లక్షణాలు వగైరా వివరించబడ్డాయి. విష్ణుమూర్తి 24 అవతారాలు వర్ణించబడ్డాయి. హరి మయము, కమనీయ భూమి భాగములు, అణువో కాక మున్నగు ముత్యాల లాంటి పద్యాలు ఇక్కడ ఆస్వాదిద్దాం రండి రసిక హృదయులారా!

## తృతీయ స్కంధము

తృతీయ స్కంధంలో పోతనామాత్యులు విశ్వ స్వరూప, కాల స్వరూప వివరణలు, కృష్ణ భక్తి తత్వం, వరాహావతార వర్ణన, దేవహూతి కపిల సంవాదం పేరుతో సాంఖ్య యోగ తత్వం వివరించారు. శ్రీ కృష్ణ నిర్యాణం వివరించారు. వారి తండ్రి పాలు, ఒకని కై యిట్లు, కంటి గంటి, బొరలు గెరలు, దేవ జితం, హవ రూపివి, వర వైకుంఠము వంటి మణిపూసల లాంటి పద్యాల నెలవు ఈ స్కంధం.

## చతుర్థ స్కంధము

చతుర్థ స్కంధంలో భక్తుల భక్తి తత్వాలు వర్ణించబడ్డాయి. అనయంబు శివ యను, నీలగళాపరధి, అభ్రం లిహ్ దభ్ర, దూర్వాంకురంబుల, ధరను విరులు మున్నగు చక్కటి పద్య రాజాలు ఈ స్కంధలోవే. దక్ష యజ్ఞం, సతీ దేవి దేహ త్యాగం, ధృవోపాఖ్యానం, పృథు చరిత్ర, ప్రచేతసుల విషయం మున్నగునవి బమ్మెర పోతన గారు తేనెలో ముంచిన గంటంతో గీసి గీసి వివరించారు ఈ స్కంధంలో.

## పంచమ స్కంధము - ప్రథమాశ్వాశం

పంచమ స్కంధం గంగన తెలుగు సేత. చిన్న స్కంధం. ఏక ఖండంగా రెండు భాగాలుగా లభ్యం అవుతున్నది. రెండు ఆశ్వాసాలుగా చేయబడిన గంగన తెలుగు సేత పోతన భాగవతంలో స్థానం పొందగలిగిందిగా పండితులచే అంగీకరించబడింది. పంచమ స్కంధ ప్రథమ ఆశ్వాసంలో మనువుల చరిత్రలు, భరతోపాఖ్యానం మున్నగునవి వివరించబడ్డాయి.

## పంచమ స్కంధము - ద్వితీయాశ్వాశం

పంచమ స్కంధం గంగన తెలుగు సేత. పోతన భాగవతంలో ఇది లుప్తం కావటం లేదా నష్టం కావటం వలన గంగనచే రచించబడింది. ఇది చిన్న స్కంధం అయినా ఏక ఖండంగా రెండు భాగాలుగా లభ్యం అవుతోంది. రెండు ఆశ్వాసాలుగా చేయబడిన గంగన తెలుగు సేత పోతన భాగవతంలో స్థానం పొందినదిగా పండితులచే అంగీకరించబడింది. పంచమ స్కంధ ద్వితీయ ఆశ్వాసంలో సృష్టి, ప్రళయాల వర్ణన, గ్రహాదుల గురించిన భగణం, నరకాది లోకాల వర్ణన ఉన్నాయి

## షష్ఠ స్కంధము

షష్ఠ స్కంధం సింగయ చేత ఆంధ్రీకరించబడి, పోతన భాగవతంలో స్థానం పొందే గౌరవం దక్కించుకుంది. అయినా స్వతంత్ర గ్రంథం వలె అప్పటి సంప్రదాయాల ప్రకారం ప్రార్థన, కృతి పతి నిర్ణయం, వంటివి ఉన్నాయి. సింగయ తన కృతిలో అనేక ఛందోప్రక్రియలు ప్రయోగించి విద్వత్తు ప్రదర్శించారు. అజామిళోపాఖ్యానం, నారాయణ కవచం, వృత్రాసుర సంహారం, చిత్రకేతోపాఖ్యానం,

పుంసవన వ్రతం, మరుత్తుల జన్మ రహస్యం మున్నగు హరి కథలు వివరించబడ్డాయి. ఈ స్కంధ లోని కాళికి బహు సన్నుత, దూరమున నాడు, నీకు వాడెవ్వడు, సతులెవ్వరు, హరి వరదుండయిన వంటి పద్య రత్నాలు అనేకం ఉన్నాయి, ఆస్వాదిద్దాం రండి.

## సప్తమ స్కంధము

సప్తమ స్కంధం బమ్మెర వారిచే అద్భుతంగా ఆంధ్రీకరించబడింది. బహుళ ప్రఖ్యాతి పొందిన పరమ భక్తాగ్రేసరుడు ప్రహ్లాదుని చరిత్ర వివరించబడింది. భక్తి తత్వంతో పాటు వివిధ ధర్మాలు, వివిధ వర్ణాలు వర్ణించబడ్డాయి. అలుక నైన, కీటకము దెచ్చి, ఆెక్కలు రావు, చదవని వా డజ్ఞుం, చదివించిరి నను, కమలాక్షు నర్చించు, ఇందు గల డందు, నరమూర్తి కాదు, శరియై, లేదని యెవ్వరిని, వంటి అనేక అమృతోపమేయ పద్యాలతో విరాజిల్లు స్కంధం ఇది.

## అష్టమ స్కంధము

అష్టమ అష్టమస్కంధం పురాణ దశలక్షణాలలో "మన్వంతరాలకు" ప్రతీక అంటారు. ఈ స్కంధంలో చతుర్దశ మనువుల చరితాలు వర్ణించబడ్డాయి. భిల్లీ భిల్ల, ఎవ్వని చే జనించు, కల డందురు, లావొక్కింతయు లేదు, అల వైకుంఠ పురంబులో, సిరికిం జెప్పడు, హార కిరీట, స్వచ్ఛమైన ఫణంబు, మింగెడి వాడు, హరి సూచిన, నన్ను గన్న తండ్రీ, గొడుగో, వారిజాక్షులందు, ఇంతింతై, రవి బింబ వంటి అత్యద్భుతమైన ఆణిముత్యాలు ఎన్నో అష్టమ స్కంధ పాల కడలిలో ఏరుకుందాం రండి. రండి. భాగవత ప్రియులారా! ఎంతో ప్రసిద్ధమైన గజేంద్ర మోక్షం, వామన చరిత్ర, బలిచక్రవర్తి కథ, క్షీర సాగర మథనం, కూర్మావతార వర్ణన ఘట్టాలను బమ్మెర పోతనామాత్యులు వారు స్వానుభవ పూర్వకంగా గంటం తేనెలో ముంచి, పంచదారలో అద్ది, తాళ పత్రాలపై గీసి ఇక్కడ అందించారు. రండి గ్రోలుదాం ఈ అమృతధారలను

## నవమ స్కంధము

నవమ స్కంధం "ఈశాను కథలు" అనే దశలక్షణాలలోని లక్షణానికి ప్రతీక అంటారు. ఈ స్కంధంలో పోతన్న గారు అద్భుతంగా ఆంధ్రీకరించారు. దీనిలో ప్రస్తుత వైవస్వత మన్వంతరంలో జరిగిన సూర్య వంశ చంద్ర వంశాలు వివరంగా చెప్పబడ్డాయి. ఇక్కడి రామాయణం చెప్పిన తీరు ఎంతో బాగుంది. చిన్ని యన్నలారా పద్య రత్నం దీని లోనిదే. చంద్ర వంశం శ్రీ కృష్ణుని తల్లిదండ్రుల వరకు వర్ణించబడింది. చిత్తంబు మధురిపు, హరి యని, కుఱ్ఱము గొనిపో, అలవాటు కలిమి, చిన్న యన్న లారా, లాంటి పద్య రత్నాలు ఎన్నో ఉన్నాయి ఈ స్కంధంలో. రండి ఆస్వాదిద్దాం

## దశమ స్కంధము - పూర్వ భాగము

దశమ స్కంధంలో పూర్వభాగం తెలుగుభాగవతంలో కెల్లా సుమారు 1800 పద్యాలతో మిక్కిలి పెద్దది, మధురాతి మధురమైనది. మధురాధిపతే రఖిలం మధురం అన్నట్లుగా గోపాల కృష్ణుని జన్మం, శైశవం, బాల్యం, కౌమారం, యౌవనం సహజ కవి పోతనామాత్యునిచే మధురంగా వర్ణించబడ్డాయి. ఓ యమ్మా నీ కుమారుడు, కల యో వైష్ణవ మాయ యో, భూసురు డేగెనో, వంటి అనేక పద్య రత్నాల గని, కృష్ణ లీలలు, గోపికా వృత్తాంతాలు, కాళియ మర్దనం, భ్రమర గీతాలు మున్నగు ఘట్టాలనే భక్తి శృంగారాల సమ్మిళితం ఈ స్కంధం. ఈ స్కంధాంతం లోని రుక్మిణీ కల్యాణం జగత్ప్రసిద్ధమైన మంత్ర రాజం. ఇందు లోని పద్య మాణిక్యాలలో మచ్చుకు కొన్ని :- శ్రీకంఠ చాప ఖండన, వావిం జెల్లెలు, గురు పాఠీనమ వై, చను నీకు గుడుప, తడవాడిరి, బాలురకు బాలు లేవని, ఓ యమ్మా నీ కుమారుడు, అమ్మా మన్ను దినంగ, ఱోలను కట్టుబడియు, తీపు గల కజ్జ, కర్ణాలంబిత, బాలుం డీతడు, కర్ణావతంసిత, నల్లని వాడు, భూషణములుసెవులకు, ప్రాణేశా నీ మంజుభాషలు, లగ్నం బెల్లి . . . ఈ కృష్ణ కథామృతంలో ఓలలాడదాం రండి భాగవత ప్రియులారా, సాహిత్యాభిమానులారా, భక్తవరేణ్యులారా రండి

## దశమ స్కంధము - ఉత్తర భాగము

దశమ స్కంధంలో ఉత్తరభాగం సుమారు 1300 పద్యాల పెద్ద స్కంధం. పోతన్న గారు యౌవ్వన, ప్రౌఢ కృష్ణుని కథలు, శ్రీ కృష్ణుని సంతాన వివరాలు మున్నగునవి కమ్మగా వర్ణించారు. ఉషాప్రద్యుమ్నుల కథ, శమంతక మణి కథ, జాంబవతీ పరిణయం, నరకాసుర వధ మున్నగు కథలతో రసవంతమైనది ఈ స్కంధం. పరు జూచున్, కొమ్మా, హార కిరీట, సకలార్థ సంవేది, పర్వత ద్వంద్వంబు వంటి పద్య రత్నాలతో ఒప్పి ఉంటుంది ఈ స్కంధం. రండి ఈ శ్రీకృష్ణామృత పానంతో తరిద్దాం రండి సుజనులారా రండి

## ఏకాదశ స్కంధము

ఏకాదశ స్కంధంలో ప్రధానంగా యదు వంశ నాశనము, శ్రీకృష్ణ నిర్యాణము, ఉద్ధవ గీత వివరించబడ్డాయి. ఒక విధంగా భాగవత కథకు ఉపసంహారంగా చెప్పవచ్చు. అద్భుతమైన వేదాంత విషయాలు అనేకం ఇవ్వబడ్డాయి. ప్రసిద్ధమైన అవధూత లక్షణాలు, 24 గురువులు మొదలైనవి వర్ణించబడ్డాయి. పరబ్రహ్మ మనంగా వంటి చక్కటి పద్యాలు ఉన్నాయి ఈ స్కంధంలో. నవ వికచ సరసిరుహ అనే సర్వలఘు సీస పద్యమునకు ఉదాహరణ పద్యంగా కూడ బహుళ ప్రసిద్ధమైనది. పరవిద్యా సంబంధి అయిన ఈ స్కంధాన్ని అద్భుతంగా బమ్మెర పోతనామాత్యుల వారి శిష్యులు బొప్పనామాత్యుల కుమారుడు గంగన వారు తెలుగు చేసి అనుగ్రహించారు.

## ద్వాదశ స్కంధము

ద్వాదశ స్కంధం తెలుగు భాగవతానికి ఉపసంహారం లాంటిది. 54 పద్యాలతో తెలుగు భాగవతంలో మిక్కిలి చిన్న స్కంధం. పోతన భాగవతంలోని ఇతర ముగ్గరు రచయితలలో, వెలిగందల నారయ మాత్రమే పోతన ప్రియ శిష్యుడను అని గర్వంగా స్కంధాంత గద్యంలో ప్రకటించారు. భవిష్యత్తు రాజుల వివరాలు, కలి యుగ వర్ణన, పరీక్షిత్తు దేహ త్యాగం, మార్కండేయ చరిత్ర, ద్వాదశ ఆదిత్యుల వివరాలు చెప్పబడ్డాయి. గజ తురగాది అనే కంద పద్యంలో భాగవత భక్తి తత్వాన్ని కూర్చిన విధం గొప్పది. ఏను మృతుండ నౌదు నని ఆణి ముత్యం లాంటి పద్యం దీనిలోనిదే. భాగవత పురాణ సారం ఇమిడ్చి బమ్మెర పోతనామాత్యుల వారి శిష్యులు గంగనార్యుల వారు తెలుగు చేసి అనుగ్రహించారు.

: : చదువుకుందాం భాగవతం; బాగుపడదాం మనం అందరం : :

భాగవత గణనాధ్యాయి., తెలుగుభాగవతం.ఆర్గ్

# భూమిక – ప్రథమ స్కంధము

## భాగవతం – పురాణం

శ్రీమద్భాగవత మహాపురాణం అష్టాదశ పురాణాల లోనిది. అంతే కాదు కావ్యత్రయం లోనిది కూడ. ముందు పురాణం గురించి చూద్దాము. "పురా అపి నవ ఇతి పురాణః ". ఎంతో పురాతన మైనది అయ్యి ఉండి; ఎప్పటి కప్పుడు సరికొత్తగా స్ఫురిస్తుండేది పురాణం. సర్గ, ప్రతిసర్గ, మనువులు, మన్వంతరము, వంశాను చరితములు పురాణానికి పంచలక్షణాలు అంటారు కొందరు. సర్గ, విసర్గ, స్థాన, పోషణ, ఊతులు, మన్వంతర, ఈశానుకథా, నిరోధ, ముక్తి, ఆశ్రయాలు అని పురాణానికి దశలక్షణాలు అంటారు కొందరు. వాటిలో ప్రధానమైనవి మహాపురాణాలు. వీటిలో ప్రసిద్ధమైనవి మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మ, వైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ,అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందములు యని పద్దెనిమిదింటిని (18) అష్టాదశ పురాణాలు అంటారు. శ్లో. మద్వయం, భద్వయం, చైవ బ్రత్రయం, వచతుష్టయం. అ, నా, ప, లిం, గ, కూ, స్కాని పురాణాని పృథక్ పృథకి. ఇంకా ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పారశర, అంగీరస, భృగు సంహిత, మారీచ, మానవ, వాశిష్ఠ, లింగ, వాయు పురాణములు – యని పద్దెనిమిదిం టిని (18) అష్టాదశ ఉపపురాణాలు అంటారు. సమస్త పురాణాలను సంస్కృతంలో మూలరచన గావించిన వారు, వేదాలను విభాగించిన వారు వ్యాస భగవానులు. అన్నిటిలోకి ఉత్తమమైన శ్రీమద్భాగవతంలో భగవంతుని గురించి భాగవతుల గురించి చెప్పబడింది. అందుకే సద్యోముక్తి సాధనమిది.

## భాగవతం - కావ్యం

హైందవ సాహిత్యంలో ముఖ్యమైనవి మూడు రామాయణ భారత భాగవతాలు. వేదాలు పునాదిరాళ్ళు అయితే, ఈ కావ్య త్రయం స్తంభాలు లాంటివి. రామాయణం మూల రచయిత వాల్మీకి మహర్షి. భారత భాగవతాలకు మూల రచయత వ్యాస భగవానులు. ప్రధానంగా రామాయణం సూర్య వంశ రాజుల చరిత్ర. భారతం చంద్రవంశస్థులది. భాగవతం భగవంతుని, భక్తుల గురించినది అని అను కోవచ్చు. రామాయణంలో జీవన విలువలకు ప్రాధాన్యం, భారతంలో ఫలవంతమైన జీవనానికి ప్రాధాన్యం. భాగవతంలో పారమార్థానికి ప్రాధాన్యం. అందుకే పోతనామాత్యులవారు గ్రంథారంభం లోనే అన్నారు.

*శ్రీ కైవల్యపదంబుఁజేరుటకునై చింతించెదన్, లోకర*
*క్షైకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో*
*ద్రేకస్తంభకుఁగేళిలోలవిలసదృగ్జాలసంభూతనా*
*నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనాడింభకున్.*

భాగవతంలో రామాయణ భారత కథలు కూడ చెప్పబడతాయి. ప్రబంధ లక్షణ సమాలంకృతం, బహు కథారత్నాల సమాహారం భాగవతం. వీటిలో చాలా వాటికి వైయక్తిక సంపూర్ణత కూడ గోచరిస్తుంది. ఈ సమాహారానికి సూత్రంగా శుక మహర్షి పరీక్షిన్మహారాజు లనే స్వర్ణ రజత దారాలతో చక్కగ పేన బడ్డాయి. మధుర శృంగారము మధుర వైరాగ్యము కలగలసిన పురాణమిది. అందుకే మధురాధిపతే రఖిలం మధురం శ్రీకృష్ణుల వారికి ప్రథమపీఠం వేసారు.

## వ్యాస భట్టారకుడు

ఈ మహాపురాణాన్ని వ్యాసమహర్షులవారు సంస్కృతంలో రచించారు. వేదాలను విభాగించటం, మహాభారతాన్ని రచించిన పిమ్మట సమస్తమైన పురాణాలు ఆ మహానుభావుడే రచించారు. వాటిలో ఉత్కృష్టమైనది శ్రీమద్భాగవతం. ఈ మూల భాగవత రచనా కాలాన్ని నిర్ణయించడం కష్టం. ఇది 5000 సంవత్సరాల కంటె అతి పురాతనమైనది అన్నది నిర్వివాదాంశం. ఈ మూల భాగవతం పన్నెండు స్కంధాలలో పద్దెనిమిదివేల శ్లోకాల బృహద్గ్రంధం.

## పోతన

అట్టి మహాభాగవతానికి తెలుగుసేత బమ్మెర పోతన చేయుట తెలుగజాతి అదృష్టం. పోతన గారి ప్రణీతము అంటే ప్రహితమే, ప్రాణిహితమే, పరహితమే. వీరు హలం కలం రెంటికి పదును యున్న కవికుల తిలకులు. కావ్యకన్యకను రాజులకీయని ఆత్మాభిమానంగల హాలికులు. తెలుగుసేతలో ఎనిమిది స్కంధాలు (1, 2, 3, 4 మరియు 7, 8, 9, 10 స్కంధాలు) వీరి కృతి అని మిగిలిన 5, 6 స్కంధాలు గంగన, సింగనల కృతి అని, 11 మరియు 12 స్కంధాలు నారయ కృతి అని స్థూలముగా అనుకోవచ్చు. తెలుగు సేతలో పన్నెండు స్కంధాలలో ఐదు, పది స్కంధాలు రెండేసి భాగాలుగా ఇవ్వబడ్డాయి. దీని రచనా శైలి పద్యగద్యాల మేలుకలయికతో పండిత పామరుల నిద్దరిని అలరారిస్తుంటుంది. 31 రకాల పద్యగద్య రీతులను ప్రయోగిస్తు మొత్తం 9014పద్యగద్యలలో సాగింది యీ మనోహర కావ్యం. ఆ మహాకవి పోతన జీవితకాలం క్రీ శ 1378 నుండి 1460 అని పలువురు పండితోత్తములచే నిర్ణయింపడినది. శైవమతానుయాయులైన ఆరువేల నియోగి బ్రాహ్మణ బమ్మెర వంశంలో పుట్టాడు. తన వంశాన్నేకాదు తన జాతిని దేశాన్ని కూడ ఉద్ధరించాడు. సంస్కృత మహాభాగవతాన్ని ప్రాంతీయ భాషాంతీకరణ చేసినవాటిలో వీరిదే ప్రప్రథమమైనది అంటారు. వీరి ఇతర కృతులు వీరభద్ర విజయము, నారాయణ శతకము, భోగినీ దండకము. వీటిలో వీరభద్ర విజయం శైవమతానుసార గ్రంధం. భాగవతమంత ప్రసిద్ధం కాకపోయినా

*జగదీశాయ! నమో నమో నవసుధాసంకాశి తాంగాయ! శ్రీ;*
*నగనాథాయ! నమో నమో శుభకరానందాయ! వేదార్ధపా;*
*రగ వంద్యాయ! నమో నమో సురనదీరంగత్తరంగావళీ;*
*మకుటాగ్రాయ! నమో నమో మునిమనోమందార! సర్వేశ్వరా!*

లాంటి చోట్ల వారి కవితా పటుత్వం ప్రస్ఫుటం గానే పలుకుతుంది. నారాయణ మకుటంతో సాగింది నారాయణ శతకం. భోగినీ దండకం వీరి తొలి రచనే కాదు అందుబాటులో ఉన్న దండకాలలో ఇదే తొట్టతొలిది అంటారు. వీరు సహజ కవులు. వీరి భాగవత రచనాశైలి చక్కెరపాకం ఆపాతమధురమని మహాపండితులు పేర్కొంటారు. పండిత పామరుల నిరువురను మెప్పిస్తుంది. అలా చెప్పకోదగ్గ పద్యాలలో ఒకటి. మందార మకరందమునఁ దేలు. ఇష్టమైన పద్యం లేదా ఇష్టమైన కథనం లేదా మొత్తం గ్రంధం ఏదైనా సరే విడిగా చదువుకోవచ్చు రసపూర్ణం గాస్వసంపూర్ణంగా ఉంటాయిఉదా. అల వైకుంఠ పురంబులో పద్యం, రుక్మిణీ కల్యాణం, గజేంద్ర మోక్షం ఘట్టాలు. ఇందుకు భాగవతంలోని ఒక పద్యమైనా రానివాడు తెలుగువాడేకాదనెడి నానుడే నిదర్శనము. భాగవతంలో కథలు, శృంగారాలు, వైరాగ్యాలు, పద్యాలే కాదు వివిధ విషయాల వివరాలు, సాహిత్య ప్రక్రియలు చాలా ఉన్నాయి. వీటిలో పోతన గారి విశిష్ఠత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వీరిది పంచదార పాకం పరమాద్భుతం. అందకే అన్నారు కవులు:

*ముద్దులుగార భాగవతమున్ రచియించుచు పంచదారలో*
*అద్దితివేమొ గంటము మహాకవిశేఖర! మధ్యమధ్య అ*
*ట్లద్దక వట్టి గంటమున నట్టిట్టు గీసిన తాటియాకులో*
*పద్దెములందు ఈ మధురభావము లెచ్చటనుండి వచ్చురా!*

ఒక ముఖ్యవిషయం మనవిచేస్తాను. భాగవతం చదువుకొనేటప్పుడు ప్రపంచ గురువులు ఎక్కిరాల కృష్ణమాచార్యులు చెప్పిన మాటలు అవశ్యము జ్ఞప్తి యుంచుకొన వలసినవి, "ఆనందానుభూతి జీవునకు పరమాత్మ యందలి తన్మయ రూపమున పరిపూర్తి చెందుటయే శృంగారము. దానికి మనస్సు నందు, యింద్రియముల యందు స్వీకరింపబడు ప్రతిబింబమే లౌకిక కావ్యాదు లలో వర్ణింపబడుచు, సంసార జీవులలో ననుభవింపబడు శృంగార మనబడు అభాసము."

## ప్రథమ స్కందము

ఈ ప్రథమ స్కంధం నిజానికి భాగవతానికి ఉపోద్ఘాతం లాంటిది. పైన చెప్పుకొన్న "శ్రీకైవల్య పదంబు . . . ." పద్యం ఈ స్కంధారంభంలో మొట్టమొదటిది. అలా కైవల్య ప్రాప్తికి ఈ గ్రంధం అంటూనే

భాగవతం అంతటిని సూచించారు మన బమ్మెరవారు. ఈ స్కంధాన్ని ఉపోద్ఘాత / పరిచయాలకు వాడినట్లుంటుంది. ఉపోద్ఘాతంలో దేవతా స్తుతులు, పాత రచయితలను గౌరవించిన తీరు, సమకాలీనులను మన్నించిన తీరు, భావికవుల ఆశీ స్సులు అందించిన తీరు పోతన వ్యక్తిత్వ విశిష్ఠతను చెప్పక చెప్తున్నాయి. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి.." మానవు లకు అంకిత మివ్వను అనే దృఢనిర్ణయం వ్యక్తపరచి నిజ జీవితంలో దానిని అమలుచేసిన మహానుభావుడు కనిపిస్తాడు. "భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు.." అంటు ఆవిష్కరించిన సవినయ ఆత్మవిశ్వాసం బహుళ ప్రశంసనీయమైనది.

భాగవతం అంటే భగవంతునికి భక్తులకు చెందిన విషయాలు చెప్పేది. "శ్రీ కృష్ణా యదుభూషణా.." అనే అద్భుతమైన పద్యం ఉన్న కుంతిస్తుతి. " కుప్పించి యెగసినఁ....." పద్యమాణిక్యం ఉన్న భీష్మస్తుతి. "గురుభీష్మాదులు గూడి.." ఉన్న నరుడు నారాయణుని స్మరిస్తు కృష్ణనిర్యాణ చెప్పటం. భాగవతం అంటేనే పారీక్షితం అని పేరుపడ్డానికి కారణమైన పరీక్షిత్తుని పుట్టుక శాపం పొందుట మున్నగు ఎత్తుగడలుతో విరాజిల్లుతోంది యీ స్కంధం.

## వృత్తాల వారీ పద్యాల లెక్క

మొత్తం పద్యగద్యలు = 530 + సీసం కింది తేటగీతులు 22 + సీసం కింది ఆటవెలదులు 25; మొత్తం = 577.

| | | | |
|---|---|---|---|
| వచనము | = 147 | చంపకమాల | = 16 |
| కంద పద్యము | = 148 | ఉత్పలమాల | = 50 |
| సీస పద్యము | = 47 | ఆటవెలది | = 22 |
| తేటగీతి సీసంతో. | = 22 | తేటగీతి | = 4 |
| మత్తేభము | = 56 | శార్దూలము | = 29 |

## సంకలన కర్త

మా తల్లితండ్రులు ఇద్దరు పుట్టి బుద్ధెరిగి పిల్లలను దండించి ఎరుగని సాత్వికులు. తల్లి వెంకటరత్నంగారు మహా పతివ్రత, పరమ ఉత్తమురాలు. తండ్రి అచ్యుత రామయ్యా గారు రాష్ట్ర రివెన్యూ శాఖలో తూర్పుగోదావరి జిల్లాలో పనిచేసారు. గణితంలో ఉద్దండులు. అన్నగారు లక్ష్మీనారాయణదేవ్ సివిల్ ఇంజనీరు. వారి సోదరప్రేమ బహు దొడ్డది. మార్గదర్శకత్వం చేయుటలోను ఎన్నదగినవారు. చెల్లెళ్ళు శేష కుమారి, లక్ష్మి యిద్దరు యిరువం శాల పేరు నిలబెట్టారు అని మంచి పేరు తెచ్చుకున్నారు.

మా పూర్వీకులది కరిణీకపు వంశము. పితామహులు చిట్టిరాజుగారు మాతామహులు సాంబశివరావు గారు కరణాలే. మామమగారు ఇవటూరి భాస్కర రావు, ఛార్టెడు ఎక్కౌంటెంటు. మాకు ఫణి కిరణ్, భాస్కర కిరణ్ అని ఇద్దరు చక్కటి పుత్రులు.

## కృతజ్ఞతలు

ఈ కృషికి ఉపయోగపడిన వివిధ పుస్తకముల రచయితలు, ప్రచురణకర్తలకు మరియు ఈ కృషిని సాధ్యము చేసిన కంప్యూటరులు చేసిన హెచ్ సి ఎల్, డెల్, ప్యానోనిక్ కంపెనీలకు మరియు సహకరించి ప్రోత్సా హించిన మిత్రులు, ఇతర వ్యక్తులు, అంతర్జాల సంస్థలకు అందరికి కృతజ్ఞతలు. మా తెలుగుభాగవతం అంతర్జాల జాలగూడు ఆదులను నిర్మించుట నిర్వహించుటలలో తమ అమూల్యమైన సహాయ సహకారాలు అందించి సాకారం చేసారు. చేస్తున్నారు. మా కుటుంబ సభ్యులు అమూల్య అనంత సహకార సహాయాలు అందించారు. ఇంచుమించు అందరూ స్వచ్ఛందంగా ఉచితంగాసాయంచేసారు. ఇట్టి సాయాలులేకుండా ఇలా నేను అందిం చగలుగుట సాధ్యం కాదు. ఇలా సహాయ సహకారాలు అందించిన అందరికి పేరుపేరునా కృతజ్ఞతలు.

భాగవత గణనాధ్యాయి. తెలుగుభాగవతం.ఆర్గ్

# విషయ అనుక్రమణి


అవతారిక iii

ప్రథమ స్కంధము 1

ఉపోద్ఘాతము 1

కృతిపతి నిర్ణయము 9

గ్రంథకర్త వంశ వర్ణనము 16

షష్ఠ్యంతములు 19

కథా ప్రారంభము 22

నైమిశారణ్య వర్ణనము 25

శౌనకాదుల ప్రశ్నంబు 32

కథా సూచనంబు 40

ఏకవింశత్యవతారములు 52

శుకుడు భాగవతంబు జెప్పుట 64

వ్యాసచింత 71

నారదాగమనంబు 77

నారదుని పూర్వకల్పము 87

నారదునికి దేవుడు దోచుట 99

ద్రౌపది పుత్రశోకం 110

అశ్వత్థామని తెచ్చుట 120

అశ్వత్థామ గర్వ పరిహారంబు 127

కుంతి స్తుతించుట 136

ధర్మజుడు భీష్ముని కడ కేగుట 150

భీష్మనిర్యాణంబు 160

ధర్మనందన రాజ్యాభిషేకంబు 168

గోవిందుని ద్వారకాగమనంబు 180

కృష్ణుడు భామల జూడబోవుట 193

గర్భస్థకుని విష్ణువు రక్షించుట 204

పరీక్షి జ్జన్మంబు 209

విదురాగమనంబు 218

ధృతరాష్ట్రాదుల నిర్గమంబు 227

నారదుని గాలసూచనంబు 236

యాదవుల కుశలం బడుగుట 248

కృష్ణనిర్యాణంబు వినుట 256

పాండవుల మహాప్రస్థానంబు 270

పరీక్షిత్తు దిగ్విజయయాత్ర 279

గోవృషభ సంవాదం 286

కలి నిగ్రహంబు 297

పరీక్షిత్తు వేటాడుట 320

శృంగి శాపంబు 331

పరీక్షిత్తుని ప్రాయోపవేశంబు 344

శుకముని యాగమనంబు 355

శుకుని మోక్షోపాయం బడుగట 361

పూర్ణి 362

అనుబంధము 367

బమ్మెఱ పోతనామాత్య వంశవృక్షము 367

నైమిశారణ్యం – గణన 375

నైమిశారణ్యం–పదాలు 375

నైమిశారణ్యంలోని జీవాల గణన 381

(అ) నైమిశారణ్యంలోని జీవాల సంఖ్యలు 381
(ఆ) నైమిశారణ్యంలోని జీవాల గణన 381
అరిషడ్వర్గాలు – వివరణ 384
రాగద్వేషాలు – వివరములు 385
అక్షౌహిణి వివరణ 386
అక్షౌహిణి – సేనాసమూహవిశేషము 386
వసుదేవుని భార్యలు 387
వసుదేవుని భార్యలు 18మంది. 387
4) మరొక భార్య (18) కూడ కలదు. 387

శ్రీరామ

ఓం నమోభగవతే వాసుదేవా

# పోతన తెలుగు భాగవతం

## ప్రథమ స్కంధము

### ఉపోద్ఘాతము

★1-1-శా.

శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు, భక్త పాలన కళా సంరంభకున్, దానవో
ద్రేకస్తంభకుఁ, గేళి లోల విలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండ కుంభకు, మహానందాంగనాడింభకున్.

టీక:- శ్రీ = శుభకర మైన; కైవల్య = ముక్తి; పదంబున్ = స్థితిని; చేరుట = పొందుట; కున్ = కోసము; ఐ = ఐ; చింతించెదన్ = ప్రార్థించెదన్; లోక = లోకా లన్నిటిని; రక్ష = రక్షించుటనే; ఏక = ముఖ్యమైన; ఆరంభ = సంకల్ప మున్న వాడు; కున్ = కి; భక్త = భక్తులను; పాలన = పాలించే; కళా = కళ యందు; సంరంభ = వేగిరపాటు ఉన్న వాడు; కున్ = కిన్; దానవ = రాక్షసుల; ఉద్రేక = ఉద్రేకమును; స్తంభ = స్తంభ = మ్రాన్పడేలా చేసే వాడు; కున్ = కి; కేళి = ఆట లందు; లోల = వినోదా లందు; విలసత్ = ప్రకాశించే; దృక్ = చూపుల; జాల = వల నుండి; సంభూత = పుట్టిన; నానా = వివిధ; కంజాత భవాండ = బ్రహ్మాండముల {కంజాత భవాండము - కంజాతభవ (బ్రహ్మ) అండము, బ్రహ్మాండము}; కుంభ = కుండలు (రాశి) తనలో కలిగిన వాడు; కున్ = కి; మహా = గొప్ప; నంద = నందుని; అంగనా = భార్య యొక్క; డింభ = కొడుకు; కున్ = కున్.

భావము:- సర్వలోకాలను సంరక్షించుట అందు గట్టి సంకల్పం కల వాడిని, భక్తజనులను కాపాడుటలో మిక్కిలి తొందర కల వాడిని, రాక్షసుల ఉద్రేకాలను అణచేవాడిని, విలాసంగా చూసే చూపుతోటే నానా బ్రహ్మాండభాండాలు సృజించే వాడిని, మహాత్ము డైన నందుని అంగన యొక్క కుమారుని (మహానందం దేహంగా గల ఆత్మీయుని) కైవల్య పదము (నీవుగానే తప్ప నాకంటూ వేరే ఉనికి లేనంతగా నీలో ఐక్యం అయ్యే పదవిని) అపేక్షించి సదా స్మరిస్తూ ఉంటాను.

ఇది తెలుగు చేయబడిన భాగవత గ్రంథారంభ ప్రార్థనా పద్యం. ఈ తెలుగసేతను బమ్మెర పోతనామా త్యుల వారు తన మోక్షానికే కాదు మనందరి మోక్షాన్ని అపేక్షించి చేసారు. ఇది భాగవతానికే కాదు, తెలుగు సాహితీ విశ్వానికే మకుటాయమాన మైంది. ఇష్టదేవతా స్తుతీ, వస్తు నిర్దేశమూ కల ఈ మనోజ్ఞవృత్తం మహాభాగవతంలోని ఇతివృత్తాని కంతా అద్దం పడుతుంది. శార్దూలవిక్రీడిత వృత్తం ఎన్నుకోడంలో విషయ గాంభీర్యత సూచింపబడుతోంది. స్తుతి, నిర్దేశాలను పలికించే పద విన్యాసం బహుళార్థ సాధకత, దీర్ఘకాల రమ్యత సాధిస్తున్న సూచన కావచ్చు. (అ) శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ (ఆ) లోకరక్షైకారంభకున్ (ఇ) భక్తపాలన కళా సంరంభకున్ (ఈ) దానవోద్రేక స్తంభకున్ (ఉ) కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానా కంజాత భవాండ కుంభకున్ (ఊ) మహానందాంగనా డింభకున్ అనే అద్భుత ప్రయుక్తాలు ఈ పద్యంలో ఆరు (6) ఉన్నాయి. భగవంతుని ప్రధాన గుణాలైన సర్వేశ్వరత్వ, ధర్మ సంస్థాపకత్వ, శిష్టరక్షణ పరాయణత్వ, దుష్ట

శిక్షణ చణత్వ, విశ్వకర్తృత్వ, ఆనందమయత్వాలు అనే ఆరింటికి ప్రతీకలు యివి. (అ) శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ అనటంలో మోక్షం కోసం ఉత్కంఠితుడైన పరీక్షిత్తు వృత్తాంతంతో పాటు మొత్తం భాగవతమే ధ్వనిస్తున్నది. అలాగే ప్రథమ స్కంధంలోని నారదుడు, భీష్ముడు, కుంతీదేవి మొదలైనవారి కథలూ, తృతీయ స్కంధంలోని దేవహూతి వృత్తాంతమూ, చతుర్థ స్కంధంలోని ధ్రువ చరిత్రా స్ఫురిస్తూ భగవంతుని సర్వేశ్వరత్వాన్ని నిరూపిస్తున్నాయి. ఎందుకంటే కైవల్యాన్ని అనుగ్రహించే అధికారం సర్వేశ్వరునికి మాత్రమే ఉంటుంది. (ఆ) లోకరక్షైకారంభకున్ అనటంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపు కంస కాలయవనాదు లను (తృతీయ, సప్తమ, దశమ స్కంధాలు) సంహరించి వారి అత్యాచారాల వల్ల అస్తవ్యస్తమైన లోకాన్ని ఉద్ధరించిన భగవంతుని ధర్మ సంస్థాప కత్వం సంస్థాపించబడింది.(ఇ) భక్తపాలన కళా సంరంభకున్ అనటంలో భక్తులను పాలించటం భగవంతుని కళ, ఎప్పుడెప్పుడు ఆర్తులను ఆదుకుందామా అని అనుక్షణం తహతహలాడుతుంటాడు స్వామి అనే సూచన. అలాగే గజేంద్రుణ్ణి కాపాడటానికి మహా విష్ణువు వైకుంఠం నుంచి పరుగెత్తుకు వచ్చిన వృత్తాంతం (అష్టమ స్కంధం) స్ఫురిస్తూ భగవంతుని శిష్ట రక్షణ పరాయణత్వాన్ని చాటుతున్నది. (ఈ) దానవోద్రేకస్తంభకున్ అనటంతో అష్టమ స్కంధంలోని వామనావతారం వ్యంజకమైంది. తరువాతి మన్వంతరంలో ఇంద్రుడు కావలసిన బలి, వరబలంతో ముందుగానే స్వర్గాన్ని ఆక్రమించి ఇంద్రపదం కాంక్షించాడు. దుష్టశిక్షణచణు డైన స్వామి వామనుడై, ఆ దాన వేంద్రుని ఉద్రేకానికి పగ్గాలు పట్టి స్తంభింప జేయటం ధ్వనించింది. (ఉ) కేళిలోల... కుంభకున్ అనటం వల్ల భగవంతుని విశ్వకర్తృకత్వాన్ని వెల్లడించే సూర్యవంశ చంద్రవంశాల చరిత్ర (నవమస్కంధం) స్ఫురిస్తోంది. స్వామి విలాసంగా త్రిప్పే కళ్ళల్లో నుంచే కదా బ్రహ్మాండాలు ఉద్భవిస్తాయి. సృష్టి జరుగుతుంది. నిజానికి స్వామి కళ్ళు సూర్యచంద్రులేగా. ఇంకా శ్రీహరే ప్రధానకర్తని ద్వితీయ స్కంధం నిరూపిస్తోంది. (ఊ) మహా నందాంగనా డింభకున్ అనటం కృష్ణలీలా సర్వస్వమైన దశమ స్కంధానికి, ఆ నందాంగనకు ఆనందానికి, మహా ఆనందమే దేహంగా కల స్వరూపికి ప్రతీక.

## ★1-2-ఉ.

**వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్, దయా**
**శాలికి, శూలికిన్, శిఖరిజా ముఖ పద్మ మయూఖ మాలికిన్,**
**బాల శశాంక మౌళికిఁ, గపాలికి, మన్మథ గర్వ పర్వతో**
**న్మూలికి, నారదాది మునిముఖ్య మనస్సరసీరుహాలికిన్.**

టీక:- వాలిన = అతిశయించిన; భక్తి = భక్తితో; మ్రొక్కెదన్ = మ్రొక్కెదను; అవారిత = వారింపలేని; తాండవ = తాండవమనే; కేళి = ఆట ఆడే వాని; కిన్ = కి; దయాశాలి = దయకలవాడి; కిన్ = కి; శూలి = శూల ధారి; కిన్ = కి; శిఖరి = పర్వతుని; జా = పుత్రికయొక్క; ముఖ = ముఖము అనే; పద్మ = పద్మానికి; మయూఖమాలి = సూర్యుడు {మయూఖమాలికిరణములు కలవాడు, సూర్యుడు}; కిన్ = కి; బాల = లేత; శశాంక = చంద్రుని {శశాంకశశ (కుందేలు) గుర్తు కలవాడు, చంద్రుడు}; మౌళి = శిరస్సున ధరించిన వాడు; కిన్ = కి; కపాలి = పుఱ్ఱె ధరించే వాడు; కిన్ = కి; మన్మథ = మన్మథుని; గర్వ = గర్వమనే; పర్వత = పర్వతాన్ని; ఉన్మూలి = నిర్మూలించిన వాడు; కిన్ = కి; నారద = నారదుడు; ఆది = మొదలైన; ముని = ముని; ముఖ్య = ముఖ్యులు; మనస్ = మనసులనే; సరసీరుహ = పద్మాలలోని {సరసీరుహ – సరస్సులో పుట్టినది, పద్మం}; అలి = తుమ్మెద లాంటి వాడు; కిన్ = కి.

భావము:- అనంత లీలాతాండవలోలు డైన పరమ శివునికి, మిక్కిలి దయ గలవానికి, త్రిశూల ధారికి, పర్వతరాజ పుత్రి పార్వతీదేవి యొక్క ముఖ పద్మం పాలిటి సూర్యునికి, తలపై నెలవంక ధరించిన వానికి,

మెడలో పుఱ్ఱెల పేరు ధరించిన వానికి, మన్మథుడి గర్వం సర్వం అణిచేసిన వానికి, నారదాది మునుల మానస సరోవరాలలో విహరించే వానికి శిరస్సు వంచి భక్తి పురస్సరంగా ప్రణామం చేస్తున్నాను.

★1-3-ఉ.

**ఆతత సేవఁ జేసెద సమస్త చరాచర భూత సృష్టి వి**
**జ్ఞాతకు, భారతీ హృదయ సౌఖ్య విధాతకు, వేదరాశి ని**
**ర్ణేతకు, దేవతా నికర నేతకుఁ, గల్మష ఛేత్తకున్, నత**
**త్రాతకు, ధాతకున్, నిఖిల తాపస లోక శుభప్రదాతకున్.**

టీక:- ఆతత = అతిశయమైన; సేవన్ = భక్తిని; చేసెదన్ = చేసెదను; సమస్త = సమస్తమైన; చర = చరములు; అచర = అచరములుయైన; భూత = ప్రాణులను; సృష్టి = సృష్టించే; విజ్ఞాత = నేర్పరి; కున్ = కి; భారతీ = భారతీ దేవి; హృదయ = హృదయానికి; సౌఖ్య = సంతోషాన్ని; విధాత = కలిగించేవాడు; కున్ = కి; వేద = వేదాల; రాశి = సమూహాలను; నిర్ణేత = ఏర్పరిచిన వాడు; కున్ = కి; దేవతా = దేవతల; నికర = సమూహము యొక్క; నేత = నాయకుడు; కున్ = కి; కల్మష = పాపములను; ఛేత్త = ఛేధించే వాడు; కున్ = కి; నత = నమస్కరించే వారిని; త్రాత = రక్షించే వాడు; కున్ = కి; ధాత = బ్రహ్మ; కున్ = కి;నిఖిల = మొత్తం; తాపస = తాపసులు; లోక = అందరికి; శుభ = శుభాలను; ప్రదాత = ఇచ్చేవాడు; కున్ = కి.

భావము:- చరాచర ప్రపంచాన్నంతా చక్కగా సృష్టించడం నేర్చినవాడు, సరస్వతీదేవికి మనోరంజకం చేకూర్చువాడు, వేదాల నన్నింటినీ సమర్థంగా సమకూర్చినవాడు, సమస్త బృందారక బృందాన్ని నాయకుడై తీర్చిదిద్దువాడు, భక్తుల పాపాలను పోకార్చు వాడు, దీనజనులను ఓదార్చువాడు, తపోధను లందరికీ శుభాలు ఒనగూర్చువాడూ ఐనట్టి బ్రహ్మదేవుణ్ణి నేను శ్రద్ధాభక్తులతో సంసేవిస్తున్నాను.

1-4-వ.

**అని, నిఖిల భువన ప్రధాన దేవతా వందనంబు సేసి.**

టీక:- అని = ఈ విధంగా; నిఖిల = సమస్త; భువన = లోకలకు; ప్రధాన = ముఖ్యమైన; దేవతా = దేవత లకు; వందనంబు = నమస్కారము; సేసి = చేసి.

భావము:-ఇలా సకలలోకపాలకులైన ముగ్గురుమూర్తులకు చేతులెత్తినమస్కారంచేసిన పిమ్మట.

★1-5-ఉ.

**ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రి సుతా హృదయానురాగ సం**
**పాదికి, దోషభేదికిఁ, బ్రపన్నవినోదికి, విఘ్నవల్లికా**
**చ్ఛేదికి, మంజువాదికి, నశేష జగజ్జన నంద వేదికిన్,**
**మోదకఖాదికిన్, సమద మూషక సాదికి, సుప్రసాదికిన్.**

టీక:- ఆదరము = మన్నన; ఒప్పన్ = ఉట్టిపడేలా; మ్రొక్కున్=నమస్కారమును; ఇడుదున్ = పెట్టెదను; అద్రి = పర్వత; సుతా = పుత్రి; హృదయ = హృదయ; అనురాగ = అనురాగాన్ని; సంపాది = సంపాదించినవాడు; కిన్ = కి; దోష = పాపాలని; భేది = పోగొట్టేవాడు; కిన్ = కి; ప్రపన్న = శరణాగతులైన భక్తులకు; వినోది = సంతోషము కలిగించు వాడు; కిన్ = కి; విఘ్న = విఘ్నాల; వల్లికా = సమూహమును; చ్ఛేది= నాశనముచేసేవాడు; కిన్=కి; మంజు = మనోజ్ఞముగ; వాది = మాట్లాడే వాడు; కిన్ = కి; అశేష = అనేక; జగత్ = లోకములందలి; జన = జను లకు; నంద = ఆనందము; వేది = కలిగించే వాడు; కిన్ = కి; మోదక = ఉండ్రాళ్ళు; ఖాది = తిను వాడు; కిన్ = కి; సమద = చక్కగ; మూషక = ఎలుక; సాది = నడిపే వాడు; కిన్ = కి; సుప్రసాది = మంచి నిచ్చే వాడు; కిన్ = కి.

భావము:- పర్వతరాజు హిమవంతుని కుమార్తె ఉమాదేవి మాతృప్రేమ అనే సంపదను సంపాదించిన వాడు, సకల పాపాలను విరిసిపోయేలా చేసేవాడు, శరణాగతులకు వినోదములు కలుగజేయువాడు. సమస్త విఘ్నాలనే బంధనాలు ఛేదించు వాడు, మంజుల మధురంగా భాషించేవాడు.అఖిల లోకవాసులు అందరకు విశేష సంతోషాన్ని ప్రసాదించువాడు, ఉండ్రాళ్లు ఆరగించువాడు. మదించిన మూషకరాజును మిక్కిలి సంతోషంగా అధిరోహించి విహరించువాడు, శుభాలు ప్రసాదించు వాడు ఐన వినాయకునకు చక్కటి మన్ననలతో నమస్కరిస్తున్నాను.

**★1-6-ఉ.**

**క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత**
**శ్రోణికిఁ, జంచరీక చయ సుందరవేణికి, రక్షితామర**
**శ్రేణికిఁ, దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్,**
**వాణికి. నక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్.**

టీక:- క్షోణితలంబునన్ = నేలకు; నుదురు = లలాటము; సోఁకఁగన్ = ఆనేలా; మ్రొక్కి = నమస్కరించి; నుతింతున్ = స్తుతిస్తాను; సైకత = ఇసక తిన్నెల లాంటి; శ్రోణి = పిరుదులు గలామె; కిన్=కు; చంచరీక = తుమ్మెదల; చయ = గుంపు లాంటి; సుందర = అందమైన; వేణి = జుట్టు గలామె; కిన్ = కు; రక్షిత = రక్షింపబడే; అమర = దేవతల; శ్రేణి = సమూహము గలామె; కిన్ = కి; తోయజాతభవ = నీటిలోపుట్టిన(పద్మం) దానిలో పుట్టిన వాని (బ్రహ్మ) యొక్క; చిత్త = మనసును; వశీకరణ = వశీకరించుకోగల; ఏక = అసహాయశూర; వాణి = వాక్కుగలామె; కిన్= కి; వాణి = సరస్వతీదేవి; కిన్ = కి; అక్ష = స్పటికముల; దామ =మాల; శుక=రామచిలుక; వారిజ = తామర పువ్వు; పుస్తక = పుస్తకము; రమ్య = అందంగా; పాణి = చేత ధరించినామె; కిన్ =కి.

భావము:- నేలకు నెన్నుదురు తాకేలా సాగిలపడి మ్రొక్కి, సైకత శ్రోణీ, చదువులవాణీ, అలినీలవేణీ ఐన వాణిని సన్నుతిస్తాను. సుధలు వర్షించే సుందర సుకుమార సూక్తులతో అరవిందభవుని అంతరంగాన్ని ఆకర్షించే సౌందర్యరాశిని; కటాక్ష వీక్షణాలతో సుర నికరాన్ని కనికరించే కరుణామయిని; ఒక చేతిలో అక్షమాల, ఇంకో చేతిలో రాచిలుక, వేరొక చేతిలో తామర పువ్వు, మరో చేతిలో పుస్తకం ముచ్చటగా ధరించే ఆ తల్లిని సదా సంస్తుతిస్తాను.

★1-7-శా.

**పుట్టం బుట్ట, శరంబునన్ మొలవ, నంభోయానపాత్రంబునన్**
**నెట్టం గల్గను, గాళిఁ గొల్వను, బురాణింపన్ దొరంకొంటి, మీఁ**
**దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మ యో! యమ్మ! మేల్**
**పట్టున్ నా కగుమమ్మ, నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ!**

టీక:- పుట్టన్ = పుట్టలో; పుట్ట = పుట్ట లేదు (వాల్మీకిని కాదు); శరంబు నన్ = రెల్లుపొదలో (బాణము అనే పదం గల పేరుతో); మొలవ = పుట్ట లేదు (సుబ్ర హ్మణ్యుడను కాదు, బాణుడను కాదు) {పాఠాంతరం – పుట్టంబుట్టశిరం బున్ మొలువ=శిరస్సుమీద పుట్టపుట్టి ఉన్నవాడనుకాదు(వాల్మీకిని కాదు)}; అంభస్ = జల; యాన = ప్రయాణ; పాత్రంబునన్ = సాధనములో – పడవలో; నెట్టన్ = యదార్థా నికి; కల్గను = పుట్ట లేదు (వ్యాసుని కాదు); కాళిన్ = కాళి; కొల్వను = ఆరాధించను (కాళిదాసు ను కాదు); పురాణింపన్ = పురాణ (భాగవత) రచనకి; దొరంకొని = పూనుకొని; ఉంటిని = ఉన్నాను; మీఁదు = ముందు చెప్పిన; ఎట్టే = అటువంటి వారి; వెంటన్ = పద్ధతినే; చరింతున్ = నడుస్తాను; తత్ = ఆ; సరణి = విధమును; నాకు = నాకు; ఈవు = ఇవ్వుము; అమ్మ = తల్లీ; ఓ = ఓ; అమ్మ = అమ్మ; మేల్ = మంచి; పట్టున్ = దన్నుగా; నాకు = నాకు; అగుము = ఉండుము; అమ్మ = తల్లీ; నమ్మితిన్ = (నిన్నే) నమ్మికొంటిని; చుమీ = సుమా; బ్రాహ్మీ = సరస్వతీదేవీ {బ్రహ్మి – బ్రహ్మ దేవుని భార్య, సరస్వతి}; దయ = దయకు; అంభోనిధీ = సముద్రమా.

భావము:- అందరిని పుట్టించే బ్రహ్మదేవుని అర్ధాంగీ! సరస్వతీదేవి! ★నేను పుట్టలో పుట్టిన వాల్మీకిని కాను; బాణం నుంచి వచ్చిన పేరు కలిగిన బాణుడను కాను (రెల్లుపొదలో పుట్టిన సుబ్రహ్మణ్యుడను కాను); పడవలో పుట్టిన వ్యాసుడను కాను; కాళీమాతను కొలిచిన కాళిదాసుని కాను; కాని మాతా! ఈ భాగవత పురాణ రచన కూడ వారి లాగే గంభీరంగా చేయాలని పూనుకున్నాను. దీనిని కూడ వారి రచనల వలెనె శాశ్వతంగా ఉండేలా అనుగ్రహించు తల్లీ! నిన్నే నమ్ముకున్నానమ్మా. నన్ను అత్యుత్తమ మార్గంలో నడిపించు. దయామయీ! {★'పుట్టంబుట్టశిరంబునన్ మొలవ' అనే పాఠ్యాంతరం ప్రకారం పుట్టలో పుట్టి శిరస్సున పుట్ట పుట్టిన వాల్మీకిని కాదు}

★1-8-ఉ.

**శారదనీరదేందు, ఘనసార, పటీర, మరాళ, మల్లికా**
**హార, తుషార, ఫేన, రజతాచల, కాశ, ఫణీశ, కుంద, మం**
**దార, సుధాపయోధి, సితతామర, సామరవాహినీ శుభా**
**కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు, భారతీ!**

టీక:- శారద = శరదృతు; నీరద = మేఘము; ఇందు = చంద్రుడు; ఘనసార = కర్పూరం; పటీర = మంచిగంధం; మరాళ = హంస; మల్లికా = మల్లిపువ్వుల; హార = దండ; తుషార = మంచు; ఫేన = నురుగు; రజత = వెండి; అచల = కొండ; కాశ = రెల్లుపువ్వులు; ఫణీశ = ఆదిశేషుడు; కుంద = అడవిమల్లె; మందార = కల్పవృక్ష ము; సుధా = పాల; పయోనిధి = సముద్రము; సిత = తెల్లని; తామరస = తామరపువ్వు; అమర వాహినీ = ఆకాశ

గంగ {అమర వాహిని – అమర (దేవతల) వాహినీ (నది) – ఆకాశగంగ}; శుభ = శుభకర మైన; ఆకారతన్ = ఆకారముతో; ఒప్పు = అమరు; నిన్ను = నిన్ను; మదిన్ = మదిలో; కానగ = చూచుట; ఎన్నడు = ఎప్పుడు; కల్గు = కలుగుతుంది; భారతీ = సరస్వతీదేవీ.

భావము:- భారతీదేవి! తెల్లని కాంతులు వెల్లివిరసే శరత్కాల మేఘాలు, శరదృతు చంద్రబింబం, పచ్చకర్పూరం, మంచిగంధం, రాజహంసలు, జాజిపూల దండలు, కురిసే మంచు, తెల్లని నురుగు, వెండికొండ, రెల్లుపూలు, ఆదిశేషుడు, మల్లెపూలు, కల్పవృక్షం, పాలసముద్రం, తెల్లతామరలు, ఆకాశగంగా నీ ఉజ్జ్వల శుభంకర ఆకారానికి ఉపమానాలు మాత్రమే కదమ్మా. అంతటి స్వచ్ఛ ధవళ సుందరమూర్తి వైన నీ దర్శనం కన్నులార మనసుదీర ఎన్నడు అనుగ్రహిస్తావు తల్లీ!

★1-9-ఉ.

**అంబ, నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రికా**
**డంబర చారుమూర్తి, ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా**
**చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా**
**వాంబరవీధి విశ్రుతవిహారిణి, నన్ గృపఁ జూడు భారతీ!**

టీక:- అంబ = తల్లీ; నవ = అప్పుడే పుట్టిన; అంబుజ = పద్మములతో; ఉజ్వల = ప్రకాశిస్తున్న; కర = చేతు లనే; అంబుజ = పద్మములు కలదాన; శారద = శరదృతువు లోని; చంద్ర = చంద్రుని; చంద్రిక = వెన్నెల; ఆడంబర = డాబు గల; చారు = అందమైన; మూర్తి = స్వరూపము కలదానా; ప్రకట = ప్రకాశించే; స్ఫుట = కొట్టొచ్చినట్లు కన బడెడి; భూషణ = ఆభరణాల లోని; రత్న = రత్నాల; దీపికా = కాంతి; చుంబిత = స్పృశించు; దిక్ = దిక్కుల; విభాగ = విభాగాలు యున్నదానా; శ్రుతి = వేద; సూక్తి = సూక్తులచే; వివిక్త = వెల్లడింపబడిన; నిజ = స్వంత; ప్రభావ = ప్రభా వము కలదానా; భావ = భావాలనే; అంబర = ఆకాశ; వీధి = వీధిలో; విశ్రుత = విస్తృతముగా; విహారిణి = విహరించే దానా; నన్ = నన్ను; కృప = దయ; అన్ = తో; చూడు = అనుగ్రహించుము; భారతీ = సరస్వతీదేవీ.

భావము:-తల్లీ! వికాస ప్రకాశాలకి ప్రతీకగా అప్పుడే వెల్లి విరుస్తున్న పద్మం అలంకరించిన హస్తంతో, శరచ్చంద్రుని వెన్నెల వికాసానికి చల్లదనానికి అనురూప మైన శ్వేత స్వరూపం తో, విజ్ఞాన స్వరూపాలై దిగ్దిగంతాలు సర్వం వెలిగిస్తున్న ఆభరణాల లోని మణి మాణిక్యాల కాంతులతో, వేదసూక్తులు వెల్లడిచేసే స్వీయ ప్రభావంతో, ఉత్తమతమ భావాల పరంపరలలో విస్తృతంగా విహరిస్తుండే భారతీదేవి! నీ దయాపూరిత దృక్కులతో అనుగ్రహించమ్మా!

★1-10-ఉ.

**అమ్మలఁ గన్నయమ్మ, ముగురమ్మలమూలపుటమ్మ, చాలఁ బె**
**ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చిన యమ్మ, తన్ను లో**
**నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా**
**యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వ పటుత్వ సంపదల్.**

టీక:- అమ్మలన్ = అమ్మలను(సప్త మాతృకలు); కన్న = కన్నటువంటి (కంటె గొప్ప దైన); అమ్మ = తల్లి; ముగురు = ముగ్గురు {ముగురు అమ్మలు - లక్ష్మి సరస్వతి పార్వతి}; అమ్మల = అమ్మలకి; మూలపు = మూల మైన; అమ్మ = అమ్మ; చాలన్ = చాలా; పెద్ద = పెద్ద; అమ్మ = అమ్మ; సురారుల = దైత్యుల యొక్క {సురారులు – సుర (దేవతల) అరులు (శత్రువులు), రాక్షసులు, దైత్యులు}; అమ్మ = తల్లి; కడుపు = కడుపు; ఆఱడిపుచ్చిన = దుఃఖపెట్టిన, వ్యర్థముచేసిన; అమ్మ = అమ్మ; తన్ను = తనను; లోన్ = మనసు లోపల; నమ్మిన = నమ్మిన; వేల్పు = దేవతల; అమ్మల = తల్లుల; మనమ్ముల = మనసులలో; ఉండెడి = ఉండే; అమ్మ = అమ్మ; దుర్గ = దుర్గాదేవి; మా = మా; అమ్మ = అమ్మ; కృప = దయా; అబ్ధి = సముద్రముతో; ఇచ్చుత = ఇచ్చుగాక; మహత్త్వ = గొప్పదైన; కవిత్వ = కవిత్వంలో; పటుత్వ = పటుత్వమనే; సంపదల్ = సంపదలు.

భావము:- దుర్గాదేవి తల్లు లందరికి తల్లి; సప్తమాతృకలను కన్నతల్లి; ముల్లోకాలకు మూల మైన లక్ష్మి సరస్వతి పార్వతులకు మూలమైన తల్లి; అందరు అమ్మల కన్నా అధికురాలైన గొప్పతల్లి; దైత్యులను నాశనము చేసి వారి తల్లియైన దితి కడుపులో దుఃఖము చేకూర్చిన తల్లి; నమ్ముకున్న దేవతామతల్లుల నిండు మనసులలో నివసించే తల్లి; అయిన మా అమ్మ దయాసముద్రి అయి ఈ మహాభాగవత తెలుగు ప్రణీత మందు కవిత్వంలో మహత్వము, పటుత్వములను సమృద్ధిగా ప్రసాదించు గాక.

★1-11-మ.

హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో వర్థంపుఁ బెన్నిక్క, చం
దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్ తో నాడు పూఁబోఁడి, తా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.

టీక:- హరి = విష్ణుమూర్తి; కిన్ = కి; పట్టపు = పట్టపు; దేవి = రాణి; పున్నెముల = పుణ్యముల; ప్రోవు = పోగు; అర్థంపు = సంపదలకు; పెన్ = పెద్ద; ఇక్క = నిలయము; చందురు = చంద్రుడికి; తోన్ = తో కలిసి – తోడ; పుట్టువు = పుట్టినది; భారతీ = సరస్వతి; గిరిసుతల్ = పర్వత పుత్రిల (పార్వతి); తోన్ = తో కలిసి; ఆడు = ఆడే; పూఁన్ = పూవును; పోడి = పోలినది – స్త్రీ; తామరలు = పద్మముల; అందున్ = లో; ఉండెడి = ఉండే; ముద్దు = మనోజ్ఞముగ ఉన్న; ఆలు = స్త్రీ; జగముల్ = లోకాలు; మన్నించు = గౌరవించే; ఇల్లు = గృహమునకు; ఆలు = స్త్రీ; భాసురతన్ = (తన) ప్రకాశము వలన; లేములు = దరిద్రాలను; వాపు = పోగొట్టే; తల్లి = అమ్మ; సిరి = లక్ష్మి; ఇచ్చున్ = ఇచ్చుగాక; నిత్య = నిత్యమైన; కల్యాణముల్ = శుభములు.

భావము:- దేవాదిదేవు డైన శ్రీహరి పట్టపుదేవి శ్రీదేవి; రాశి పోసిన పుణ్యాలు రూపుగట్టిన పుణ్యవతి; సిరిసంపదలకు పెన్నిధి; చందమామకు గారాల చెల్లెలు; వాణితోను పార్వతీదేవితోను క్రీడించే పూబోణి; అరవిందాలు మందిరంగా గల జవరాలు; అఖిలలోకాలకు ఆరాధ్యురాలైన అన్నులమిన్న; చల్లని చూపులతో భక్తుల దారిద్ర్యాన్ని పటాపంచలు చేసే బంగారు తల్లి; ఆ శ్రీమహాలక్ష్మి నిత్యకల్యాణాలు అనుగ్రహించు గాక.

1-12-వ.

**అని యిష్టదేవతలం జింతించి, దినకర కుమార ప్రముఖులం దలంచి, ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయ గ్రీవదనుజకర పరిమిళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథాసుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి, మృదు మధురవచన వర్గ పల్లవిత స్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోక సమ్మోదిత సూరు మయూరు నభినందించి, మహాకావ్యకరణ కళావిలాసుం గాళి దాసుం గొనియాడి, కవి కమల రవిన్ భారవిన్ బొగడి, విదళితాఘు మాఘు వినుతించి, యాంధ్రకవితాగౌరవజనమనోహరి నన్నయ సూరిం గైవారంబు సేసి, హరిహర చరణారవిందవందనాభిలాషిం దిక్కమనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు వలికి, భావి కవుల బహూకరించి, యుభయకావ్యకరణ దక్షుండనై.**

టీక:- అని = ఈ విధంగా; ఇష్ట = ఇష్టమైన; దేవతలన్ = దేవతలను; చింతించి = తలచుకొని; దిన = దినమునకు; కర = కారణమైన - సూర్యుడు; కుమార = కుమారస్వామి; ప్రముఖులన్ = మొదలగు ముఖ్యులను; తలంచి = తలచుకొని; ప్రథమ = మొట్టమొదటి; కవితా= కవిత్వమును; విరచన = రచించే; విద్యా = నేర్పు అనే; విలాస = ఆటలో; అతిరేకి = ఉత్తముడు; వాల్మీకిన్ = వాల్మీకిని; నుతియించి = స్తుతించి; హయగ్రీవ = హయగ్రీవుడనే; దనుజ = దానవుని; కర = చేతితో; పరిమిళిత = కలగాపులగము చే.యబడ్డ; నిగమ = వేద; నివహ = రాశిని; విభాగ = విభజిం చుటకు వలసిన; నిర్ణయ = నియమాల; నిపుణతా = నైపుణ్య సాధనలో; సముల్లాసు = మంచి ఉల్లాసము గలవాడు; కున్ =కి; వ్యాసున =వ్యాసులవారి; కున్=కి; మ్రొక్కి= నమస్కరించి; శ్రీ = శుభప్రథమైన; మహా = గొప్ప; భాగవత = భాగవతము అనే; కథా = కథ అనే; సుధా = అమృత ప్రాయమైన; రస = రసాయనాన్ని; ప్రయోగి = ప్రయోగించినవాడు; కిన్ = కి; శుక = శుకుడనే; యోగి = యోగి; కిన్ = కి; నమస్కరించి = నమస్కరించి; మృధు = మృదువైన (లాలిత్యమైన); మధుర = తీయనైన; వచన = మాటల; వర్గ = మాలికలచే; పల్లవిత = చిగురించిన; స్థాణు = రాళ్లు కలిగినవాడు; కున్ = కి; బాణు = బాణుడు; కున్ = కి; ప్రణమిల్లి = నమస్కరించి; కతిపయ = ఎన్నదగిన; శ్లోక = శ్లోకాలతో; సమ్మోదిత = సంతోష పెట్ట బడిన; సూరున్ = పండితులు కలవాని; మయూరున్ = మయూరుని; అభినందించి = పొగిడి; మహా = గొప్ప; కావ్య =వ్యాలను; కరణ = రచించే; కళా = కళలో; విలాసున్ = నేర్పరిని; కాళిదాసున్ = కాళిదాసుని; కొనియాడి = పొగిడి; కవి = కవులనే; కమల = పద్మాలకి; రవిన్ = సూర్యు డైనవాడుని; భారవిన్ = భారవిని; పొగడి = కీర్తించి; విదళిత = నిర్మూలింపబడ్డ; అఘు = పాపాలు కలవాడిని; మాఘున్ = మాఘుని; వినుతించి = పొగిడి; ఆంధ్ర = తెలుగు; కవితా = సాహిత్యంమీద; గౌరవ = గౌరవమున్న; జన = జనుల; మనస్ = మనస్సులను; హారిన్ = ఆకర్షించినవాని; నన్నయ = నన్నయ; సూరిన్ = పండితుడుకి; కై = చేతులు; వారమున్ = జోడించుట; సేసి = చేసి; హరిహర = హరిహరునియొక్క - హరి హరుల; చరణ = పాదాలనే; అరవింద = పద్మాలకి; వందన = నమస్కరించే; అభిలాషిన్ = అభిలాషగలవాడనిని; తిక్క = తిక్కన అనే; మనీషిన్ = ప్రతిభాశాలిని; భూషించి = పొగిడి; మఱియు = ఇంకను;

ఇతర = ఇతరమైన; పూర్వ = ముందుతరపు; కవి = కవుల; జన = సమూహమునకు; సంభావనంబు = గౌరవాభివాదము; కావించి = చేసి; వర్తమాన = ఈనాటి; కవుల = కవుల; కున్ = కును; ప్రియంబు = ప్రియము కలుగునట్లుగా; పలికి = చెప్పి – అభినందించి; భావి = భవిష్య కాలపు; కవులన్ = కవులను; బహూకరించి = గౌరవించి; ఉభయ = రెండు రకాలైన; కావ్య = కావ్యములను; కరణ = రచించుటలో; దక్షుండన్ = సామర్థ్యముకలవాడిని; ఐ = అయి.

భావము:- ఇలా ఇష్టదేవత లందరినీ స్తుతించి. సూర్యభగవానుడిని, కుమారస్వామిని స్మరించుకున్నాను. ముందుగా కవితాసరస్వతి విలాస విన్యాసాలను వెలయింప జేసిన వాల్మీకి మహర్షుల వారికి వందనం చేస్తున్నాను. హయగ్రీవాసురుని చేతిలో పడి చిక్కుపడిన వేద సమూహాన్ని మొక్కపోని ఓర్పుతో, నేర్పుతో చక్కదిద్దిన వ్యాస భగవానుల వారికి వంగి నమస్కరిస్తున్నాను. శ్రీ మహాభాగవతకథ అనే సుధారసాన్ని పంచి పెట్టిన శుకయోగికి తలవంచి నమస్కరిస్తున్నాను. అనంతరం తన మెత్తనైన తియ్యనైన పలుకుల కులుకులతో శిలల్ని సైతం చిగురింపజేసిన బాణకవికి ప్రణామం చేస్తున్నాను. ఎన్నదగిన కొన్ని శ్లోకాలతోనే భగవానుడైన భాస్కరుణ్ణి ప్రసన్నుణ్ణి చేసికొన్న మయూరకవిని అభినందిస్తున్నాను. మహాకావ్యాలను నిర్మించే కళలో ఆరితేరిన కవి చంద్రుడు కాళిదాసుని కైవారం చేస్తున్నాను. కవుల హృదయాలను దోచుకున్న నన్నయ భట్టారకుని స్తుతిస్తున్నాను. హరిహరనాథుని చరణారవిందాలకు ఆనందాతిశయంతో మ్రొక్కుతున్న తిక్కనాచార్యుని కొనియాడుతున్నాను. తక్కిన పూర్వకవు లందరిని మనసారా భావించి సంభావిస్తున్నాను. ఈనాటి కవు లందరిని అభినందిస్తున్నాను. ముందు తరాలలో రాబోయే కవు లందరికీ శుభం పలుకుతున్నాను. ఆంధ్ర సంస్కృత ఉభయ భాషలలో గద్యపద్యాల (చంపూ) కావ్యాలు రచించే నైపుణ్యం అలవర్చుకున్నాను.

## కృతిపతి నిర్ణయము

**★1-13-ఉ.**

**ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి, పురంబులు వాహనంబులున్**
**సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి కాలుచే**
**సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ**
**బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.**

టీక:- ఈ = ఈ; మనుజ = మానువులకు; ఈశ్వర = రాజులలో; అధముల = అధముల; కున్ = కు; ఇచ్చి = అంకితమిచ్చి; పురంబులు = ఊళ్ళు; వాహనంబులున్ = ప్రయాణ సాధన ములు; సొమ్ములున్ = ధనం; కొన్ని = మొదలైన కొన్నిటిని; పుచ్చుకొని = తీసుకొని; చొక్కి = అలసిపోయి; శరీరము = శరీరము; వాసి = వదలి; కాలు = యముడి; చేన్ = చేత; సమ్మెట = సుత్తి; వ్రేటులన్ = దెబ్బలు; పడక = తినకుండ; సమ్మతి = ఇష్ట; తోన్ = పూర్వకముగా, కలిగి; హరి = హరి; కిన్ = కి; ఇచ్చి = ఇచ్చి; చెప్పెన్ = చెప్పెను; ఈ = ఈ; బమ్మెర = బమ్మెర వంశపు; పోతరాజు = పోతన అనే సమర్థుడు; ఒకఁడు = అనబడేవాడు ఒకడు; భాగవతంబున్ = భాగవతమును; జగత్ = లోకానికి; హితంబుగన్ = మేలు సమకూరునట్లుగా.

భావము:- విశ్వశ్రేయస్సు సమకూర్చాలనే సంకల్పంతో సమర్థంగా వ్రాసిన భాగవతాన్ని మానవ మాతృలు మాత్రమే అయినట్టి రాజులెవరికి ఇవ్వటానికి మనస్సు ఏమాత్రం అంగీకరించటం లేదు. అలా చేసి ఊళ్లు, అగ్రహారాలు హారాలు వస్తు వాహనాలు లాంటివి ఏవేవో తీసుకొని, ఆ సుఖా లలో మైమరచి ఈ లోకంలో అనుభవించినా, మరణించాక నరకంలో యమధర్మరాజు వేసే శిక్షలనే సుత్తిదెబ్బలు తప్పవని తెలుసు. అందుకే బమ్మెర పోతరాజు అనే నేను చక్కగా ఆలోచించుకొని మనస్ఫూర్తిగా అతిపవిత్ర గ్రంథమైన భాగవతాన్ని భగవంతుడైన ఆ శ్రీహరికే సమర్పించాను.

★1-14-తే.

చేతులారంగ శివునిఁ బూజింపఁడేని,
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ,
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు.

టీక:- చేతులు = చేతులు; ఆరంగ = నిండుగ; శివుని = శివుడిని; పూజింపఁడు = పూజింపని వాడు; ఏని = ఐతే; నోరు = నోరు; నొవ్వంగ = నొప్పెట్టేలా; హరి = విష్ణువుయొక్క; కీర్తి = శ్రవణము; నుడువఁడు = పలుకడు; ఏని = ఐతే; దయయు = దయ మఱియు; సత్యంబు = సత్యము; లోనుగాన్ = కలుగునట్లు; తలఁపఁడేనిన్ = ఎంచకపోతే; కలుగన్ = పుట్టుట; ఏటి = ఎందుల; కిన్ = కు; తల్లుల = వారి తల్లుల యొక్క; కడుపు = కడుపు; చేటు = చెడపుటకు.

భావము:- ఈ లోకంలో జన్మించిన ప్రతి ఒక్కడు చేతులారా శివుణ్ణి పూజించాలి, నోరారా కేశవుణ్ణి కీర్తించాలి, సత్యం కరుణ మొదలైన సద్గుణాలను అలవర్చుకోవాలి. అలా చేయని నిర్భాగ్యుడు ఈ లోకంలో పుట్టటం దేనికి తల్లి కడుపు చెడగొట్టటం దేనికి

1-15-వ.

అని మఱియు మదీయపూర్వజన్మ సహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనాకుతూహలుండనై, యొక్క రాకా నిశాకాలంబున సోమోపరాగంబు రాకఁ గని, సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుంజని, క్రుంకులిడివెడలి, మహనీయమంజులపులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ, గించి దున్మీలిత లోచనుండనై యున్న యెడ.

టీక:- అని = అని పలికి; మఱియున్ = ఇంకా; మదీయ = నాయొక్క; పూర్వ = క్రితపు; జన్మ = జన్మలు; సహస్ర = వేలకొలదుల లోను; సంచిత = సంపాదించిన; తపః = తపస్సుల యొక్క; ఫలంబున = ఫలితము వలనను; శ్రీమన్ = శోభనకరమైన; నారాయణ = హరియొక్క; కథా = కథల; ప్రపంచ = మొత్తం సమూహాన్ని;

విరచనా = రచించాలనే; కుతూహలుండను = బలీయమైన కోరికగల వాడను; ఐ = అయి; ఒక్క = ఒక; రాకా = పౌర్ణమి నాటి; నిశా = రాత్రి; కాలంబున = కాలంలో; సోమ = చంద్ర; ఉపరాగంబు = గ్రహణము; రాకన్ = వస్తుందని; కని = తెలిసికొని; సజ్జన = సజ్జనుల; అనుమతంబున = అనుమతితో; అభ్రంకష = ఆకాశమును; కష = ఒరసుకనేలా; శుభ్ర = శుభ్రమైన; సముత్తుంగ = పెద్ద; భంగ = అలలు కలది; అగు = అగు; గంగ = గంగానది; కున్ = కి; చని = వెళ్ళి; క్రుంకులు = మునుగుటలు - స్నానము; ఇడి = చేసి; వెడలి = బయటకువచ్చి; మహనీయ = గొప్పదైన; మంజుల = మనోహరమైన; పులిన = ఇసుకతిన్నెల; తలంబున = గట్టుమీద; మహేశ్వర = శివుని; ధ్యానంబు = ధ్యానం; సేయుచున్ = చేస్తూ; కించిత్ = కొంచెము; ఉన్మీలిత = తెరచిన; లోచనుండను = కన్నులుగలవాడను; ఐ = అయి; ఉన్న = ఉన్నటువంటి; ఎడ = సమయములో.

భావము:-వేల వేల జన్మలు ఎత్తి కూడబెట్టుకున్న నా తపస్సు పండింది. నా హృదయంలో శ్రీమన్నారాయణ దేవుని పుణ్యకథలను విస్తరించి రచించాలనే కుతూహలం నిండింది. ఒక పున్నమి రాత్రి చంద్రగ్రహణం ఉంది. అవాళ చందమామ నిండుగా ఉన్నాడు. పండు వెన్నెలలు కురుస్తున్నాయి. పెద్దల అనుజ్ఞ పొంది ఆకాశాన్నంటే ఉత్తుంగ తరంగాలతో పొంగి ప్రవహిస్తున్న గౌతమీగంగకు వెళ్లాను. ఆ నదిలో స్నానం చేసి వచ్చి ఒక తెల్లని ఇసుక తిన్నెమీద పరమశివుణ్ణి ధ్యానిస్తూ అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చున్నాను. అప్పుడు....

1-16-సీ.

మెఱుఁగు చెంగటనున్న మేఘంబు కైవడి-
నువిద చెంగట నుండ నొప్పువాఁడు,
చంద్రమండల సుధాసారంబు పోలిక-
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు,
వల్లీయుత తమాల వసుమతీజము భంగిఁ-
బలువిల్లు మూఁపునఁబరఁగువాఁడు,
నీలనగాగ్ర సన్నిహిత భానుని భంగి-
ఘన కిరీటము దలఁ గలుగువాఁడు,

1-16.1-ఆ.

పుండరీకయుగముఁ బోలు కన్నుల వాఁడు,
వెడఁద యురమువాఁడు, విపులభద్ర
మూర్తివాఁడు, రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

టీక:- మెఱుఁగు = మెఱుపుతీగ; చెంగటన్ = ప్రక్కన; ఉన్న = ఉన్నటువంటి; మేఘంబు = మబ్బుల; కైవడిన్ = విధంగా; ఉవిద = స్త్రీ (భార్య), లక్ష్మి; చెంగట = దగ్గఱ; ఉండన్ = ఉండగా; ఒప్పు = చక్కగ యండెడి; వాడు = వాడు; చంద్ర = చంద్ర; మండల = బింబపు; సుధా = వెన్నెల; సారంబు = వెలుగు; పోలిక = వలె; ముఖమున = ముఖములో; చిఱునవ్వు = చిఱునవ్వు; మొలచు = వెలయు - ప్రకాశించు; వాఁడు = వాడు; వల్లీయుత = పూలతీగతోకూడిన; తమాల = గానుగు; వసుమతీ = భూమిని; జము = పుట్టినది - చెట్టు; భంగిన్ = వలె; పలు = బలిష్టమైన; విల్లు = విల్లు; మూఁపునన్ = భుజమున; పరఁగు = ప్రవర్తిల్లే; వాఁడు = వాడు; నీల = నీల; నగ = గిరి; అగ్ర = శిఖరము; సన్నిహిత = సమీపంగానున్న; భానుని = సూర్యుడి; భంగిన్ = లాగ; ఘన = గొప్ప; కిరీటము = కిరీటము; తలన్ = తలపైన; కలుగు = కల; వాఁడు = వాడు;

పుండరీక = పద్మముల, తెల్లతామరల; యుగము = జంట; పోలు = వంటి; కన్నుల = కళ్ళుకల; వాఁడు = వాడు; వెడఁద = విశాలమైన; ఉరము = వక్షముగల; వాఁడు = వాడు; విపుల = విస్తారమైన; భద్ర = శుభలక్షణముల; మూర్తి = ఆకారముగల; వాఁడు = వాడు; రాజ = రాజులలో; ముఖ్యుఁడు = ముఖ్యమైనవాడు; ఒక్కరుఁడు = ఒకడు; నా = నాయొక్క; కన్నున్ = కళ్ళ; గవ = జంట; కున్ = కు; ఎదురన్ = ఎదురగ; కానఁబడియె = సాక్షత్కరించెను;

భావము:- ఆ సమయంలో రాజశేఖరుడు ఒకడు నా కళ్ళ ముందు సాక్షాత్కరించాడు. మేఘం ప్రక్కన మెరుపులాగ ఆయన ప్రక్కన ఒక స్త్రీమూర్తి ఉంది. చంద్ర మండలంలోంచి కురిసే అమృత ధారలా ఆయన ముఖంలో మందహాసం చిందుతూ ఉంది. కానుగవృక్షాన్ని చుట్టుకొన్న తీగలా ఆయన భుజాగ్రాన ధనుస్సు వ్రేలాడుతోంది. నీలగిరి శిఖరాన ప్రకాశించే భానుబింబంలాగ ఆయన శిరస్సుపై కిరీటం విరాజిల్లుతూ ఉంది. ఈ విధంగా విరిసిన తెల్ల తామరరేకులవంటి కన్నులతో, విశాలమైన వక్షస్థలంతో, విశ్వమంగళ స్వరూపంతో, ఆ రాజశ్రేష్ఠుడు నా కట్టెదుట కనువిందు చేసాడు.

## 1-17-వ.

### ఏను నా రాజశేఖరుం దేఱి చూచి భాషింప యత్నంబు సేయునెడ నతఁడు దా, "రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవ తంబుఁ దెనుంగు సేయుము; నీకు భవబంధంబులు దెగు"నని, యానతిచ్చి తిరోహితుం డయిన, సమున్మీలిత నయనుండనై వెఱఁగుపడి చిత్తంబున.

టీక:- ఏను = నేను; ఆ = ఆయొక్క; రాజ = రాజులలో; శేఖరున్ = శ్రేష్ఠుని - మహారాజుని; తేఱి = తేరిపార; చూచి = చూచి; భాషింప = మాట్లాడుటకు; యత్నంబు = ప్రయత్నం; సేయు = చేస్తున్న; ఎడ = సమయంలో; అతఁడు = అతడు; తాన్ = తను; రామభద్రుండ = రామభద్రుండననియు; మన్ = నాయొక్క; నామ = పేరునకు; అంకితంబుగా = అంకితముగా; శ్రీ = శ్రీ; మహా = మహా; భాగవతంబున్ = భాగవతమును; తెనుంగు = తెలుగులోకి (అనువాదము); చేయుము = చేయుము; నీకు = నీకు; భవ = సంసార వలన; బంధంబులు = బంధనములు; తెగును = తెగుతాయి; అని = అని; ఆనతి = ఆజ్ఞ; ఇచ్చి = వేసి; తిరోహితుండు = మాయము; అయిన = అవ్వగా; సమున్మీలిత = బాగాతెరచిన; నయనుండను = కళ్ళుగలవాడను; ఐ = అయి; వెఱఁగున్ = ఆశ్చర్యములో; పడి = పడి; చిత్తంబున = మనస్సులో.

భావము:- అప్పుడు నేనా మహారాజుని రెప్పవాల్చకుండా చూసి మాట్లాడదామని ఇంకా ప్రయత్నిస్తున్నాను. ఇంతలో ఆయనే"నేను రామభద్రుణ్ణి. నా పేరు మీదుగా శ్రీ మహాభాగవతాన్ని తెలుగు చేయుము.. నీ భవబంధాలు పటాపంచలౌతాయి" అని సెలవిచ్చి అంతలోనే అంతర్థానమయ్యాడు. నేను పూర్తిగా కళ్ళు తెరచుకొని అంతా ఆశ్చర్యంగా చూస్తూ, నాలో నే నిట్లా అనుకున్నాను.

★1-18-క.

పలికెడిది భాగవత మఁట,

పలికించెడివాడు రామభద్రుం డఁట, నేఁ

బలికిన భవహర మగునఁట,

పలికెద, వేఱొండు గాథ బలుకఁగ నేలా?

టీక:- పలికెడిది = పలుకునది; భాగవతము = భాగవతము; అఁట = అట; పలికించెడి = పలికించెడి; వాడు; రామభద్రుండు = రాముడు; అఁట; నేన్ = నేను; పలికిన = పలికినట్లయిన; భవ = సంసారబంధనములు; హరము =తొలగుట; అగునఁట =అవుతుందట; పలికెద= (అందుకే) పలుకుదును; వేఱొండు = ఇంకొక; గాథ = కథ; పలుకఁగన్ = పలకటం; ఏలా = ఎందుకు.

భావము:- వ్రాయబడేదేమో పరమ పవిత్రమైన శ్రీమద్భాగవతం. కరుణా సముద్రుడైన శ్రీరామచంద్ర ప్రభు వేమో వ్రాయించేవాడుట. వ్రాసి నందువల్ల భవభందాలు పరిహారము అవుతాయిట. అంచేత భాగవతాన్ని వ్రాస్తాను. మిగతా వేవి వ్రాయను.

1-19-ఆ.

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు,

శూలికైనఁ దమ్మిచూలికైన,

విబుధజనుల వలన విన్నంత, కన్నంత,

దెలియ వచ్చినంత, దేటపఱతు.

టీక:- భాగవతము = భాగవతమును; తెలిసి = తెలుసు కొని; పలుకుట = పలుకుట; చిత్రంబు = చిత్రమైనది; శూలి = శూలధారి శివుని; కిన్ = కి; ఐనన్ = ఐన ప్పటికి; తమ్మి = పద్మము నందు; చూలి = పుట్టిన వాని; కిన్ = కి; ఐనన్ = అయినప్పటికి; విబుధ = విశేషమైన జ్ఞానము గల; జనుల = జనుల; వలనన్ = వలన; విన్న = వినిన; అంత =అంత; కన్న= చూసిన; అంత = అంత; తెలియ వచ్చిన = తెలిసిన; అంత = అంత; తేట = తెలిసేలా; పఱతు = చేస్తాను.

భావము:- అయితే చిత్రమేమంటే భాగవతాన్ని చక్కగా సమ గ్రంగా అర్థంచేసుకున్నామని ఎవరు చెప్పలేరు. ఆఖరికి ఆ త్రి శూలధారి పరమశివుడైనా సరే, పద్మభవుడైన బ్రహ్మదేవుడైనా సరే అలా అనలేరంటే ఇక

నా సంగతి వేరే చెప్పాలా. అయినా పెద్దల వల్ల ఎంత విన్నానో, వారి సన్నిధిలో ఎంత నేర్చుకున్నానో, స్వయంగా ఎంతతెలుసుకోగలిగానో అదంతా తేటతెల్లమయ్యే లా చెప్తాను.

★1-20-క.

కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ,
గొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండుం
గొందఱికి గుణములగు, నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

టీక:- కొందఱు = కొంతమంది; కున్ = కి; తెనుఁగు = తెలుగు {తెనుగు గుణమగు – తెలుగు (దేశీయ) పదాల ప్రయోగం ఎక్కువ వుంటే నచ్చుతుంది}; గుణము = బాగుగ; అగున్ = ఉండును; కొందఱకును = కొంతమందికి; సంస్కృతంబు = సంస్కృతము {సంస్కృతంబు గుణమగు - సంస్కృతమూలపదాల ప్రయోగం ఎక్కువ వుంటే నచ్చుతుంది}; గుణము = బాగుగ; అగున్ = ఉండును; రెండున్ = రెండూ; కొందఱి = కొంత మంది; కిన్ = కి; గుణములగు = బాగుగ ఉంటాయి; నేన్ = నేను; అందఱ = అందర్ని; మెప్పింతు = మెప్పిస్తాను; కృతులన్ = రచనలలో; ఆయ్యై = ఆయా; ఎడలన్ = సందర్భానుసారంగా.

భావము:- తెలుగు పదాలతో కూర్చి వ్రాసినవి కొంతమందికి నచ్చుతాయి. సంస్కృత పదాలుతో కూర్చి వ్రాసిన రచనలు మరికొంతమందికి నచ్చుతాయి. ఇంకొంతమందికి రెండు రకాల పదప్రయోగాలు నచ్చుతాయి. నేను అందరు మెచ్చుకొనేలా భాగవతం ఆంధ్రీకరిస్తాను.

★1-21-మ.

ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు, మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో,
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్, దీనిం దెనింగించి, నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

టీక:- ఒనరన్ =ఇంపుగా; నన్నయ = నన్నయ; తిక్కన = తిక్కన; ఆది = మొదలైన; కవులు = కవులు; ఈ = ఈ; ఉర్విన్ = భూమ్మీద; పురాణ = పురాణ {పురాణలక్షణములు - సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంత రము, వంశానుచరితము}; ఆవళుల్ = సమూహములు; తెనుఁగు = ఆంధ్రీకరణ; చేయుచున్ = చేస్తూ; మత్ = నాయొక్క; పురా = పూర్వ జన్మలలో; కృత = చేసిన; శుభ = పుణ్యపు; అధిక్యంబు = గొప్పతనం; తాన్ = అది; ఎట్టిదో = ఎలాంటిదో కాని; తెనుఁగు = ఆంధ్రీకరణ; చేయరు = చేయలేదు; మున్ను = ఇంతకు ముందుగ; భాగవతమున్ = భాగవతాన్ని; దీనిన్ = దీనిని; తెనింగించి = ఆంధ్రీకరించి; నా = నాయొక్క; జననంబున్ = జన్మని; సఫలంబు = సార్థకము; చేసెదన్ = చేసుకుంటాను; పునః = పునః; జన్మంబున్ = జన్మమును; లేకుండఁగన్ = లేకుండే లాగ.

భావము:- సంస్కృతంలో ఉన్న పురాణగ్రంథాలు అనేకం ఇప్పటికే నన్నయ భట్టారకుడూ, తిక్కన సోమయాజి మొదలైన కవీశ్వరులు తెలుగులోకి తీసుకొచ్చారు. నేను పూర్వజన్మలలో ఎంతో గొప్ప పుణ్యం చేసుకొని ఉంటాను. అందుకే ఆ మహామహులు భారత రామాయణాలు తప్ప భాగవతం జోలికి రాలేదు. బహుశః నా కోసమే భాగవతాన్ని వదిలిపెట్టి ఉంటారు. ఇంకెందుకు ఆలస్యం ఈ మహాగ్రంథాన్ని తెలుగులోకి వ్రాసి మళ్లీ జన్మంటూ లేకుండా ఈ నా జన్మను సార్థకం చేసుకుంటాను.

★1-22-మ.

**లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం**
**జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో**
**జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై**
**వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.**

టీక:- లలిత = చక్కని, అందమైన; స్కంధము = కొమ్మలతో, స్కంధములతో; కృష్ణ = నల్లని, కృష్ణుని కథలు; మూలము = వేళ్ళతో, మూలాధారముగ; శుక = చిలుకల, శుక యోగి; ఆలాప = పలుకులతో, పలుకుల చే; అభిరామంబు = రమణీయంగా, మిక్కిలి శోభాకరమై; మంజులత = అందమైన పూల తీగలతో, మనోహర మైన వాక్కులతో; శోభితమున్ = అలంకరింపబడుతూ, అలరారుతూ; సువర్ణ = మంచి రంగులు గల, మంచి అక్షర ప్రయోగాలు కలిగి; సుమనస్ = మంచి పువ్వులతో, మంచి మనసున్నవారికి; సుజ్ఞేయమున్ = చక్కగ కనిపిస్తున్న, చక్కగ తెలిసే లాగ; సుందర = అందంగా, అందమైన; ఉజ్జ్వల = బాగా పెరిగిన, విలాసవంత మైన; వృత్తంబున్ = గుండ్రముగా నున్న, చక్కటి పద్య వృత్తములతోను; మహా = పెద్ద, గొప్ప; ఫలంబు = పళ్ళతో, ఫలితా న్నిచ్చే లాగను; విమల = విస్తార మైన, నిర్మల మూర్తి యైన; వ్యాసా = చుట్టుకొలత గల, వ్యాసు డనే; ఆలవాలంబున్ = పాదుతో ఉన్నది, పునాది కలిగినది; ఐ = అయి; వెలయున్ = రూపుకట్టి యున్నది, రూపొంది యున్నది; భాగవత = భాగవత మనే; ఆఖ్య = పేరు గల; కల్పతరువు = కల్పవృక్షము; ఉర్విన్ = భూమిమీద, లోకంలో; సద్విజ = చక్కటి పిట్టలకు, సజ్జనులకు మరియు ద్విజులకు; శ్రేయము = మేలుకూర్చునది, శ్రేయస్కరము; ఐ = అయి.

భావము:- బ్రహ్మదేవుడికైన పరమశివునికైన భాగవతమును తెలిసి పలుకుట చిత్రమైనట్టి శ్రీమద్భాగ వతం కల్పవృక్షంతో సాటిరాగలిగి ప్రకాశించేది. ఏమాత్రం సందేహం లేదు. దీనిని రెండు రకాల అన్వయార్థాలు గల పదప్రయోగాలతో ఇలా వివరించారు. కల్పవృక్షం కొమ్మలతో మనోజ్ఞ మైంది అయితే భాగవతం స్కంధాలనే 12 భాగాలతో లలిత మనోహర మైనది. కల్పవృక్షం నల్లగా ఉండే వేళ్ళు కలది అయితే భాగవతానికి మూలం భగవానుడైన శ్రీకృష్ణుడుగా కలది. కల్పవృక్షం చిలుకల పలుకలతో సతతం కూడి మనోహరంగా ఉంటుంది, అలాగే భాగవతం శుకమహర్షి మధుర వాగ్ధారలతో మనోజ్ఞంగా ఉంటుంది. కల్పవృక్షం అందమైన పూల తీగలచే అలంకరింప బడినది, మరి భాగవతం మనోహర మైన వాక్కులుతో అలరారేది. కల్పవృక్షం మంచి రంగురంగుల పూలతో శోభిల్లుతుంటుంది, అదేవిధంగా భాగవతం అక్షర సార్థక మై సజ్జనుల మనసులు అలరించేది. కల్ప వృక్షం సుందరంగా ఉజ్వలంగా ప్రకాశిస్తు గుండ్రంగా ఉంటుంది, అదే మరి భాగవతమో సుందరము ఉజ్వలము అయిన చక్కటి పద్య వృత్తాలు గలది. కల్పవృక్షం ఎంత గొప్ప కామితార్థాల నైనా

అందిస్తుంది, అయితే భాగవతం కైవల్యాది కామిత ప్రయోజనాలు సర్వం సమకూర్చేది. కల్పవృక్షం విశాలమైన చుట్టుకొలత గల మాను కలిగినది, అలాగే భాగవతం స్వచ్ఛమైన వ్యాస కృత వ్యాసాలతో నిండినది. కల్పవృక్షం స్వర్గంలో విలసిల్లు తుంది, మరి భాగవతమో భూలోకంలో విరాజిల్లుతోంది. కల్పవృక్షం శుక పికాది పక్షులకు సైతం శ్రేయస్కర మైనది, అదే భాగవతం అయితే ఉత్తములకు సద్బ్రాహ్మణులకు శ్రేయోదాయక మైనది.

1-23-వ.

ఇట్లు భాసిల్లెడు శ్రీ మహాభాగవతపురాణ పారిజాత పాదపసమాశ్ర యంబునను, హరి కరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె నని, బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి; యందు గురు, వృద్ధ, బుధ, బంధు జనానుజ్ఞాతుండనై.

టీక:- ఇట్లు = ఈ విధంగా; భాసిల్లెడు = ప్రకాశించే; శ్రీ = శుభప్రదమైన; మహా = గొప్ప; భాగవత = భగవంతుని గురించిన; పురాణ = పురాణమనే; పారిజాత = పారిజాత; పాదప = వృక్షమును; సమ = చక్కగా; ఆశ్రయంబునన్ = ఆశ్రయించుట వలనను; హరి = విష్ణుని; కరుణా = దయయొక్క; విశేషంబునను = విశిష్టత్వంవలనను; కృతార్థత్వంబు = ప్రయోజనకరమైనది; సిద్ధించెనని = సిద్ధించిందని; బుద్ధిని = బుద్ధియందు; ఎఱింగి = గ్రహించి; లేచి = లేచి (ధ్యానస్థానంనుంచి); మరలి = వెనుకకు వచ్చి; కొన్ని = కొన్ని; దినంబుల = రోజుల; కున్ = కు; ఏకశిలానగరంబున = ఏకశిలానగరాని; కున్ = కి; చనుదెంచి = చేరి; అందున్ = అందు; గురు = గురువులు; వృద్ధ = పెద్దలు; బుధ = జ్ఞానవంతులు; బంధు = బంధువులు; జన = ఐన జనులచే; అనుజ్ఞాతుండన్ = అనుమతి పొందినవాడిని; ఐ = అయి.

భావము:- ఈ విధం బహు ప్రకాశమానమైన పురాణరాజమైన భాగవతం అనే కల్పవృక్షాన్ని సమాశ్రయించటం వల్ల, శ్రీహరి విశేషంగా అనుగ్రహించటం వల్ల నా జన్మ చరితార్థమైంది అని చక్కగా అర్థమైంది. అప్పుడు నేను ఆ నదీ ప్రదేశం నుంచి కదలి కొన్నాళ్ళకు ఏకశిలానగరానికి తిరిగివచ్చాను. అక్కడ గురువులూ, వృద్ధులూ, పండితులూ, బంధువులూ మొదలైన పెద్దలందరి అనుజ్ఞ తీసుకున్నాను.

## గ్రంథకర్త వంశ వర్ణనము

1-24-సీ.

కౌండిన్యగోత్ర సంకలితుఁ, డాపస్తంబ-
సూత్రుండు, పుణ్యుండు, సుభగుఁడైన
భీమన మంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ,-
కలకంఠి తద్భార్య గౌరమాంబ,
కమలాప్తు వరమునఁ గనియె సోమన మంత్రి,-
వల్లభ మల్లమ, వారి తనయుఁ

డెల్లన, యతనికి నిల్లాలు మాచమ,-
వారి పుత్త్రుఁడు, వంశవర్ధనుండు

1-24.1-ఆ.

లలిత మూర్తి, బహుకళానిధి, కేసన;
దాన మాన నీతి ధనుఁడు, ఘనుఁడు,
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె; శైవశాస్త్రమతముఁ గనియె.

టీక:- కౌండిన్య = కౌండిన్యస; గోత్ర = గోత్రంలో; సంకలితుఁడు = ఆవిర్భవించినవాడు; ఆపస్తంభ = ఆపస్తంభ; సూత్రుండు = సూత్రానుయాయి; పుణ్యుండు = పుణ్యాత్ముడు; సుభగుఁడు = సౌభాగ్యసంపన్నుడు; ఐన = ఐనటువంటి; భీమనమంత్రి = భీమనమంత్రి; కిన్ = కి; ప్రియ = ప్రియమైన; పుత్త్రుఁడు = కొడుకు; అన్నయ = అన్నయ; కలకంఠి = మంచి వాక్కు ఉన్నామె; తత్ = అతని; భార్య = భార్య; గౌరమాంబ = గౌరమాంబ; కమల = పద్మముల; ఆప్త = బంధువు – సూర్యుని; వరమున = వరమువలన; కనియె = కనినది; సోమనమంత్రిన్ = సోమన మంత్రిని; వల్లభ = (అతని) భార్య; మల్లమ = మల్లమ; వారి = వారి; తనయుఁడు = కొడుకు; ఎల్లన = ఎల్లన; అతని = అతని; కిన్ = కి; ఇల్లాలు = భార్య; మాచమ = మాచమ; వారి = వారి; పుత్త్రుఁడు = కొడుకు; వంశ = వంశమును; వర్ధనుండు = ఉద్ధరించినవాడు;

లలిత = అందమైన; మూర్తి = రూపుగలవాడు; బహు = అనేక; కళా = కళల; నిధి = సంపన్నుడు; కేతన = కేతన; దాన = దానగుణము; మాన = మన్నింపదగిన గుణము; నీతి = నీతితో కూడిన ప్రవర్తన; ధనుఁడు = ధనముగాకలవాడు; ఘనుఁడు = గొప్పవాడు; తను = అతను; కున్ = కి; లక్కమాంబ = లక్కమాంబ; ధర్మ = ధర్మబద్ధమైన; గేహిని = గృహిణి – భార్య; కాఁగ = అయ్యి యుండగా; మనియె = జీవించెను; శైవశాస్త్ర = శైవమును; మతమున్ = మతముగా; కనియెన్ = స్వీకరించినాడు.

భావము:- ఇక మావంశచరిత్ర. కౌండిన్యసగోత్రంలో ఆవిర్భవించినవాడు, అపస్తంబసూత్ర అనుయాయి, పుణ్యాత్ముడు, ధన్యాత్ముడు అయిన వాడు భీమన మంత్రి. ఆయన కుమారుడు అన్నయ్య. ఆయన అర్ధాంగి గౌరమాంబ. ఆ దంపతులకు సూర్యుని వరప్రసాదం వల్ల సోమన జన్మించాడు. ఆయన ఇల్లాలు మల్లమ్మ. ఆ సతీపతుల సంతానం ఎల్లన. ఆయన భార్య మాచమ్మ. వారిద్దరికీ వంశవర్ధనుడైన కేసనమంత్రి ఉదయించాడు. చక్కనివాడు, పెక్కు కళలలో ప్రసిద్ధుడు, దాత, నీతిమంతుడు, అభిమానధనుడు ఐన కేసన్నగారు లక్కమాంబను సహధర్మచారిణిగా వరించి శాస్త్ర సమ్మతమైన శైవమతాన్ని స్వీకరించాడు.

★1-25-క.

నడవదు నిలయము వెలువడి,
తడవదు పరపురుష గుణముఁ, దనపతి నుడువుం
గడవదు, వితరణ కరుణలు
విడువదు, లక్కాంబ; విబుధ విసరము వొగడన్.

టీక:- నడవదు = వెళ్ళదు; నిలయము = ఇల్లు; వెలువడి = విడిచి; తడవదు = తలపులోకి రానీయదు; పర = పరాయి; పురుషు = మగవారి; గుణము = గుణాలను; తన = తన; పతి = పతి; నుడువున్ = మాటను; గడవదు = దాటదు; వితరణ = దాన గుణము; కరుణలు = జాలిని; విడువదు = విడిచి పెట్టదు; లక్కాంబ = లక్కమాంబ; విబుధ = మంచి జ్ఞానుల; విసరము = సమూహం; పొగడన్ = కీర్తించగ.

భావము:- ఆ లక్కమాంబ మహా యిల్లాలు. యింటి బయటకు కాలు పెట్టి ఎరుగదు. పరపురుషుల సంగతి తలచుట ఎరుగదు. భర్త మాట జవదాటి ఎరుగదు. దాన ధర్మాలకు, దయా దాక్షిణ్యాలకు పెట్టింది పేరు. పెద్దల మన్ననలను పొందిన మహా సాధ్వి.

1-26-ఉ.

మానిను లీడుగారు బహుమాన నివారిత దీనమానస
గ్లానికి, దాన ధర్మ మతిగౌరవమంజులతాగభీరతా
స్థానికి, ముద్దుసానికి, సదాశివపాదయుగార్చనానుకం
పానయవాగ్భవానికిని, బమ్మెర కేసయ లక్కసానికిన్.

టీక:- మానినులు = స్త్రీలు, {మానిని - మానము గల స్త్రీ}; ఈడు = సాటి; కారు = రారు; బహుమాన = తను చేసిన బహుమానములచే; నివారిత = తొలగింపబడిన; దీన = దీనుల యొక్క; మానస = మనసులలోని; గ్లాని = దఃఖముగలామె; కిన్ = కి; దాన = దాన; ధర్మ = ధర్మ; మతి = బుద్ధి; గౌరవ = గౌరవ; మంజులతా = మృదువైన; గభీరతా = గంభీరమైన ప్రవర్తనలకి; స్థాని = నిలయమైనామె; కిన్ = కి; ముద్దు = మనోజ్ఞమైన; సాని = అధికురాలు; కిన్ = కి; సదా = ఎల్లప్పుడూ; శివ = శివునియొక్క; పాద = పాదముల; యుగ = ద్వయాన్ని; అర్చన = పూజించుటందు; అనుకంపా = దయాకలిత; నయ = మృదు; వాక్ = సంభాషణలో; భవాని = పార్వతీదేవి లాంటి ఆమె; కిన్ = కి; బమ్మెర = బమ్మెర; కేసయ = కేసయగారి; లక్కసాని = లక్కాంబ; కిన్ = కు.

భావము:- లక్కమాంబ బీదసాదలను ఆదరించి వారి కష్టాలు పోగొట్టే చల్లని తల్లి. ఔదార్యానికీ, బుద్ధి చాతుర్యా నికి, సౌందర్యానికి, గాంభీర్యానికి ఆమె పెట్టిందిపేరు. సదా, సదాశివుని పాదాలు అర్చిస్తూ, దయతో కూడిన నయవాక్కులతో, సాక్షాత్తు భవానీమాతలా కనిపించే ఆ కేసయ గారి ధర్మపత్నికి సామాన్య కాంతలు సాటిరారు.

1-27-క.

ఆ మానినికిం బుట్టితి
మే మిరువుర, మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన, పోతన
నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్.

టీక:- ఆ = అటువంటి; మానిని = మంచి మానము గలామె {మానిని - మానము గల స్త్రీ}; కిన్ = కి; పుట్టితిమి = పుట్టితిమి; మేము = మేము; ఇరువురము = ఇద్దరము; అగ్ర = ముందు; జాతుడు = పుట్టినవాడు - అన్న; ఈశ్వర = శివ; సేవా = పూజయందు; కాముఁడు = కోరికగలవాడైన; తిప్పన = తిప్పన; పోతన = పోతన అనే; నామ = పేరుతో; వ్యక్తుండ = తెలియబడేవాడిని; సాధు = మంచితనం; నయ = నీతి; ఉక్తుండన్ = ఉన్నవాడిని.

భావము:- ఆమెకి మేమిద్దరం కొడకులం పుట్టాము. పెద్దవాడు తిప్పన, ఆయన ఈశ్వరార్చన కళాశీలుడు. నేను చిన్నవాణ్ణి. నా పేరు పోతన. పెద్దల అడుగుజాడల్లో నీతి యుక్త సాధువర్తనతో మెలగే వాడిని.

1-28-వ.

**అయిన నేను, నా చిత్తంబున శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పించుకొని.**

టీక:- అయిన = ఐనటువంటి; నేను = నేను; నా = నాయొక్క; చిత్తంబున = మనసులో; శ్రీ = శ్రీ; రామచంద్రుని = రామచంద్రుని; సన్నిధానంబు = సాన్నిధ్యము; కల్పించుకొని = కల్పించుకొని;

భావము:- అట్టి నేను శ్రీ రామచంద్రుణ్ణి నా నిండుగుండెలో నిలుపుకొన్నవాడని అయి.

## షష్ఠ్యంతములు

1-29-ఉ.

**హారికి, నందగోకులవిహారికిఁ జక్రసమీరదైత్య సం**
**హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీ మనో**
**హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా**
**హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్.**

టీక:- హారి = హారాలు ధరించువాని; కిన్ = కి; నంద = నందుని; గోకుల = గోకులములో; విహారి = విహరించువాని; కిన్ = కి; చక్ర = చక్రము వలె తిరుగు; సమీర = గాలి - సుడిగాలి రూపధారియైన; దైత్య = రాక్షసుని - తృణావర్తుని; సంహారి = సంహరించినవాని; కిన్ = కి; భక్త = భక్తులయొక్క; దుఃఖ = దుఃఖమును; పరిహారి = తీసివేయువాని; కిన్ = కి; గోప = గోపాల వంశములో పుట్టి; నితంబినీ = స్త్రీల యొక్క {నితంబిని - గొప్ప పిరుదులు గలవారు}; మనస్ = మనసులని; హారి = గెలిచినవాని; కిన్ = కి; దుష్ట = దుష్టుల; సంపద్ = సంపదను; అపహారి = అపహరించువాని; కిన్ = కి; ఘోష = గొల్లల; కుటీ = ఇళ్ళలోని; పయః = పాలు; ఘృత = పెరుగు; ఆహారి = తినేవాని; కిన్ = కి; బాలక = పిల్లలను; గ్రహ = పట్టుకొనే; మహా = మహా; అసుర = రాక్షసియైన; దుర్ = చెడ్డ; వనితా = స్త్రీని - పూతనని; ప్రహారి = చంపినవాని; కిన్ = కి.

భావము:- మనోహర హారాలు ధరించువాడికిం; నంద వంశం వారి గోకులంలో విహరించిన వాడికి; తృణావర్తు డనే దానవుణ్ణి సంహరించిన వాడికి; భక్తుల పరితాపాలను పరిహరించువాడికి; గోపాంగనల

మనస్సులను అపహరించినవాడికి; దుష్టుల సంపదలను హరించిన వాడికి; వ్రేపల్లెలో గోపికల యిండ్లలో పాలు, నెయ్యి, అపహరించినవాడికి; పిల్లల పాలిటి పెనుభూతమైన పూతన అనే మహారాక్షసిని మట్టు పెట్టినవాడికి.

గమనిక :- విభక్తులు లేదా విభక్తి ప్రక్రియలు వాక్యంలోని వివిధ పదాలకు అన్వయం కలిగించునవి. అష్ట విక్తులు అని ఎనిమిది ఉన్నాయి. అందు కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ ఐదును షష్ఠి ిభక్తి. ఈ షష్ఠీ విభక్తి వాడుతూ గ్రంథారంభంలో అంకితం ఇచ్చే వారిని స్తుతిస్తూ పద్యాలు చెప్పడం సంప్రదాయం ఉంది. వాటిని షష్ఠ్యంతములు అంటారు.

1-30-ఉ.

శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణ హస్త ని
ర్మూలికి, ఘోర నీరదవిముక్త శిలాహతగోపగోపికా
పాలికి, వర్ణధర్మపరిపాలికి, నర్జునభూజయుగ్మ సం
చాలికి, మాలికిన్, విపుల చక్ర నిరుద్ధ మరీచి మాలికిన్.

టీక:- శీలి = శీలము కలవాని; కిన్ = కి; నీతిశాలి = నీతి స్వభావము గలవాని; కిన్ = కి; వశీకృత = వశపఱచుకోబడిన; శూలి = శివుడు గలవాని; కిన్ = కి; బాణ = బాణాసురుని; హస్త = చేతులను; నిర్మూలి = నిర్మూలించినవాని; కిన్ = కి; ఘోర = భయంకరమైన; నీరద = మేఘాల నుండి; విముక్త = వర్షించిన; శిలా = రాళ్ళచే; హత = కొట్టబడిన; గోప = గోపాలురను; గోపికా = గోపికల; పాలి = పరిపాలకుని; కిన్ = కి; వర్ణ = వర్ణములను {చతుర్వర్ణములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర,}; ధర్మ = ధర్మములను {ధర్మ - వేదధర్మములను}; పరిపాలి = పరిపాలించేవాని; కిన్; అర్జున = మద్ది; భూజ = చెట్లు; యుగ్మ = జంటను; సంచాలి = కదిలించిన వాని; కిన్; మాలి = మాలలు ధరించిన వాని; కిన్ = కి; విపుల = పెద్దదైన; చక్ర = చక్ర ముచే; నిరుద్ధ = అడ్డగింప బడ్డ; మరీచి = సూర్యకిరణములనే; మాలి = మాలికలకి కారణభూతి; కిన్ = కి.

భావము:- శీలవంతుడికి; నీతిమంతుడికి; త్రిశూలధారియైన శివుణ్ణి వశం చేసుకున్నవాడికి; బాణాసురుని బాహువులు ఖండించిన వాడికి; ఇంద్రుని పంపున మేఘాల నుండి కురిసిన రాళ్ల జల్లుకు చెల్లా చెదరైన గోపాలురను, గోపికలను కాపాడినవాడికి; వర్ణాశ్రమ ధర్మాలను ఉద్ధరించిన వాడికి; జంట మద్ది చెట్లు పెల్లగించినవాడికి; వనమాల ధరించు వాడికి; సైంధవ సంహార సమయాన తన చేతి చక్రంతో సూర్యమండలాన్ని కప్పివేసినవాడికి.

1-31-ఉ.

క్షంతకుఁ, గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు, నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోర వాహినీ
హంతకు, నింద్ర నందన నియంతకు, సర్వచరాచరావళీ
మంతకు, నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్.

టీక:- క్షంత = క్షమించు వాని; కున్ = కి; కాళియ = కాళీయుడు అను; ఉరగ = పాము యొక్క; విశాల = పెద్ద; ఫణా = పడగల; వళి = సమూహమందు; నర్తన = నాట్యము; క్రియా = చేయుటలో; రంత = క్రీడించే వాని; కున్ = కి; ఉల్లసన్ = ఉల్లాసము చెందిన; మగధ = మగధకు; రాజ = రాజు యొక్క – జరాసంధుని; చతుర్ = నాలుగు; విధ = అంగములతో – చతురంగబలాలతో {చతురంగబలములు – రథ, గజ, హయ, కాల్బలములు.}; ఘోర = భయంకరమైన; వాహినీ = సేనావాహినిని; హంత = చంపినవాని; కున్ = కి; ఇంద్ర = ఇంద్రుని; నందన = కుమారుడైన అర్జునుని; నియంత = నడిపించేవాడి; కున్ = కి; సర్వ = సకల; చర = కదల గలవాటి; అచరా = కదల లేనివాటి; ఆవళీ = సమూహము (జగతి గురించి); మంత = తలంచు వాడు; కున్ = కి; నిర్జిత = జయించిన; ఇంద్రియ = ఇంద్రియములు కల; సమ = బాగుగా; అంచిత = పూజించు; భక్త = భక్త; జన = జనులను; అను = అనుసరించి; గంత = నడచువాని; కున్ = కి.

భావము:- క్షమాగుణశీలికి; కాళీయుని విశాలమైన పడగలపై నాట్యమాడటం నేర్చినవాడికి; పొంగి దాడిచేసిన భయంకరమైన జరాసంధుని చతురంగ సైన్యాలను హతమార్చినవాడికి; పార్థుని రథాన్ని, పార్థుని నడిపినవాడికి; సమస్త చరాచర ప్రపంచం స్మరిస్తుండే వాడికి; జితేంద్రియులైన భక్తుల వెంటనుండువాడకి.

## 1-32-ఉ.

**న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీమన**
**స్థ్సాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగ సం**
**ధాయికిఁ, బీతవస్త్రపరిధాయికిఁ, బద్మభవాండభాండ ని**
**ర్మాయికి, గోపికానివహ మందిరయాయికి, శేషశాయికిన్.**

టీక:- న్యాయి = న్యాయమైనవాని; కిన్ = కి; భూసుర = బ్రాహ్మణ; ఇంద్ర = శ్రేష్ఠుని; మృత = చనిపోయిన; నందన = పుత్రుని; దాయి = తెచ్చి ఇచ్చిన వాని; కిన్ = కి; రుక్మిణీ = రుక్మిణీదేవి; మనస్ = మనసులో; స్థ్సాయి = ఉండు వాని; కిన్ = కి; భూత = జీవులకు; సమ్మద = సంతోషము; విధాయి = కూర్చువాని; కిన్ = కి; సాధు = మంచి; జన = వారియందు; అనురాగ = అనురాగమును; సంధాయి = కూర్చువాని; కిన్ = కి; పీత = పచ్చని పట్టు; వస్త్ర = వస్త్రములు; పరిధాయి = ధరించేవాని; కిన్ = కి; పద్మ = పద్మంలో; భవ = పుట్టిన వాడు – బ్రహ్మ; అండ = అండముల; భాండ = కోశము; నిర్మాయి = నిర్మించేవాని; కిన్ = కి; గోపికా = గోపికల; నివహ = అందటి; మందిర = ఇళ్ళకు; యాయి = వెళ్ళేవాని; కిన్ = కి; శేషశాయి = శేషతల్పంపై శయనించేవాని; కిన్ = కి.

భావము:- న్యాయాన్ని మెచ్చువాడికి, చచ్చిపోయిన బ్రాహ్మణ బాలుణ్ణి తెచ్చి యిచ్చినవాడికి, రుక్మిణీదేవి మనస్సుకు బాగా నచ్చినవాడికి, సకల జగత్తుకీ సంతోషాన్ని సమకూర్చేవాడికి, సజ్జనుల ఆదరాభిమానాలను తీర్చిదిద్దేవాడికి, పట్టు పీతాంబరాన్ని కట్టుకునేవాడికి, బ్రహ్మాండ భాండాలను సృజించేవాడికి, గోపికల గృహాలన్నింటికి వెళ్ళువాడికి, ఆదిశేషునిపై శయనించేవాడికి.

1-33-వ.

సమర్పితంబుగా, నే నాంధ్రంబున రచియింపం బూనిన శ్రీమహా

భాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టి దనిన.

టీక:- సమర్పితంబుగా = సమర్పిస్తూ; నేను = నేను; ఆంధ్రంబున = తెలుగులో; రచియింపన్ = రచించుటకు; పూనిన = నిర్ణయించిన; శ్రీ = శ్రీ; మహా = మహా; భాగవత = భాగవతము అనే; పురాణంబున = పురాణమున; కున్ = కు; కథా = కథ యొక్క; ప్రారంభంబు = మొదలు; ఎట్టిది = ఎలాంటిది; అనిన = అంటే;

భావము:- నా స్వామికి సమర్పితంగా శ్రీమద్భాగవత పురాణం తెనిగించటానికి పూనుకొన్నాను. ఆ గ్రంథానికి కథా ప్రారంభం ఈ విధంగా చేస్తున్నాను.

కథా ప్రారంభము

1-34-సీ.

విశ్వ జన్మస్థితివిలయంబు లెవ్వని-

వలన నేర్పడు, ననువర్తనమున

వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై-

తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి

వేదంబు లజునకు విదితముల్ గావించె-

నెవ్వఁడు, బుధులు మోహింతురెవ్వ

నికి, నెండమావుల నీటఁ గాచాదుల-

నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

1-34.1-ఆ.

త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము

భంగిఁ దోఁచు, స్వప్రభానిరస్త

కుహకుఁ డెవ్వఁ, డతనిఁ గోరి చింతించెద,

ననఘు సత్యుఁ బరుని ననుదినంబు.

టీక:- విశ్వ = విశ్వముల యొక్క; జన్మ = పుట్టుక; స్థితి = పాలించుటలు; విలయంబులు = నాశనములు; ఎవ్వాని = ఎవ్వని; వలనన్ = వలననైతో; ఏర్పడున్ = ఏర్పడుతాయో; అనువర్తనమున = అనుకూలంగా వర్తించుటలోను; వ్యావర్తనమున = వ్యతిరేకముగా వర్తించుటలోను; కార్యములు = వ్యవహారములు; అందున్ =

లోను; అభిజ్ఞుఁడు = బాగా తెలిసినవాడు; ఐ = అయ్యి; తాన = తనే; రాజు = పరిపాలించేవాడు; అగుచు = అయ్యి; చిత్తమున = మనసున; చేసి = సంకల్పించినంత మాత్రమున; వేదంబులు = వేదములు; అజునకు = పుట్టుక లేనివాడైన బ్రహ్మకు {అజుడు – ఎవరిగర్భంలోను పుట్టుక లేనివాడు}; విదితములు = తెలియునట్లు; కావించెన్ = చేసినది; ఎవ్వఁడు = ఎవరో; బుధులు = జ్ఞానులు; మోహింతురు = మోహిస్తారో; ఎవ్వనికి = ఎవరినినో; ఎండమావుల = ఎండమావులలోని; నీటన్ = నీరు; కాచన్ = గాజు; ఆదులన్ = మొదలగు వానిలో వలె; అన్యోన్య = ఒకదానిలోనింకోటి; బుద్ధి = ఉండినట్లు అనిపించుచు; తాన్ = అదే; అడరునట్లు = ప్రకాశించినట్లు;

త్రిగుణసృష్టి = త్రిగుణాత్మక సృష్టి; ఎందున్ = ఎందులోనైతే; దీపించి = కనిపించుతూ; సత్యము = నిజము; భంగిన్ = వలె; తోఁచున్ = అనిపించునో; స్వ = తన; ప్రభా = ప్రభావముచే; నిరస్త = తొలగింపడిన; కుహకుఁడు = మాయ కలవాడు; ఎవ్వఁడు = ఎవ్వడో; అతనిన్ = అతనిని; కోరి = కోరి; చింతించెదన్ = ప్రార్థింతును; అనఘున్ = పాప మంటని వానిని; సత్యున్ = సత్యమైన వానిని; పరునిన్ = అందఱికి పై నున్నవానిని; అనుదినంబు = ప్రతిరోజు.

భావము:- ఎవనివల్ల ఈ విశ్వానికి సృష్టి స్థితి లయాలు ఏర్పడుతుంటాయో; ఎవడు సర్వతోముఖ మైన కార్యనిర్వహణలో సమర్థుడో; ఎవడు సమస్తానికి రాజై విరాజిల్లుతుంటాడో; ఎవడు సంకల్పమాత్రం చేతనే బ్రహ్మదేవునికి వేదాలన్నీ తేటతెల్లం చేసాడో; ఎవని మాయకు పండితులు సైతం లోబడిపోతారో; ఎవనియందు సత్త్వరజస్తమో గుణాత్మకమైన ఈ సృష్టి అంతా ఎండమావుల్లో, నీళ్లలో, గాజు వస్తువుల్లో లాగ అసత్యమై కూడ సత్యంగా ప్రతిభాసిస్తూ ఉంటుందో; ఎవడు తనతేజస్సుతో మాయను దూరంగా తొలగిస్తాడో ఆ పాపరహితుడు, సత్యస్వరూపుడు అయిన ఆ పరాత్పరుని ప్రతినిత్యమూ స్తుతి చేస్తున్నాను.

## 1-35-వ.

### ఇట్లు "సత్యంపరంధీమహి"యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీ నామబ్రహ్మ స్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి, యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు.

టీక:- ఇట్లు = ఈవిధంగా; సత్యంపరంధీమహి = సత్యంపరంధీమహి {సత్యంపరంధీమహి – జ్ఞాని సత్యమే ఉత్కృష్ట మైనది}; అను = అని పలికే; గాయత్రీ = గాయత్రీ మంత్రము యొక్క; ప్రారంభమున = మూలములో; గాయత్రీ = గాయత్రి అను; నామ = పేరుగల; బ్రహ్మ = సర్వాంతర్యామి యొక్క; స్వరూపంబు = స్వరూపము; ఐ = అయి; మత్స్యపురాణంబు = మత్స్యపురాణము; లోనన్ = లోనున్న; గాయత్రిని = గాయత్రిని; అధికరించి = అధిగమించి; ధర్మ = ధర్మముయొక్క; విస్తరంబును = విస్తారమైన వివరణను; వృత్రాసుర = వృతుడు; అసుర = అసురుని; వధంబును = సంహారమును; ఎందున్ = ఎందులోనైతే; చెప్పంబడున్ = చెప్పబడుతుందో; అదియ = అదే; భాగవతంబు = భాగవతము; అని = అని; పలుకుటన్ = పలుకుటను; చేసి = చేసి; ఈ = ఈ; పురాణంబు = పురాణము; శ్రీ = శ్రీ; మహా = గొప్ప; భాగవతంబు = భాగవతము; అనన్ = అనుటకు; ఒప్పుచు = తగి; ఉండున్ = ఉండును;

భావము:- "సత్యం పరం ధీమహి" పరమమైన సత్యమునే ధ్యానము చేసెదము అనే గాయత్రీ మహా మంత్రంతో ఆరంభించటం వల్ల గాయత్రి పరదేవతాస్వరూప మైనది. గాయత్రిని అతిశయింపజేస్తూ, ధర్మ ప్రస్తారాన్నీ, వృత్రాసుర సంహారాన్నీ అభివర్ణించే గ్రంథాన్ని భాగవతం అంటారు అని మత్స్యపురాణంలో చెప్పి ఉండటం వల్ల ఈ మహా గ్రంథం శ్రీ మహాభాగవతం అని ప్రసిద్ధి గాంచింది.

1-36-సీ.

శ్రీమంతమై, మునిశ్రేష్ఠకృతంబైన-
    భాగవతంబు సద్భక్తితోడ
వినఁ గోరువారల విమలచిత్తంబులఁ-
    జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక
యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే,-
    మంచివారలకు నిర్మత్సరులకుఁ
గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును-
    దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ,

1-36.1-తే.

బరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు
నడఁచి, పరమార్థభూతమై, యధిక సుఖద
మై, సమస్తంబుఁ గాకయు, నయ్యు నుండు
వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు.

టీక:- శ్రీమంతము = శుభంకరము; ఐ = అయిన ; ముని = మునులలో; శ్రేష్ఠ = శ్రేష్ఠునిచే – వ్యాసుని చేత; కృతంబు = రచింపబడినది; ఐన = అయినట్టి; భాగవతంబు = భాగవతము; సద్భక్తి = మంచిభక్తి; తోడన్ = తో; వినన్ = వినుటను; కోరువారల = కోరేవారి; విమల = నిర్మలమైన; చిత్తంబులన్ = మనస్సులలో; చెచ్చెరన్ = తొందరగా; ఈశుండు = జీవులలోనున్న ఈశ్వరుడు; చిక్కున్ = దొరకును; కాక = అంతేకాని, తప్పించి; ఇతర = ఇతర; శాస్త్రంబులన్ = శాస్త్రములకు; ఈశుండు = ఈశ్వరుడు; చిక్కునే = దొరుకుతాడా; మంచివారల = మంచి వాళ్ళ; కున్ = కును; నిర్మత్సరులు = మాత్సర్యం లేని వాళ్ళ; కున్ = కును; కపట = మాయ నుంచి; నిర్ముక్తులై = విడిపింప బడ్డవారై; ఐ = అయ్యి; కాంక్ష = కోరుట; సేయకయును = చేయకుండక; తగిలి = తగిలి (భక్తికి); ఉండుటన్ = ఉండటమును; మహాతత్త్వ = మహత్త్వమైన అంతర్యామి యందు; బుద్ధిన్ = ధ్యాస; పరఁగ = ప్రవర్తిల్లగ; ఆధ్యాత్మిక = ఆధ్యాత్మికము; ఆది = మొదలైన; తాపత్రయంబున్ = మూడు రకాలైన తాపములను {తాపత్రయంబు – (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక , ఆధిదైవిక)}; అడఁచి = అణచి;

పరమార్థ = మోక్షము యొక్క; భూతము = రూపము; ఐ = అయ్యి; అధిక = మిక్కిలి; సుఖదము = సుఖ ప్రదము; ఐ = అయ్యి; సమస్తంబున్ = సర్వమును; కాకయు = కాకుండాను; అయ్యున్ = అయ్యికూడా; ఉండు = ఉండే టటువంటి; వస్తువు = వస్తువు; ఎఱుఁగంగన్ = తెలిసికొనుటకు; తగు = వీలున్నది; భాగవతమున్ = భాగవతము; అందున్ = లోమాత్రమే.

భావము:- శ్రీమంతమైనది, వేదవ్యాస మహాముని చే విరచితము ఐన ఈ భాగవత మహాపురాణాన్ని అచంచల భక్తితో ఆకర్ణించగోరే భక్తుల అంతరంగాలలోనే భగవంతుడు నిరంతరం నివసిస్తాడు. అంతే తప్పించి ఇతర గ్రంథాల వల్ల ఈశ్వరుడు చిక్కడు. సజ్జనులు మాత్సర్యరహితులు మహాతత్వబుద్ధి కలిగి కపటమార్గాన పోకుండ, ఎటువంటి కాంక్షా లేకుండ, భాగవత శ్రవణమందే ఆసక్తులై ఉంటారు. ఇందువల్ల తాపత్రయం అంటే ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనే త్రివిధ తాపాలూ నశించి వారికి తత్త్వజిజ్ఞాస కలుగుతుంది. ఈ భాగవతంలో మాత్రమే పరమార్థభూతము, పరమానంద దాయకము, వ్యక్తావ్యక్తము అయిన పరబ్రహ్మ స్వరూపం అభివ్యక్త మవుతుంది.

1-37-ఆ.

వేదకల్పవృక్షవిగళితమై, శుక
ముఖసుధాద్రవమున మొనసి యున్న,
భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావవిదులు.

టీక:- వేద = వేదము అను; కల్పవృక్ష = కల్పవృక్షము నుండి; విగళితము = జారినది; ఐ = అయి; శుక = శుకబ్రహ్మ, చిలుక; ముఖ = ముఖము అను, ముక్కు తగిలిన; సుధాద్రవమున = అమృతముతో, మంచి రసముతో; మొనసి = నిండినదై, రుచి కలదియై; ఉన్న = ఉన్నటువంటి; భాగవత = భాగవతము అని పేరు గల; పురాణ = పురాణము యొక్క, పురాణము అను; ఫల = ఫలితము యొక్క, పండు యొక్క; రస = భావమును, రసమును; ఆస్వాదన = ఆస్వాదించు; పదవిన్ = ఉన్నతమైన స్థితిని, మార్గాన్ని; కనుఁడు = కనుగొనుడు, చూడండి; రసిక = రసికత్వ, రుచి యొక్క; భావ = భావవివరాలు, ప్రత్యేకత; విదులు = బాగా తెలిసిన వారు.

భావము:- భాగవత మనే ఈ మహాఫలం వేద మనే కల్పవృక్షం నుండి బాగా పండి రాలింది. శుక ముఖ సుధాద్రవంతో అతిశయించి ఉంది. భావజ్ఞులు రసజ్ఞులు ఐన భక్తవరేణ్యులారా! రండి ఈ ఫలరసాన్ని ఆస్వాదించి ధన్యులు కండి.

## నైమిశారణ్య వర్ణనము

1-38-క.

పుణ్యంబై, మునివల్లభ
గణ్యంబై, కుసుమ ఫల నికాయోత్థిత సా
ద్గుణ్యమయి, నైమిశాఖ్యా
రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్.

టీక:- పుణ్యంబు = పుణ్య ప్రదేశము; ఐ = అయి; ముని = మునులలో; వల్లభ = శ్రేష్ఠులచే; గణ్యంబు = గొప్పదిగా గణింప బడునది; ఐ = అయి; కుసుమ = పుష్పాల; ఫల = ఫలాలను; నికాయ = సమూహముల వలన; ఉత్థిత = ఉద్భవించిన; సాద్గుణ్యము = మంచి గుణాలు కలిగినది; అయి = అయి; నైమిశ = నైమిశమను; ఆఖ్య = పేరుగల; అరణ్యంబు = అరణ్యము; నుతింపన్ = పొగడుటకు; తగున్ = తగును; అరణ్యంబుల = అరణ్యా లన్నిటి; లోన్ = లోను.

భావము:- పుష్పములు, ఫలములతో నిండిన నైమిశారణ్యం అరణ్యాలలోకెల్లా గొప్పదై అలరారు తుంటుంది. ఈ పుణ్యప్రదేశం తాపసోత్తములచే శ్రేష్ఠమైనదని కీర్తింపబడుతుంటుంది,

★1-39-వ.

మఱియును; మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథమహి తంబై; బ్రహ్మ గేహం బునుం బోలె శారదాన్వితంబై; నీలగళసభా నికేతనం బునుం బోలె వహ్ని, వరుణ, సమీ రణ, చంద్ర, రుద్ర, హైమవతీ, కుబేర, వృషభ, గాలవ, శాండిల్య, పాశు పత జటిపటల మండితంబై; బలభేది భవనంబునుం బోలె నైరావతామృత, రంభా గణికాభిరామంబై; మురాసురునిలయంబునుంబోలె నున్మత్తరాక్షసవంశ సంకు లంబై; ధనదాగారంబునుం బోలె శంఖ, పద్మ, కుంద, ముకుంద సుందరం బై; రఘురాము యుద్ధంబునుంబోలె నిరంతర శరానలశిఖాబహుళంబై; పరశు రాము భండనంబునుం బోలె నర్జునోద్భేదం బై; దానవ సంగ్రామంబునుం బోలె నరిష్ట, జంభ, నికుంభ శక్తియుక్తంబై; కౌరవసంగరం బునుం బోలె ద్రోణార్జున కాంచనస్యందనకదంబ సమేతంబై; కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్య సహకారంబై; సముద్రసేతుబంధనంబునుం బోలె నల, నీల, పనసాద్యద్రి ప్రదీపితం బై; భర్గుభజనంబునుం బోలె నానాశోక లేఖా ఫలితంబై; మరుని కోదండంబు నుం బోలెఁ బున్నాగశిలీముఖ భూషితంబై; నరసింహ రూపంబునుం బోలెఁ గేసరకరజ కాంతంబై; నాట్య రంగంబునుం బోలె నటనటీ సుషిరాన్వితంబై; శైలజానిటలం బునుం బోలెఁ జందన, కర్పూర తిలకాలంకృతంబై; వర్షాగమం బునుం బోలె నింద్ర బాణాసన, మేఘ, కరక, కమనీయంబై; నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితం బై; మహాకావ్యం బునుం బోలె సరళ మృదులతా కలితంబై; వినతానిల యంబునుం బోలె సుపర్ణ రుచి రంబై; యమరావతీ పురంబునుం

బోలె సుమనో లలితంబై; కైట భోద్యోగంబునుం బోలె మధు మానితంబై; పురుషో త్తమసేవనంబునుం బోలె నమృతఫలదంబై; ధనంజయ సమీకంబునుం బోలె నభ్రంకష పరా గంబై; వైకుంఠ పురంబునుం బోలె హరి, ఖడ్గ, పుండరీక విలసితం బై; నందఘోషం బునుం బోలెఁ గృష్ణసార సుందరంబై; లంకా నగరంబునుం బోలె రామమహిషీ వంచక సమంచి తంబై; సుగ్రీవ సైన్యంబునుం బోలె గజ, గవయ, శరభ శోభితంబై; నారాయణ స్థానంబునుం బోలె నీలకంఠ, హంస, కౌశిక, భరద్వాజ, తిత్తిరి భాసురంబై; మహా భారతంబునుం బోలె నేకచక్ర, బక, కంక, ధార్తరాష్ట్ర, శకుని, నకుల సంచార సమ్మి ళితంబై; సూర్యరథం బునుం బోలె నురుతర ప్రవాహంబై; జలదకాల సంధ్యా ముహూర్తం బునుం బోలె బహువితత జాతిసౌమనస్యంబై యొప్పు నైమిశారణ్యం బను శ్రీవిష్ణుక్షేత్రంబు నందు శౌనకాది మహామునులు స్వర్లోకగీయ మానుండగు హరింజేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁగల సత్త్రసంజ్ఞికం బైన యాగంబు సేయుచుండి; రం దొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తిక హోమం బు లాచరించి సత్కృతుండై సుఖాసీనుం డై యున్న సూతుఁ జూచి.

టీక:- మఱియును = ఇంకనూ; మధువైరి = మధుడనే రాక్షసుని శత్రువు, విష్ణువు; మందిరంబునున్ = మందిరమును; పోలెన్ = వలె; మాధవీ = పూలగురివింద చెట్లతోను, లక్ష్మీతోను; మన్మథ = వెలగచెట్లతోను, మన్మథుడితోను; పాతంబు = అందంగా ఉన్నది; ఐ = అయి; బ్రహ్మ = బ్రహ్మ; గేహంబునున్ = గృహము; పోలెన్ = వలె; శారద = ఏడాకులఅరటి చెట్లతోను, సరస్వతీదేవితోను; ఆన్వితంబు = కూడుకొన్నది; ఐ = అయి; నీలగళ = నీలకంఠుడైన శివుని; సభా = సభ; నికేతనంబునున్ = మండపమును; పోలెన్ = వలె; వహ్ని = చిత్రమూలం, అగ్నిదేవుడు; వరుణ = ఉలిమిరిచెట్లు, వరుణదేవుడు; సమీరణ = మరువము, వాయుదేవుడు; చంద్ర = పెద్ద ఏలకి, చంద్రుడు; రుద్ర = రుద్రాక్ష, ఏకాదశరుద్రులు; హైమవతీ = కరకచెట్లు, పార్వతీదేవి; కుబేర = నందివృక్షాలు, కుబేరుడు; వృషభ = అడ్డసర, వృషభవాహనము; గాలవ = లొద్దుగచెట్లు, గాలవముని; శాండిల్య = మారేడు చెట్లు,శాండిల్యముని; పాశుపత = శ్రీవల్లీ, శివభక్తులు; జటి పటల = జువ్విచెట్లుతోను, ముని సమూహముల తోను; మండితంబు = అలంకరింపబడినది; ఐ = అయి; బలభేది = దేవేంద్రుని {బలభేది – బలుణ్ణి భేదించిన వాడు, దేవేంద్రుడు}; భవనంబునున్ = భవనాన్ని; పోలెన్ = పోలి; ఐరావత = నారింజచెట్లు, స్వర్గంలోని ఐరావతము; అమృత = ఉసిరిక, అమృతము; రంభా = అరటిచెట్లు, అప్సరస రంభ; గణిక = అడవిమొల్లలుతోను, దేవవేశ్యలతోను; అభిరామంబు = మనోజ్ఞము; ఐ = అయి; ముర = ముర; అసురు = అసురుని; నిలయంబునున్ = నిలయమును; పోలెన్ = పోలి; ఉన్మత్త = ఉమ్మెత్త, మదించిన; రాక్షస = బలురక్కెస, రాక్షసుల; వంశ = వెదురు,

సమూహాలు; సంకులంబు = కలగలసినది; ఐ = అయి; ధనద = కుబేరుని {ధనదుడు – ధనానికి అధిపతియైన కుబేరుడు}; ఆగారంబునున్= సౌధము; పోలెన్=పోలి; శంఖ=శంఖాలు, నవనిధులలోనిశంఖము {నవనిధులు – పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము}; పద్మ = పద్మపుష్పాలు, నవనిధులలోని పద్మము; కుంద = మొల్లలు,నవనిధులలోని కుందము; ముకుంద = ఎఱ్ఱ తామరలతోటి, నవనిధులలోని ముకుందము తో; సుందరంబు = అందమైనది; ఐ = అయి; రఘు = రఘువంశోద్భవుడైన; రాము = శ్రీరాముని; యుద్ధంబునున్ = యద్ధమును; పోలెన్ = పోలి; నిరంతర = అంతరములేని; శర = రెల్లు, బాణ; అనలశిఖ = శక్రపుష్పి, అగ్నిజ్వాలలు; బహుళంబు = తఱచుగాఉన్నది; ఐ = అయి; పరశురాము = పరశురాముడి; ఖండనంబునున్ = యుద్ధము; పోలెన్ = పోలి; అర్జునోద్భేదంబు = మద్ది అంకురాలు కలది, కార్త వీర్యార్జుని సంహారం కలది; ఐ = అయి; దానవ = రాక్షసుల; సంగ్రామంబునున్ = యుద్ధమును; పోలెన్ = పోలి; అరిష్ట = వేపచెట్లు, అరిష్టాసురుడు; జంభ = నిమ్మచెట్లు, జంభాసురుడు; నికుంభ = దంతిచెట్లు, నికుంభాసురుడు; శక్తి = (యొక్క) బలముతో; యుక్తంబు = కూడినది; ఐ = అయి; కౌరవ = కౌరవ పాండవుల; సంగరంబునున్ = యుద్ధమును; పోలెన్ = పోలి; ద్రోణ = తుమ్మచెట్లు, ద్రోణుడు; అర్జున = మద్దిచెట్లు, అర్జునుడు; కాంచన = సంపెంగచెట్లు, బంగారు; స్యందన = నిమ్మిచెట్లు, రథాల; కదంబ = కడిమిచెట్లు, సమూహము; సమేతంబు = కలిసియన్నది; ఐ = అయి; కర్ణ = కర్ణుని; కలహంబునున్ = యుద్ధమును; పోలెన్ = పోలి; మహోన్నత = చాలా ఎత్తైన, చాలా ఉన్నతమైన; శల్య = మంగచెట్లు, శల్యుని; సహకారంబు = మామిడిచెట్లు, కలదై సహాయము కలది; ఐ = అయి; సముద్ర = సాగరము మీద; సేతు = వంతెన; బంధనంబునున్ = కట్టుటను; పోలెన్ = పోలి; నల = వట్టివేరు, నలుడనే వానరవీరుడు; నీల = నీలిచెట్లు, నీలుడనే వానరవీరుడు; పనస = పనసచెట్లు, పనసుడనే వానరవీరుడు; ఆది = మొదలైన; అద్రి = చెట్లతో, (వానరులనే) కొండలతో; ప్రదీపితంబు = ప్రకాశిస్తున్నది; ఐ = అయి; భర్గు = శివుని; భజనంబునున్ = భజనము; పోలెన్ = పోలి; నానా = వివిధరకాలైన, వివిధములైన; అశోక = అశోకచెట్లు, శుభ; లేఖా = పంక్తులకొద్దీ, పత్రికల; ఫలితంబు = వృక్షాలున్నదై, ఫలితాన్నిచ్చేది; ఐ = అయి; మరుని = మన్మథుని; కోదండంబునున్ = విల్లును; పోలెన్ = పోలి; పున్నాగ = సుర పొన్నలు, పున్నాగ పుష్పాల; శిలీముఖ = తుమ్మెదలతో, బాణాలతో; భూషితంబు = అలంకరింప బడినది; ఐ = అయి; నరసింహ = నరసింహుని; రూపంబునున్ = స్వరూపమును; పోలెన్ = పోలి; కేసర = పొన్నచెట్లు, జూలు; కరజ = కానుగ చెట్లు, గోళ్ళు; కాంతంబు = తోవెలుగుతున్నది; ఐ = అయి; నాట్య = నాట్య; రంగంబునున్ = రంగమును; పోలెన్ = పోలి; నట = దుండిగచెట్లు, నటులు; నటీ = దొండచెట్లు, నటీమణులు; సుషిర = గువ్వగుతికచెట్లు, వాద్య విశేషాల; అన్వితంబు = తోకలగలిసియున్నది; ఐ = అయి; శైలజా = పార్వతీదేవి; నిటలంబునున్ = నుదురును; పోలెన్ = పోలి; చందన = చందనవృక్షాలు, మంచిగంధము; కర్పూరతిలకా = కలిగొట్లు బొట్టుగచెట్లతో, కర్పూర తిలకముతో; అలంకృతంబు = అలంకరింపబడినది; ఐ = అయి; వర్షాగమంబునున్ = వానరావటమును, వానాకాలము; పోలెన్ = పోలి; ఇంద్రబాణాసన = మరువం నల్లగోరింట వేగిస చెట్లు, ఇంద్రధనస్సు; మేఘ = తుంగముస్తెలు, మేఘాలు; కరక = దానిమ్మచెట్లు, వడగళ్ళు; కమనీయంబు = తో చూడచక్కనిది; ఐ = అయి; నిగమంబునున్ = వేదమును; పోలెన్ = పోలి; గాయత్రీ = చంద్రచెట్లుతో, గాయత్రీ మంత్రంతో; విరాజితంబు = మంచి పంక్తులు కలది, ప్రకాశిస్తున్నది; ఐ = అయి; మహా = మహా; కావ్యంబునున్ = కావ్యమును; పోలెన్ = పోలి; సరళ = తెల్లతెగడచెట్లు, సరళత్వము; మృదులతా = కోమలమైన తీగలుతో, సౌకుమార్యములు; కలితంబు = కలసియన్నది, ఎఱుగబడినది; ఐ = అయి; వినతానిలయంబునున్ = వినతా నిలయమును; పోలెన్ = పోలి;

సుపర్ణ = సుందరమైన ఆకులుతో, గరుత్మంతుడుతో; రుచిరంబు = ఒప్పి యున్నది; ఐ = అయి; అమరావతీ = అమరావతీ; పురంబునున్ = పురమును; పోలెన్ = పోలి; సుమనస్ = మంచి పుష్పాలతో, దేవతలతో {సుమనస్ – మంచి మనసున్నవారు, దేవతలు}; లలితంబు = అందమైనది; ఐ = అయి; కైటభ = కైటభుని; ఉద్యోగంబునున్ = కొలువును; పోలెన్ = పోలి; మధు = పూదేనెతో, మధుడనే రాక్షస వీరునితో; మానితంబు = మన్నింప దగినది; ఐ = అయి; పురుషోత్తమసేవనంబును = హరి సేవను; పోలెన్ = పోలి; అమృత = తియ్యని, మోక్షమును; ఫలదంబు = పండ్లుకలది, ప్రసాదించేది; ఐ = అయి; ధనంజయ = అర్జునుని; సమీకంబునుం = యుద్ధమును; పోలెన్ = పోలి; అభ్రంకష = ఆకాశమంతా క్రమ్మిన, ఆకాశంనిండా క్రమ్మిన; పరాగంబు = పుప్పొడికలది, ధూళికలది; ఐ = అయి; వైకుంఠ = వైకుంఠ; పురంబునున్ = పురమును; పోలెన్ = పోలి; హరి = సింహము, విష్ణుమూర్తి; ఖడ్గ = ఖడ్గమృగము, నందకము {నందకము – విష్ణుమూర్తి ఖడ్గము పేరు}; పుండరీక = బెబ్బులుల, తెల్లదామరలతో; విలసితంబు = క్రీడలు కలది, ప్రకాశిస్తున్నది; ఐ = అయి; నంద = నందుని; ఘోషంబునున్ = మందను; పోలెన్ = పోలి; కృష్ణసార = నల్లజింకలతో, కృష్ణుని శక్తిసామర్థ్యముల వలన; సుందరంబు = చక్కనిది; ఐ = అయి; లంకా = లంకా; నగరంబునున్ = నగరమును; పోలెన్ = పోలి; రామ = పెద్దదుప్పి, రాముని; మహిషీ = దున్నపోతు, భార్యని; వంచక = నక్క, వంచించినవాడైన రావణాసురుని; సమంచితంబు = కలిగినది; ఐ = అయి; సుగ్రీవ = సుగ్రీవుని; సైన్యంబునున్ = సైన్యమును; పోలెన్ = పోలి; గజ = ఏనుగులు, వానరవీరుడు గజుడు; గవయ = కురుఁబోతులు, వానరవీరుడు గవయుడు; శరభ = శరభమృగము, వానరవీరుడు శరభుడు; శోభితంబు = ప్రకాశమైనది; ఐ = అయి; నారాయణ = విష్ణు; స్థానంబునున్ = లోకమును; పోలెన్ = పోలి; నీలకంఠ = నెమళ్ళు, నీలకంఠుడైన శివుడు; హంస = హంసలు, పరమహంసలతో; కౌశిక = గుడ్లగూబలు, కౌశికమహర్షి; భరద్వాజ = ఏంట్రితలు, భరద్వాజమహర్షి; తిత్తిరి = తీతువులు, తిత్తిరిమహర్షి; భాసురంబు = లతో ప్రకాశించుచున్నది; ఐ = అయి; మహాభారతంబునున్ = మహాభారతమును; పోలెన్ = పోలి; ఏకచక్ర = ముఖ్యమైన చక్రవాకపక్షులు, ఏకచక్రపురము; బక = కొంగ, బకాసురుడు {ధార్తరాష్ట్ర – కాళ్ళు, ముక్కు ఎఱ్ఱగాను, మిగతా శరీరం తెల్లగా నుండే హంసలు}; కంక = రాబందులు, కంకుభట్టుగ పిలవబడ్డ ధర్మరాజు; ధార్తరాష్ట్ర = హంసలు, ధృతరాష్ట్రుని కొడుకులైన కౌరవులు; శకుని = శకునిపక్షులు, శకుని; నకుల = ముంగిసలు, నకులుడు; సంచార = సంచారముతో; సమ్మిళితంబు = కలిసున్నది; ఐ = అయి; సూర్య = సూర్యుని; రథంబును = రథమును; పోలెన్ = పోలి; ఉరుతర = మంచి, మేలుజాతి; ప్రవాహంబు = జలప్రవాహాలుకలది, గుఱ్ఱములుకలది; ఐ = అయి; జలదకాల = వానాకాలపు; సంధ్యా = సంధ్యా; ముహూర్తంబునున్ = సమయమును; పోలెన్ = పోలి; బహువితత = మిక్కిలి, మిక్కిలి విశాలమైన; జాతిసౌమనస్యంబు = జాజిపూలు కలది, జాతీయ భావాలు కలది; ఐ = అయి; ఒప్పు = ఒప్పియున్నదైనట్టి; నైమిశ = నైమిశము అను పేరు కల; అరణ్యంబు = అరణ్యము; అను = అను; శ్రీ = శోభనకరమైన; విష్ణు = విష్ణుదేవుని; క్షేత్రంబున్ = ప్రదేశము; అందున్ = లో; శౌనక = శౌనకుడు; ఆది = మొదలైన; మహా = గొప్ప; మునులు = మునులు; స్వర్గ = స్వర్గ; లోక = లోక; గీయమానుండు = స్తుతింపబడువాడు; అగు = అయిన; హరిన్ = శ్రీహరిని; చేరు = చేరుట; కొఱకున్ = కోసము; సహస్ర = వెయ్యి; వర్షంబులు = సంవత్సరములు; అనుష్ఠాన = నిర్వహించవలసిన; కాలంబుగా = కాలముగా; కల = ఉన్నటువంటి; సత్ర = సత్ర; సంజ్ఞికంబైన = అను పేరు గల; యాగంబు = యాగము; చేయుచున్ = చేయుచు; ఉండిరి = ఉన్నారు; అందున్ = ఆ యాగ కాలము లో; ఒక్క = ఒక; నాడు = దినమున; వారలు = వారు; రేపకడ = తెల్లవారగానే; నిత్య = నిత్యముచేయు; నైమిత్తిక = నిమిత్తికముగ చేయబడు; హోమంబులు = హోమములు; ఆచరించి = నిర్వహించి; సత్కృతుండు = సత్కరింప

బడ్డవాడు; ఐ = అయి; సుఖ = సుఖమైన; ఆసీనుండు = ఆసన మలంకరించిన వాడు; ఐ = అయి; ఉన్న = ఉన్నటువంటి; సూతున్ = సూత మహర్షిని; చూచి = చూసి.

భావము:- అంతేకాక ఆ నైమిశారణ్యం. . .

(1) పూలగురివింద చెట్లతోటి, వెలగచెట్లతోటి; మధు డనే రాక్షసుని శత్రువు విష్ణువు మందిరము వలె లక్ష్మీదేవితో, మన్మథునితో కూడినట్లు అందంగా ఉంది.

(2) ఏడాకులఅరటిచెట్టతోటి; బ్రహ్మదేవుని గృహమును పోలి సరస్వతీదేవితో కూడుకొని ఉన్నది.

(3) చిత్రమూలం, ఉలిమిరి, మరువము, పెద్ద ఏలకి, రుద్రాక్ష, కరక, నంది, లొద్దుగ, మారేడు, శ్రీవల్లీ, జువ్విచెట్ల తోటి; నీలకంఠుడైన పరమ శివుని సభామండపమును పోలి అగ్నిదేవుడు, వరుణదేవుడు, వాయుదేవుడు, చంద్రుడు, ఏకాదశరుద్రులు, పార్వతీదేవి, కుబేరుడు, వృషభ వాహనము, గాలవ ముని, శాండిల్య ముని, మొదలైన శివభక్తులతో మునుల సమూహములతో అలంకరింపబడినట్లుంది.

(4) నారింజ, ఉసిరిక, అరటి, అడవిమొల్ల చెట్లతోటి; దేవేంద్రుని భవనాన్ని పోలుతూ స్వర్గంలోని ఐరావతము, అమృతం, అప్సరస రంభ మున్నగు దేవవేశ్యలతో మనోజ్ఞమై ఉంది.

(5) ఉమ్మెత్త, బలురక్కెస, వెదురు పొదలతో; మురాసురుని నిలయంలా మదించిన రాక్షసుల సమూహాలు కలగలసినదై ఉంది.

(6) శంఖాలు, పద్మాలు, మొల్లలు, ఎఱ్ఱతామరలతోటి; కుబేరుని సౌధము లాగ (పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము లనే నవనిధులు లోని) శంఖము, పద్మము, కుందము, ముకుందములు ఉన్నట్లు అందముగా ఉంది.

(7) దట్టమైన రెల్లు, శక్రపుష్పి చిక్కటి పొదలు తో; శ్రీరాముని యద్దం వలె ఎడతెగని బాణముల అగ్నిజ్వాలలు ఉన్నట్లు ఉంది.

(8) మద్ది అంకురాలు కలదై; పరశురాముడి యుద్ధం లాగా కార్తవీర్యార్జుని సంహారం కలదు అన్నట్లుంది.

(9) వేప, నిమ్మ, దంతిచెట్లతో బలిసి; రాక్షసులయుద్ధంలాగ అరిష్ట, జంభ, నికుంభాది రాక్షసుల సైన్యాలతో కూడినట్లు ఉంది.

(10) తుమ్మ, మద్ది, సంపెంగ, నిమ్మి కడిమిచెట్ల తోటి కూడి ఉండి; ద్రోణుని, అర్జునుని, బంగారు రథాల మున్నగువాని సమూహము కూడిన కౌరవ పాండవుల యుద్ధంలాగ ఉంది.

(11) చాలా ఎత్తైన మంగ, మామిడిచెట్లు కలదై; మహోన్నత మైన శల్యుని సహాయము కల కర్ణుని యుద్ధంలాగ ఉంది.

(12) వట్టివేరు, నీలి, పనసాది చెట్ల తోటి; నలుడు, నీలుడు, పనసుడు మొదలైన వానరవీరు లనే కొండలతో ప్రకాశిస్తున్నట్లు ఉంది.

(13) నానా రకాలైన అశోకాది వృక్షాల వరుసలు కలిగి, అనేక శుభాలు కలిగుండే శివుని భజనను పోలి ఉంది.

(14) సురపొన్నలు, తుమ్మెదలతో కూడి; పున్నాగ పూల బాణాలతో అలంకరింపబడిన మన్మథుని విల్లులా ఉంది.

(15) పొన్న, కానుగచెట్లతో వెలిగిపోతూ; జూలు, గోళ్ళతో నరసింహ రూపంలా ప్రకాశిస్తోంది.

(16) దుండిగ, దొండ, గువ్వగుతికచెట్లు కలదై; నటులు, నటీమణులు, వాద్యవిశేషాలతో కూడి ఉన్న నాట్యరంగం లాగ ఉంది.

(17) చందనం, మంచిగంధం, కలిగొట్లు బొట్టుగచెట్లతో; చందనము, మంచి గంధము, కర్పూరతిలకములతో అలంకరింపబడ్డ పార్వతీదేవి నుదురులా ఉంది.
(18) మరువం, నల్లగోరింట, వేగిస, తుంగముస్తెలు, దానిమ్మచెట్లతో; ఇంద్రధనస్సు, మేఘాలు, వడగళ్లతో చూడచక్కని వానాకాలంలాగ ఉంది.
(19) మంచి వరుసలు తీరిన చంద్రచెట్లతో; గాయత్రీ మంత్రంతో ప్రకాశిస్తున్న వేదంలా ఉంది.
(20) తెల్లతెగడచెట్లతో, కోమలమైన తీగెలతో కూడినదై; సరళత్వ, సౌకుమార్యాలు గల మహాకావ్యంలా ఉంది.
(21) అందమైన ఆకులతో; గరుత్మంతుడితో ఉన్న వినతానిలయంలా ప్రకాశిస్తున్నది.
(22) అందమైన పూలతో; దేవతలతో నిండుగా ఉన్న అమరావతీపురంలా అందంగా ఉంది.
(23) పూదేనెతో చక్కగా; మధుడనే రాక్షస వీరునితో కూడిన కైటభుని కొలువు వలె మన్నింపదగి ఉంది.
(24) తియ్యని పండ్లుకలదై; మోక్షమును ప్రసాదించే హరి సేవలా మనోహరంగా ఉంది.
(25) ఆకాశమంతా క్రమ్మిన పుప్పొడికలదై; ఆకాశంనిండా క్రమ్ముకున్న ధూళికల అర్జునుడి యుద్ధములా ఉంది.
(26) సింహము, ఖడ్గమృగము, బెబ్బులుల క్రీడలు కలిగి; నందకమనే విష్ణుమూర్తి ఖడ్గము, తెల్లదామరలతో ప్రకాశిస్తున్న వైకుంఠపురంలా ఉంది.
(27) చక్కగా ఉన్న నల్లజింకలతో; కృష్ణుని శక్తిసామర్థ్యములతో కూడిన నందుని మందలా సుందరంగా ఉంది.
(28) పెద్దదుప్పి, దున్నపోతు, నక్కలు కలిగి; రాముడి భార్య సీతని వంచించిన రావణాసురుడు ఉన్న లంకానగరంలాగ ఉంది.
(29) ఏనుగులు, కురుఃబోతులు, శరభమృగాలుతో ప్రకాశిస్తూ; గజుడు, గవయుడు, శరభుడులతో శోభిస్తున్న సుగ్రీవ సైన్యంలాగ ఉంది.
(30) నెమళ్ళు, హంసలు, గుడ్లగూబలు, ఏంట్రితలు, తీతువు మున్నగు పక్షులతో కలకలలాడుతు; నీలకంఠుడైన పరమశివుడు, పరమహంసలు మరియు కౌశిక, భరద్వాజ, తిత్తిరి ఆది మహర్షులతో భాసురమైన వైకుంఠంలా ఉంది.
(31) చక్రవాకాలు, కొంగలు, హంసలు, రాబందులు, శకునిపక్షులు, ముంగిసలు మున్నగువాని సంచారం కలిగి; ఏకచక్రపురము, బకాసురుడు, కంకుభట్టుగ పిలవబడ్డ ధర్మరాజు, ధృతరాష్ట్రుని కొడుకులైన కౌరవులు, శకుని, నకులుల విహారాలు కల మహాభారతంలా ఉంది.
(32) మంచి మంచి కాలువలతో; మేలుజాతి గుఱ్ఱములు కల సూర్యరథంలా ఉంది.
(33) జాజి పూలు అధికంగా కలిగి ఉండి; మిక్కిలి విశాలమైన జాతీయ భావాలు కలిగించే వానాకాలపు సంధ్యా సమయంలాగ ఉంది;

ఆ విధంగా ఒప్పియున్న శ్రీమహావిష్ణువు యొక్క దివ్యక్షేత్రమైన నైమిశారణ్యంలో శౌనకాది గొప్ప ఋషులు స్వర్గలోక వంద్యుండైన విష్ణువుని చేరుట కోసం వెయ్యి సంవత్సరముల పాటు చేసే"సత్ర"అనే యాగం చేస్తున్నారు; ఆ యాగం చేసే కాలంలో, ఒకనాడు సూతమహర్షి తెల్లవారగట్ల నిత్య నైమిత్తిక హోమాలు చేసుకొన్నాడు. సత్కరింపబడి సుఖ ఆసనంపై కూర్చుని ఉన్నాడు. అప్పుడు శౌనకాది మహర్షులు సూతమహర్షిని చూసి. . .

## శౌనకాదుల ప్రశ్నంబు

1-40-క.

**ఆ తాపసు లిట్లనిరి, వి**

**నీతున్, విజ్ఞాన ఫణిత నిఖిల పురాణ**

**వ్రాతున్, నుత హరి గుణ సం**

**ఘాతున్, సూతున్, నితాంత కరుణోపేతున్.**

టీక:- ఆ = ఆ; తాపసులు = ఋషులు; ఇట్లు = ఈ విధముగ; అనిరి = అనిరి; వినీతున్ = విశిష్టమైన నీతిగల వానిని; విజ్ఞాన = విజ్ఞాన మయ; ఫణిత = విధానంలో; నిఖిల = అన్ని; పురాణ = పురాణాల; వ్రాతున్ = సమూహము గలవానిని; నుత = స్తోత్రము చేయబడిన; హరి = విష్ణుని; గుణ = గుణముల; సంఘాతున్ = సమూహాలున్న వానిని; సూతున్ = సూతుని; నితాంత = ఎల్లప్పుడు; కరుణ = దయతో; ఉపేతున్ = కూడినవాని.

భావము:- ఆ శౌనకాది మునీంద్రులు వినయశీలుడు, విజ్ఞాన విశేషంచేత వేదాలను, పురాణాలను పండించుకున్నవాడు, అసంఖ్యాకమైన శ్రీమన్నారాయణుని సద్గుణాలను సంకీర్తించేవాడు, సదా కారుణ్యంతో నిండి ఉండేవాడు ఐన సూతుణ్ణి చూసి ఈ విధంగా అన్నారు.

1-41-మ.

**"సమతం దొల్లి పురాణపంక్తు, లితిహాసశ్రేణులున్, ధర్మ శా**

**స్త్రములుం, నీవ యుపన్యసింపుదువు, వేదవ్యాసముఖ్యుల్మునుల్**

**సుమతుల్, సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం దత్ప్రసా**

**దమునం జేసి యెఱుంగనేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా!**

టీక:- సమతన్ = సమబుద్ధితో; తొల్లి = ఇంతకు ముందు; పురాణ = పురాణముల; పంక్తులు = సమూహాలు; ఇతిహాస = ఇతిహాసాల; శ్రేణులున్ = సమూహాలను; ధర్మ = ధర్మములను; శాస్త్రములున్ = శాస్త్రములను; నీవ = నీవు; ఉపన్యసింపుదువు = వివరించి చెప్పుదువు; వేదవ్యాస = వేదవ్యాసుడు; ముఖ్యుల్ = మొదలైన ముఖ్యమైనవారు; మునుల్ = మునులు; సుమతుల్ = మంచి మనసు గలవారు; సూచినవి = చూచినవి; ఎన్ని = ఎన్నున్నాయో; అన్నియును = అన్నీ; తోఁచున్ = స్ఫురించును; నీ = నీయొక్క; మదిన్ = మనసుకు; తత్ = వారియొక్క; ప్రసాదమునన్ = అనుగ్రహము; చేసి = వలన; ఎఱుంగనేర్తువు = గ్రహించగలవు; సమస్తంబున్ = సమస్తమును; బుధ = జ్ఞాన; ఇంద్ర = శ్రేష్ఠులలో; ఉత్తమ = ఉత్తముడా.

భావము:-"సుధీమణులలో ప్రథమగణ్యుడ వైన సూతమునీంద్రా ! నీవు బ్రహ్మాండాది పురాణాలు, మహాభారతం మొదలైన ఇతిహాసాలు, ఇంకా ఎన్నో ధర్మములు శాస్త్రములు మీ గురువుల సన్నిధిలో చక్కగా చదువుకున్నావు. అవన్నీ మాకు వివరించి చెప్పావు. ధీమంతులైన వేదవ్యాసాది మహర్షులు దర్శించిన విశేషాలన్నీ నీ మనసునకు స్ఫురిస్తాయి. ఆ మహానుభావుల అనుగ్రహంవల్ల నీ బుద్ధికి అందని దంటూ ఏదీ లేదు. నీవు సర్వజ్ఞుడవు.

★1-42-క.

గురువులు ప్రియశిష్యులకుం

బరమ రహస్యములు దెలియఁ బలుకుదు, రచల

స్థిర కల్యాణం బెయ్యది

పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్.

టీక:- గురువులు = గురువులు; ప్రియ = ప్రియమైన; శిష్యుల = శిష్యుల; కున్ = కు; పరమ = ఉత్కృష్ట మైన; రహస్యములు = రహస్య జ్ఞానములను; తెలియన్ = తెలియునట్లు; పలుకుదురు = వివరిస్తారు; అచల = చాంచల్యము లేనిది; స్థిర = స్థిరత్వము కలిగించేది; కల్యాణంబు = శుభకరమైనది; ఎయ్యది = ఏదో; పురుషుల = మానవుల; కును = కు; నిశ్చయించి = నిర్ణయించి; బోధింపు = బోధింపుము (మాకు); తగన్ = తగినట్లుగా.

భావము:- గురువులైనవారు ప్రీతిపాత్రులైన శిష్యులకు అత్యంత రహస్యాలైన సంగతులెన్నో బోధిస్తారు కదా. ఈ లోకంలోని మానవులకు శాశ్వతమైనట్టి కల్యాణాన్ని కలిగించే విషయమేదో బాగా ఆలోచించి దాన్ని దయతో మాకు ఉపదేశించు.

★1-43-క.

మన్నాఁడవు చిరకాలము,

గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్,

విన్నాఁడవు వినఁదగినవి,

యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.

టీక:- మన్నాఁడవు = బ్రతికితివి; చిర = చాలా; కాలము = కాలము; కన్నాఁడవు = దర్శించితివి; పెక్కు లైన = అనేకమైన; గ్రంథ = గ్రంథముల; అర్థంబుల్ = సారములను; విన్నాఁడవు = విన్నావు; వినఁదగినవి = వినదగినవి; ఉన్నాఁడవు = ఉన్నావు; పెద్దలొద్దన్ = పెద్దల దగ్గర; ఉత్తమ = మంచి; గోష్ఠిన్ = చర్చలలో.

భావము:- చక్కటి గోష్ఠులలో, మహానుభావుల సాన్నిధ్యంలో బహుకాలం ఉన్నావు. ఎన్నో మహా గ్రంథాల లోని పరమార్థాలను కన్నావు. పెద్దల వద్ద వినదగిన విశేషాలెన్నో విన్నావు.

1-44-చ.

అలసులు, మందబుద్ధియుతు, లల్పతరాయువు, లుగ్రరోగసం

కలితులు, మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయఁజాల రీ

కలియుగమందు మానవులు; గావున నెయ్యది సర్వసౌఖ్యమై

యలవడు? నేమిటం బొడము నాత్మకు? శాంతి, మునీంద్ర! చెప్పవే.

టీక:- అలసులు = సోమరి పోతులు; మంద = మందగించిన; బుద్ధి = బుద్ధి; యుతులు = కలిగిన వారు; అల్పతర = చాలా తక్కువ {అల్ప - అల్పతర - అల్పతమ}; ఆయువులు = ఆయుష్షు కలవారు; ఉగ్ర = భయంకర మైన; రోగ = రోగములతో; సంకలితులు = కూడి ఉన్న వారు; మంద = మందగించిన; భాగ్యులు = భాగ్యము కల వారు; సుకర్మములు = మంచిపనులు; ఎవ్వియున్ = ఏవియును; చేయఁజాలరు = చేయలేరు; ఈ = ఈ; కలియుగము = కలియుగము; అందున్ = లో; మానవులు = మనుషులు; కావునన్ = అందువలన; ఎయ్యది = ఏదైతే; సర్వ = అన్ని; సౌఖ్యము = సుఖములను కలుగజేయునది; ఐ = అయి; అలవడున్ = సిద్ధించునో; ఏమిటన్ = దేనివలన; పొడమున్ = కలుగుతుందో; ఆత్మకు = ఆత్మకు; శాంతి = శాంతి; ముని = మునులలో; ఇంద్రా = శ్రేష్ఠుడా; చెప్పవే = చెప్పుము.

భావము:- మునీంద్రా! సూతా! ఈ కలియుగంలోని మానవులందరు సోమరి పోతులు, మందబుద్ధులు, మందభాగ్యులు, అల్పాయుష్కులు. రకరకాల భయంకర వ్యాధులతో పీడింపబడుతున్నవారు. వారు సత్కార్యాలు చేయటానికి అసమర్థులు. అందువల్ల వారి ఆత్మలకు ఏది శాంతిని ప్రసాదిస్తుందో అట్టి మార్గాన్ని అనుగ్రహించు.

1-45-సీ.

ఎవ్వని యవతార మెల్ల భూతములకు-
సుఖమును వృద్ధియు సొరిదిఁజేయు;
నెవ్వని శుభనామ మేప్రొద్దు నుడువంగ-
సంసార బంధంబు సమసిపోవు;
నెవ్వని చరితంబుఁ హృదయంబుఁ జేర్పంగ-
భయమొంది మృత్యువు పరువువెట్టు;
నెవ్వని పదనది నేపాఱు జలముల-
సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ;

1-45.1-తే.

దపసులెవ్వాని పాదంబు దగిలి శాంతి
తెరువుఁగాంచిరి; వసుదేవదేవకులకు
నెవ్వఁ డుదయించెఁ; దత్కథలెల్ల వినఁగ
నిచ్చ పుట్టెడు; నెఱిఁగింపు మిద్ధచరిత!

టీక:- ఎవ్వని = ఎవని; అవతారము = జన్మ, అవతరించుట వలన; ఎల్ల = అన్ని; భూతముల = జీవుల; కున్ = కు; సుఖమును = సుఖమును; వృద్ధియు = అభ్యుదయము; సొరిదిన్ = క్రమముగ; చేయున్ = కలుగునో;

ఎవ్వని = ఎవని; శుభ = శుభకరమైన; నామము = పేరు; ఏప్రొద్దున్ = ఎల్లప్పుడును; నుడువంగ = ఉచ్చరింపగా; సంసార = సంసారము యొక్క; బంధంబు = బంధములు; సమసి = నాశనము; పోవున్ = అగునో; ఎవ్వని = ఎవని; చరితంబున్ = కథలను; హృదయంబున్ = హృదయంలో; చేర్పంగ = పెట్టుకొంటే; భయము = భయము; ఒంది = పొంది; మృత్యువు = మృత్యువు; పరువున్ = పరుగును; పెట్టున్ = పెట్టునో; ఎవ్వని = ఎవని; పద = పాదముల వద్ద పుట్టిన; నదిన్ = నది లోని (గంగానది); ఏపాఱు = అతిశయించిన; జలములన్ = నీటిని; సేవింపన్ = సేవించగా; నైర్మల్య = నిర్మలత్వము; సిద్ధి = సమకూరుట; కలుగున్ = కలుగుతుందో; తపసులు = తాపసులు; ఎవ్వాని = ఎవని;

పాదంబున్ = పాదమును; తగిలి = భక్తితో తగులుకొని; శాంతి = ప్రశాంతతకు; తెరువున్ = మార్గమును; కాంచిరి = దర్శించిరో; వసుదేవ = వసుదేవుడు; దేవకులు = దేవకీదేవిలు; కున్ = కు; ఎవ్వఁడు = ఎవడు; ఉదయించెన్ = జన్మించాడో; తత్ = ఆ; కథలు = కథలు; ఎల్ల = అన్నీ; వినఁగన్ = వినవలెనని; ఇచ్ఛ = కోరిక; పుట్టెడున్ = పుట్టినది; ఎఱిఁగింపుము = తెలియ చెప్పుము; ఇద్ధ = ప్రశస్తమైన; చరిత = నడవడిక కలవాడా.

భావము:- ఏ మహానుభావుడు అవతరించడం ఈ జగత్తులోని సమస్త జీవులకు ఆనందాన్నీ, అభివృద్ధినీ అందిస్తుందో, ఏ మహానుభావుడి దివ్యనామాన్ని ఎల్లప్పుడు ఉచ్చరించటం వల్ల భవబంధాలన్నీ పటాపంచలు అయిపోతాయో, ఏ మహానుభావుడి పవిత్ర చరిత్రని భావించిన మాత్రంచేతనే మృత్యుదేవత భయపడి పారిపోతుందో, ఏ మహానుభావుడి పాదాల నుంచి ఉద్భవించిన నదీజలాలను సేవించినంత మాత్రాన సమస్త కల్మషాలు సమస్తం నశించి పావనత్వం ప్రాప్తిస్తుందో, ఏ మహానుభావుడి చరణాలను సమాశ్రయించి సంయమీంద్రులు శాంతి మార్గాన్ని సాధించారో, ఏ మహానుభావుడు దేవకీ వసుదేవులకు ముద్దుల బిడ్డడుగా జన్మించాడో, ఆ మహానుభావుడైన వాసుదేవుని కథలన్నీ వినాలని ఎంతో ముచ్చట పడుతున్నామయ్యా. ఓ సచ్చరిత్రుడా! సూతా! అవన్నీ మాకు వినిపించు.

★1-46-క.

**భూషణములు వాణికి, నఘ**

**పేషణములు, మృత్యుచిత్త భీషణములు, హృ**

**త్తోషణములు, కల్యాణ వి**

**శేషణములు, హరి గుణోపచితభాషణముల్.**

టీక:- భూషణములు = అలంకారములు; వాణి = సరస్వతి, వాక్కు; కిన్ = కి; అఘ = పాపములను; పేషణములు = పొడిచేయునవి, పోగొట్టునవి; మృత్యు = మృత్యువు యొక్క; చిత్త = మనసునకు; భీషణములు = భయం కలిగించేవి; హృత్ = హృదయమునకు; తోషణములు = తుష్టి కలిగించేవి; కల్యాణ = శుభకరమైన; విశేషణములు = విశిష్టతలను ఇచ్చునవి; హరి = హరియొక్క; గుణ = గుణములతో; ఉపచిత = కూడిన; భాషణముల్ = పలుకులు.

భావము:- శ్రీమహావిష్ణువు యొక్క గుణకీర్తనములతో కూడిన పలుకులు, వాక్కులకు అధిదేవత యైన సరస్వతీ దేవికి అలంకారాలు. మృత్యు దేవతకు భయం కలిగించేవి. భక్తుల హృదయాలకు సంతోషాలు కలిగించేవి. సకల పాపాలను పోగొట్టునవి. నిత్యకల్యాణములను సమకూర్చేవి.

1-47-క.

కలిదోషనివారకమై
యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు
వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా!

టీక:- కలి = కలికాలములోని; దోష = దోషములను; నివారకము = నివారించునది; ఐ = అయి; అలఘు = తక్కువగాని (ఏవిధంగాను), గొప్ప; యశుల్ = కీర్తి గలవారు; పొగడునట్టి = స్తోత్రము చేయునట్టి; హరి = హరియొక్క; కథనమున్ = కథలు; నిర్మల = నిర్మలమైన; గతిన్ = మార్గమును; కోరెడు = కోరుకొనే; పురుషుఁడు = మనిషి; వెలయఁగన్ = ప్రసన్నమైతే; ఎవ్వాఁడున్ = ఎవడు మాత్రం; తగిలి = కుతూహలముతో; వినఁడు = వినడు; మహా = గొప్ప; ఆత్మా = ఆత్మకలవాడా, సూతా.

భావము:- మహాత్మా! సూత! కలికాల దోషాలను పారద్రోలుతు, ప్రసిద్ధులైన సత్పురుషుల ప్రశంస లందుకొన్న గోవిందునికథలను, పుణ్యలోకాలుకోరేవాడు ఎవడు ఆసక్తితోవినకుండా ఉంటాడు.

1-48-ఆ.

అనఘ! విను, రసజ్ఞులై వినువారికి
మాటమాట కధిక మధురమైన
యట్టి కృష్ణ కథన మాకర్ణనము సేయఁ
దలఁపు గలదు, మాకుఁ దనివి లేదు.

టీక:- అనఘ = పాపము లేనివాడా; విను = వినుము; రసజ్ఞులు = రస జ్ఞానము కలవారు; ఐ = అయి; విను = వినే; వారి = వారి; కి = కి; మాటమాటకు =ప్రతిమాటలోను; అధిక = మిక్కిలి; మధురము = తీయనిది; ఐన = అయినది; అట్టి = అగు; కృష్ణ = కృష్ణుని గూర్చిన; కథనము = విషయములు; ఆకర్ణనము = వినుట; సేయన్ = చేయాలని; తలఁపు = కోరిక; కలదు = కలదు; మాకున్ = మాకు; తనివి = తృప్తి (ఎంతవిన్నా); లేదు = తీరదు.

భావము:- పుణ్యాత్మా! సూతా! శ్రీకృష్ణుని కథలు ఆసక్తితో ఆలకించే రసజ్ఞుల హృదయాలకు పదే పదే మధురాతి మధురాలై ఆనందాన్ని కలిగిస్తాయి. వాటిని ఆలకించాలని మాకు ఎంతో కుతూహలంగా ఉంది. ఎన్ని విన్నా మాకు తనివి తీరటం లేదు.

1-49-మ.

వర గోవింద కథా సుధారస మహావర్షోరు ధారా పరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర, దుర్దాంత, దురంత, దుస్సహ, జనుస్సంభావితానేక దు
స్తర, గంభీర, కఠోర, కల్మష కనద్దావానలం బాఱునే?

టీక:- వర = శ్రేష్ఠమైన; గోవింద = కృష్ణుని {గోవింద - గోవులకుఒడయుడు}; కథా = కథలను; సుధారస = అమృతపు; మహావర్ష = గొప్ప వర్షము యొక్క; ఉరుధారా = పెద్ద ధారా పాతపు; పరంపరలన్ = తెరలు వలన; కాక = కాకుండా; బుధేంద్ర = జ్ఞానశ్రేష్ఠులలో; చంద్ర = చంద్రునివంటి వాడా; ఇతర = ఇతరమైన; ఉపాయ = ఉపాయాల మీది; అనురక్తిన్ = అనురాగం వలన; ప్రవిస్తర = మిక్కిలి విస్తరించిన; దుర్దాంత = అణచుటకురాని; దురంత = అంతము చేయు టకు రాని; దుస్సహ = సహింపరాని; జనుస్ = జన్మముల యందు; సంభావిత = సంభవించు చున్న; అనేక = అనేకమైన; దుస్తర = తరింపరాని; గంభీర = లోతైన; కఠోర = కఠినమైన; కల్మష = పాపములు అను; కనత్ = మండుచున్న; దావానలంబు = కారుచిచ్చు; ఆఱునే = చల్లారుతుందా.

భావము:- సూతా! బుధేంద్రచంద్ర! అత్యంత విస్తరమైనది, దాటరానిది, అణచుట సాధ్యం కానిది, అంతులేనిది, సహింపశక్యముకానిది అయి, అనేక జన్మల నుంచి పేరుకుపోయి, చుట్టుకుపోయినది అయి, దాటశక్యంగానిదై, గంభీరము, కఠోరమునైన కల్మషమనే కారుచిచ్చు మహాభయంకరంగా ఉన్నది. దీన్ని ఆర్పివేయాలంటే శ్రేష్ఠమైన ఆ నందనందనుని కథాసుధారసంతో నిండిన బ్రహ్మాండమైన వర్షధారాపరంపరలు తప్ప వేరే ఉపాయం లేదు కదా.

1-50-సీ.

హరినామ కథన దావానలజ్వాలచేఁ-
    గాలవే ఘోరాఘ కాననములు;
వైకుంఠదర్శన వాయు సంఘంబుచేఁ-
    దొలఁగవే భవదుఃఖ తోయదములు;
కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ-
    గూలవే సంతాప కుంజరములు;
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ-
    దీఱవే షడ్వర్గ తిమిర తతులు;

1-50.1-ఆ.

నలిన నయన భక్తినావచేఁ గాక సం

సారజలధి దాఁటి చనఁగ రాదు;

వేయునేల; మాకు విష్ణుప్రభావంబుఁ

దెలుపవయ్య సూత! ధీసమేత!

టీక:- హరి = హరియొక్క; నామ = పేరు; కథన = ఉచ్చరించుటనే; దావానల = కారుచిచ్చు; జ్వాలచేన్ = మంటలచేత; కాలవే = కాలిపోవా; ఘోర = ఘోరమైన; అఘ = పాపములు అను; కాననములు = అడవులు; వైకుంఠ = వైకుంఠలోక {వైకుంఠుడు - వైకుంఠమున ఉండువాడు, సృష్ట్యారంభమున పంచమాహాభూతము లను సమ్మేళనము చేసినవాడు, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 405వ నామం}; దర్శన = దర్శనమనే; వాయు = గాలుల; సంఘంబు = సమూహము; చేన్ = చేత; తొలఁగవే = తొలగిపోవా; భవ = సంసార; దుఃఖ = దుఃఖములు అను; తోయదములు = మేఘములు; కమలనాభ = విష్ణువుమీది {కమలనాభ - పద్మము నాభి యందు కలవాని}; ధ్యాన = ధ్యానము అను; కంఠీరవంబు = సింహము; చేన్ = చేత; కూలవే = కూలిపోవా; సంతాప = దిగుళ్ళు అను; కుంజరములు = ఏనుగులు; నారాయణ = హరిని; స్మరణ = స్మరించుట అను; ప్రభాకర = సూర్య; దీప్తిన్ = కాంతులచేత; తీఱవే = తీరిపోవా; షడ్వర్గ = అరిషడ్వర్గములు అను {అరిషడ్వర్గములు - కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్య, మోహములు.}; తిమిర = చీకటుల; తతులు = సమూహాలు;

నలిననయన = పద్మాల వంటి కళ్ళు కలవాడు, భగవంతుని పై; భక్తి = భక్తియనే; నావ = తెప్ప; చేన్ = తో; కాక = కాకుండా; సంసార = సంసారమనే; జలధి = సాగరము; దాఁటి = దాటి; చనఁగ = వెళ్ళటకు; రాదు = వీలు లేదు; వేయు = వేయి విషయములు; ఏల = ఎందుకు; మాకు = మాకు; విష్ణు = హరి {విష్ణుః- సర్వత్రా వ్యాపించి ఉన్నవాడు, హరి, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 2వ, 258వ, 657వ నామం}; ప్రభావంబున్ = శక్తిని; తెలుపవయ్య = తెలుపుము; సూత = సూతా; ధీ = జ్ఞానము; సమేత = కలిగి ఉన్నవాడా.

భావము:- పరమ ధీమంతుడ వైన సూతమహర్షీ! భయంకర పాపాలనే అరణ్యాలను కాల్చివేయాలి అంటే, శ్రీహరి నామసంకీర్తనలనే దావాగ్ని జ్వాలలే కావాలి; సంసార దుఃఖాలనే మేఘాలను పారద్రోలాలంటే, వాసుదేవ సందర్శనము అనే వాయువుల సమూహమే కావాలి; పరితాపాలు అనే ఏనుగుల సమూహాన్ని చంపాలంటే, శ్రీమన్నారాయణ ధ్యానము అనే సింహమే కావాలి; అరిషడ్వర్గము అనే అంధకార సమూహాన్ని తొలగించా లంటే, హరి స్మరణమనే సూర్యకాంతి కావాలి; సంసార సముద్రాన్ని దాటి గట్టెక్కాలంటే, విష్ణుదేవుని భక్తి అనే నావనే ఎక్కాలి; వేలకొద్దీ మాట లెందుకు గాని, మాకు శ్రీహరి మాహాత్మ్యాన్ని వినిపించండి మహానుభావా!

1-51-వ.

మఱియుఁ, గపటమానవుండును, గూఢుండు నైన మాధవుండు రామ సహితుం డై యతిమానుషంబు లైన పరాక్రమంబులు సేసె నఁట; వాని వివరింపుము;

**కలియుగంబు రాఁగల దని వైష్ణవక్షేత్రంబున దీర్ఘసత్త్ర నిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి, దైవయోగంబున.**

టీక:- మఱియు = ఇంకనూ; కపట = మాయవలన; మానవుండును = మానవ రూపం ధరించిన వాడు; గూఢుండును = మాయవలన తెలియరానివాడు; ఐన = అయిన; మాధవుండు = లక్ష్మీదేవి భర్త, {మాధవ - శ్రీదేవి భర్త, ఉపనిషత్ప్రసిద్ధ మధువిద్యచే తెలియబడు వాడు, విద్యాధిపతి, శ్రీశంకరభాష్యం విష్ణుసహస్రనామము లలో 72వ నామం, 167వ నామం, 735వ నామం}; రామ = బలరామునితో; సహితుండు = కూడినవాడు; ఐ = అయి; అతి = అతీతమైనవి; మానుషంబులు = మానవులు చేయుటకు; ఐన = అయినట్టి; పరాక్రమంబులు = సాహసములు; సేసెన్ = చేసెను; అట = అట; వాని = వాటిని; వివరింపుము = వివరముగా చెప్పుము; కలి యుగంబు = కలియుగము; రాఁగలదని = రాబోవుచున్నదని; వైష్ణవ = విష్ణువునకు సంబంధించిన; క్షేత్రంబున = సిద్ధస్థలమున, నైమిశారణ్యమున; దీర్ఘ = పెద్దదైన; సత్త్ర = సత్త్రయను పేరుగల యాగము; నిమిత్తంబున = కారణముగా; హరి = విష్ణుని; కథలు = కథలు; వినన్ = వినుట; ఎడ = పట్లు; కలిగి = కలిగినందు వలన; నిలిచితిమి = ఉంటిమి; దైవ = దైవము; యోగంబున = కలిసివచ్చుటచేత.

భావము:- అంతేకాదు, అప్రమేయుడైన గోవిందుడు మాయామానుష శరీరం ధరించి బలరాముని తో గూడి మానవాతీతాలైన మహా వీరకృత్యాలు ఎన్నో చేశాడని విన్నాము. అవన్నీ మాకు వివరంగా సెలవీ యండి. దైవానుగ్రహం సమకూరింది. కలియుగం రాబోతున్నదని విని ముందుగానే విష్ణు క్షేత్రమైన ఈ నైమిశారణ్యంలోదీర్ఘసత్ర"మనే యజ్ఞం ప్రారంభించాము. అలా హరికథలు ఆలకించే అవకాశం కలిగింది.

**★1-52-క.**

**జలరాశి దాఁటఁ గోరెడి**
**కలము జనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిం.**
**గలి దోష హరణ వాంఛా**
**కలితులమగు మేము నిన్నుఁ గంటిమి, సూతా!**

టీక:- జలరాశిన్ = సముద్రము; దాఁటన్ = దాటుటను; కోరెడి = కోరే; కలము = ఓడలోని; జనుల్ = జనము; కర్ణధారున్ = చుక్కాని పట్టి నడిపే వానిని {కర్ణధారుడు - పడవ నడుపువాడు - తరింప సమర్థుడు}; కాంచిన = చూచిన; భంగిన్ = విదంగా; కలి = కలికాలపు; దోష = పాపాలు; హరణ = నాశనము చేసే; వాంఛా = కోరికతో; కలితులము = కూడిన వారము; అగు = అయినటువంటి; మేమ; నిన్నున్ = నిన్ను {నిన్ను – కలిదోష నివారక సమర్థుడైన వాని}; కంటిమి = కనుగొన గలిగితిమి; సూతా = సూతా.

భావము:- ఓ సూతమహర్షీ! మహాసముద్రాన్ని దాటాలని ప్రయత్నించే ప్రయాణికులకు ఓడ నడిపే నావికుడు లభించినట్లుగా, కలికాల పాపాలను పోగొట్టుకొని తరించాలని కోరుతున్న మాకు నీవు కన్పించావు.

1-53-క.

చారుతర ధర్మరాశికి

భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్,

భారకుఁడు లేక యెవ్వనిఁ

జేరును ధర్మంబు బలుపు సెడి, మునినాథా!

టీక:- చారుతర= అతిమనోహరమైన {చారు - చారుతర - చారుతమ}; ధర్మ = ధర్మముల; రాశి = సమూ హము; కిన్ = నకు; భారకుఁడు = భరించు వాడు; అగు = అయినటువంటి; కృష్ణుఁడు = కృష్ణుడు; ఆత్మ = తన; పద మునకు = లోకమునకు; ఏఁగన్ = వెళ్ళగా; భారకుఁడు = భర్త; లేక = లేకపోవుటచే; ఎవ్వనిన్ = ఎవనిని; చేరును = చేరును; ధర్మంబు = ధర్మము; బలుపు = పుష్టిని; సెడి = కోల్పోయి; ముని = ముని అయిన; నాథా = ప్రభువా.

భావము:- ఓ సూతమహర్షీ! ఉత్తమ ధర్మాలకు ఆధారంగా ఉండే శ్రీకృష్ణుడు పరమపదం చేరుకున్న తరువాత, ఆధారంలేని ధర్మం దిక్కుమాలి, చిక్కి జీర్ణించి ఎవరిని ఆశ్రయిస్తుందో వివరించు.”

## కథా సూచనంబు

1-54-వ.

అని యిట్లు మహనీయగుణగరిష్ఠు లయిన, శౌనకాది మునిశ్రేష్ఠు లడిగిన, రోమహర్షణ పుత్త్రుం డయి, యుగ్రశ్రవసుం డను పేర నొప్పి, నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుండు.

టీక:- అని = అని పలికి; ఇట్లు = ఈ విధముగా; మహనీయ = మిక్కిలి గొప్ప; గుణ = గుణవంతులలో; గరిష్ఠులు = శ్రేష్ఠులు; అయిన = అయినట్టి; శౌనక = శౌనకుడు; ఆది = మొదలగు; ముని = మునులలో; శ్రేష్ఠులు = శ్రేష్ఠమైనవారు; అడిగిన = అడుగగా; రోమహర్షణ = రోమహర్షణుని; పుత్త్రుండు = పుత్రుడు; అయి = అయి; ఉగ్రశ్రవసుండు = ఉగ్రశ్రవసుడు; అను = అనే; పేరన్ = పేరుతో; ఒప్పి = ప్రసిద్ధుడైనట్టియు; నిఖిల = సమస్త; పురాణ = పురాణములను; వ్యాఖ్యాన = వ్యాఖ్యానము చేయు; వైఖరీ = మంచి నేర్పు; సమేతుండు = కలిగినవాడు; ఐన = అయినటువంటి; సూతుండు = సూతుడు.

భావము:- ఈ విధంగా సద్గుణాలనిధి అయిన శౌనకుడు మొదలైన మునీంద్రులు అడిగారు. రోమహ ర్షుని కుమారుడు, సమస్త పురాణాలను చక్కగా వివరించి చెప్పే నేర్పు కలవాడు అయిన ఉగ్రశ్రవసు డని ప్రసిద్ధుడైన సూతుడు ఇలా ఉపక్రమించాడు.

1-55-మ.

"సముఁడై, యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై, సన్న్యాసియై యొంటిఁ బో
వ మహాభీతి నొహోకుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ, వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె, మున్నట్టి భూ
తమయున్, మ్రొక్కెద బాదరాయణిఁ, దపోధన్యాగ్రణిన్, ధీమణిన్.

టీక:- సముఁడు = సర్వ సమత్వము సిద్ధించిన వాడు; ఐ = అయి; ఎవ్వఁడు = ఎవడు; ముక్త = విమోచనము చెందిన; కర్మ = కర్మల; చయుఁడు = సమూహము గలవాడు; ఐ = అయి; సన్న్యాసి = సన్యాసి; ఐ = అయి; ఒంటిన్ = ఒంటరిగా; పోవ = వెళ్ళగా; మహా = మిక్కిలి; భీతిన్ = భయముతో; ఓహో = ఓ; కుమార = కుమారా; అనుచున్ = అనుచు; వ్యాసుండు = వ్యాసుడు; చీరంగన్ = పిలువగా; వృక్షములున్ = చెట్లు సైతము; తన్మయతన్ = తన్మయత్వంతో; ప్రతిధ్వనులు = ప్రతిధ్వనులను; సక్కన్ = చక్కగా; చేసెన్ = చేసినవి; మున్ను = పూర్వము; అట్టి = అటువంటి; భూతమయున్ = సకలభూతములు తానైనవానికి; మ్రొక్కెద = నమస్కరించెద; బాదరాయణిన్ = శుకుని {బాదరాయణి – బాదరాయణుడైన వ్యాసుని కుమారుడు, శుకుడు}; తపస్ = తపస్సుచేత; ధన్య = ధన్యమైనవారిలో; అగ్రణిన్ = శ్రేష్ఠమైనవాడిన; ధీమణిన్ = బుద్ధిశాలిని {ధీమణి – జ్ఞానము కలవారి అందు మణి వంటి వాడు (లేదా) బుద్ధి యను మణి కలవాడు}.

భావము:- "సర్వభూతము అందు సమభావంతో సంచరించే మహాత్ముడు శుకమహర్షి సర్వసంగ పరిత్యాగియై, విరాగియై, మహాయోగియై, ఒంటరిగా అరణ్యంలో వెళ్తున్న సమయంలో తండ్రియైన వ్యాసులవారు అత్యంత వాత్సల్యంతో ఓ కుమారా! అని పెద్దగా పిలుస్తుంటే, అడవిలోని చెట్లన్నీ తన్మయత్వంలో"ఓయ్ ఓయ్"అంటూ ప్రత్యుత్తర రూపంగా ప్రతిధ్వనులు చేశాయి. అట్టి సకలభూతములు తానైనవాడు, తపోధనులలో అగ్రేసరుడు, మహామనీషి, మహానుభావుడు, బాదరాయణుడైన వ్యాసుని పుత్రుడు అయిన శుకునికి నమస్కారం చేస్తున్నాను.

1-56-సీ.

కార్యవర్గంబును, గారణ సంఘంబు-
నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు, నట్టి యధ్యాత్మముఁ-
దెలియఁ జేయఁగఁ జాలు దీప మగుచు,
సకలవేదములకు సారాంశమై, యేక-
మై, యసాధారణమగు ప్రభావ

రాజకంబైన పురాణ మర్మంబును,-

గాఢ సంసారాంధకార పటలి

1-56.1-తే.

దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప

నే తపోనిధి వివరించె నేర్పడంగ,

నట్టి శుకనామధేయు, మహాత్మగేయు,

విమల విజ్ఞాన రమణీయు, వేడ్కఁ గొలుతు.H63

టీక:- కార్య = కార్యముల యొక్క; వర్గంబునున్ = సమూహమునూ; కారణ = కారణముల; సంఘంబున్ = సమూహమునూ; అధికరించి = అతీతముగ; చరించు = వర్తించునట్టి; ఆత్మతత్త్వము = ఆత్మ యొక్క తత్త్వము; అధ్యాత్మము = అధ్యాత్మము); అనఁబడున్ = అని చెప్పబడుతుంది; అట్టి = అటువంటి; అధ్యాత్మమున్ = అధ్యాత్మమును; తెలియన్ = తెలియునట్లు; చేయఁగజాలు = చేయగలిగినట్టి; దీపము = దీపము; అగుచు = అవుతూ; సకల = సమస్త; వేదములకు = వేదాలకు; సారాంశము = సారాంశము; ఐ = అయి; ఏకము = ప్రత్యేకమైనది, అనన్యమైనది; ఐ = అయ్యి; అసాధారణము = అసాధారణము; అగు = అయినటువంటి; ప్రభావ = ప్రభావముతో; రాజకంబు = ప్రకాశించునది; ఐన = అయినట్టి; పురాణ = పురాణములలోని; మర్మంబును = మూలసూత్రమును; గాఢ = దట్టమైన; సంసార = సంసారమనే; అంధకార = చీకటి; పటలి = సమూహము;

దాఁటన్ = తరించాలని; కోరెడి = కోరుకొను; వారి = వారి; కిన్ = కి; దయ = దయ; తలిర్పన్ = చిగురించగా; ఏ = ఏ; తపస్ = తపస్సు అను; నిధి = నిధి కలవాడు; వివరించెన్ = వివరించాడో; ఏర్పడంగన్ = అర్థమయ్యేటట్లు; అట్టి = అటువంటి; శుక = శుకుడనే; నామ = పేరు; ధేయు = ధరించిన; మహా = గొప్ప; ఆత్మ = ఆత్మకలవారి చేత; గేయున్ = కీర్తింపబదగువానిని; విమల = నిర్మలమైన; విజ్ఞాన = విజ్ఞానము గల; రమణీయు = మనోహరుని; వేడ్కన్ = ఆసక్తితో; కొలుతున్ = ఆరాధిస్తున్నాను.

భావము:- కార్యకారణాలను వశీకరించుకొని అలరారే ఆత్మతత్త్వాన్ని పెద్దలు అధ్యాత్మికం అంటారు. అటువంటి అధ్యాత్మతత్త్వాన్ని సమగ్రంగా సాక్షాత్కరింపజేసేటట్టిది, సకలవేదాలసారభూతమైనట్టిది, అనన్యము, అసామాన్య, మహాప్రభావ సంపన్నము, సమస్త పురాణ రహస్యము అయినట్టి మహాభాగవతాన్ని సంసారమనే గాఢాంధకార సమూహాన్ని తరించగోరే విపన్నులకు ఉపదేశించిన అపారకృపాపయోనిధి, తపోనిధి, విశేష వివేక విజ్ఞానాల పెన్నిధి, వేదవ్యాసుల పుత్రుడు, సుధీజనస్తుతిపాత్రుడు అయినట్టి శ్రీశుకులవారిని ఆసక్తితో ఆరాధిస్తున్నాను.

1-57-క.

నారాయణునకు, నరునకు,

భారతికిని మ్రొక్కి; వ్యాసు పదములకు నమ

స్కారము సేసి, వచింతు ను

దారగ్రంథంబు, దళిత తను బంధంబున్."

టీక:- నారాయణును = నారాయణును; కున్ = కు; నరున = నరున; కున్ = కు; భారతి = సరస్వతీ దేవి; కిని = కి; మ్రొక్కి = నమస్కరించి; వ్యాసు = వ్యాసుని; పదముల = పాదముల; కున్ = కు; నమస్కారము = నమస్కారము; చేసి = చేసి; వచింతున్ = చెప్పెదను; ఉదార = ప్రకాశించే; గ్రంథంబు = గ్రంథము; దళిత = ఖండింపబడిన; తను = జన్మ; బంధంబున్ = బంధములు కలది.

భావము:- నరనారాయణులకు నమస్కారం చేసి; సరస్వతీదేవికి మ్రొక్కి;, వ్యాసులవారి పాదపద్మాలకు ప్రణామం కావించి; జనన మరణ బంధాలను పటాపంచలు చేసే పవిత్ర గ్రంథం అయిన భాగవతాన్ని వినిపిస్తాను."

1-58-వ.

అని యిట్లు దేవతాగురు నమస్కారంబు సేసి యిట్లనియె "మునీంద్రు లారా! నన్ను మీరు నిఖిలలోకమంగళంబైన ప్రయోజనం బడిగితిరి; ఏమిటం కృష్ణ సంప్రశ్నంబు సేయం బడు? నెవ్విధంబున నాత్మ ప్రసన్నం బగు? నిర్విఘ్నయు నిర్హేతుకయునై హరిభక్తి యేరూపంబునంగలుగు? నది పురుషులకుఁబరమధర్మంబగు, వాసు దేవునియందుఁ బ్రయోగింపఁబడిన భక్తి యోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు; నారాయణ కథలవలన నెయ్యేధర్మంబులు దగులువడవవి నిరర్థకంబు; లపవర్గపర్యంతం బయిన పరధర్మంబునకు దృష్ట శ్రుత ప్రపంచార్థంబు ఫలంబు గాదు; ధర్మంబు నందవ్యభిచారి యైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు; విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతి ఫలంబుగాదు; నెంతతడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు; తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బదియు నర్థంబు గాదు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబె తత్త్వం బని పలుకు దురు. తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైనయది తత్త్వమని యెఱుంగుదు; రా తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మయనియు, సాత్వతులచేత భగవం తుండనియును బలుకంబడు; వేదాంత శ్రవణంబున గ్రహింపంబడి, జ్ఞాన వైరా గ్యంబులతోడంగూడిన భక్తిచేతఁదత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మ యందుఁ బరమాత్మం బొడగందురు; ధర్మంబునకు భక్తి ఫలంబు; పురుషులు వర్ణా శ్రమధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి; ఏకచిత్తంబున నిత్యంబును గోవిందునాకర్ణింపనుంవర్ణింపనుందగుఁ; జక్రాయుధ

ధ్యానంబను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన కర్మంబు ద్రుంచి వైతురు; భగవంతుని యందలి శ్రద్ధయు; నపవర్గదం బగు తత్కథాశ్రవణాదుల యందత్యంతాసక్తియుఁ; బుణ్యతీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు కర్మ నిర్మూలన హేతువులైన కమలలోచనుకథలం దెవ్వండు రతిసేయువిననిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి పుట్టింపనేరవు; పుణ్యశ్రవణకీర్తనుం డైన కృష్ణుండు తనకథలు వినువారి హృదయంబు లందు నిలిచి, శుభంబు లాచరించు; నశుభం బులు పరిహరించు; నశుభంబులు నష్టంబులయిన భాగవతశాస్త్రసేవా విశేషంబు న నిశ్చలభక్తి యుదయిం చు; భక్తి కలుగ రజస్తమోగుణ ప్రభూతంబులైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; ప్రసన్నమన స్కుండైన ముక్తసంగుం డగు; ముక్తసంగుం డైన నీశ్వరతత్త్వజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడినఁ జిజ్జడ గ్రథనరూపం బైన యహంకారంబు భిన్నం బగు; నహంకారంబు భిన్నంబైన నసంభా వనాది రూపంబు లగు సంశయంబులు విచ్ఛి న్నంబులగు; సంశయవిచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున.

టీక:- అని = అని; ఇట్లు = ఈవిధంగా; దేవతా = దేవతలకు; గురు = గురువులకు; నమస్కారంబున్ = నమస్కారము; చేసి = చేసి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; ముని = మునులలో; ఇంద్రులారా = శ్రేష్ఠులారా; నన్ను = నన్ను; మీరు = మీరు; నిఖిల = అన్ని; లోక = లోకములకు; మంగళంబు = శుభకరము; ఐన = అయినట్టి; ప్రయోజనంబు = ప్రయోజనము; అడిగితిరి = అడిగారు; ఏమిటన్ = దేనివలన; కృష్ణ = కృష్ణుని; సంప్రశ్నంబు = ఆశ్రయము, శరణు; సేయంబడున్ = కలుగుతుందో; ఏ = ఏ; విధంబునన్ = విధము వలన; ఆత్మ = ఆత్మ; ప్రసన్నంబు = సంతుష్టము; అగున్ = అవుతుంది; నిర్విఘ్నయు = ఆటంకములు లేనిది; నిర్హేతుకయున్ = కారణములేనిది; ఐ = అయి; హరి = హరియందు; భక్తి = భక్తి; ఏ = ఏ; రూపంబునన్ = విధము వలన; కలుగున్ = కలుగుతుందో; అది = అది; పురుషుల = మానవుల; కున్ = కు; పరమధర్మంబు = పరమ ధర్మము; అగు = అయిన; వాసుదేవుని = భగవంతుని; అందున్ = గురించి; ప్రయోగింపఁబడిన = నడప బడిన; భక్తి = భక్తి; యోగంబు = యోగము; వైరాగ్య = వైరాగ్యమును; విజ్ఞానంబులన్ = విజ్ఞానములను; పుట్టించు = కలిగించును; నారాయణ = భగవంతుని; కథల = కథల; వలనన్ = వలన; ఎయ్యే = ఏఏ; ధర్మంబులు = ధర్మములు; తగులువడవు = పట్టు బడవో; అవి = అవి; నిరర్థకంబులు = ప్రయోజనము లేనివి; అపవర్గ = మోక్షము; పర్యంతంబు = వరకు; అయిన = వ్యాపించిన; పరధర్మంబున్ = పరధర్మమున; కున్ = కు; దృష్ట = చూడబడు; శ్రుత = వినబడు; ప్రపంచ = ప్రాపంచిక; అర్థంబు = విషయములు; ఫలంబు = ప్రయోజనము; కాదు = కాదు;

ధర్మంబున్ = ధర్మము; అందున్ = లో; అవ్యభిచారి = అతిక్రమించనిది {అవ్యభిచారి - (అది తప్ప) మరియొకదానియందు చరించనిది}; ఐన = అయిన; అర్థంబు = విషయము; కున్ = కు; కామంబు = కామము; ఫలంబు = ప్రయోజనము; కాదు = కాదు; విషయ = ఇంద్రియార్థములను; భోగంబు = అనుభవించుట; ఐన = అయినట్టి; కామంబు = కామము; కున్ = కు; ఇంద్రియ = ఇంద్రియములకు; ప్రీతి = ప్రియము కలుగ జేయుట; ఫలంబు = ప్రయోజనము; కాదు = కాదు; ఎంత = ఎంత; తడవు = కాలము; జీవించున్ = జీవించునో; అంతియ = అంత వరకు మాత్రమే; కామంబు = కామము; కున్ = కు; ఫలంబు = ప్రయోజనము; తత్త్వ = సృష్టిలోని సత్యమును, పరబ్రహ్మను; జిజ్ఞాస = తెలిసికొను కోరిక; కల = ఉన్నటువంటి; జీవుడు = మానవుడు; కున్ = కు; కర్మంబుల = కర్మల; చేతన్ = చేత; ఎయ్యది = ఏదయితే; సుప్రసిద్ధంబు = బాగా ప్రసిద్ధమైనదో; అదియున్ = అది కూడా; అర్థంబు = ప్రయోజనము; కాదు = కాదు; తత్త్వ = తత్త్వ; జిజ్ఞాస = జిజ్ఞాస; అనునది = అనునది; ధర్మ = ధర్మమును; జిజ్ఞాస = తెలిసికొను కోరిక; అగుటన్ = అగుట చేత; కొందఱు = కొందఱు; ధర్మంబె = ధర్మమే; తత్త్వంబు = తత్త్వము; అని = అని; పలుకుదురు = అందురు; తత్త్వవిదులు = తత్త్వము తెలిసినవారు; జ్ఞానంబు = జ్ఞానము; అను = అను; పేరన్ = పేరుతో; అద్వయంబు = అదితప్ప మరింకొకటి లేనిది; అయిన = అయినట్టి; అది = అది; తత్త్వము = తత్త్వము; అని = అని; ఎఱుంగుదురు = తెలియుదురు; ఆ = ఆయొక్క; తత్త్వంబు = తత్త్వము; ఔపనిషదుల = ఉపనిషత్తులను అనుసరించువారి; చేతన్ = చేత; బ్రహ్మము = బ్రహ్మము; అనియు = అనీ; హైరణ్యగర్భుల = హిరణ్యగర్భుని వివరించువారి {హిరణ్యగర్భుడు - బంగారు గ్రుడ్డు నందు పుట్టిన చతుర్ముఖ బ్రహ్మ}; చేతన్ = చేత; పరమాత్మ = పరమాత్మ; అనియు = అనీ; సాత్వతుల = భాగవత మతము నవలంబించినవారి; చేతన్ = చేత; భగవంతుండు = భగవంతుండు; అనియును = అనీ; పలుకంబడు = తెలుప బడుచున్నది; వేదాంత = వేదాంతమును; శ్రవణంబున = వినుట వలన; గ్రహింపంబడి = తెలిసికొని; జ్ఞాన = జ్ఞానము; వైరాగ్యంబుల = వైరాగ్యముల; తోడన్ = తో; కూడిన = కలిసియున్న; భక్తి = భక్తి; చేతన్ = చేత; తత్పరులు = దాని యందు నిష్ఠ గలవారు; ఐన = ఐన; పెద్దలు = మహాత్ములు; క్షేత్రజ్ఞుండు = శరీరమును ధరించిన జీవుడు; ఐన = అయిన; ఆత్మ = జీవాత్మ; అందున్ = లో; పరమాత్మన్ = పరమాత్మను; పొడగందురు = దర్శించెదరు; ధర్మంబు = ధర్మము; కున్ = కు; భక్తి = భక్తి; ఫలంబు = ప్రయోజనము; పురుషులు = మానవులు; వర్ణ = వివిధ వర్ణముల {చతుర్వర్ణములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర.}; ఆశ్రమ = వివిధ ఆశ్రమముల {చతురాశ్రమములు- బ్రహ్మచర్య, గృహస్త, వానప్రస్త, సన్యాసము}; ధర్మ = ధర్మములులోని; భేదంబులన్ = భేదముల ప్రకారము; చేయు = చేయు; ధర్మంబు = ధర్మముల; కున్ = కు; మాధవుండు = లక్ష్మీదేవి భర్త, హరి; సంతోషించుటయె = సంతోషించుటే; సిద్ధి = ప్రయోజనము; ఏక = ఏకాగ్ర; చిత్తంబున = మనసుతో; నిత్యంబును = నిత్యమూ; గోవిందుని = కృష్ణుని; ఆకర్ణింపనున్ = వినుటయును; వర్ణింప నున్ = కీర్తించుటయును; తగున్ = తగినది; చక్రాయుధ = హరి {చక్రాయుధుడు - చక్రము ఆయుధము గా కలవాడు}; ధ్యానంబు = ధ్యానము; అను = అనే; ఖడ్గంబున = కత్తితో; వివేకవంతులు = వివేకవంతులు; అహంకార = అహంకారమునందు; నిబద్ధంబు = బంధింపబడినది; ఐన = అయిన; కర్మంబు = కర్మములను; త్రుంచివైతురు = త్రుంచివైతురు; భగవంతుని = భగవంతుని; అందలి = మీది; శ్రద్ధయున్ = శ్రద్ధ; అపవర్గదంబు = మోక్షమిచ్చునవి; అగు = అయినటువంటి; తత్ = అతని; కథా = కథలు; శ్రవణ = వినుట; ఆదులు = మొదలగు వాటి; అందున్ = అందు; అత్యంత = మిక్కిలి; ఆసక్తియు = కుతూహలమును; పుణ్యతీర్థ = పుణ్యతీర్థములలో; అవగాహన = స్నానముచేయుట; మహత్ = మహాత్ములను; సేవ = సేవించుట; ఆదుల = మొదలగువాని; చేన్ = చేత; సిద్ధించు = కలుగును; కర్మ = కర్మలను;

నిర్మూలన = నశింపచేయుటకు; హేతువులైన = కారణములైన; కమలలోచను = భగవంతుని {కమలలోచనుడు – కమలముల వంటి కన్నుల వాడు, విష్ణువు}; కథలు = కథల; అందున్ = లో; ఎవ్వండు = ఎవడు; రతిసేయు = కుతూహలపడునో; వినన్ = వినుటను; ఇచ్చగించు = ఇష్టపడతాడో; వాని = అతని; కిన్ = కి; ఇతరంబులు = మిగిలినవి; ఎవ్వియు = ఏవీకూడా; రుచి = ఇష్టమును; పుట్టింపన్ = కలుగ; నేరవు = జేయలేవు; పుణ్య = పుణ్యమును కలుగజేయు; శ్రవణ = తన కథలు వినబడువాడు, శ్రుతి; కీర్తనుండు = కీర్తింపబడు వాడు, స్తోత్రము చేయబడు వాడు; ఐన = అయిన; కృష్ణుండు = కృష్ణుడు; తన = తనయొక్క; కథలు = కథలు; వినువారి = వినే వారి; హృదయంబులు = మనసుల; అందున్ = లో; నిలిచి = నివసించి; శుభంబులు = శుభములు; ఆచరించున్ = సమకూర్చును; అశుభంబులు = అశుభములను; పరిహరించున్ = నశింపజేయును; అశుభంబులు = అశుభములు; నష్టంబులు = నాశనము; అయిన = అయినచో; భాగవత = భాగవత; శాస్త్ర = పురాణాల; సేవ = సేవయొక్క; విశేషంబున = విశిష్టత వలన; నిశ్చల = అచంచలమైన; భక్తి = భక్తి; ఉదయించున్ = ప్రాప్తించును; భక్తి = భక్తి; కలుగ = కలుగుట వలన; రజస్ = రజస్; తమో = తమో; గుణ = గుణముల నుండి; ప్రభూతంబులు = పుట్టినవి; ఐన = ఐనటువంటి; కామ = కామము; లోభ = లోభము; ఆదులు = మొదలగు; కున్ = వాటికి; వశంబుగాక = లొంగక; చిత్తంబు = చిత్తము; సత్త్వ = సత్త్వ; గుణంబునన్ = గుణములో; ప్రసన్నంబు = ప్రశాంతమైనది; అగున్ = అవుతాడు; ప్రసన్న = ప్రసన్నమైన; మనస్కుండు = మనసుగలవాడు; ఐన = అయిన; ముక్తసంగుండు = బంధవిముక్తుడు {ముక్తసంగుడు – మనసునకు పట్టిన విషయ బంధాలు విడివిడినవాడు}; అగు = అవుతాడు; ముక్తసంగుండు = బంధవిముక్తుడు; ఐనన్ = అయినచో; ఈశ్వర = భాగవత; తత్త్వజ్ఞానంబు = పరతత్త్వజ్ఞానము; సిద్ధించున్ = సిద్ధించును; ఈశ్వరుండు = భగవంతుడు; కానంబడినన్ = దర్శనము జరిగిన; చిత్ = చైతన్య రూపమైన జ్ఞానము; జడ = అచేతన రూపమైన అజ్ఞానములు; గ్రథన = గ్రంథి {గ్రథన – ముడి పెట్టబడినది}; రూపంబు = రూపము; ఐన = అయినటువంటి; అహంకారంబు = అహంకారము; భిన్నంబగు = బ్రద్ధలగును; అహంకారంబు = అహంకారము; భిన్నంబు = బ్రద్దలు; ఐనన్ = అయితే; అసంభావన = చక్కగా భావింప కుండుట; ఆది = మొదలైన; రూపంబులు = రూపములు; అగు = అయిన; సంశయంబులు = సంశయములు; విచ్ఛిన్నంబులగు = నశించిపోతాయి; సంశయ = సంశయముల; విచ్ఛేదంబు = నాశనము; ఐనన్ = అయినచో; అనారబ్ధ = అనారబ్ధ {అనారబ్ధములు – ఇంకనూ ప్రారంభింపనివి (ప్రభావము చూపనివి)}; ఫలంబులు = ఫలితములు ఇచ్చేటివి; ఐన = ఐనటువంటి; కర్మంబులు = కర్మములు; నిశ్శేషంబులు = శేషము మిగలనవి; ఐ = అయి; నశించున్ = నశించి పోవును; కావున = అందువలననే.

భావము:- అని దేవతలకు, గురువులకు ప్రణామాలు చేసి సూతుడు శౌనకాదులతో ఇలా చెప్ప సాగాడు మునీంద్రులారా! సమస్త విశ్వానికి శ్రేయోదాయకమైన పరమార్థాన్ని చెప్పమని నన్ను మీరడిగారు. దేనివల్ల నిర్విరామము నిర్వ్యాజము నయిన హరిభక్తి ప్రాప్తిస్తుందో అదే మానవులకు పరమధర్మం అవుతుంది. గోవిందుని యందు సమర్పితమైన భక్తియోగంవలన వైరాగ్యము, ఆత్మజ్ఞానము లభిస్తాయి. ముకుందుని కథాసుధలకు దూరమైన ధర్మాలు సారహీనాలు. కైవల్యమే గమ్యస్థానమైన పరమధర్మానికి ఫలం. కనబడుతూ వినబడుతూ ఉన్న ఈ ప్రాపంచిక సుఖం సుఖం కాదు. ధర్మాన్ని అతిక్రమించని అర్థానికి ఫలం కామం కాదు. విషయభోగరూపమైన కామానికి ఫలం ఇంద్రియసంతుష్టి కాదు. జీవించి ఉన్నంత వరకే కామానికి ప్రయోజనం. తత్త్వవిచారం ఉన్నవాడికి నిత్య నైమిత్తిక కర్మల వల్ల లభించే స్వర్గాది సుఖాలు నిరర్థకాలు,

తత్త్వవేత్తలైన వారు అద్వైతజ్ఞానమే తత్త్వమని తలుస్తారు. ఆ తత్త్వాన్ని ఔపనిషదులు బ్రహ్మం అంటారు. హైరణ్యగర్భులు పరమాత్మ అంటారు. సాత్త్వతులు భగవంతుడు అంటారు. ఉపనిషత్తుల శ్రవణంచేత సంప్రాప్తమై, జ్ఞానంతోనూ, వైరాగ్యంతోనూ కూడిన భక్తి యందు ఆసక్తులైన మహాత్ములు జీవాత్మ యందే పరమాత్మను దర్శిస్తారు. ధర్మానికి భక్తియే ఫలం. వర్ణాశ్రమ ధర్మాలను అనుష్ఠించే మానవ ధర్మానికి భగవంతుడు సంతోషించుటయే ప్రయోజనం. ఏకాగ్రమైన చిత్తంతో నిత్యము పురుషోత్తముని లీలలు ఆకర్ణించటం, అభివర్ణించటం అవశ్య కర్తవ్యం. వివేకంగల మానవులు హరిస్మరణమనే కరవాలంతో అహంకార పూరితమైన కర్మబంధాన్ని కోసివేస్తారు. ముకుందుని మీది శ్రద్ధ ముక్తిని ప్రసాదిస్తుంది. పుణ్యతీర్థాలనూ, పుణ్యపురుషులనూ సేవించటం వల్లనే భగవంతుని కథలు వినాలనే ఉత్కంఠ ఉదయిస్తుంది. కర్మ బంధాలను నిర్మూలించే కమలాక్షుని కథలను ఆసక్తితో ఆకర్ణించేవానికి మరేవీ రుచించవు. పుణ్యశ్రవణకీర్తనుడైన పురుషోత్తముడూ తన కథలు ఆలకించే భక్తుల అంతరంగాలలో నివసించి వారికి సర్వశుభాలూ సమకూర్చి అశుభాలు పోగొట్టుతాడు. అశుభ పరిహారంవల్ల భాగవత సేవ లభిస్తుంది, భాగవతసేవ వల్ల అచంచలభక్తి ప్రాప్తిస్తుంది. భక్తివల్ల రజస్తమో గుణాలతో చెలరేగిన కామలోభాదులకు లొంగక చిత్తం సత్త్వగుణాయత్తమై ప్రసన్నమౌతుంది. చిత్తం ప్రస న్నమైతే బంధాలు విడిపోతాయి. బంధరహితుడైన వానికి తత్త్వజ్ఞానం సిద్ధించి ఈశ్వరదర్శనం లభిస్తుంది. ఈశ్వరదర్శనం వల్ల అజ్ఞానరూపమైన అహంకారం దూరమౌతుంది. అహంకారం దూరం కాగానే సమస్త సంశయాలూ పటాపంచలౌతాయి. సంశయాలు తొలిగిపోగానే అశేషకర్మలూ నిశ్శేషమై నశిస్తాయి.

1-59-క.

గురుమతులు తపసు లంతః

కరణంబుల శుద్ధి సేయ ఘనతరభక్తిన్

హరియందు సమర్పింతురు

పరమానందమున భిన్నభవబంధనులై.

టీక:- గురు = గొప్ప; మతులు = జ్ఞానము కలవారు; తపసులు = తాపసులు; అంతఃకరణంబులన్ = లోపలి ఇంద్రియములను {చతురంతఃకరణములు -మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.}; శుద్ధి = పరిశుద్ధి; సేయ = చేయు; ఘనతర = మిక్కిలి గొప్పదైన; భక్తిన్ = భక్తిని; హరి = హరి, భగవంతుని; అందున్ = కొరకు; సమర్పింతురు = సమర్పింతురు, నివేదింతురు; పరమ = పరమమైన, ఉత్కృష్టమైన; ఆనందమున = ఆనందముతో; భిన్న = బ్రద్దలైన; భవ = సంసార,జన్మజన్మల; బంధనులు = బంధనములు కలవారు; ఐ = అయి.

భావము:- విజ్ఞాననిధులు, తపోధనులు తమ అంతరంగాలను శుద్ధి చేసుకోవటం కోసం సంసారబంధాలను త్రోసిపుచ్చి; అచంచలమైన అనురక్తితో కూడిన తమ భక్తినంతా పరమానందంతో భగవంతునికే సమర్పించుకుంటారు.

1-60-త.

పరమపూరుషుఁ, డొక్కఁ, డాఢ్యుఁడు, పాలనోద్భవ నాశముల్
సారిదిఁ జేయు; ముకుంద, పద్మజ, శూలి సంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురిత సత్త్వ రజస్తమంబులఁ బొందు; నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వ నిరూఢుఁడై.

టీక:- పరమ = ఉత్కృష్టమైన; పూరుషుడు = పురుషోత్తముడు {పూరుషుడు - కారణభూతుడు, విష్ణువు}; ఒక్కఁడు = ఒకడే అయిన వాడు; ఆఢ్యుఁడు = శ్రేష్ఠమైనవాడు; పాలన = పాలనము (స్థితి); ఉద్భవ = ఉద్భవించుట (సృష్టి); నాశముల్ = నశింపజేయుట (లయము); సారిదిన్ = వరుసగా; చేయు = చేసేటటువంటి; ముకుంద = ముకుందుడు, విష్ణువు; పద్మజ = పద్మజ, బ్రహ్మ; శూలి = శూలి, శివుడు; సంజ్ఞలన్ = పేర్లతో; ప్రాకృత = ప్రకృతి నుండి; స్ఫురిత = వ్యక్తమైన; సత్త్వ = సత్త్వము; రజస్ = రజస్సు; తమంబులన్ = తమస్సులను; పొందున్ = పొందును; అందున్ = వానిలోనే; శుభస్థితుల్ = శుభమైన స్థితులు, భోగమోక్షములు; హరి = హరి; చరా = కదిలే జీవులు; అచర = కదలనివియైన జీవులు; కోటి = అనేకము; కిన్ = నకు; ఇచ్చున్ = ఇచ్చును; అనంత = అంతములేని; సత్త్వ = సత్త్వగుణముతో; నిరూఢుఁడై = స్థిరముగా నున్నవాడై.

భావము:- పరమపురుషుడు ఒక్కడే; ఆయనే ఈ అనంత విశ్వానికి అధీశ్వరుడు; ఆయనే సత్త్వరజస్తమోగుణాలను స్వీకరించి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అనే మూడు రూపాలు ధరించి ఈ లోకాలను సృష్టిస్తు, రక్షిస్తూ, అంతం చేస్తూ ఉంటాడు; అందులో అనంత సత్త్వగుణ సంపన్నుడైన శ్రీహరి చరాచర ప్రపంచానికి అపార శుభాలను అనుగ్రహిస్తాడు.

1-61-వ.

మఱియు నొక్క విశేషంబు గలదు; కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబుకంటెఁ ద్రయీ మయం బయిన వహ్ని యెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబుకంటె బ్రహ్మ ప్రకాశకం బగు సత్త్వగుణంబు విశిష్టం బగు; తొల్లి మునులు సత్త్వ మయుం డని భగవంతు, హరి, నధోక్షజుం, గొలిచిరి; కొందఱు సంసార మందలి మేలుకొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయిన వారలు ఘోరరూపు లైన భూతప తుల విడిచి దేవతాంతర నిందసేయక శాంతు లయి నారాయణ కథల యందే ప్రవర్తిం తురు; కొందఱు రాజస తామసు లయి సిరియు, నైశ్వర్యంబునుఁ, బ్రజలనుం గోరి పితృ భూత ప్రజేశాదుల నారాధింతురు; మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద, యాగ, యోగక్రియా,

జ్ఞాన, తపోగతి, ధర్మంబులు వాసుదేవ పరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వ రుండు గలుగుచు, లేకుండుచు త్రిగుణం బుల తోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి, గుణవం తుని చందంబున నిజమాయా విలసి తంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి, విజ్ఞానవిజృంభితుండై వెలుఁగు; నగ్ని యొక్క రుండయ్యుఁ, బెక్కు మ్రాఁకు లందుఁ దేజరిల్లుచుఁ బెక్కండ్రై తోఁచు తెఱంగున; విశ్వాత్మకుం డైన పురుషుం డొక్కండ, తనవలనం గలిగిన నిఖిల భూతంబు లందు నంతర్యామి రూపంబున దీపించు; మహాభూత సూక్ష్మేంద్రియం బులతోడం గూడి, గుణమయంబు లయిన భావంబులం దనచేత నిర్మితంబు లైన భూతంబు లందుఁ దగులు వడక తద్గుణంబు లనుభవంబు సేయుచు, లోకకర్త యైన యతండు దేవతిర్యఙ్మనుష్యాది జాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు" నని, మఱియు సూతుఁ డిట్లనియె.

టీక:- మఱియు = ఇంకను; ఒక్క = ఒక; విశేషంబు = విషయము; కలదు = ఉన్నది; కాష్ఠంబు = కట్టె; కంటెన్ = కన్నను; ధూమంబు = పొగ; ధూమంబు = పొగ; కంటెన్ = కన్నను; త్రయీమయంబు = వేదమయము, మూడు తత్త్వములతో కూడినది {త్రితత్త్వములు - వేడిమి, వెలుగు, శక్తి.}; అయిన = అయినటువంటి; వహ్ని = అగ్ని; ఎట్లు = ఏ విధముగనైతే; విశేషంబు = విశిష్టము; అగున్ = అగునో; అట్లు = ఆ విధముగనే; తమోగుణంబు = తమోగుణంబు; కంటెన్ = కంటెను; రజోగుణంబు = రజోగుణము; రజోగుణంబు = రజోగుణము; కంటెన్ = కంటెను; బ్రహ్మ = బ్రహ్మమును; ప్రకాశకంబు = ప్రకాశింప జేయునది; అగు = అయినటువంటి; సత్త్వగుణంబు = సత్త్వగుణము; విశిష్టంబు = విశేషము; అగు = అగును; తొల్లి = పూర్వము; మునులు = మునీశ్వరులు; సత్త్వ = సత్త్వగుణములుతో; మయుండు = నిండినవాడు; అని = అని; భగవంతు = భగవంతుడైన {భగవంతుడు - మహిమాన్వితుడు}; హరిన్ = హరిని; అధోక్షజున్ = విష్ణువుని; కొలిచిరి = పూజించిరి; కొందఱు = కొంతమంది; సంసారము = సంసారము; అందలి = లోని; మేలు = కలసివచ్చుట, మంచి; కొఱకున్ = కోసము; అన్యుల = ఇతరులను; సేవింతురు = పూజింతురు; మోక్ష = ముక్తి; అర్థులు = కోరెడివారు; అయిన = అయిన; వారలు = వారు; ఘోర = ఘోరమైన; రూపులు = రూపములుగలవారు; ఐన = అయినటువంటి; భూత = భూతములకు; పతుల = నాయకులను; విడిచి = విడిచిపెట్టి; దేవత = దేవతలలో; ఇతర = ఇతరమైనవారిని; నింద = దూరుట; చేయక = చేయకుండా; శాంతులు = శాంతస్వభావులు; అయి = అయి; నారాయణ = హరి; కథల = కథలు; అందే = లోనే; ప్రవర్తింతురు = నడచెదరు; కొందఱు = కొంతమంది; రాజస = రజోగుణము; తామసులు = తామసగుణములు గలవారు; అయి = అయి; సిరియున్ = ధనమును; ఐశ్వర్యంబును = ఐశ్వర్యమును; ప్రజలన్ = సంతతిని; కోరి = ఆశించి; పితృ = పితృదేవతలు; భూత = ప్రకృతిశక్తులు; ప్రజేశ = ప్రజాపతులు; ఆదులన్ = మొదలైనవారిని; ఆరాధింతురు = పూజింతురు; మోక్షము = ముక్తిని; ఇచ్చుటన్ = ఇచ్చుట; చేసి = వలన; నారాయణుండు = నారాయణుడు {నారాయణుడు - నారము అందు వసించువాడు}; సేవ్యుండు = సేవించ

దగినవాడు; వేద = వేదములు; యాగ = యాగములు; యోగ = యోగములు; క్రియ = క్రియలు; జ్ఞాన = జ్ఞానములు; తపోగతి = తపస్సులు; ధర్మంబులు = ధర్మములు; వాసుదేవ = భగవంతుని {వాసుదేవ - ఆత్మ యందు వసించే దేవుడు}; పరంబులు = గమ్యముగా కలవి; నిర్గుణుండు = గుణముల కతీతడు; అయిన = అయినటువంటి; పరమేశ్వరుండు = శ్రేష్ఠమైన ఈశ్వరుడు; కలుగుచున్ = ఉండుచును; లేకుండుచున్ = లేకుండగను; త్రిగుణంబుల = త్రిగుణముల; తోడన్ = తో; కూడిన = కూడినటువంటి; తన = తనయొక్క; మాయ = మాయ; చేతన్ = చేత; ఇంతయు = ఇదంతా; సృజియించి = సృష్టించి; గుణవంతుని = గుణములతో కూడిన వాని; చందంబున = విధముగ; నిజ = తన; మాయా = మాయవలన; విలసితంబులు = ప్రకాశించుచున్నవి; అయిన = అయినటువంటి; గుణంబుల = త్రిగుణముల {త్రిగుణములు– సత్త్వ, రజస్, తమస్}; లోన్ = లోనికి; ప్రవేశించి = ప్రవేశించి; విజ్ఞాన = విజ్ఞానము యొక్క; విజృంభితుండు = విశేషము గలవాడు, చెలరేగినవాడు; ఐ = అయి; వెలుఁగున్ = ప్రకాశించును; అగ్ని = అగ్ని; ఒక్కరుండు = ఒక్కడే; అయ్యున్ = అయినప్పటికిని; పెక్కు = అనేకమైన; వ్రాఁకులు = కట్టెలు; అందున్ = లోపల; తేజరిల్లుచున్ = విరాజిల్లుతూ; పెక్కండ్రై = అనేకులుగా; తోఁచు = కనిపించు; తెఱంగున = విధముగా; విశ్వాత్మకుండు = విశ్వమునకు ఆత్మ ఐనవాడు {విశ్వాత్మాః- విశ్వమునకు ఆత్మ యైనవాడు,విష్ణువు శ్రీశంకరభాష్యం విష్ణుసహస్రనామములలో 225వ నామం}; ఐన = అయినటువంటి; పురుషుండు = పరమపురుషుడు; ఒక్కండ = ఒక్కడే; తన = తన; వలనన్ = వలన; కలిగిన = సృష్టింప బడిన; నిఖిల = సర్వ; భూతంబులు = జీవులు; అందున్ = లోపల; అంతర్యామి = అంతర్యామి {అంతర్యామి - లోపలంతా వ్యాపించినవాడు}; రూపంబున = రూపముతో; దీపించు = ప్రకాశించును; మహాభూత = మహాభూతములు {మహాభూతములు - మనస్సు, పంచభూతములు}; సూక్ష్మేంద్రియంబుల = సూక్ష్మములైన ఇంద్రియములు; తోడన్ = తో; కూడి = కలిసి; గుణ = గుణములతో; మయంబులయిన = నిండినటువంటి; భావంబులన్ = భావముల ద్వారా; తన = తన; చేతన్ = చేత; నిర్మితంబులైన = సృష్టింపబడిన; భూతంబులందున్ = భూతములలో; తగులు = చిక్కు; వడక = పడకుండా; తత్ = ఆ; గుణంబుల = గుణములను; అనుభవంబుసేయుచు = అనుభవించుచూ; లోకకర్త = లోకములను సృష్టించినవాడు; ఐన = అయినట్టి; అతండు = అతడు; దేవ = దేవత; తిర్యక్ = పశుపక్ష్యాదులు {తిర్యక్ - చలనము గలవి, జంతువులు}; మనుష్య = మానవులు; ఆది = మొదలగు; జాతులు = జీవుల; అందున్ = లోపల; లీలన్ = లీలతో, క్రీడతో; అవతరించి = అవతరించి; లోకంబులన్ = లోకములను; రక్షించును = రక్షించును; అని; మఱియు = ఇంకను; సూతుఁడు = సూతుడు; ఇట్లు = ఈ విధముగా; అనియె = చెప్పెను.

భావము:- ఇక్కడ ఇంకొక విశేషం ఉంది. కట్టె కంటే పొగ విశిష్టమైనది. పొగ కంటే యజ్ఞసాధకమైన అగ్ని విశిష్టమైనది. అదే విధంగా తమోగుణం కన్నా రజోగుణము, రజోగుణం కన్నా పరమాత్మను దర్శింపజేసే సత్త్వగుణమూ ఉత్తమమైనది. పూర్వం మహర్షులు భగవంతుని సత్త్వగుణ స్వరూపునిగా కొలిచారు. కొంతమంది సంసార సుఖాలను వాంఛించి ఇతరులను ఆరాధిస్తారు. మోక్షాన్ని కోరినవారు మాత్రం వికృతాకారులైన భూతపతులను వదలి, శాంతభావులైన ఇతర దేవతలను నిందించకుండా శ్రీహరినే ఆశ్రయిస్తారు. మోక్షప్రదాత అయిన వాసుదేవుడే సేవింప దగ్గవాడు. వేదాలూ, యాగాలూ, యోగాలు క్రియలూ, జ్ఞానాలూ, తపస్సులూ, ధర్మాలూ అన్నీ వాసుదేవుని స్వరుపాలే. త్రిగుణాతీతుడైన భగవంతుడు వ్యక్తావ్యక్త స్వరూపుడై త్రిగుణాత్మకమైన నిజమాయ వల్ల విశ్వమంతా సృష్టించి, సత్త్వరజస్తమో గుణాలను

అంగీకరించి, గుణసహితుని లాగా విజ్ఞాన విశేషంతో విరాజిల్లుతాడు. ఒకే అగ్ని అనేక కట్టెలలో విరాజిల్లుతూ పెక్కు రూపాలుగా కన్నిస్తున్నట్లు, విశ్వమయుడైన పరమాత్మ ఒక్కడే తాను సృజించిన ప్రాణులన్నింటి యందు అంతర్యామియై ప్రకాశిస్తుంటాడు. మనస్సు వంటి సూక్ష్మేంద్రియాలతో కూడినవాడై గుణాత్మకాలైన భావాల ద్వారా తాను సృష్టించిన ప్రాణులలో ఉండి కూడ త్రిగుణాలకు తగులుబడకుండా ఆ యా గుణాలను అనుభవిస్తుంటాడు. లోకాలను సృష్టించిన ఆ పరమాత్మ దేవ మనుష్య పశుపక్ష్యాదులలో లీలావతారుడై జన్మించి లోక రక్షణం చేస్తుంటాడు" అని చెప్పి సూతుడు మళ్లీ ఇలా చెప్పసాగాడు.

1-62-సీ.

మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై-
   చారు షోడశ కళాసహితుఁ డగుచుఁ,
బంచమహాభూత భాసితుండై శుద్ధ-
   సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ,
జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసా శి-
   రములు నానాసహస్రములు వెలుఁగ,
నంబర కేయూర హార కుండల కిరీ-
   టాదులు పెక్కువేలమరుచుండఁ,

1-62.1-తే.

బురుషరూపంబు ధరియించి పరుఁ, డనంతుఁ,
డఖిల భువనైకవర్తన యత్నమమర
మానితోదార జలరాశి మధ్యమునను
యోగ నిద్రా విలాసియై యొప్పుచుండు."

టీక:- మహత్ = మహత్తు; అహంకార = అహంకారము; తన్మాత్ర = తన్మాత్రలతో {తన్మాత్రలు - శబ్ద స్పర్శ రస, రూప గంధములు}; సంయుక్తుఁడై = కూడినవాడై; చారు = అందమైన; షోడశ = పదహారు; కళా = కళలతో; సహితుఁడు = కూడినవాడు; అగుచున్ = అగుచూ; పంచ = ఐదు; మహాభూత = మహాభూతములలోను {మహాభూతములు - మనస్సు, పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశము.}; భాసితుండు = వెలుగొందుచున్న వాడు; ఐ = అయ్యి; శుద్ధ = నిర్మలమైన; సత్త్వుఁడు = సత్త్వగుణము కలవాడు; ఐ = అయ్యి; సర్వ = సర్వమును; అతిశాయి = అతిశయించినవాడు; అగుచున్ = అగుచూ; చరణ = పాదములు; ఊరు = తొడలు; భుజ = భుజములు; ముఖ = ముఖములు; శ్రవణ = చెవులు; అక్షి = కళ్ళు; నాస = ముక్కులు; శిరములు = తలలు; నానా = అనేకమైన; సహస్రములు = వేనవేలు; వెలుఁగన్ = ప్రకాశించుచుండగా; అంబర = వస్త్రములు; కేయూర =

భుజకీర్తులు; హార = హారములు; కుండల = కుండలములు; కిరీట = కిరీటములు; ఆదులు = మొదలగునవి; పెక్కు = అనేకమైన; వేలు = వేలు; అమరుచుండన్ = ధరింపబడియుండగా; పురుష = పరమ పురుష, విశ్వరూపము; రూపంబు = రూపము;

ధరియించి = ధరించి; పరుఁడు = అన్నిటికంటె వేరైన వాడు; అనంతుడు = అంతము లేనివాడు; అఖిల = సమస్త; భువన = లోకములందు; ఏక = ఒకేమాఱు; వర్తన = ఉండు; యత్నము = ప్రయత్నము; అమర = సిద్ధించగ; మానిత = పూజనీయమైన; ఉదార = పెద్ద; జలరాశి = సముద్రము; మధ్యమునను = నడుమ; యోగ = యోగ; నిద్రా = నిద్రతో; విలాసియై = విరాజిల్లుతూ; ఒప్పుచుండు = ఒప్పియుండును.

భావము:- "పరాత్పరుడు, అనంతుడు ఐన ఆ భగవంతుడు సమస్త భువనాలనూ సృష్టింప దలచి; మహదహంకారాలతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే తన్మాత్రలతో కూడి షోడశకళా పరిపూర్ణుడై; పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలతో ప్రకాశమానుడై; శుద్ధసత్త్వస్వరూపుడై; సర్వేశ్వరుడై; వేలకొలది పాదాలు, తొడలు, భుజాలు, ముఖాలు, చెవులు, కన్నులు, శిరస్సులతో అలరారుతూ; వేలకొలది వస్త్రాలు, భుజకీర్తులు, హారాలు, మకరకుండలాలు, మణికిరీటాలు ధరించి; పరమపురుష రూపం ధరించి; యోగనిద్రా ముద్రితుడై మహా సముద్ర మధ్యంలో శయనించి ఉంటాడు.

## ఏకవింశత్యవతారములు

1-63-వ.

అది సకలావతారంబులకు మొదలి గని యైన శ్రీమన్నారాయణ దేవుని విరాజ మానంబయిన దివ్యరూపంబు; దానిం బరమ యోగీంద్రులు దర్శింతురు; అప్పర మేశ్వరు నాభీకమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవ స్థానంబుల యందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల నద్దేవుండు కౌమా రాఖ్య సర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబునఁ జరియించె; రెండవ మాఱు జగజ్జననంబుకొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహదేహంబుఁ దాల్చె; మూడవ తోయంబున నారదుండను దేవర్షియై కర్మ నిర్మోచకంబైన వైష్ణవ తంత్రంబు సెప్పె; నాలవపరి ధర్మభార్యా సర్గంబునందు నర నారాయణాభిధానుం డై దుష్కరంబైన తపంబు సేసెఁ; బంచమావతారంబునం గపిలుం డను సిద్ధేశుం డయి యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వ గ్రామ నిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె; నాఱవ శరీరంబున ననసూయాదేవి యందు నత్రిమహా మునికిం గుమారుండై

యలర్కు నికిఁ బ్రహ్లాద ముఖ్యులకు నాత్మవిద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతి యందు రుచికి జన్మించి,యజ్ఞుం డనఁ ప్రకాశమానుండై యామాది దేవతల తోడం గూడి, స్వాయంభువమన్వంతరంబు రక్షించె; అష్టమ మూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్రముండనం బ్రసిద్ధుండై విద్వజ్జను లకుఁ బరమహంస మార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి; తొమ్మిదవ జన్మంబునఁ బృథు చక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె; చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబైన మీనావతారంబునొంది మహీ రూపంబగు నావనెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె; సముద్రమథన కాలం బునం బదునొకొండవమాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠ కర్పరం బున నేర్పరియై నిలిపె; ధన్వంతరి యను పండ్రెం డవ తనువున సురాసుర మధ్య మాన క్షీరపాథోధి మధ్యభాగంబున నమృతకలశహస్తుండై వెడలెఁ; బదమూఁడ వది యయిన మోహినీవేషంబున నసు రుల మోహితులం జేసి సురల నమృతాహా రులం గావించెఁ; బదునాలుగవది యైన నరసింహ రూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవదియైన కపటవామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడులోకంబుల నాక్రమించెఁ; బదునాఱువదియైన భార్గవరామా కృతిని గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహు లయిన రాజుల నిరువదియొక్క మాఱు వధియించి భూమి నిఃక్షత్త్రంబు గావించె; బదునేడవది యైన వ్యాస గాత్రం బున నల్పమతు లయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱచెఁ; బదునెనిమిదవ దైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్రనిగ్రహాది పరాక్ర మంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబు లైన రామకృష్ణ రూపంబులచే యదువంశంబునందు సంభవించి; విశ్వంభరా భారం బు నివారించె; నేకవింశతితమంబైన బుద్ధనామధేయంబునం గలియు గాద్యవస రంబున రాక్షససమ్మోహనంబుకొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి దేజరిల్లు; యుగసంధి యందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపంగలం"డని; యిట్లనియె.

టీక:- అది = అది (ఈవిధముగనుండే రూపము); సకల = అన్ని; అవతారంబులు = అవతారములు; కున్ = కు; మొదలిగని = మూలవిరాట్టు; ఐన = అయినటువంటి; శ్రీమన్నారాయణదేవుని = శ్రీమన్నారాయణుని {శ్రీమన్నారాయణదేవుడు – అత్యంత శుభకరమైన నారాయణు డగు దేవుడు}; విరాజమానంబు = విశేషముగ ప్రకాశించుచున్నది; అయిన = అయిన; దివ్య = దివ్యమైన; రూపంబు = రూపము; దానిన్ = దానిని; పరమ = గొప్ప; యోగి = యోగులలో; ఇంద్రులు = శ్రేష్ఠులు; దర్శింతురు = దర్శించెదరు; ఆ = ఆ యొక్క; పరమేశ్వరు = భగవంతుని; నాభీ = బొడ్డు; కమలంబు = కమలము; వలనన్ = నుండి; సృష్టికర్తల = సృష్టికర్త లందరి; లోనన్ = లోను; శ్రేష్ఠుండైన = ఆద్యుడైన; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఉదయించె = పుట్టెను; అతని = అతని యొక్క; అవయవ = అవయవముల; స్థానంబులు = స్థానముల; అందున్ = లో; లోక = లోకముల యొక్క; విస్తారంబులు = విస్తరణలు; కల్పింప బడియెన్ = పుట్టింప బడినవి; మొదలన్ = మొదట(1); ఆ = ఆ యొక్క; దేవుండు = దేవుడు (ఆదినారాయణమూర్తి); కౌమార = కౌమార {కౌమార ఆఖ్యలు – సనకుడు, సనందనుడు, సనత్ కుమారుడు, సనత్ సుజాతుడు}; ఆఖ్య = అను పేరుగల; సర్గంబున్ = సృష్టి (సంఘము) నందు; ఆశ్రయించి = అవతరించి; బ్రహ్మణ్యుండు = బ్రాహ్మణ హితుడు; ఐ = అయి; దుశ్చరంబు = ఆచరించుటకు మిక్కిలి కష్టమైనది; ఐన = అయినటువంటి; బ్రహ్మచర్యంబునన్ = బ్రహ్మచర్యమున; చరియించె = నడిచెను; రెండవ = రెండవ(2); మాఱు = సారి; జగత్ = జగత్తులయొక్క; జననంబు = పుట్టుక; కొఱకున్ = కోసము; రసాతల = రసాతలమున; గత = ఇమిడినది; అయిన = అయిన; భూమిని = భూమండలమును; ఎత్తుచున్ = ఉద్ధరిస్తూ; యజ్ఞేశుండు = యజ్ఞమునకు అధిపతి; అయి = అయి; వరాహ = వరాహ; దేహంబున్ = రూపమును; తాల్చెన్ = ధరించెను; మూడవ = మూడవ(3); తోయంబునన్ = సారి; నారదుండు = నారదుడు; అను = అను పేర; దేవర్షి = దేవలోకఋషి; ఐ = అయి; కర్మ = కర్మబంధాలను; నిర్మోచకంబు = విడిపించగలిగినవి; ఐన = అయిన; వైష్ణవ = విష్ణుమూర్తి ఆరాధనమనే; తంత్రంబు = తంత్రము, సిద్ధాంతమును; సెప్పెన్ = చెప్పెను; నాలవ = నాల్గవ(4); పరి = సారి; ధర్మ = ధర్ముడు; భార్యా = (అతని) భార్యల; సర్గంబునందు = సృష్టి యందు, కలయిక యందు; నరనారాయణ = నరనారాయణులనే; అభిధానుండు = పేర్లు గలవాడు; ఐ = అయి; దుష్కరంబైన = చేయుటకు మిక్కిలి కష్టమైన; తపంబు = తపస్సు; చేసెన్ = చేసెను; పంచమ = ఐదవ(5); అవతారంబునన్ = అవతారములో; కపిలుండు = కపిలుడు; అను = అనే; సిద్ధేశుండు = సిద్ధులలో శ్రేష్ఠుడు; అయి = అయి; ఆసురి = ఆసురి; అను = అను; బ్రాహ్మణు = బ్రాహ్మణున; కున్ = కు; తత్త్వ = తత్త్వముల {తత్త్వములు – ప్రకృతి మహత్తాదు లిరువదినాల్గు}; గ్రామ = సమూహము యొక్క; నిర్ణయంబు = నిర్ణయము; కల = కలిగినటువంటి; సాంఖ్యంబున్ = సాంఖ్యమును {సాంఖ్యము — తత్త్వదర్శనములలో నొకటి}; ఉపదేశించెన్ = ఉపదేశించెను; ఆఱవ = ఆరవ(6); శరీరంబున = అవతారమున; అనసూయాదేవి = అనసూయాదేవి; అందున్ = వలన; అత్రిమహాముని = అత్రిమహాముని; కిన్ = కిని; కుమారుండు = పుత్రుడు; ఐ = అయి; అలర్కుని = అలర్కున; కిన్ = కును; ప్రహ్లాద = ప్రహ్లాద; ముఖ్యులు = మొదలగు ముఖ్యమైనవారల; కున్ = కు; ఆత్మవిద్యన్ = ఆత్మవిద్యను; తెలిపెన్ = తెలియజేసెను; ఏడవ = ఏడవ(7); విగ్రహంబునన్ = అవతారమున; ఆకూతి = ఆకూతి; అందున్ = కిని; రుచి = రుచి; కిన్ = కిని; జన్మించి = పుట్టి; యజ్ఞుండు = యజ్ఞుడు; అనన్ = అనబడుతూ; ప్రకాశమానుండు = అవతరించినవాడు; ఐ = అయి; యామ = యామ {యామ– కాలవిభాగమైన యామమును నిర్ణయించినవాడు}; ఆది = మొదలైన; దేవతలన్ = దేవతలను; కూడి = కలిసి; స్వాయంభువ = స్వాయంభువు డనే; మన్వంతరంబున్ = మనువు కాలములో; రక్షించె = (సృష్టిని)

రక్షించెను; అష్టమ = ఎనిమిదవ(8); మూర్తిని = అవతారమునందు; మేరుదేవి = మేరుదేవి; అందున్ = కిని; నాభి = నాభి; కిన్ = కిని; జన్మించి = పుట్టి; ఉరుక్రముండు = ఉరుక్రముండు; అనన్ = అని; ప్రసిద్ధుండు = ప్రసిద్ధి పొందినవాడు; ఐ = అయి; విద్వజ్జనులు = పాండిత్యముగలవారల; కున్ = కు; పరమహంస = పరమహంస {పరమహంస - సర్వ పరిత్యాగము చేసి జ్ఞానమార్గమున చరించు వాడు}; మార్గంబున్ = మార్గమును; ప్రకటించెన్ = ఉపదేశించెను; ఋషుల = ఋషుల; చేతన్ = చేత; కోరంబడి = ప్రార్థింపబడి; తొమ్మిదవ = తొమ్మిదవ(9); జన్మంబునన్ = జన్మలో; పృథు = పృథుడనే; చక్రవర్తి = సార్వభౌముడు; ఐ = అయి; భూమిని = భూమండలమును; ధేనువున్ = గోవుగా; చేసి = చేసి; సమస్త = సమస్తమైన; వస్తువులన్ = వస్తువులను; పిదికెన్ = పిదికెను; చాక్షుష = చాక్షుష అనే {చాక్షుషమన్వంతరము - చాక్షుషుడను మనువు కాలం కనుక చాక్షుష మన్వంతరము}; మన్వంతర = మన్వంతరంలో {మన్వంతరము – మనువు పరిపాలన కాలము}; సంప్లవంబునన్ = జలప్రళయమున; దశమంబు = పదవది(10); అయిన = అయినటువంటి; మీన = మీనముగా; అవతారంబు = అవతారమును; ఒంది = పొంది; మహీ = భూమియొక్క; రూపంబగు = రూపముగల; నావన్ = ఓడను; ఎక్కించి = ఎక్కించి; వైవస్వత = వైవస్వతుడనే; మనువున్ = మనువును; ఉద్ధరించెన్ = ఉద్ధరించెను; సముద్ర = సాగరము; మథన = మథించబడిన (చిలికే); కాలంబునన్ = కాలమున; పదునొకొండవ = పదుకొండవ(11); మాఱు = సారి; కమఠ = కూర్మ; ఆకృతిని = అవతారములో; మందరాచలంబున్ = మందరపర్వతమును; తన = తనయొక్క; పృష్ఠ = వీపుపైనుండే; కర్పరంబున = వెన్నుచిప్పమీద; నేర్పరి = నేర్పుగలవాడు; ఐ = అయి; నిలిపెన్ = నిలిపెను; ధన్వంతరి = ధన్వంతరి; అను = అను; పండ్రెండవ = పండ్రెండవ(12); తనువునన్ = అవతారములో; సుర = దేవతలచేతను; అసుర = రాక్షసులచేతను; మధ్యమాన = మథింపబడుచున్న; క్షీరపాథోధి = పాలసముద్రము యొక్క; మధ్యభాగంబునన్ = మధ్యభాగములో; అమృత = అమృతము నిండిన; కలశ = బిందె, కలశము; హస్తుండు = హస్తమున ధరియించినవాడు; ఐ = అయి; వెడలెన్ = ఉద్భవించెను; పదమూఁడవది = పదమాడవది(13); అయిన = అయినట్టి; మోహినీ = మోహినీ; వేషంబునన్ = అవతారములో; అసురుల = రాక్షసులను; మోహితులన్ = మోహితులుగా; చేసి = చేసి; సురలన్ = దేవతలను; అమృత = అమృతమును; ఆహారులన్ = భుజించినవారిగా; కావించెన్ = చేసెను; పదునాలుగవది = పద్నాలుగవది(14); ఐన = అయినట్టి; నరసింహ = నరసింహ; రూపంబునన్ = అవతారములో; కనకకశిపుని = హిరణ్యకశిపుని {హిరణ్యకశిపుడు – బంగారు వస్త్రము ధరించు వాడు}; సంహరించెన్ = రూపుమాపెను; పదునేనవది = పదిహేనవది(15); ఐన = అయినట్టి; కపట = మాయా; వామన = వామనుడు {వామనః పొట్టివానిగా (మఱుగుజ్జువానిగా) అవతరించిన విష్ణువు, చక్కగా సేవింపదగినవాడు, విష్ణుసహస్రనామములలో 152వ నామం}; అవతారంబునన్ = అవతారములో; బలినిన్ = బలి(చక్రవర్తి)ని; పద = అడుగులు; త్రయంబున్ = మూడు; యాచించి = దానముగా అడిగి; మూఁడు = మూడు; లోకంబులన్ = లోకములను; ఆక్రమించెన్ = ఆక్రమించెను; పదునాఱవది = పదహారవది (16); ఐన = అయినటువంటి; భార్గవరామ = పరశురామ {భార్గవుని కుమారుడు – పరశురామ}; ఆకృతినిన్ = అవతారములో; కుపితభావంబున్ = కోపాన్ని; తాల్చి = పొంది; బ్రాహ్మణ = బ్రాహ్మణులకు; ద్రోహులు = ద్రోహము చేసినవారు; అయిన = ఐనటువంటి; రాజులన్ = రాజులను; ఇరువదియొక్క = ఇరవై ఒక్క(21); మాఱు = సార్లు; వధియించి = సంహరించి; భూమిన్ = భూమిని; నిఃక్షత్రంబు = క్షత్రియులు లేనిస్థితి; కావించెన్ = కలుగ చేసెను; పదునేడవది = పదిహేడవది(17); ఐన = అయినట్టి; వ్యాస = వ్యాసుని; గాత్రంబునన్ = శరీరమున; అల్ప = మంద మైన; మతులు = ప్రజ్ఞానము కలవారు; అయిన = అయినట్టి; పురుషులన్ = మానవులమీద; కరుణించి = దయ

చూపి; వేద = వేదమనే; వృక్షంబునకున్ = వృక్షమునకు; శాఖలు = శాఖలు {వేదమునకు – ఋక్ యజుస్ సామ అధర్వణ అని 4 శాఖలు}; ఏర్పఱచెన్ = ఏర్పాటుచేసెను; పదునెనిమిదవ = పద్దెనిమిదవది(18); ఐన = అయినట్టి; రామ = శ్రీరాముని; అభిధానంబునన్ = పేరుతో, అవతారముతో; దేవ = దేవతలయొక్క; కార్యార్థంబు = పనికొఱకు; రాజత్వంబున్ = రాజత్వమును {రాజత్వము – రాజు అను తత్వము}; ఒంది = స్వీకరించి; సముద్ర = సాగరమును; నిగ్రహ = నిగ్రహించుట; ఆది = మొదలైన; పరాక్రమంబులు = శౌర్యవంతము లైన పనులు; ఆచరించెన్ = చేసెను; ఏకోనవింశతి = పందొమ్మిదవది(19); వింశతితమంబు = ఇరువదవది(20); ఐన = అయినట్టి; రామ = బలరాముడు; కృష్ణ = శ్రీకృష్ణుడు; రూపంబుల = శరీరముల; చేన్ = తో; యదు = యాదవ; వంశంబు = కులము; అందున్ = లో; సంభవించి = అవతరించి; విశ్వంభర = భూదేవియొక్క; భారంబు = భారమును; నివారించెన్ = తప్పించెను; ఏకవింశతితమంబు = ఇరువదియొకటవ(21); ఐన = అయినట్టి; బుద్ధ = బుద్ధుడనే {బుద్ధః- ప్రపంచాకారముతో భాసించువాడు, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 351వ నామం}; నామధేయంబునన్ = పేరుతో; కలియుగ = కలియుగముయొక్క; ఆది = మొదలు; అవసరంబునన్ = అగు కాలంబున; రాక్షస = రాక్షసులను; సమ్మోహనంబు = మోహితులుగాచేయుట; కొఱకున్ = కోసము; మధ్యగయా = మధ్యగయ అను; ప్రదేశంబునన్ = స్థలములో; జిన = జినుడియొక్క; సుతుండు = పుత్రుడుగ; అయి = పుట్టి; తేజరిల్లున్ = ప్రకాశించు; యుగసంధి = యుగముల నడిమి కాలము (కలియుగం తరువాత, కృతయుగానికి ముందు); అందున్ = లో; వసుంధరాధీశులు = భూమిని పాలించువారు; చోరప్రాయులు = దొంగలు వంటివారు; ఐ = అయి; సంచరింపన్ = తిరుగుతుండగ; విష్ణుయశుండు = విష్ణుయశుడు; అను = అనే; విప్రుని = బ్రాహ్మణు; కిన్ = నకు; కల్కి = కల్కి; అను = అనే; పేరన్ = పేరుతో; ఉద్భవింపంగలండు = అవతరించును; అని = అని; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = చెప్పెను.

భావము:- అది అన్ని అవతారాలకు మూలవిరాట్టయిన అదినారాయణుని దేదీప్యమానమైన దివ్యరూపం. ఆ దివ్యరూపాన్ని మహాత్ములైన యోగీంద్రులు దర్శిస్తారు. శ్రీమన్నారాయణ దేవుని నాభికమలం నుంచి సృష్టికర్తలలో ఆద్యుడైన బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. శ్రీహరి అవయవ స్థానాలనుంచి లోకాలు సమస్తము ఆవిర్భవించాయి.

1) ఆదినారాయణదేవుడు మొదట కౌమార మనే స్వర్గాన్ని ఆశ్రయించి సనకసనందనాది రూపాలతో కఠోరమైన బ్రహ్మచర్యాన్ని ఆచరిస్తు బ్రహ్మణ్యుడై చరించాడు.

2) రెండవసారి యజ్ఞవరాహదేహం ధరించి విశ్వసృష్టి నిమిత్తం రసాతలం నుంచి భూమండలాన్ని ఉద్ధరించాడు.

3) మూడవ పర్యాయం నారదు డనే దేవర్షిగా జన్మించి మోక్షదాయకమైన వైష్ణవధర్మాన్ని బోధించాడు.

4) నాలుగవ అవతారంలో ధర్ముడను వానికి మూర్తి యందు నరనారాయణ స్వరూపుడై ఆవిర్భవించి ఆత్మశాంతికోసం అపారమైన తపస్సు చేసాడు.

5) ఐదవ అవతారం కపిలావతారం. దేవహూతి కర్దములకు జనించి ఆసురి అనే బ్రాహ్మణునికి తత్త్వనిరూపకమైన సాంఖ్యాన్ని ఉపదేశించాడు.

6) ఆరవ అవతారంలో అత్రి అనసూయలకు దత్తాత్రేయుడై పుట్టి అలర్కుడు, ప్రహ్లాదుడు మొదలైనవారికి ఆత్మవిద్య ప్రబోధించాడు.

7) ఏడవ పర్యాయం యజ్ఞుడనే నామంతో రుచికి, ఆకూతికి కుమారుడై, యమాది దేవతలతో స్వాయంభువ మన్వంతరాన్ని సంరక్షించాడు.
8) ఎనిమిదవ రూపంలో నాభికి మేరుదేవియందు ఉరుక్రముడను పేర ప్రభవించి పండితులకు పరమహంస మార్గాన్ని ప్రకటించాడు.
9) తొమ్మిదవ జన్మలో ఋషుల ప్రార్థన మన్నించి పృథుచక్రవర్తి యై భూదేవిని గోవు గావించి సర్వ ఓషధులను పిదికాడు.
10) పదవదైన మత్స్యావతారం దాల్చి చాక్షుష మన్వంతరాంతంలో సంభవించిన జలప్రళయంలో నావపై నెక్కించి వైవస్వత మనువును కాపాడాడు.
11) పదకొండవ పర్యాయం కూర్మావతారం స్వీకరించి మున్నీటిలో మునగిపోతున్న మందరపర్వతాన్ని నేర్పుగా వీపుపై ధరించాడు.
12) పన్నెండవ అవతారంలో ధన్వంతరి యై దేవదానవులు మథిస్తున్న పాలసముద్రంలో నుంచి అమృతకలశం హస్తాన ధరించి సాక్షాత్కరించాడు.
13) పదమూడవ అవతారంలో మోహిని వేషంలో రాక్షసులను వంచించి దేవతలకు అమృతం పంచి పెట్టాడు.
14) పద్నాలుగవ సారి నరసింహమూర్తిగా అవతరించి ధూర్తుడైన హిరణ్యకశిపుణ్ణి రూపుమాపాడు.
15) పదిహేనవ అవతారంలో మాయా వామనుడై బలిచక్రవర్తిని మూడడుగులు దానమడిగి ముల్లోకాలు ఆక్రమించాడు.
16) పదహారవమారు పరశురాముడై రౌద్రాకారంతో బ్రాహ్మణ ద్రోహులైన రాజులను, ఇరవై ఒక్కమారు సంహరించి ధాత్రిని క్షత్రియహీనం కావించాడు.
17) పదిహేడవసారి వేదవ్యాసుడై అల్పప్రజ్ఞులైన వారికోసం వేదశాఖలను విస్తరింపజేశాడు.
18) పద్దెనిమిదవ పర్యాయం శ్రీరాముడై సముద్రబంధనాది వీరకృత్యాలు ఆచరించి దేవకార్యం నిర్వర్తించాడు.
19) పందొమ్మిదవ అవతారంలో బలరాముడుగా,
20) ఇరవయ్యో అవతారంలో శ్రీకృష్ణుడుగా సంభవించి భూభారాన్ని హరించాడు.
21) ఇరవై ఒకటవసారి బుద్ధుడై మధ్య గయా ప్రదేశంలో తేజరిల్లి రాక్షసులను సమ్మోహపరచి ఓడిస్తాడు.
22) ఇరవై రెండవ పర్యాయం కల్కి రూపంతో విష్ణుయశుడనే విప్రునికి కుమారుడై జన్మించి కలియుగాంతంలో కలుషాత్ములైన రాజులను కఠినంగా శిక్షిస్తాడు అని పలికి సూతుడు ఇంకా ఇలా అన్నాడు.

★1-64-మ.

"సరసిం బాసిన వేయు కాలువల యోజన్ విష్ణునం దైన శ్రీ
కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్
సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే; దా విష్ణుఁడౌ నేర్పడన్.

టీక:- సరసిన్ = సరస్సు నుండి; పాసిన = వెలువడిన; వేయు = అనేకము లైన, వెయ్యి; కాలువల = కాలువల; యోజన్ = వలె; విష్ణుని = హరి {విష్ణుః - విష్ణుసహస్రనామాలులో 2వ నామం, విశ్వ మంతయు వ్యాపించి ఉన్నవాడు}; అందైన = నుండి ఉద్భవించిన; శ్రీకర = శుభములు కలిగించు, విష్ణుని {శ్రీకరః- శుభములు కలిగించువాడు, సిరులను ఇచ్చువాడు, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 611వ నామం}; నానా = అనేక విధముల; ప్రకట = కనబడిన; అవతారములు = అవతారాలు; అసంఖ్యాతంబులు = లెక్కపెట్టలేనివి; ఉర్వీశులు = రాజులు {భూమి పతులు, రాజులు}; సురలున్ = దేవతలు; బ్రాహ్మణ = బ్రాహ్మణులు; సంయమ = జితేంద్రియులలో; ఇంద్రులు = శ్రేష్ఠులు; మహా = గొప్ప; ఋషుల్ = ఋషులు; విష్ణుని = హరియొక్క; అంశాంశ = సూక్ష్మఅంశలతో; అజులు = పుట్టిన వారు; హరి = హరి; కృష్ణుండు = కృష్ణుడు; బల = బలరామునికి; అనుజన్ముఁడు = తోబుట్టువు వలె; ఎడల లేదా = వచ్చాడు కదా; విష్ణుఁ డౌ = హరి యై; ఏర్పడన్ = ఉండగా.

భావము:- ప్రపంచంలో సరస్సులనుండి ఎన్నోకాలవలు వెలువడి ప్రవహిస్తూ ఉంటాయి; అలాగే శ్రీమన్నారాయణుని లోనుంచి విశ్వశ్రేయోదాయకములైన ఎన్నెన్నో అవతారాలు ప్రావిర్భవిస్తూ ఉంటాయి; రాజ్యాలేలే వాళ్ళు, దేవతలు, బ్రాహ్మణులు, బ్రహ్మర్షులు, మహర్షులు ఆ నారాయణుని సూక్ష్మ అంశలచే ఉద్భవించిన వారే; పూర్వం బలరామునిగా, అతని సోదరుడు శ్రీకృష్ణునిగా శ్రీమహావిష్ణువు తానే అవతరించాడు కదా.

★1-65-క.

భగవంతుం డగు విష్ణుఁడు
జగముల కెవ్వేళ రాక్షసవ్యధ గలుగుం
దగ నవ్వేళలఁ దడయక
యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్.

టీక:- భగవంతుండు = భగవంతుడు; అగు = అయిన; విష్ణుఁడు = హరి; జగములు = లోకములు; కు = కు; ఎవ్వేళ = ఏవేళ; రాక్షస = రాక్షసులవలన; వ్యధ = బాధ; కలుగున్ = కలుగుతుందో; తగన్ = తగినట్లుగ; ఆ = ఆ; వేళలన్ = సమయములలో; తడయక = ఆలస్యము చేయక; యుగయుగ మునన్ = ప్రతియుగములోను; పుట్టి = ఉద్భవించి; కాచున్ = రక్షించును; ఉద్యత్ = యత్నమనే; లీలన్ = మాయతో.

భావము:- ప్రతి యుగంలో రాకాసుల చేష్టలతో లోకాలు చీకాకుల పాలయ్యే సమయాలలో, భగవంతుడైన శ్రీమహావిష్ణువు విడువక తగిన అవతారాలవతరించి దుష్టులశిక్షించి, శిష్టుల రక్షించి లోకాలను ఉద్ధరిస్తాడు.

1-66-ఆ.

అతిరహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపుఁ
జాల భక్తితోడఁ జదివిన సంసార
దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు.

టీక:- అతి = మిక్కిలి; రహస్యము = రహస్యము {రహస్యము - దాచుకొనదగ్గది}; ఐన = అయినట్టి; హరి = హరియొక్క; జన్మ = అవతారముల; కథనంబు = కథలు; మనుజుఁడు = మానవుడు; ఎవ్వఁడేని = ఎవరయిన; మాపు రేపున్ = రాత్రి+పగలు - అనునిత్యము; చాల = ఎక్కువ; భక్తి = భక్తి; తోడన్ = తో; చదివిన = పఠించినచో; సంసార = సంసారములోని; దుఃఖ = వ్యథల; రాశి = సమూహము; పాసి = దూరముగ; తొలఁగి = తొలగి; పోవున్ = పోవును.

భావము:- అత్యంత రహస్య గాథలైన వాసుదేవుని అవతార గాథలు, ఏ మానవుడైతే ఉదయము సాయంకాలము అత్యంత శ్రద్ధాభక్తులతో నిత్యము పఠిస్తాడో, అతడు దుఃఖమయమైన సంసార బంధాలకు దూరంగా తొలగిపోయి ఆనందం అనుభవిస్తాడు.

1-67-వ.

వినుం డరూపుం డయి చిదాత్మకుం డయి పరఁగు జీవునికిం బరమేశ్వరు మాయా గుణంబు లైన మహదాది రూపంబులచేత నాత్మస్థానంబుగా స్థూలశరీరంబు విరచితం బైన, గగనంబు నందుఁ బవనాశ్రిత మేఘ సమూహంబును, గాలి యందుఁ బార్థివధూళి ధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్ట యగు నాత్మ యందు దృశ్యత్వంబు బుద్ధిమంతులు గానివారిచేత నారోపింపంబడు; నీ స్థూలరూపంబు కంటె నదృష్టగుణం బయి యశ్రుతం బైన వస్తు వగుటం జేసి వ్యక్తంబు గాక సూక్ష్మం బై కరచరణాదులు లేక జీవునికి నొండొక రూపంబు విరచితంబై యుండు; సూక్ష్ముఁ డయిన జీవునివలన నుత్క్రాంతి గమనాగమ నంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీ స్థూల సూక్ష్మ రూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునఁ బ్రతిషేధింపఁ బడు; నపుడ నవిద్యంజేసి యాత్మనుగల్పింపంబడు నని యుం దెలియు నప్పుడు జీవుండు బ్రహ్మ దర్శనంబున కధికారి యగు; దర్శనం బన జ్ఞానైక స్వరూపంబు; విశారదుం డైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడు చున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణత యగు నప్పుడు జీవోపాధి యయిన స్థూల సూక్ష్మరూపంబు దహించి జీవుడు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్ని చందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మస్వరూపం బునం బొంది పరమానం దంబున విరాజమానుం డగు; ఇట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు"రని సూతుం డిట్లనియె.

టీక:- వినుండు = వినండి; అరూపుండు = రూపములేనివాడు; అయి = అయి; చిదాత్మకుండు = జ్ఞాని {చిదాత్మకుడు - చేతనా రూపమైన ఆత్మ కలవాడు, జ్ఞాని}; అయి = అయి; పరఁగు = ప్రవర్తిల్లు; జీవుని = జీవు; కిన్ = నకు; పరమేశ్వరు = పరమేశ్వరునియొక్క; మాయా = మాయతోకూడిన; గుణంబులు = గుణములు; ఐన = అయినట్టి; మహత్ = మహత్తు; ఆది = మొదలగు {మహత్త్యాదులు - మహత్తు, అహంకారము, పంచభూత ములు, తన్మాత్రలు, పంచేంద్రియములు, అంతఃకరణములు. (వీటి సహాయ ముతోనే జీవులు ఉద్భవిస్తారు};

రూపంబుల = రూపముల; చేతన్ = చేత; ఆత్మస్థానంబుగాన్ = స్వస్థానము గా; స్థూల = భౌతికమైన; శరీరంబు = శరీరము; విరచితంబు = ఏర్పాటుచేయబడినది; ఐన = అయినట్టి; గగనంబునందున్ = ఆకాశమునందు; పవన = వాయువును; ఆశ్రిత = ఆశ్రయించిన; మేఘ = మేఘముల; సమూహంబును = సమూహమును; గాలియందున్ = వాయువునందు; పార్థివ = భూమికి సంబంధించిన; ధూళి = ధూళితోను; ధూసరత్వంబును = దుమ్ముతోను కూడినట్టి; ఏ = ఏ; రీతి = విధమైతే; ఆ = ఆ; రీతి = విధముగ; ద్రష్ట = చూచువాడు; అగు = అయినట్టి; ఆత్మ = ఆత్మ; అందున్ = లోపల; దృశ్యత్వంబున్ = చూడబడు దాని తత్త్వము; బుద్ధిమంతులు = జ్ఞానము గలవారు; కానివారి = కాకుండా ఉండే వారి; చేతన్ = చేత; ఆరోపింపంబడున్ = లేనిది యున్నట్లు గా భావింపబడును; ఈ = ఈయొక్క; స్థూల = భౌతిక; రూపంబు = రూపము; కంటెన్ = కంటెను; అదృష్ట = చూడబడని; గుణంబు = గుణములు; అయి = కలిగి యుండినదై; అశ్రుతంబు = వినబడనిది; ఐన = అయినట్టి; వస్తువు = పదార్థము; అగుటన్ = అగుట; చేసి = వలన; వ్యక్తంబున్ = అభివ్యక్తము, తెలియబడునది; కాక = కాకుండ; సూక్ష్మంబై = సూక్ష్మమై; కర = చేతులు; చరణ = కాళ్లు; ఆదులు = మొదలగుని; లేక = లేని; జీవుని = జీవుని; కిన్ = కి; ఒండొక = ఇంకొక; రూపంబు = రూపము; విరచితంబు = ఏర్పరచబడినది; ఐ = అయి; ఉండున్ = ఉండును; సూక్ష్ముఁడు = సూక్ష్మమైనవాడు; అయిన = అయినట్టి; జీవుని = జీవుని; వలనన్ = వలన; ఉత్క్రాంతి = వ్యక్తపరచ బడిన; గమన = వెడలుట; ఆగమనంబులన్ = వచ్చుటలను; పునర్జన్మంబున్ = మళ్ళీ మళ్ళీ జన్మిస్తున్నట్లు; తోఁచున్ = అర్థమగును; ఎప్పుడు = ఎప్పుడు; ఈ = ఈ యొక్క; స్థూల = భౌతిక; సూక్ష్మ = సూక్ష్మ; రూపంబులు = రూపములు; రెండున్ = రెండును; స్వ=తన; రూప = రూపము యొక్క; సమ్యక్ = పూర్తియైన; జ్ఞానంబునన్ = జ్ఞానమువలన; ప్రతిషేధింపఁ బడున్ = అడ్డగింపబడును; అపుడ = అప్పుడు; అవిద్యన్ = అజ్ఞానము; చేసి = వలన; ఆత్మను = ఆత్మయందు; కల్పింపంబడును = కల్పింపబడతాయి; అనియున్ = అనీ; తెలియున్ = తెలసిన; అప్పుడు = అప్పుడు; జీవుండు = జీవుడు; బ్రహ్మ = పరబ్రహ్మను; దర్శనంబు = దర్శించుట; కున్ = కు; అధికారి = తగినవాడు; అగున్ = అగును; దర్శనంబు = దర్శనము; అనన్ = అనగా; జ్ఞాన = జ్ఞానముయొక్క; ఏక = ప్రత్యేకమైన; స్వరూపంబు = స్వరూపము; విశారదుండు = నేర్పరియైనవాడు; ఐన = అయినట్టి; ఈశ్వరునిది = ఈశ్వరు యొక్క; ఐ = అయి; క్రీడించుచున్ = క్రీడిస్తూ, వినోదము గా చరిస్తూ; అవిద్య = అవిద్య; అనంబడుచున్ = అని పిలవబడుచు; ఉన్న = ఉన్నట్టి; మాయ = మాయ; ఉపరత = నిలచిపోయినది; ఐ = అయి; ఎప్పుడు = ఎపుడైతే; తాన = తానే; విద్య = విద్య యొక్క; రూపంబునన్ = రూపముగ; పరిణత = పరిణామము చెందినది; అగున్ = అగునో; అప్పుడు = అప్పుడు; జీవ = జీవునకు; ఉపాధి = ఆధారము; అయిన = అయినట్టి; స్థూల = భౌతికమైన; సూక్ష్మ = సూక్ష్మమైన; రూపంబున్ = రూపము; దహించి = నశించి; జీవుడు = జీవుడు; కాష్ఠంబు = కట్టె; లేక = లేకనే; తేజరిల్లున్ = ప్రకాశించు; వహ్ని = అగ్ని; చందంబునన్ = వలె; తాన = తనే; ఉపరతుండు = నిలిచిపోయినవాడు; అయి = అయి; బ్రహ్మ = బ్రహ్మయొక్క; స్వరూపంబునన్ = స్వరూపమును; పొంది = ప్రాప్తించి; పరమ = అన్నిటికంటె నుత్తమమైన; ఆనందంబునన్ = ఆనందములో; విరాజమానుండు = విశేషముగ ప్రకాశించువాడు; అగున్ = అగును; ఇట్లు = ఈవిధముగ; తత్త్వజ్ఞులు = తత్త్వజ్ఞానము గలవారు; చెప్పుదురు = చెబుతారు; అని = అని చెప్పి; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈవిధముగ; అనియె = చెప్పెను.

భావము:-వినండి, ప్రాకృత రూప రహితుడు చిదాత్మస్వరూప జ్ఞానస్వరూపుడు ఐన జీవునికి మహదాదులైన మాయాగుణాల వల్ల ఆత్మస్థానమైన స్థూలశరీరం ఏర్పడింది; గగన మందు మేఘసమూహాన్ని ఆరోపించి

నట్లూ, గాలి యందు పైకి లేచిన దుమ్ముదుమారాన్ని ఆరోపించినట్లూ అజ్ఞానులైన వారు సర్వదర్శి అయిన ఆత్మ యందు దృశ్యత్వాన్ని ఆరోపించుతున్నారు; జీవునికి కనిపించే ఈస్థూలరూపంకంటే కనిపించనిది, వినిపించ నిది ఐన జీవాత్మ యొక్క ఉత్క్రాంతి గమనాగమనాల వల్ల మళ్లీ మళ్లీ జన్మిస్తున్నట్లు అనిపిస్తుంది; స్వస్వరూపజ్ఞానం వల్ల ఈ స్థూల సూక్ష్మరూపాలు రెండు తొలగిపోతాయని, మాయవల్ల ఇవి ఆత్మకు కల్పింపబడతాయని గ్రహించి నప్పుడు జీవునికి బ్రహ్మసందర్శనానికి అధికారం లభిస్తుంది; సమ్యక్ జ్ఞానమే దర్శనం; సర్వజ్ఞుడైన ఈశ్వరునికి లోబడి క్రీడిస్తూ అవిద్య అనబడే మాయ ఉపశమించి, తాను విద్యగా పరిణమించినప్పుడు ఉపాధి అయిన స్థూల సూక్ష్మరూపాలను దగ్ధం చేసి, కట్టె లేకుండా ప్రకాశిస్తున్న అగ్నిలాగా తానే బ్రహ్మస్వరూపాన్ని పొంది, పరమానందంతో విరాజిల్లుతాడని తత్త్వవేత్తలు వివరిస్తారు" అని సూతుడు మళ్లీ చెప్పసాగాడు.

1-68-చ.

"జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్త చిత్త వ
ర్తనుఁడగు చక్రికిం గవు లుదార పదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱి లేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మకర్మముల్.

టీక:- జననము = పుట్టుక; లేక = లేని; కర్మముల = కర్మల; జాడలన్ = వెంట; పోక = పోని; సమస్త = సర్వుల; చిత్త = చిత్తములలో; వర్తనుఁడు = చరించేవాడు; అగు = అయిన; చక్రి = చక్రధారియైన హరి {చక్రిః- సుదర్శన మను చక్రమును ధరించినవాడు, విష్ణుసహస్రనామాలలో 908వ నామం}; కిన్ = కి; కవులు = కవులు; ఉదార = గొప్ప; పదంబుల = పదములతో; జన్మ = పుట్టుక; కర్మముల్ = నడతల; వినుతులు = పొగడ్తలు; సేయుచున్ = చేస్తూ; ఉండుదురు = ఉంటారు; వేద = వేదము లందలి; రహస్యములు = రహస్యములు {రహస్యములు – దాచు కొనదగ్గవి}; అందున్ = లోపల; ఎందున్ = ఎందులోను కూడ; చూచిన = వెతికి చూచిన; మఱి = ఇంక; లేవు = లేవు; జీవుని = జీవుని; కిన్ = కొరకు; చెప్పిన = చెప్పబడిన; కైవడిన్ = విధమైన; జన్మ = జన్మలు; కర్మముల్ = కర్మలు.

భావము:- "చక్రధారుడైన ఆ హరికి జన్మ అన్నది లేదు. ఏ కర్మలూ ఆయనని అంటవు. సమస్తజీవుల చిత్తముల లోను ఆయన నివసిస్తూ ఉంటాడు. ఆ పరాత్పరునికి విద్వాంసులు జన్మలు కర్మలు కల్పించి, ఉదాత్తములైన పదజాలాలతో వర్ణిస్తున్నారు. స్తోత్రాలు చేస్తున్నారు. వాస్తవానికి వేదాలన్నీ వెదకి చూసినా జీవునికి వలె దేవునికి జన్మలు కర్మలు లేనేలేవు.

1-69-మ.

భువనశ్రేణి నమోఘలీలుఁ డగుచుం బుట్టించు రక్షించు నం
తవిధింజేయు మునుంగఁడందు; బహుభూతవ్రాతమం దాత్మతం
త్రవిహారస్థితుడై షడింద్రియ సమస్తప్రీతియున్ దవ్వులన్
దవిభంగిం గొనుఁ జిక్కఁ డింద్రియములం ద్రిప్పున్ నిబంధించుచున్.

టీక:- భువన = లోకముల; శ్రేణిన్ = సమూహములో; అమోఘ = అమోఘమైన {అమోఘమైనది - వ్యర్థము కానిది}; లీలుఁడు = లీల కలవాడు; అగుచున్ = అగుచూ; పుట్టించు = సృష్టించు, సృష్టి; రక్షించున్ = రక్షించు, స్థితి; అంతవిధిన్ = అంతముచేయుటను, లయలను; చేయు = చేయును; మునుంగఁడు = లోనుకాడు; అందున్ = అందు; బహు = అనేక; భూత = జీవుల; వ్రాతము = సమూహము; అందున్ = లోపల; ఆత్మ = స్వయముగ అల్లు కొనిన; తంత్ర = తంత్రము, అల్లిక - స్వతంత్ర; విహార = విహారముచేయు; స్థితుడు = స్థితిగలవాడు; ఐ = అయి; షట్ = ఆరు; ఇంద్రియ = ఇంద్రియముల యొక్క {ఇంద్రియములు - మనసు, పంచేంద్రియాలు కలిసి 6}; సమస్త = సమస్తమైన; ప్రీతియున్ = దగ్గరలు; దవ్వులన్ = దూరములను; దివి = ఆకాశము; భంగిన్ = వలె; కొనున్ = గ్రహించును; చిక్కఁడు = చిక్కుకొనడు; ఇంద్రియములన్ = ఇంద్రియములను; త్రిప్పున్ = విహరింపచేయును; నిబంధించుచున్ = నియమించును.

భావము:- ఈ సకల భువన జాలాన్నీ తన అమోఘమైన లీలావిలాసం చేత శ్రీమన్నారాయణుడు పుట్టిస్తుంటాడు, రక్షిస్తుంటాడు, అంతం చేస్తూ ఉంటాడు. కాని తాను మాత్రం ఆ జనన మరణాలలో నిమగ్నం కాడు. సర్వ ప్రాణి సమూహ మందు ఆత్మస్వరూపుడై విహరిస్తుంటాడు. ఎంతో దూరంలో అందకుండా స్వర్గంలాగా ఉండి, జీవుల ఇంద్రియాలకు సంతోషాన్ని సమకూరుస్తూ, తాను మాత్రం ఇంద్రియాలకు అతీతుడుగా ఉండి, నియంతయై ఇంద్రియాలను తన ఇష్టం వచ్చినట్లు త్రిప్పుతూ ఉంటాడు.

## 1-70-చ.

జగదధినాథుఁడైన హరిసంతతలీలలు నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్
మిగిలి కుతర్కవాది తగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే?
యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోపునే?

టీక:- జగత్ = సృష్టికి; అధి = పై; నాథుడు = పతి - అధిపతి; ఐన = అయినట్టి; హరి = హరియొక్క; సంతత = ఎడతెగని; లీలలు = లీలలు; నామ = నామాలు; రూపముల్ = రూపములు; తగిలి = పూనుకొని; మనో = ఆలోచనల; వచో = వాక్కుల; గతులన్ = రీతులతో; తార్కిక = తర్కమునకు సంబంధించిన; చాతురి = నేర్పు; ఎంత = ఎంత; కల్గినన్ = కలిగి యున్నప్పటికిని; మిగిలి = అతిశయించి; కు = చెడ్డ; తర్క = హేతు విమర్శ; వాది = వాదించువాడు - చెడ్డ వాదనలు వాదించువాడు; తగ = తగిన; మేరలు = హద్దులు; సేసి = చేసి; ఎఱుంగ = తెలిసికొన; నేర్చునే = గలడా; అగణిత = లెక్కకందని; నర్తన = నాట్యము, నృత్యము; క్రమమున్ = విలువ; అజ్ఞుఁడు = అజ్ఞానము కలవాడు; ఎఱింగి = అర్థము చేసికొని; నుతింపన్ = అభినందించుట; ఓపునే = చేయకలడా.

భావము:- సర్వలోకేశ్వరుడైన శ్రీహరి లీలావిలాసంగా నానావిధాలైన నామరూపాలు ధరిస్తూ ఉంటాడు. కళా హృదయం లేని అజ్ఞుడు, నాట్యంలోని అందచందాలను అర్థంచేసికొని ఆనందించి అభినందించ లేనట్లే, వితర్కాలు కుతర్కాలు నేర్చినవాడు తర్క శాస్త్ర పాండిత్యం ఎంత ఉన్నా, భగవంతుని సత్యస్వరూపాన్ని మనస్సుచేత గానీ వాక్కుల చేతగానీ ఇంత అని గ్రహింపలేడు.

1-71-ఉ.

ఇంచుక మాయలేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరిదివ్యపదాంబుజ గంధరాశి సే
వించు, నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన, యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్.

టీక:- ఇంచుక = కొంచెము కూడ; మాయ = మాయ, మర్మము; లేక = లేకుండా; మదిన్ = మనసులో; ఎప్పుడు = ఎల్లప్పుడూ; పాయని = విడువని; భక్తి = భక్తి; తోడన్ = తో; వర్తించుచున్ = నడచు కొనుచు; ఎవ్వఁడేని = ఎవ రైతే; హరి = హరియొక్క; దివ్య = దివ్యమైన; పద = పాద; అంబుజ = పద్మముల యొక్క; గంధ = వాసన; రాశి = మొత్తములను; సేవించున్ = సేవించునో; అతండు = అతడు; ఎఱుంగున్ = తెలియును; అరవిందభవ = బ్రహ్మ దేవుడు {అరవిందభవుడు- పద్మమున పుట్టినవాడు, బ్రహ్మ}; ఆదులు=మొదలైనవారు; కున్=కి; ఐన= అయినను; దుర్లభ = లభించనిది; ఉదంచితము = విజృంభణము కలది; ఐన = అయినట్టి; ఆ = ఆ; హరి = హరియొక్క; ఉదార = చక్కటి; మహా = గొప్ప; అద్భుత = ఆశ్చర్యకరమైన; కర్మ = కర్మలయొక్క; మార్గముల్ = విధానములు.

భావము:- మర్మము అన్నది కొంచం కూడ లేకుండ, ఎడతెగని భక్తితో ప్రవర్తిస్తూ, నారాయణ చరణార విందం సుగంధాన్ని సేవించే మహాత్ముడు, బ్రహ్మాదులకు సైతం అందుకోన శక్యం కాని భగవంతుని అత్యద్భు తమైన లీలావిశేషాలను తెలుసుకొంటాడు" ఇలా చెప్పి సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అన్నాడు.

1-72-మ.

హరిపాదద్వయభక్తి మీ వలన నిట్లారూఢమై యుండునే
తిరుగంబాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁ జెంద వెన్నడును జన్మాంతర్వ్యథాయోగముల్

టీక:- హరి = హరియొక్క; పాద = పాదములు; ద్వయ = జంట మీది; భక్తి = భక్తి; మీ = మీ; వలనన్ = వలన; ఇట్లు = ఈవిధముగా; ఆరూఢమై = నెలకొని, ఎంతగానో; ఉండున్ = ఉండును; ఏతిరుగన్ = ఇంకొక విధముగ; పాఱదు = విస్తరించదు; చిత్త = చిత్తము యొక్క; వృత్తి = ప్రవృత్తి; హరి = హరి; పై = మీద; దీపించి = ప్రకాశిస్తూ; మీ = మీ; లోపలన్ = అందు; ధరణీదేవతలారా = విప్రులులారా {ధరణీదేవతలు - భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; మీరలు = మీరు; మహా = మిక్కిలి, గొప్ప; ధన్యులు = సార్థకజీవులు; సమస్త = సర్వము; అజ్ఞులున్ = తెలిసిన వారు; హరి = హరిమీది; చింతన్ = భక్తి వలన; మిమున్ = మిమ్ములను; చెందవు = అంటవు; ఎన్నడును = ఎప్పుడూ; జన్మాంతర = వివిధజన్మలలో; వ్యథ = బాధలయొక్క; యోగముల్ = యోగములు.

భావము:- "ఓ బ్రహ్మణ్యులారా ! మీరు పుణ్యవంతులలో శ్రేష్ఠులు, సర్వం తెలిసిన మునివరేణ్యులు. మీలో శ్రీహరి చరణయుగంపై భక్తి ఇంతగా ఆరూఢమై ఉన్నది. మీ హృదయాలు శ్రీహరి యందు అసక్తములై

ఎడబాటు ఎరుగకుండా ఉన్నాయి. శ్రీమన్నారాయణ సంస్మరణ ప్రభావం వల్ల ఈ చావు పుట్టుకల బాధలు ఎన్నడూ మీ సమీపానికి రాలేవు.

## శుకుడు భాగవతంబు జెప్పుట

1-73-సీ.

పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితంబు-
బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోకభ-
ద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి-
శుకుఁ డనియెడుఁ దన సుతునిచేతఁ
జదివించె నింతయు సకలవేదేతిహా-
సములలోపల నెల్ల సారమైన

1-73.1-ఆ.

యీ పురాణమెల్ల, నెలమి నా శుకయోగి
గంగ నడుమ నిల్చి ఘన విరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁ డగు పరీ
క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁడు.

టీక:- పుణ్య = పుణ్యాత్ములచే; కీర్తనుడు = కీర్తింప బడువాడు - భగవంతుడు; ఐన = అయినట్టి; భువన = లోకములకు; ఈశు = అధిపతి - భగవంతుని; చరితంబు = చరిత్ర; బ్రహ్మ = పరబ్రహ్మతో; తుల్యంబు = సమానమైనది; ఐన = అయినట్టి; భాగవతము = భాగవతము; సకల = సమస్త; పురాణ = పురాణములలోను; రాజము = ఉత్తమమైనది; తొల్లి = పూర్వకాలము; లోక = లోకములకు; భద్రముగన్ = క్షేమముగ; ధన్యముగన్ = ధన్యత్వము పొందునట్లుగా; మోదముగన్ = సంతోషముగా; ప్రీతిన్ = ఇష్టంగా; భగవంతుఁడు = మహిమ కలవాడు, పూజ్యుడు; ఐన = అయినట్టి; వ్యాస = వ్యాస; భట్టారకుఁడు = ముని, పండితోత్తముడు; ఒనర్చి = పొందికగ కూర్చి; శుకుఁడు = శుకుడు; అనియెడున్ = అనబడే; తన = తనయొక్క; సుతుని = పుత్రుని; చేతన్ = చేత; చదివించెన్ = చదివించాడు; ఇంతయున్ = ఇది(ఈభాగవతము) ఎల్లను; సకల = సమస్త; వేద = వేదముల; ఇతిహాసముల = ఇతిహాసముల {ఇతిహాసము — (ఇతి+హా+ఆసీత్) — ఇది ఈ విధముగా జరిగినది, పూర్వరాజుల చరిత్రము గలది, భారతము మొదలగునవి}; లోపలన్ = లోపలి; ఎల్ల = సమస్తమైన; సారము = సారము; ఐన = అయినట్టి;

ఈ = ఈ; పురాణము = పురాణము; ఎల్లన్ = అంతటిని; ఎలమిన్ = సంతోషముతో; ఆ = ఆ; శుక = శుకుడనే; యోగి = ముని; గంగ = గంగానది; నడుమ = మధ్యభాగములో; నిల్చి = నిలకడగా ఉండి; ఘన = గొప్ప; విరక్తి = వైరాగ్యము; ఒదవి = ఉద్భవించి; మునుల = మునుల; తోడన్ = తో కలిసి; ఉపవిష్టుఁడు = కూర్చున్నవాడు; అగు = అయినట్టి; పరీక్షిత్ = పరీక్షిత్తు అనే; నర = రాజులలో; ఇంద్రుడు = ఉత్తముడు; అడుగన్ = అడుగగా; చెప్పెన్ = చెప్పెను; వినుఁడు = వినండి.

భావము:- పుణ్యకీర్తనుడైన విశ్వేశ్వరుని చరిత్రం శ్రీమద్భాగవతం. ఇది పరబ్రహ్మకు ప్రతిరూప మైనది. సర్వ పురాణాలలోను మేలుబంతి. ఈ మహాగ్రంథాన్ని పూర్వం లోకకల్యాణం కోసం భగవంతుడైన వ్యాసభట్టారకుడు అత్యంత పవిత్రంగా, ఆనందమయంగా, అనురాగ పూర్వకంగా రచించాడు. అలా రచించిన ఈ గ్రంథాన్ని సమగ్రంగా ఆయన తన కుమారుడైన శ్రీశుకునిచేత చదివింపచేసాడు. సమస్తవేదాల, ఇతిహాసాల సారభూతమైన ఈ భాగవతాన్ని ఆ శుకయోగీంద్రుడు గంగానది మధ్యలో మునిగణ సహితుడై, అత్యంత విరక్తుడై, ప్రాయోపనిష్ఠుడై ఉన్న పరీక్షిన్మహారాజు అడుగగా చెప్పాడు.

## 1-74-వ.

### కృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడం దన లోకంబునకుం జనిన పిమ్మట గలికాల దోషాం ధకారంబున నష్టదర్శను లైన జనులకు నిప్పు డిప్పురాణంబు కమల బంధుని భంగి నున్నది; నాఁ డందు భూరి తేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలన నేఁ బఠించిన క్రమంబున నామదికి గోచరించి నంతయ వినిపించెద"ననిన సూతునకు ముని వరుండయిన శౌనకుం డిట్లనియె.

టీక:- కృష్ణుండు = కృష్ణుడు; ధర్మ = ధర్మము; జ్ఞాన = జ్ఞానము ఆదుల = మొదలగువాని; తోడన్ = తో; తన = తన యొక్క; లోకంబు = లోకమున (వైకుంఠము); కున్ = కు; చనిన = వెళ్ళిన; పిమ్మటన్ = తరువాత; కలికాల = కలికాలము యొక్క; దోష = దోషమనే; అంధకారంబున = చీకట్లో; నష్ట = నశించిన; దర్శనులు = జ్ఞానము, ధర్మము కలవారు; ఐన = అయిన; జనులు = జనులు; కున్ = కు; ఇప్పుడు = ఇప్పుడు; ఈ = ఈ; పురాణంబు = పురాణము; కమలబంధుని = సూర్యుని {కమలబంధువు - పద్మాలకు మిత్రుడు, సూర్యుడు}; భంగిన్ = వలె; ఉన్నది = ఉన్నది; నాఁడు = ఆసమయము; అందున్ = అక్కడ; భూరి = మిక్కిలి గొప్ప; తేజుండు = తేజస్సు కలవాడు; అయి = అయి; కీర్తించుచున్న = స్తుతిస్తున్న (భాగవత పఠనము); విప్రర్షి = బ్రహ్మర్షి (శుకుని); వలనన్ = ద్వారా; నేన్ = నేను; పఠించిన = చదివిన; క్రమంబునన్ = ప్రకారముగా; నా = నాయొక్క; మది = మనసు; కిన్ = నకు; గోచరించినన్ = దర్శించ గలిగిన; అంతయ = అంత వరకు; వినిపించెదన్ = చెప్పెదను; అనిన = అని పలికిన; సూతు = సూతున; కున్ = కు; ముని = మునులలో; వరుండు = ఉత్తముడు; అయిన = అయిన; శౌనకుండు = శౌనకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నాడు.

భావము:- ధర్మము, జ్ఞానములతోపాటు శ్రీకృష్ణభగవానుడు తన లోకమైన వైకుంఠానికి వెళ్లి పోయిన తరువాత లోకంలో కలియుగం ప్రవేశించింది. కలికాల దోషాలనే చిమ్మచీకటిలో గ్రుడ్డివారు అయిపోయి దిక్కు తెలియక చిక్కుపడి ఉన్న మానవులకు ఇప్పుడీ మహాపురాణం పద్మాలకు ఇష్టుడైన సూర్యుడిలా వెలుగులు పంచుతోంది. ఆనాడు మునుల ముందు మహాతేజస్వియై శ్రీహరి లీలలు కీర్తిస్తూ ఉన్న బ్రహ్మర్షి శ్రీశుకయోగివల్ల

నేను నేర్చుకొన్న విధంగా, నా మనస్సుకు స్ఫురించినంతవరకు మీకు వినిపిస్తాను" అన్నాడు సూతుడు. అప్పుడు ఆయనను ముని శ్రేష్ఠుడైన శౌనకుడు ఇలా అడిగాడు.

## 1-75-శా.

"సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠు నే
శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై, శోధించి లోకైక వి
ఖ్యాతిన్ వ్యాసుఁడుఁ మున్ను భాగవతముం గల్పించెఁ? దత్పుత్త్రుఁడే
ప్రీతిన్ రాజునకీ పురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్.

టీక:- సూతా = సూతుడా; ఏ = ఏ; యుగ = యుగపు; వేళన్ = సమయములో; ఏమిటి = ఎందు; కిన్ = కు; ఏ = ఏ; చోటన్ = ప్రదేశములో; ముని = మునులలో; శ్రేష్ఠున్ = గొప్పవానిని; ఏ = ఏ; శ్రోతల్ = వినగోరువారు; కోరిరి = అడిగిరి; ఏమి = ఏమి; హేతువు = కారణము; కై = కొరకు; శోధించి = పరిశోధించి; లోక = లోకములకు; ఏక = ఎల్ల; విఖ్యాతిన్ = విశేషమైన ఖ్యాతిగలదిగా; వ్యాసుడు = వ్యాసుడు; మున్ను = పూర్వము; భాగవతమున్ = భాగవతమును; కల్పించెన్ = రచించెను; తత్ = అతని; పుత్త్రుఁడు = కుమారుడు; ఏ = ఏ; ప్రీతిన్ = ఆదరముతో; రాజు = రాజు; కున్ = కి; ఈ = ఈ; పురాణ = పురాణము యొక్క; కథన్ = కథను; చెప్పెన్ = చెప్పెనో; చెప్పవే = చెప్పుము; అంతయున్ = సమస్తమును.

భావము:-"సూతమహాముని! ఏ యుగంలో ఏ ప్రదేశంలో ఏ ఉద్దేశంతో వ్యాసుల వారిని భాగవతాన్ని రచించమని ఎవరు అడిగారు? ఆ వ్యాసభగవానుడు దేనికోసం వేద, ఇతిహాసాదుల సారం అంతా ఎంతో పరిశోధించి ఈ మహాగ్రంథాన్ని రచించాడు? ఆయన కుమారుడైన శుకబ్రహ్మ ఎటువంటి ప్రీతితో, ఏ విధంగా పరీక్షిన్మహారాజుకి భాగవతకథ వినిపించాడో? అదంతా మాకు సమగ్రంగా వివరించి చెప్పు.

## 1-76-వ.

బుధేంద్రా! వ్యాసపుత్త్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం, డేకాంతమతి, మాయాశయనంబువలనం దెలిసిన వాఁడు, గూఢుండు మూఢునిక్రియ నుండు నిరస్తఖేదుం డదియునుంగాక.

టీక:- బుధ = జ్ఞానులలో; ఇంద్రా = శ్రేష్ఠుడా; వ్యాస = వ్యాసుని యొక్క; పుత్త్రుండు = కుమారుడు; ఐన = అయినట్టి; శుకుండు = శుకుడు; అను = అనే; మహా = గొప్ప; యోగీ = యోగి; సమదర్శనుండు = (సర్వమును) సమానముగా చూచువాడు; ఏకాంత = ఏకాంతముగా, ఒంటరిగా; మతి = ఉండగోరువాడు; మాయ = మాయ; శయనంబు = దాగిన తావు; వలనన్ = గురించిన; తెలిసినవాఁడు = మర్మము తెలిసినవాడు; గూఢుండు = గూఢుడు {గూఢుడు - సాధరణముగ వ్యక్తము కాక యుండువాడు}; మూఢుని = తెలియని వాని; క్రియన్ = వలె; ఉండున్ = ఉండును; నిరస్త = తిరస్కరింపబడిన; ఖేదుండు = దుఃఖము గలవాడు; అదియునున్ = అదికూడా; కాక = కాకుండా.

భావము:- సుధీమణి! సూతా! వ్యాసుభగవానుని పుత్రుడైన శుకుడు మహా గొప్పయోగి, విరాగి, సమదర్శనుడు, బ్రహ్మజ్ఞుడు, మాయాతీతుడు, సర్వజ్ఞుడు. ఆయన నిగూఢ వర్తన కలవాడు. మూఢునిలా లోకానికి కనిపిస్తాడు, భేదాలు ఖేదాలు అంటని నిత్యానందుడు. అంతేకాకుండా,

★1-77-త.

శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి తోయములందు ల
జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు హా! శుక! యంచు వెన్క జనంగ వ్యాసునిఁ జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ!

టీక:- శుకుఁడు = శుకుడు; గోఁచియున్ = గోచీ కూడా; లేక = లేకుండా; పైన్ = బయట; చనన్ = వెళ్ళుచుండగా; చూచి = చూచి కూడ; తోయములు = నీటి; అందున్ = లోపల; లజ్జ = సిగ్గు; కున్; చలింపక = ఓడకుండా; చీరలు = చీరలను; ఒల్లక = కోరక; చల్లులాడెడి = జలకాలాడే; దేవ = దేవలోకపు; కన్యకలు = కన్యలు; హా = ఓహో; శుక = శుకుడా; అంచున్ = అనుచు; వెన్కన్ = వెనకాతలే; చనంగన్ = వెళ్ళుచుండగా; వ్యాసునిన్ = వ్యాసుని; చూచి = చూచుట వలన; అంశుకములన్ = సన్నని వస్త్రములను; ధరియించి = కట్టుకొని; సిగ్గునన్ = సిగ్గుతో; స్రుక్కిరి = జంకారు; అందఱు = అందరును; ధీనిధీ = బుద్ధిమంతుడా.

భావము:- ఓ విజ్ఞానఖనీ! సూతమహర్షీ! ఒకమారు వ్యాసుని పుత్రు డయిన శుకమహాముని కనీసం గోచీకూడా లేకుండ దిగంబరంగా వెళ్తున్నాడు. ఆ పక్క దేవకన్యలు ఒక సరస్సులో బట్టలులేకుండా స్నానాలు చేస్తున్నారు. వారు శుకుని చూసి కూడ చీరలు ధరించలేదు. ఏమాత్రం సిగ్గుకి చలించకుండా ఉల్లాసంగా జలకాలాడుతూనే ఉన్నారు. శుకుడి వెనకాతలే, వయోవృద్ధుడు, పరమజ్ఞాన స్వరూపుడు అయిన వ్యాసమహర్షి, కుమారుణ్ణి పిలుస్తూ అటుగా వచ్చాడు. ఆయనను చూసి ఆ దేవకాంతలు అందరు ఎంతో సిగ్గుతో గబగబ చీరలు కట్టేసుకున్నారు.

1-78-వ.

మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్ర పరిధానం బొనరిం పక వస్త్రధారియు వృద్ధుండునునైన తనుంజూచి చేలంబులుధరియించు దేవరమణులంగని వ్యాసుండు కారణం బడిగిన వారలు, నీ పుత్రుండు"స్త్రీ పురుష లనెడుభేదదృష్టిలేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండుగాన నీకు నతనికి మహాంతరంబు గల"దని రట్టి శుకుండు కురుజాంగల దేశంబుల సొచ్చి హస్తినా పురంబునఁ బౌరజనంబులచే నెట్లుజ్ఞాతుండయ్యె? మఱియు నున్మత్తునిక్రియ మూగ తెఱంగున జడునిభంగినుండు నమ్మహాయోగికి రాజర్షియైన పరీక్షిన్మహా

**రాజుతోడ సంవాదంబెట్లుసిద్ధించె? బహుకాలకథనీయంబయిన శ్రీభాగవత నిగమ వ్యాఖ్యానంబేరీతిసాగె? నయ్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవునుఁబిదికిన యంతదడవుగానినిలువంబడం; డతండు గోదోహన మాత్ర కాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబు లగు నండ్రు; పెద్దకాలం బేక ప్రదేశం బున నెట్లుండె? భాగవతోత్తముం డైన జనపాలుని జన్మ కర్మంబు లే ప్రకారంబు? వివరింపుము.**

టీక:- మఱియున్ = ఇంకనూ; నగ్నుండున్ = వస్త్రములు దాల్చనివాడు; తరుణుండును = మంచి వయసులో నున్నవాడు; ఐ = అయి; చను = వెళ్ళుచున్న; తన = తనయొక్క; కొడుకున్ = పుత్రుని; కని = చూచి; వస్త్ర = దుస్తులను; పరిధానంబు = ధరియించుటను; ఒనరింపక = చేయకుండా; వస్త్ర = దుస్తులు; ధారియున్ = ధరించినవాడు; వృద్ధుండును = ముసలివాడును; ఐన = అయినట్టి; తనున్ = తనను; చూచి = చూసి; చేలంబులు = దుస్తులు; ధరియించు = ధరిస్తున్న; దేవ = దేవలోకపు; రమణులన్ = కన్యలను; కని = చూసి; వ్యాసుండు = వ్యాసుడు; కారణంబు = కారణమును; అడిగినన్ = అడగగా; వారలు = వారు; నీ = నీయొక్క; పుత్రుండు = పుత్రుడు; స్త్రీ = స్త్రీలు; పురుషులు = పురుషులు; అనెడు = అనే; భేదదృష్టి = భేదమునుచూచుట; లేక = లేకుండా; ఉండున్ = ఉండును; మఱియున్ = ఇంకనూ; అతండు = అతను; నిర్వికల్పుండు = భ్రాంతి లేని వాడు; కాన = కావున; నీకున్ = నీకు; అతని = అతని; కిన్ = కిని; మహ = గొప్ప; అంతరంబు = భేదము; కలదు = ఉన్నది; అనిరి = అన్నారు; అట్టి = అటువంటి; శుకుండు = శుకుడు; కురు = కురురాజ్యంలో; జాంగల = మెఱక; దేశంబులన్ = ప్రదేశములలో; సొచ్చి = ప్రవేశించి; హస్తినాపురంబునన్ = హస్తినాపురములోని; పౌరజనంబుల = పురజనుల, పౌరులు; చేన్ = చేత; ఎట్లు = ఏవిధముగా; జ్ఞాతుండు = గుర్తింపబడ్డాడు; అయ్యెన్ = అయినాడు; మఱియున్ = ఇంకనూ; ఉన్మత్తుని = పిచ్చివాని; క్రియన్ = వలె; మూగ = మూగవాని; తెఱంగునన్ = వలె; జడుని = తెలివితక్కువ వాని; భంగిన్ = వలె; ఉండున్ = ఉండువాడు; ఆ = ఆయొక్క; మహా = గొప్ప; యోగి = యోగి; కిన్ = కి; రాజ = రాజులలో; ఋషి = ఋషి వంటి వాడు {రాజర్షి – వేదశాస్త్రానుయాయి అగు రాజు}; ఐన = అయినట్టి; పరీక్షిత్ = పరీక్షిత; మహారాజు = మహారాజు; తోడన్ = తో; సంవాదము = సంభాషణము; ఎట్లు = ఏవిధముగ; సిద్ధించెన్ = జరిగినది; బహు = చాలా; కాల = కాలము; కథనీయంబు = చెప్పదగినది; అయిన = అయినటువంటి; శ్రీ = శ్రీ; భాగవత = భాగవతమనే; నిగమ = వేదమునకు; వ్యాఖ్యానంబున్ = వ్యాఖ్యానము; ఏ = ఏ; రీతిన్ = విధముగ; సాగెన్ = నడచినది; ఆ = ఆ; యోగి = యోగులలో; ముఖ్యుండు = ముఖ్యమైన వాడు; గృహస్థుల = గృహస్తాశ్రమ వాసుల; గృహంబులన్ = ఇళ్ళల్లో; గోవును = ఆవును; పిదికిన = (పాలు) పితికిన; అంత = అంతమాత్రము; తడవు = సమయము; కాని = కంటే ఎక్కవ కాలం; నిలువంబడండు = నిలబడడు; అతండు = అతను; గో = గోవును; దోహన = పితికినయంత; మాత్ర = మాత్రము; కాలంబు = సమయము; సంచరించిన = తిరిగిన; స్థలంబులు = ప్రదేశములు; తీర్థంబులు = పుణ్యస్థలములు; అగున్ = అగును; అండ్రు = అందురు; పెద్ద = ఎక్కువ; కాలంబు = సమయము; ఏక = ఒకే; ప్రదేశంబునన్ = తావున; ఎట్లు = ఏవిధముగ; ఉండెన్ = ఉండెను; భాగవత = భాగవతు లలో; ఉత్తముండు = ఉత్తముడు; ఐన = అయినట్టి; జనపాలుని = రాజు {జనపాలుడు – జనులను పాలించు

వాడు, రాజు}; జన్మ = పుట్టుక; కర్మంబులు = ప్రవర్తనములు; ఏ = ఏ; ప్రకారంబు = విధమో; వివరింపుము = వివరముగాచెప్పుము.

భావము:- అప్పుడు నగ్నంగా స్నానాలు చేస్తున్న దేవకాంతలు, దిగంబరుడు, నవయువకుడు ఐన తన కొడుకును చూసి సిగ్గుపడి చీరలు ధరించకుండా, వస్త్రధారి వృద్ధుడు ఐన తనను చూసి లజ్జతో వస్త్రాలు కట్టుకొన్న దేవకాంతలను చూసి ఆశ్చర్యపడి, వ్యాసుడు అందుకు కారణ మేమిటని అడిగాడు; అప్పుడు వారు"నీ కుమారుడికి స్త్రీపురుషభేధభావము లేదు; అంతేకాక ఆయన నిర్వికల్పుడు; మరి నీలో స్త్రీ పురుష భేదభావం ఇంకా పోలేదు; నీకు, ఆయనకు ఎంతో భేదం ఉంది" అన్నారట; అటువంటి శుకబ్రహ్మ కురుజాంగల దేశాలు ఎలా ప్రవేశించారు; హస్తినాపురంలోని పౌరులు ఆయన్ని ఎలా గుర్తుపట్టారు; పిచ్చివాడిలా, మూగవాడిలా, జడునిలా ఉండే ఆ మహర్షి, రాజర్షియైన పరీక్షిన్మహారాజుల మధ్య సంభాషణ ఏ విధంగా కుదిరింది; శ్రీమహాభాగవత సంహితను చెప్పడానికి ఎంతో కాలంపడుతుంది; దానిని శుకబ్రహ్మ వచించటం ఎలా జరిగింది; అంతేగాక మహావిరాగి యైన ఆ శుకయోగి గృహస్థుల ఇండ్లలో గోవు పాలు తీసేటంత సేపు మాత్రమే నిలుస్తాడని, ఆయన గో దోహన మాత్ర సమయం నిలిచిన చోట్లు అన్నీ పుణ్యతీర్థాలౌతాయని పెద్దలు అంటారు; అట్టి మహానుభావుడు అన్నాళ్ళు ఒకే ప్రదేశంలో ఎలా ఉన్నాడు? భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన ఆ పరీక్షిన్నరేంద్రుడి జన్మ ప్రకారం ఏమిటి, ఏమేమేం చేసాడు? దయతో ఈ విశేషాలన్నీ వివరంగా తెలుపుము.

1-79-సీ.

పాండవ వంశంబు బలము మానంబును-
వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ;
బలిపంథిరాజులు భర్మాది ధనముల-
నర్చింతు రెవ్వని యంఘ్రియుగముఁ;
గుంభజ కర్ణాది కురు భట వ్యూహంబు-
సొచ్చి చెండాడెనే శూరు తండ్రి;
గాంగేయ సైనికాక్రాంత గోవర్గంబు-
విడిపించి తెచ్చె నే వీరుతాత;

1-79.1-ఆ.

యట్టి గాఢకీర్తి యగు పరీక్షిన్మహా
రాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై
యసువు లుండ, నేల యడఁగి యుండె?

టీక:- పాండవ = పాండవుల యొక్క; వంశంబు = వంశమునకు; బలము = శక్తియు; మానం బును = గౌరవమును; వర్ధిల్లన్ = అధికమగునట్లు; కడిమిన్ = పరాక్రమముతో; ఎవ్వాఁడు = ఎవడైతే; మనియెన్ = జీవించాడో; పరిపంథి = శత్రు; రాజులు = రాజులు; భర్మ = బంగారము; ఆది = మొదలగు; ధనములన్ = సంపదలతో; అర్చింతురు = పూజిస్తారో; ఎవ్వని = ఎవనియొక్క; అంఘ్రి=పాద; యుగమున్ = ద్వయమును; కుంభజ = ద్రోణుడు{ద్రోణుడు - కుంభములో(ద్రోణిలో) పుట్టినవాడు}; కర్ణ = కర్ణుడు; ఆది = మొదలగు(వారి); కురు = కౌరవ; భట =సైనిక; వ్యూహంబున్ = వ్యూహమును; సొచ్చి = ప్రవేశించి; చెండాడెన్ = ఖండించాడో; ఏ = ఏ; శూరు = శూరుని; తండ్రి = తండ్రి; గాంగేయ = భీష్ముని {గాంగేయుడు - భీష్ముడు - గంగ యొక్క పుత్రుడు}; సైనిక = సైనికులచే; ఆక్రాంత = ఆక్రమింపబడిన; గో = ఆవుల; వర్గంబు = మందను; విడిపించి = విడిపించి; తెచ్చెన్ = తెచ్చాడో; ఏ = ఏ; వీరు = వీరుని; తాత = పితామహుడు;

అట్టి = అటువంటి; గాఢ = గాఢమైన, దట్టమైన; కీర్తి = కీర్తికలవాడు; అగు = అయిన; పరీక్షిత్ = పరీక్షిత్తు అను; మహా = గొప్ప; రాజు = రాజు; విడువన్ = విడుచుటకు; రాని = తగని; రాజ్య = రాజ్యమను; లక్ష్మిన్ = మహా సంపదను; పరిహరించి = విసర్జించి; గంగన్ = గంగలో; ప్రాయోపవిష్టుఁడు = ప్రాయోపవేశమున ఉన్నవాడు, మరణాయత్త దీక్షుడు; ఐ = అయ్యి; అసువులు = ప్రాణములు; ఉండన్ = ఉండగనే; ఏల = ఎందులకు; అడఁగి = అణగి; ఉండెన్ = ఉండెను.

భావము:- ఆ పరీక్షిన్మహారాజు సామాన్యుడు కాడు; తన పరాక్రమంతో పాండవుల వంశం, బలం, గౌరవప్రతిష్ఠలు వర్థిల్లునట్లు ప్రవర్తించిన వాడు; పరరాజ్యపాలకులు అందరు బంగారురాసులు తీసికొచ్చి ఆయన కాళ్ల ముందు క్రుమ్మరించి ఆయన పాదపద్మాలను సేవించారు; ఆ మహావీరుని తండ్రి అయిన అభిమన్యుడు అసహాయశూరుడై, ద్రోణ కర్ణాదులచే పరిరక్షితమైన కౌరవసేనావ్యూహంలో ప్రవేశించి చీల్చి చెండాడాడు; ఆయన తాత యైన అర్జునుడు మహారథుడైన భీష్ముని రక్షణలో ఉన్న కురుసేనావాహినిని పారద్రోలి గోవులను మరలించి తెచ్చాడు; అటువంటి అఖండ కీర్తి సంపన్నుడైన పరీక్షిత్తు మహారాజు విడువరాని రాజ్యలక్ష్మిని విడిచి, గంగానదిలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలను బిగట్టుకొని ఎందుకు ఉండవలసి వచ్చింది.

## 1-80-ఉ.

**ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నడుం**
**జిత్తములందుఁ గోరరు హసించియు, లోకుల కెల్ల నర్థ సం**
**పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు రన్యరక్షణా**
**త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో?**

టీక:- ఉత్తమ = ఉత్తమమైన; కీర్తులు = కీర్తిగలవారు; ఐన = అయినట్టి; మనుజ = మానవులలో; ఉత్తములు = ఉత్తములు; ఆత్మ = స్వంత; హితంబులు = మేలు; ఎన్నడున్ = ఎప్పుడును; చిత్తము = మనస్సుల; అందున్ = లోపల; కోరరు = కోరుకొనరు; హసించియు = నవ్వులకైనా; లోకుల = లోకుల; కున్ = కు; ఎల్లన్ = సమస్తమైన; అర్థ = ధన; సంపత్తియున్ = సంపదను; భూతియున్ = వైభవమును; సుఖమున్ = సౌఖ్యమును; భద్రమున్ = క్షేమమును; కోరుదురు = వాంఛింతురు; అన్య = ఇతరులను; రక్షణ = రక్షించుట అనే; అతి = మిక్కిలి;

ఉత్తమము = ఉత్తమము; ఐన = అయినట్టి; మేనున్ = శరీరము; విభుఁడు = రాజు; ఊరక = ఊరికే; ఏల = ఎందుకు; విరక్తిన్ = వైరాగ్యముతో; పాసెనో = విసర్జించెనో.

భావము:- అత్యుత్తమ కీర్తి ప్రతిష్ఠలు కల మానవోత్తములు నవ్వులాటకైనా ఆత్మ సుఖాన్ని అంతరాత్మలోనైనా అభిలషించరు; అట్టి వారు ఎల్లప్పుడూ లోకంలో అందరికీ అర్థసంపద, ఐశ్వర్యం, సౌఖ్యం, శ్రేయస్సు చేకూర్చాలని ఆకాంక్షిస్తూ ఉంటారు; పరోపకార పారీణమైన తన దేహాన్ని ఆ ప్రభువరేణ్యుడు ఆవిధంగా ప్రాయోపవేశం చేసి ఎందుకు పరిత్యజించాడో?

1-81-క.

సారముల నెల్ల నెఱుగుదు

పారగుఁడవు భాషలందు బహువిధ కథనో

దారుఁడవు మాకు సర్వముఁ

బారము ముట్టంగఁ దెలియఁబలుకు మహాత్మా!"

టీక:- సారములన్ = సారాంశములను; ఎల్లన్ = సమస్తమును; ఎఱుగుదు = తెలిసికొన్నవాడివి; పారగుఁడవు = పారంగతుడవు; భాషలు = వ్యాఖ్యానముల; అందున్ = లో; బహు = అనేక; విధ = విధములైన; కథన = కథలు చెప్పుటలో; ఉదారుఁడవు = ఉదారముగా ఉండువాడవు; మాకు = మాకు; సర్వమున్ = అన్నీ; పారము = మూలము; ముట్టంగన్ = చిక్కునట్లుగ; తెలియన్ = తెలియునట్లుగ; పలుకుము = చెప్పుము; మహా = గొప్ప; ఆత్మా = ఆత్మ కలవాడా.

భావము:- ఓ మహానుభావా! సూతా! నీవు సమస్త గ్రంథాల సారం తెలిసినవాడివి; భాషణలు అన్నీ బాగా తెలిసినవాడివి; అనేక విధాల కథలను చక్కగా చెప్పటంలో మిక్కిలి నేర్పరివి; ఇప్పుడు మేము అడిగిన విషయాలన్ని, ఆ మూలాగ్రంగా మాకు సవివరంగా వివరించు."

## వ్యాసచింత

1-82-వ.

అని యడిగిన, శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ"దృతీయంన ద్వాపర యుగంబు దీఱు సమయంబున నుపరిచరవసువు వీర్యం బున జన్మించి, వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి, విజ్ఞానియయిన వేద వ్యాసుండు జన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీనదీజలంబుల స్నానాది కర్మంబులం దీర్చి శుచియై, పరులు లేనిచోట నొంటిఁగూర్చుండి సూర్యో దయవేళ నతీతానాగతవర్త మానజ్ఞుం డయిన యా ఋషి వ్యక్తంబుగానివేగంబు

**గలకాలంబునంజేసి యుగధర్మం బులకు భువిసాంకర్యంబువొందు; యుగ యుగంబుల భౌతికశరీరంబులకు శక్తిసన్నం బగుఁ బురుషులు నిస్స త్త్వులు, ధైర్యశూన్యులు, మందప్రజ్ఞు, లల్పాయువులు, దుర్బలులు, నయ్యెదరని, తన దివ్యదృష్టింజూచి, సర్వ వర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి, నలుగురు హోతల చేత ననుష్ఠింపం దగి ప్రజలకు శుద్ధికరంబులైన వైదికకర్మంబులగు, యజ్ఞంబులెడతెగకుండుకొఱకు నేకంబయిన వేదంబు, ఋగ్యజుస్సా మాధర్వ ణంబులను నాలుఁగునామంబుల విభాగించి, యితిహాస పురాణంబు లన్నియుఁ బంచమవేదం బని పల్కె నందు.**

టీక:- అని = ఆవిధంగ; అడిగిన = అడుగినప్పుడు; శౌనక = శౌనకుడు; ఆది = మొదలగు; ముని = మునులలో; శ్రేష్ఠుల = శ్రేష్ఠమైనవారల; కున్ = కు; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను; తృతీయంబు = మూడవది; ఐన = అయినట్టి; ద్వాపరయుగంబు = ద్వాపర యుగము; తీఱు = పూర్తియగు; సమయంబునన్ = సమయములో; ఉపరిచర = ఉపరిచరుడు అను; వసువు = వసువుయొక్క; వీర్యంబునన్ = వీర్యమునందు; జన్మించి = పుట్టిన; వాసవి = వాసవి; నాఁదగు = నామముకలదైన; సత్యవతి యందున్ = సత్యవతికి; పరాశరు = పరాశర ఋషి; కిన్ = కి; హరి = హరియొక్క; కళన్ = అంశ; చేసి = చేత; విజ్ఞాని = విజ్ఞాని; అయిన = అయినట్టి; వేద = వేదములకు సంబంధించిన; వ్యాసుండు = వ్యాసుడు; జన్మించి = అవతరించి; ఒక్క = ఒక; నాడు = దినమున; బదరిక = బదరిక అను (బదరిక = రేగి చెట్లు); ఆశ్రమంబున = ఆశ్రమములో; సరస్వతీ = సరస్వతీ; నదీ = నదియొక్క; జలంబులన్ = నీటిలో; స్నాన = స్నానము; ఆది = మొదలగు; కర్మంబులన్ = పనులను; తీర్చి = పూర్తిచేసి; శుచి = శుభ్రముగను; ఐ = అయి; పరులు = ఇతరులు; లేని = లేని; చోటన్ = ప్రదేశమున; ఒంటిన్ = ఒంటరిగ; కూర్చుండి = కూర్చుని; సూర్యోదయ = ఉదయపు; వేళన్ = సమయములో; అతీత = జరిగినది, భూత; అనాగత = జరుగబోవునది, భవిష్య; వర్తమాన = జరుగుచున్నది, వర్తమాన; అజ్ఞుండు = తెలిసినవాడు; అయిన = అయినట్టి; ఆ = ఆ; ఋషి = ఋషి; వ్యక్తంబు = తెలియ; కాని = రానంత; వేగంబు = వేగము; కల = కలిగిన; కాలంబునన్ = కాలమున; చేసి = చేసి; యుగ = యుగములయొక్క; ధర్మంబులు = ధర్మముల; కున్ = కు; భువి = భూమిని; సాంకర్యంబున్ = సంకరత్వము, కల్తీ; పొందున్ = కలుగును; యుగయుగంబులన్ = యుగయుగాలకి; భౌతిక = భూతములకు సంబంధించిన; శరీరంబులు = (జీవుల) శరీరములు; కున్ = కు; శక్తి = బలము; సన్నంబు = తక్కువ; అగున్ = అగును; పురుషులు = మానవులు; నిస్సత్త్వులు = సత్తువలేనివారు; ధైర్యశూన్యులు = ధైర్యము లేనివారు; మందప్రజ్ఞులు = సామర్థ్యము మందగించినవారు; అల్పాయువులు = అల్పమైన ఆయువు గలవారు; దుర్బలులు = బలము తక్కువ గలవారును; అయ్యెదరు = పుట్టెదరు; అని = అని; తన = తనయొక్క; దివ్యదృష్టిన్ = దివ్యదృష్టితో; చూచి = గమనించి; సర్వ = సమస్త; వర్ణ = నాలుగు వర్ణాలకు {చాతుర్వర్ణములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర}; ఆశ్రమంబులు = నాలుగు ఆశ్రమాల {చాతురాశ్రమములు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస} ; కున్ = కు; హితంబున్ = మేలు;

సేయన్ = చేయాలి అని; తలంచి = తలచి; నలుగురు = నలుగురు; హోతలు = హోమము చేయు వారల; చేతన్ = చేత; అనుష్ఠింపన్ = నిర్వహించుటకు; తగి = తగినట్టి; ప్రజలు = లోకులు; కున్ = కు; శుద్ధి = పరిశుద్ధి; కరంబులు = కలుగజేయునవి; అయిన = అయినట్టి; వైదిక = వేద; కర్మంబులు = కర్మములు; అగు = అయినట్టి; యజ్ఞంబులు = యజ్ఞములు; ఎడతెగక = ఆగకుండగ; ఉండు = ఉండుట; కొఱకున్ = కోసము; ఏకంబు = అవిభక్తము; ఐన = అయిన; వేదంబున్ = వేదమును; ఋక్ = ఋగ్వేదము; యజుస్ = యజుర్వేదము; సామ = సామవేదము; అధర్వణంబులు = అధర్వణవేదములు; అను = అను; నాలుఁగు = నాలుగు; నామంబులన్ = పేర్లతో; విభాగించి = విభజించి; ఇతిహాస = ఇతిహాసములు; పురాణంబులు = పురాణములు; అన్నియున్ = అన్నిటిని కలిపి; పంచమవేదంబు = పంచమ వేదము; అని = అని; పల్కెన్ = పలికెను; అందున్ = వాటిలో.

భావము:- అలా అడుగుతున్న శౌనకాది మునీంద్రులతో సూతమహర్షి ఇలా చెప్పసాగాడు "మూడో యుగమైన ద్వాపరం పూర్తి అవుతున్న సమయంలో ఉపరిచర వసువు వీర్యం వల్ల ఉద్భ వించి వాసవి అనబడే సత్యవతికి పరాశరుని వల్ల నారాయణాంశతో వేదవ్యాసుడు జన్మించాడు. ఒకనాడు ఆయన బదరికాశ్రమంలో, సరస్వతీనదిలో స్నానాది నిత్యకృత్యాలు పూర్తిచేసుకొని శుచియై, సూర్యోదయ సమయంలో ఏకాంతస్థలంలో ఒంటరిగా కూర్చున్నాడు. భూత భవిష్య ద్వర్తమానాలు తెలిసిన ఆ మహర్షి అవ్యక్తమైన కాల వేగానికి లోకంలో యుగ ధర్మాలు సాంకర్యం పొందుతాయని, పాంచ భౌతిక శరీరాలకు శక్తి సన్నగిల్లుతుందని, మానవులు సారహీనులు, ధైర్యరహితులు, మంద బుద్ధులు, అల్పాయుష్కులు, దుర్బలులు అవుతారనీ తన దివ్య దృష్టితో తెలుసుకొన్నాడు. అన్ని వర్ణాలకి, అన్ని ఆశ్రమాలకి మేలు కలిగించాలనే ఆశయంతో హోత, ఉద్గాత, అధ్వర్యుడు. బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కులచే అనుష్ఠింపదగి ప్రజలకు క్షేమం చేకూర్చే వైదికకర్మలైన యజ్ఞాలు నిరంతరం అవిచ్ఛిన్నంగా సాగటం కోసం ఒకటిగా ఉన్న వేదాన్ని ఋక్కు, యజస్సు, సామము, అథర్వణము అనే నాలుగు వేదాలుగా విభజించాడు. ఇతిహాస పురాణాలన్నీ కలిపి పంచమ వేదంగా పేర్కొన్నాడు.

1-83-సీ.

పైలుండు ఋగ్వేద పఠనంబు దొరఁకొనె,-
సామంబు జైమిని సదువుచుండె,
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ,-
దుది నథర్వము సుమంతుఁడు పఠించె,
నఖిల పురాణేతిహాసముల్ మా తండ్రి-
రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ,
దమతమ వేద మా తపసులు భాగించి-
శిష్యసంఘములకుఁ జెప్పి రంత

1-83.1-తే.

శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల
కంత బహుమార్గములు సెప్పి యనుమతింపఁ;
బెక్కుశాఖలు గలిగి యీ పృథివిలోన
నిగమ మొప్పారె భూసుర నివహమందు.

టీక:- పైలుండు = పైలుడు; ఋగ్వేద = ఋగ్వేదము యొక్క; పఠనంబు = చదువుకొనుట; దొరఁకొనెన్ = పూనుకొన్నాడు; సామంబు = సామవేదము; జైమిని=జైమిని; సదువుచున్ =పఠిస్తూ; ఉండెన్ = ఉన్నాడు; యజువు = యజుర్వేదము; వైశంపాయన = వైశంపాయనుడు; ఆఖ్యుండు = అనుపేరు గలవాడు; కైకొనెన్ = తీసుకొన్నా; తుదిన్ = చివరకు; అధర్వంబు = అధర్వణవేదము; సుమంతుఁడు = సుమంతుడు; పఠించెన్ = చదువుకొన్నాడు అఖిల = సమస్తమైన; పురాణ = పురాణములు; ఇతిహాసముల్ = ఇతిహాసములు; మా = మా; తండ్రి = తండ్రి; రోమహర్షణుఁడు = రోమహర్షణుడు; నిరూఢిన్ = నిష్ఠగా; తాల్చెన్ = ధరించాడు; తమతమ = వారివారి; వేదము = వేదములను; ఆ = ఆ; తపసులు = తాపసులు; భాగించి = విభజించి; శిష్య = శిష్యులయొక్క; సంఘములు = సమూహములు; కున్ = కు; చెప్పిరి = బోధించారు; అంతన్ = అంతట; శిష్యులు = శిష్యులు; ఎల్లను = అందరును; ఆత్మీయ = తమయొక్క; శిష్యజనులు = శిష్యులు; కున్ = కు; అంత = అంతట; బహు = పెక్క; మార్గములు = విధములు; చెప్పి = చెప్పి; అనుమతింపన్ = అనుమతింపగా; పెక్కు = అనేక; శాఖలు = శాఖలు; కలిగి = ఏర్పడి; ఈ = ఈ; పృథివి = భూప్రపంచము; లోనన్ = లోపల; నిగమము = వేదము; ఒప్పారెన్ = ప్రకాశించెను; భూసుర = బ్రాహ్మణుల; నివహమందు = సమూహములో.

భావము:-పైలుడు ఋగ్వేదాన్ని చదవటం మొదలు పెట్టాడు. జైమిని సామవేదం చదువసాగాడు. వైశంపాయనుడు యజుర్వేదాన్ని అధ్యయనం చేయటం మొదలు పెట్టాడు. సుమంతుడు అథర్వ వేదాన్ని ఆరంభించాడు. మా తండ్రిగారైన రోమహర్షణుడు పట్టుదలతో సమస్త పురాణాలూ, ఇతిహాసాలూ పఠించటం ప్రారంభించాడు. ఇలా తాము నేర్చుకొన్న వేదాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ ఆ తపోధనులు తమ శిష్యులకు వేరువేరుగా విభజించి చెప్పారు. ఆ శిష్యు లందయా తమ తమ శిష్యులకు అనేక విధాలూగా ఉపదేశించారు. అలా వేదం భూమి మీద అనేక శాఖలతో బ్రాహ్మణ సమాజంలో ప్రకాశించింది.

1-84-వ.

ఇట్లు మేధావిహీనులయినపురుషులచేత నట్టివేదంబులు ధరియింపబడుచున్నవి; మఱియు దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విననర్హంబులుగావుగావున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానం బుచేసియు నమ్ముని భూతహితంబునందుఁ దనహృదయంబు సంతసిం పకున్న సరస్వతీతటంబున నొంటియుండి, హేతువువితర్కించుచుఁ దనలో నిట్లనియె.

టీక:- ఇట్లు = ఈవిధముగ; మేధా = ప్రజ్ఞ; విహీనులు = లేనివారు; అయిన = అయినట్టి; పురుషులు = మానవులు; చేతన్ = చేత; అట్టి = అట్టి; వేదంబులు = వేదములు; ధరియింపబడుచున్ = స్వీకరింపబడుతూ; ఉన్నవి = ఉన్నవి; మఱియున్ = ఇంకను; దీన = దీనులందు; వత్సలుండు = దయగలవాడు; అయిన = అయినట్టి; వ్యాసుండు = వ్యాసుడు; స్త్రీ = స్త్రీలకు; శూద్రులు = శూద్రులు; కున్ = కును; త్రై = మూడు; వర్ణిక = వర్ణములలోని; అధములు = అధములు; కున్ = కున్; వేదంబులు = వేదములు; వినన్ = వినుటకు; అర్హంబులు = సమర్థంబులు; కావు = కావు; కావునన్ = అందువలన; మూఢులు = మూఢులు; కున్ = కు; ఎల్లన్ = అందరికిని; మేలు = మేలు; అగును = కలుగును; అని = అని; భారత = భారతము; ఆఖ్యానంబు = రచన; చేసియున్ = చేసినప్పటికిని; ఆ = ఆ; ముని = ముని; భూత = జీవులకు; హితంబు = మేలు చేయుట; అందున్ = లో; తన = తనయొక్క; హృదయంబు = హృదయము; సంతసింపక = సంతోషింపకుండా; ఉన్న = ఉండగా; సరస్వతీ = సరస్వతీనదియొక్క; తటంబునన్ = ఒడ్డుమీద; ఒంటి = ఒంటరిగా, ఏకాంతముగ; ఉండి = నిలిచి; హేతువు = కారణము; వితర్కించుచున్ = చింతించుచు; తనలోన్ = తనలోతాను, స్వగతంగా; ఇట్లు = ఈవిధంగా; అనియెన్ = అనుకొన్నాడు.

భావము:- ఈ విధంగా వేదములు విభజింపబడి మందబుద్ధు లైన మానవులచే పఠింపబడుతూ ఉన్నాయి. బ్రహ్మ బంధువులు, స్త్రీలు, శూద్రులు, వేద శ్రవణానికి సమర్థులు కారు కనుక, సామాన్యు లందరికీ క్షేమం కలగాలని దీనవత్సలుడైన వ్యాసభగవానుడు మహాభారతాన్ని రచించాడు. అయినప్పటికీ విశ్వశ్రేయస్సు కోసం తాను చేసిన కృషిలో ఆయన హృదయం సంతుష్టి చెందలేదు. అందువల్ల ఆ మహర్షి సరస్వతీ నదీతీరంలో ఏకాంతంగా కూర్చుండి తన అసంతుష్టికి కారణం ఏమిటా అని ఆలోచించసాగాడు.

1-85-సీ.

"వ్రతధారినై వేదవహ్ని గురుశ్రేణి-
మన్నింతు, విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడుపుదు, భారతమిషమునఁ-
బలికితి వేదార్థభావ మెల్ల,
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లందుఁ-
దెలిపితి నేఁజెల్ల, దీనఁ జేసి
యాత్మ సంతస మంద, దాత్మలో నీశుండు-
సంతసింపక యున్న జాడ దోఁచె,

1-85.1-ఆ.

హరికి యోగివరుల కభిలషితంబైన

భాగవత విధంబుఁ బలుకనైతి

మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి"

ననుచు వగచుచున్న యవసరమున.

టీక:- వ్రతధారిని = నిష్ఠలో నున్న వానిగ; ఐ = అయ్యి; వేద = వేదముల {వేదములు - 4 ఋక్ ,యజు, సామ, అధర్వణ వేదములు}; వహ్ని = అగ్నుల {త్రేతాగ్నులు - 1ఆహవనీయము 2దక్షిణాగ్ని, 4గార్హపత్యము}; గురు = గురువుల {గురువులు - కన్నతండ్రి, పెంచినతండ్రి, ఉపాధ్యాయుడు, బృహస్పతి, కులముపెద్ద, తండ్రితోడ పుట్టిన వాడు, తాత, అన్న, మామ, మేనమామ, రాజు, కాపాడినవాడు.}; శ్రేణి = సమూహమును; మన్నింతున్ = గౌరవింతును; విహిత = వేదములలో విధింపబడిన; కర్మములన్ = పనులలో; కొఱఁత = లోపము; పడకుండన్ = లేకుండా; నడుపుదు = నడిపిస్తాను; భారత = భారతమనే; మిషమునన్ = వంకతో; పలికితి = వెల్లడించితిని; వేద = వేదములయొక్క; అర్థ = ప్రయోజనము; భావము = సారాంశము; ఎల్లన్ = అంతటిని; మునుకొని = పూనుకొని; స్త్రీ = స్త్రీలకు; శూద్ర = శూద్రులకు; ముఖ్య = ముఖ్యమైన; ధర్మములు = ధర్మములు; అందున్ = అందులో; తెలిపితిన్ = తెలియ జేసితిని; నేన్ = నేను; చెల్లన్ = చెలఁగి, ఉత్సాహముతో; దీనఁన్ = దీని; చేసి = వలన; ఆత్మ = ఆత్మ; సంతసము = సంతోషము; అందదు = పొందదు; ఆత్మ = ఆత్మ; లోన్ = లోని; ఈశుండున్ = ఈశ్వరుడు; సంతసింపక = సంతోషింపకుండగ; ఉన్న = ఉన్న; జాడన్ = విధముగ; తోఁచెన్ = తోచుచున్నది;

హరి = శ్రీహరి; కిన్ = కి; యోగి = యోగులలో; వరులు = శ్రేష్ఠులు; కున్ = కు; అభిలషితంబు = అత్యంత ప్రియము; ఐన = అయినట్టి; భాగవత = భాగవతము యొక్క {భాగవతము - భగవంతునికి సంబంధించినదైన}; విధంబున్ = విషయమును; పలుకన్ = వివరింపలేని వాడను; ఐతిన్ = అయితిని; మోసము = ప్రమాదము; అయ్యెన్ = జరిగెను; తెలివి = తెలివి; మొనయదు = చేకూరలేదు; మఱచితిన్ = మరచిపోయితిని; అనుచు = అనుకొనుచు; వగచుచున్న = బాధపడుతున్న; అవసరమునన్ = సమయములో.

భావము:- “దీక్ష చేపట్టిన వాడినై, వేదాలను విభజించాను. అగ్నులను అర్చించాను. ఆచార్యులను గౌరవించాను. శాస్త్రోక్తాలైన కర్మలన్నీ ఏ మాత్రం లోపం లేకుండా నడుపుతున్నాను. వేదాల్లోని అర్థాన్నంతా మహాభారత రూపంలో వెల్లడించాను. ఈ రూపంగా స్త్రీలు శూద్రాదులు సహితం తమ తమ ధర్మకర్మలు గుర్తించేటట్లు చేశాను. ఇంత చేసినా ఎందుకో గాని నా అంతరాత్మకు సంతోషం కలగటం లేదు. నా మనస్సులో ఉన్న పరమేశ్వరుడు సంతుష్టుడు కానట్లే తోస్తున్నది. కారణం ఏమిటో. అన్నీ చేశాను కాని హరికీ, హరిభక్తులైన పరమ హంసలకూ అత్యంత ప్రియమైన భాగవత స్వరూపాన్ని చెప్పటం మాత్రం మరచిపోయాను. ఎంత పొరపాటు చేశాను ఎంత తెలివి తక్కువ పని చేశాను ఎంతటి విస్మృతి పాలయ్యాను” అని వ్యాసమహర్షి విచారిస్తూ కూర్చున్నాడు.

## నారదాగమనంబు

1-86-సీ.

తన చేతి వల్లకీతంత్రీ స్వనంబున-

సతత నారాయణశబ్ద మొప్ప,

నానన సంభూత హరిగీతరవ సుధా-

ధారల యోగీంద్రతతులు సొక్కఁ,

గపిల జటాభార కాంతిపుంజంబుల-

దిశలు ప్రభాత దీధితి వహింపఁ,

దనులగ్న తులసికా దామగంధంబులు-

గగనాంతరాళంబు గప్పికొనఁగ,

1-86.1-ఆ.

వచ్చె మింటనుండి వాసవీనందను

కడకు మాటలాడఁ గడఁకతోడ,

భద్రవిమలకీర్తిపారగుఁ, డారూఢ

నయవిశారదుండు, నారదుండు.

టీక:- తన = తన; చేతి = చేతిలో ఉండే; వల్లకీ = వీణ; తంత్రీ = తీగల; స్వనంబునన్ = శబ్దమువలన; సతత = ఎడతెగని; నారాయణ = నారాయణ యనే; శబ్దము = శబ్దము; ఒప్పన్ = అలంకరింపగా; ఆనన = నోటి నుంచి; సంభూత = వెలువడే; హరి = విష్ణువు యొక్క; గీత = పాటల; రవ = ధ్వని (యనే); సుధా = అమృత; ధారలన్ = ధారల వలన; యోగ = యోగులలో; ఇంద్ర = శ్రేష్ఠమైనవారి; తతులు = సమూహము; సొక్కన్ = పరవశించగ; కపిల = కపిల (రాగి) రంగుతో; జటా = జడల; భార = చుట్టల యొక్క; కాంతి = కాంతి; పుంజంబులన్ = సమూహములతో; దిశలు = దిక్కులు; ప్రభాత = ఉదయపు; దీధితి = వెలుగు; వహింపన్ = నింపుకొనగ; తను = శరీరమున; లగ్న = ధరింపబడిన; తులసికా = తులసి; దామ = దండ యొక్క; గంధంబులు = సువాసనలు; గగన = ఆకాశము; అంతరాళంబున్ = లోపలంతా; కప్పుకొనఁగ = వ్యాపించగ;

వచ్చెన్ = వచ్చెను; మింట = ఆకాశము; నుండి = నుండి; వాసవీనందను = వాసవి యొక్క {వాసవీనందనుడు – వాసవి యొక్క పుత్రుడు, వ్యాసుడు}; కడ = దగ్గర; కున్ = కు; మాటలాడన్ = మాట్లాడాలనే; గడఁక = ఉద్దేశ్యము; తోడన్ = తో; భద్ర = క్షేమము; విమల = నిర్మలము యైన; కీర్తి = కీర్తి; పారగుఁడు = పొందినవాడు; ఆరూఢ = ప్రసిద్ధమైన; నయ = మేలైన; విశారదుండు = విద్వాంసుడు; నారదుండు = నారదుడు; కనియెన్ = చూసాడు; నారదుఁడు = నారదుడు.

భావము:- ఆ సమయంలో తన చేతిలో ఉన్న మహతి అనే వీణ తీగలో నుంచి నారాయణ నామం నిరంతరంగా ప్రతిధ్వనిస్తూ ఉండగా, నోటివెంట వెలుపడే హరినామ సంకీర్తనం అనే అమృత ప్రవాహంలో మహాయోగులందరూ పరవశించిపోతు ఉండగా, బంగారు రంగు జటాజూట కాంతి సమూ హాలకు దిక్కులన్నీ ప్రభాత కాంతులతో మెరుస్తుండగా, ఒంటినిండా ధరించిన తులసిమాలల సుగంధాలు ఆకాశం నిండా వ్యాపిస్తుండగా ముల్లోకాలలో అఖండమైన పేరు ప్రతిష్ఠలు గలవాడు, సకల శాస్త్రపురాణ విశారదుడు ఐన నారదుడు వ్యాసుని దగ్గరకు ఆకాశ మార్గాన వచ్చాడు.

1-87-క.

కనియెన్ నారదుఁ డంతన్

వినయైక విలాసు, నిగమ విభజన విద్యా

జనితోల్లాసున్, భవదుః

ఖనిరాసున్, గురుమనోవికాసున్, వ్యాసున్.

టీక:- కనియెన్ = చూసాడు; నారదుఁడు = నారదుడు; అంతన్ = అంతట; వినయ = వినయముతో; ఏక = కూడిన; విలాసు = నడవడిక కలిగినవాడిని; నిగమ = వేదములను; విభజన = విభజించు; విద్యా = విద్యవలన; జనిత = పుట్టిన; ఉల్లాసున్ = ఉల్లాసము గలవాడిని; భవ = సంసారపు; దుఃఖ = దఃఖములను; నిరాసున్ = తిరస్కరించినవాడిని; గురు = అధికముగ; మనస్ = మనస్సు; వికాసున్ = వికసించినవాడిని; వ్యాసున్ = వ్యాసుని.

భావము:- అలా వచ్చిన నారదమహర్షి వినయశీలుడూ, వేదాలను విభజించిన ఉల్లాసం కలవాడు, సంసార దుఃఖం లేనివాడూ, మనోవిజ్ఞానం పూర్తిగా కలిగినవాడూ అయిన వ్యాసమునీంద్రుణ్ణి చూసాడు.

1-88-వ.

ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు విధివత్ క్రమం బునం బూజించిన, నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికా తంత్రి వ్రేల మీటుచు నిట్లనియె.

టీక:- ఇట్లు = ఈవిధముగా; నిజ = తన; ఆశ్రమంబు = ఆశ్రమము; కున్ = కు; వచ్చిన = వచ్చినట్టి; నారదున్ = నారదుని; ఎఱింగి = గమనించి; లేచి = లేచి; వ్యాసుండు = వ్యాసుడు; విధివత్ క్రమంబునన్ = యధావిధిగా; పూజించినన్ = పూజించగా; అతండు = అతడు; లేనగవున్ = లేతనవ్వు; ఎగడెడి = మొలచు; మొగంబు = ముఖము; తోడన్ = తో; విపంచిక = వీణ; తంత్రి = తీగలు; వ్రేల = వేలుతో; మీటుచున్ = మీటుచు; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా తన ఆశ్రమానికి విచ్చేసిన నారదుడిని చూసి, లేచి వ్యాసుమహర్షి యథావిధిగా పూజించాడు. అప్పుడు నారదుడు మధుర మందహాస సుందర వదనారవిందంతో మహతీవిపంచిని మెల్లగా మీటుతూ ఇలా ప్రశ్నించాడు.

1-89-ఉ.

"ధాతవు, భారతశ్రుతివిధాతవు, వేదపదార్థజాతవి
జ్ఞాతవు, కామముఖ్యరిపుషట్కవిజేతవు, బ్రహ్మతత్త్వని
ర్ణేతవు, యోగినేతవు, వినీతుఁడ వీవు చలించి చెల్లరే!
కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి? పరాశరాత్మజా!"

టీక:- ధాతవు = బ్రహ్మ దేవుడివి; భారత = భారతమనే; శ్రుతి = వేదము; విధాతవు = సృష్టించిన వాడివి; వేద = వేదము లందలి; పదార్థ = విషయముల నుండి; జాత = పుట్టిన; విజ్ఞాతవు = విజ్ఞానము కలవాడివి; కామ = కామము {అరిషడ్వర్గములు - 1కామము 2క్రోధము 3లోభ 4మోహ 5మద 6మాత్సర్యములు; ముఖ్య = మొదలగు; రిపు = శత్రు; షట్క = షట్కమును (6); విజేతవు = జయించినవాడివి; బ్రహ్మ = బ్రహ్మజ్ఞానము యొక్క; తత్త్వ = స్వభావమును; నిర్ణేతవు = నిర్ణయించిన వాడవు; యోగి = యోగులలో; నేతవు = నాయకుడవు; వినీతుఁడవు = జితేంద్రియుడవు; ఈవు = నీవు; చలించి = చలించి పోయి; చెల్లరే = తగునా; కాతరు = దీనుని; కైవడిన్ = వలె; వగవన్ = దుఃఖ పడుటకు; కారణము = కారణము; ఏమి = ఏమిటి; పరాశరాత్మజా = వ్యాసా {పరాశరాత్మజుడు - పరాశరుని పుత్రుడు, వ్యాసుడు}.

భావము:- "పరాశరుని పుత్రుడా! వ్యాసమునీంద్రా! నీవు బ్రహ్మదేవుడివి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాల్ని జయించిన వాడివి. పరబ్రహ్మ తత్త్వాన్ని నిర్ణయించిన వాడివి, యోగులలో అగ్రేసరుడివి, వినయసంపన్నుడివి. ఇటువంటి నీవు ఈ విధంగా చలించిపోయి పిరికివాడి లాగ విచారించటం ఆశ్చర్యంగా ఉంది. కారణమేమిటయ్యా?"

1-90-వ.

అనినఁ బారాశర్యుం డిట్లనియె.

టీక:- అనినన్ = అని పలికిన; పారాశర్యుండు = వ్యాసుడు {పారాశర్యుడు - పరాశరుని పుత్రుడు, వ్యాసుడు}; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అలా అడిగిన నారదమహర్షితో వ్యాసమహర్షి ఇలా అన్నాడు.

1-91-క.

"పుట్టితి వజు తనువునఁ, జే
పట్టితివి పురాణపురుషు భజనము, పదముల్
మెట్టితివి దిక్కులం, దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా!

టీక:- పుట్టితివి = జన్మించావు; అజు = బ్రహ్మయొక్క; తనువునన్ = శరీరము వలన; చేపట్టితివి = స్వీకరించావు; పురాణ = పూర్వముల కెల్ల పూర్వమైన; పురుషు = వ్యక్తి – భగవంతుని; భజనము = సంకీర్త నము; పదముల్ = దారులను; మెట్టితివి = దాటావు; దిక్కులన్ = దిక్కులను; తుది = సారాంశము; ముట్టితివి = దర్శించావు; మహా = ఉత్తమమైన; ప్రబోధమునన్ = జ్ఞానమున; ముని = మునులలో; నాథా = శ్రేష్ఠుడా.

భావము:- "నారదమునీంద్రా! నీకు తెలియనిది ఏముంది. బ్రహ్మమానస పుత్రుడవు. శ్రీమన్నారాయణ సంకీర్తనాన్ని స్వీకరించావు. దశదిశలందు తిరిగావు. మహత్తరమైన తత్త్వజ్ఞానంలో అందెవేసిన చేయ్యి అనిపించుకొన్నావు.

1-92-వ.

**అదియునుం గాక, నీవు సూర్యునిభంగి మూఁడు లోకములం జరింతువు; వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి.**

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండా; నీవు = నీవు; సూర్యుని = సూర్యుని; భంగిన్ = వలె; మూఁడు = మూడు; లోకములన్ = లోకములలోను; చరింతువు = తిరుగుతూ ఉంటావు; వాయువు = గాలి; పగిదిన్ = వలె; అఖిల = సమస్త; జనుల = మానవుల మనసుల; లోనన్ = లోను; మెలంగుదువు = మెలగుతూ ఉంటావు; సర్వజ్ఞుండవు = సర్వ జ్ఞానములు గలవాడివి; అగుటన్ = అగుట; చేసి = వలన.

భావము:- అంతేకాకుండా, నీవు సూర్యభగవానుడిలా ముల్లోకాలలోను సంచరిస్తూ ఉంటావు. వాయుదేవుడిలాగా సర్వమానవుల మనస్సులలో మెలగుతూ ఉంటావు. సమస్తమూ తెలిసినవాడివి.

1-93-క.

**నీ కెఱుఁగరాని ధర్మము**
**లోకములను లేదు, బహువిలోకివి నీవున్,**
**నా కొఱఁత యెట్టి దంతయు**
**నాకున్ వివరింపవయ్య నారద! కరుణన్."**

టీక:- నీకు = నీకు; ఎఱుఁగరాని = తెలియని; ధర్మము = ధర్మం; లోకములను = లోకాలలో; లేదు=లేదు; బహు =అనేకవిషయాలు; విలోకివి=దర్శించినవాడవు; నీవున్ = నీవు; నా = నాకు కలిగిన; కొఱఁతన్ = లోపము; ఎట్టిది = ఎటువంటిది; అది = అది; అంతయున్ = అంతా; నాకున్ = నాకు; వివరింపవయ్య = వివరముగాచెప్పుము; నారద = నారదుడా; కరుణన్ = కరుణతో.

భావము:- నారదా! నీకు తెలియని ధర్మం ఏ లోకంలోను లేదు. అనేక విషయాలను దర్శించిన వాడివి. నాకు ప్రాప్తించిన కొరతకి కారణం ఏమిటో అదంతా దయతో నాకు వివరంగా చెప్పు."

1-94-వ.

**అనిన నారదుం డిట్లనియె.**

టీక:-అనిన = అనిపలికిన; నారదుండు=నారదుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నాడు.

భావము:- అని అడిగిన వ్యాసమునీంద్రుడితో నారదుడు ఇలా అన్నాడు.

1-95-ఉ.

"అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక; నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!

టీక:- అంచితము = పూజింప తగినవి; ఐన = అయినట్టి; ధర్మ = ధర్మముల; చయము = సమూహము; అంతయున్ = సమస్తమును; చెప్పితివి = వివరించితివి; అందున్ = వాని; లోనన్ = లో; ఇంచించుక = కొంచెములో కొంచెము; కాని = కూడ; విష్ణు = హరియొక్క; కథలు = కథలు; ఏర్పడన్ = తేటపడునట్లు; చెప్పవు = చెప్పవు; ధర్మముల్ = ధర్మములను; ప్రపంచించిన = వివరణములతో చెప్పిన; మెచ్చునే = మెచ్చుకొనునా; గుణ = గుణముల యొక్క; విశేషములు = విశిష్టతలు; ఎన్నినఁన్ = పొగడుటచే; కాక = కాకుండా; నీకున్ = నీకు; ఈ = ఈ; కొంచెము = లోటు, న్యూనత; వచ్చుట = కలుగుట; ఎల్లన్ = సమస్తమూ; హరిన్ = విష్ణుమూర్తిని; కోరి = కోరి; నుతింపమిన్ = స్తుతింపక పోవుటచేత; ఆర్య = ఆర్యులచే; పూజితా = పూజింపబడువాడా.

భావము:- "ఆర్యులచే పూజితుడా! వ్యాసా! పవిత్రమైన అనేక ధర్మవిశేషాలను నీవు వెల్లడించావు. సరే కానీ, పొరపొ టేమిటంటే దానిలో కొంచెం మాత్రమే విష్ణుకథలు చెప్పావు. చక్కగా సమగ్రంగా చెప్పలేదు. వాసుదేవుని గుణవిశేషాలు వర్ణించి చెప్తే సంతోషించినట్లు, ఎన్ని ధర్మాలు విస్తరించి చెప్పినా భగవంతుడు సంతోషించడు. నీ మనస్సుకు ఈ లోటు రావటానికి కారణం నీవు నీ గ్రంథాలలో హరినామ సంకీర్తనం ప్రధానంగా చేయకపోవటమే.

★1-96-మ.

హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు, శ్రీ
కరమై యుండ; దయోగ్యదుర్మదనదత్కాకోల గర్తాకృతిన్.

టీక:- హరి = శ్రీహరి; నామ = నామములను; స్తుతిసేయు = స్తుతించు; కావ్యము = కావ్యము; సువర్ణ = మంచిరంగుగల, బంగారు; అంభోజ = తామర పూవులు; హంస = హంసల; ఆవళీ = పంక్తులతో; సు = మంచి; రుచి = ప్రకాశముతో; భ్రాజితము = వెలుగుతున్నది; ఐన = అయినట్టి; మానస = మానస; సరస్ = సరోవరము; స్ఫూర్తిన్ = తీరుగ; వెలుంగొందు = ప్రకాశించును; శ్రీహరి = మహావిష్ణువు యొక్క; నామ = నామముల; స్తుతి =

స్తుతించుట; లేని = లేనట్టి; కావ్యము = కావ్యము; విచిత్ర = విశేషముగ చిత్రింపబడిన; అర్థ = అర్థములు; ఆన్వితంబు = కూడుకొన్నది; అయ్యున్ = అయినప్పటికిని; శ్రీకరమై = శుభంకరమై; ఉండదు = ఉండదు; అయోగ్య = యోగ్యముకానిది; దుర్మద = దుర్గంధపూరితమైన; నదత్ = మ్రోతతో కూడుకున్న; కాకోల = బొంతకాకుల; గర్తము = గుంట; ఆకృతిన్ = వలె.

భావము:- పరాశరపుత్రా! వ్యాసా! హరినామ సంకీర్తనంతో ప్రకాశించే కావ్యం బంగారు కమలాలతో, కలహంస పంక్తులతో శోభాయమానమైన మానససరోవరం లాగ విరాజిల్లుతుంది. హరినామ సంకీర్తనం లేని కావ్యం చిత్ర విచిత్రాలైన అర్థాలతో కూడినప్పటికీ అది శుభకరంగా ఉండదు. పైగా కంపుకొడుతూ బొంతకాకుల గోలతో కూడిన చెత్తగుంటలా అయోగ్యమై ఉంటుంది.

★1-97-మ.

అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁ; గావున హరిన్ భావించుచుం, బాడుచున్,
జపముల్ సేయుచు, వీనులన్ వినుచు, నశ్రాంతంబు గీర్తించుచుం,
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ! చింతింపుమా.

టీక:- అపశబ్దంబులన్ = తప్పుమాటలతో; కూడియున్ = కలిసి ఉన్నప్పటికి; హరి = విష్ణుమూర్తి; చరిత్ర = చరిత్రల; ఆలాపముల్ = పలుకులు; సర్వ = సమస్త; పాప = పాపములను; పరిత్యాగమున్ = పూర్తిగ విడిచిపోవుటను; చేయున్ = చేయును; కావున = అందువలన; హరిన్ = విష్ణువుని; భావించుచున్ = ధ్యానము చేస్తూ; పాడుచున్ = (లీలలు) గానము చేస్తూ; జపముల్ = జపాలు; చేయుచున్ = చేయుస్తూ; వీనులన్ = చెవులారా; వినుచున్ = వింటూ; అశ్రాంతంబు = ఎడతెగకుండగ; కీర్తించుచున్ = పొగుడుతూ; తపసుల్ = తాపసులు; సాధులు = మంచివారు; ధన్యులు = సార్థకులు; ఔదురు = ఔతారు; కదా = కదా; తత్త్వజ్ఞ = తత్త్వజ్ఞానము గలవాడా; చింతింపుమా = ఆలోచించుకోవయ్యా.

భావము:- తత్త్వవిశారదా! వ్యాస మునీంద్రా! పవిత్రమైన హరి చరిత్రలు కలిగిన కావ్యాలు తప్పులతో కూడుకొన్నప్పటికీ, సకల పాపాలను పటాపంచలు చేస్తాయి. అందువల్లనే సజ్జనులైన తపోధనులు శ్రీహరిని భావిస్తూ, శ్రీహరి లీలలు గానం చేస్తూ, నామం జపం చేస్తూ, కథలు చెవులారా ఆలకించుట చేస్తూ, ఎప్పుడూ ఆయననే కీర్తిస్తూ తమ జన్మలు సార్థకం చేసుకొంటారు కదా.

1-98-వ.

మునీంద్రా! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తిలేకున్న విశేషంబుగ శోభితంబు గాదు, ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞాన వాచాకర్మ కౌశలంబులు నిరర్థంబులు; గావున, మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకలదిగంత

ధవళకీర్తివి, సత్యరతుం డవు, ధృతవ్రతుండవునగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశే షంబులు భక్తితోడ వర్ణింపుము; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృత రూపనామం బులంజేసి పృథగ్దర్శనుండైనవాని మతి పెను గాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావ చందంబున నెలవు సేర నేరదు; కామ్య కర్మంబు లందు రాగంబు గల ప్రాకృత జనులకు నియమించిన ధర్మంబులుసెప్పి శాసకుండవగు నీవు వగచుట తగ; దది యెట్టులనిన, వారలదియే ధర్మంబని జుగుప్సితంబులగు కామ్య కర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున, బుద్ధిమోహంబు జనియింపక తత్త్వజ్ఞుండవై వ్యథావియోగంబు సేయు"మని మఱియు నిట్లనియె.

టీక:- మునీంద్రా = మునులలో శ్రేష్ఠుడా; నిర్గత = విడచిన; కర్మంబు = కర్మకలది; ఐ = అయి; నిరుపాధికంబు = ఉపాధి లేనిది; ఐన = అయినట్టి; జ్ఞానంబు = జ్ఞానము; హరి = హరి; భక్తి = భక్తి; లేకున్న = లేకపోయినచో; విశేషంబుగ = ప్రత్యేకముగా; శోభితంబు = ప్రకాశించునది; కాదు = కాదు; ఫలంబున్ = ఫలితమును; కోరక = ఆశించక; కర్మంబు = కర్మము; ఈశ్వరు = హరి; కున్ = కి; సమర్పణంబు = సమర్పించుట; చేయక = చేయక; ఉన్నన్ = పోయినచో; అది = అది; ప్రశస్తంబు = మంచిది; ఐ = అయి; ఉండదు = ఉండదు; భక్తి = భక్తి; హీనం బులు = లేనివి; అయిన = అయినట్టి; జ్ఞాన = జ్ఞానములోని; వాచా = వాక్కులోని; కర్మ = కర్మలోని; కౌశలంబులు = నేర్పరితనము; నిరర్థంబులు = ప్రయోజనం లేనివి; కావున = అందువలన; మహా = గొప్ప; అనుభావుండవు = అనుభవము పొందినవాడవు; యథార్థ = సత్యమును; దర్శనుండవు = దర్శించువాడవు; సకల = సమస్త; దిక్ = దిక్కుల; అంత = అంతటు; ధవళ = మెరుస్తున్న, తెల్లని; కీర్తివి = కీర్తి గలవాడవు; సత్య = సత్యమునందు; రతుండవు = ఆసక్తి గలవాడవు; ధృత = ధరించిన; వ్రతుండవున్ = వ్రతముగల వాడవును; అగు = అయినట్టి; నీవు = నీవు; నిఖిల = సమస్త; బంధ = బంధముల; మోచనంబు = విముక్తి; కొఱకున్ = కోసము; వాసుదేవుని = భగవంతుని {వాసుదేవుడు – ఆత్మలో వసించే దేవుడు}; లీలా = లీలలయొక్క; విశేషంబులు = విశేషములు; భక్తి = భక్తి; తోడన్ = తో; వర్ణింపుము = వర్ణింపుము; హరి = హరియొక్క; వర్ణనంబు = వర్ణనము; చేయక = చేయకుండా; ప్రకార = విధములలో, విధానములలో; అంతరంబునన్ = బేధములతోను; అర్థ = అర్థములలో; అంతరంబులు = బేధములను; వీక్షించి = దర్శించి; తత్ = వాటిని; వివక్షా = చెప్పటంకోసం; కృత = చేసిన; రూప = రూపములును; నామంబులన్ = నామములును; చేసి = వలన; పృథక్ = పెక్కు విధములైన, మరల మరల; దర్శనుండు = దృష్టికలవాడు, చూచువాడు; ఐన = అయినట్టి; వాని = వానియొక్క; మతి = బుద్ధి; పెను = ప్రచండమైన (సుడి); గాలి = గాలివీచుట; చేతన్ = చేత; త్రిప్పంబడి = త్రిప్పబడుతూ; తప్పన్ = తప్పిపోయి; చను = వెళ్ళు; నావ = పడవ; చందంబున = వలె; నెలవు = రేవును; సేర = చేరుట; నేరదు = చేయలేదు; కామ్య = ఫలితము ను ఆశించి చేయు; కర్మంబులు = కర్మలు; అందున్ = లో; రాగంబు = ఆసక్తి; కల = కలిగినట్టి; ప్రాకృత = అజ్ఞాన, పామర; జనులు = జనములు; కున్ = కు; నియమించిన = విధించిన; ధర్మంబులు = ధర్మములు; చెప్పి = చెప్పి; శాసకుండవు =

శాసించినవాడవు; అగు = అయినట్టి; నీవు = నీవు; వగచుట = బాధపడుట; తగదు = తగదు; అది = అది; ఎట్టుల = ఏవిధముగా; అనినన్ = అన్నట్లైతే; వారలు = వారు; అదియే = అదే; ధర్మంబు = ధర్మము; అని = అనుకొని; జుగుప్సితంబులు = అసహ్యములు; అగు = అయినట్టి; కామ్య = ఫలితమును ఆశించి చేయు; కర్మం బులు = కర్మలు; చేయుచున్ = చేయుచు; తత్త్వజ్ఞానంబు = తత్త్వజ్ఞానమును; మఱతురు = మరచి పోవుదురు; కావున =అందువలన; బుద్ధిన్=బుద్ధిలో; మోహంబున్= మోహము; జనియింపక = పుట్టకుండగ; తత్త్వ = తత్త్వము యొక్క; అజ్ఞుండవు = జ్ఞానము కలవాడవు; ఐ = అయి; వ్యథా = దుఃఖము యొక్క; వియోగంబు = ఎడబాటును; చేయుము = చేయుము; అని = అని పలికి; మఱియున్ = ఇంకా; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నాడు.

భావము:- వ్యాస మునివర్యా! కర్మవాసన లేనిది, ఆధారం లేనిది అయిన జ్ఞానం విష్ణుభక్తి లేకపోతే విశేషంగా ప్రకాశించదు. ఫలాపేక్షలేని నిష్కామకర్మమయినా భగవదర్పితం కాకపోతే అది ప్రశస్తం కాదు. జ్ఞానం కాని, వాక్కు కాని కర్మకాని అవి యెంత గొప్పవైనను భక్తిలేనినాడు నిరర్థకాలే. అందువల్ల వ్యాసమహర్షీ! నీవు మహానుభావుడవు, సత్యదర్శనుడవు, దిగంత విశ్రాంతమైన కీర్తి కలవాడవు, సత్యనిష్ఠుడవు, నియమ పరాయణుడవు, మానవు లందరికీ భవబంధవిముక్తి కోసం భగవంతుడైన మాధవుని లీలలు భక్తితో విశేషంగా వర్ణించు. వాసుదేవుని వర్ణించని ఘట్టాలన్నిటిలో భావార్థ భేదాలు వెతుక్కుంటూ, ఆయా వివక్షల రూపాలు నామాలు పట్టుకు వేళ్ళాడేవాడి మనసు, ప్రచండమైన వాయువేగానికి ప్రవాహంలో పడి కొట్టుకుపోయే పడవలా రేవు చేరలేదు. కామ్యకర్మలందు ఆసక్తులైన మూఢమానవులకు నియతాలైన ధర్మాలు చెప్పి అనుశాసించటం నీవంటి వానికి తగదు. ఎందుకంటే వారు అదే ప్రధానమని భావించి కలుషితాలైన కామ్యకర్మలకు అలవాటు పడి పరమార్థాన్ని విస్మరిస్తారు. అందువల్ల బుద్ధి పెడదారి పట్టించకుండా వారికి భగవత్తత్త్వాన్ని అందించి వారి వ్యథలు తొలగించు" అని చెప్పి నారదుడు ఇంకా ఇలా పలికాడు.

## 1-99-చ.

"ఎఱిఁగెడువాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱింగి యవ్వలన నేరుపుఁ జూపు; గుణానురక్తుఁడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరలీల లెఱుంగ చెప్పవే.

టీక:- ఎఱిఁగెడు = ఎరుక; వాఁడు = కలవాఁడు; కర్మ = కర్మముల; చయము = సమూహము; ఎల్లను = సమస్తమును; మాని = మానేసి; హరి = హరియొక్క; స్వరూపమున్ = స్వరూపమును; నెఱయన్ = నిండుగ; ఎఱింగి = తెలిసికొని; ఆ = దాని; వలన్ = మూలమున; నేరుపున్ = నేర్పును; చూపు = చూపును; గుణ = గుణములందు; అనురక్తుడు = ఆసక్తి కలిగినవాడు; ఐ = అయి; తెఱకువ = వివేకము; లేక = లేకుండా; క్రుమ్మరుచున్ = తిరుగుచు; దేహ = దేహమును; ధన = ధనమును; ఆది = మొదలగు; అభిమాన = అభిమానము; యుక్తుఁడు = కూడినవాడు; ఐ = అయినప్పటికి; ఎఱుఁగని = తెలియని; వాని = వాని; కిన్; తెలియన్ = తెలియునట్లు; ఈశ్వర = ఈశ్వరుని; లీలలు = లీలలు; ఎఱుంగ = తెలియ; చెప్పవే = చెప్పుము.

భావము:- "మునీంద్రా వ్యాసా ! కామ్యకర్మ లన్నింటినీ పరిత్యజించి ప్రాజ్ఞుడైనవాడు గోవిందుని గుణగణాలందు అనురక్తుడై, హరి స్వరూపాన్ని తెలిసికోవటం కోసం సమర్థమైన ప్రయత్నం చేస్తాడు. అజ్ఞుడైనవాడు వివేకహీనుడై దేహాభిమానం, ధనాభిమానం మొదలైనవి కలవాడై సంచరిస్తూ ఉంటాడు. అటువంటి అజ్ఞానులకి సైతం ఈశ్వరుని లీలావిలాసాలు తెలిసేటట్లుగా నీవు చెప్పాలి.

1-100-చ.

తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
పనివడి సేవ సేసి పరిపాకముఁ బొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన, మఱి మేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా
సినఁ గుల ధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్.

టీక:- తన = తనయొక్క; కుల = కులముయొక్క; ధర్మమున్ = ధర్మమును; విడిచి = విడిచిపెట్టి; దానవ వైరి = విష్ణువు {దానవుల శత్రువు - హరి}; పద = పాదములనే; అరవిందముల్ = పద్మములను; పనిపడి = పని గట్టుకు; సేవ=భక్తి; చేసి = చేసి; పరిపాకమున్ = సిద్ధిని; పొందక = పొందకుండగ; ఎవ్వఁడేనిన్ = ఎవడైనా; చచ్చిన = చనిపోయిన; మఱి = తరువాతి; మేనన్ = జన్మలో (శరీరంలో); ఐనన్ = అయినను; అది = అది; సిద్ధి = సిద్ధి; వహించున్ = పొందును; తదీయ = అతని; సేవన్ = భక్తిని; పాసినన్ = విడిచిన; కుల = కులము; ధర్మ = ధర్మము; గౌరవము = గౌరవము(లతో); సిద్ధి = సిద్ధి; వహించునె = పొందునా; ఎన్ని = ఎన్ని; మేనులన్ = జన్మలకైనా.

భావము:- ఎవడైతే తన కులధర్మాలను వదలిపెట్టినా సరే, గోవింద పదారవిందాలను శ్రద్ధాభక్తులతో సేవిస్తూ కృతార్థుడు కాకుండానే మృతి పొందుతాడో, అట్టివానికి నష్టమేమీకలుగదు. అతడు ఆ జన్మలో కాకపోయినా మరుజన్మలోనైనా తనసేవకు ఫలాన్నిపొందుతాడు. అలాకాకుండా విష్ణుసేవకి దూర మైనవాడు ఎట్టి కులధర్మాలను గౌరవించి ఆచరించినప్పటికీ వాడు ఎన్ని జన్మలెత్తినా కృతార్థుడు కాలేడు.

1-101-వ.

అదిగావున నెఱుకగలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబులయినను హరిసేవ విడువందగదు; దానంజేసి యూర్ధ్వం బున బ్రహ్మ పర్యంతంబు గ్రింద స్థావర పర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు నెయ్యది వొందరా దట్టి మేలు సిద్ధించుకొఱకు హరిసేవ సేయవలయు; హరిసేవకుం డగువాఁడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబునం జిక్కండు; క్రమ్మఱ హరిచరణ స్మరణంబుఁ జేయుచు భక్తిరస వశీకృతుం డయి విడువ నిచ్ఛగింపఁడు; మఱియును.

టీక:- అది = అందు; కావునన్ = వలన; ఎఱుక = జ్ఞానము; కలవాఁడు = ఉన్నవాడు; హరి = హరి; సేవ = భక్తి; కున్ = కి; ప్రయత్నంబు = ప్రయత్నము; చేయన్ = చేయుట; తగున్ = తగును; కాలక్రమంబున = కాలక్రమములో; సుఖ = సుఖమును; దుఃఖములు = దుఃఖమును; ప్రాప్తంబులు = ప్రాప్తములు; అయినను = అయినప్పటికిని; హరి = విష్ణువు యొక్క; సేవ = భక్తి; విడువన్ = విడుచుట; తగదు = తగినదికాదు; దానన్ = దాని; చేసి = వలన; ఊర్ధ్వంబునన్ = పైలోకములందు; బ్రహ్మ = బ్రహ్మము; పర్యంతంబున్ = వరకును; క్రింద = క్రింద; స్థావర = చైతన్యము (కదలిక) లేని జీవుల; పర్యంతంబున్ = వరకును; తిరుగుచున్న = చరించుచున్న; జీవులు = ప్రాణులు; కున్ = కును; ఎయ్యది = ఏదైతే; పొందన్ = పొందుటకు; రాదు = రాదో, కష్టసాధ్యమో; అట్టి = అటువంటి; మేలు = శుభములు; సిద్ధించు = కలుగుట; కొఱకున్ = కోసము; హరి = హరియొక్క; సేవన్ = సేవించుట; సేయవలయు = చేయవలయును; హరి = హరియొక్క; సేవకుండు = భక్తుడు; అగు = అయినట్టి; వాఁడు = వాడు; జననంబున్ = జన్మను; ఒందియున్ = పొందినప్పటికిని; అన్యుని = ఇతరుల; క్రియన్ = వలె; సంసారంబునన్ = సంసారములో; చిక్కండు = చిక్కుకొనడు; క్రమ్మఱన్ = తిరిగి; హరి = హరియొక్క; చరణ = పాదముల; స్మరణంబున్ = సంస్మరణము; చేయుచున్ = చేయుచు; భక్తి = భక్తి; రస = రసమునకు; వశీకృతుండు = పరవశుడు, లొంగినివాడు; అయి; విడువన్ = విడుచుటకు; ఇచ్చగింపఁడు = ఇష్టపడడు; మఱియును = ఇంకనూ.

భావము:- అందువల్ల సత్యం తెలుసుకున్నవాడు శ్రీహరి చరణ సేవాపరాయణుడు కావటా నికి ప్రయత్నం చేయటం మంచిది. కాలానుసారంగా కష్ట సుఖాలు సంప్రాప్తమైనా, శ్రీహరి సేవను విడిచిపెట్టటం తగినపని కాదు. ఆ హరిసేవ వల్ల బ్రహ్మలోకం నుండి స్థావర పర్యంతం పరిభ్రమిస్తున్న జీవులకు పొందశక్యంకాని ఆనందం ఏదైతే ఉందో, అది తప్పకుండా సిద్ధిస్తుంది. శ్రీహరి సేవాపరాయణు డైనవాడు నీచజన్మని పొందినప్పటికీ సంసారబంధాల్లో చిక్కుకోడు. పూర్వజన్మ సంస్కారం వల్ల భక్తి పరవశుడై హరిచరణస్మరణం విడిచిపెట్టకుండా సాగిస్తూనే ఉంటాడు.

1-102-సీ.

విష్ణుండు విశ్వంబు, విష్ణునికంటెను-
వేఱేమియును లేదు విశ్వమునకు
భవవృద్ధిలయము లా పరమేశుచే నగు-
నీ వెఱుంగుదు కాదె నీ ముఖమున
నెఱిఁగింప బడ్డది యేక దేశమున నీ-
భువన భద్రమునకై పుట్టినట్టి
హరికళాజాతుండ వని విచారింపుము,-
రమణతో హరిపరాక్రమము లెల్ల

1-102.1-ఆ.

వినుతిసేయు మీవు; వినికియుఁ, జదువును,
దాన, మతుల నయముఁ, దపము, ధృతియుఁ,
గలిమి కెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ
గమలనాభుఁ బొగడఁ గలిగెనేని.

టీక:- విష్ణుండు = శ్రీహరే; విశ్వంబు = విశ్వము; విష్ణుని = హరి; కంటెను = కంటే; వేఱు = వేరైనది; ఏమియును = ఏమీకూడా; లేదు = లేదు; విశ్వము = విశ్వము; కున్ = కు; భవ = సృష్టి; వృద్ధి = స్థితి; లయములు = లయములు; ఆ = ఆ; పరమేశు = పరమమైన ఈశుని, భగవంతుని; చేన్ = చేతనే; అగున్ = అగును; నీవు = నీవు; ఎఱుంగుదు = తెలియుదువు; కాదె = కదా; నీ = నీ; ముఖమునన్ = నోటిద్వారానే; ఎఱిఁగింపబడ్డది = చెప్ప బడినది; యేకదేశమునన్ = అంశముగ; ఈ; భువన = లోకముల; భద్రమున = క్షేమము; కై=కొరకు; పుట్టినట్టి = అవతరించినట్టి; హరి = హరియొక్క; కళ = అంశతో; జాతుండవు = జన్మించినవాడవు; అని; విచారింపుము = తెలిసికొనుము; రమణ = ప్రీతి; తోన్ = తో; హరి = హరియొక్క; పరాక్రమములు = సామర్థ్యములు; ఎల్లన్ = సమస్తము; వినుతిసేయుము = కీర్తింపుము; ఈవు = నీవు; వినికియున్ = వినుటయు; చదువును = స్తోత్రమును; దానము = దానమును; అతుల = మిక్కిలి; నయమున్ = నీతియు; దపమున్ = తపస్సు; ధృతియున్ = ధైర్యమును; కలిమి = సంపద; కిన్ = కు; ఎల్లన్ = సమస్తమునకు; ఫలము = ఫలితము; కాదె = కాదా; పుణ్యశ్లోకున్ = భగవంతుని {పుణ్యశ్లోకుడు - పుణ్యాత్ములచే కీర్తింపబడువాడు, విష్ణువు}; కమలనాభున్ = భగవంతుని {కమల నాభుడు - కమలము నాభియందు కలవాడు}; పొగడన్ = కీర్తించుట; కలిగెనేని = (చేయ) కలిగితే, జరిగినచో;

భావము:- ఈ విశాల ప్రపంచంలో విష్ణువు కంటె ఇతరమైనది ఏదీ లేదు. ఈ విశ్వమంతా విష్ణుమయం. ఆ పరమేశ్వరుని సంకల్పం చేతనే ఈ ప్రపంచానికి సృష్టి స్థితిసంహారాలు ఏర్పడుతుంటాయి. వ్యాస మహర్షీ! నీవు సర్వజ్ఞుడవు నీకు తెలియనిది ఏముంది. నీవే ఒక చోట ఈ విషయాన్ని చెప్పావు. ఈ విశ్వకల్యాణం కోసం మహావిష్ణువు అంశతో జన్మించావన్న మాట గుర్తు చేసుకో. అందువల్ల నీవు శ్రీహరి లీలావతారాలలోని విక్రమ విశేషాలను స్తుతించు మానవుని జ్ఞానానికీ, అధ్యయనానికీ, ఔదార్యానికీ, అనుష్ఠానానికీ, తపస్సుకూ, ధైర్యానికీ, సంపదకూ ప్రయోజనం పుణ్యశ్లోకుడైన పురుషోత్తముణ్ణి స్తుతించటమే.

## నారదుని పూర్వకల్పము

1-103-వ.

మహాత్మా! నేను పూర్వకల్పంబునం దొల్లిఁటిజన్మంబున వేదవాదులయింటిదాసికిం బుట్టి, పిన్ననాఁడు వారలచేఁబంపంబడి, యొక్క వానకాలంబునఁ జాతుర్మస్యం బుననేకస్థలనివాసంబు సేయ నిశ్చయించు యోగిజనులకుం బరిచర్య సేయుచు.

టీక:- మహా = గొప్ప; ఆత్మా = ఆత్మ కలవాడా; నేను = నేను; పూర్వ = ఇంతకు ముందటి; కల్పంబునన్ = కల్పములో; తొల్లిఁటి = పూర్వ; జన్మంబునన్ = జన్మలో; వేద = వేదము; వాదుల = చదువు వారి; ఇంటి = ఇంటిలో; దాసి = దాసి; కిన్ = కి; పుట్టి = జన్మించి; పిన్ననాఁడు = చిన్నతనమున; వారల = వారి; చేన్ = చేత; పంపంబడి = పంపబడి; ఒక్క = ఒక; వానకాలంబునన్ = వానాకాలమందు; చాతుర్మాస్యంబునన్ = చాతుర్మాస్యదీక్షలో {చాతుర్మాస్యము - యోగులు వర్షాకాలము 4 నెలలు ఒకే ప్రదేశమున ఉండు దీక్ష}; ఏక = ఒకే; స్థల = స్థలములో; నివాసంబున్ = నివాసము; సేయ = చేయుటకు; నిశ్చయించు = నిశ్చయించుకొన్న; యోగి = యోగుల; జనుల = సమూహమున; కున్ = కు; పరిచర్య = సేవ; సేయుచున్ = చేయుచు.

భావము:- మహానుభావా! నేను గడచిన కల్పంలో గత జన్మలో ఒక దాసీపుత్రుణ్ణి. మా అమ్మ వేదవేత్తలైన వారి ఇంటిలో పని చేస్తూ ఉండేది. నన్ను చాతుర్మాస్యాలలో వానాకాలం నాలుగు నెలలూ ఒకే స్థానంలో నివాసం ఏర్పరచుకొనిన కొందరు యోగిజనుల సేవనిమిత్తమై వారు నియమించారు. ఆ పెద్దల ఆనతి శిరసా వహిస్తూ వారికి సేవ చేస్తూ ఉండేవాణ్ణి. ఆ మహానుభావులకు పరిచర్యలు చేసేవాణ్ణి.

1-104-క.

ఓటమితో నెల్లప్పుడుఁ

బాటవమునఁ బనులు సేసి, బాలురతో నే

యాటలకుఁ బోక, యొక జం

జాటంబును లేక, భక్తి సలుపుదు ననఘా!

టీక:- ఓటమి = భయభక్తుల; తోన్ = తో; ఎల్లప్పుడున్ = ఎప్పుడూ; పాటవమునన్ = సామర్థ్యముతో; పనులు = పనులు; చేసి = చేసి; బాలుర = పిల్లల; తోన్ = తో; ఏ = ఏ; ఆటలు = ఆటలు; కున్ = కు; పోక = వెళ్ళకుండా; ఒక = ఒక; జంజాటంబును = బంధమును, తగులమును; లేక = లేకుండా; భక్తి = భక్తి; సలుపుదునన్ = చేయుచుంటిని; అనఘా = పాపములు లేనివాడా.

భావము:- పుణ్యాత్ముడా! ఓర్పుతో నేర్పుతో భయభక్తులతో ప్రవర్తించేవాణ్ణి. తోటిపిల్లలతో ఆటపాటలకు పోకుండా, ఎటువంటి ఇతర సంబంధాలూ పెట్టుకోకుండా శ్రద్ధాభక్తులతో ఆ మహాత్ముల్ని కొలిచేవాణ్ణి.

1-105-క.

మంగళమనుచును వారల

యెంగిలి భక్షింతు, వాన కెండకు నోడన్,

ముంగల నిలుతును నియతిని,

వెంగలి క్రియఁ జనుదు నురు వివేకముతోడన్.

టీక:- మంగళము = శుభము; అనుచును = అంటూ; వారల = వారి; ఎంగిలి = ఎంగిలి; భక్షింతు = తినెదను; వాన = వాన; కున్ = కు; ఎండ = ఎండ; కున్ = కు; ఓడన్ = జంకను; ముంగల = ఎదుట; నిలతును =

నిలిచెదను; నియతిని = నియమముతో; వెంగలి = తెలివిలేనివాని; క్రియన్ = వలె; చనుదున్ = చరించెదను; ఉరు = మిక్కిలి; వివేకము = వివేకము; తోడన్ = తో.

భావము:- నే నా యోగిజనులు భుజించిన అనంతరం భిక్షాపాత్రలలో మిగిలి ఉన్న అన్నాన్ని భక్షించేవాణ్ణి: ఎండని, వానని లేకుండా వారి ముందు నిలబడి, ఎంతో జాగ్రత్తగా మారుమాటడకుండా వారి ఆజ్ఞలు పాలించేవాడిని.

1-106-వ.

ఇట్లేను వర్షాకాలశరత్కాలంబులుసేవించితి; వారును నాయందుఁగృపసేసి రంత.

టీక:- ఇట్లు = ఈవిధముగ; ఏను = నేను; వర్షాకాల = వానాకాలము; శరత్కాలంబులు = శరత్కాలములు; సేవించితిన్ = సేవించితిని; వారును = వారుకూడ; నాయందున్ = నాయందు; కృప = దయ; సేసిరి = చూపిరి; అంత = అంతట;

భావము:- ఈ ప్రకారంగా వర్షాకాలం, శరత్కాలం గడచిపోయాయి. ఆ మహానుభావులకు నా మీద అనుగ్రహం కలిగింది.

1-107-శా.

వారల్ కృష్ణ చరిత్రముల్ చదువఁగా, వర్ణింపఁగాఁ, బాడఁగా,
నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన, మది సంతోషించి నే నంతటం
బ్రారంభించితి విష్ణుసేవ కితరప్రారంభ దూరుండనై.

టీక:- వారల్ = వారు; కృష్ణ = కృష్ణుని; చరిత్రముల్ = చరితములు; చదువఁగా = చదువుచుండగా; వర్ణింపఁగాన్ = వర్ణిస్తుండగా; పాడఁగాన్ = పాడుతుండగా; ఆ = ఆ; రావంబు = శబ్దము, రాగము; సుధా = అమృతపు; రస = రుచితో; ప్రతిమము = సాటిది; ఐ = అయి; అశ్రాంతమున్ = ఎడతెగక; వీనులన్ = చెవులలో; దోరంబు = బలిష్ఠము , అధికము; ఐ = అయి; పరిపూర్ణమైన = నిండిపోవ; మది = మనసున; సంతోషించి = సంతోషించి; నేను = నేను; అంతటన్ = అప్పటినుండి; ప్రారంభించితిన్ = సంకల్పించితిని; విష్ణు = హరియొక్క; సేవ = భక్తి; కిన్ = కి; ఇతర = ఇతరమైన; ప్రారంభ = సంకల్పాలకి; దూరుండను = దూరమైనవానిని; ఐ = అయి.

భావము:- ప్రాజ్ఞులైన ఆ బ్రహ్మజ్ఞులు శ్రీ కృష్ణుని కథలు చదువుతూ, హరి లీలలు వర్ణిస్తు హరినామ సంకీర్తనం చేస్తూ ఉండేవారు. అనుక్షణం ఆ పుణ్యాత్ముల నోటినుండి వెడలి వచ్చే ఆ పలుకులు అమృత రసప్రవాహాలై నా వీనులవిందు చేసేవి. నా హృదయం ఆనందంతో నిండిపోయేది. క్రమక్రమంగా నేను ఇతర విషయా లన్నింటికి స్వస్తి చెప్పి భగవంతుడైన హరిని ఆరాధించటం ఆరంభించాను.

1-108-వ.

ఇట్లుహరి సేవారతింజేసి ప్రపంచాతీతుండనై, బ్రహ్మరూపకుండనయిన నాయందు స్థూలసూక్ష్మంబయిన యీశరీరంబు నిజమాయాకల్పితంబని యెఱింగితి; యమ్మహాత్ము లగు యోగిజనుల మూలం బున రజస్తమోగుణ పరిహారిణి యయిన భక్తి సంభవించె; నంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్ర సేయువార లై; రివ్విధంబున.

టీక:- ఇట్లు = ఈవిధముగ; హరి = హరియొక్క; సేవా = భక్తియందలి; రతిన్ = ఆసక్తి; చేసి = వలన; ప్రపంచ = ప్రకృతికి; అతీతుండన్ = అతీతమైనవాడిని; ఐ = అయి; బ్రహ్మ = పరబ్రహ్మయొక్క; రూపకుండన్ = రూపము దాల్చినవాడను; అయిన = అయిన; నా = నా; అందున్ = అందలి; స్థూల = స్థూలమూ; సూక్ష్మంబు = సూక్ష్మమూ; అయిన = అయినట్టి; ఈ = ఈ; శరీరంబున్ = శరీరము; నిజ = తన; మాయా = మాయచే; కల్పితంబు = కల్పింపబడినది; అని = అని; ఎఱింగితిన్ = తెలిసికొన్నాను; ఆ = ఆ; మహా = గొప్ప; ఆత్ములు = ఆత్మగలవారు; అగు = అయినట్టి; యోగి = యోగుల; జనుల = సమూహము; మూలంబునన్ = వలన; రజస్ = రజోగుణము; తమోగుణ = తమోగుణముల; పరిహారిణి = పరిహరించునది; అయిన = అయినట్టి; భక్తి = భక్తి; సంభవించెన్ = కలిగినది; అంతన్ = అంతలో; చాతుర్మాస్యంబున్ = (వారి) చాతుర్మాస్య దీక్ష; నిండినన్ = పూర్తికాగా; ఆ = ఆ; యోగి = యోగుల; జనులు = సమూహము; యాత్ర = యాత్ర {యాత్ర - యోగుల నియమమును అనుసరించి ఏకస్థలమున ఉండరాదు కనుక వారు చేయు ప్రయాణములు.}; చేయువారలు = చేయువారు; ఐరి = అయినారు; ఈ = ఈ; విధంబునన్ = విధముగ;

భావము:- అప్పుడు నాకు హరి సేవలో అమితమైన ఆసక్తి ఏర్పడింది. అందువల్ల నేను ప్రపంచాతీతుణ్ణి బ్రహ్మ స్వరూపుణ్ణి అయి, యట్టి నా యందు స్థూలం సూక్ష్మం అయిన ఈ శరీరం కేవలం మాయా కల్పితమని తెలుసుకున్నాను. మహానుభావులైన ఆ యోగీంద్రుల అనుగ్రహంవల్ల రజస్తమోగుణాలను రూపుమాపే అచంచల భక్తి నాకు సంప్రాప్తించింది. చాతుర్మాస్య వ్రతం అనంతరం ఆ మహాత్ములు మరొక ప్రదేశానకి వెళ్లటానికి ఉద్యుక్తులైనారు.

1-109-మ.

అపచారంబులు లేక, నిత్యపరిచర్యాభక్తి యుక్తుండనై,
చపలత్వంబును మాని, నేఁ గొలువఁగా సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున, దీనవత్సలతతోఁ, గారుణ్య సంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదారవిజ్ఞానమున్.

టీక:- అపచారంబులు = తప్పులు, పొరపాట్లు; లేక = లేకుండ; నిత్య = ప్రతిదినము; పరిచర్యా = ఉపచారములు; భక్తి; ఉక్తుండను = కూడినవాడను; ఐ = అయి; చపలత్వంబును = చపలతను; మాని = మానివేసి;

నేన్ = నేను; కొలువఁగా = ఆరాధించగా; సంప్రీతులు = సంతోషించినవారు; ఐ; వారు; నిష్కప టత్వంబునన్ = కపటత్వము లేకుండగను; దీన = దీనుల యెడ చూపెడి; వత్సలత = వాత్సల్యము; తోన్ = తో; కారుణ్య = దయ; సంయుక్తులు = తో కూడినవారు; ఐ = అయి; ఉపదేశించిరి = ఉపదేశించిరి; నాకున్ = నాకు; ఈశ్వర = హరియొక్క; రహస్య = రహస్యమైన; ఉదార = చక్కటి; విజ్ఞానమున్ = విజ్ఞానమును.

భావము:- ఈ విధంగా ఎట్టి ఒడుదుడుకులూ రాకుండా, చాంచల్యం లేకుండా ముప్పూటలా భక్తితో ఆరాధించి నందుకు ఆ సాధుపుంగవులు సంప్రీతు లైనారు. ఎంతో సంతోష కారుణ్య వాత్సల్యాలతో అతిరహస్యము, అమోఘము అయిన ఈశ్వరవిజ్ఞానాన్ని ఆ మహాత్ములు నాకు ఉపదేశించారు.

1-110-వ.

ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబు దెలిసితి; నీశ్వ రుని యందు సమర్పితం బయిన కర్మంబు దాప త్రయంబు మానుప నౌషధం బగు; నే ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్యం బా రోగంబు మానుప నేరదు; ద్రవ్యాంతరంబులచేతనైన చికిత్సమానుపనోపు; నివ్విధంబునఁ గర్మంబు లు సంసార హేతుకంబు లయ్యు నీశ్వరార్పితంబు లై తాము తమ్ముఁ జెఱుపుకొన నోపి యుండు; నీశ్వరునియందుఁజేయంబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై, యీశ్వర సంతోషణం బును, భక్తియోగంబునుం బుట్టించు; నీశ్వరశిక్షం జేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణనామ వర్ణన స్మరణంబులు సేయుదురు; ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్నసంకర్షణానిరుద్ధ మూర్తి నామం బులు నాలుగు భక్తింబలికి, నమస్కారం బుసేసి, మంత్రమూర్తియు మూర్తి శూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు.

టీక:- ఏనును = నేనును; వారి = వారి; ఉపదేశంబునన్ = ఉపదేశమువలన; వాసుదేవుని = భగవం తుని {వాసుదేవుడు - ఆత్మలోవసించే దేవుడు}; మాయ = మాయ; అను = అనే; న్ = ను; తెలిసితిన్ = తెలిసి కొంటిని; ఈశ్వరుని = భగవంతుని; అందున్ = ఎడ; సమర్పితంబు = సమర్పింపబడినది; అయిన = అయినట్టి; కర్మంబు = కర్మము; తాప = తాపములు {తాపత్రయములు - ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము.}; త్రయంబు = మూడు; మానుపన్ = మానుపుటకు; ఔషధంబు = ఔషధము, మందు; అగున్ = అగును; ఏ = ఏ; ద్రవ్యంబు = పదార్థము; వలనన్ = వలన; ఏ = ఏ; రోగంబు = రోగము; జనియించెన్ = పుట్టినదో; ఆ = ఆ; ద్రవ్యంబు = పదార్థమునకు; ఆ = ఆ; రోగంబున్ = రోగమును; మానుపన్ = మానుపుటను; నేరదు = చెయ్యలేదు; ద్రవ్య = పదార్థముకంటె; అంతరంబుల = ఇతరమైన వాటి; చేతన్ = చేత; ఐన = అయినట్టి; చికిత్స = వైద్యము; మానుపన్ = మాపునట్లు; ఓపు = చేయగలదు; ఈ = ఈ; విధంబునన్ = విధముగనే; కర్మంబులు = కర్మములు; సంసార = సంసారమునకు; హేతుకంబులు = కారణములు; అయ్యున్ = అయినప్పటికిని; ఈశ్వర = భగవంతునికి; అర్పి

తంబులు = సమర్పింపబడినవి; ఐ =అయి; తాము=తమను; తమ్మున్ = తమనే; చెఱుపుకొనన్ = నశింపచేసికొన; ఓపి = శక్తి కలిగి; ఉండున్ = ఉండును; ఈశ్వరుని = భగవంతుని; అందున్ = ఎడ; చేయంబడు = చేయబడు; కర్మంబు = కర్మము; విజ్ఞాన = విజ్ఞానమునకు; హేతుకంబు = కారణము; ఐ = అయి; ఈశ్వర = భగవంతునికి; సంతోష ణంబును = సంతోషమును; భక్తి = భక్తి; యోగంబునున్ = యోగమును; పుట్టించున్ = పుట్టించును; ఈశ్వర = భగవద్భక్తి వలన; శిక్షన్ = పొందిన నేర్పు; చేసి = వలన; కర్మంబులు = కర్మములు; చేయు = చేయు; వారలు = వారు; కృష్ణ = కృష్ణుని, భగవంతుని; గుణ = గుణములు; నామ = నామములను; వర్ణన = కీర్తించుటలు; స్మరణంబులు = జపించుటలు; చేయుదురు = చేయుదురు; ప్రణవ = ఓంకారము; పూర్వకంబులుగాన్ = ముందు న్నట్టివిగా; వాసుదేవ = వాసుదేవ {వాసుదేవః - వసుదేవుని పుత్రుడు, అంతటను నిండి ఉండువాడు, తన మాయాశక్తిచే సర్వము ఆవరించిన వాడు, కృష్ణుడు, విష్ణుసహస్రనామాలలో 332వ నామం, 695వ నామం, 709వ నామం}; ప్రద్యుమ్న = ప్రద్యుమ్న {ప్రద్యుమ్నః- విశేషధనము కలవాడు, విష్ణుసహస్రనామాలు 640వ నామం}; సంకర్షణ = సంకర్షణ; అనిరుద్ధ = అనిరుద్ధ {అనిరుద్ధః- శత్రువులకు అడ్డగింపరానివాడు, విష్ణుసహస్రనామాలు 185వ నామం, 638వ నామం}; మూర్తి = స్వరూపముల; నామంబులు = నామములు; నాలుగున్ = నాలుగును; భక్తిన్ =భక్తితో; పలికి = పలికి; నమస్కారంబున్ = నమస్కారము; చేసి = చేసి; మంత్ర = మంత్ర; మూర్తియు = స్వరూపుడును; మూర్తి = ఆకారము; శూన్యుండును = లేనివాడును; అయిన = అయినట్టి; యజ్ఞపురుషున్ = యజ్ఞపురుషుని; పూజించు = పూజించుచుండెడి; పురుషుండు = మానవుడు; సమ్యక్ = చక్కగా; దర్శనుండు = దర్శించినవాడు, తెలిసికొన్నవాడు; అగు = అగును.

భావము:-దేవాదిదేవుడైన వాసుదేవుని మాయాప్రభావాన్ని నేను కూడా ఆ మహనీయుల మహోపదేశం వల్ల తెలుసుకున్నాను. తాపత్రయాన్ని రూపుమాపే పరమౌషధం ఈశ్వరార్పణం చేసిన కర్మమే. లోకంలో ఏ పదార్థం వల్ల రోగం ఉద్భవించిందో ఆ పదార్థం ఆ రోగాన్ని పోగొట్టలేదు. మరో పదార్థం చేత చికిత్స జరిగితేనే కాని ఆ రోగం శాంతించదు. ఈ ప్రకారంగా కర్మలు భవబంధ కారణాలే అయినప్పటికీ, ఈశ్వరార్పణం చేయటం మూలాన తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చేసే కార్యం విశిష్టమైన జ్ఞానాన్ని ప్రసాది స్తుంది. అందువల్ల ఈశ్వరుడు సంతోషించి అచంచల భక్తిని అనుగ్రహిస్తాడు. భగవంతుని ప్రబోధం వల్ల కర్మలు కావించేవారు శ్రీ కృష్ణ గుణ నామాలను కీర్తించటంలో, సంస్మరించటంలో ఆసక్తులౌతారు. ఓంకారపూర్వకంగా వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ నామాలు నాలుగింటిని భక్తితో ఉచ్చరించి నమస్కరించి చిన్మయ స్వరూపుడైన యజ్ఞేశ్వరుణ్ణి ఆరాధించే మానవుడు సమ్యగ్దర్శనుడై సమదృష్టి కలవాడౌతాడు.

1-111-క.

ఏ నవ్విధమునఁ జేయఁగ,

దానవకులవైరి నాకుఁ దనయందలి వి

జ్ఞానము నిచ్చెను, మదను

ష్ఠానము నతఁ డెఱుఁగు, నీవు సలుపుము దీనిన్.

టీక:- ఏను = నేను; ఆ = ఆ; విధమునన్ = ప్రకారముగా; చేయఁగన్ = చేయగా; దానవకుల వైరి = భగవంతుడు {దానవకులవిరోధి - దానవులందరికి శత్రువు, విష్ణువు}; నాకున్ = నాకు; తన = తన; అందలి = ఎడలి; విజ్ఞానమున్ = విజ్ఞానమును; ఇచ్చెను = ఇచ్చెను; మత్ = నా యొక్క; అనుష్ఠానమున్ = అనుష్ఠానమును; అతఁడు = అతడు; ఎఱుఁగు = తెలియును; నీవున్ = నీవు కూడా; సలుపుము = ఆచరింపుము; దీనిన్ = దీనిని.

భావము:- నేనీ విధంగా ప్రవర్తించుటవల్ల విష్ణుభగవానుడు విశిష్టమైన ఈశ్వరజ్ఞానాన్ని నాకు అనుగ్రహించాడు. నా నడవడి ఆ శ్రీమన్నారాయణునికి తెలుసు. ఓ వ్యాసా! నీవు కూడా శ్రీహరిని సంకీర్తించు.

1-112-క.

మునికులములోన మిక్కిలి
వినుకులు గలవాఁడ వీవు, విభుకీర్తులు నీ
వనుదినముఁ బొగడ వినియెడి
జనములకున్ దుఃఖమెల్ల శాంతిం బొందున్."

టీక:- ముని = మునుల; కులము = వంశము; లోనన్ = లో; మిక్కిలి = ఎక్కువగ; వినుకులు = (అనేక విషయములను) వినుటలు; కలవాఁడవు = కలిగిన; వాఁడవు; ఈవు = నీవు; విభు = ప్రభు యొక్క, భగవంతుని; కీర్తులు =కీర్తనలు; నీవు; అనుదినమున్=ప్రతిదినమును; పొగడ=కీర్తించుచుండగ; వినియెడి = వినెడు; జనముల = మానవులు; కున్ = కు; దుఃఖము = దుఃఖము; ఎల్లన్ = సమస్తము; శాంతిన్ = శాంతిని; పొందున్ = పొందును.

భావము:- వ్యాసా! నీవు మునులలో ఎంతో ప్రసిద్ధుడవు. వినేవారి దుఃఖాలన్నీ దూరమై వారి స్వాంతనాలకు శాంతి లభించేటట్లు, చక్కగా వాసుదేవుని కీర్తించుము."

1-113-వ.

ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; నారదు = నారదుని; జన్మ = పూర్వజన్మ; కర్మంబులు = కర్మములు; విని = ఆలకించి; క్రమ్మఱన్ = మరల; వ్యాసుండు = వ్యాసుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా నారదమహర్షి తన పుట్టు పూర్వోత్తరాలు వినిపించగా ఆలకించిన, వ్యాసముని నారదుణ్ణి మళ్లీ ఇలా ప్రశ్నించాడు.

1-114-మ.

"విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో
యిన, బాల్యంబున వృద్ధభావమున నీ కే రీతి సంచారముల్
సనె? నీకిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ? ద
త్తనువుం బాసిన చందమెట్లు? చెపుమా దాసీసుతత్వంబుతోన్."

టీక:- వినుము = వినుము; ఆ = ఆ; భిక్షులు = యోగులు; నీకున్ = నీకు; ఇట్లు = ఈ విధముగ; కరుణన్ = దయతో; విజ్ఞానమున్ = విజ్ఞానమును; చెప్పి = తెలిపి; పోయిన = వెళ్ళిపోయిన; బాల్యంబున = బాల్యములో; వృద్ధ = పెద్దవాడు, జ్ఞాని; భావమున = అయినప్పుడు; నీకు = నీకు; ఏ = ఏ; రీతి = విధమైన; సంచారముల్ = సంచరించుటలు; చనెన్ = జరిగెను; నీకు = నీకు; ఇప్పుడు = ఇప్పుడు; పూర్వ = పూర్వ; కల్ప = జన్మ; మతి = జ్ఞాపకములు; ఏ = ఏ; జాడన్ = మార్గమున; ప్రదీపించెన్ = ప్రకాశించెను; తత్ = ఆ; తనువున్ = శరీరమును; పాసిన = విడిచిన; చందము = విధము; ఎట్లు = ఏది; చెపుమా = చెప్పుము; దాసీ = దాసీ; సుతత్వంబు = పుత్రతత్వము; తోన్ = తో.

భావము:- “ఆయ్యా! నీకు ఆ మహానుభావులైన సాధువులు ఎంతో దయతో ఈశ్వరజ్ఞానాన్ని ఉపదేశించి వెళ్లిపోయారు గదా. అటు పిమ్మట నీ బాల్యం ఎలా గడిచింది. పెద్దవాడ వయ్యాక ఎక్కడెక్కడ సంచరించావు. ఈ జన్మలో ఇప్పుడు నీకు పూర్వ జన్మస్మృతి ఏ విధంగా కలిగింది. దాసీపుత్రుడవైన నీవు ఏ విధంగా నీ దేహాన్ని త్యజించావు దయచేసి వివరించు.”

1-115-వ.

## అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె "దాసీపుత్త్రుండ నయిన యేను భిక్షులవలన హరిజ్ఞానంబు గలిగి యున్నంత.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; వ్యాసుండు = వ్యాసుడు; అడిగిన = అడిగిన; నారదుండు = నారదుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; దాసీ = దాసీ; పుత్త్రుండన్ = పుత్రుడను; అయిన = అయినట్టి; ఏను = నేను; భిక్షుల = భిక్షువులు; వలనన్ = వలన; హరి = హరియొక్క; జ్ఞానంబు = జ్ఞానము; కలిగి = కలిగి; ఉన్నంత = ఉండగ.

భావము:- వ్యాసులవారి ప్రశ్నలకు నారదులవారు ఇలా సమాధానం చెప్పారు”ఆ విధంగా నేను ఆ సాధుపుంగవుల వల్ల ఈశ్వర పరిజ్ఞానాన్ని పొంది యున్నాను.

1-116-సీ.

## మమ్ము నేలినవారి మందిరంబునఁ గల-
## పనులెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి
## తన పరాధీనతఁ దలఁపదు; సొలసితి-
## నలసితి నాఁకొంటి ననుచు వచ్చి
## మాపును రేపును మా తల్లి మోహంబు-
## సొంపార ముద్దాఁడు, చుంచు దువ్వు,
## దేహంబు నివురు, మోదించుఁ, గౌఁగిటఁ జేర్చు,-
## నర్మిలి నన్నిట్టు లరసి మనుప,

1-116.1-ఆ.

నేను విడిచి పోక యింట నుండితినయ్య,
మోహిఁగాక, యెఱుక మోసపోక,
మాఱు చింత లేక, మౌనినై యేనేండ్ల
వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు.

టీక:- మమ్ము=మా; ఏలినవారి=యజమానుల; మందిరంబునన్ = ఇంటిలో; కల = ఉన్న; పనులు; ఎల్లన్ = అన్నియు; క్రమమున = పద్ధతిగ; భక్తిన్ = భక్తితో; చేసి = చేసి; తన = తన యొక్క; పరాధీనతన్ = దాస్యమును; తలఁపదు = తలుచుకొనదు; సొలసితిన్ = సోలిపోతిని; అలసితిన్ = అలసిపోతిని; ఆఁకొంటిన్ = ఆకలితో ఉంటిని; అనుచున్ = అనుకొనుచు; వచ్చి; మాపును = రాత్రిని; రేపును = పగలును; మా = మాయొక్క; తల్లి = తల్లి; మోహంబు = మోహము; సొంపార = అతిశయించగా; ముద్దాఁడున్ = ముద్దాడును; చుంచు = జుట్టు; దువ్వున్ = దువ్వును; దేహంబున్ = దేహము; నివురున్ = నిమురును; మోదించున్ = తట్టును; కౌగిటన్ = కౌగిట్లో; చేర్చున్ = చేర్చుకొనును; అర్మిలిన్ = ఆపేక్షతో; నన్ = నన్ను; ఇట్టుల = ఈ విధముగ; అరసి = సాకి; మనుపన్ = పోషింపగ; నేను = నేను; విడిచి = విడిచిపెట్టి; పోకన్ = వెళ్ళిపోక; ఇంటన్ = ఇంటిలో; ఉండితిని = ఉన్నాను; అయ్య = అయ్య; మోహిన్ = మోహి; కాక = కాకుండగ; ఎఱుకన్ = జ్ఞానముయందు; మోసపోకన్ = వంచింపబడక; మాఱు = మరొక; చింత = ఆలోచన; లేకన్ = లేకుండగ; మౌనిని = మౌనమువహించినవాడను; ఐ = అయ్యి; ఏను = ఐదు; ఏండ్లవాఁడన్ = ఐదుసంవత్సరముల వాడిని; అగుచున్ = అగుచూ; కొన్ని = కొన్ని; వాసరములు = దినములు;

భావము:- మా తల్లిది చాలా జాలిగుండె. ఉత్త అమాయకురాలు. తల వంచుకొని యజమానుల గృహాల్లో పనులన్నీ క్రమం తప్పకుండ చేసేది. తన దాస్యాన్ని గూర్చి కించిత్తు కూడా కించపడేది కాదు. నేనంటే ఆమెకు పంచప్రాణాలు. అయ్యో నా బిడ్డ అలసిపోయాడు. సొలసిపోయాడు, ఆకలి గొన్నాడు. అని అంటూ ప్రతిరోజూ అల్లారుముద్దుగా ఆదరించి నన్ను పెంచి పెద్దచేసింది. ఎంతో ప్రేమగా మాటిమాటికీ నా బుగ్గలు ముద్దుపెట్టుకొనేది. నా జట్టు దువ్వేది. నాఒళ్ళు నిమిరేది. నన్ను ఆప్యాయంగా అక్కున చేర్చుకొనేది. ఈ విధంగా తల్లి ప్రేమతో పెరిగిన నేను ఆమెను విడిచి పోలేక ఇంట్లోనే ఉండిపోయాను. అయితే నేను సంసారవ్యామోహంలో చిక్కుబడలేదు. జ్ఞానాన్ని విడువలేదు. అయిదేళ్ళు వచ్చేదాక అలా మౌనిగ ఉన్నాను.

1-117-వ.

అంత. టీక:- అంత = అంతట. భావము:- అప్పుడు.

1-118-క.

సదనము వెలువడి తెరువునఁ
జెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుఁకగ, నొకఫణి
పదభాగముఁ గఱచెఁ ద్రొక్కఁబడి మునినాథా!

టీక:- సదనమున్ = ఇంటినుండి; వెలువడి = బయల్పడి; తెరువునన్ = దారిలో; చెదరక = బెదరక; మా = మా; తల్లి = తల్లి; రాత్రిన్ = రాత్రి; చీఁకటివేళన్ = చీకటిలో; మొదవున్ = ఆవుకు; పిదుఁకగన్ = పాలుపిండుటకు పోవుచుండగా; ఒక = ఒక; ఫణి = పాము; పదభాగమున్ = పాదమును; కఱచెన్ = కరచినది; త్రొక్కఁబడి = త్రొక్కబడి; మునినాథా = మునులలోశ్రేష్ఠుడా.

భావము:- వ్యాసమహర్షీ! ఒకనాడు ఏమి జరిగిందంటే, మా అమ్మ రాత్రివేళ కటిక చీకటిలో ఆవు పాలు పిండటం కోసం ఇల్లు వదలి బయటికి వెళ్ళింది. త్రోవలో ఆమె ఒకపామును త్రొక్కింది. ఆ సర్పం ఆమె పాదాన్ని కరచింది.

1-119-క.

నీలాయతభోగఫణా

వ్యాళానలవిష మహోగ్రవహ్నిజ్వాలా

మాలావినిపాతితయై

వ్రాలెన్ ననుఁ గన్నతల్లి వసుమతి మీఁదన్.

టీక:- నీల = నల్లని; ఆయత = పొడవైన; భోగ = శరీరము; ఫణా = పడగలుగల; వ్యాళ = పాము; ఆనల = జఠరాగ్నిని పుట్టిన; విష = విషముయొక్క; మహా = మిక్కిలి; ఉగ్ర = భయంకరమైన; వహ్ని = అగ్ని; జ్వాలా = జ్వాలల; మాలా = మాలల వలన; వినిపాతిత = పడవేయబడినది; ఐ = అయి; వ్రాలెన్ = పడిపోయెను; ననున్ = నన్ను; కన్న = కన్నటువంటి; తల్లి = తల్లి; వసుమతి = భూమి; మీఁదన్ = మీద.

భావము:-అత్యంత భయంకరమైన ఆ త్రాచుపాము కోరలలోని విషాగ్ని జ్వాలల వల్ల అమ్మ నేల మీద పడిపోయింది.

1-120-ఉ.

తల్లి ధరిత్రిపై నొఱగి తల్లడపాటునుఁ జెంది చిత్తముం

బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి, కలంగ కేను నా

యుల్లములోన మోహరుచి నొందక, సంగము వాసె మేలు రా

జిల్లె, నటంచు విష్ణుపదచింత యొనర్పఁగ బుద్ధిఁ జేర్చుచున్.

టీక:- తల్లి = తల్లి; ధరిత్రి = భూమి; పైన్ = మీద; ఒఱగి = పడిపోయి; తల్లడపాటునున్ = వణుకి పోవుటను; చెంది = చెంది; చిత్తమున్ = మనసు; పల్లటిలంగన్ = కలవరపడగా; ప్రాణములు = ప్రాణము లను; పాసినన్ = వదలగా; చూచి = చూచియు; కలంగక = కలతపడక; ఏను = నేను; నా = నా; ఉల్లము = మనసు; లోనన్ = లోపల; మోహ = మోహపు; రుచిన్ = భావమును, లేశమును; ఒందక = పొందక; సంగము = బంధము; పాసె = తొలగినది; మేలు = మంచి; రాజిల్లెన్ = సిద్ధించెను; అట = అట; అంచున్ = అనుకొనుచు; విష్ణు = హరి; పద = పాద; చింత = భక్తి; ఒనర్పఁగన్ = చక్కచేయవలెనని; బుద్ధిన్ = బుద్ధిలో; చేర్చుచున్ = నిర్ణయించుకొనుచు.

భావము:- అలా మా అమ్మ క్రిందపడి విలవిల తన్నుకొని వివశురాలై ప్రాణాలు వదిలింది. అప్పుడు నేను ఆ విషాదదృశ్యాన్ని చూసి ఏ మాత్రం కలవరపడకుండా, నాచిత్తం శోకాన్నిపొందకుండా, నిబ్బరించుకొని నిలబడ్డాను. "మంచిది, బంధం తెగిపోయింది"అనుకొన్నాను. ఇక నాకు హరిచరణ స్మరణమే అవశ్యకర్తవ్యమని నిర్ణయించుకొన్నాను.

1-121-వ.

**ఉత్తరాభిముఖుండ నై యేను వెడలి జనపదంబులుఁ, బురంబులుఁ, బట్టణంబులు, గ్రామంబులుఁ, బల్లెలు, మందలుఁ, గిరాత పుళింద నివాసంబులు, నుపవనంబులుఁ, జిత్రధాతు విచిత్రితంబు లయిన పర్వతంబులు, సమద కరికర విదళిత శాఖలుగలశాఖులును, నివారిత పథికజనశ్రమాతిరేకంబు లైన తటాకంబులు, బహువిధ విహంగ నినద మనోహరంబు లై వికచారవింద మధు పాన పరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాఁటిచనుచు; క్షుత్పిపాసాసమేతుండ నై యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై, నీరుద్రావి గతశ్రముండనై.**

టీక:- ఉత్తర = ఉత్తరదిక్కుకు; అభిముఖుండన్ = తిరిగినవాడిని; ఐ = అయి; ఏను = నేను; వెడలి = బయలుదేరి; జనపదంబులున్ = నగరములు; పురంబులున్ = పురములు; పట్టణంబులున్ = పట్టణములు; గ్రామంబులున్ = గ్రామములు; పల్లెలున్ = పల్లెటూళ్ళు; మందలున్ = మందలు (సంచార జాతుల వారి); కిరాత = కిరాతులయొక్క; పుళింద = పుళిందులయొక్క; నివాసంబులున్ = నివాసములు; ఉపవనంబులున్ = ఉద్యానవనములు; చిత్ర = చిత్రమైన; ధాతు = ఖనిజాలతో; విచిత్రితంబులు = విచిత్రములు; అయిన = అయినట్టి; పర్వతంబులు = పర్వతములు; సమద = మదమెక్కిన; కరి = ఏనుగు; కర = తొండములచే; విదళిత = విరవబడ్డ; శాఖలు = కొమ్మలు; కల = కలిగిన; శాఖులును = (కొమ్మలతో నుండేవి) చెట్లు; నివారిత = వారింపబడిన; పథికజన = బాటసారుల; శ్రమ = అలసటయొక్క; అతిరేకంబులు = విజృంభణలు, చెలరేగుటలు; ఐన = కలిగిన; తటాకంబులు = చెరువులు; బహువిధ = వివిధరకముల; విహంగ = పక్షుల; నినద = కలకలారావముతో, అరపులతో; మనోహరంబులై = మనోహరములై; వికచ = వికసించిన; అరవింద = పద్మముల; మధు = తేనె; పాన = తాగుటవలన; పరవశ = పరవశించి; పరిభ్రమత్ = తిరుగుచున్న; భ్రమర = తుమ్మెదలతో; సుందరంబులు = అందమైన; ఐన = అయినట్టి; సరోవరంబులు = సరస్సులు; దాఁటి = దాటుకొనుచు; చనుచున్ = వెళ్ళుచుండగ; క్షుత్ = ఆకలి; పిపాసా = దాహములుతో; సమేతుండను = కూడుకొన్నవాడను; ఐ = అయి; ఒక్క = ఒక; నదీ = నదియొక్క; హ్రదంబునన్ = మడుగులో; క్రుంకులిడి = స్నానముచేసి; శుచిని = శుభ్రపడినవాడను; ఐ = అయి; నీరు = నీరు; త్రావి = తాగి; గత = పోగొట్టబడిన; శ్రముండన్ = అలసటకలవాడను; ఐ = అయి.

భావము:- అలా అనుకొన్న నేను ఉత్తర దిక్కుగా బయలుదేరి జనపదాలు, పురాలు, పట్టణాలు, గ్రామాలు, పల్లెలు, వ్రేపల్లెలు, ఖిల్లవాటికలు, తోటలు దాటుకొంటూ; ఖనిజాలతో చిత్రమైన రంగులద్దుకున్న పర్వతాలూ; మదపూరితమైన ఏనుగులు తొండాలతో విరపబడ్డ కొమ్మలు గల వృక్షాలూ; బాటసారుల మార్గాయాసాన్ని పోగొట్టే తటాకాలు; నానావిధాలైన పక్షుల కలకలారావాలతో రమణీయమై, వికసించిన తామరపూలతో అలరారుతూ వాటి మకరందాన్ని త్రాగి పరవశించి పరిభ్రమించే తుమ్మెదలతో అందగిస్తున్న సరస్సులూ దాటుతూ ముందుకు సాగాను. అప్పుడు నాకు ఆకలీ దప్పికా ఎక్కువయ్యాయి. ఒక యేటి మడుగులో శుభ్రంగా స్నానం చేసి నీరు త్రాగి నా మార్గాయాసాన్ని తగ్గించుకొన్నాను. అంతట...

★1-122-క.

**సాలావృక, కపి, భల్లుక,**
**కోలేభ, లులాయ, శల్య, ఘూక, శరభ, శా**
**ర్దూల, శశ, గవయ, ఖడ్గ,**
**వ్యాళాజగరాది భయద వనమధ్యమునన్**

టీక:- సాలావృక = పెద్దతోడేళ్ళు; కపి = కోతులు; భల్లుక = ఎలుగుబంట్లు; కోల = అడవిపందులు; ఇభ = ఏనుగులు; లులాయ = అడవిదున్నలు; శల్య = ముళ్ళపందులు; ఘూక = గుడ్లగూబలు; శరభ = శరభమృగములు {శరభము - సింహములను తినే ఒక జాతి జంతువు}; శార్దూల = పెద్దపులులు; శశ = కుందేళ్ళు; గవయ = ఎనుబోతులు; ఖడ్గ = ఖడ్గమృగములు; వ్యాళ = పాములు; అజగర = కొండచిలువలు; ఆది = మొదలగువానితో; భయద = భయంకరమైన; వన = అడవి; మధ్యమునన్ = నడుమ.

భావము:- తోడేళ్ళు, కోతులు, ఎలుగుబంట్లు, అడవివరాహాలు, ఏనుగులు, దున్నపోతులు, ముళ్ళ పందులు, గుడ్లగూబలు, శరభమృగాలు, శార్దూలాలు, కుందేళ్లు, మనుబోతులు, ఖడ్గమృగాలు, క్రూరసర్పాలు, కొండచిలవలు నిండిన భయంకరారణ్యాల గుండా మళ్లీ ప్రయాణించాను.

1-123-వ.

**దుస్తరంబులైన నీలవేణు, కీచక, గుల్మ, లతాగహ్వరంబుల పొంత నొక్క రావిమ్రాని డగ్గఱఁ గూర్చుండి యే విన్న చందంబున నా హృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి.**

టీక:-దుస్తరంబులు = దాటుటకు మిక్కిలి కష్టమైనవి; ఐన = అయినట్టి; నీల = నీలి; వేణు = వెదురు; కీచక = బొంగువెదురు; గుల్మ = పొదలు; లత = తీగలు; గహ్వరంబుల = పొదరిళ్ళ; పొంతన్ = ప్రక్కన; ఒక్క = ఒక; రావి = రావి; మ్రాని = మ్రానుకు; డగ్గఱన్ = దగ్గర; కూర్చుండి = కూర్చొని; ఏన్ = నేను; విన్న = వినిన; చందంబున = విధముగ; నా = నా; హృదయ = హృదయమున; గతున్ = ఉన్నవాడైన; పరమాత్మ = పరమాత్మయొక్క; స్వరూపు = స్వరూపముగలవాడైన; హరిన్ = హరిని; చింతించితిన్ = ధ్యానించాను.

భావము:- దాటశక్యంకాని నీలితుప్పలు, వెదురుపొదరిండ్లు దగ్గరగాగల ఒక రావిచెట్టుకింద కూర్చు న్నాను. నేను విన్న విధంగా నా హృదయంలో పదిలం చేసికొన్న పరమాత్మ స్వరూపుడైన హరిని ధ్యానం చేశాను.

## నారదునికి దేవుడు దోచుట

1-124-శా.

**ఆనందాశ్రులు గన్నులన్ వెడల, రోమాంచంబుతోఁ, దత్పద**
**ధ్యానారూఢుఁడ నైన నా తలఁపులో నద్దేవుఁడుం దోఁచె నే**
**నానందాబ్ధిగతుండనై యెఱుఁగలేనైతిన్ ననున్నీశ్వరున్,**
**నానాశోకహమైన యత్తనువు గానన్ లేక యట్లంతటన్.**

టీక:- ఆనందాశ్రులు = ఆనందబాష్పములు; కన్నులన్ = కళ్ళవెంట; వెడల = కారగ; రోమాంచంబు = వెంట్రుకల గగుర్పాటు; తోన్ = తో; తత్ = వాని; పద = పాదముల; ధ్యాన = ధ్యానములో; ఆరూఢుఁడన్ = మునిగినవాడను; ఐన = అయిన; నా = నా; తలఁపు = భావము; లోన్ = లో; ఆ = ఆ; దేవుఁడున్ = దేవుడు; తోఁచెన్ = తోచెను; నేన్ = నేను; ఆనంద = సంతోష; అబ్ధి = సాగరములో; గతుండన్ = మునిగినవాడను; ఐ = అయి; ఎఱుఁగ = తెలిసికొన; లేనైతిన్ = లేకపోతిని; ననున్ = నన్ను; ఈశ్వరున్ = ఈశ్వరుని; నానా = సమస్త; శోక = శోకములను; అహము = పోగొట్టునది; ఐన = అయినట్టి; ఆ = ఆ; తనువున్ = రూపమును; కానన్ = చూడ, కనుగొన; లేక = లేక; అట్లు = ఆవిధముగ; అంతటన్ = అప్పుడు.

భావము:- నా కళ్ళల్లో ఆనందబాష్పాలు పొంగిపొర్లాయి. నా శరీరమంతా పులకించింది. ఆ భక్తి పారవ శ్యంలో భగవంతుని చరణాలు ధ్యానిస్తున్న నా చిత్తంలో ఆ దేవదేవుడు సాక్షాత్కరించాడు. నేను కన్నులు తెరచి చూచేసరికి భక్తుల దుఃఖాలను పటాపంచలు చేసే పరమేశ్వరుని స్వరూపం అదృశ్యమైపోయింది.

1-125-వ.

**లేచి నిలుచుండి, క్రమ్మఱ నద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు, హృదయంబున నిలుపుకొని యాతురుండునుంబోలె జూచియుం గాన లేక, నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుం డైన హరి గంభీర మధురంబులైన వచనంబుల శోకంబుపశమింపంజేయు చందంబున నిట్లనియె.**

టీక:- లేచి = లేచి; నిలుచుండి = నిలబడి; క్రమ్మఱన్ = మరల; ఆ = ఆ; దేవుని = దేవుని యొక్క; దివ్య = దివ్యమైన; ఆకారంబున్ = ఆకారమును; చూడన్ = చూచుటను; ఇచ్ఛించుచున్ = కోరుతూ; హృదయంబున = హృదయములో; నిలుపుకొని = నిలుపుకొని; ఆతురుండునున్ = ఆతురతతో యున్నవాడు; పోలెన్ = వలె; చూచియున్ = వెతికి చూచి కూడ; కాన = కనుగొన; లేక = లేక; నిర్మనుష్యంబు = మనుష్య సంచారము లేనిది;

ఐన = అయినట్టి; వనంబునన్ = అరణ్యములో; చరియించుచున్న = తిరుగుతున్న; నన్నున్ = నన్ను; ఉద్దేశించి = ఉద్దేశించి; వాక్ = వాక్కువలన {వాగగోచరుడు - వాక్కు వలన తెలియరానివాడు}; అగోచరుండు = తెలుప సాధ్యం కాని వాడు; ఐన = అయినట్టి; హరి = హరి; గంభీర = గంభీరమైనవియును; మధురంబులు = మధురమైనవియును; ఐన = అయినట్టి; వచనంబులన్ = మాటలతో; శోకంబున్ = విచారమును; ఉపశమింపన్ = ఉపశమించునట్లు; చేయు = చేయు; చందంబునన్ = విధముగ; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- నేను విచారంతో లేచి నిల్చున్నాను. మళ్లీ ఆ దేవదేవుని దివ్యస్వరూపాన్ని దర్శించాలనే ఉత్కంఠతో నిర్మానుష్యమైన ఆ అరణ్యంలో అటూ ఇటూ తిరుగసాగాను. కాని నాకు తిరిగి ఈశ్వర సాక్షాత్కారం కలుగలేదు. అంతలో మాటలలో వివరించ సాధ్యం కాని వాడు అయిన శ్రీహరి మధుర గంభీర వచనాలు నా శోకాన్ని ఉపశమింపజేస్తూ నన్ను ఓదారుస్తూ ఈ విధంగా వినవచ్చాయి.

## 1-126-ఉ.

"ఏల కుమార! శోషిలఁగ? నీ జననంబున నన్నుఁ గానఁగాఁ
జాలవు నీవు, కామముఖషట్కము నిర్దళితంబు సేసి ని
ర్మూలితకర్ములైన మునిముఖ్యులు గాని, కుయోగిఁ గానఁగాఁ
జాలఁడు, నీదు కోర్కి కొనసాఁగుటకై నిజమూర్తిఁ జూపితిన్.

టీక:- ఏల = ఎందుకు; కుమార = కుమారా; శోషిలఁగన్ = అయాసపడుట; ఈ = ప్రస్తుత; జననంబునన్ = జన్మలో; నన్నున్ = నన్ను; కానఁగాఁన్ = దర్శించ; చాలవు = లేవు, సరిపడవు; నీవు = నీవు; కామ = కామము {కామముఖషట్కము - అరిషడ్వర్గములు -శత్రువులు 6 - కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్య, మోహములు)}; ముఖ = మొదలగు; షట్కమున్ = ఆరుగురు; నిర్దళితంబున్ = ఖండితముగ; చేసి = చేసి; నిర్మూలిత = నిర్మూలింపబడిన; కర్ములు = కర్మములుగలవారు; ఐన = అయినట్టి; ముని = మునులలో; ముఖ్యులు = ముఖ్యమైనవారు; కాని = కాని; కుయోగి = చెడ్డవాడైన యోగి; కానఁగాన్ = దర్శించను; చాలఁడు = సరిపోడు, చేయలేడు; నీదు = నీ యొక్క; కోర్కి = తపన, ఇచ్ఛ; కొనసాఁగుట = కొనసాగుట; కై = కై; నిజ = నాయొక్క; మూర్తిన్ = ఆకారమును; చూపితిన్ = చూపించితిని.

భావము:- "నాయనా! ఎందుకలా వృథాగా ఆయాసపడతావు. నీవు ఎంత ప్రయత్నించినా ఈ జన్మలో నన్ను దర్శించలేవు. కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జయించి నిర్మూలితకర్ములైన ముని ముఖ్యులే నన్ను చూడ గల్గుతారు. అంతే కాని జితేంద్రియులు కానివారు నన్ను దర్శించలేరు. అయినా నీ మనసులోని కోరికను కొనసాగించటం కోసం క్షణ కాలం నా స్వరూపాన్ని నీకు స్ఫురింపజేశాను.

1-127-క.

నావలని కోర్కి యూరక

పోవదు, విడిపించు దోషపుంజములను, మ

త్సేవం బుట్టును వైళమ

భావింపఁగ నాదు భక్తి బాలక! వింటే.

టీక:- నావలని = నామీద; కోర్కి = భక్తి; ఊరక = ఊరికే; పోవదు = పోదు; విడిపించున్ = విడిపించును; దోష = పాపపు; పుంజములను = సమూహములను; మత్ = నాయొక్క; సేవన్ = సేవవలన; పుట్టును = కలుగును; వైళమ = శ్రీఘ్రముగ; భావింపఁగ = ఎంచిచూస్తే; నాదు = నాయొక్క; భక్తి = భక్తి; బాలక = కుమారా; వింటే = వింటున్నావా

భావము:- వత్సా! నా యందు లగ్నమైన నీ కోరిక వ్యర్థం కాదు. నీ సమస్త దోషాలూ దూరమౌతాయి. నన్ను సేవించటం వల్ల నాభక్తి అచిరకాలంలోనే నీమదిలో పదిలమౌతుంది.

1-128-క.

నాయందుఁ గలుగు నీ మది

వాయదు జన్మాంతరముల బాలక! నీ వీ

కాయంబు విడిచి మీఁదట

మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భక్తుఁడవై.

టీక:- నా = నా; అందున్ = మీద; కలుగు = కలుగును; నీ = నీ; మది = మనసు; పాయదు = విడువదు; జన్మ = జన్మముల; అంతరములు = ఇతరములుకును; బాలక = కుమార; నీవు = నీవు; ఈ = ఈ; కాయంబున్ = శరీరమును; విడిచి = విడిచిన; మీఁదటన్ = తరువాత; మా = మా యొక్క; అనుమతిన్ = అనుమతితో; పుట్టన్ = (మరల) పుట్ట; కలవు = కలవు; మత్ = నాయొక్క; భక్తుఁడవు = భక్తుడవు; ఐ = అయి.

భావము:- కుమారా నా యందు లగ్నమైన నీ హృదయం వచ్చే జన్మలో కూడా నన్ను అంటిపెట్టుకొని ఉంటుంది. నీవు ఈ దేహాన్ని వదలిన అనంతరం నా అనుజ్ఞతో మరు జన్మలో నా భక్తుడివై ఉద్భవిస్తావు.

1-129-మ.

విను; మీ సృష్టిలయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా

మినియైపోయెడిఁ బోవఁగాఁ, గలుగుఁజూమీఁదం బునఃసృష్టి, యం

దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు నిర్దోషుండవై నా కృపన్,

ఘనతం జెందెదు శుద్ధ సాత్త్వికులలో గణ్యుండవై యర్భకా!"

టీక:- విను = వినుము; ఈ = ప్రస్తుత; సృష్టి = సృష్టి (మొత్తము); లయంబున్ = అంతము (ప్రళయము); ఒంది = పొంది; యుగముల్ = యుగములు; వేయి = వెయ్యి; ఐన = అయిన; కాలంబు = కాలము; యామిని = రాత్రి (బ్రహ్మ); ఐపోయెడిన్ = అయిపోవుట; పోవఁగాన్ = (అది) గడిచిపోగా; కలుగుఁన్ = జరుగును; సుమీ = సుమా; మీఁదన్ = ఆపైన; పునః = మరల; సృష్టి = సృష్టి; అందున్ = అందు; నిరూఢ = గట్టి; స్మృతి = జ్ఞాపకశక్తి; తోడన్ = కలిగి; పుట్టెదవు = జన్మించెదవు; నిర్దోషుండవు = దోషములు లేనివాడవు; ఐ = అయి; నా = నాయొక్క; కృపన్ = కృప వలన; ఘనతన్ = గొప్పతనమును; చెందెదు = పొందెదవు; శుద్ధ = పరిశుద్ధమైన; సాత్త్వికుల = సత్త్వగుణసంపన్నులు; లోన్ = లో; గణ్యుండవు = గొప్పవాడవు; ఐ = అయి; అర్భకా = బాలకుడా.

భావము:-విను చిట్టితండ్రి! ఈ సృష్టియావత్తూ లయమైపోయిన పిమ్మట వేయి యుగాలు చీకటి రాత్రిగా గడిచిపోతుంది. అప్పుడు తిరిగి సృష్టి ఏర్పడుతుంది. నీవు మళ్లీజన్మిస్తావు. నీకు పూర్వస్మృతి ఉంటుంది. నా అనుగ్రహం వల్ల నీ దోషాలన్నీ నశించి సత్వ గుణసంపన్నులైన హరిభక్తులలో అగ్రగణ్యుడవై ప్రసిద్ధుడవు అవుతావు."

1-130-వ.

అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి, సర్వ నియామకం బైన మహాభూతంబు వలికి యూరకున్న; నేను మస్తకంబువంచి మ్రొక్కి, తత్కరుణకు సంతసించుచు, మదంబు దిగనాడి, మచ్చరంబు విడిచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల వెడల నడిచి, సిగ్గు విడిచి, యనంత నామంబులు పఠించుచుఁ, బరమ భద్రంబు లయిన తచ్చరిత్రంబులం జింతించుచు, నిరంతర సంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి, నిర్మలాంతః కరణంబుల తోడ విషయవిరక్తుండ నై, కాలంబున కెదురు సూచుచు భూమిం దిరుగుచు నుండ; నంతం గొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు దోఁచినం, బంచభూతమయం బయి కర్మ స్వరూపం బైన పూర్వ దేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధసత్త్వ మయం బైన భాగవతదేహంబు సొచ్చితి; నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాల పయోరాశి మధ్యంబున శయనించు నారాయణమూర్తి యందు నిదురవోవ నిచ్ఛగించు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతని లోపలం బ్రవేశించితి; నంత సహస్ర యుగ పరిమితంబైన కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మ నిశ్వాసంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జనియించితిమి; అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూఁడులోకంబుల బహిరంతరంబు లందు మహావిష్ణుని యను

గ్రహంబున నడ్డంబు లేక యీశ్వరదత్తమై బ్రహ్మాభివ్యంజకంబు లైన సప్తస్వరం బులు దమ యంతన మ్రోయుచున్న, యీ వీణాలాపన రతింజేసి నారాయణకథా గానంబు సేయుచుఁ జరియించు చుందు.

టీక:- అని = అని; ఇట్లు = ఈవిధముగ; ఆకాశంబు = ఆకాశము; మూర్తియు = రూపముగను; ఋగ్వేద = ఋగ్వేదము; ఆదికంబు = మొదలగునవి; నిశ్వాసంబునున్ = ఊపిరియును; కాన్ = కాగా; ఒప్పి = అమరి; సర్వ = సర్వమును; నియామకంబు = నియమించునది; ఐన=అయినట్టి; మహా=బృహత్; భూతంబు = ప్రకృతి; పలికి = పలికి; ఊరక = ఊరక; ఉన్నన్ = ఉండిన; నేను = నేను; మస్తకంబున్ = శిరస్సు; వంచి = వంచి; మ్రొక్కి = నమస్కరించి; తత్ = ఆయొక్క; కరుణ = దయ; కున్ = కు; సంతసించుచున్ = సంతోషిం చుచు; మదంబున్ = గర్వమును; దిగనాడి = వదిలివేసి; మచ్చరంబున్ = మాత్సర్యమును; విడిచి = విడనాడి; కామంబున్ = కామమును; నిర్జించి = అణచి; క్రోధంబున్ = కోపమును; వర్జించి = వదిలిపెట్టి; లోభ = లోభమును; మోహంబులన్ = మోహములను; వెడలనడిచి = గెంటి వేసి; సిగ్గున్ = సిగ్గును; విడిచి = విడిచి; అనంత = అనంతుని, భగవంతుని అనంతమైన; నామంబులున్ = నామములను; పఠించుచున్ = చదు వుతూ; పరమ = అన్నిటికంటె ఉత్తమమైన; భద్రంబులు = క్షేమకరములు; అయిన = అయినట్టి; తత్ = అతని; చరిత్రంబులన్ = చరిత్రలను; చింతించుచు = తలుస్తూ; నిరంతర = ఎడతెగని; సంతుష్టుండను = సంతో షము కలవాడను; ఐ = అయి; కృష్ణుని = విష్ణువుని; బుద్ధిన్ = బుద్ధిలో; నిలిపి = స్థిరపరుచుకొని; నిర్మల = మలినములేని; అంతఃకరణంబుల= లోపలిఇంద్రియముల {అంతఃకరణములు- శబ్దము, స్పర్శ, రూపము, రుచి, వాసనలు వాని స్థానములు}; తోడన్ = తో; విషయ = విషయములమీద {విషయములు - ఇంద్రియాలకు సంబంధించి నవి}; విరక్తుండను = ఆసక్తిలేనివాడను; ఐ = అయి; కాలంబు = (మరణ)కాలము; కున్ = కు; ఎదురు = ఎదురు; సూచుచు = చూస్తూ; భూమిన్ = భూమిమీద; తిరుగుచున్ = తిరుగుతూ; ఉండన్ = ఉండగా; అంతన్ = అంతట; కొంత = కొంత; కాలంబు = కాలము; కున్ = తరువాత; మెఱుంగు = మెరుపు; మెఱసిన = మెరిసిన; తెఱంగునన్ = విధముగ; మృత్యువు = మరణము; తోఁచినన్ = ప్రత్యక్షము కాగా; పంచభూత = పంచభూతములతో; మయంబు = కూడినది; అయి = అయినట్టి; కర్మ = కర్మము యొక్క; స్వరూపంబు = స్వరూపము; ఐన = కలిగిన; పూర్వ = పూర్వజన్మ లోని; దేహంబు = దేహమును; విడిచి = విడిచిపెట్టి; హరి = హరియొక్క; కృపా = దయ; వశంబునన్ = వలన; శుద్ధ = పరిశుద్ధమైన; సత్త్వ = సత్త్వగుణముల; మయంబు = కూడినది; ఐన = అయినట్టి; భాగవత = భగవంతుని యొక్క; దేహంబు = దేహము, రూపము; చొచ్చితిన్ = ప్రవేశించితిని, లీనమైతిని; అంతన్ = అంతట; త్రైలోక్యంబున్ = మూడు లోకములను; సంహరించి = నాశనము చేసి; ప్రళయ = కల్పాంత; కాల = కాలములో; పయోరాశి = సముద్ర; మధ్యంబున = మధ్యభాగమున; శయనించు = పండుకొను; నారాయణ మూర్తి = విష్ణు మూర్తి; అందున్ = లోపల; నిదుర = నిద్ర; పోవ = పోవుటకు; ఇచ్చగించు = నిశ్చయించు; బ్రహ్మ = బ్రహ్మ యొక్క; నిశ్వాసంబు = ఊపిరి; వెంటన్ = వెనకన; అతని; లోపలన్ = లోపలికి; ప్రవేశించితిన్ = చొచ్చితిని; అంత = అంతట; సహస్ర = వెయ్యి; యుగ = యుగముల; పరిమితంబు = పర్యంతము; ఐన = అయినట్టి; కాలంబు = కాలము; చనిన = గడచిన; లేచి = లేచి; లోకంబులున్ = లోకములను; సృజియింపన్ = సృష్టించవలెనని; ఉద్యోగించు = ప్రయత్నము చేయు; బ్రహ్మ = బ్రహ్మయొక్క; నిశ్వాసంబు = ఊపిరి; వలనన్ = ద్వారా; మరీచి =

మరీచి; ముఖ్యులగు = మొదలగు; మునులును = మునులును; నేనును = నేనును; జనియించితిమి = పుట్టితిమి; అందున్ = వారిలో; అఖండిత = ఎడతెగని; బ్రహ్మచర్యుండన్ = బ్రహ్మచర్య వ్రతధారుడను; ఐ = అయి; ఏను = నేను; మూఁడు = మూడు; లోకంబులన్ = లోకముల యొక్క; బహిర్ = బయటి భాగములు; అంతరంబులు = లోపటి భాగములు; అందున్ = అందును; మహా = గొప్ప వాడైన; విష్ణుని = భగవంతుని యొక్క; అనుగ్రహంబునన్ = అనుగ్రహము వలన; అడ్డంబు = అడ్డము; లేక = లేకుండగ; ఈశ్వర = ఈశ్వరునిచే; దత్త = ఇవ్వబడినది; ఐ = అయినట్టి; బ్రహ్మ = పరబ్రహ్మమును; అభివ్యంజకంబులు = అభివ్యక్తము చేయునవి; ఐన = అయినట్టి; సప్తస్వరంబులు = సప్తస్వరములు; తమయంతన = తమంతతామే; మ్రోయుచున్న = మ్రోగు; ఈ = ఈ; వీణ = వీణ; ఆలాపన = రాగముతో, నాదముతో; రతిన్ = కూడినదాని, ఆసక్తి; చేసి = వలన; నారాయణ = నారాయణుని; కథ = కథల; గానంబు = గానము; చేయుచున్ = చేయుచు; చరియించుచున్ = తిరుగుతూ; ఉందున్ = ఉందును;

భావము:- ఈ విధంగా చెప్పి విరమించిన సర్వవ్యాపి, సర్వనియంత, వేదమయమూ అయిన ఆ మహాభూతానికి నేను తలవంచి మ్రొక్కాను. భగవంతుని అనుగ్రహానికి ఆనందించాను. మదాన్ని వీడాను. మాత్సర్యాన్ని దిగనాడాను. కామాన్ని అణచిపెట్టాను. క్రోధాన్ని వదలిపెట్టాను. లోభాన్ని, మోహాన్ని వదలి వేసాను. సంకోచం లేకుండా గొంతెత్తి అనంతుని అనంతనామాలు ఉచ్చరిస్తూ, పరమపవిత్రాలయిన హరి చరిత్రలనుస్మరిస్తూ, నిత్యసంతుష్టుడనై వాసుదేవుని హృదయంలోపదిలపరచుకొన్నాను. ప్రశాంతమైన అంతఃకరణంతో వైరాగ్యాన్ని అవలంబించి కాలాన్నినిరీక్షిస్తూతిరుగసాగాను. కొన్నాళ్లకు మెరుపుమెరిసినట్లుగామృత్యుదేవత నాముందుప్రత్యక్షమయింది. అప్పుడు నేను పంచభూతాత్మకమైనపూర్వదేహాన్ని పరి త్యజించి భగవంతునిదయవల్ల సత్త్వగుణాత్మకమైనభాగవతదేహంలో ప్రవేశించాను. తర్వాత కల్పాంతకాలం లో ఏకార్ణవమైన జలమధ్యంలో శ్రీమన్నారాయణుడు శయనించి ఉన్న సమయాన, బ్రహ్మదేవుని నిశ్వాసం తోపాటు నేనూ భగవానుని ఉదరంలోప్రవేశించాను. వెయ్యియుగాలుగడిచిపోయిన తర్వాతలేచి లోకాలు సృష్టించతలచెడి బ్రహ్మదేవునినిశ్వాసంనుంచి మరీచిమొదలైన మునులు, నేను జన్మించాము. ఈ జన్మలో నేను అస్ఖలితబ్రహ్మచారినై, భగవంతుని అనుగ్రహంవల్లత్రిలోకసంచారినై, పరబ్రహ్మముచేత సృష్టిం పబడిన సప్తస్వరాలు తమంతతామే మ్రోగే ఈ మహతి అనే వీణమీద విష్ణుకథలు గానంచేస్తూ ఇలా విహరిస్తున్నాను

## 1-131-ఆ.

**తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు**
**తన చరిత్ర మేను దవిలి పాడఁ,**
**జీరఁబడ్డవాని చెలువున నేతెంచి**
**ఘనుఁడు నామనమునఁ గానవచ్చు.**

టీక:- తీర్థ = తరింపజేయు; పాదుఁడు = పాదములు గలవాడు; అయిన = అయినట్టి; దేవుండు = దేవుడు; విష్ణుండు = విష్ణువు; తన = తనయొక్క; చరిత్ర = చరిత్రను; మేను = శరీరము; దవిలి = పులకరించి; పాడన్ = పాడగా; చీరఁబడ్డవాని = పిలువబడినవాని; చెలువునన్ = విధంగా; ఏతెంచి = వచ్చి; ఘనుఁడు = గొప్పవాడు – భగవంతుడు; నా = నాయొక్క; మనమునన్ = మనసులో; కానవచ్చున్ = కనిపిస్తాడు.

భావము:- నేను విష్ణుమూర్తి లీలలను గానం చేసినప్పుడు, తీర్థపాదుడు, దేవాదిదేవుడు, వాసుదేవుడు అయిన హరి పేరు పెట్టి పిలిచినట్లుగా వచ్చి నా మనస్సులో దర్శనము ఇచ్చేవాడు.

1-132-క.

విను మీ సంసారంబను
వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడువానికి వి
ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా!

టీక:- వినుము = వినుము; ఈ = ఈ; సంసారంబు = సంసారము; అను = అనే; వననిధి = సముద్రము; లోన్ = లోపల; మునిఁగి = మునిగిపోయి; కర్మ = కర్మములందు; వాంఛల = కోరికల; చేన్ = చేత; వేదనన్ = బాధను; పొందెడువాని = పడేవాడి; కిన్ = కి; విష్ణుని = హరియొక్క; గుణ = గుణముల; వర్ణనము = కీర్తించుట; తెప్ప = పడవ; సుమ్ము = సుమా; ముని = మునులలో; ఇంద్రా = శ్రేష్ఠుడా.

భావము:- ఓ వ్యాసమహర్షీ! ఈ సంసార సముద్రంలో మునిగి తేలుతూ విషయవాంఛలచే క్రిందుమీదై బాధపడేవానికి గోవింద గుణకీర్తనం గట్టుకు చేర్చే తెప్ప లాంటిది.

1-133-చ.

యమనియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ, గామరో
షములఁ బ్రచోదితంబ యగు, శాంతి వహింపదు, విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతిఁ గైకొనిన కైవడి; నాదు శరీర జన్మ క
ర్మముల రహస్య మెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరినన్."

టీక:- యమ = యమము; నియమ = నియమము; ఆది = మొదలగు; యోగములన్ = యోగా భ్యాస మార్గముల; ఆత్మ = ఆత్మ; నియంత్రితము = నియమింపపడినది; అయ్యున్ = అయినప్పటికిని; కామ = కామము; రోషములన్ = రోషములచే; ప్రచోదితంబు = ప్రేరేపింప బడినది; అగు = అగును; శాంతి = శాంతిని; వహింపదు = పొందదు; విష్ణు = హరియొక్క; సేవ = భక్తి; చేన్ = చేత; క్రమమున = క్రమముగా; శాంతిన్ = శాంతిని; కైకొనిన = పొందిన; కైవడిన్ = విధముగా; నాదు = నాయొక్క; శరీర = శరీరము; జన్మ = జన్మ; కర్మముల = కర్మముల (పుట్టుపూర్వోత్తరముల); రహస్యము = రహస్యము, మర్మము; ఎల్లన్ = అంతా; ముని = మునులకు; మండన = ప్రకాశించేవాడా; చెప్పితిన్ = చెప్పితిని; నీవు = నీవు; గోరినన్ = కోరగా.

భావము:- మునికులభూషణా! యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారాది అష్టాంగముల ద్వారా మనస్సును ఎంత కట్టుదిట్టం చేసుకొన్నప్పటికీ కామం, రోషం మొదలైన వానిచే అది మాటిమాటికీ రెచ్చిపోతూనే ఉంటుంది. కానీ శాంతించదు. అట్టి శాంతి వాసుదేవుని సేవ వల్లనే క్రమంగా లభిస్తుంది. నా పుట్టు పూర్వోత్తరాల రహస్యమంతా నీవు కోరిన ప్రకారం నీకు వివరించి చెప్పాను."

1-134-వ.

**అని యిట్లు భగవంతుం డగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని, వీణ వాయించుచు, యదృచ్ఛామార్గంబునం జనియె"నని,,సూతుం డిట్లనియె.**

టీక:- అని = అనిచెప్పి; ఇట్లు = ఈవిధముగ; భగవంతుండు = భగవంతుడు; అగు = అయినట్టి; నారదుండు = నారదుడు; వ్యాస = వ్యాసుడు అనే; మునీంద్రుని = మునులలో శ్రేష్ఠుని; వీడ్కొని = సెలవు తీసుకొని; వీణ = వీణను; వాయించుచున్ = వాయించుచు; యదృచ్ఛా = స్వేచ్ఛా, ఇచ్చవచ్చిన; మార్గంబునన్ = మార్గమున; చనియెన్ = వెళ్ళెను; అని = అనిచెప్పి; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అని ఈప్రకారంగా భగవంతుడయిన నారదుడు వ్యాసమునీంద్రునితో పలికి వీడ్కోలందు కొని వీణను మ్రోగించుకుంటూ వెళ్లిపోయాడు. అనంతరం సూతమహాముని శౌనకాదులతో ఇలా అన్నాడు.

1-135-క.

**"వాయించు వీణ నెప్పుడు,**
**మ్రోయించు ముకుందగీతములు, జగములకుం**
**జేయించుఁ జెవుల పండువు,**
**మాయించు నఘాళి నిట్టి మతి మఱి గలఁడే"**

టీక:- వాయించున్ = వాయించును; వీణన్ = వీణను; ఎప్పుడున్ = ఎల్లప్పుడు; మ్రోయించున్ = మ్రోగించును; ముకుంద = హరియొక్క; గీతములు = పాటలు; జగములు = లోకాల; కున్ = కు; చేయించుఁన్ = కలుగజేయును; చెవుల = చెవులకు; పండువు = పండుగ; మాయించున్ = మాయము చేయును; అఘాళిన్ = పాపములను; ఇట్టి = ఇటువంటి; మతి = బుద్ధిమంతుడు; మఱి = మరియొకడు; కలఁడే = ఉన్నాడా.

భావము:- “నారదమహర్షి సర్వదా మహతీ విపంచి వాయిస్తు, ముకుందగీతాలు మ్రోయిస్తు, సకల జగత్తులకు వీనులవిందు చేస్తు, లోకుల పాపసమూహాలను మాయిస్తు, సంచరించే మేటి భక్తుడు. ఆయనకు ఆయనే సాటి.”

1-136-వ.

**అని నారదుం గొనియాడిన సూతునిం జూచి "నారదు మాటలు విన్న వెనుక భగవంతుండైన బాదరాయణుం డేమి సేసె?"నని శౌనకుం డడిగిన సూతుం డిట్లనియె "బ్రహ్మదైవత్య యైన సరస్వతి పడమటి తీరంబున ఋషులకు సత్రకర్మ వర్ధనంబై బదరీ తరుషండ మండితం బయి "శమ్యాప్రాసం"బనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు గల; దందు జలంబుల వార్చి కూర్చుండి, వ్యాసుండు తన మదిం**

**దిరంబుసేసికొని భక్తియుక్తంబయిన చిత్తంబునం బరిపూర్ణుండయిన యీశ్వరుం గాంచి, యీశ్వరాధీన మాయావృతం బైన జీవుని సంసారంబుఁ గని, జీవుండు మాయచేత మోహితుం డయి గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుం డని యభిమానించుచుఁ ద్రిగుణత్వాభిమానంబునం గర్తయు భోక్తయు నను ననర్థంబు నొందు ననియు; నయ్యనర్థంబునకు నారాయణ భక్తి యోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదనియు నిశ్చయించి.**

టీక:- అని = అని; నారదున్ = నారదుని; కొనియాడిన = స్తుతించిన; సూతునిన్ = సూతుని; చూచి = చూసి; నారదు = నారదుని; మాటలు = ఉపదేశములు; విన్న = ఆలకించిన; వెనుక = తరువాత; భగవంతుండు = భగవంతుడు; ఐన = అయిన; బాదరాయణుండు = వ్యాసుడు {బాదరాయణుడు - బదరీవనములో నుండు వాడు, వ్యాసుడు}; ఏమి = ఏమి; సేసెన్ = చేసెను; అని = అని; శౌనకుండు = శౌనకుడు; అడిగిన = ప్రశ్నించగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = చెప్పెను; బ్రహ్మదైవత్య = బ్రహ్మ తనకు అధిదైవముగా గలది; ఐన = అయినట్టి; సరస్వతి = సరస్వతీనది; పడమటి = పశ్చిమ; తీరంబునన్ = తీరమున; ఋషులు = ఋషులు; కున్ = కు; సత్ర = యాగములయొక్క; కర్మ = కర్మలను; వర్ధనంబు = వృద్ధిచేయునది; ఐ = అయి; బదరీ = రేగుపళ్ళ; తరు = చెట్ల; షండ = గుంపుతో; మండితంబు = అలంకరింపడినది; అయి = అయి; శమ్యాప్రాసంబు = శమ్యాప్రాసము {శమ్యాప్రాసము - శమము యను ఆహారము గలది}; అనన్ = అనేపేరుతో; ప్రసిద్ధంబు = ప్రసిద్ధమైనది; అగు = అయినట్టి; ఆశ్రమంబు = ఆశ్రమము; కలదు = ఉన్నది; అందున్ = అక్కడ; జలంబులన్ = నదిలో; వార్చి = సంధ్యవార్చి; కూర్చుండి = కూర్చొని; వ్యాసుండు = వ్యాసుడు; తన = తనయొక్క; మదిన్ = మనసును; తిరంబు = స్థిరముగ; చేసికొని = చేసికొని; భక్తి = భక్తితో; యుక్తంబు = కూడినది; అయిన = అయినట్టి; చిత్తంబునన్ = చిత్తములో; పరిపూర్ణుండు = పరిపూర్ణుడు; అయిన = అయినట్టి; ఈశ్వరున్ = ఈశ్వరుని; కాంచి = దర్శించి; ఈశ్వర = ఈశ్వరునియొక్క; అధీన = అధీనములో ఉండే; మాయ = మాయతో; ఆవృతంబు = కప్పబడినది; ఐన = అయినట్టి; జీవుని = జీవునియొక్క; సంసారంబున్ = సంసారమును; కని = చూసి; జీవుండు = జీవుడు; మాయ = మాయ; చేతన్ = చేత; మోహితుండు = మోహింపబడినవాడు; అయి = అయి; గుణ = గుణములకంటెను; వ్యతిరిక్తుండు=వేరైనవాడు; అయ్యు=అయినప్పటికిని; మాయ=మాయతో; సంగతిన్= సహవాసము వలన; తాను = తాను; త్రి = మూడు; గుణ = గుణములు; ఆత్మకుండు = తనవిగా కలవాడు; అని = అనుకొని; అభిమానించుచున్ = (ఆ గుణములను) అభిమానించుచు; త్రి = మూడు; గుణత్ = గుణముల యందు; అభిమానంబునన్ = అభిమానమువలన; కర్తయున్ = కర్తను; భోక్తయున్ = భోక్తను; అను = అను; అనర్థంబు = అనర్థమును (అర్థము లేని అభిప్రాయము); ఒందును = పొందును; అనియున్ = అనియూ; ఆ = ఆ; అనర్థంబు = అనర్థమున; కున్ = నకు; నారాయణ = భగవంతుని; భక్తి = భక్తి; యోగంబు = యోగము; కాని = తప్ప; ఉపశమనంబు = అణగింపగలది; వేఱొకటి = మరొకటి; లేదు = లేదు; అనియు = అనీ; నిశ్చయించి = నిర్ణయించి.

భావము:- అంటూ నారదమహర్షిని సూతుడు స్తుతించగా "నారదుని మాటలు ఆలకించిన అనంతరం వ్యాసభగవానుడు ఏం చేసాడో చెప్ప" మని శౌనకుడు అడిగాడు. సూతుడు ఇలా చెప్పాడు. "బ్రహ్మదేవతాక

మైన సరస్వతీనది పడమటి తీరాన ఋషులు యజ్ఞాలు చేసుకోటానికి అనుకూలమై అనేక రేగుచెట్లతో నిండి శమ్యాప్రాసమనే ఆశ్రమం ఉంది. వ్యాసుడు ఆ ఆశ్రమానికి వెళ్లి తన చిత్తంలో భగవంతుణ్ణి దర్శించాడు. ఈశ్వరుని మాయ ఆవరించి ఉన్న జీవుని సంసారాన్ని చూశాడు. మాయా మోహితుడైన జీవుడు త్రిగుణాతీతుడై కూడా మయా ప్రభావం వల్ల గుణాభిమానం కలవాడై, తానే కర్తను భోక్తను అనే అనర్థభావనలు చేస్తాడని, ఈ అనర్థాన్ని ఉపశమింప చేయటానికి విష్ణుభక్తి అనే యోగం తప్ప మరొకటి ఏదీ లేదని నిశ్చయించాడు.

1-137-మ.

అవనీచక్రములోన నే పురుషుఁ డే యామ్నాయమున్ విన్న మా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁ జాలు భ
క్తివిశేషంబు జనించు నట్టి భువనక్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పగన్.

టీక:- అవనీ = భూ; చక్రము = మండలము; లోనన్ = లోపల; ఏ = ఏ; పురుషుఁడు = పురుషుడైనా; ఏ = ఏ; ఆమ్నాయమున్ = వేదమును; విన్న = విన్నచో; మాధవు = విష్ణువు; పైన్ = మీద; లోక = లోకములకు; శరణ్యు = శరణమైనవాని; పైన్ = మీద; భవములన్ = మళ్ళీపుట్టుటలను; తప్పింపఁగాన్ = తప్పించుటకు; చాలు = సామర్థ్యములు కల; భక్తి = భక్తి యనే; విశేషంబు = విశిష్ఠమైనది; జనించున్ = పుడుతుందో; అట్టి = అటువంటి; భువన = లోకములకు; క్షేమంకరంబు = శ్రేయస్సును కలిగించునది; ఐన = అయినట్టి; భాగవత = భాగవతము అనే; ఆమ్నాయమున్ = వేదమును; బాదరాయణుఁడు = వ్యాసుడు; తాన్ = తాను; కల్పించెన్ = సృష్టించెను; నేర్పు = నేర్పు; ఒప్పగన్ = అమరగా.

భావము:- ఈ విశాల భూమండలంలో ఏ మహాగ్రంథాన్ని విన్నంత మాత్రం చేతనే సంసారబంధాలు సమసిపోయి జగన్నాథుడైన నారాయణునిపై అచంచలమైన భక్తి ఆవిర్భవిస్తుందో, అట్టి లోకకల్యాణకరమైన మహాగ్రంథాన్ని, వేదస్వరూపమైన భాగవతాన్ని బాదరాయణ మహర్షి ఓర్పుతో నేర్పుతో రూపొందించాడు.

1-138-వ.

ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించె"నని చెప్పిన విని శౌనకుండు "నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండును నైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె?"ననవుడు; సూతుం డిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; భాగవతంబు = భాగవతమును; నిర్మించి = రచించి; మోక్ష = మోక్షమును; అర్థి = అర్థించువాడు; ఐన = అయినట్టి; శుకుని = శుకుని; చేన్ = చేత; చదివించెన్ = చదివించెను; అని = అని; చెప్పినన్ = చెప్పగా; విని = విని; శౌనకుండు = శౌనకుడు; నిర్వాణ = మోక్షమునందు; తత్పరుండును = నిష్ఠగలవాడును; సర్వ = సర్వము అందు; ఉపేక్షకుండును = ఉదాసీనత కలవాడును; ఐన = అయినట్టి; శుక =

శుకుడు అను; యోగి = యోగి; ఏమిటి = ఎందు; కిన్ = కొరకు; భాగవతంబు = భాగవతమును; అభ్యసించెన్ = అధ్యయనము చేసాడు; అనవుడు = అనగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నాడు.

భావము:- ఈ విధంగా మహాభాగవత మనే సంహితను కల్పించి ముముక్షువైన శ్రీశుకునిచే చదివించాడు" అని సూతుడు చెప్పగానే శౌనకముని విని "మోక్ష మందు మాత్రమే అపేక్ష కలిగి, సమస్త మందు ఉపేక్ష కల శుకయోగీంద్రుడు భాగవతాన్ని ఎందుకోసం అధ్యయనం చేసాడు" అని ప్రశ్నించగా సూతమహర్షి ఇలా అన్నాడు-

1-139-క.

"ధీరులు, నిరపేక్షులు, నా

త్మారాములునైన మునులు హరిభజనము ని

ష్కారణము చేయుచుందురు;

నారాయణుఁ డట్టి వాఁ, డనవ్యచరిత్రా!

టీక:- ధీరులు = విద్వాంసులు; నిరపేక్షులున్ = దేనియందు ఆపేక్షలేని వారు; ఆత్మారాములున్ = ఆత్మయందు ఆనందించువారును; ఐన = అయినట్టి; మునులు = మునులు; హరి = విష్ణువు యొక్క; భజనమున్ = సంకీర్తనమును; నిష్కారణము = కారణమేదీ లేకుండానే; చేయుచున్ = చేస్తూ; ఉందురు = ఉంటారు; నారాయణుఁడు = నారాయణుడు; అట్టి = అటువంటి; వాఁడు = వాడు; అనవ్య = పురాతనమైన; చరిత్రా = చరిత్ర కలవాడా.

భావము:- "పురాణప్రవర్తకా! శౌనకా! జితేంద్రియులు, నిష్కాములు, ఆత్మారాములు అయిన మహా మునులు ఫలాపేక్ష లేకుండానే కారణములేకనే భక్తితో శ్రీహరిని భజిస్తూ ఉంటారు. శ్రీమన్నారాయణుడు సైతం భక్తుల విషయంలో కారణము లేకుండానే కటాక్షిస్తూ ఉంటాడు.

1-140-క.

హరిగుణవర్ణన రతుఁడై

హరితత్పరుఁడైన బాదరాయణి శుభత

త్పరతంబఠించెఁ ద్రిజగ

ద్వరమంగళమైన భాగవత నిగమంబున్.

టీక:- హరి = హరియొక్క; గుణ = గుణముల; వర్ణన = వర్ణన యందు; రతుఁడు = ఆసక్తి గలవాడు; ఐ = అయి; హరి = హరి యందు; తత్పరుఁడు = నిష్ఠగలవాడు {హరి తత్పరుడు - తను కానిది హరి మాత్రమే అని నడచువాడు}; ఐన = అయినట్టి; బాదరాయణి = శుకుడు {బాదరాయణి - బాదరాయణుని పుత్రుడు, శుకుడు}; శుభ = శుభమునందు; తత్పరతన్ = నిష్ఠతో; పఠించెన్ = చదివెను; త్రి = మూడు; జగత్ = లోకములకు; వర = శ్రేష్ఠమైన; మంగళము = శుభము; ఐన = అయినట్టి; భాగవత = భాగవతము అనే; నిగమంబున్ = వేదమును.

భావము:- శ్రీహరి గుణకీర్తన మందు ఆసక్తుడూ, ఉత్తమ విష్ణుభక్తుడూ అయిన శుకమహర్షి ముల్లోకాలకూ కల్యాణప్రదమైన భాగవతము అనే వేదమును విశ్వశ్రేయస్సును ఆకాక్షించి అధ్యయనం చేసాడు.

★1-141-క.

నిగమములు వేయుఁ జదివిన

సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్.

సుగమంబు భాగవత మను

నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!"

టీక:- నిగమములు = వేదములు; వేయున్ = వేలకొలది; చదివినన్ = పఠించినను; సుగమం బులు = సులభముగ అర్థము అగునవి; కావు = కావు; ముక్తి = ముక్తినిచ్చు; సుభగత్వంబుల్ = సౌభాగ్యములు; సుగమంబు = సులభము అగును; భాగవతము = భాగవతము; అను = అనబడే; నిగమంబున్ = వేదమును; పఠింప = చదివినచో; ముక్తి = ముక్తి; నివసనము = నివాసము, ఇల్లు; బుధా = జ్ఞానవంతుడా.

భావము:- జ్ఞానవంతుడా! వేలకొద్దీ వేదాలను ఎంత చదివినా మోక్షసంపదలు అందుకోడం అంత సుళువు కాదు. అదే భాగవతము, అనే వేదాన్ని పఠిచటం ద్వారా అయితే మోక్షం అతి సుళువుగా దొరుకుతుంది."

## ద్రౌపది పుత్రశోకం

1-142-వ.

అని పలికి "రాజర్షియైన పరీక్షిన్మహారాజు జన్మ కర్మ ముక్తులునుఁ, బాండవుల మహాప్రస్థానంబునుఁ, గృష్ణకథోదయంబునుఁ జెప్పెదం; గౌరవ ధృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గంబు నకుం జనిన వెనుక, భీము గదాఘాతం బున దుర్యోధనుండు తొడలువిఱిగికూలిన, నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియం బు సేయు వాఁడై నిదురవోవు ద్రౌపదీపుత్త్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమ ర్పించె; నది క్రూరకర్మంబని లోకులు నిందింతురు.

టీక:- అని = అని; పలికి = పలికి; రాజర్షి = రాజర్షి {రాజర్షి - వైదిక సంప్రదాయ అనువర్తి యైన రాజు}; ఐన = అయిన; పరీక్షిత్ = పరీక్షిత్తు అను; మహా = గొప్ప; రాజు = రాజు; జన్మ = పుట్టుక; కర్మ = నడత; ముక్తులును = ముక్తిపొందిన విధములను; పాండవుల = పాండవులయొక్క; మహా = గొప్ప (తిరిగిరాని); ప్రస్థానంబును = ప్రయాణమును; కృష్ణ = కృష్ణుని; కథ = కథకు; ఉదయంబును = ప్రారంభమును; చెప్పెదన్ =

చెప్పెదను; కౌరవ = కౌరవులు; ధృష్టద్యుమ్న = ధృష్టద్యుమ్నుడు; ఆదుల = మొదలగువారల; యుద్ధంబునన్ = యుద్ధములో; వీరులైన = వీరమరణము పొందిన; వారలు = వారు; స్వర్గంబు = స్వర్గము; కున్ = కు; చనిన = పోయిన; వెనుక = తరువాత; భీము = భీముని; గద = గదయొక్క; ఆఘాతంబున = దెబ్బలవలన; దుర్యోధనుండు = దుర్యోధనుడు; తొడలు = తొడలు, ఊరువులు; విఱిగి = విరిగి; కూలిన = పడిపోయిన; అశ్వత్థామ = అశ్వత్థామ; దుర్యోధను = దుర్యోధను; కున్ = కు; ప్రియంబు = సంతోషము; చేయువాఁడు = కలుగ చేయువాడు; ఐ = అయి; నిదురవోవు = నిద్రించుచున్న; ద్రౌపదీ = ద్రౌపదియొక్క; పుత్త్రుల = కొడుకుల; శిరంబులున్ = శిరస్సులు; ఖండించి = నరికి; తెచ్చి = తీసుకువచ్చి; సమర్పించెన్ = సమర్పించెను; అది = ఆపని; క్రూర = క్రూరమైన; కర్మంబు = పని; అని = అని; లోకులు = ప్రజలు; నిందింతురు = నిందిస్తారు.

భావము:- రాజర్షియైన పరీక్షిత్తుజన్మవృత్తాంతాన్ని, ధర్మకార్యాలను, మోక్షప్రాప్తిని, పాండవుల మహాప్రస్థానాన్ని కృష్ణ కథోదయాన్ని నీకు వివరిస్తాను. కౌరవ పాండవులకు జరిగిన కురుక్షేత్ర సంగ్రామంలో వీరులైనవారు చాలామందిచనిపోయి స్వర్గానికివెళ్లారు. అనంతరం భీమసేనుని గదా దండం దెబ్బకు దుర్యోధనుడు తొడలు విరిగి నేల కొరిగాడు. గురుపుత్రుడైన అశ్వత్థామ దుర్యోధను నికి సంతోషం కలిగించటం కోసం నిద్రాక్తులైన ద్రౌపది కుమారుల శిరస్సులు ఖండించాడు. అది చాలా దారుణమైన పని అని, లోకు లందరు ఈ క్రూరకృత్యానికి అశ్వత్థామను నిందించారు.

## 1-143-ఉ.

### బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి, యలంగి, యోరువం
### జాలక, బాష్పతోయ కణజాలము చెక్కుల రాల నేడ్చి, పాం
### చాలతనూజ నేలఁబడి జాలిఁ బడం గని, యెత్తి, మంజువా
### చాలతఁ జూపుచుం, జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్.

టీక:- బాలుర = కొడుకుల; చావు = మృతి; కర్ణములన్ = చెవులలో; పడ్డన్ = పడగా; కలంగి = కలతచెంది; అలంగి = శోకించి; ఓరువన్ = ఓర్చుకొన; చాలక = లేక; బాష్ప = కన్నీటి; తోయ = నీటి; కణ = బిందువుల; జాలము = సమూహము; చెక్కుల = చెంపల వెంట; రాలన్ = రాలునట్లుగ; ఏడ్చి = దుఃఖించి; పాంచాల = పాంచాల రాజు యొక్క; తనూజ = కూతురు; నేలన్ = నేలపై; పడి = పడినదై; జాలిన్ = బాధ; పడన్ = పడుతుండగ; కని = చూచి; ఎత్తి = పైకిలేపి; మంజు = మృదువైన; వాచాలతన్ = మాటల చాతుర్యము; చూపుచున్ = ప్రదర్శిస్తూ; చికురజాలమున్ = ముంగురుల సమూహము; దువ్వుచున్ = దువ్వుతూ; క్రీడి = అర్జునుడు; ఇట్లు = ఈ విధముగ; అనున్ = అన్నాడు.

భావము:- కన్న కొడుకులంతా, అశ్వత్థామ ఖడ్గానికి బలైపోయారని విని ద్రౌపది దుఃఖాన్ని సహించలేకపోయింది. చెక్కిళ్లపై కన్నీళ్లు కాలువలు కట్టేలా ఏడ్చి జాలితో క్రింద పడి దొర్లుతున్న ద్రౌపదిని అర్జునుడు చూసాడు. ఆమెను ఓదార్చి, మధురమైన మాటలతో ధైర్యం చెప్తుతూ ఆమె ముంగురులు దువ్వుతూ ఇలా అన్నాడు-

1-144-మ.

"ధరణీశాత్మజ వీవు, నీకు వగవన్ ధర్మంబె? యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల, మద్గాండీవ నిర్ముక్త భీ
కరబాణంబుల నేఁడు వానిశిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ, ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడు మిచటన్ శీతాంశుబింబాననా!"

టీక:- ధరణీశ = రాజ; ఆత్మజవు = కుమారివి; ఈవు = నీవు; నీకు = నీకు; వగవన్ = దుఃఖించుట; ధర్మంబె = మంచిపనా; ఆ = ఆ; ద్రౌణి = ద్రోణుని కొడుకు (అశ్వత్థామ); నిష్కరుణుండు = కరుణలేనివాడు; ఐ = అయి; విదళించె = ఖండించెను; బాలకులన్ = బాలురను; మత్ = నాయొక్క; గాండీవ = గాండీవమునుండి; నిర్ముక్త = వదలబడు; భీకర = భీకరమైన; బాణంబులన్ = బాణములతో; నేఁడు = ఈదినము; వాని = అతని; శిరమున్ = శిరస్సును; ఖండించి = నరికి; నేన్ = నేను; దెత్తున్ = తెస్తాను; తత్ = ఆయొక్క; శిరమున్ = తలను; త్రొక్కి = త్రొక్కి; జలంబులాడు = స్నానము చేయుము; ఇచటన్ = ఇక్కడ; శీతాంశు = చంద్రుని {శీతాంశుడు - చల్లని కిరణాలు కలవాడు, చంద్రుడు}; బింబ = బింబము వంటి; ఆననా = ముఖము గలదానా.

భావము:- "చంద్రుని వంటి మోముగల ద్రౌపదీ! నీవు రాజకుమారివి. క్షత్రియకాంతవు అయి నీకు, చనిపోయిన వారికోసం విచారించటం ధర్మం కాదు. ఇదిగో విను, ఆ అశ్వత్థామ దయాదాక్షిణ్యాలు లేనివాడై నీ బిడ్డలను చంపాడు. అందుకు ప్రతీకారంగా నా గాండీవం నుండి మహోగ్రబాణాలను వేసి వాని శిరస్సు ఖండించి నీకు కానుకగా తీసుకొని వస్తాను. ఆ తలను ఇక్కడ కాలితో తన్ని స్నానం చేద్దువు గాని."

1-145-వ.

అని యిట్లొడంబఱచి, తనకుమిత్త్రుండును, సారథియు నైన హరి మేలనుచుండం, గవచంబు దొడిగి, గాండీవంబు ధరియించి, కపిధ్వజుండై, గురుసుతుని వెంట రథంబు దోలించిన.

టీక:- అని = పలికి; ఇట్లు = ఈ విధముగ; ఒడన్ = ఒప్పునట్లు; పఱచి = చేసి; తన = తన; కున్ = కు; మిత్త్రుండును = స్నేహితుడును; సారథియును = సారథియు; ఐన = అయినట్టి; హరి = కృష్ణుడు; మేలు = మంచిది; అనుచున్ = అని పలుకుచూ; ఉండన్ = ఉండగ; కవచంబు = కవచమును; తొడిగి = ధరించి; గాండీవంబు = గాండీవమును; ధరియించి = తీసుకొని; కపి = ఆంజనేయుని గుర్తు; ధ్వజుండు = జండాపై ధరించినవాడు (అర్జునుడు); ఐ = అయి; గురుసుతుని = అశ్వత్థామ {గురుసుతుడు - ద్రోణుని పుత్రుడు, అశ్వత్థామ}; వెంట = వెనుక తరిమి; రథంబు = రథమును; తోలించినన్ = నడిపించగ.

భావము:- ఇలా ద్రౌపదికి నచ్చజెప్పి ఆత్మీయుడైన శ్రీకృష్ణుడు "మేలుమే"లని ప్రశంసిస్తుండగా, అర్జునుడు కవచాన్ని ధరించి గాండీవాన్ని చేతబట్టి, కపిధ్వజంతో కూడిన రథాన్ని సారథియై నారాయణుడు ముందుకు నడుపుతూ ఉండగా అశ్వత్థామను వెంటతరుముతూ వెళ్ళాడు.

1-146-శా.

**తన్నుం జంపెద నంచు వచ్చు విజయున్ దర్శించి, తద్ద్రౌణి యా**
**పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్,**
**మున్నాబ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప, నా**
**సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియభ్రాంతితోన్.**

టీక:- తన్నున్ = తనను; చంపెదన్ = సంహరించెదను; అంచు = అనుచు; వచ్చు = వస్తూ ఉన్న; విజయున్ = అర్జునుని; దర్శించి = చూసి; తత్ = ఆయొక్క; ద్రౌణి = ద్రోణుని పుత్రుడు అశ్వత్థామ; ఆపన్నుండు = ఆపదచెందినవాడు; ఐ = అయి; శిశు = పిల్లలను; హంత = సంహరించినవాడు; కావున = కనుక; నిజ = తన; ప్రాణ = ప్రాణములమీది; ఇచ్ఛన్ = మమకారముతో; పాఱెన్ = పారిపోయాడు; వడిన్ = వేగంగా; మున్న = పూర్వము; ఆ; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; మృగ = లేడి; ఆకృతిన్ = రూపముతో; తనయ = పుత్రిక; కున్; మోహించి = మోహించి; క్రీడింపన్ = క్రీడించగా; ఆసన్నుండు = సమీపించుతున్న వాడు; ఔ = అగు; హరున్ = శివుని; చూచి; పాఱు = పారిపోవు; పగిదిన్ = విధముగా; సర్వ = సమస్త; ఇంద్రియ = ఇంద్రియములు; భ్రాంతి = భయము; తోన్ = తో.

భావము:- శిశుహంతకుడు అయిన అశ్వత్థామ తనను సంహరించటం కోసం సన్నద్ధుడై వస్తున్న అర్జునుణ్ణి చూచి, విభ్రాంతుడై దిక్కు తోచక ప్రాణాలు కాపాడు కోవటం కోసం అలోచించాడు. పూర్వం బ్రహ్మదేవుడు లేడి రూపం దాల్చి, కామాతురుడై కన్న కూతుర్ని మోహించి; పరమశివుణ్ణి చూసి పారియిన విధంగా, అశ్వత్థామ పారిపోసాగాడు.

1-147-వ.

**ఇట్లోపినంత దూరంబు బరువిడి వెనుకఁ జూచి రథతురంగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి, జలంబుల వార్చి, ద్రోణనందనుండు సమాహితచిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారం బు నేరకయుఁ, బ్రాణసంరక్షణార్థంబు పార్థునిమీద బ్రహ్మశిరోనామకాస్త్రంబుం బ్రయోగించిన, నది ప్రచండ తేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణి భయంకరం బై తోఁచిన, హరికి నర్జునుం డిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈవిధముగా; ఓపిన = సాధ్యమైన; అంత = అంతటు; దూరంబున్ = దూరము; పరువిడి = పరుగెత్తి; వెనుకన్ = వెనుకకు; చూచి = చూసి; రథతురంగంబులు = రథమునకు కట్టిన గుఱ్ఱములు; అలయుటన్ = అలసట పొందుట; తెలిసి = తెలుసుకొని; నిలిచి = ఆగి; ప్రాణ = ప్రాణములను; రక్షంబు = రక్షించుకొనుట; కున్ = కు; ఒండు = మరొక; ఉపాయంబు = ఉపాయము; లేమిన్ = లేకపోవుటను; నిశ్చయించి = నిర్ణయించుకొని; జలంబులవార్చి = ఆచమనం చేసి (సంకల్పించుకొని); ద్రోణనందనుండు = అశ్వత్థామ

{ద్రోణనందనుడు – ద్రోణుని పుత్రుడు, అశ్వత్థామ}; సమాహిత = కూడతీసుకొన్న; చిత్తుండు = మనసుకలవాడు; ఐ = అయి; ప్రయోగంబ = ప్రయోగించుట; కాని = తప్ప; ఉపసంహారంబు = మరలించుట; నేరకయున్ = తెలియకపోయినను; ప్రాణ = ప్రాణములను; సంరక్షణార్థంబు = రక్షించుకొనుటకు; పార్థుని = అర్జునుని {పార్థుడు - పృథ పుత్రుడు, అర్జునుడు}; మీదన్ = పైన; బ్రహ్మశిరస్ = బ్రహ్మశిరస్సు అనే; నామక = పేరుగల; అస్త్రంబున్ = అస్త్రమును; ప్రయోగించినన్ = వేసిన; అది = ఆ బ్రహ్మాస్త్రము; ప్రచండ = భయంకరమైన; తేజంబునన్ = వెలుగుతో; దిక్ = దిక్కులయొక్క; అంతరాళంబున్ = మధ్యభాగమంతా; నిండి = నిండిపోయి; ప్రాణి = జీవులకు; భయంకరంబు = భయము కలిగించునది; ఐ = అయి; తోఁచినన్ = అనిపించగా; హరి = కృష్ణుని, హరి; కిన్ = కి; అర్జునుండు = అర్జునుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = అన్నాడు;

భావము:-ఈప్రకారంగా ఓపికున్నంతవరకుపారిపోతున్న అశ్వత్థామ ఒక్కమాటు వెనక్కుతిరిగి చూశాడు; రథాశ్వాలు అలసిపోయినట్లుగా తెలిసికొన్నాడు; ఇక తన ప్రాణాల్ని రక్షించుకోవటానికి వేరే ఉపాయం లేదనే నిశ్చయంతో, అశ్వత్థామ ఆచమనం చేసి, ఏకాగ్ర చిత్తంతో ప్రయోగమే గాని ఉపసంహారం తెలియని బ్రహ్మశిరో నామకాస్త్రాన్ని పార్థునిపై ప్రయోగించాడు. ఆ బ్రహ్మశిరోనామకాస్త్రం ప్రచండ తేజంతో సకల దిక్కులూ వ్యాపించి, సర్వప్రాణులకూ భయం కలిగిస్తూ, విజృంభించటం చూసి అర్జునుడు, కృష్ణుని ఇలా అర్థించాడు.

1-148-సీ.

"పద్మలోచన! కృష్ణ! భక్తాభయప్రద! -
 వినుము, సంసారాగ్నివేఁగుచున్న
జనుల సంసారంబు సంహరింపఁగ నీవు-
 దక్క నన్యులు లేరు తలఁచి చూడ,
సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు,-
 ప్రకృతికి నవ్వలి ప్రభుఁడ, వాద్య
పురుషుండ వగు నీవు బోధముచే మాయ-
 నడఁతువు నిశ్శ్రేయసాత్మ యందు

1-148.1-ఆ.

మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప
సేసి ధర్ముముఖ్యచిహ్నమయిన
శుభము సేయు దీవు, సుజనుల నవనిలోఁ
గావఁ బుట్టుదువు, జగన్నివాస!

టీక:- పద్మలోచన = హరీ {పద్మలోచనుడు – పద్మముల వంటి కన్నులు కలవాడు, కృష్ణుడు}; కృష్ణ = కృష్ణా, హరీ; భక్త = భక్తులకు; అభయ = అభయమును; ప్రద = ఇచ్చువాడా, హరీ; వినుము = విను; సంసార = సంసారమనే; అగ్నిన్ = అగ్నిలో; వేఁగుచున్న = వేగుచున్నట్టి; జనుల = మానవుల; సంసారంబున్ = సంసారము నందలి మాయను; సంహరింపఁగ = హరించి వేయుటకు; నీవున్ = నువ్వు; తక్కన్ = తప్ప; అన్యులు = ఇతరులు; లేరు = లేరు; తలఁచి = ఆలోచించుకొని; చూడన్ = చూడగా; సాక్షాత్కరించిన = సాక్షాత్తు; సర్వ = సమస్తమునకు; ఈశ్వరుండవు = భగవంతుడవు; ప్రకృతి = ప్రకృతి; కిన్ = కి; అవ్వలి = పరమైన; ప్రభుఁడవు = అధిపుడవు అయినవాడవు; ఆద్య = మూల కారణమైన; పురుషుండవు = పరమపురుషుడు; అగు = అయినట్టి; నీవు = నీవు; బోధము = జ్ఞానము; చేన్ = చేత; మాయన్ = మాయను; అడఁతువు = అణచి వేస్తావు; నిశ్శ్రేయస = ముక్తి పొందిన {నిశ్శ్రేయస్సు – (ఇక పొందవలసిన) శ్రేయస్సులు లేనిది, ముక్తి}; ఆత్మ = ఆత్మ; అందున్ = లో;

మాయ = మాయా; చేతన్ = కి; మునిఁగి = చిక్కుకొని; మను = జీవించు; వారలు = వారు; కున్ = కి; కృప = దయ; చేసి = చేసి; ధర్మ = ధర్మమునకు; ముఖ్య = ముఖ్యమైన; చిహ్నము = గుర్తు; అయిన = అయినట్టి; శుభము = శుభములను; చేయుదు = చేకూరుస్తావు; ఈవు = నీవు; సుజనులన్ = మంచివారిని; అవని = భూలోకము; లోన్ = లో; కావన్ = కాపాడుటకు; పుట్టుదువు = అవతరిస్తావు; జగన్నివాస = హరీ జగన్నివాసుడు – లోకాలకి నివాసమైనవాడు, విష్ణువు;

భావము:- “పద్మాక్షా! భక్తజనరక్షాపరాయణా! శ్రీకృష్ణా! సంసారాగ్నిలో తపించిపోతున్న జనుల కష్టాన్ని పోగొట్టటం నీకు తప్ప మరొకరికి శక్యం కాదు. నీవు సాక్షాత్తూ సర్వేశ్వరుడవు. ఈ ముల్లోకాలకు అవ్వలివాడవు. ఆదిపురుషుడవైన ప్రభుడవు నీవు ముముక్షువులకు జ్ఞానాన్ని ప్రసాదించి మాయను మటుమాయం చేస్తావు. నీవు మాయాజాలంలో మునిగిన వారికి ధర్మసమ్మతమైన తేజస్సును అనుగ్రహిస్తావు. ఓ జగన్నివాసా! శిష్టరక్షణ కోసమే నీవీ జగత్తులో అవతరిస్తావు.

## 1-149-క.

**ఇది యొక తేజము, భూమియుఁ**
**జదలును దిక్కులును నిండి, సర్వంకషమై**
**యెదురై వచ్చుచు నున్నది,**
**విదితముగా నెఱుగఁ జెప్పవే దేవేశా!"**

టీక:- ఇది = ఇదిగో; ఒక = ఒక; తేజము = తేజోమయమైనది; భూమియున్ = భూమిని; చదలును = ఆకాశమును; దిక్కులును = దిక్కులను; నిండి = నిండిపోయి; సర్వంకషమై = అన్నిటిని ఒరుసుకు పోతూ; ఎదురై = ఎదురుగా; వచ్చుచున్ = వస్తూ; ఉన్నది = ఉంది; విదితముగాన్ = వివరముగా; ఎఱుగన్ = తెలియునట్లు; చెప్పవే = చెప్పుము; దేవేశా = దేతలలో శ్రేష్ఠుడా.

భావము:- దేవాదిదేవా! వాసుదేవా! ఇదేదో ఒక ప్రచండమైన తేజస్సు, భూమ్యాకాశాలు, దిక్కులు వ్యాపించి ఎదురుగా వస్తున్నది. దీని స్వరూప మేమిటో నాకు తెలియ జెప్పు”

1-150-వ.

అనిన హరి యిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; హరి = హరి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అర్జునుని మాటలు విని శ్రీకృష్ణు ఇలా పలికాడు-

1-151-శా.

"జిహ్మాత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై
బ్రహ్మాస్త్రం బదె యేసె; వచ్చెనిదె తద్బాణాగ్ని, బీభత్సు! నీ
బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు, సంహార మీ
బ్రహ్మాపత్య మెఱుంగఁ, డేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై."

టీక:- జిహ్మాత్వంబునన్ = వక్రబుద్ధితో; పాఱి = పారిపోవు; ద్రోణజుఁడు = అశ్వత్థామ {ద్రోణజుడు - ద్రోణునికొడుకు, అశ్వత్థామ}; దుశ్శీలుండు = చెడ్డ శీలముగలవాడు; ప్రాణ = ప్రాణములమీది; ఇచ్ఛము = కోరిక; ఐ = కొరకు; బ్రహ్మాస్త్రంబు = బ్రహ్మాస్త్రము; అదె = అదిగో; ఏసెన్ = వేసెను; వచ్చెన్ = వస్తున్నది; ఇదె = ఇదిగో; తత్ = దాని; బాణ = బాణము యొక్క; అగ్ని = అగ్ని యొక్క; బీభత్స = అర్జునా {బీభత్సుడు - బీభత్సము (అతి క్రూరత్వము)గా యుద్ధము చేయువాడు, అర్జునుడు}; నీ = నీ; బ్రహ్మాస్త్రంబున్ = బ్రహ్మాస్త్రమువలన; కాని = తప్పించి; దీనిన్ = దీనిని; మరలింపన్ = మరలించుటకు; రాదు = వీలుకాదు; సంహారము = మరలించుట; ఈ = ఈ; బ్రహ్మాపత్యము = బ్రాహ్మణ వంశీయుడు; ఎఱుంగఁడు = ఎరుగడు; ఏయుము = వేయుము; వడిన్ = తొందరగా; బ్రహ్మాస్త్రమున్ = బ్రహ్మాస్త్రమును; దీని = దీని; పైన్ = మీద.

భావము:- "అర్జునా! నిప్పులు చెరుగుతూ ఆ వచ్చేది బ్రహ్మాస్త్రం. దీనిని పిక్కబలంతో పారిపోతున్న కుటిలాత్ముడు, ధూర్తుడు అయిన అశ్వత్థామ తన ప్రాణం రక్షించుకోడానికి ప్రయోగించాడు. దీన్ని త్రిప్పి కొట్టటానికి నీ బ్రహ్మాస్త్రం తప్ప మరొక్కటి సమర్థం కాదు. బ్రాహ్మణయువకుడైన ఈ అశ్వత్థామకు బ్రహ్మాస్త్ర ప్రయోగం తప్ప ఉపసంహారం తెలియదు. ఆలస్యం చేయకుండా దీనిపై నీ బ్రహ్మాస్త్రం ప్రయోగించు."

1-152-వ.

అనిన నర్జునుండు జలంబుల వార్చి, హరికిం బ్రదక్షిణంబు వచ్చి, ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబు మీదఁ దన బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన.

టీక:- అనినన్ = అని ఆదేశించిన; అర్జునుండు = అర్జునుడు; జలంబులవార్చి = సంక ల్పించుకొని; హరి = కృష్ణుని; కిన్ = కి; ప్రదక్షిణంబు = ప్రదక్షిణ; వచ్చి = చేసి; ద్రోణనందనుండు = ద్రోణుని కుమారుడు అశ్వత్థామ; ఏసిన = వేసినట్టి; బ్రహ్మాస్త్రంబు = బ్రహ్మాస్త్రము; మీదన్ = పైన; తన = తన యొక్క; బ్రహ్మాస్త్రంబున్ = బ్రహ్మాస్త్రమును; ప్రయోగించిన = ప్రయోగించగా;

భావము:- వాసుదేవుని వచనాలు వినగానే అర్జునుడు ఆచమనం చేసి, కృష్ణునికి ప్రదక్షిణం చేసి, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం మీద తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

1-153-మ.

**అవనివ్యోమము లందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్**
**రవివహ్నిద్యుతిఁ బోరుచుం, ద్రిభువనత్రాసంబుఁ గావింపగా,**
**వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప నా వేళ మా**
**ధవు నాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్.**

టీక:- అవని = భూమి; వ్యోమములు = ఆకాశముల; అందున్ = లో; నిండి = నిండిపోయి; తమలోన = తమలోతాము; ఆ = ఆ; రెండు = రెండు; బ్రహ్మాస్త్రముల్ = బ్రహ్మాస్త్రములు; రవి = సూర్యుని; వహ్ని = అగ్ని; ద్యుతిన్ = కాంతి కలిగి; పోరుచున్ = పోరాడుతూ; త్రి = మూడు; భువన = లోకములకు; త్రాసంబున్ = భయము కలుగు నట్లు; కావింపగా = చేయగా; వివశ = ఒడలు తెలియని; భ్రాంతిన్ = భ్రమతో; యుగ = యుగమునకు; అంతమో = అంతమేమో; అని = అనుకొనుచూ; ప్రజల్ = ప్రజలు; వీక్షింపన్ = చూస్తుండగా; ఆ = ఆ; వేళ = సమయములో; మాధవున్ = కృష్ణుని {మాధవుడు - మాధవి భర్త, విష్ణువు}; ఆజ్ఞన్ = ఆదేశము ప్రకారము; విజయుండు = అర్జునుడు; చేసెన్ = చేసెను; విశిఖ = బాణముల; ద్వంద్వ = ద్వయమును; ఉపసంహారమున్ = మరలించుట.

భావము:- మిన్నూమన్నూ ఏకంచేస్తూ ఆబ్రహ్మాస్త్రాలు రెండూ, ఇద్దరు సూర్యులులాగా, అగ్నిహోత్రులు లాగ పరస్పరం ఘోరంగా పోరు సాగించాయి. అది చూసి భయంతో ముల్లోకాలూ కంపించాయి. ప్రళయకాలమేమోనని ప్రజలంతా భయభ్రాంతులతో పరికింపసాగారు. ఇదంతా శ్రీకృష్ణుడు చూచాడు. అర్జునునికి ఆజ్ఞ ఇచ్చాడు. బ్రహ్మాస్త్రాలు రెండింటినీ పార్థుడు ఉపసంహరించాడు.

1-154-వ.

**ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి, ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి తఱిమి పట్టుకొని, రోషారుణితలోచనుండై యాజ్ఞికుండు రజ్జువునం బశువుఁ గట్టిన చందంబున బంధించి, శిబిరంబు కడకుం గొనిచని, హింసింతు నని తిగిచినం జూచి, హరి యిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈ విధముగా; అస్త్ర = అస్త్రములు; ద్వయంబున్ = రెండింటిని; ఉపసంహరించి = మరల్చి; ధనంజయుండు = అర్జునుడు; ద్రోణనందనున్ = ద్రోణుని పుత్రుని, అశ్వత్థామ; కూడ = వెనుక; అరిగి = వెళ్ళి; తఱిమి = తరిమి; పట్టుకొని = పట్టుకొని; రోష = రోషముచే; అరుణిత = ఎఱ్ఱబారిన; లోచనుండు = కళ్ళు కలిగిన వాడు; ఐ = అయి; యాజ్ఞికుండు = యజ్ఞము చేయు వాడు; రజ్జువునన్ = తాడుతో; పశువున్ = పశువును; కట్టిన = కట్టిన; చందంబునన్ = విధముగా; బంధించి = కట్టి; శిబిరంబు = గుడారము; కడ = దగ్గర;

కున్ = కు; కొని = తీసుకొని; చని = వెళ్ళి; హింసింతును = సంహరించెదను; అని = అని; తిగిచినన్ = లాక్కొస్తుండగా; చూచి = చూసి; హరి = కృష్ణుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నాడు.

భావము:- ఈ విధంగా అస్త్రాలు రెండింటిని ఉపసంహరించిన అనంతరం, పార్థుడు అశ్వత్థామను వెంటాడి పట్టుకొన్నాడు; యాజ్ఞికుడు యజ్ఞంలో పశువును బంధించినట్లు, కోపంతో ఎఱ్ఱబడ్డ కళ్ళతో అర్జునుడు, అతణ్ణి త్రాళ్లతో బంధించాడు; అలా అర్జునుడు "శిబిరానికి లాగికొని వెళ్ళి ఈ ధూర్తుణ్ణి చిత్రహింస పెడతా" నని, అశ్వత్థామను ఈడ్చుకుని రావడం చూసి, అధికమైన క్రోధంతో కృష్ణుడు ఇలా అన్నాడు-

## 1-155-ఉ.

"మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్న పాఁపల వధించె నిశీథము నందుఁ గ్రూరుఁడై,
పాఱుఁడె వీఁడు పాతకుఁడు, ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బాఱెడి వీని గావుము కృపామతి నర్జున! పాపవర్జనా!

టీక:- మాఱు = తిరుగ; పడంగ = పడుటకు శక్తి; లేని = లేనట్టి; అసమర్థుల = సమర్థత లేనివారిని; సుప్తుల = నిద్రించినవారిని; అస్త్ర = అస్త్ర ప్రయోగ; విద్యలన్ = విద్యలందు; తేఱని = ఆరితేరని; పిన్న = చిన్న; పాఁపలన్ = పిల్లలను; వధించెన్ = చంపెను; నిశీథము = చీకటి రాత్రి; అందున్ = లో; క్రూరుఁడు = క్రూరమైన పనులు చేయువాడు; ఐ = అయి; పాఱుఁడె = బ్రాహ్మణుడా; వీఁడు = ఇతడు; పాతకుఁడు = మహాపాపము చేసినవాడు; ప్రాణ = ప్రాణములమీద; భయంబునన్ = భయముతో; వెచ్చన్ = వేడి యైన; ఊర్చుచున్ = నిట్టూర్పులు నిగిడ్చుచు; పాఱెడిన్ = పారిపోవుచున్నాడు; వీనిన్ = ఇతనిని; కావుము = కాపాడుము; కృపామతిన్ = దయాబుద్ధితో; అర్జున = అర్జునుడా; పాప = పాపములను; వర్జనా = విడిచినవాడా.

భావము:- "పరమ దుర్మార్గుడిలా తనను ఎదిరించే శక్తి లేని వారు, గాఢనిద్రలో ఉన్నవారు, అస్త్రవిద్యలలో నేర్పులేనివారు, చిన్నపిల్లలు అని కూడా చూడకుండా రాత్రి చీకటిలో చంపేసాడు. వీడు బ్రాహ్మణుడా కాదు, పాపిష్టివాడు. కానీ పార్థ! నీవు పాపాలను వదలగొట్టే వీరుడవు, వీడేమో ప్రాణాల మీది భయంతో ఒగర్చుకుంటూ పారిపోతున్నాడు కనుక క్షమించి వదలిపెట్టు.

## 1-156-చ.

వెఱచినవాని, దైన్యమున వేఁదుఱు నొందినవాని, నిద్ర మై
మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావినవాని, భగ్నుడై
పఱచినవాని, సాధు జడభావమువానిని, గావు మంచు వా
చఱచినవానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు, ఫల్గునా!

టీక:- వెఱచిన = భయపడిన; వానిన్ = వాడిని; దైన్యమున = దీనత్వముతో; వేఁదుఱున్ = గాబరా; ఒందిన = పొందినట్టి; వానిన్ = వాడిని; నిద్రన్ = నిద్రలో; మై = మేను, ఒళ్ళు; మఱచిన = తెలియకుండా ఉన్న; వానిన్ = వాడిని; సౌఖ్యమున = సుఖంగా; మద్యము = మత్తు పానీయము; త్రావిన = తాగినట్టి; వానిన్ = వాడిని; భగ్నుడు = భంగపడినవాడు; ఐ = అయి; పఱచిన = పారిపోయే; వానిన్ = వాడిని; సాధు = మంచివానిని; జడ = జడత్వ, మందబుద్ధి; భావము = భావముగల; వానిన్ = వాడిని; కావుము = కాపాడుము; అంచున్ = అనుచు; వాచఱచిన = మొరపెట్టుకొనే; వానిన్ = వాడిని; కామినులన్ = స్త్రీలను; చంపుట = సంహరించుట; ధర్మము = ధర్మము; కాదు = కాదు; ఫల్గునా = అర్జునా.

భావము:- ఫల్గుణా! భయపడిన వాడిని, దిగులుతో మతిభ్రమించిన వాడిని, నిద్రపోయిన వాడిని, మద్యపానంచేసి మైమరచిన వాడిని, పరాజితుడై పారిపోయే వాడిని, కదలక మెదలక పడి ఉన్నవాడిని, రక్షించమని వేడినవాడిని, ఆడవారిని చంపటం ధర్మం కాదు గదా.

1-157-శా.

**స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ, గరుణాసంగంబు సాలించి య**
**న్యప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ, డధోలోక దుః**
**ఖప్రాప్తుండగురాజదండమున సత్కల్యాణుఁ డౌ, నైన నీ**
**విప్రున్ దండితుఁ జేయ నేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్?"**

టీక:- స్వ = తనయొక్క; ప్రాణంబులన్ = ప్రాణములకొరకు; ఎవ్వఁడేనిన్ = ఎవడైనా; కరుణ = దయయొక్క; సంగంబు = స్పర్శ; చాలించి = విడిచిపెట్టి; అన్య = ఇతరులను; ప్రాణంబుల = ప్రాణముల; చేతన్ = వలన; రక్షణము = కాపాడుట; సేయన్ = చేయని; వాఁడు = వాడు; అధః = క్రింది, నరక; లోక = లోకములలోని; దుఃఖ = దుఃఖములను; ప్రాప్తుండు = పొందువాడు; అగున్ = అగును; రాజ = రాజుయొక్క; దండమున = శిక్షవలన; సత్ = మంచి; కల్యాణుఁడు = శుభమైన మార్గము పట్టినవాడు; ఔను = అగును; ఐనన్ = ఐన; ఈ = ఈ; విప్రున్ = బ్రాహ్మణుని; దండితున్ = దండింపబడినవానిని; చేయన్ = చేయుట; ఏటి = ఎందుల; కిన్ = కు; మహా = మిక్కిలి; విభ్రాంతి = విభ్రాంతి; చేన్ = లో; ఉండఁగన్ = ఉండగా.

భావము:- ఎవడైతే కనికరం లేకుండా తన ప్రాణాలు కాపాడుకోవటం కోసం పరుల ప్రాణాలు తీస్తాడో, అటువంటి దుర్మార్గుడు నరకలోకంలో నానా దుఃఖాలూ అనుభవిస్తాడు; అయితే రాజు వాణ్ణి శిక్షిస్తే వాడి పాపం నశించి, వాడికి శ్రేయస్సు లభిస్తుంది; కాని ఈ అశ్వత్థామ భయభ్రాంతుడై యున్నాడు గదా, కఠినంగా శిక్షించకు."

1-158-వ.

**అని యివ్విధంబునఁ గృష్ణుఁ డానతిచ్చిన, బ్రాహ్మణుండు కృతాపరాధుం డయ్యు వధ్యుండు గాఁడను ధర్మంబుఁ దలఁచి చంపక, ద్రుపదరాజ పుత్త్రికిం దన చేసిన**

ప్రతిజ్ఞం దలంచి, బద్ధుండైన గురునందనుందోడ్కొని, కృష్ణుండు సారథ్యంబు సేయ, శిబిరంబుకడకు వచ్చి.

టీక:- అని = అని; ఈ = ఈ; విధంబునన్ = విధముగా; కృష్ణుఁడు = కృష్ణుడు; ఆనతి = ఆజ్ఞ; ఇచ్చినన్ = ఇవ్వగా; బ్రాహ్మణుండు = బ్రాహ్మణుడు; కృత = చేసిన; అపరాధుండు = అపరాధము చేసినవాడు; అయ్యు = అయినప్పటికిని; వధ్యుండు = చంప దగినవాడు; కాఁడు = కాడు; అను = అను; ధర్మంబున్ = ధర్మమును; తలఁచి = తలచుకొని; చంపక = చంపకుండా; ద్రుపదరాజపుత్రిక = ద్రౌపది; కిన్ = కి; తన = తను; చేసిన = చేసినట్టి; ప్రతిజ్ఞన్ = వాగ్దానమును; తలంచి = జ్ఞాపకము చేసుకొని; బద్ధుండైన = బంధింపడిన; గురునందనున్ = అశ్వత్థామని {గురునందనుడు - గురువు (ద్రోణుని) కొడుకు, అశ్వత్థామ}; తోడున్ = తనతోకూడా; కొని = తీసుకొని వెళ్ళి; కృష్ణుండు = కృష్ణుడు; సారథ్యంబు = రథము నడపుట; సేయన్ = చేయగా; శిబిరంబు = గుడారము; కడ = దగ్గర; కున్ = కు; వచ్చి = వచ్చి.

భావము:- ఈ విధంగా కృష్ణుడు వివరించగా"అపరాధం చేసినప్పటికిని బ్రాహ్మణుణ్ణి చంపకూడదు" అనే ధర్మాన్ని కూడా స్మరించి, అర్జునుడు అశ్వత్థామను సంహరించలేదు. పాంచాల రాజపుత్రి సమక్షంలో తాను పలికిన ప్రతిజ్ఞ పాటించడం కోసం కాళ్లూ చేతులూ కట్టేసి అశ్వత్థామను లాక్కునివచ్చి ఎత్తి రథం పైన పడవేశాడు. కృష్ణుడు అశ్వాలను అదలించాడు. రథం శిబిరం వద్దకు చేరింది.

## అశ్వత్థామని తెచ్చుట

1-159-క.

సురరాజసుతుఁడు చూపెను
దురవధి సుతశోకయుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగశ్రేణిం
బరుష మహాపాశ బద్ధపాణిన్ ద్రౌణిన్.

టీక:- సురరాజసుతుఁడు = అర్జునుడు {సురరాజసుతుడు - ఇంద్రుని కొడుకు, అర్జునుడు}; చూపెను = చూపించాడు; దురవధి = అంతులేని; సుత = పుత్ర; శోక = శోకంతో; యుత = కూడిన ఆమె; కున్ = కు; ద్రుపదునిసుత = ద్రౌపది {ద్రుపదునిసుత – దృపద మహారాజు పుత్రిక, ద్రౌపది}; కున్ = కి; పరిచలిత = వణుకుతున్న; అంగ = అవయవములు; శ్రేణిన్ = సమూహముగల; పరుష = మోటైన; మహా = పెద్దది అయిన; పాశ = త్రాటితో; బద్ధ = కట్టబడిన; పాణిన్ = చేతులుకలవాడు; ద్రౌణిన్ = ద్రోణుని పుత్రుని, అశ్వత్థామని.

భావము:- ఇచ్చిన మాట నెరవేర్చుకొన్న ఇంద్రనందనుడు, గట్టి త్రాళ్లతో కాళ్లూ చేతులూ బిగింపబడి గిలగిల కొట్టుకొంటున్న అశ్వత్థామను, పుత్ర శోకంతో పరితపిస్తున్న ద్రౌపది ముందు తెచ్చి పడేశాడు.

1-160-వ.

**ఇట్లర్జునుండు దెచ్చి చూపిన, బాలవధ జనిత లజ్జా పరాఙ్ముఖుం డైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి, సుస్వభావ యగు ద్రౌపది యిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈ విధముగా; అర్జునుండు = అర్జునుడు; తెచ్చి = తీసుకొని వచ్చి; చూపిన = చూపించగా; బాల = పిల్లలను; వధ = సంహరించుటచే; జనిత = పుట్టిన; లజ్జా = సిగ్గుచే; పరాన్ = పెడ; ముఖుండు = ముఖము వాడు; ఐన = అయినట్టి; కృపి = కృపి {కృపి - కృపాచార్యుని చెల్లెలు, ద్రోణుని భార్య}; కొడుకున్ = కొడుకుని; చూచి = చూసి; మ్రొక్కి = నమస్కరించి; సు = మంచి; స్వభావ = స్వభావముగలది; అగు = అయినట్టి; ద్రౌపది = ద్రౌపది; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- చిన్న పిల్లల ప్రాణాలు తీసిన తన నీచత్వానికి సిగ్గుతో అశ్వత్థామ ద్రౌపది ముందు తల ఎత్తలేకపోయాడు. సుగుణవతి అయిన ద్రౌపది పరాఙ్ముఖుడైన అశ్వత్థామను చూసి, నమస్కరించి, ఇలా అన్నది

★1-161-మ.

**"పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోపసం**
**హరణాద్యాయుధవిద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం**
**చిరి; పుత్త్రాకృతి నున్న ద్రోణుడవు; నీ చిత్తంబులో లేశముం**
**గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే?**

టీక:- పరఁగన్ = ప్రసిద్ధముగా; మా = మా యొక్క; మగవారలు = భర్తలు; అందఱును = అందరూ; మున్ = పూర్వము; బాణ = బాణములను; ప్రయోగ = ప్రయోగించుట; ఉపసంహరణ = మరల్చుట; ఆది = మొదలగు; ఆయుధ = అస్త్ర; విద్యలు = విద్యలు; అన్నియును = అన్నీ; ద్రోణ = ద్రోణుడు అను; ఆచార్యు = గురువు; చేన్ = వలన; అభ్యసించిరి = నేర్చుకొంటిరి; పుత్త్ర = పుత్రుని యొక్క; ఆకృతిన్ = రూపముతో; ఉన్న = ఉన్నటువంటి; ద్రోణుడవు = ద్రోణుడవు; నీ = నీ; చిత్తంబు = మనసు; లోన్ = లో; లేశమున్ = కొంచెము కూడా; కరుణ = దయ యొక్క; సంగము = స్పర్శ; లేక = లేకుండా; శిష్య = శిష్యుల యొక్క; సుతులన్ = పుత్రులను; ఖండింపఁగాన్ = చంపడం; పాడియే = న్యాయమా.

భావము:- "ఇంతకుముందు గురువర్యులు ద్రోణాచార్యులవారి సన్నిధిలోనే కదా మా మగవాళ్ళు అందరూ బాణాలు ప్రయోగించటం ఉపసంహరించటం మొదలైన యుద్ధవిద్యలు అన్నీ అభ్యసించారు. అశ్వత్థామా! నీవు పుత్రరూపంలో ఉన్న ద్రోణాచార్యుడవు కదా. అలాంటి నీకు హృదయంలో కనికరం అన్నది ఇసుమంతైనా లేకుండా ఇలా శిష్యుల సంతానాన్ని చంపడం న్యాయమా చెప్పు? నాయనా!

★1-162-క.

భూసురుఁడవు, బుద్ధిదయా

భాసురుఁడవు, శుద్ధవీరభటసందోహా

గ్రేసరుఁడవు, శిశుమారణ,

మాసురకృత్యంబు ధర్మ మగునే? తండ్రీ!

టీక:- భూసురుఁడవు = బ్రాహ్మణుడవు; బుద్ధి = బుద్ధియందు; దయా = దయతో; భాసురుఁడవు = ప్రకాశించువాడవు; శుద్ధ = చక్కటి; వీర = వీరుల; భట = భటుల; సందోహ = సమూహములో; అగ్రేసరుఁడవు = పెద్దనాయకుడవు; శిశు = పిల్లలను; మారణము = సంహరించుట; అసుర = రాక్షసపు; కృత్యంబు = పని; ధర్మ = న్యాయము; అగునే = అవుతుందా; తండ్రీ = అయ్యా.

భావము:- తండ్రీ! దివ్యమైన బ్రాహ్మణుడివి కదయ్యా; వివేక, దయాదాక్షిణ్యాలతో ప్రకాశించేవాడివి కదయ్యా; వీరాధివీరులందరిలో ఎన్నదగ్గ వాడివి కదయ్యా; అలాంటి నువ్వు బాలుర ప్రాణాలు తీసే ఇలాంటి రాక్షసకృత్యానికి పాల్పడడం ధర్మమా? చెప్పు.

★1-163-శా.

ఉద్రేకంబున రారు, శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు, కిం

చిద్ద్రోహంబును నీకుఁ జేయరు, బలోత్సేకంబుతోఁ జీఁకటిన్

భద్రాకారులఁ, బిన్నపాఁపల, రణప్రౌఢక్రియాహీనులన్,

నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతు లెట్లాడెనో?

టీక:- ఉద్రేకంబున = ఉద్రేకముతో; రారు = రారు; శస్త్ర = శస్త్రములు; ధరులు = ధరించినవారు; ఐ = అయి; యుద్ధ = రణ; అవనిన్ = భూమిలో; లేరు = లేరు; కించిత్ = కొంచెముకూడా; ద్రోహంబును = ద్రోహమును; నీకున్ = నీకు; చేయరు = చేయరు; బల = బలమువలని; ఉత్సేకంబు = ఉద్రేకము; తోన్ = తో; చీకటిన్ = చీకట్లో; భద్ర = బంగారములాంటి; ఆకారులన్ = రూపమున్న వారిని; పిన్న = చిన్న; పాఁపల = పిల్లలను; రణ = యుద్ధము; ప్రౌఢ = నేర్పుగా; క్రియా = చేయుట; హీనులన్ = రానివారిని; నిద్ర = నిద్రపోవుటందు; ఆసక్తులన్ = ఆసక్తితో ఉన్నవారిని; సంహరింపన్ = చంపుటకు; అకటా = అయ్యో; నీ = నీ యొక్క; చేతులు = చేతులు; ఎట్లు = ఎలా; ఆడెనో = వచ్చాయో.

భావము:- ఉద్రేకంతో నీ పైకి దూకలేదే; యుద్ధరంగంలో ఆయుధపాణులై ఎదురు నిలువలేదే; లవలేశం కూడా నీకు అపకారం చేయలేదే; అటువంటి చిన్నవాళ్లను, అందాలు చిందే పిన్నవాళ్లను, యుద్ధవిద్యలు ఇంకా సరిగా నేర్వని వాళ్లను, నిద్రలో ఆదమరచి ఉన్న వాళ్లను కారుచీకటిలో, వీరావేశంతో వధించటానికి అయ్యో! నీకు చేతు లెలా వచ్చాయయ్యా?

★1-164-ఉ.

అక్కట! పుత్త్ర శోక జనితాకులభార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయ మాత, నేఁ
డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో?"

టీక:- అక్కట = అయ్యో; పుత్త్రశోక = పుత్రులు పోయిన దుఃఖం వలన; జనిత = పుట్టిన; ఆకుల = బాధ యొక్క; భార = భారముతో; విషణ్ణ = దుఃఖ పడిన; చిత్తన్ = మనసు కల దానను; ఐ = అయి; పొక్కుచున్ = కుమిలిపోతూ; ఉన్న = ఉన్నట్టి; భంగిన్ = విధంగానే; నినున్ = నిన్ను; పోరన్ = యుద్ధములో; కిరీటి = అర్జునుడు; నిబద్ధున్ = బంధింపబడిన వానిగా; చేసి = చేసి; నేఁడు = ఇవాళ; ఇక్కడ = ఇక్కడ; కున్ = కు; ఈడ్చి = లాక్కొంటూ; తెచ్చుటన్ = తీసుకొచ్చుటను; సహింపనిది = ఓర్చుకో లేనిది; ఐ = అయి; భవదీయ = మీ యొక్క; మాత = తల్లి; నేఁడు = ఇవాళ; ఎక్కడన్ = ఎక్కడ; ఇట్టి = ఇలాంటి; శోకమున = దుఃఖముతో; ఏ = ఏ; క్రియన్ = విధంగా; ఏడ్చుచున్ = ఏడుస్తూ; పొక్కుచు = కుమిలిపోతూ; ఉన్నదో = ఉన్నదోకదా.

భావము:- పుత్రశోకంతో బరువెక్కి వ్యాకుల మైన చిత్తంతో నేను ఇక్కడ ఏడుస్తు ఉన్నాను. అలాగే పోరాటంలో అర్జునుడు నిన్ను కట్టేసి ఈడ్చుకొచ్చాడన్న విషయం తెలిసి, అయ్యయ్యో! అశ్వత్థామా! అక్కడ మీ అమ్మ కూడా తట్టుకోలేక ఎంతటి దుఃఖంతో కుమిలి పోతూ ఉంటుందో కదా."

1-165-వ.

అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె.

టీక:- అని = అని పలికి; కృష్ణ = కృష్ణ; అర్జునులన్ = అర్జునులను; చూచి = చూసి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = అన్నది.

భావము:- ఈ విధంగా అశ్వత్థామతో పలికి ద్రౌపది కృష్ణార్జునులను చూసి ఇలా అన్నది-

1-166-ఉ.

"ద్రోణునితో శిఖింబడక ద్రోణకుటుంబిని యున్న దింట, న
క్షీణతనూజ శోకవివశీకృతనై విలపించుభంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో?
ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే.

టీక:- ద్రోణుని = ద్రోణుని; తోన్ = తో; శిఖిన్ = అగ్నిలో; పడక = పడకుండా; ద్రోణ = ద్రోణునియొక్క; కుటుంబిని = భార్య; ఉన్నది = ఉన్నది; ఇంటన్ = ఇంటిలో; అక్షీణ = తరుగని; తనూజ = పుత్ర; శోక = శోకమున; వివశీకృతను = కలతచెందినబుద్ధి గలదానను; ఐ = అయి; విలపించు = ఏడ్చుచున్న; భంగిన్ = విధముగా; ఈ =

ఈ; ద్రౌణిన్ = ద్రోణుడి పుత్రుని; తెరల్చి = మరల్చి; తెచ్చుట = తీసుకొని వచ్చిన; కున్ = అందుకు; దైన్యమున్ = దీనత్వమును; ఒందుచున్ = పొందుతూ; ఎంత = ఎంతగా; పొక్కునో = కుమిలి పోవునో; ప్రాణ = ప్రాణములు; వియుక్తుఁడు = విడిచినవాడు; ఐన = అయినచో; అతి = మిక్కిలి; పాపము = పాపము; బ్రాహ్మణ = బ్రాహ్మణులను; హింసన్ = హింసించుటను; మానరే = మానండి.

భావము:- "ఆచార్య ద్రోణునితో సహగమనం చేయకుండా ఆచార్యుని పత్ని అయిన కృపి ఇంకా బ్రతికే ఉంది. ఇలా ఒంటరి జీవితం గడుపుతున్న ఆ యిల్లాలు తన ఏకైక పుత్రుణ్ణి బంధించి పట్టుకు వెళ్లారని విని భరింపరాని పుత్రశోకంతో నాలాగే గుండెలు పగిలేటట్లు ఎంత అక్రోశిస్తున్నదో? మీరు ఈ అశ్వత్థామను హింసించటం మానండి. పాపం ఇతడు ప్రాణాలు కోల్పోతే మనకు మహాపాపం చుట్టుకుంటుంది.

★1-167-క.

భూపాలకులకు విప్రుల

గోపింపం జేయఁ దగదు కోపించినఁ, ద

త్కోపానలంబు మొదలికి

భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్."

టీక:- భూపాలకులు = రాజుల; కున్ = కి; విప్రులన్ = బ్రాహ్మణులను; కోపింపన్ = కోపించుట; చేయన్ = చేయుటకు; తగదు = తగినది కాదు; కోపించినన్ = కోపము చేసినచో; తత్ = ఆ యొక్క; కోప = కోపము అనే; అనలంబు = అగ్ని; మొదలి = మొదలకి; కిన్ = అంటా; భూపాల = రాజులు అను; అటవులన్ = అడవులను; కాల్చు = కాల్చివేయును; భూ = భూమి; కంపముగన్ = కంపించునట్లుగా.

భావము:- ప్రజాపాలకులగు క్షత్రియులు బ్రాహ్మణులకు కోపం తెప్పించేలా చేయరాదు. అలా చేస్తే, విప్రుల కోపాగ్ని జ్వాల కార్చిచ్చులా భూకంపంలా వారి వంశాల నాశనానికి దారితీస్తుంది."

1-168-వ.

అని యిట్లు ధర్మ్యంబును, సకరుణంబును, నిర్వ్యళీకంబును, సమంజస మును, శ్లాఘ్యంబునుంగాఁ బలుకు ద్రౌపది పలుకులకు ధర్మనంద నుండు సంతసిల్లె; నకుల, సహదేవ, సాత్యకి, ధనంజయ, కృష్ణులు, సమ్మతించిరి; సమ్మతింపక భీముం డిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధంగా; ధర్మ్యంబును = ధర్మమునకు అనుకూలముగానూ; సకరుణంబును = దయతో కూడినవిగానూ; నిర్వ్యళీకంబును = కపటములేనివిగానూ; సమంజస మును = న్యాయబద్ధముగానూ; శ్లాఘ్యంబునున్ = పొగడతగినదిగానూ; కాఁన్ = అగునట్లు; పలుకు = పలికే; ద్రౌపది = ద్రౌపది {ద్రౌపది - దృపదుని కూతురు}; పలుకులు = మాటలు; కున్ = కి; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుడు -

ధర్మదేవతకొడుకు, ధర్మరాజు}; సంతసిల్లెన్ = సంతోషించెను; నకుల = నకులుడు; సహదేవ = సహదేవుడు; సాత్యకి = సాత్యకి; ధనంజయ = అర్జున; కృష్ణులు = కృష్ణులు; సమ్మతించిరి = ఒప్పుకొన్నారు; సమ్మతింపక = ఒప్పుకొనక; భీముండు = భీముడు; ఇట్లు = ఈ విధంగా; అనియెన్ = అన్నాడు.

భావము:-"ఇలా ద్రౌపది ధర్మసమ్మతంగా, దాక్షిణ్యసహితంగా నిష్కపటంగా, నిష్పక్షపాతంగా, న్యాయంగా, ప్రశంసనీయంగా పలికింది; ఆ పాంచాలి పలుకులకు ధర్మరాజు సంతోషించాడు; నకుల సహదేవులు, సాత్యకి, కృష్ణార్జునులు సమ్మతించారు; భీమసేనుడు మాత్రం తన అసమ్మతి ప్రకటిస్తూ ఇలా అన్నాడు

## ★1-169-చ.

**"కొడుకులఁ బట్టి చంపె నని కోపము నొందదు; బాలఘాతుకున్**
**విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది, వీఁడు విప్రుఁడే?**
**విడువఁగ నేల? చంపుఁ డిటు వీనిని మీరలు సంపరేని నా**
**పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్."**

టీక:- కొడుకులన్ = కొడుకులను; పట్టి = పట్టుకొని; చంపెన్ = చంపేసాడు; అని; కోపమున్ = కోపం; ఒందదు = పొందదు; బాల = పిల్లలను; ఘాతుకున్ = సంహరించిన వానిని; విడువుము = వదలిపెట్టండి; అటంచున్ = అంటూ; చెప్పెడిని = చెప్తోంది; వెఱ్ఱిది = వెఱ్ఱిబాగులది; ద్రౌపది = ద్రౌపది; వీఁడు = ఇతడు; విప్రుఁడే = బ్రాహ్మణుడా; విడువఁగన్ = వదలిపెట్టుట; ఏల = ఎందుకు; చంపుఁడు = చంపండి; ఇటు = ఇలా; వీనిని = ఇతనిని; మీరలు = మీరు; సంపరేని = చంపకపోతే; నా = నాయొక్క; పిడికిటి = పిడికిలి; పోటునన్ = పోటుతో; శిరము = తల; భిన్నము = బద్దలు; సేసెదన్ = కొడతాను; చూడుఁడు = చూడండి; ఇందఱున్ = మీరు అందరూ.

భావము:- “తన కన్నకొడుకులను చంపేసాడు అని తెలిసినా కూడ ఈ శిశుహంతకుడు అశ్వత్థామ మీద ఈ ద్రౌపది కోపం తెచ్చుకోటం లేదు; పైగా వదిలిపెట్టమంటోంది; ఎంత పిచ్చిదో చూడండి; బ్రాహ్మణుడు కదా వదలేయండి అంటోంది; ఇంతటి కసాయితనం చూపే వీడు బ్రాహ్మణుడా? చెప్పండి. వీడిని వదలవలసిన అవసరం ఏమీ లేదు; చంపెయ్యండి; మీరు కనుక చంపకపోతే నేనే ఓగుద్దు గుద్ది వీడి బుఱ్ఱబద్దలుకొట్టేస్తాను; మీరంతా చూస్తూ ఉండండి.”

## 1-170-వ.

**అని పలికిన, నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె; భీముని సంరంభంబు సూచి, హరి చతుర్భుజుం డయి, రెండు చేతుల భీముని వారించి, కడమ రెంటను ద్రుపద పుత్రికను దలంగించి, నగుచు భీముని కిట్లనియె**

టీక:- అని = అని; పలికినన్ = పలుకగా; అశ్వత్థామ = అశ్వత్థామ; కున్ = కి; ద్రౌపది = ద్రౌపది; అడ్డంబు = అడ్డం; వచ్చె = వచ్చింది; భీముని = భీముని యొక్క; సంరంభంబు = వేగిరి పాటు; సూచి = చూసి; హరి = కృష్ణుడు; చతుర్ = నాలుగు; భుజుండు = భుజములుగలవాడు; అయి = అయి; రెండు = రెండు; చేతుల = చేతులతో;

భీముని = భీముడిని; వారించి=ఆపి; కడమ = మిగిలిన; రెంటను = రెండింటితోను; ద్రుపదపుత్రికనున్ = ద్రౌపదిని; తలంగించి = తప్పించి; నగుచు = నవ్వుతూ; భీముని = భీముని; కిన్ = కి; ఇట్లు = ఈ విధంగా; అనియె = చెప్పాడు.

భావము:- భీముడు అన్నంత పనీ చేస్తాడనే భయంతో పాంచాలి అశ్వత్థామకు అడ్డం వచ్చింది. భీముని తొందరపాటు చూసి శ్రీకృష్ణుడు తన చతుర్భుజత్వం సార్థకంగా ఈ ప్రక్క రెండు చేతులతో భీముణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. ఆ ప్రక్క రెండు చేతులతో పాంచాలిని ప్రక్కకు తప్పిస్తూ భీమునితో నవ్వుతూ ఇలా చెప్పాడు.

## 1-171-ఉ.

**"అవ్వఁడు గాఁడు వీఁడు, శిశుహంత, దురాత్మకుఁ, డాతతాయి, హం**
**తవ్యుఁడు, బ్రహ్మబంధుఁ డగుఁ దప్పదు నిక్కము "బ్రాహ్మణో నహ**
**న్తవ్య" యటంచు వేదవిదితం బగుఁ గావున, ధర్మ దృష్టిఁ గ**
**ర్తవ్యము వీనిఁ గాచుట; యథాస్థితిఁ జూడుము, పాండవోత్తమా!"**

టీక:- అవ్వఁడు = రక్షింప తగ్గవాడు; కాఁడు = కాడు; వీఁడు = ఇతడు; శిశు = పిల్లలను; హంత = చంపినవాడు; దురాత్మకుడు = చెడ్డబుద్ధికలవాడు; ఆతతాయి = హత్యలుచేసేవాడు{ఆతతాయి - ఇంటికి నిప్పెట్టేవాడు, విషము పెట్టేవాడు, కత్తి పట్టుకొని నరికేవాడు, ధనము దోచుకొనే వాడు, నేల నపహరించువాడు, ఇతరుల భార్యను చెరపట్టేవాడు వీరు ఆరుగురుని ఆతతాయి అంటారు}; హంతవ్యుఁడు = చంపదగినవాడు; బ్రహ్మబంధుఁడు = భ్రష్టబ్రాహ్మణుడు {బ్రాహ్మబంధువు - భ్రష్టుడైన బ్రాహ్మణునకు జాతీయము}; అగున్ = అగును; తప్పదు = తప్పదు; నిక్కము = నిజము; బ్రాహ్మణోనహన్తవ్య = బ్రాహ్మణులను చంపరాదు; అటంచు = అని అంటూ; వేద = వేదములలో; విదితంబు = తెలుపబడినది; అగున్ = అయ్యున్నది; కావున = అందుచేత; ధర్మ = ధర్మమునకు తగిన; దృష్టిన్ = దృష్టితో; కర్తవ్యము = చేయవలసినది; వీనిన్ = ఇతడిని; కాచుట = కాపాడుట; యథాస్థితిన్ = ఉన్నపరిస్థితిని; చూడుము = చూడు; పాండవ = పాండవులలో; ఉత్తమా = ఉత్తముడా (భీమా).

భావము:- "పాండుకులభూషణా! భీమా! శిశు ఘాతకుడు, దుష్టుడు, ఆతతాయి (ఇంటికి నిప్పెట్టే వాడు, విషము పెట్టేవాడు, కత్తిపట్టుకొనినరికేవాడు, ధనము దోచుకొనే వాడు, నేల నపహరించువాడు, ఇతరుల భార్యను చెరపట్టేవాడు వీరు ఆరుగురుని ఆతతాయి అంటారు) అయిన ఈ అశ్వత్థామ చంపదగినవాడే కాని రక్షింపదగిన వాడు కానేకాదు. ఇదిముమ్మాటికీసత్యం. అయితే"బ్రాహ్మణో న హంతవ్యః" అనే వేదవాక్యం వినవస్తున్నది. ఈధర్మసూక్ష్మం ప్రకారం ఇతణ్ణి రక్షించటమే న్యాయంగా తోస్తున్నది. యథార్థం నీవే ఆలోచించు" అన్నాడు.

1-172-వ.

**అని సరసాలాపంబులాడి, పవన నందను నొడంబఱచి యర్జునుం జూచి "ద్రౌపదికి, నాకు, భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు, నా పంపు సేయు"మని నారాయణుం డానతిచ్చిన నర్జునుండు నారాయణానుమతంబున.**

టీక:- అని = అని; సరస = సరసములైన; ఆలాపంబులు = మాటలు; ఆడి = చెప్పి; పవననందనున్ = భీముని {పవననందనుడు - వాయుదేవుని పుత్రుడు, భీముడు}; ఒడంబఱచి = ఒప్పించి; అర్జునున్ = అర్జుడిని; చూచి = చూసి; ద్రౌపది = ద్రౌపది; కిన్ = కిని; నాకు = నాకును; భీమసేనుడు = భీముడు; కున్ = కి; సమ్మతంబుగ = అంగీకారం అయ్యేటట్లుగా; మున్ను = ఇంతకుముందు; నీ = నీవు; చేసిన = చేసినట్టి; ప్రతిజ్ఞయు = ప్రతిజ్ఞకూడా; సిద్ధించున్ = నెరవేరే; అట్లు = విధంగా; నా = నా; పంపు = ఆజ్ఞ ప్రకారము; సేయుము = చెయ్యి; అని = అని; నారాయణుండు = కృష్ణుడు; ఆనతి = ఆదేశము; ఇచ్చిన = ఇవ్వగా; అర్జునుండు = అర్జునుడు; నారాయణ = కృష్ణుని; అనుమతంబున = సమ్మతితో.

భావము:- ఈ విధంగా చతురోక్తులతో, భీముడిని చల్లపరచి, శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి చూసి "అర్జునా! ద్రౌపదికి, నాకు, భీముడికి సమ్మతమయ్యేలాగా, నీ ప్రతిజ్ఞ నెరవేరేలాగా ఈ విధంగా చెయ్యి." అని కర్తవ్యం సూచించాడు; అర్జునుడు కృష్ణుని ఆజ్ఞ ప్రకారంగా. .

## అశ్వత్థామ గర్వ పరిహారంబు

1-173-శా.

**విశ్వస్తుత్యుఁడు, శక్రసూనుఁడు, మహావీరుండు ఘోరాసిచే**
**నశ్వత్థామ శిరోజముల్దఱిఁగి, చూడాంతర్మహారత్నమున్**
**శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని, పాశవ్రాతబంధంబులన్**
**విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్.**

టీక:- విశ్వ = లోకముచే; స్తుత్యుఁడు = స్తుతింప దగినవాడు; శక్రసూనుఁడు = అర్జునుడు {శక్రసూనుడు - ఇంద్రుని పుత్రుడు, అర్జునుడు}; మహా = గొప్ప; వీరుండు = వీరుడు; ఘోర = భయంకరమైన; అసి = పదునుకల కత్తి; చేన్ = తో; అశ్వత్థామ = అశ్వత్థామ; శిరోజముల్ = కేశములు; తఱిఁగి = తెగ్గోసి; చూడ = జుట్టు; అంతర = లోని; మహా = గొప్ప; రత్నమున్ = రత్నమును; శశ్వత్ = శాశ్వతమైన; కీర్తి = కీర్తి; వెలుంగన్ = ప్రకాశింపగా; పుచ్చుకొని = తీసికొని; పాశ = తాళ్ల; వ్రాత = సమూహము యొక్క; బంధంబులన్ = కట్లను;

విశ్వాసంబునన్ = నమ్మకముగ; ఊడ్చి = విప్పి; త్రోచెన్ = నెట్టెను; శిబిర = గుడారముయొక్క; ఉర్వి = భూమి; భాగమున్ = భాగమును (ప్రదేశము); పాసి = తొలగి; పోన్ = పోవునట్లుగా.

భావము:- విశ్వమంతా కొనియాడ దగినవాడు, వీరాధివీరుడు, యింద్రపుత్రుడు అయిన అర్జునుడు శ్రీకృష్ణుని అభిప్రాయానుసారం పదునైన కత్తితో అశ్వత్థామ శిరోజాలు ఖండించి లోపల మెరుస్తున్న మహామణిని వశం చేసుకున్నాడు. విశాలమైన కీర్తిని పొందాడు. తరువాత కట్టిన త్రాళ్లన్నీ విప్పదీసి శిబిరం బయటికి గెంటేశాడు.

1-174-క.

నిబ్బరపు బాలహంతయు
గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై
ప్రబ్బిన వగచే విప్రుఁడు
సిబ్బితితో నొడలి గబ్బుసెడి వడిఁ జనియెన్.

టీక:- నిబ్బరపు = నిస్సంకోచపు; బాల = పిల్లల; హంతయున్ = హంతకుడును; గొబ్బునన్ = వెంటనే; తేజంబు = ప్రకాశమును; మణియున్ = మణియు; కోల్పడి = పోగొట్టుకొని; నతుఁడు = వంగిపోయినవాడు; ఐ = అయి; ప్రబ్బిన = అతిశయించిన; వగ = దుఃఖము; చేన్ = తో; విప్రుఁడు = బ్రాహ్మణుడు; సిబ్బితి = సిగ్గు; తోన్ = తో; ఒడలి = ఒళ్ళు; గబ్బు = పొగరు; సెడి = చెడిపోయి; వడిన్ = వేగముగా; చనియెన్ = వెళ్లిపోయెను.

భావము:- బాలకులను నిర్భయంగా హత్యచేసిన అశ్వత్థామ భరింపరాని అవమానంతో మర్యాదను, మణిని కోల్పోయి, సిగ్గుతో తలవంచుకొని, అతిశయించిన ఆవేదనతో వెలవెలపోయి వేగంగా వెళ్లిపోయాడు.

1-175-ఆ.

ధనముఁ గొనుట యొండె, దలఁ గొఱుగుట యొండె,
నాలయంబు వెడల నడచు టొండె,
గాని చంపఁ దగిన కర్మంబు సేసినఁ
జంపఁ దగదు విప్రజాతిఁ బతికి.

టీక:- ధనమున్ = ధనమును; కొనుట = తీసికొనుట; ఒండెన్ = ఒకటో; తల = జుట్టు, గుండు; గొఱుగుట = తీసివేయుట, చేయుట; ఒండెన్ = ఒకటో; ఆలయంబు = ఇల్లు; వెడలనడచుట = వెళ్ళగొట్టుట; ఒండెన్ = ఒకటో; కాని = అంతే కాని; చంపఁన్ = చంపుటకు; తగిన = తగ్గ; కర్మంబు = కర్మము; చేసినన్ = చేసినప్పటికిని; చంపన్ = చంపుట; తగదు = తగినపని కాదు; విప్ర = బ్రాహ్మణ; జాతిన్ = జాతివానిని; పతికి = రాజునకు.

భావము:- ధనం తీసికోవాలి, లేదా తల గొరిగించాలి, అదీ కాదంటే ఇంట్లో నుంచి వెళ్లగొట్టాలి. అంతే గాని చంపదగిన దుష్కర్మం చేసినా బ్రాహ్మణ పుట్టుక పుట్టిన వానిని రాజైన వాడు చంపరాదు

1-176-వ.

**ఇ ట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడచి, పాండవులు పాంచాలీ సహితులై పుత్త్రులకు శోకించి, మృతులైన బంధువుల కెల్ల దహనాది కృత్యంబులు సేసి యుదక ప్రదానంబు సేయు కొఱకు స్త్రీల ముందట నిడుకొని గోవిందుండునుం దారును గంగకుం జని, తిలోదకంబులు సేసి, క్రమ్మఱ విలపించి, హరి పాదపద్మ జాత పవిత్రంబు లయిన భాగీరథీ జలంబుల స్నాతులయి యున్న యెడం, బుత్త్ర శోకాతురు లయిన గాంధారీ ధృతరాష్ట్రులనుఁ గుంతీ ద్రౌపదులనుఁ జూచి మాధవుండు మునీంద్రులుం దానును బంధుమరణశోకాతురు లయిన వారల వగపు మానిచి మన్నించె; నివ్విధంబున.**

టీక:- ఇట్లు = ఈ విధంగా; అశ్వత్థామన్ = అశ్వత్థామను; ప్రాణ = ప్రాణాలతో; అవశిష్టున్ = మిగిలిన వానిగ; చేసి = చేసి; వెడల = బయటికి; నడచి = పంపి; పాండవులు = పాండవులు {పాండు రాజు సంతానము - పాండవులు}; పాంచాలీ = ద్రౌపది {పాంచాలి - పాంచాల దేశ రాకుమారి , ఐదుగురకు భార్య , ద్రౌపది}; సహితులు = కూడినవారు; ఐ = అయి; పుత్త్రుల = కొడుకుల; కున్ = కొరకు; శోకించి = దుఃఖించి; మృతులైన = మరణించిన; బంధువులు = చుట్టాలు; కున్ = కు; ఎల్లన్ = అందరకు; దహన = శవ దహనము; ఆది = మొదలగు; కృత్యంబులు = కార్యములు; చేసి = పూర్తిచేసి; ఉదకప్రదానంబున్ = తర్పణములు, (బంధు మరణాంతర కర్మ); చేయు = చేయుట; కొఱకున్ = కోసం; స్త్రీల = స్త్రీలను; ముందట = ముందర; ఇడుకొని = ఉంచుకొని; గోవిందుండునున్ = కృష్ణుడును {గోవిందుడు-గోవులకు ఒడయుడు (స్వామి), కృష్ణుడు}; తారును = తామును; గంగ = గంగానది; కున్ = కి; చని = వెళ్ళి; తిలోదకంబులు = తిలోదకములు {తిలోదకములు ఇచ్చుట - బంధు మరణాంతర కర్మ}; చేసి = వదలి; క్రమ్మఱన్ = మరల; విలపించి = ఏడ్చి; హరి = విష్ణుమూర్తి; పాద = పాదములనే; పద్మ = పద్మముల; జాత = పుట్టి; పవిత్రంబులు = పవిత్రములు; అయిన = అయినట్టి; భాగీరథీ = గంగానది {భాగీరథి - భగీరథుని ప్రయత్నము వలన భూలోకానికి వచ్చిన నది, గంగానది}; జలంబులన్ = నీటిలో; స్నాతులు = స్నానము చేసినవారు; అయి = అయి; ఉన్న = ఉన్నటువంటి; ఎడన్ = సమయమున; పుత్త్ర = కొడుకుల కోసం; శోక = దుఃఖముతో; ఆతురులు = బాధపడువారు; అయిన = అయినట్టి; గాంధారీ = గాంధారి; ధృతరాష్ట్రులను = ధృతరాష్ట్రులను; కుంతీ = కుంతి; ద్రౌపదులను = ద్రౌపదులను; చూచి = చూసి; మాధవుండు = కృష్ణుడు; ముని = మునులలో; ఇంద్రులున్ = శ్రేష్ఠులును; తానును = తనూ; బంధు = చుట్టముల; మరణ = మరణానికి; శోకాతురులు = దుఃఖితులు; అయిన = అయినట్టి; వారల = వారియొక్క; వగపున్ = దుఃఖాన్ని; మానిచి = పోగొట్టి; మన్నించెన్ = ఆదరించెను; ఈ = ఈ; విధంబునన్ = విధంగా.

భావము:- ఇలా అశ్వత్థామను ప్రాణాలతో గెంటేసి ద్రౌపదితోపాటు పాండవులు తమ కొడుకుల కోసం శోకించారు. అనంతరం చనిపోయిన బంధువు లందరికీ దహన సంస్కారాలు ఆచరించారు. స్త్రీలతోనూ, శ్రీకృష్ణునితోనూ గూడి గంగానదికి వెళ్ళి, పొంగిపొర్లే దుఃఖం దిగమ్రింగి పవిత్ర గంగానదిలో తిలోదకాలు

ఇచ్చారు, తరువాత అందరూ శ్రీమహావిష్ణువు పాదాల నుండి పుట్టిన పవిత్ర గంగానదీ జలాలలో స్నానాలు చేశారు. తరువాత శ్రీకృష్ణుడు మునివరేణ్యులతో కూడి పుత్రశోకంతో వ్యాకుల మనస్కులై ఉన్న గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతీ ద్రౌపదులను సమీపించి ఎన్నో విధాల ఊరడించి ధైర్యం చెప్పాడు.

★1-177-శా.

పాంచాలీ కబరీవికర్షణమహాపాపక్షతాయుష్కులం,
జంచద్గర్వుల, ధార్తరాష్ట్రుల ననిం జంపించి, గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ, గల్పించెన్ మహాఖ్యాతిఁ, జే
యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్.

టీక:- పాంచాలీ = ద్రౌపదియొక్క; కబరీ = జుట్టును; వికర్షణ = పట్టుకొని తోసేసిన; మహా = ఘోరమైన; పాప = పాపం వలన; క్షత = క్షీణించిన; ఆయుష్కులన్ = ఆయుస్సు గలవారిని; చంచత్ = చెలరేగిన; గర్వులన్ = గర్వంతో ఉన్నవారిని; ధార్తరాష్ట్రులన్ = ధృతరాష్ట్ర పుత్రులని; అనిన్ = యుద్ధమున; చంపించి = చంపించి; గోవిందుఁడు = కృష్ణుడు; ఇప్పించెన్ = ఇప్పించెను; రాజ్యమున్ = రాజ్యమును; ధర్మపుత్రుడు = ధర్మరాజు {ధర్మపుత్రుడు - యమధర్మరాజు కొడుకు, ధర్మరాజు}; కున్ = కి; కల్పించెన్ = కలిగించెను; మహా = గొప్ప; ఖ్యాతిన్ = కీర్తిని; చేయించెన్ = చేయించెను; మూఁడు = మూడు; తురంగమేధములు = అశ్వమేధయజ్ఞములు; దేవేంద్ర = దేవేంద్రుని; ప్రభావంబునన్ = వైభవంతో.

భావము:- నిండుసభలో ద్రౌపదిని జుట్టుపట్టుకులాగిన మహాపాపం ఫలితంగా దుర్మదాంధులైన ధృతరాష్ట్రనందనులైన కౌరవుల ఆయుష్షులు క్షీణించాయి; వారందరినీ శ్రీకృష్ణుడు కురుక్షేత్రయుద్ధంలో చంపించి, ధర్మరాజుకు రాజ్యం ఇప్పించాడు; విజయభేరి మ్రోగించి మహేంద్రవైభవంతో మూడు అశ్వమేధ యాగాలు చేయించాడు; ధర్మరాజుకు గొప్ప పేరుప్రఖ్యాతులు తెప్పించాడు.

1-178-వ.

అంత వాసుదేవుండు వ్యాసప్రముఖ భూసుర పూజితుం డయి, యుద్ధవ సాత్యకులు గొలువ ద్వారకాగమన ప్రయత్నంబునం బాండ వుల వీడ్కొని రథారోహణంబు సేయు సమయంబునం, దత్తఱపడుచు నుత్తర సనుదెంచి కల్యాణగుణోత్తరుం డైన హరి కిట్లనియె.

టీక:- అంత = అంతట; వాసుదేవుండు = కృష్ణుడు {వాసుదేవుడు - వసుదేవుని కుమారుడు, కృష్ణుడు}; వ్యాస = వ్యాసుడు; ప్రముఖ = మొదలగు ప్రముఖమైన; భూసుర = బ్రాహ్మణులచే; పూజితుండు = పూజింపబడినవాడు; అయి = అయి; యుద్ధవ = యుద్ధవుడును; సాత్యకులు = సాత్యకియు; కొలువ = పూజించగా; ద్వారక = ద్వారకకు; ఆగమన = చేరు; ప్రయత్నంబునన్ = ప్రయత్నముతో; పాండవుల = పాండవుల; వీడ్కొని = సెలవుతీసుకొని; రథ = రథాన్ని; ఆరోహణంబు = ఎక్కుట; చేయు = చేసే; సమయంబునన్ =

సమయంలో; తత్తఱ = ఖంగారు; పడుచున్ = పడుతూ; ఉత్తర = ఉత్తర; చనుదెంచి = వచ్చి; కల్యాణ = శుభ; గుణ = గుణములతో కూడిన; ఉత్తరుండు = ఉత్తముడు; ఐన = అయినట్టి; హరి = కృష్ణుని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అనంతరం వ్యాసాది మహర్షుల పూజలందుకొన్న శ్రీకృష్ణుడు ఉద్ధవ, సాత్యకులను వెంటబెట్టుకొని ద్వారకకు బయలు దేరాడు. పాండవు లందరికీ వీడ్కోలు చెప్పి రథం ఎక్కుతుండగా, ఉత్తర తత్తరపడుతూ పరుగెత్తుకు వచ్చి మంగళకరగుణాలప్రోవైన పురుషోత్తమునితో ఇలా మొరపెట్టుకొంది.

1-179-మ.

"ఇదె కాలానల తుల్యమైన విశిఖం బేతెంచె దేవేశ! నేఁ
డుదరాంతర్గత గర్భ దాహమునకై యుగ్రప్రభన్ వచ్చుచు
న్నది, దుర్లోక్యము మానుపన్ శరణ మన్యం బేమియున్ లేదు, నీ
పదపద్మంబులె కాని యొండెఱుఁగ, నీ బాణాగ్ని వారింపవే.

టీక:- ఇదె = ఇదిగో; కాల = మృత్యువు వంటి; అనల = అగ్ని; తుల్యము = తోసమానము; ఐన = అయినట్టి; విశిఖంబు = బాణము; ఏతెంచెన్ = వస్తోంది; దేవేశ = కృష్ణా {దేవేశుడు - దేవతలలో శ్రేష్ఠుడు, కృష్ణుడు}; నేఁడు = ఇవాళ; ఉదర = గర్భము; అంతర్గత = లోపలి; గర్భదాహమున = పిండమును దహించుట; కై = కోసము; ఉగ్ర = భయంకరమైన; ప్రభన్ = ప్రభావంతో; వచ్చుచున్ = వస్తూ; ఉన్నది = ఉంది; దుర్లోక్యము = చూడశక్యంకానిది; మానుపన్ = నివారించే; శరణము = దిక్కు; అన్యమున్ = ఇంకోటి; ఏమియున్ = ఏదీ; లేదు = లేదు; నీ = నీయొక్క; పద = పాదములనే; పద్మంబులే = పద్మములే; కాని = తప్ప; ఒండు = ఇంకోటి; ఎఱుఁగన్ = ఎరుగను; ఈ = ఈ; బాణాగ్నిన్ = బాణాలనే అగ్నిని; వారింపవే = ఆపుము.

భావము:- "దేవదేవా! శ్రీకృష్ణా! ప్రళయాగ్ని జ్వాలలతో భయంగొల్పే బాణ మొకటి ఎక్కటినుంచో కళ్లకు మిరుమిట్లు గొల్పుతూ వచ్చి, నా కడుపులో ఉన్న పిండాన్ని కాల్చేయాలని చూస్తోంది. ఈ భయంకర బాణాన్ని అడ్డుకొని నన్ను రక్షించేవారు వేరే ఎవరు లేరు. నీ చరణకమలాలనే నమ్మి శరణుజొచ్చాను. కరుణించి ఈ బాణాగ్నిని ఆపు.

1-180-క.

దుర్భరబాణానలమున
గర్భములో నున్న శిశువు ఘనసంతాపా
విర్భావంబునుఁ బొందెడి
నిర్భరకృపఁ గావుమయ్య, నిఖిలస్తుత్యా!

టీక:- దుర్భర = భరింప శక్యంకాని; బాణానలమునన్ = బాణాలనే అగ్నివలన; గర్భము = (నా) గర్భం; లోన్ = లోపల; ఉన్న = ఉన్నట్టి; శిశువు = శిశువు; ఘన = అత్యధికమైన; సంతాప = బాధ; ఆవిర్భావంబునున్ = పుట్టుటను; పొందెడిన్ = పొందుతోంది; నిర్భర = నిండు; కృపన్ = దయతో; కావుము = కాపాడుము; అయ్య = తండ్రీ; నిఖిలస్తుత్యా = శ్రీకృష్ణా {నిఖిలస్తుత్యుడు – సర్వులచే స్తుతింపబడువాడు, కృష్ణుడు};

భావము:- భరింపరాని ఈ శరాగ్నికి నా కడుపులో ఉన్న పసిగందు కసుగంది పోతున్నాడు. దయతో రక్షించవయ్యా, సకల శరీరులచేత స్తుతింపబడువాడా! శ్రీకృష్ణా!

1-181-క.

చెల్లెలికోడల, నీ మే
నల్లుఁడు శత్రువులచేత హతుఁడయ్యెను సం
పుల్లారవిందలోచన!
భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే.

టీక:- చెల్లెలి = (నీ) చెల్లెలికి; కోడల = కోడల్ని; నీ = నీయొక్క; మేనల్లుఁడు = మేనల్లుడు (మేనల్లుడు – సోదరి కొడుకు); శత్రువుల = వైరుల; చేతన్ = వలన; హతుఁడు = చంపబడినవాడు; అయ్యెను = అయ్యెను; సంపుల్ల = చక్కగా వికసించిన; అరవింద = పద్మములవంటి; లోచన = కన్నులు గలవాడా; భల్ల = బాణముల యొక్క; అగ్నిన్ = అగ్నిని; అడంచి = అణచి; శిశువున్ = శిశువును; బ్రతికింపఁగదే = బ్రతికింపుము.

భావము:- నేను నీ చెల్లెలు సుభద్రాదేవికి కోడల్నయ్యా; నీ మేనల్లుడు అభిమన్యుడిని శత్రువులు సంహరించారయ్యా. చక్కగా వికసించిన పద్మాల వంటి నీ కన్నులెత్తి చూడవయ్యా! కృష్ణయ్య! ఈ అమ్మను వమ్ముచేసి నా కడుపుపంట ప్రాణాలు కాపాడవయ్యా.

★1-182-ఆ.

గర్భ మందుఁ గమలగర్భాండశతములు
నిముడుకొన వహించు నీశ్వరేశ!
నీకు నొక్క మానినీగర్భరక్షణ
మెంత బరువు నిర్వహింతు గాక."

టీక:- గర్భమందున్ = గర్భంలోపల; కమలగర్భఅండ = బ్రహ్మాండములు; శతములు = వందలకొలది; నిముడుకొనన్ = ఇముడ్చుకొని; వహించు = ధరించు; ఈశ్వర = దేవతలలో; ఈశ = శ్రేష్ఠుడా; నీకు = నీకు; ఒక్క = ఒక్క; మానినీ = స్త్రీ యొక్క; గర్భ = గర్భాన్ని; రక్షణము = రక్షించటం; ఎంత = ఏపాటి; బరువు = భారము; నిర్వహింతుగాక = తప్పక చేయ్యి (నాగర్భరక్షణ).

భావము:- గర్భంలో వందలకొద్దీ బ్రహ్మాండాలను భద్రంగా భరించే దేవాధిదేవ! శ్రీకృష్ణా! నీకు ఒక ఆడదాని గర్భాన్ని రక్షించటం ఏమంత బ్రహ్మాండం. ఆపదలో ఉన్న నన్ను ఆదుకోవయ్యా! నా గర్భాన్ని రక్షించవయ్యా!"

1-183-వ.

**అనిన నాశ్రితవత్సలుం డగు నప్పరమేశ్వరుండు సుభద్ర కోడలి దీనాలాపంబు లాలించి, యిది ద్రోణనందనుండు లోక మంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రం బని యెఱింగె; నంతఁ బాండవుల కభిముఖం బయి ద్రోణ నందను దివ్యాస్త్ర నిర్గత నిశిత మార్గణంబులు డగ్గఱిన బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబు లందికొని పెనంగు సమయంబున.**

టీక:- అనినన్ = అని కోరగా; ఆశ్రిత = ఆశ్రయించిన వారిని; వత్సలుండు = రక్షించువాడు; అగు = అయిన; ఆ = ఆ; పరమేశ్వరుండు = కృష్ణుడు {పరమేశ్వరుడు - పరమమైన ఈశ్వరుడు, కృష్ణుడు}; సుభద్ర = సుభద్ర యొక్క; కోడలి = కోడలి; దీన = దీనమైన; ఆలాపంబులు = పలుకులు; ఆలించి = విని; ఇది = ఇది; ద్రోణనందనుండు = అశ్వత్థామ {ద్రోణనందనుడు - ద్రోణునికొడుకు, అశ్వత్థామ}; లోకము = ప్రపంచం; అంతయున్ = సమస్తమూ; అపాండవంబు = పాండవులు లేకుండా; అయ్యెడుము = అవుగాక; అని = అని; ఏసిన = వేసినట్టి; దివ్య = దివ్యమైన; అస్త్రంబు = అస్త్రము; అని = అని; ఎఱింగెన్ = తెలుసుకొన్నాడు; అంతన్ = అంతలో; పాండవులు = పాండవులు; కున్ = కు; అభిముఖంబు = ఎదురు; అయి = అయి; ద్రోణనందను = అశ్వత్థామ; దివ్య = దివ్యమైన; అస్త్ర = అస్త్రమునుండి; నిర్గత = వెలువడిన; నిశిత = వాడైన; మార్గణంబులు = బాణములు; డగ్గఱినన్ = దగ్గరకురాగా; బెగ్గడిలక = చెదరకుండా; వారును = వారుకూడా; ప్రత్యస్త్రంబులు = ఎదురు అస్త్రాలు; అందికొని = తీసుకొని; పెనంగు = యుద్ధము చేయు; సమయంబున = సమయంలో.

భావము:- ఆపన్నశరణ్యుడైన గోపాలుడు అనుంగు చెల్లెలి కోడలు ఉత్తర దీనాలాపాలు ఆలకించాడు. ఇది, లోకంలో పాండవ వంశం లేకుండా పోవాలని, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం అని తెలుసుకొన్నాడు. అంతలో, ఆ దివ్యాస్త్రం నుండి వెలువడుతున్న పదునైన బాణాలు పాండవులను చుట్టుముట్టాయి. వారు బెదరిపోకుండా ఎదురు నిలిచి శరపరంపరలతో సమరం సాగించసాగారు.

1-184-మ.

**తన సేవారతిచింత గాని పరచింతాలేశమున్ లేని స**
**జ్జనులం బాండుతనూజులన్ మనుచు వాత్సల్యంబుతో ద్రోణనం**
**దను బ్రహ్మాస్త్రము నడ్డుపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వారి సా**
**ధన నిర్వక్రము, రక్షితాఖిల సుధాంధశ్చక్రముం, జక్రమున్.**

టీక:- తన = తనయొక్క; సేవ = భక్తితో; ఆరతి = తపించు; చింత = ఆలోచన; కాని = తప్ప; పర = ఇతర; చింతా = ఆలోచన; లేశమున్ = కొంచెముకూడా; లేని = లేని; సజ్జనులన్ = మంచివారిని; పాండుతనూజులన్ = పాండవులను; మనుచు = కాపాడాలనే; వాత్సల్యంబు = ఆపేక్ష; తోన్ = తో; ద్రోణనందను = అశ్వత్థామ యొక్క {ద్రోణుని కొడుకు - అశ్వత్థామ}; బ్రహ్మాస్త్రమున్ = బ్రహ్మాస్త్రాన్ని; అడ్డుపెట్టన్ = అడ్డుకోమని; పనిచెన్ = నియోగించాడు, ప్రయోగించాడు; దైత్యారి = కృష్ణుడు {దైత్యారి - దైత్యుల శత్రువు, కృష్ణుడు}; సర్వ = సమస్తమైన; అరి = శత్రువులను; సాధన = సాధించుటలో, నశింపచేయుటలో; నిర్వక్రము = తిరుగులేనిది; రక్షిత = రక్షింపబడిన; అఖిల = సమస్త; సుధాంధస్ = దేవతలను గల {సుధాంధసులు – సుధా (అమృతమును) అంధసులు (అన్నముగా కలవారు), దేవతలు }; చక్రమున్ = చక్రమును.

భావము:- తనను సేవించాలనే భావం తప్ప ఇతర భావం ఏమాత్రం ఎరుగని సచ్చరిత్రులు, సజ్జనులు అయిన పాండవులు ఆపదలో ఉన్నారు, వారిని ఆదరంతో ఆదుకోవాలని రాక్షసాంతకుడు అయిన శ్రీకృష్ణుడు భావించాడు: అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని త్రిప్పికొట్టటం కోసం, శత్రువుల ఆయుధాలకు చెక్కు చెదరనిది, దేవతలు అందరినీ కనురెప్పలా కాపాడేది అయిన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు.

## ★1-185-మ.

**సకలప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు సూ**
**క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడన్ విరటజా గర్భంబుఁ దాఁ జక్రహ**
**స్తకుఁడై, వైష్ణవమాయఁ గప్పి, కురు సంతానార్థియై యడ్డమై**
**ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణతనయబ్రహ్మాస్త్రమున్ లీలతోన్.**

టీక:- సకల = సమస్త మైన; ప్రాణి = ప్రాణుల యొక్క; హృద = హృదయముల; అంతరాళ ములన్ = లోలోపల; భాస్వత్ = ప్రకాశించే; జ్యోతి = దీపము; ఐ = అయి; ఉండు = ఉండే; సూక్ష్మ = సూక్ష్మ మైన; కళుండు = నేర్పున్న వాడు; అచ్యుతుఁడు = హరి {అచ్యుతుడు — చ్యుతము (దిగజారుట) లేని వాడు, విష్ణువు}; ఆ = ఆ; ఎడన్ = సమయములో; విరటజా = ఉత్తర యొక్క {విరటజ - విరటుని సంతానము, ఉత్తర}; గర్భంబున్ = గర్భమును; తాన్ = తాను; చక్ర = చక్రమును; హస్తకుఁడు = చేతిలో ధరించిన వాడు; ఐ = అయి; వైష్ణవ = విష్ణువు {విష్ణువు — విశ్వమంతా వ్యాపించి ఉండు వాడు, హరి} యొక్క; మాయన్ = మాయను; కప్పి = కప్పి; కురు = కురువంశ; సంతాన = సంతానం నిలబడుటను; అర్థి = కోరినవాడు; ఐ = అయి; అడ్డము = అడ్డముగా నిలబడిన వాడు; ఐ = అయి; ప్రకట = అభివ్యక్తమైన; స్ఫూర్తిన్ = స్ఫూర్తితో; అడంచెన్ = అణిచాడు; ద్రోణతనయు = అశ్వత్థామ {ద్రోణతనయుడు - ద్రోణుని కుమారుడు, అశ్వత్థామ}; యొక్క; బ్రహ్మాస్త్రమున్ = బ్రహ్మాస్త్రమును; లీల = అవలీల, లీలావిలాసము; తోన్ = గా.

భావము:- సూక్ష్మాతి సూక్ష్మమైన రూపంతో సమస్త ప్రాణుల హృదయాంతరాళాల్లో జ్యోతిర్మూర్తియై ప్రకాశించే వాసుదేవుడు పాండవుల వంశాంకురాన్ని రక్షించటం కోసం చక్రాన్ని ధరించి, ఉత్తరాగర్భాన్ని యోగమాయతో కప్పివేసి, అమోఘమైన వైష్ణవ తేజస్సుతో అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని అవలీలగా అణచివేశాడు.

1-186-వ.

**ఇట్లు ద్రోణతనయుం డేసిన ప్రతిక్రియారహితం బయిన బ్రహ్మశిరం బనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె; నిజ మాయా విలసనమున సకల లోక సర్గస్థితి సంహారంబు లాచరించు నట్టి హరికి ధరణీసుర బాణ నివారణంబు విచిత్రంబు గాదు; తత్సమయంబున సంతసించి, పాండవ పాంచాలీ సహితయై గొంతి గమనోన్ముఖుం డైన హరిం జేర వచ్చి యిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈ విధంగా; ద్రోణతనయుండు = అశ్వత్థామ {ద్రోణతనయుడు - ద్రోణుని కొడుకు, అశ్వత్థామ}; ఏసిన = వేసిన; ప్రతిక్రియా = ఎదురు చేయటకు; రహితంబు = వీలు లేనట్టిది; అయిన = అయినటువంటి; బ్రహ్మశిరంబు = బ్రహ్మశిరము; అనియెడి = అనే; దివ్య = దివ్యమైన; అస్త్రంబు = అస్త్రం; వైష్ణవ = విష్ణువు యొక్క; తేజంబున = ప్రభావమువలన; నిరర్థకంబు = నిష్ప్రయోజనం; అయ్యెన్ = అయిపోయింది; నిజ = తన; మాయా = మాయ యొక్క; విలసనమున = విలాసము వలన; సకల = సమస్త; లోక = లోకముల యొక్క; సర్గ = సృష్టి; స్థితి = పాలన; సంహారంబులు = సంహారములు; ఆచరించున్ = ఆచరిస్తూ ఉండు వాడు; అట్టి = అయినట్టి; హరి = కృష్ణుని; కిన్ = కి; ధరణీసుర = బ్రాహ్మణుని {ధరణీసుర - భూమికి దేవత, బ్రాహ్మణుని}; బాణ = బాణమును; నివారణంబు = ఆపుట; విచిత్రంబున్ = విచిత్రమేమి; కాదు = కాదు; తత్ = ఆ; సమయంబున = సమయంలో; సంతసించి = సంతోషించి; పాండవ = పాండవులతోను {పంచపాండవులు - పాండురాజు సంతానము, 1ధర్మరాజు, 2భీముడు, 3అర్జునుడు, 4నకులుడు, 5సహదేవుడు}; పాంచాలీ = ద్రౌపదితోను {పాంచాలి - పాంచాల రాకుమార్తె. ద్రౌపది}; సహిత = కూడినది; ఐ = అయి; గొంతి = కుంతి; గమన = వెళ్ళుటకు; ఉన్ముఖుండు = సిద్ధపడినవాడు; ఐన = అయినట్టి; హరిన్ = కృష్ణుని {హరి - సర్వ దుఃఖములను హరించు వాడు, విష్ణువు}; చేరన్ = చేరువకు; వచ్చి = వచ్చి; ఇట్లు = ఈ విధంగా; అనియెన్ = పలికెను.

భావము:- అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరాస్త్రం తిరుగులేనిది అయినప్పటికీ, వైష్ణవ తేజస్సు ముందు వ్యర్థం అయిపోయింది. ఒక బ్రాహ్మణ యువకుడి బాణాన్ని నివారించటం అన్నది, తన మాయా ప్రభావంతో నిఖిల జగత్తును నిర్మించి, భరించి, హరించే పరమాత్ముడికి విచిత్రమైన విషయమేమీ కాదు. అప్పుడు ఎంతో సంతోషంతో కుంతీదేవి కోడలు ద్రౌపది, కొడుకులు పాండవులతో వచ్చి ద్వారకకు ప్రయాణం అవుతున్న శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా స్తుతించింది-

## కుంతి స్తుతించుట

1-187-క.

"పురుషుం, డాఢ్యుఁడు, ప్రకృతికిఁ
బరుఁ, డవ్యయుఁ, డఖిలభూత బహిరంతర్భా
సురుఁడును, లోకనియంతయుఁ,
బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ!

టీక:- పురుషుండు = పరమ పురుషుడును {పురుషః - శరీరములు అను పురములు (లోకములు) సృష్టించి వానిలో నుండు వాడు, విష్ణుసహస్రనామాలులో 14వ నామం 406వ నామం, నవద్వారముల పురము నందు ఉండువాడు, పురము నందు శయనించు వాడు, సర్వము కంటెను పూర్వ మున్నవాడు}; ఆఢ్యుఁడు = శ్రీమంతుడు {ఆఢ్యుడు - లక్ష్మీదేవి యనే సంపద గలవాడు, సంపన్నుడు}; ప్రకృతి = ప్రకృతి; కిన్ = కంటెను; పరుఁడు = పై నున్న వాడును; అవ్యయుఁడు = నాశనములేనివాడును {అవ్యయః - విష్ణుసహస్రనామాలులో 13వ నామం, 900వ నామం, అజరుడు, అమరుడు, వినాశము కాని, వికారము కాని లేని వాడు,}; అఖిల = సమస్త; భూత = ప్రాణుల యందు; బహిర్ = బయట; అంతర్ = లోపల; భాసురుఁడును = ప్రకాశించువాడును; లోక = లోకములను; నియంతయున్ = పాలించువాడును; పరమేశ్వరుఁడు = పరమమైన ఈశ్వరుడును {పరమేశ్వరః - విష్ణుసహస్రనామాలలో 377వ నామం, ఉత్కృష్టమైన వాడు, అత్యధికమైన శాసనము కలవాడు}; ఐన = అయినట్టి; నీకున్ = నీకు; ప్రణతులు = నమస్కారములు; అగు = చేయుచున్నాము; హరీ = కృష్ణా {హరిః - విష్ణుసహస్రనామాలులో 650వ నామం, అజ్ఞాన జనితమైన సంసార దుఃఖము హరించు వాడు, సమూలముగా సంసారమును హరించువాడు}.

భావము:- "కృష్ణా! నువ్వు పరమపురుషుడవు, దేవాధిదేవుడవు, ప్రకృతికి అవ్వలివాడవు, అనంతుడవు, సకల ప్రాణులలో వెలుపల లోపల ప్రకాశిస్తూ ఉండేవాడవు. విశాల విశ్వాన్ని నడిపేవాడవు, పరమేశ్వరుడవు అయినట్టి నీకు నమస్కారములు.

1-188-వ.

మఱియు, జవనిక మఱుపున నాట్యంబు సలుపు నటుని చందంబున, మాయా యవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచేఁ బరమహంసలు, నివృత్తరాగ ద్వేషులు, నిర్మలాత్ములునయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛిన్నుం డవు గాని, నీవు మూఢదృక్కులుఁ, గుటుంబవంతులు నగు మాకు నెట్లు దర్శనీ యుండ వయ్యెదు; శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద!

**పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశచరణ! హృషీకేశ! భక్తి యోగంబునం జేసి నమస్కరించెద, నవధరింపుము.**

టీక:- మఱియున్ = ఇంకను; జవనిక = తెర; మఱుపున = చాటున; నాట్యంబు = నాట్యము; సలుపు = చేయు; నటుని = నటుని; చందంబునన్ = వలె; మాయా = మాయ అనే; యవనిక = తెర; అంతరాళంబున = చాటున; నిలువంబడి = నిలబడి ఉండి; నీ = నీ యొక్క; మహిమ = మహిమ; చేన్ = చేత; పరమహంసలు = మోక్షస్థితిని పొందినవారు; నివృత్త = నివారింపబడిన; రాగద్వేషులున్ = అనురాగము, ద్వేషములు కలవారును ; నిర్మల = నిర్మలమైన; ఆత్ములున్ = ఆత్మగలవారును; అయిన = అయినట్టి; మునులు = మునుల; కున్ = కు; అదృశ్య = కనుపించక; మానుండు = ఉండేవాడవును; అయి = అయి; పరిచ్ఛిన్నుండవుగాని = సీమ లేదా మితము లేనివాడు, అవిభాజ్యుడు నైన పరబ్రహ్మ స్వరూపమైనవాడవు; నీవు = నీవు; మూఢ = మోసము చెందిన; దృక్కులున్ = దృష్టి కలవారును; కుటుంబవంతులున్ = కుటుంబము గలవారును; అగు = అయినట్టి; మాకు = మాకు; ఎట్లు = ఏవిధంగ; దర్శనీయుండవు = కనబడువాడవు; అయ్యేదు = అవుతావు; శ్రీకృష్ణ = కృష్ణా; వాసుదేవ = కృష్ణా {వాసుదేవుడు - ఆత్మ యందు వసించే దేవుడు, విష్ణువు}; దేవకీనందన = కృష్ణా {దేవకీనందన - దేవకీదేవి పుత్రుడు, కృష్ణుడు}; నంద గోప కుమార = కృష్ణా {నందగోప కుమార - నందుడను గోపాలుని కుమారుడు, కృష్ణుడు}; గోవింద = కృష్ణా {గోవింద - గోవులను పాలించు వాడు, కృష్ణుడు}; పంకజనాభ = కృష్ణా {పంకజనాభుడు - పద్మము నాభిని గల వాడు, విష్ణువు}; పద్మమాలికాలంకృత = కృష్ణా {పద్మమాలికాలం కృతుడు- పద్మ మాలికలతో అలంకరింపబడిన వాడు, కృష్ణుడు}; పద్మలోచన = కృష్ణా {పద్మలోచనుడు — పద్మ ములవంటి కన్నులు గలవాడు, కృష్ణుడు};పద్మసంకాశ చరణ = కృష్ణా {పద్మసంకాశ చరణుడు - పద్మముల వలె ప్రకాశించు పాదములు గలవాడు, కృష్ణుడు}; హృషీ కేశ = కృష్ణా {హృషీకేశ - ఇంద్రియములకు ప్రభువు, విష్ణువు}; భక్తి యోగంబునన్ = భక్తి యోగము వలన; చేసి = చేసి; నమస్కరించెదన్ = నమస్కరిస్తున్నాను; అవధరింపుము = స్వీకరింపుము.

భావము:-మాయ అనే యవనిక మాటున వర్తించే నీ మహిమ, తెరచాటున వర్తించే నటునిలా అగోచరమైనది; పరమహంసలు, రాగద్వేషరహితులు, నిర్మలహృదయులు అయిన మునీశ్వరులకు సైతం దర్శింపశక్యంకానికాని వాడవూ, సీమ లేదా మితము లేనివాడు, అవిభాజ్యుడు నైన పరబ్రహ్మ స్వరూపమైనవాడవూ అయిన నిన్ను జ్ఞానహీనులమూ సంసార నిమగ్నులమూ అయిన మా వంటి వారం ఎలా చూడగలం; శ్రీకృష్ణా! వాసుదేవా! దేవకీనందనా! నందగోపకుమారా! గోవిందా! పద్మనాభా! పద్మమాలా విభూషణా! పద్మనయనా! పద్మసంకాశ చరణా! హృషీకేశా! భక్తి పూర్వకమైన నా ప్రణామాలు పరిగ్రహించు. నా విన్నపం మన్నించు.

1-189-సీ.

**తనయులతోడ నే దహ్యమానంబగు-**
**జతుగృహంబందునుఁ జావకుండఁ,**
**గురురాజు వెట్టించు ఘోరవిషంబుల-**
**మారుతపుత్త్రుండు మడియకుండ,**

ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ-
    ద్రౌపదిమానంబు దలఁగకుండ,
గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే-
    నా బిడ్డ లనిలోన నలఁగకుండ,
1-189.1-తే.
విరటుపుత్రిక కడుపులో వెలయు చూలు
ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ,
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను,
నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష!

టీక:- తనయులు = పుత్రులు; తోడన్ = తో; నే = నేను; దహ్యమానంబు = మండిపోవుచున్నది; అగు = అయినట్టి; జతు = లక్క; గృహంబు = గృహము; అందును = లో; చావకుండన్ = చనిపోకుండా; కురురాజు = కురువంశ రాజు, దుర్యోధనుడు; వెట్టించు = పెట్టించిన; ఘోర = ఘోరమైన; విషంబులన్ = విషములవలన; మారుతపుత్త్రుండు = భీముడు {మారుత పుత్త్రుడు - వాయుదేవుని పుత్రుడు, భీముడు}; మడియకుండన్ = చనిపోకుండా; ధార్తరాష్ట్రుఁడు = దుశ్శాసనుడు {ధార్తరాష్ట్రుడు - ధృతరాష్ట్రుని కొడుకు, దుశ్శాసనుడు}; సముద్ధతిన్ = మిక్కిలి ఆటోపముతో {సముద్ధతిని - గురువు దగ్గర శిక్షింపబడని వానివలె, మిక్కిలి ఆటోపముతో}; చీరలు = చీరలు, బట్టలు; ఒలువంగన్ = ఒలిచేస్తున్నప్పుడు; ద్రౌపది = ద్రౌపది యొక్క; మానంబు = మానము; తలఁగకుండన్ = తొలగిపోగుండా; గాంగేయ = భీష్మడు {గాంగేయుడు - గంగ యొక్క పుత్రుడు}, భీష్మడు; కుంభజ = ద్రోణుడు {కుంభజుడు - కుంభములో పుట్టినవాడు, ద్రోణుడు}; కర్ణ = కర్ణుడు; ఆది = మొదలగు; ఘనులు = గొప్పవారి; చేన్ = చేత; నా = నా; బిడ్డలు = పిల్లలు; అని = యుద్ధము; లోనన్ = లో; నలఁగకుండన్ = నలిగికుండా;

విరటుపుత్రిక = ఉత్తర {విరటుపుత్రిక - విరటరాజు పుత్రిక, ఉత్తర}; కడుపు = కడుపు; లోన్ = లోపల; వెలయు = వెలసిన; చూలు = గర్భము; ద్రోణనందను = అశ్వత్థామ {ద్రోణనందనుడు - ద్రోణుని యొక్కకొడుకు, అశ్వత్థామ}; శర = బాణముల; వహ్నిన్ = అగ్నివలన; త్రుంగకుండన్ = తునికలు కాకుండగ; మఱియున్ = ఇంకను; రక్షించితివి = కాపాడావు; పెక్కు = అనేకమైన; మార్గములను = విధములుగ; నిన్నున్ =నిన్ను; ఏమని =ఏవిధంగా; వర్ణింతున్ = కీర్తించగలను; నీరజాక్ష = కృష్ణా {నీరజాక్షుడు - నీరజము (పద్మము) లవంటి కన్నులు గలవాడు, కృష్ణుడు}.

భావము:- పుండరీకాక్షా! భగభగ మండుతున్న లక్కయింట్లో నా బిడ్డలు, నేను కాలి భస్మమైపోకుండా కాపాడావు; దుర్యోధనుడు పెట్టించిన విషాన్నం తిని చనిపోకుండా భీమసేనుణ్ణి రక్షించావు; దురహంకారంతో త్రుళ్లి పడుతూ దుశ్శాసనుడు ద్రౌపదికట్టుబట్టలు ఒలుస్తున్నకష్టసమయంలో అవమానంపాలుకాకుండా ఆదుకొన్నావు; భీష్మడూ మొదలైన యోధానుయోధాలవల్ల పోరాటంలో నాబిడ్డలకు చేటువాటిల్లకుండా అడ్డుపడ్డావు; మళ్లీ

ఇప్పుడు చిట్టితల్లి ఉత్తర కడుపులోని కసుగందును, అశ్వత్థామ శరాగ్ని జ్వాలలలో ముగ్గిపోకుండా కనికరించావు; మరింకా ఎన్నో విధాలుగా నన్నూ, నా బిడ్డలనూ కటాక్షించిన నిన్ను ఏ విధంగా కొనియాడే దయ్యా!

1-190-మత్త.

బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ
తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండఁగఁ దావకీన గుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన, జగత్పతీ!

టీక:- బల్లిదుండు = మిక్కిలి బలము గలవాడు; అగు = అయిన; కంసు = కంసుని; చేతను = చేత; బాధ = బాధలు; ఒందుచున్ = పొందుతూ; ఉన్న = ఉన్నట్టి; మీ = మీ; తల్లిన్ = తల్లిని; కాచిన = కాపాడిన; భంగిన్ = విధముగ; కాచితి = కాపాడితివి; ధార్తరాష్ట్రుల = కౌరవుల {ధార్తరాష్ట్రులు - ధృతరాష్ట్రుని సంతానము, కౌరవులు}; చేతన్ = చేత; ఏన్ = నేను; తల్లడంబునన్ = ఇబ్బందులలో; చిక్కకుండఁగన్ = చిక్కుకుపోకుండా; తావకీన = నీయొక్క; గుణ = గుణముల; వ్రజంబు = సమూహము; ఎల్లన్ = సమస్తమును; సంస్తుతి = చక్కగ కీర్తిన; చేసి = చేసి; చెప్పఁగన్ = చెప్పుటకు; ఎంతదానన్ = నేను ఎంతటి దానని; జగత్పతీ = కృష్ణా {జగత్పతి – లోకములకు ప్రభువు, కృష్ణుడు}.

భావము:- జగన్నాథా! బలవంతుడైన కంసునిబారి నుంచి మీ తల్లి దేవకీదేవిని రక్షించినట్లుగా, ధృతరాష్ట్రుని కొడుకులు అయిన కౌరవులు పెట్టిన ఇక్కట్లకు గురికాకుండా నన్ను కాపాడిన నీ అనంతకోటి గుణాలు అభివర్ణించటానికి నే నెంతదాన్ని.

1-191-క.

జననము, నైశ్వర్యంబును,
ధనమును, విద్యయునుఁ, గల మదచ్ఛన్ను లకిం
చనగోచరుఁడగు నిన్నున్
వినుతింపఁగ లేరు, నిఖిలవిబుధస్తుత్యా!

టీక:- జననమున్ = పుట్టుటయు; ఐశ్వర్యంబును = సంపదయు; ధనమును = విత్తమును; విద్యయును = విద్యయును; కల = కలుగుటవలన; మదచ్ఛన్నులు = గర్వముతో కప్పబడినవారు; అకించన = విత్తహీనులకు; గోచరుఁడు = కనబడువాడు; అగు = అయినట్టి; నిన్నున్ = నిన్ను; వినుతింపఁగన్ = కీర్తించ; లేరు = లేరు; నిఖిలవిబుధస్తుత్యా = జ్ఞానులు అందరిచేత కీర్తింపబడేవాడా (కృష్ణా).

భావము:- నిష్కాములైన భక్తులకు మాత్రమే గోచరించేవాడు, నిఖిల దేవతా సంస్తూయమానుడు అయిన నిన్ను, గొప్పవంశంలో జన్మించామనీ, భోగభాగ్యాలు ఉన్నాయినీ, ధనవంతులము అనీ, విద్యావంతులము అనీ మదాంధులైన మానవులు ప్రస్తుతింపలేరు.

1-192-వ.

**మఱియు, భక్తధనుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, నాత్మారాముం డును, రాగాదిరహితుండునుఁ, గైవల్యదానసమర్థుండునుఁ, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుం డును, విభుండును, సర్వసముండును, సకల భూత నిగ్రహానుగ్రహకరుండునునైన నిన్నుఁ దలంచి నమస్కరించెద, నవ ధరింపుము; మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు; నీకుం బ్రియాప్రియులు లేరు; జన్మకర్మశూన్యుండవయిన నీవు తిర్య గాదిజీవులయందు వరాహాదిరూపంబులను, మనుష్యులందు రామాదిరూపంబు లను, ఋషులయందు వామనాదిరూపంబులను, జలచరంబులయందు మత్స్యా దిరూపంబులను, నవతరించుట లోకవిడంబనార్థంబుగాని జన్మకర్మసహితుం డవగుటం గాదు.**

టీక:- మఱియున్ = ఇంకను; భక్త = భక్తులకు; ధనుండును = ధనము అయిన వాడును; నివృత్త = నివారింపబడిన; ధర్మ = ధర్మము; అర్థ = అర్థము; కామ = కామ; విషయుండును = విషయములు కలవాడు; ఆత్మారాముండును= ఆత్మయందు రమించు వాడును; రాగాది = రాగద్వేషములు {త్రయోదశ రాగద్వేషములు - 1రాగము 2ద్వేషము 3కామము 4క్రోధము 5లోభము 6మోహము 7మదము 8మాత్సర్యము 9ఈర్ష్య 10అసూయ 11దంభము 12దర్పము 13అహంకారము.}; రహితుండును = లేనివాడును; కైవల్య = మోక్షమును {కైవల్యము - కేవలము తన వలె నగు స్థితి, మోక్షము}; దాన = యిచ్చుటకు; సమర్థుండును = సమర్థత గలవాడును; కాల = కాలమే; రూపకుండును = స్వరూపముగ నున్నవాడు; నియామకుండును = (సర్వ) నియంతయును; ఆది = ఆది; అంత = అంతములు; శూన్యుండును = లేనివాడును; విభుండును = ప్రభువు; సర్వ = సమస్తమునందు; సముండును = సమదృష్టి కలవాడు; సకల = సమస్త; భూత = భూతముల యందు, జీవులకును; నిగ్రహ = నిగ్రహము; అనుగ్రహ = అనుగ్రహము; కరుండునున్ = చేయువాడును; ఐన = అయినట్టి; నిన్నున్ = నిన్ను; తలంచి = స్మరించి; నమస్కరించెదన్ = నమస్కరిస్తున్నాను; అవధరింపుము = స్వీకరింపుము; మనుష్యులన్ = మానవులను; విడంబించు = భ్రమింపజేయు; భవదీయ = నీ యొక్క; విలసనంబున్ = విలాసములను; నిర్ణయింపన్ = వర్ణింపను; ఎవ్వఁడు = ఎవడు; సమర్థుండు = సమర్థత గలవాడు; నీకున్ = నీకు; ప్రియ = ప్రియమైనవారును; అప్రియులు = ప్రియముకానివారును; లేరు = లేరు; జన్మ = జన్మమును; కర్మ = కర్మమును; శూన్యుండవు = లేనివాడవు; అయిన = అయినట్టి; నీవు = నీవు; తిర్యక్ = పశుపక్ష్యాదులు {తిర్యక్ – చలనముగలవి, పశుపక్ష్యాదులు}; ఆది = మొదలగు; జీవుల = జీవుల; అందున్ = లో; వరాహ = వరాహము; ఆది = మొదలగు; రూపంబులను = రూపములతోను; మనుష్యుల = మానవుల; అందున్ = లో; రామ = రాముడు; ఆది = మొదలగు; రూపంబులను = రూపములతోను; ఋషుల = ఋషుల; అందున్ = లో; వామన = వామనుడు;

ఆది = మొదలగు; రూపంబులను = రూపములతోను; జలచరంబుల = జలచరముల; అందున్ = లో; మత్స్య= చేప; ఆది = మొదలగు; రూపంబులను = రూపములతోను; అవతరించుట = అవతరించుట; లోక = లౌకిక విధానాలను; విడంబన = అనుసరించుట; అర్థంబున్ = కొరకు; కాని = తప్ప; జన్మ = జన్మములను; కర్మ = కర్మములను; సహితుండవు = కలిగివుండు వాడవు; అగుటన్ = అగుటవలన; కాదు = కాదు.

భావము:- అంతేకాకుండా, కృష్ణా! నీవు భక్తులకు కొంగుబంగారానివి; ధర్మార్థ సంబంధమైన వ్యామోహాన్ని తొలగించేవాడివి; ఆత్మారాముడివి; రాగద్వేషములులేనివాడివి; మోక్షప్రదాతవు; కాలస్వరూపుడివి; జగన్నియంతవు; ఆద్యంతాలు లేనివాడవు; సర్వేశ్వరుడవు; సర్వసముడవు; జీవులందరి యెడ నిగ్రహానుగ్రహ సమర్థుడవు; మానవభావాన్ని అనుకరిస్తూ వర్తించే నీ లీలలు గుర్తించటం ఎవరికి సాధ్యం కాదు; నీకు ఐనవారు కానివారు లేరు; జన్మకర్మలు లేవు; జంతువులలో వరాహాదిరూపాలతో, మానవులలో రామావతారాది రూపాలతో, ఋషులలో వామనావతారాది రూపాలతో, జలచరాలలో మత్స్యాదిరూపాలతో నీవు అవతరించటం లోకం కోసమే తప్పించి నిజానికి నీకు జన్మకర్మాదులు లేనే లేవు; నీ ప్రభావాన్ని భావించి నేను చేసే నమస్కారాలు స్వీకరించు.
*గమనిక*:- రాగాది అనగా రాగద్వేషములు, ఇవి పదమూడు. 1.రాగము, 2.ద్వేషము, 3.కామము, 4.క్రోధము, 5.లోభము, 6.మోహము, 7.మదము, 8.మాత్సర్యము, 9.ఈర్ష్య, 10.అసూయ, 11.దంభము, 12.దర్పము, 13అహంకారము ఈ పదమూడింటిని త్రయోదశరాగద్వేషములు అంటారు. ఈ రాగద్వేషములు లేని వారిని శాంతమూర్తి అంటారు.

★1-193-ఉ.

**కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో**
**గోపిక ద్రాటఁ గట్టిన, వికుంచిత సాంజన బాష్పతోయ ధా**
**రాపరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ బ్రాముచు, వెచ్చనూర్చుచుం,**
**బాపఁడవై నటించుట కృపాపర! నా మదిఁ జోద్య మయ్యెడిన్.**

టీక:- కోపము = కినుక; తోడన్ = తో; నీవు = నీవు; దధి = పాల; కుంభము = కుండ; భిన్నము = ముక్కలు; చేయుచు = చేస్తూ; ఉన్నచోన్ = ఉన్నపుడు; గోపిక = యశోదాదేవి ; త్రాటన్ = తాడుతో; కట్టిన = కట్టగా; వికుంచిత = వంచిన, జారిన; సాంజన = కాటుకతో కూడిన; బాష్పతోయ = కన్నీటి; ధారా = ధారలతో; పరిపూర్ణ = నిండిన; వక్త్రమున్ = ముఖమును; కరంబులన్ = చేతులతో; ప్రాముచు = అలము కొనుచు; వెచ్చనూర్చుచున్ = వేడినిట్టూర్పులు నిట్టూరుస్తూ; పాపఁడవు = శిశువు; ఐ = అయి; నటించుట = నటించుట; కృప = దయను; పర = ప్రసరించువాడా; నా = నా యొక్క; మదిన్ = మనసులో; చోద్యము = ఆశ్చర్యమును; అయ్యెడిన్ = కలిగిస్తోంది.

భావము:- దయామయా! శ్రీకృష్ణా! చిన్నప్పుడు నీవు ఒకసారి కోపంవచ్చి పాలకుండ బద్దలు కొట్టావు. అప్పుడు మీ అమ్మ యశోదాదేవి తాడు పట్టుకొని వచ్చి కట్టేసింది. అన్నీ తెలిసిన నువ్వేమో కాటుక కలిసిన కన్నీటి ధారలను చేత్తో పామేసుకుంటూ, ఉడికిపోతూ చంటిపిల్లాడిలా నటించటం తలచుకుంటే, ఇప్పటికి నా మనసులో ఆశ్చర్యం కలుగుతోందయ్యా.

1-194-క.

మలయమునఁ జందనము క్రియ

వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై

యిలపై నభవుఁడు హరి యదు

కులమున నుదయించె నండ్రు గొంద, అనంతా!

టీక:- మలయమునన్ = మలయపర్వతముమీది; చందనము = గంధపుచెట్టు సువాసన; క్రియన్ = వలె; వెలయఁగన్ = విస్తరించునట్లు; ధర్మజుని = ధర్మరాజు యొక్క {ధర్మజుడు - యమధర్మరాజు కొడుకు, ధర్మరాజు}; కీర్తి = కీర్తిని; వెలయించుట = ప్రకాశింజేయుట; కై = కోసం; ఇల = భూమి; పై = మీద; అభవుఁడు = కృష్ణుడు {అభవుడు - పుట్టుకలేనివాడు, విష్ణువు}; హరి = కృష్ణుడు; యదు = యదు; కులమునన్ = వంశములో; ఉదయించెన్ = అవతరించెను; అండ్రు = అందురు; కొందఱు = కొందరు; అనంతా = అంతము లేనివాడా, కృష్ణా.

భావము:- ధర్మనందనుని యశస్సు, మలయ మారుతముచే చందనవృక్షపు సౌరభాలు విస్తరించే చందమున, సలుదెసలా ప్రసరింపజేయటానికి, శ్రీకృష్ణా! పుట్టుక ఎరుగని పురుషోత్తముడవైన నీవు యదువంశంలో ఉదయించావని కొంద రంటారు.

1-195-క.

వసుదేవదేవకులు తా

పసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం

తసమునఁ బుత్త్రత నొందితి

వసురుల మృతి కంచుఁ గొంద అండ్రు, మహాత్మా!

టీక:- వసుదేవ = వసుదేవుడు; దేవకులు = దేవకీదేవులు; తాపస = తాపసుల యొక్క; గతిన్ = వృత్తితో; గత = పూర్వ; భవమునందున్ = జన్మలో; ప్రార్థించినన్ = ప్రార్థించుటవలన; సంతసమునన్ = సంతోషముతో; పుత్త్రతన్ = పుత్రుడుగా ఉండుట; ఒందితివి = వహించితివి; అసురుల = రాక్షసుల; మృతి; కిన్ = కోసము; అంచున్ = అనుచు; కొందఱు = కొందరు; అండ్రు = అందురు; మహాత్మా = గొప్ప ఆత్మకలవాడా, కృష్ణా.

భావము:- పూర్వజన్మంలో అపూర్వమైన తపస్సు చేసి దేవకీ వసుదేవులు ప్రార్థించగా, మహానుభావా! శ్రీకృష్ణా! రాక్షస సంహారం కోసం ఆ పుణ్యదంపతులకు పుత్రుడవై పుట్టావని కొందరు చెబుతారు.

1-196-క.

జలరాశి నడుమ మునిఁగెడు
కలము క్రియన్ భూరిభారకర్శితయగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ
గలిగితి వని కొంద ఱండ్రు, గణనాతీతా!

టీక:- జలరాశి = సముద్రము; నడుమ = మధ్యన; మునిఁగెడు = మునిగిపోతున్న; కలము = ఓడ; క్రియన్ = వలె; భూరి = అత్యంత; భార = భారముతో; కర్శిత = పీడితము; అగు = అయినట్టి; ఈ = ఈ; ఇలన్ = భూమిని; కావన్ = కాపాడుటంకోసం; అజుఁడు = బ్రహ్మ {అజుఁడు - భౌతిక జన్మము లేనివాడు, బ్రహ్మ}; కోరినన్ = కోరగా; కలిగితివి = అవతరించావు; అని = అని; కొందఱు = కొందరు; అండ్రు = అంటారు; గణనాతీతా = కృష్ణా {గణనాతీత - ఎంచుటకు అతీతమైన వాడు, కృష్ణుడు}.

భావము:- బ్రహ్మదేవుడు ప్రార్థింపగా నట్టనడి సముద్రంలో మునిగిపోతున్న నావలాగ భరింపరాని బరువుతో క్రుంగిపోతున్న భూమండలాన్ని ఉద్ధరించటం కోసం, అంచనాలకి అందని అనంత! శ్రీకృష్ణా! నీవు అవతారం ఎత్తావంటారు మరికొందరు.

1-197-తే.

మఱచి యజ్ఞాన కామ కర్మములఁ దిరుగు
వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ
శ్రవణ, చింతన, వందనార్చనము లిచ్చు
కొఱకు నుదయించి తండ్రు నిన్ గొంద ఱభవ!

టీక:- మఱచి = మర్చిపోయి; అజ్ఞాన = అజ్ఞనముతో; కామ = ఫలితమును కోరి చేయు; కర్మములన్ = కర్మములందు; తిరుగు = తిరుగుతుండే; వేదన = బాధలుచే; ఆతురులు = పీడింపబడే వారు; కున్ = కి; తత్ = వానినుండి; నివృత్తిన్ = నివారించుటను; చేయన్ = చేయు నిమిత్తము; శ్రవణ = (తన గురించి) వినుట; చింతన = ధ్యానించుట; వందన = నమస్కారము చేయుట; అర్చనములు = పూజించుటలు; ఇచ్చు = ఇచ్చుట; కొఱకున్ = కోసము; ఉదయించితి = అవతరించితివి; అండ్రు = అంటారు; నిన్ = నిన్ను; కొందఱు = కొందరు; అభవ = పుట్టుక లేనివాడా, కృష్ణా.

భావము:- కర్తవ్యం విస్మరించి, కామ్యకర్మలలో మునిగి తేలుతూ, అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న ఆపన్నుల ఆర్తి పోగొట్టి, వారికి శ్రవణం, చింతనం, వందనం, అర్చనం మొదలైన భక్తి మార్గాలను ప్రసాదించే నిమిత్తం, పుట్టుకే లేని పురుషోత్తమ! శ్రీకృష్ణా! నీవు అవతరించావని కొందరి అభిప్రాయం.

1-198-మ.

నినుఁ జింతించుచుఁ, బాడుచుం, బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్
వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే
ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా!

టీక:- నినున్ = నిన్ను; చింతించుచున్ = ధ్యానముచేస్తూ; పాడుచున్ = భజనలు పాడుతూ; పొగడుచున్ = కీర్తిస్తూ; నీ = నీ; దివ్య = దివ్యమైన; చారిత్రముల్ = కథలు; వినుచున్ = వింటూ; చూతురున్ = దర్శించ గలుగుతారు; కాక = అంతే తప్ప; లోకులు = మానవులు; ఇతర = ఇతరమైన; అన్వేషంబులన్ = వెతుకులాటల వలన; చూతురే = దర్శించగలరా; ఘన = కరడుగట్టిన; దుర్జన్మ = చెడ్డజన్మల; పరంపరా = వరుసలను; హరణ = కృశింపజేయుటకు; దక్షంబు = సామర్థ్యము గలవి; ఐ = అయి; మహా = గొప్ప; యోగి = యోగుల; వాక్ = వాక్కులచే; వినుతంబు = స్తోత్రము చేయబడునవి; ఐన = అయినట్టి; భవత్ = నీయొక్క; పద = పాదములనే; అబ్జ = పద్మముల; యుగమున్ = జంటను; విశ్వేశ = విశ్వేశుడు - కృష్ణా {విశ్వమునకు ఈశ్వరుడు, కృష్ణ}; విశ్వంభరా = కృష్ణా {విశ్వంభరుడు - విశ్వమును భరించువాడు, కృష్ణ}.

భావము:- ఎల్లప్పుడు నిన్నే ధ్యానిస్తూ, నీ లీలలే గానం చేస్తూ, నిన్నే ప్రశంసిస్తూ, నీ పవిత్ర చరిత్రలే వింటూ ఉండే వారు మాత్రమే, విశ్వేశ్వరా! విశ్వంభరా! శ్రీకృష్ణా! దురంతాలైన జన్మపరంపరలను అంతం చేసేవీ, పరమయోగులు పవిత్ర వాక్కులతో ప్రస్తుతించేవీ అయిన నీ పాదపద్మాలను, దర్శించగలుగుతారు. అంతేతప్ప మరింకే ఇతర ప్రయత్నాలు ఫలవంతాలు కావు.

1-199-వ.

దేవా! నిరాశ్రయులమై, భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారల మైన మమ్ము విడిచి విచ్చేయ నేల, నీ సకరుణావలోకనంబుల నిత్యంబునుఁ జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణ లక్షణ లక్షితంబులయిన నీ యడుగులచేత నంకితంబైన యీధరణీమండలంబు నీవువాసిన శోభితంబు గాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమ ఫలభరితం బులై యోషధి, తరు, లతా, గుల్మ, నద, నదీ, సమేతంబులై యుండు.

టీక:- దేవా = దేవా, శ్రీకృష్ణా; నిరాశ్రయులము = ఆశ్రమము లేని వారము (ఇతర); ఐ = అయి; భవదీయ = నీ యొక్క; చరణ = పాదములనెడి; అరవిందంబులున్ = పద్మములను; ఆశ్రయించి = ఆశ్రయించి; నీ = నీ; వారలము = వారము; ఐన = అయినట్టి; మమ్ము = మమ్ములను; విడిచి = విడిచిపెట్టి; విచ్చేయన్ = వెళ్ళుట;

ఏల = ఎందుకు; నీ = నీ; సకరుణ = దయతో కూడిన; అవలోకనంబులన్ = చూపులతో, దృక్కులతో; నిత్యంబును = ప్రతినిత్యము; చూడవేని = చూడకపోయినట్లైతే; యాదవ = యాదవులతో; సహితులు = కూడిన వారు; ఐన = అయిన; పాండవులు = పాండవులు {పాండురాజు సంతానము - పంచపాండవులు}; జీవునిన్ = ప్రాణం; పాసిన = దూరమైన; ఇంద్రియంబుల = ఇంద్రియముల; చందంబునన్ = వలె; కీర్తి = కీర్తిని; సంపదలు = సంపదలును; లేక = లేకుండాపోయి; తుచ్ఛత్వంబున్ = నీచత్వమును; ఒందుదురు = పొందుతారు; కల్యాణ = శుభమైన; లక్షణ = లక్షణములకు; లక్షితంబులు = గురుతులు; అయిన = అయినట్టి; నీ = నీ; అడుగుల = పాదములు; చేతన్ = చేత; అంకితంబు = గుర్తులు వేయబడినది; ఐన = అయినట్టి; ఈ = ఈ; ధరణీ = భూ; మండలంబున్ = మండలము; నీవు = నీవు; వాసిన = విడిచినట్లైన; శోభితంబు = శోభాయమానము; కాదు = కాదు; నీ = నీ; కృపా = దయతో కూడిన; వీక్షణ = చూపులనే; అమృతంబున = అమృతమువలననే; ఇక్కడి = ఇక్కడి; జనపదంబులు = ఊర్లు; కుసుమ = పువ్వులతోను; ఫల = పండ్లతోను; భరితంబులు = నిండినవి; ఐ = అయి; ఓషధి = మొక్కలు {ఓషధి - ఫలించగానే మరణించు నవి (ధాన్యాదులు), మొక్కలు}; తరు = చెట్లు; లతా = లతలు, తీగలు; గుల్మ = పొదలు; నద = నదములు {నదము - పడమరకు ప్రవహించు నది}; నదీ = నదులు {నది - తూర్పునకు ప్రవహించు నదము}; సమేతంబులు = తో కూడినవి; ఐ = అయి; ఉండున్ = ఉండును.

భావము:- దేవదేవ! శ్రీకృష్ణా! నీ వారలమయ్యా. నిరాశ్రయులమై నీ చరణ కమలాలనే ఆశ్రయించామయ్యా; అటువంటి మమ్మల్ని విడిచి వెళ్లటం న్యాయం కాదు. కరుణామయుడవైన నీవు నిత్యం కటాక్ష వీక్షణాలతో వీక్షించకపోతే యాదవులు, పాండవులు; జీవాత్మను ఎడబాసిన పంచేంద్రియాల వలె పేరు ప్రతిష్ఠలు కోల్పోయి, దిక్కులేనివారు అవుతారు; సమస్త శుభలక్షణాలతో అలరారే నీ పాదపంకజాల ముద్రలతో అంచితమైన ఈభూభాగం పల్లెలు, పుష్ప, ఫల సమృద్ధి కలిగి ప్రకాశిస్తోంది. పండిన పంటచేలు, వృక్షాలు, లతలు, పొదలు, నదీనదాలు కలిగి ఉంది.

### ★1-200-ఉ.

యాదవు లందుఁ, బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహవి
చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁ గదయ్య! యీశ్వరా!

టీక:- యాదవులందున్ = యదు వంశమువారి మీదను; పాండుసుతులందున్ = పాండురాజు పుత్రుల మీదను; అధీశ్వర = ప్రభూ; నాకు = నాకున్న; మోహ = మోహమును; విచ్ఛేదమున్ = విమోచనము; సేయుము = చేయుము; అయ్య = అయ్యా; ఘనసింధువున్ = సముద్రము {ఘనసింధువు - అత్యధికమైన నీరుగలది, సముద్రము}; చేరెడి = చేరేటటువంటి; గంగ = గంగ; భంగిన్ = వలెను; నీ = నీయొక్క; పాద = పాదములను; సరోజ = పద్మముల; చింతనము = భక్తి; పైన్ = మీద; అనిశంబు = ఎల్లప్పుడు; మదీయ = నాయొక్క; బుద్ధిన్ = మనసుని; అతి = మిక్కిలి; ఆదర = ఆదరమైన; వృత్తి = ప్రవర్తన; తోన్ = తో; కదియునట్లుగన్ = కూడి ఉండునట్లుగా; చేయన్ = చేయవచ్చు; కద = కదా; అయ్య = అయ్యా; ఈశ్వరా = ఈశ్వరుడా, శ్రీకృష్ణా.

భావము:- స్వామీ! విశ్వేశ్వరా! శ్రీకృష్ణా! ఆత్మీయులైన యాదవులమీద, పాండవులమీద నాకున్న అనురాగ బంధాన్ని తెంపెయ్యి. కడలిలో కలిసే గంగానదిలా, నా బుద్ధి సర్వదా నీ చరణసరోజ సంస్మరణంలోనే లగ్న మయ్యేటట్లు చెయ్యి.

## ★1-201-శా.

శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!"

టీక:- శ్రీకృష్ణా = కృష్ణా {కృష్ణుడు - 1. నల్లనివాడు, 2. భక్తుల హృదయములు ఆకర్షించువాడు, 3. శ్లో. కృషిర్భూవాచకశ్శబ్దోణశ్చ నిర్వృతివాచకః, పూర్ణానంద పరబ్రహ్మ కృష్ణ ఇత్యభీయతే., పూర్ణానంద పరబ్రహ్మము, కృష్ణుడు, నల్లనివాడు, 4. కృఞ్‌కరణే అను ధాతువుచేత సృష్టిస్థితిలయములను చేయువాడు, 5. శ్లో. కృషిర్భూ వాచకశ్శబ్దోణశ్చ నిర్వృతివాచకః, తయోరైక్యాత్పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే (ప్రమాణము), అజ్ఞానబంధమును తెంచివేయువాడు, కృష్ణుడు, , సచ్చిదానంద స్వరూపుడైన భగవానుడు. సర్వమును ఆకర్షించువాడు, విష్ణు స్రహస్రనామములలో 57వ నామం}; యదుభూషణా = కృష్ణా {యదు భూషణుడు - యదు వంశమునకు భూషణము వంటి వాడు, కృష్ణుడు}; నరసఖా = కృష్ణా {నరసఖుడు - అర్జునునకు సఖుడు, కృష్ణుడు}; శృంగార రత్నాకరా = కృష్ణా {శృంగార రత్నాకరుడు - శృంగార రసమునకు సముద్రము వంటివాడు, కృష్ణుడు}; లోకద్రోహి నరేంద్రవంశదహనా = కృష్ణా {లోకద్రోహినరేంద్రవంశదహన - దుష్టరాజవంశముల నాశనము చేయువాడు, కృష్ణుడు}; లోకేశ్వరా = కృష్ణా {లోకేశ్వరుడు - లోకములకు ఈశ్వరుడు, కృష్ణుడు}; దేవతానీకగోబ్రాహ్మణార్తి హరణా = కృష్ణా {దేవతానీకగోబ్రాహ్మణార్తి హరణుడు - దేవత = దేవతల, అనీక = సమూహమునకును, బ్రాహ్మణ = బ్రాహ్మణులకును, గోగణ = గోవులమందకును, ఆర్తి = బాధలను, హరణా = హరించువాడు, కృష్ణుడు}; నిర్వాణ సంధాయకా = కృష్ణా {నిర్వాణ సంధాయికుడు - మోక్షమును కలిగించువాడు, కృష్ణుడు}; నీకున్ = నీకు; మ్రొక్కెదన్ = నమస్కరిస్తున్నాను; త్రుంపవే = తెంపుము; భవ = సంసార; లతల్ = బంధనములు; నిత్యానుకంపానిధీ = కృష్ణా {నిత్యానుకంపానిధి –శాశ్వతమైన దయకు నిలయమైనవాడు, కృష్ణుడు}.

భావము:- శ్రీ కృష్ణా! యదుకులవిభూషణా! అర్జునమిత్రా! శృంగార రత్నాకరా! జగత్కంటకులైన రాజుల వంశాలను దహించే వాడా! జగదీశ్వరా! ఆపన్నులైన దేవతల, బ్రాహ్మణుల, ఆవులమందల ఆర్తులను బాపువాడా! మోక్షాన్ని ప్రసాదించే ప్రభూ! నీకు నమస్కరిస్తున్నాను; నాకీ ఈ భవబంధాలను తెంపెయ్యి.

1-202-వ.

**అని యిట్లు సకలసంభాషణంబుల నుతియించు గొంతిమాటకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి, రథారూఢుండై కరినగరంబునకు వచ్చి, కుంతీ సుభద్రాదుల వీడ్కొని, తన పురం బునకు విచ్చేయ గమకించి, ధర్మరాజు చేఁ గించిత్కాలంబు నిలువుమని ప్రార్థి తుండై, నిలిచె; నంత బంధువధ శోకాతురుం డయిన ధర్మజుండు నారాయణ, వ్యాస, ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై, నిర్వివేకం బగు చిత్తంబున నిట్లనియె.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధంగా; సకల = సమస్త; సంభాషణంబులన్ = పదముల; నుతియించు = కీర్తించు; గొంతి = కుంతీదేవి; మాట = మాటలు; కున్ = కి; ఇయ్యకొని = అంగీకరించి; గోవిందుండు = కృష్ణుడు {గోవిందుడు - గోవులకు ఒడయుడు (స్వామి), కృష్ణుడు}; మాయా = మాయను; నిరూఢ = నెలకొల్పే; మందహాస = చిరునవ్వు; విశేషంబున = విశిష్టతవలన; మోహంబున్ = మోహమును; ఒందించి = కలిగించి; రథా = రథమును; ఆరూఢుండు = అధిష్టించినవాడు; ఐ = అయి; కరినగరంబు = హస్తినాపురము; కున్ = కు; వచ్చి = వచ్చి; కుంతీ = కుంతియొక్క; సుభద్ర = సుభద్ర; ఆదుల = మొదలగువారి యొక్క; వీడ్కొని = వీడ్కోలు తీసుకొని; తన = తన యొక్క; పురంబు = నగరాని; కున్ = కి; విచ్చేయ = వెళ్ళవలెనని; గమకించి = సంకల్పించి; ధర్మరాజు = ధర్మరాజు; చేన్ = చేత; కించిత్ = కొంచెము; కాలంబు = కాలము; నిలువుము = ఆగుము; అని = అని; ప్రార్థితుండు = వేడుకొనబడినవాడు; ఐ = అయి; నిలిచెన్ = ఆగెను; అంతన్ = అంతట; బంధు = బంధువులను; వధ = వధించిన; శోక = బాధతో; ఆతురుండు = వేదనపడుతున్నవాడు; అయిన = అయినట్టి; ధర్మజుండు = ధర్మరాజు; నారాయణ = కృష్ణుడు {నారాయణుడు - నారముల యందు నివశించువాడు, విష్ణువు}; వ్యాస = వ్యాసుడు; ధౌమ్య = ధౌమ్యుడు; ఆదులు = మొదలగువారి; చేతన్ = చేత; తెలుపంబడియున్ = తెలియజేయబడి నప్పటికీ; తెలియక = సమాధానపడలేక; మోహితుండు = మోహము చెందినవాడు; ఐ = అయి; నిర్వివేకంబు = వివేకశూన్యంము; అగు = అయిన; చిత్తంబునన్ = మనసుతో; ఇట్లు = ఈ విధంగా; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా కుంతీదేవి మధురోక్తులతో మాధవుణ్ణి కొనియాడింది. ఆమె ప్రార్థనను అంగీకరించిన శ్రీకృష్ణుడు మాయా మయమైన తన మధుర మందహాసంతో మైమరపించాడు; రథారూఢుడై హస్తినాపురానికి తిరిగివచ్చాడు. కొంతకాలమైన తరువాత కుంతి, సుభద్ర మొదలగువారికి చెప్పి ద్వారకానగరానికి ప్రయాణమైనాడు గోవిందుడు; కొద్దికాలం ఉండమని ధర్మరాజు బతిమిలాడటంతో ఉండిపోయాడు; చుట్టాలందరినీ మట్టు పెట్టానన్న దుఃఖంతో తల్లడిల్లుతున్న ధర్మజుణ్ణి కృష్ణుడు, వ్యాసుడు, ధౌమ్యుడు మొదలైనవారు ఎన్నో విధాల ఓదార్చారు; అయినా, ఆయన మనస్సు ఊరట చెందలేదు; వ్యాకులమైన హృదయంతో ధర్మరాజు ఇలా అనుకోసాగాడు.

1-203-మ.

"తనదేహంబునకై యనేకమృగసంతానంబుఁ జంపించు దు
ర్జనుభంగిం గురు, బాలక, ద్విజ, తనూజ, భ్రాతృ సంఘంబు ని
ట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హా
యన లక్షావధి నైన ఘోరనరకవ్యాసంగముల్ మానునే?

టీక:- తన = తన యొక్క; దేహంబు = దేహ పోషణాదులు; కై = కోసం; అనేక = అనేకమైన; మృగ = మృగముల; సంతానంబున్ = సమూహమును; చంపించు = సంహరించు; దుర్జను = చెడ్డవాని; భంగిన్ = వలె; గురు = గురువుల; బాలక = పిల్లల; ద్విజ = బ్రాహ్మణుల; తనూజ = పుత్రుల; భ్రాతృ = సోదరుల; సంఘంబున్ = సమూహములను; ఇట్లు = ఈ విధంగా; అనిన్ = యుద్ధములో; చంపించిన = చనిపోవునట్లు చేసిన; పాప = పాపం; కర్ముడు = చేసినవాడి; కున్ = కి; రాజ్య = రాజ్యముమీద; ఆకాంక్షి = బలీయమైన కోరికతో వేగువాడి; కిన్; నాకు; హాయన = సంవత్సరములు; లక్ష = లక్షలకొలది; అవధి = మేర; ఐనన్ = జరుగునట్టి; ఘోర = ఘోరమైన; నరక = నరకమువలన; వ్యాసంగముల్ = సంబంధములు, వసించుటలు; మానునే = తప్పునే (తప్పవు).

భావము:- అమాయకమైన మృగాలను ఎన్నింటినో తన శరీరపోషణకోసం అని చంపించే దుర్మార్గుడిలా, రాజ్యంకోసం అని గురువులను, బాలకులను, బ్రాహ్మణులను, కొడుకులను, అన్నదమ్ములను యుద్ధరంగంలో చంపించాను. ఇంతటి పాపానికి ఒడిగట్టిన నేను లక్షల సంవత్సరాల పర్యంతం ఘోరమైన నరకం అనుభవించక తప్పదు కదా.

1-204-వ.

మఱియుఁ, బ్రజాపరిపాలనపరుండయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినం బాపంబు లేదని, శాస్త్రవచనంబు గల; దయిన నది విజ్ఞానంబు కొఱకు సమర్థంబు గాదు; చతురంగంబుల ననేకా క్షౌహిణీ సంఖ్యాతంబులం జంపించితి; హతబంధు లయిన సతుల కేనుఁ జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పు లేదు; గృహస్థాశ్రమధర్మంబు లైన తురంగమేధాది యాగంబులచేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబులవలన విడివడి నిర్మలుండగు నని, నిగమంబులు నిగమించు; పంకంబునఁ బంకిలస్థలంబునకు, మద్యంబున మద్యభాండంబున కును శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వక జీవహింసనంబు లయిన యాగంబుల చేతం బురుషులకుఁ బాప బాహుళ్యంబ కాని పాపనిర్ముక్తి గాదని శంకించెద."

టీక:- మఱియున్ = ఇంకా; ప్రజా = ప్రజలను; పరిపాలన = పరిపాలించుట; పరుండు = చేయవలసినవాడు; అయిన = అయినట్టి; రాజు = రాజు; ధర్మ = ధర్మబద్ధమైన; యుద్ధంబున = యుద్ధముతో; శత్రువులన్ = శత్రువులను; వధియించినన్ = సంహరించినప్పటికీ; పాపంబు = పాపము; లేదు = లేదు, అంటదు; అని = అని; శాస్త్ర = శాస్త్రములు చెప్పిన; వచనంబున్ = మాట; కలదు = ఉంది; అయినన్ = అయిననూ; అది = అది; విజ్ఞానంబు = విజ్ఞానము; కొఱకున్ = వలన; సమర్థంబు = సరియయినది; కాదు = కాదు; చతురంగంబులన్ = చతురంగబలములతో {చతురంగము – రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, కాల్బలము అను సేనా భాగములుతో కూడిన సేన}; అనేక = లెక్కలేనన్ని; అక్షౌహిణీ = అక్షౌహిణుల {అక్షోహిణి – ఇరవైఒక్కవేల ఎనిమిదివందల డెబ్బై రథములు, అన్ని ఏనుగులు, అరవైయైదువేల నాలుగువందల పది గుఱ్ఱాలు, లక్షా తొమ్మిదివేల మూడు వందల యాభై కాల్బలమును కల సేనావిశేషము}; సంఖ్యాతంబులన్ = సంఖ్యలలోనున్న వాటిని; చంపించితిన్ = చనిపోవునట్లు చేసి; హత = చంపబడిన; బంధులు = బంధువులు; అయిన = అయిన; సతులు = స్త్రీలు; కున్ = కు; ఏను = నేను; చేసిన = చేసినటువంటి; ద్రోహంబున్ = ద్రోహమును; తప్పించుకొనన్ = తప్పించుకోడానికి; నేర్పు = మార్గము; లేదు = లేదు; గృహస్థాశ్రమ = గృహస్థాశ్రమపు; ధర్మంబులు = ధర్మాలు; ఐన = అయినట్టి; తురంగమేధ = అశ్వమేధము; ఆది = మొదలగు; యాగంబులు = యాగములు; చేతన్ = చేత; పురుషుండు = మానవుడు; బ్రహ్మహత్య = బ్రాహ్మణులను చంపుట; ఆది = మొదలగు; పాపంబుల = పాపముల; వలనన్ = నుండి; విడివడి = బయటపడి; నిర్మలుండు = నిర్మలమైనవాడు; అగున్ = అగును; అని = అని; నిగమంబులు = వేదములు, నిగమించునవి; నిగమించున్ = నిర్ణయిస్తున్నాయి; పంకంబు నన్ = బురదతో; పంకిలస్థలంబు = బురదనేల; కున్ = కును; మద్యంబున = మద్యము వలన; మద్యభాండంబు = మద్యపుకుండ; కున్ = కును; శుద్ధి = పరిశుభ్రత; సంభవింపని = కలుగని; చందంబునన్ = విధంగా; బుద్ధి = ఇష్ట; పూర్వక = పూర్వకముగా చేయు; జీవహింసనంబులు = జీవులనుచంపుటలు; అయిన = అయినట్టి; యాగంబులు = యజ్ఞముల; చేతన్ = వలన; పురుషులు = మానవుల; కున్ = కు; పాప = పాపముల; బాహుళ్యంబ = వృద్ధియే; కాని = కాని; పాప = పాపములనుండి; నిర్ముక్తి = విముక్తి; కాదు = కాదు; అని = అని; శంకించెదన్ = అనుమానిస్తాను.

భావము:- ప్రజలను పరిపాలించే రాజు ధర్మబుద్ధితో శత్రువులను చంపటంలో దోషం లేదని శాస్త్రాలు చెప్పుతున్నాయి. అయినా, ఆలోచించి చూస్తే ఈ మాట నాకు సమంజసం అనిపించటం లేదు. రథాలతో, ఏనుగులతో, గుఱ్ఱాలతో, కాలిబంట్లతో కూడిన పెక్కు అక్షౌహిణుల సైన్యాలను చంపించాను. పతులను, బంధువులను హతమార్చి సతులకు నేను చేసిన మహాద్రోహం క్షమించరానిది. నా యీ పాపానికి నిష్కృతి లేదు. గృహస్థధర్మాలైన అశ్వమేధం మొదలైన యజ్ఞాలు ఆచరిస్తే బ్రహ్మహత్య మొదలగు దోషాలు పరిహారం అవుతాయని వేదాలు చెప్పుతున్నాయి.. కాని బురదవల్ల బురదనేల పరిశుభ్రం కాదు. కల్లుపోసి కడిగి నందువల్ల కల్లుకుండకు శుద్ధి లభించదు. అలాగే బుద్ధి పూర్వకంగా చేసే జీవహింసతో కూడిన యజ్ఞాలవల్ల మానవుల పాపం పెరుగుతుందే కాని తరగదని నా అనుమానం.

## ధర్మజుడు భీష్ముని కడ కేగుట

1-205-క.

అని యిట్లు ధర్మసూనుఁడు
మొనసి నిరాహారభావమున దేవనదీ
తనయుఁడు గూలిన చోటికిఁ
జనియెఁ బ్రజాద్రోహ పాప చలితాత్ముండై.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; ధర్మసూనుఁడు = ధర్మరాజు {ధర్మసూనుడు – యమధర్మ రాజు పుత్రుడు, ధర్మరాజు}; మొనసి = పూనుకొని; నిరాహార = ఆహారము స్వీకరింపని; భావమునన్ = నిర్ణయముతో; దేవనదీతనయుఁడు = భీష్ముడు {దేవనదీతనయుడు - గంగ యొక్క; తనయుఁడు = పుత్రుడు, భీష్ముడు }; కూలిన = పడి ఉన్న; చోటు = ప్రదేశాని; కిన్ = కి; చనియెన్ = వెళ్ళాడు; ప్రజా = ప్రజలకు; ద్రోహ = చేసిన ద్రోహము అనే; పాప = పాపంచే; చలిత = చలించిన; ఆత్ముండు = మనసు కలవాడు; ఐ = అయి;

భావము:- ఈ విధంగా, ప్రజాద్రోహం వల్ల కలిగిన పాపానికి చలించిన మనసు కలవాడు అయిన ధర్మరాజు, నిరాహారుడై భీష్ముడు పడి ఉన్న చోటుకు వెళ్లాడు.

1-206-వ.

"అయ్యవసరంబునం దక్కినపాండవులును, ఫల్గున సహితుండైన పద్మలోచనుం డును గాంచనసమంచితంబులయిన రథంబులెక్కి ధర్మజుంగూడిచనిన, నతండు గుహ్యక సహితుం డయిన కుబేరుని భంగి నొప్పె; నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబునకేఁగి, దివంబుననుండి నేలం గూలిన దేవతతెఱంగున సంగ్రామ రంగపతితుం డైన గంగానందనునకు నమస్కరించి; రంత బృహదశ్వ, భరద్వాజ, పరశురామ, పర్వత, నారద, బాదరాయణ, కశ్య పాంగిరస, కౌశిక, ధౌమ్య, సుదర్శన, శుక, వసిష్ఠా ద్యనేక రాజర్షి, బ్రహ్మర్షులు, శిష్య సమేతులై చనుదెంచినం జూచి సంతసించి, దేశకాలవిభాగవేది యైన భీష్ముండు వారలకుం బూజనంబులు సేయించి.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయానికి; తక్కిన = మిగతా; పాండవులును = పాండ వులును; ఫల్గున = అర్జునునితో; సహితుండు = కూడిన వాడు; ఐన = అయినట్టి; పద్మలోచనుం డును = కృష్ణుడును; కాంచన = బంగారము; సమంచితంబులు = పొదగబడినవి; అయిన = అయిన; రథంబులు = రథాలను; ఎక్కి = అధిరోహించి; ధర్మజున్ = ధర్మరాజు {ధర్మజుడు – యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; కూడి = తో కలిసి;

చనినన్ = వెళ్ళగా; అతండు = అతడు; గుహ్యక = యక్షులతో; సహితుండు = కూడినవాడు; అయిన = అయినట్టి; కుబేరుని = కుబేరుడి; భంగిన్ = లాగ; ఒప్పెన్ = ప్రకాశిస్తున్నాడు; ఇట్లు = ఈ విధంగా; పాండవులు = పాండవులు; పరి జనులు = పరివారం; కొలువన్ = సేవిస్తూ ఉండగా; పద్మనాభ = కృష్ణుని {పద్మనాభుడు – పద్మము నాభి యందు గలవాడు, కృష్ణుడు, విష్ణుసహస్రనామాలలో 48వ నామం, 196వ నామం, 346వ నామం}; సహితులు = తోకూడినవారు; ఐ = అయి; కురుక్షేత్రంబు = కురుక్షేత్రమున; కున్ = కు; ఏఁగి = వెళ్ళి; దివంబున = స్వర్గము; నుండి = నుండి; నేలన్ = నేలమీదకు; కూలిన = పడిపోయిన; దేవత = దేవత; తెఱంగునన్= వలె; సంగ్రామరంగ = యుద్ధక్షేత్రంలో; పతితుండు = పడి ఉన్నవాడు; ఐన = అయిన; గంగానందనున = భీష్మున {గంగానందనుడు – గంగాదేవి పుత్రుడు, భీష్ముడు}; కు=కు; నమస్కరించిరి = నమస్కరించారు; అంత = అంతట; బృహదశ్వ = బృహదశ్వుడు; భరద్వాజ = భరద్వాజుడు; పరశురామ = పరశురాముడు; పర్వత = పర్వతుడు; నారద = నారదుడు; బాదరాయణ = వ్యాసుడు {బాదరాయణుడు– బదరికాశ్రమంలో ఉండేవాడు, వ్యాసుడు}; కశ్యప = కశ్యపుడు; ఆంగిరస = ఆంగిరసుడు; కౌశిక = విశ్వామిత్రుడు; ధౌమ్య = ధౌమ్యుడు; సుదర్శన = సుదర్శనుడు; శుక = శుకుడు; వసిష్ఠ = వసిష్ఠుడు; ఆది = మొదలగు; అనేక = అనేకులయిన; రాజర్షి = రాజర్షులు; బ్రహ్మర్షులు = బ్రహ్మర్షులు; శిష్య = శిష్యులతో; సమేతులు = కూడినవారు; ఐ = అయి; చనుదెంచినన్ = రాగా; చూచి = చూసి; సంతసించి = సంతోషించి; దేశ = దేశముయొక్క; కాల = కాలముయొక్క; విభాగ = విభాగాలవివరాలు; వేది = తెలిసినవాడు; ఐన = అయినట్టి; భీష్ముండు = భీష్ముడు; వారలకున్ = వారికి; పూజనంబులున్ = పూజలు; చేయించి = చేయించి.

భావము:- కృష్ణార్జునులు, భీమ నకుల సహదేవులు బంగారు రథాలు అధిరహించి ధర్మరాజు వెంట వెళ్లారు. అప్పుడు ధర్మజుడు గుహ్యకులతో కూడిన కుబేరుడి లాగ ప్రకాశించాడు. ఈ విధంగా పాండవులు తమ పరివారంతోపాటు, శ్రీకృష్ణునితో కూడి కురుక్షేత్రానికి వెళ్లారు. అక్కడ దివినుంచి భువికి కూలిన దేవతలా యుద్ధరంగంలో అంపశయ్యపై ఉన్న భీష్ముడికి నమస్కరించారు. ఇంతలో బృహదశ్వుడు, భరద్వాజుడు, పరశురాముడు, పర్వతుడు, నారదుడు, వేదవ్యాసుడు, కశ్యపుడు, ఆంగిరసుడు, కౌశికుడు, ధౌమ్యుడు, సుదర్శనుడు, శుకుడు, వసిష్ఠుడు మొదలైన పెక్కుమంది రాజర్షులు, బ్రహ్మర్షులు తమతమ శిష్యులతో కూడి రావటం చూసి ఆనందించి, దేశకాల విభాగాలు తెలిసిన భీష్మాచార్యుడు వచ్చిన వారందరిని సత్కరింపజేసాడు.

### 1-207-క.

మాయాంగీకృతదేహుం
డై యఖిలేశ్వరుఁడు మనుజుఁ డైనాఁ డని ప్ర
జ్ఞాయత్తచిత్తమున గాం
గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్.

టీక:- మాయాంగీకృతదేహుండు = మాయచేత స్వీకరించిన దేహము కలవాడు; ఐ = అయిన; అఖిలేశ్వరుఁడు = అఖిలేశ్వరుడు – సర్వులకు ఈశ్వరుడు; మనుజుఁడు = మానవుడుగా; ఐనాఁడు = అవతరించాడు; అని = అని; ప్రజ్ఞా = పాటవంతో; ఆయత్త = కూడిన; చిత్తంబునన్ = మనసుతో; గాంగేయుఁడు

= భీష్ముడు {గాంగేయుడు – గంగ యొక్క పుత్రుడు, భీష్ముడు}; పూజనము = పూజ; చేసెన్ = చేసెను; కృష్ణున్ = కృష్ణుడిని {కృష్ణుడు – నల్లని వాడు, కృష్ణుడు}; జిష్ణున్ = కృష్ణుడిని {జిష్ణుడు – జయశీలము గలవాడు, కృష్ణుడు}.

భావము:- సర్వేశ్వరుడు అయిన పరమేశ్వరుడు మాయా మానవ దేహంతో జయశీలుడైన కృష్ణుడిగా అవతరించి అరుదెంచాడనే ప్రజ్ఞానంతో కూడిన వాడై గాంగేయుడు కృష్ణుణ్ణి పూజించాడు.

### 1-208-వ.

### మఱియు గంగానందనుండు వినయప్రేమ సుందరు లయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగ జనిత బాష్పసలిల సందోహ సమ్మిళిత లోచనుండై యిట్లనియె.

టీక:- మఱియు = ఇంకనూ; గంగానందనుండు = భీష్ముడు {గాంగానందనుడు – గంగ యొక్క పుత్రుడు, భీష్ముడు}; వినయ = వినయముతోను; ప్రేమ = ప్రేమతోనుకూడి; సుందరులు = అందమైన వారు; అయిన = అయినట్టి; పాండునందనులన్ = పాండవులను; కూర్చుండన్ = కూర్చోమని; నియోగించి = నియమించి; మహా = మిక్కిలి; అనురాగ = అనురాగముచే; జనిత = పుట్టిన; బాష్పసలిల = కన్నీటి; సందోహ = సమూహము; సమ్మిళిత = కూడిన; లోచనుండు = కన్నులుగలవాడు; ఐ = అయి; ఇట్లు = ఇటుల; అనియెన్ = అన్నాడు.

భావము:- అటుపిమ్మట, భీష్మాచార్యుడు వినయ ప్రేమలతో చక్కటివారైన పాండవులను దగ్గర కూర్చో పెట్టుకొన్నాడు. అపారమైన అనురాగంతో పొంగిపొరలే బాష్పధారలతో నిండిన కన్నులు కలవాడై ఇలా అన్నాడు.

### 1-209-ఆ.

### "ధరణిసురులు, హరియు, ధర్మంబు దిక్కుగా
### బ్రదుకఁ దలఁచి మీరు బహువిధముల
### నన్నలార! పడితి రాపత్పరంపర
### లిట్టి చిత్రకర్మ మెందుఁ గలదు?

టీక:- ధరణిసురులు = బ్రాహ్మణులును {ధరణిసురులు – భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; హరియున్ = కృష్ణుడును; ధర్మంబున్ = ధర్మమును; దిక్కుగాన్ = శరణముగ; బ్రదుకన్ = బ్రతుకవలెనని; తలఁచి = అనుకొని; మీరు = మీరు; బహు = అనేకమైన; విధములన్ = రకములుగా; అన్నలార = నాయనలారా; పడితిరి = పడ్డారు; ఆపత్ = ఆపదలు; పరంపరలు = ఒకదానిమీదింకొకటి; ఇట్టి = ఇటువంటి; చిత్ర = చిత్రమైన; కర్మము = పని; ఎందున్ = ఎక్కడ; కలదు = ఉంది.

భావము:- "నాయనలారా! పాండవులారా! శ్రీకృష్ణుణ్ణి, బ్రాహ్మణులను, ధర్మాన్ని నమ్ముకొని జీవించే మీరు కష్టాలు ఎన్నో పడ్డారు. ఇటువంటి విచిత్రమైన విషయం ఇంకా ఏముంటుంది.

★1-210-ఉ.

సంతస మింత లేదు మృగశాపవశంబునఁ బాండు భూవిభుం
డంతము నొంది యుండ మిము నర్భకులం గొనివచ్చి, కాంక్షతో
నింతలవారిఁగాఁ బెనిచె, నెన్నఁడు సౌఖ్యముపట్టు గాన దీ
గొంతి; యనేక దుఃఖములఁ గుందుచు నుండును భాగ్య మెట్టిదో?

టీక:- సంతసము = సంతోషము; ఇంతన్ = కొంచెము కూడ; లేదు = లేదు; మృగ = లేడి రూపంలో ఉన్న ముని యొక్క; శాప = శాపము; వశంబునన్ = వలన; పాండు = పాండు; భూవిభుండు = రాజు; అంతమున్ = మరణమును; ఒంది = పొంది; ఉండన్ = ఉండగ; మిమున్ = మిమ్మల్ని; అర్భకులన్ = పసిబిడ్డలను; కొనివచ్చి = తీసుకొని వచ్చి; కాంక్ష = బలీయమైన కోరిక; తోన్ = తో; ఇంతలవారిఁగాన్ = ఇంతవారిగా; పెనిచెన్ = పెంచింది; ఎన్నఁడున్ = ఎప్పుడుకూడా; సౌఖ్యముపట్టున్ = ఏమాత్రము సుఖమును; కానదు = ఎరుగదు; ఈ = ఈ; గొంతి = కుంతి {గొంతి - కుంతి - కుంతల దేశ ఇంతి}; అనేక = అనేకమైన; దుఃఖములన్ = బాధలతో; కుందుచున్ = కృంగిపోతూ; ఉండును = ఉంటుంది; భాగ్యము = అదృష్టం; ఎట్టిదో = ఎలాంటిదో.

భావము:- పాపం! మీ తల్లి కుంతీదేవికి ఏమాత్రం సంతోషం లేదు; పాండురాజు లేడిరూపంలో ఉన్న ముని శాపకారణంగా మరణించడంతో, పసికందులైన మిమ్మల్ని అరచేతిలో పెట్టుకొని పెంచుకొచ్చింది; ఇంతవాళ్ళని చేసింది; ఏ ఒక్కరోజూ సౌఖ్యమన్న మాట ఎరుగదు; ఈవిడ దురదృష్టం ఎలాంటిదో కానీ జీవితమంతా కష్టాలతోనే గడిచింది.

★1-211-ఉ.

వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం
బాయుచు నుండుకైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు, కాల మన్నియుం
జేయుచుఁ నుండుఁ, గాలము విచిత్రముదుస్తర మెట్టివారికిన్.

టీక:- వాయు = గాలికి; వశంబులు = ప్రభావానికి లోనైనవి; ఐ = అయి; ఎగసి = ఎగిరి; వారిధరంబులు = మేఘములు {వారి ధరములు -నీటిని కలిగియుండునవి, మేఘములు}; మింటన్ = ఆకాశములో; కూడుచున్ = కలుస్తు; పాయుచున్ = విడిపోతు; ఉండు = ఉండే; కైవడిన్ = విధంగా; ప్రపంచము = లోకము; సర్వమున్ = అంతా; కాల = కాలము చేత; తంత్రము = అల్లబడిన, మాయకు; ఐ = లోబడినవి అయి; పాయుచున్ = విడిపోతూ; కూడుచుండున్ = కలుస్తూ; ఒక = ఒక; భంగిన్ = విధంగా; చరింపదు = జరుగదు; కాలము = కాలము; అన్నియున్ = అన్నింటినీ; చేయుచున్ = చేస్తూ; ఉండున్ = ఉంటుంది; కాలము = కాలము; విచిత్రము = విచిత్రమైనది; దుస్తరము = దాటుటకు వీలుకానిది; ఎట్టివారి = ఎటువంటి వారి; కిన్ = కైనా,

భావము:- ఆకాశంలోని మేఘాలు గాలికి ఎగిరి పరస్పరం కలుసుకుంటూ, విడిపోతూ ఉంటాయి. అలానే ఈ ప్రపంచంలోని ప్రాణికోటి సమస్తం కాలం యొక్క అల్లిక వల్ల కూడుతూ, విడిపోతూ ఉంటాయి. కాలం ఎప్పుడూ ఒకేలా జరగదు. కాలమే అన్నింటికీ మూలం. కాలం చాలా విచిత్రమైంది. ఎంతటి వారైనా ఈ కాల ప్రభావాన్ని దాటలేరు.

★1-212-ఉ.

రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండట ధన్వి, శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్ర సం
యోజకుఁడైన చక్రియఁట, యుగ్రగదాధరుఁడైన భీముఁడ
య్యాజికిఁదోడు వచ్చునఁట, యాపద గల్గు టిదేమి చోద్యమో.

టీక:- రాజు = రాజు; అఁట = అట; ధర్మజుండు = ధర్మరాజు {ధర్మజుడు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మ రాజు}; సురరాజ = ఇంద్రుని; సుతుండు = పుత్రుడు; అఁట = అట; అర్జునుడు { ధన్వి - ధనుస్సు ధరించు వాడు, అర్జునుడు}; శాత్రవ = శత్రువులకు; ఉద్వేజకము = వెరపు కలిగించునది; ఐన = అయినట్టి; గాండివము = గాండీవము; అతని విల్లు = ధనుస్సు; అఁట = అట; సారథి = రథం నడిపించు వాడు; సర్వ = సమస్త; భద్ర = శుభ ములను; సంయోజకుఁడు = కలిగించువాడు; ఐన = అయిన; చక్రి = కృష్ణుడు {చక్రి - చక్రము ధరించు వాడు, కృష్ణుడు}; అఁట = అట; ఉగ్ర = భయంకరమైన; గదా = గదను; ధరుఁడు = ధరించువాడు; ఐన = అయి నట్టి; భీముఁడు = భీముడు; ఆ = ఆ; యాజి = యజ్ఞము చేసినవాని, ధర్మరాజు; కిఁన్ = కి; తోడు = తోడుగా; వచ్చున్ = వచ్చును; అఁట = అట; ఆపద = విపత్తు; కల్గుట = కలుగుట; ఇది = ఇది; ఏమి = ఏమి; చోద్యమో = చిత్రమో.

భావము:- ధర్మజు అంతటివాడు రాజు; ఇంద్రుడి కుమారుడూ మహావీరుడూ అయినట్టి అర్జునుడు యోద్ధ; శత్రుభయంకరమైనట్టి గాండీవం అతని ధనుస్సు; సమస్త శుభాలనూ కలిగించే శ్రీకృష్ణుడు రథసారథి; చండ ప్రచండమైన గదాదండం ధరించే భీముడు కొండంత అండ; అయినా ఇంతటి మహా మహిమాన్వితమైన సహాయ సంపత్తులు ఉన్నా ఈ పాండవులు అరణ్యవాసాలు, అజ్ఞాతవాసాలు చేసి మొదలైన ఆపదలు ఎన్నో పొందారు; ఎంత ఆశ్చర్యం!

★1-213-ఆ.

ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ నెవ్వని
కేమిసేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు
నతనిమాయలకు మహాత్ములు విద్వాంసు
లడఁగి మెలగుచుందు రంధు లగుచు.

టీక:- ఈశ్వరుండు = ఈశ్వరుడు, కృష్ణుడు {ఈశ్వరుడు - ఈశత్వము (ప్రభుత్వము) కలవాడు}; విష్ణుఁడు = విష్ణువు, కృష్ణుడు; ఎవ్వేళ = ఏసమయమునకు; ఎవ్వని = ఎవని; కిన్ = కి; ఏమి = ఏమి; సేయున్ =

చేయునో; పురుషుఁడు = మానవుడు; ఏమి = ఏమి; యెఱుఁగున్ = తెలియగలడు; అతని = అతనియొక్క; మాయలు = మహిమలు; కు = కి; మహాత్ములు = గొప్పవారు {గొప్ప ఆత్మ గలవారు}; విద్వాంసులు = పండితులు; అడఁగి = లొంగి; మెలగుచూ = చరిస్తూ; ఉందురు = ఉంటారు; అంధులు = గ్రుడ్డివారు; అగుచున్ = అవుతూ.

భావము:- పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఎప్పుడు ఎవరికి ఏమి చేస్తాడో ఎవరు చెప్పగలరు. ఆ మహానుభావుని మాయలకు పెద్ద పెద్ద విద్వాంసులు కూడా దిక్కు తెలియనివారై, లోబడి అణిగి మణిగి ఉంటారు.

## 1-214-వ.

**కావున దైవతంత్రంబైన పనికి వగవం బని లేదు; రక్షకులు లేని ప్రజల నుపేక్షింపక రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయ ణుండు, తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై తన మాయ చేత లోకంబుల మోహాతిరేకంబు నొందించు; నతని రహస్యప్రకారంబులు భగవంతుండైన పరమేశ్వరుం డెఱుంగు; మఱియు దేవర్షియగు నారదుండును, భగవంతుండగు కపిలమునియు, నెఱుం గుదురు; మీరు కృష్ణుండు దేవకీపుత్త్రుం డగు మాతులేయుండని తలంచి దూత, సచివ, సారథి, బంధు, మిత్ర, ప్రయోజనంబుల నియమింతు; రిన్నిటం గొఱంత లేదు; రాగాదిశూన్యుండు, నిరహంకారుండు, నద్వయుండు, సమదర్శ నుండు, సర్వాత్మకుండు, నయిన యీశ్వరునకు నతోన్నతభావ, మతివైషమ్యంబు లెక్కడివి, లే; వయిన భక్తవత్స లుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు.**

టీక:- కావునన్ = అందువలన; దైవ = దేవునిచేత; తంత్రంబు = పన్నబడినది; ఐన = అయినట్టి; పని = ఘటన; కిన్ = కి; వగవన్ = చింతించే; పని = అవసరము; లేదు = లేదు; రక్షకులు = రక్షించువారు; లేని = లేనట్టి; ప్రజలన్ = ప్రజలను; ఉపేక్షింపక = అశ్రద్ధ చేయక; రక్షింపన్ = రక్షించుటకు; పుండరీకాక్షుండు = కృష్ణుడు {పుండరీకాక్షుడు - తెల్ల కలువల వంటి కన్నులు కలవాడు, కృష్ణుడు}; సాక్షాత్కరించిన = ప్రత్యక్షముగా; నారాయణుండు = విష్ణుమూర్తి {నారాయణుడు – నీట నుండు వాడు, విష్ణువు}; తేజః = ప్రభావము; నిరూఢుండు = ప్రకటింపబడినవాడు; కాక = కాకుండా; యాదవులు = యాదవులు; అందున్ = లో; గూఢుండు = రహస్యముగ చరించువాడు; ఐ = అయి; తన = తన; మాయ = మాయ; చేతన్ = చేత; లోకంబుల = లోకములను; మోహ = మోహము యొక్క; అతిరేకంబున్ = అతిశయించుటను; ఒందించు = కలుగజేయును; అతని = అతని యొక్క; రహస్య = రహస్యమైన; ప్రకారంబులు = పద్ధతులు; భగవంతుండు = భగవంతుడు; ఐన = అయినట్టి; పరమేశ్వరుండు = శివుడు; ఎఱుంగున్ = తెలియగలుగును; మఱియు = ఇంకనూ; దేవర్షి = దేవర్షి; అగు = అయినట్టి; నారదుండును = నారదుడును; భగవంతుండు = భగవంతుడు, మహిమాన్వితుడు; అగు = అయినట్టి; కపిల = కపిలుడు అను; మునియు = మునియు; ఎఱుంగుదురు = తెలియగలరు; మీరు = మీరు;

కృష్ణుండు = కృష్ణుడు; దేవకీ = దేవకి యొక్క; పుత్త్రుండు = కొడుకు; అగు = అయిన; మాతులేయుండు = మేనమామ కొడుకు, మేనబావ; అని = అని; తలంచి = భావించి; దూత = రాయబారి; సచివ = మంత్రి; సారథి = రథసారథి; బంధు = చుట్టము; మిత్ర = స్నేహితుడు అను; ప్రయోజనంబుల = వివిధవిధములుగ; నియమింతురు = నియమిస్తూ; ఇన్నిటన్ = ఇన్నిటివలన; కొఱంత = లోటు; లేదు = లేదు; రాగ = రాగము (రాగవిద్వేషాలు); ఆది = మొదలగునవి; శూన్యుండున్ = లేనివాడును; నిరహంకారుండున్ = అహంకారము లేనివాడును; అద్వయుండున్ = కష్టసుఖాలు లాంటి ద్వంద్వాలకు అతీతుడునూ; సమదర్శనుండున్ = సమస్తమును హెచ్చు తగ్గులు లేక చూచువాడును; సర్వాత్మకుండున్ = సర్వమునందు ఆత్మరూపమున యుండువాడును; అయిన = అయినప్పటికీ; ఈశ్వరున = ప్రభువు, కృష్ణున; కున్ = కు; నత = తక్కువ; ఉన్నత = ఎక్కువ యను; భావ = భావము; మతి = బుద్ధి; వైషమ్యంబులు = విషమమైనవి, బేధములు; ఎక్కడివి = ఎక్కడవి; లేవు = లేవు; అయిన = అయినప్పటికీ; భక్త = భక్తులయందు; వత్సలుండు = వాత్సల్యము గలవాడు; కావునన్ = అగుటచేతను; ఏకాంత = ఏకాంతమను స్థితిని చేరిన; భక్తులు = భక్తులు; కున్ = కు; సులభుండు = సుఖముగా లభించువాడు; ఐ = అయి; ఉండున్ = ఉంటాడు.

భావము:- అందుచేత, దైవసంకల్పం వల్ల జరిగినదానికి విచారించటం వివేకం కాదు. రక్షణ లేని ప్రజానీకాన్ని రక్షించటంకోసం శ్రీహరి పుండరీకాక్షరూపంలో సాక్షాత్కరించాడు. వాసుదేవుడు తన దైవత్వం తెలియబడకుండా, యదుకులంలో రహస్యంగా సంచరిస్తూ తన మాయచేత ముల్లోకాలను మోహంలో ముంచి తేలుస్తున్నాడు. ఆ గుట్టుమట్టులు ఇంకా దేవర్షి అయిన నారదునికి, జ్ఞానస్వరూపుడైన కపిలమహర్షికి కొంత తెలుసు; నాయనలారా! మీరు శ్రీకృష్ణుని దేవకీ పుత్రుడని, మీ మేనమామ కుమారుడని తలచారు. దూతగా, సచివుడుగా, సారథిగా, బంధువుగా, మిత్రుడుగా భావించి ఎన్నో పనులకు ఆయన్ని వినియోగించుకొన్నారు. అయినా అందువల్ల ఎలాంటి లోపం రాదు. రాగద్వేషాలు లేనివాడు, అహంకారం లేని వాడు, ద్వంద్వాలకు అతీతుడైనవాడు, సమదర్శనుడు, సర్వాత్మకుడు ఐన జగన్నాథునకు ఎక్కువ తక్కువ భావాలు, అభిప్రాయభేదాలు ఎక్కడివి; అయినప్పటికీ భగవంతుడు భక్తవత్సలుడు అగుటచేత ఆత్మీయులైన భక్తులకు అందుబాటులో ఉంటాడు.

## 1-215-సీ.

అతిభక్తి నెవ్వనియందుఁ జిత్తముఁ జేర్చి-
  యెవ్వని నామ మూహించి పొగడి
కాయంబు విడుచుచుఁ గామ కర్మాది ని-
  ర్మూలనుండై యోగి ముక్తి నొందు
నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తంసుఁ-
  డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు

నందాఁక నిదె మహాహర్షుఁడై వికసిత-
వదనారవిందుఁడై వచ్చె నేఁడు

1-215.1-తే.

నాల్గుభుజములుఁ గమలాభ నయనయుగము
నొప్పఁ గన్నుల ముంగట నున్నవాఁడు
మానవేశ్వర! నా భాగ్యమహిమఁ జూడు
మేమి సేసితినో పుణ్య మితనిఁ గూర్చి."

టీక:- అతి = ఎక్కువ; భక్తిన్ = భక్తితో; ఎవ్వని = ఎవని; అందున్ = అందు; చిత్తమున్ = మనసు; చేర్చి = నిలిపి; యెవ్వని = ఎవని; నామము = నామమును; ఊహించి = స్మరించి; పొగడి = స్తుతించి; కాయంబున్ = శరీరమును; విడచుచున్ = విడిచిపెట్టుచు; కామ = కామము; కర్మ = కర్మము; ఆది = మొదలగునవి; నిర్మూల నుండు = వేళ్ళతో సహా పెకిలించ బడినవాడు; ఐ = అయ్యి; యోగి = యోగి; ముక్తిన్ = ముక్తిని; ఒందున్ = పొందు తాడో; అట్టి = అటువంటి; సర్వేశ్వరుండు = కృష్ణుడు {సర్వేశ్వర - సర్వమునకు ఈశ్వరుడు, కృష్ణుడు}; అఖిల దేవోత్తంసుఁడు = కృష్ణుడు {అఖిలదేవోత్తసుండు - సమస్త దేవతలలోను ఉన్నతుడు, కృష్ణుడు}; ఏ = ఏ; వేళన్ = సమయంలో; ప్రాణంబులు = ప్రాణములను; ఏను = నేను; విడుతున్ = వదులుతానో; అందాఁక = ఆ సమయము దాకా; ఇదె = ఇదిగో; మహా = గొప్ప; హర్షుఁడు = ఆనందము కలవాడు; ఐ = అయి; వికసిత = వికసించిన; వదన = ముఖము అనే; అరవిందుఁడు = పద్మముగలవాడు; ఐ = అయి; వచ్చెన్ = వచ్చాడు; నేఁడు = ఇవాళ;

నాల్గు = నాలుగు; భుజములున్ = భుజములును; కమల = కమలములు; అభ = వంటి; నయన = కళ్ళు; యుగము = జంట; ఒప్పన్ = ప్రకాశిస్తుండగా; కన్నుల = కళ్ళ; ముంగటన్ = ముందర; ఉన్నవాడు = ఉన్నాడు; మానవేశ్వర = రాజా; నా = నాయొక్క; భాగ్య = భాగ్యము యొక్క; మహిమన్ = గొప్పతనము; చూడుము = చూడుము; ఏమి = ఏమి; సేసితినో = చేసానో; పుణ్యము = పుణ్యము; ఇతనిన్ = ఇతని; గూర్చి = కోసము.

భావము:- మిక్కిలి భక్తియుక్తుడైన యోగి ఏ దేవుని యందు చిత్తం లగ్నంచేసి, ఏ దేవుని పవిత్ర నామం ఉచ్చరిస్తూ తనువు చాలించి, కామాది కర్మఫలాన్ని నిర్మూలించి, మోక్షాన్ని పొందుతాడో, అటువంటి దేవదేవుడైన గోవిందుడు నేను శరీరం చాలించే సమయానికి మహానందంతో వికసిత వదనారవిందంతో విచ్చేసి నాలుగు చేతులతో తామరరేకుల వంటి కళ్ళతో, నా కళ్ళ ముందు ప్రత్యక్షమయ్యాడు. ధర్మరాజా! నాభాగ్యం పండింది. ఈ మహానుభావుడి కోసం ఏ పుణ్యం చేసుకున్నానో. “

1-216-వ.

అని యిట్లు ధనంజయ సంప్రాపిత శరపంజరుం డయిన కురుకుంజ రుని వచనంబు లాకర్ణించి, ముని లందఱు వినుచుండ, ధర్మనంద నుడు మందాకినీ నందనువలన నరజాతిసాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమ ధర్మంబు

**లును, రాగవైరాగ్యోపాధులతోఁ గూడిన ప్రవృత్తి నివృత్తి ధర్మంబులును, దానధర్మం బులును, రాజ ధర్మంబులును, స్త్రీ ధర్మంబులును, శమదమాదికంబు లును, హరితోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థకామ మోక్షంబులును, నానా విధో పాఖ్యానేతిహాసంబులును, సంక్షేపవిస్తార రూపంబుల నెఱింగె; నంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛంద మరణు లైన యోగీశ్వరులచేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన, నది దనకు మరణోచితకాలం బని నిశ్చయించి.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; ధనంజయ = అర్జునిచేత; సంప్రాపిత = పొందజేయబడిన; శర = అమ్ములు కల; పంజరుండు = పంజరము (శరీరము) కలవాడు; అయిన = అయినట్టి; కురుకుంజరుని = భీష్ముని {కురుకుంజరుడు - కురువంశానికి ఏనుగు వంటి (పెద్ద) వాడు, భీష్ముడు}; వచనంబులు = ఉపదేశ ములు; ఆకర్ణించి = విని; మునులు = మునులు; అందఱున్ = అందరూ; వినుచుండన్ = వింటూ ఉండగా; ధర్మనందనుడు = ధర్మరాజు {ధర్మనందనుడు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; మందాకినీనందను = భీష్ముని {మందాకినీనందనుడు - గంగాదేవిపుత్రుడు, భీష్ముడు}; వలనన్ = నుండి; నర = మానవ; జాతి = జాతియొక్క; సాధారణంబులు = సాధారణముగా వర్తించునవి; అగు = అయిన; ధర్మంబులును = ధర్మములును; వర్ణా = కులముల యొక్క {చాతుర్వర్ణములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు}; ఆశ్రమ = ఆశ్రమము లోని వారికి వర్తించు {చతురాశ్రమములు - బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములు}; ధర్మంబు లును = ధర్మములును; రాగ = రాగము (ఆసక్తి) {రాగవైరాగ్యోపాధులు - వేదాంతశాస్త్ర సాంకేతిక పదాలు}; వైరాగ్య = వైరాగ్యము (అనాసక్తత); ఉపాధుల = ఉపాధి (ఆధారము) లు; తోన్ = తో; కూడిన = కూడిన; ప్రవృత్తి = ఐహికమునకైన (స్వర్గాది భోగములకైన); నివృత్తి = మోక్షమునకైన; ధర్మంబులును = ధర్మములును; దాన = దానము వలన; ధర్మంబులును = ధర్మములును; రాజ = రాజరికము వలన; ధర్మంబులును = ధర్మములును; స్త్రీ = స్త్రీల యొక్క; ధర్మంబులును = ధర్మములును; శమ = శాంతి; దమ = ఇంద్రియ నిగ్రహము; ఆదికంబులును = మొదలైనవి; హరి = హరికి; తోషణంబులు = సంతోషము కలిగించునవి; అగు = అయిన; ధర్మంబులును = ధర్మములును; ధర్మ = ధర్మమును; అర్థ = అర్థమును; కామ = కామమును; మోక్షంబులును = మోక్షములును; నానా = అనేక; విధ = రకముల; ఉపాఖ్యాన = ఉపాఖ్యానములూ; ఇతిహాసంబులూ = ఇతిహాసములూ; సంక్షేప = సంగ్రహమూ; విస్తార = వివరమూ అయిన; రూపంబులన్ = రూపముల వలన; ఎఱింగెన్ = తెలుసుకొనెను; అంత = అంతట; రథిక = రథికులు {రథికులు - రథముపై నుండి యుద్ధము చేయు వీరులు}; సహస్రంబులు = వేలమంది; కున్ = కి; గమికాఁడు = అధిపత్యము చేయగలవాడు, మొనగాడు; ఐన = అయినట్టి; భీష్ముండు = భీష్ముడు; స్వచ్ఛంద = స్వతంత్రమైన, తమకు ఇష్టము వచ్చినప్పుడే; మరణులు = మరణించు శక్తిగలవారు; ఐన = అయినట్టి; యోగి = యోగులలో; ఈశ్వరులు = శ్రేష్ఠులు; చేతన్ = చేత; వాంఛితంబు = కోరదగినది; అగు = అయిన; ఉత్తరాయణంబు = ఉత్తరాయణము; సనుదెంచినన్ = వచ్చిన; అది = అది; తనకున్ = తనకు; మరణ = మరణించుటకు; ఉచిత = తగిన; కాలంబు = కాలము; అని = అని; నిశ్చయించి = నిశ్చయించుకొని.

భావము:- ఈ విధంగా శరీరము నిండా అర్జునుడు వేసిన బాణములు కలవాడైన కురుకుల పితామహుడు పలికిన పలుకులను, అక్కడకి వచ్చిన మునులందరూ విన్నారు. అప్పుడు ధర్మనందనుడు గంగానందను డైన భీష్మాచార్యుని వలన మానవజాతికి ఆవశ్యకాలైన సామాన్య ధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, అనురాగ వైరాగ్యాలకు సంబంధించిన ప్రవృత్తి నివృత్తి ధర్మాలు, దాన ధర్మాలు, రాజ ధర్మాలు, స్త్రీ ధర్మాలు భగవంతునికి ప్రియమైన భాగవత ధర్మాలు, శమదమాదులు, చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థ కామ మోక్షాలు, నానావిధాలైన ఉపాఖ్యానాలు, ఇతిహాసాలు మొదలైన వన్నీ కొన్ని సంక్షేపంగా కొన్ని వివరంగా విన్నాడు. తర్వాత అతిరథ మహారథులకు శిరోభూషణ మైన భీష్ముడు స్వచ్ఛందమరణులైన సంయమీంద్రులు వాంఛించే ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చిందని తెలుసుకొని అది తాను తనువు చాలించటానికి అనుకూలమైన సమయమని నిశ్చయించుకొన్నాడు.

గమనిక:- తండ్రి శంతనమహారాజు నుండి భీష్ముడు స్వచ్ఛందమరణాన్ని వరంగా పొందాడు.

1-217-శా.

**ఆలాపంబులు మాని, చిత్తము మనీషాయత్తముం జేసి, దృ**
**గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి, తత్కారుణ్యదృష్టిన్ విని**
**ర్మూలీభూత శరవ్యథా నిచయుఁడై మోదించి, భీష్ముండు సం**
**శీలం బొప్ప నుతించెఁ గల్మషగజశ్రేణీహరిన్, శ్రీహరిన్.**

టీక:- ఆలాపంబులు = సంభాషణములు; మాని = మానివైచి; చిత్తము = మనసును; మనీషా = ప్రజ్ఞకు; ఆయత్తమున్ = లొంగినదిగా; చేసి = చేసి; దృక్ = చూపుల; జాలంబున్ = సమూహమును, వలను; హరి = కృష్ణుని; మోము = ముఖము; పైన్ = మీద; పఱపి = నిలిపి ఉంచి; తత్ = అతని; కారుణ్య = దయతోకూడిన; దృష్టిన్ = దృష్టితో; వినిర్మూలీ = పూర్తిగానిర్మూలనము; భూత = చేయబడిన; శర = అమ్ములవలన కలిగిన; వ్యథా = బాధల యొక్క; నిచయుఁడు = సమూహముగలవాడు; ఐ = అయి; మోదించి = మిక్కిలి సంతోషము పొంది; భీష్ముండు = భీష్ముడు; సంశీలంబు = మంచి నడత; ఒప్పన్ = ఒప్పుచుండగ; నుతించెన్ = స్తుతించెను; కల్మష = పాపములనే; గజ = ఏనుగుల; శ్రేణీ = సమూహమును; హరిన్ = హరించువానిని, కృష్ణుని; శ్రీహరిన్ = శ్రీకృష్ణుని.

భావము:- అటుపిమ్మట గాంగేయుడు మౌనం వహించి మనస్సును ఏకాగ్రం చేసుకొని తన చూపులన్నీ గోపాలదేవుని ముఖమండలంపై కేంద్రీకరించాడు; కమలాక్షుని దాక్షిణ్యపూరిత కటాక్షవీక్షణం వల్ల ఆయనకి బాణాల బాధలన్ని ఉపశమించాయి; అంతట శాంతశీలుడైన శంతనపుత్రుడు సంతోషించి కలుషాలనే గజసమూహాన్ని చించి చెండాడే యదు సింహుణ్ణి నుతించాడు.

## భీష్మనిర్యాణంబు

1-218-వ.

**ఇట్లు పీతాంబరధారియుఁ, జతుర్భుజుండు, నాదిపూరుషుండు, బరమేశ్వరుండు, నగు హరియందు నిష్కాముండై, విశుద్ధం బగు ధ్యానవిశేషంబుచే నిరస్తదోషుఁ డగుచు, ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది, ప్రకృతి వలననైన సృష్టిపరంపరలఁ బరిహరించుతలపున మందాకినీనందనుం డిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; పీతాంబరధారియున్ = కృష్ణుడు {పీతాంబరధారి - పచ్చని వస్త్రములు ధరించువాడు, హరి}; చతుర్భుజుండున్ = కృష్ణుడు {చతుర్భుజుడు - నాలుగు చేతులవాడు, విష్ణువు, విష్ణుసహస్రనామములలోని 140వ నామము}; ఆదిపూరుషుండున్ = కృష్ణుడు {ఆదిపురుషుడు - సృష్టికి ముందునుండి ఉన్నట్టి పురుషుడు, విష్ణువు}; పరమేశ్వరుండున్ = కృష్ణుడు {పరమేశ్వరుడు - సర్వమునకు పైనుండు ప్రభువు, హరి}; అగు = అయిన; హరి = కృష్ణుని {హరి - పాపములను హరించువాడు, విష్ణువు}; అందున్ = అందు; నిష్కాముండు = కోరికలు లేనివాడు; ఐ = అయి; విశుద్ధంబు = మిక్కిలి శుద్ధమైనది; అగు = అయిన; ధ్యాన = ధ్యానము యొక్క; విశేషంబు = విశిష్ఠిత; చేన్ = చేత; నిరస్త = తొలగింపబడిన; దోషుండు = దోషములు గలవాడు; అగుచు = అవుతూ; ధారణావతి = ధారణకలిగినది {ధారణా భగవంతునిఁ దప్ప మఱియొకటి నెఱుఁగమి; (ఇది యోగాంగములలో నొకటి)}; ఐన = అయిన; బుద్ధిని = బుద్ధిని; సమర్పించి = లగ్నముచేసి; పరమ = పరమమైన; ఆనందంబునన్ = ఆనంద స్థితిని; ఒంది = పొంది; ప్రకృతి = ప్రకృతి; వలనన్ = సిద్ధము; ఐన = అయిన; సృష్టిపరంపరలన్ = పునర్జన్మములను; పరిహరించు = నివారించు; తలపున = ఉద్దేశముతో; మందాకినీనందనుండు = భీష్ముడు {మందాకినీనందనుడు – గంగాదేవి పుత్రుడు, భీష్ముడు}; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- మందాకినీనందను డైన భీష్ముడు సమస్త దోషాలను నిరస్తం చేసి నిష్కామభావంతో, నిర్మలధ్యానంతో పీతాంబరధురుడు, చతుర్భుజుడు, పురాణపురుషుడు, పరమేశ్వరుడు అయిన గోవిందుని యందు ఏకాగ్రబుద్ధిని సంధానించి పరమానంద భరితుడై ప్రకృతిసిద్ధాలైన సంసారబంధాలను పరిహరించే ఉద్దేశంతో ఈ విధంగా ప్రస్తుతించాడు

★1-219-మ.

**"త్రిజగన్మోహన నీలకాంతిఁ దను వుద్దీపింపఁ, బ్రాభాత నీ**
**రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక**
**వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప, మా**
**విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.**

టీక:- త్రి = మూడు; జగత్ = లోకములను; మోహన = మోహింప చేయగల; నీల = నీలమైన; కాంతిన్ = కాంతితో; తనువు = శరీరము; ఉద్దీపింపన్ = బాగా ప్రకాశిస్తుండగ; ప్రాభాత = ఉదయ కాలపు; నీరజ = పద్మములకు; బంధు = బంధువు, సూర్యుని; ప్రభము = కాంతి కలది; ఐన = అయిన; చేలము = వస్త్రము; పయిన్ = పైన; రంజిల్లన్ = ఎఱ్ఱగా ప్రకాశిస్తుండగ; నీల = నల్లని; అలక = ముంగురుల యొక్క; వ్రజ = సమూహముతో; సంయుక్త = కూడిన; ముఖ = ముఖము అనే; అరవిందము = పద్మము; అతి = మిక్కిలి; సేవ్యంబు = సేవింప దగినది; ఐ = అయి; విజృంభింపన్ = చెలరేగుతూ; మా = మా యొక్క; విజయున్ = అర్జునుని; చేరెడు = చేరి యుండు; వన్నెలాఁడు = విలాసవంతుడు; మదిన్ = మనస్సును; ఆవేశించున్ = ప్రవేశించును గాక; ఎల్లప్పుడున్ = ఎల్లప్పుడూ.

భావము:- "ముల్లోకాలకు సమ్మోహనమైన నీలవర్ణ కాంతులతో నిగనిగలాడే మనోహరమైన దేహం గలవాడు; పొద్దుపొడుపు వేళ వెలుగులు చిమ్ముతున్న బాలభానుని ప్రభలతో మెరిసిపోతున్న బంగారు వస్త్రం ధరించువాడు; నల్లని ముంగురులు కదలాడుతుండే వాడు; ముద్దులు మూటగట్టుతున్న ముఖపద్మం కలవాడు; మా అర్జునుణ్ణి విజయుణ్ణి చేస్తు చేరి ఉండే అందగాడు; అయిన శ్రీకృష్ణ భగవానుడు నా మదిలో నిరంతరం నిలిచిపోవాలి.

★1-220-మ.

**హయరింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై,**
**రయజాతశ్రమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో,**
**జయముం బార్థున కిచ్చువేడ్క, నని నాశస్త్రాహతిం జాల నొ**
**చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.**

టీక:- హయ = గుఱ్ఱముల; రింఖా = కాలి గిట్టల; ముఖ = చివళ్ళ నుండి లేచు; ధూళి = దుమ్ము వలన; ధూసర = బూడిదవర్ణము; పరిన్యస్త = పైపూత గా ఉన్న; అలక = ముంగురులుతో; ఉపేతము = కూడినది; ఐ = అయి; రయ = వేగమువలన; జాత = పుట్టినట్టి; శ్రమ = శ్రమచేత పట్టిన; తోయ = నీటి, చెమట; బిందు = బిందువులతో; యుతము = కూడినది; ఐ = అయి; రాజిల్లు = ఎఱ్ఱనైన; నెఱ = నిండు; మోము = ముఖము; తోన్ = తో; జయమున్ = జయమును; పార్థున = అర్జునున; కున్ = కు; ఇచ్చు = ఇవ్వవలె ననే; వేడ్కన్ = కోరికతో; అనిన్ = యుద్ధములో; నా = నా యొక్క; శస్త్ర = శస్త్రముల; ఆహతిన్ = దెబ్బల వలన; చాలన్ = అధికముగ; నొచ్చియున్ = నొప్పి చెందియు; పోరించు = యుద్ధమును చేయించు; మహానుభావున్ = మహానుభావుని; మది = మనసు; లోన్ = లో; చింతింతున్ = స్మరింతును; అశ్రాంతమున్ = ఎల్లప్పుడూ.

భావము:- గుఱ్ఱాల కాలిగిట్టల వల్ల రేగిన ధూళితో దుమ్ముకొట్టుకుపోతున్నా; ముంగురులు చెదిరి పోతున్నా; అధికమైన రథ వేగానికి అలసట చెంది ఒళ్ళంతా చెమట్లు కారుతున్నా; ముచ్చటైన ముఖమంతా ఎఱ్ఱగా అవుతున్నా; నా శస్త్రాస్త్రాలు తగిలి ఎంత నొప్పెడుతున్నా లెక్క చెయ్యకుండా అర్జునుడికి విజయాన్ని చేకూర్చాలనే ఉత్సాహంతో అతనిని ప్రోత్సహిస్తు యుద్ధం చేయిస్తున్న మహానుభావుడు శ్రీకృష్ణపరమాత్మని నా మనస్సులో నిరంతరం ధ్యానిస్తుంటాను.

★1-221-మ.

నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలో

బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం

బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నీ

పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై.

టీక:- నరు = అర్జునుని; మాటల్ = మాటలను; విని = విన్న వాడై; నవ్వు = నవ్వు; తోన్ = తూ; ఉభయ = రెండు; సేనా = సేనల; మధ్యమ = మధ్యన ఉన్న; క్షోణి = ప్రదేశము; లోన్ = లో; పరులు = శత్రువులు; ఈక్షింపన్ = చూచుచుండగ; రథంబున్ = రథమును; నిల్పి = నిలబెట్టి; పర = శత్రువు లైన; భూపాల = రాజుల యొక్క; ఆవళిన్ = సమూహమును; చూపుచున్ = చూపెడుతూ; పర = శత్రువు లైన; భూప = రాజుల యొక్క; ఆయువులు = ప్రాణములు; ఎల్లన్ = అన్నిటిని; చూపులన = చూపులతోనే; శుంభత్ = మెరయుచున్న; కేళి = విలాసముతో; వంచించున్ = లాగికొను; ఈ = ఈ; పరమేశుండు = పరమమైన ఈశుండు, హరి; వెలుంగుచు = ప్రకాశిస్తూ; ఉండెడును = ఉండుగాక; హృత్ = హృదయ మనే; పద్మ = పద్మమును; ఆసనా = ఆసనముగ; ఆసీనుఁడు = స్వీకరించినవాడు; ఐ = అయి.

భావము:- ఏ లోకేశ్వరుడు అర్జునుడు అడిగాడని చిరునవ్వు చిందిస్తు, పగవారి కళ్ళెదురుగానే రథాన్ని తీసుకు వెళ్ళి ఉభయ సేనలకు మధ్యప్రదేశంలో నిలబెట్టాడో; చిరునవ్వులు చిందిస్తూనే కౌరవపక్ష రాజు లందరిని పేరుపేరునా చూపిస్తు ఆ చూపులతోనే వాళ్ళ ఆయువులన్నీ చిదిమేసాడో; ఆ శ్రీకృష్ణపరమాత్మ నా హృదయపద్మంలో పద్మాసనం వేసుకొని స్థిరంగా వసించుగాక.

1-222-క.

తనవారిఁ జంపఁజాలక

వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్

ఘన యోగవిద్యఁ బాపిన

మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

టీక:- తన = తన యొక్క; వారిన్ = వారిని; చంపన్ = చంపుట; చాలక = చేయలేక; వెనుకకున్ = వెనక్కి; పోన్ = వెళ్ళుటను; ఇచ్చగించు = కోరుతున్న; విజయుని = అర్జునుని; శంకన్ = సందేహమును; ఘన = గొప్ప; యోగ = యోగమును గూర్చిన; విద్యన్ = విద్యవలన; పాపిన = పోగొట్టిన; ముని = మునులచే; వంద్యుని = స్తుతింపబడువాని, కృష్ణుని; పాద = పాదముల మీది; భక్తి = భక్తి; మొనయున్ = ఉద్భవించును గాక; నాకున్ = నాకు.

భావము:- రణరంగంలో తన బంధుమిత్రుల ప్రాణాలు తీయడానికి ఇష్టపడక వెనుదీస్తున్న ధనుంజయునికి మహా మహిమాన్వితమైన గీతోపదేశం చేసి, సందేహాలు పోగొట్టి, యుద్ధంలో ముందంజ వేయించిన వాని; మునులచే స్తుతింపబడు పరముని పాదభక్తి నాలో పరిఢవిల్లుగాక.

★1-223-సీ.

కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి-
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ;
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న-
జగముల వ్రేఁగున జగతి గదలఁ;
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ-
బైనున్న పచ్చనిపటము జాఱ;
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక-
మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ;

1-223.1-తే.

గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి
"నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున!" యనుచు మద్విశిఖ వృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

టీక:- కుప్పించి = దుమికి; యెగసినన్ = పరుగెడుతుండగ; కుండలంబుల = (చెవి) కుండలముల యొక్క; కాంతిన్ = కాంతి; గగన = ఆకాశ; భాగంబు = భాగము; ఎల్లన్ = సమస్తము; కప్పికొనఁగన్ = నిండిపోగా; ఉఱికిన = దుముకిన; ఓర్వక = ఓర్చుకొనలేక; ఉదరంబు = పొట్ట; లోన్ = లోపల; ఉన్న = ఉన్నట్టి; జగముల = జగత్తుల; వ్రేఁగున = వడి వలన; జగతి = భూమి; కదలన్ = కదలగా; చక్రంబున్ = చక్రమును; చేన్ = చేత; పట్టి = పట్టి; చనుదెంచు = వచ్చుచున్న; రయమునన్ = వేగమువలన; పైన = పైన; ఉన్న = ఉన్నట్టి; పచ్చని = పచ్చని; పటము = బట్ట; జాఱన్ = జారగ; నమ్మితిన్ = నమ్ముకొంటిని; నా = నాయొక్క; లావున్ = పరువును; నగుఁబాటు = నవ్వులపాలు; సేయక = చేయకుము; మన్నింపుము = మన్నించుము; అని = అని; క్రీడి = అర్జునుడు; మరలన్ = వెనుకకు; దిగువన్ = లాగుచుండగా; కరి = ఏనుగు; కి = కొరకు;

లంఘించు = దూకు; సింహంబు = సింహము; కరణి = వలె; మెఱసి = ప్రకాశించుచు; నేఁడు = ఈవేళ; భీష్మునిన్ = భీష్ముని; చంపుదున్ = సంహరించెదను; నిన్నున్ = నిన్ను; కాతు = కాపాడుదును; విడువుము = వదులు; అర్జున = అర్జునా; అనుచున్ = అనుచూ; మత్ = నాయొక్క; విశిఖ = బాణముల; వృష్టిన్ = వానను; తెరలి = తప్పించుకొని; చనుదెంచు = వచ్చు; దేవుండు = దేవుడు; దిక్కు = శరణమగుగాక; నాకు = నాకు.

భావము:- ఆ నాడు యుద్ధభూమిలో నా బాణవర్షాన్ని భరించలేక నా మీదికి దుమికే నా స్వామి వీరగంభీర స్వరూపం ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్లే కన్పిస్తున్నది;

కుప్పించి పై కెగరగా కుండలాల కాంతులు గగనమండలం నిండా వ్యాపించాయి; ముందుకు దూకడంతో తుళ్ళే బొజ్జలోని ముజ్జగాలనే పిండాండం వడికి బ్రహ్మాండం కంపించిపోయింది; చేతిలో చక్రాన్ని ధరించి అరుదెంచే వేగానికి పైనున్న బంగారుచేలం జారిపోయింది; "నమ్ముకొన్న నన్ను నలుగురిలో నవ్వులపాలు చేయవ " ద్దని మాటిమాటికి కిరీటి వెనక్కు లాగుతున్నా లెక్కచేయకుండ "అర్జునా! నన్ను వదులు. ఈ నాడు భీష్ముని సంహరించి నిన్ను కాపాడుతాను" అంటూ కరిపైకి లంఘించే కంఠీరవం లాగా నా పైకివస్తున్నాడు. అట్టి గోపాల దేవుడే నాకు రక్ష.

★1-224-మ.

తనకున్ భృత్యుఁడు వీనిఁ గాఁచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁ బూని ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్మోహము నొందఁ జేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్.

టీక:- తన = తన; కున్ = కు; భృత్యుఁడు = సేవకుడు; వీనిన్ = ఇతనిని; కాఁచుట = కాపాడుట; మహా = ముఖ్యమైన; ధర్మంబు = ధర్మము; ఒమ్ము = పొమ్ము; అంచున్ = అనుచు; అర్జున = అర్జునుని; సారథ్యము = రథసారథ్యము; పూని = చేపట్టి; పగ్గములు = పగ్గములను; చేన్ = చేతితో; చోద్యంబుగాన్ = ఆశ్చర్యకరముగ; బట్టుచున్ = పట్టుకొని; మునికోలన్ = ములుగఱ్ఱను; వడిన్ = త్రిప్పు వేగమును; పూని = కూడి ఉండి; ఘోటకములన్ = గుఱ్ఱములను; మోదించి = సంతోషపరచి; తాడించుచున్ = అదలించుచు; జనులన్ = ప్రజలను; మోహము = మోహము; ఒందన్ = పొంద; చేయు = చేయుచున్న; పరమ = మిక్కిలి; ఉత్సాహున్ = ఉత్సాహముగలవానిని; ప్రశంసించెదన్ = స్తోత్రము చేసెదను.

భావము:- ఇతడు అర్జునుడు నా సేవకుడు. ఇతనిని కాపాడవలసి ఉన్నది అంటున్నాడు. అది పరమ ధర్మముట. అందుకని, అర్జునుని రథానికి సారథ్యము చేస్తున్నాడు. పగ్గములను ఆశ్చర్యకరముగ పట్టుకొన్నాడు. మిక్కిలి ఉత్సాహంతో ములుగఱ్ఱ వేగముగా తిప్పుతూ, గుఱ్ఱములను మోదిస్తూ, తాడిస్తున్నాడు. చూసే ప్రజలను మోహింపజేస్తున్నాడు. చూడు అదిగో అట్టి ఆ శ్రీకృష్ణుని స్తోత్రము చేస్తున్నాను.

1-225-క.

పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్.

టీక:- పలుకులన్ = పలుకులతోను; నగవులన్ = చిరునవ్వులతోను; నడపులన్ = ప్రవర్తనలలోను; అలుకలన్ = అలుకలుతోను; అవలోకనములన్ = చూపులతోను; ఆభీర = గోపికా; వధూ = స్త్రీ; కులముల =

సమూహముల; మనముల = మనసులలోని; తాలిమి = ఓర్పు, ధైర్యము; కొలుకులు = కొల్చుటలు; వదలించు = సడలించు; ఘనునిన్ = గొప్పవానిని; కొలిచెదన్ = పూజించెదను; మది = మనస్సు; లోన్ = లోపల.

భావము:- తియ్యని మాటలతో మందహాసాలతో, ప్రవర్తనలతో, ప్రణయకోపాలతో, వాల్చూపు లతో వ్రజవధూమణుల వలపులు దోచుకొనే వాసుదేవుడిని మనస్సులో మరీ మరీ సేవిస్తాను.

1-226-ఆ.

మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది
దేవుఁ డమరు నాదు దృష్టియందు.

టీక:- మునులు = మునులు; నృపులు = రాజులు; చూడ = చూస్తుండగ; మును = పూర్వము; ధర్మజుని = ధర్మరాజు యొక్క {ధర్మజుడు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; సభా = సభదీర్చు; మందిరమున = భవనములో; యాగ = యజ్ఞముచేయు; మండపమునన్ = మండపములో; చిత్ర = చిత్రమైన; మహిమ = ప్రాభవము; తోడన్ = తో; చెలువొందు = అందాలొలికించు; జగత్ = విశ్వమునకు; ఆది = మూలపు; దేవుఁడు = దేవుడు; అమరున్ = కుదురుకొనుగాక; నాదు = నా యొక్క; దృష్టి = చూపుల; అందున్ = లోపల.

భావము:- మునీంద్రులు, నరేంద్రులు చూస్తూ ఉండగా యింతకు మునుపు ధర్మరాజు సభామందిరం లోని యజ్ఞ మండపంలో చిత్ర విచిత్ర ప్రభావాలతో ప్రకాశించే విశ్వనాథుడు నా చూపుల్లో స్థిరంగా యున్నాడు.

★1-227-మ.

ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై."

టీక:- ఒక = ఒకే; సూర్యుండు = సూర్యుడు; సమస్త =సమస్తమైన; జీవులు =జీవులు; కున్ = కును; తాన్ = తను; ఒక్కొక్కఁడు = ఒక్కొక్కడుగా; ఐ = అయి; తోఁచు = కనిపించు; పోలికన్ = విధముగ; ఏ =ఏ; దేవుండు =దేవుడు; సర్వ = సమస్తమైన; కాలము =కాలమునందు; మహా = గొప్ప; లీలన్ = లీలతో; నిజ = తననుండి; ఉత్పన్న = జనించిన; జన్య = జీవుల; కదంబంబుల = సమూహముల; హృత్ = హృదయ; సరోరుహములన్ = పద్మములలోను {సరోరుహము - సరసున పుట్టునది, పద్మము}; నానావిధ = అనేక రకములైన; అనూన = గొప్పవియైన; రూపకుఁడు = రూపముకలవాడు; ఐ = అయి; ఒప్పుచు = ఒప్పుతు; ఉండున్ = ఉండును; అట్టి = అటువంటి; హరిన్ = హరిని {హరి - సంగవ్రాతములను హరించువాడు, విష్ణువు}; నేన్ = నేను; ప్రార్థింతు = పూజింతు; శుద్ధుండను = పరిశుద్ధుడను; ఐ = అయి.

భావము:- ఉన్న ఒకే ఒక్క సూర్యుడు సకల జీవరాసులకు ఒక్కొక్కడుగా కానవస్తాడు కదా. ఆ విధంగానే తాను సృష్టించిన నానావిధ ప్రాణి సమూహాల హృదయ కమలాలలో నానా విధాల రూపాలతో సర్వకాల సర్వావస్థల యందు తన లీలా విలాసంతో తనరారే నారాయణుని పవిత్రహృదయంతో ప్రార్థిస్తున్నాను."

1-228-వ.

**అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముం డగు కృష్ణుని హృదయంబున నిలిపికొని, నిశ్వాసంబులు మాని, నిరుపాధికం బయిన వాసుదేవ బ్రహ్మంబు నందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరకయుండు తెఱంగున నుండిరి; దేవ మానవ వాదితంబులై దుందుభి నినాదంబులు మొరసె; సాధుజన కీర్తనంబులు మెఱసెఁ; గుసుమ వర్షంబులు గురిసె; మృతుం డయిన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించి ముహూర్త మాత్రంబు దుఃఖితుం డయ్యెఁ; నంత నచ్చటి మునులు కృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగు లగుచుం దదీయ దివ్యావతార నామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుం జనిరి; పిదప నయ్యుధిష్ఠిరుండు కృష్ణసహితుండై గజపురంబునకుం జని గాంధారీ సమేతుం డయిన ధృతరాష్ట్రు నొడంబఱచి తత్సమ్మతంబున వాసుదేవానుమోదితుండై పితృపైతామహంబైన రాజ్యంబుఁ గైకొని ధర్మమార్గంబునఁ బ్రజాపాలనంబు సేయుచుండె"నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; మనస్ = మనసులోను; వాక్ = మాటలలోను; దర్శనంబులన్ = దర్శనములలోను; పరమ = పరమమైన; ఆత్ముండు = ఆత్మగలవాడు; అగు = అయిన; కృష్ణుని = కృష్ణుని {కృష్ణుడు - నల్లని వాడు}; హృదయంబున = మనసులో; నిలిపికొని = స్థిరపరచుకొని; నిశ్వాసంబులు = ఊపిరితీసుకొనుట; మాని = మానివేసి; నిరుపాధికంబు = హేతువుకు అతీతమగునది; అయిన = అయినట్టి; వాసుదేవ = ఆత్మలలో వసించే దైవమైన; బ్రహ్మంబు = బ్రహ్మ, వాసుదేవ బ్రహ్మ; అందున్ = లో; కలసిన = కలసిపోయిన; భీష్మునిన్ = భీష్ముని; చూచి = చూసి; సర్వ = సమస్త; జనులు = ప్రజానీకము; దివస = దినమునకు; అవసానంబున = అంతమున, సాయం సంధ్యలో; విహంగంబులు = పక్షులు; ఊరక = నిశ్శబ్దముగ; ఉండు = ఉండే; తెఱంగునన్ = విధమున; ఉండిరి = ఉన్నారు; దేవ = దేవతలచే; మానవ = మానవులచే; వాదితంబులు = మ్రోగింపబడుచున్నవి; ఐ = అయిన; దుందుభి = దుందుభుల; నినాదంబులు = శబ్దములు; మొరసెన్ = మ్రోగినవి; సాధుజన = సజ్జనులు చేసిన; కీర్తనంబులు = స్తుతులు; మెఱసె = ప్రకాశించినవి; కుసుమ = పూల; వర్షంబులు = వానలు; కురిసె = వర్షించినవి; మృతుండు = చనిపోయినవాడు; అయిన = అయినట్టి; భీష్ముని =

భీష్మని; కిన్ = కి; ధర్మజుండు = ధర్మరాజు {ధర్మజుడు – యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; పరలోకక్రియలు = శ్రాద్ధకర్మలు {పరలోకక్రియలు – పరలోకగతులకై చేయు దహనాది కర్మలు}; చేయించి = చేయించి; ముహూర్త = ముహూర్త; మాత్రంబు = కాలము; దుఃఖితుండు = దుఃఖించిన వాడు; అయ్యెన్ = అయ్యెను; అంతన్ = అంతట; అచ్చటి = అక్కడ ఉన్న; మునులు = మునులు; కృష్ణనిన్ = హరిని; తమ = తమ యొక్క; హృదయంబులన్ = హృదయములలో; నిలిపికొని = స్థిరపరచుకొని; సంతుష్ట = సంతృప్తి చెందిన; అంతరంగులు = అంతరంగము గలవారు; అగుచున్ = అవుతూ; తదీయ = అతని యొక్క; దివ్య = దివ్యమైన; అవతార = అవతారములను; నామంబులు = నామములు; చేన్ = చేత; స్తుతియించి = ప్రార్థించి; స్వ = తమ యొక్క; ఆశ్రమంబులు = ఆశ్రమములు; కున్ = కు; చనిరి = వెళ్ళిరి; పిదపన్ = ఆతరువాత; ఆ = ఆ; యుధిష్ఠిరుండు = ధర్మరాజు; కృష్ణ = కృష్ణునితో; సహితుండు = కూడుకొన్నవాడు; ఐ = అయి; గజపురంబున్ = హస్తినాపురము; కున్ = నకు; చని = వెళ్ళి; గాంధారీ = గాంధారితో; సమేతుండు = కూడినవాడు; అయిన = అయినట్టి; ధృతరాష్ట్రున్ = ధృతరాష్ట్రుని; ఒడంబఱిచి = ఒప్పించి; తత్ = అతని; సమ్మతంబునన్ = ఒప్పుకోలుతో; వాసుదేవ = వసుదేవసుతుని, కృష్ణుని; అనుమోదితుండు = అనుమతిపొందినవాడు; ఐ = అయి; పితృ = తండ్రి నుండి వచ్చినదియు; పైతామహంబు = వంశపారంపర్యము {పైతామహము–తాతలకు సంబంధించినది – అనువంశికము}; ఐన = అయినట్టి; రాజ్యంబున్ = రాజ్యమును; కైకొని = స్వీకరించి; ధర్మ = ధర్మబద్ధమైన; మార్గంబునన్ = విధముగ; ప్రజా = ప్రజలను; పాలనంబు = పరిపాలించుట; సేయుచుండెన్ = చేయుచుండెను; అని = అని; చెప్పిన = చెప్పగా; విని = ఆలకించి; సూతున = సూతున; కున్ = కు; శౌనకుండు = శౌనకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ ప్రకారంగా గాంగేయుడు మనస్సుద్వారా, వాక్కులద్వారా, దృక్కులద్వారా శ్రీకృష్ణపరమాత్మను హృదయంలో పదిలపరచుకొని; నిశ్వాసాన్ని నిరోధించి; నిరుపాధిక పరబ్రహ్మమైన వాసుదేవునిలో ఐక్యమైయ్యాడు. అప్పుడు అది చూసి అక్కడ ఉన్న వారందరూ సంధ్యా సమయంలో పక్షుల్లా మౌనం వహించారు; దేవలోకంలోను, మానవ లోకంలోను దుందుభులు ధ్వనించాయి; సాధుసంకీర్తనలు వినిపించాయి; పూలవానలు కురిశాయి; తనువు చాలించిన దేవనదీ పుత్రునికి దహన సంస్కారాలు జరిపించి; ధర్మరాజు ముహూర్తకాలం దుఃఖించాడు. అక్కడి ముని లందరు శ్రీకృష్ణుని రూపం తమ మనస్సులలో నిలుపుకొని; ఆయన దివ్యావతారాలను కొనియాడుతూ సంతోషితస్వాంతులై తమ తమ ఆశ్రమాలకు తరలిపోయారు. అనంతరం ధర్మనందనుడు నందనందనునితో కలిసి హస్తినాపురానికి వెళ్లాడు. అక్కడ గాంధారీ సహితుడైన ధృతరాష్ట్రుణ్ణి ఒప్పించి అతని అంగీకారంతో, శ్రీకృష్ణుని ఆమోదంతో తన తాత తండ్రులు పరిపాలించిన రాజ్యాన్ని స్వీకరించినవాడై ధర్మం తప్పకుండా ప్రజలను పరిపాలించసాగాడు."ఇలా చెప్పగానే శౌనకుడు సూతమహర్షిని ఇలా అడిగాడు.

★1-229-ఆ.

"ధనము లపహరించి తనతోడఁ జెనకెడు
నాతతాయి జనుల నని వధించి
బంధు మరణ దుఃఖ భరమున ధర్మజుఁ
డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె?"

టీక:- ధనములు = ధనములను; అపహరించి = దొంగిలించి; తన = తన; తోడన్ = మీద; చెనకెడు = గొడవచేయువారు; ఆతతాయి = హత్యలు చేయువారైన; జనులన్ = మానవులను; అనిన్ = యుద్ధములో; వధించి = సంహరించి; బంధు = బంధువుల; మరణ = మరణమువలన కలిగెడు; దుఃఖ = బాధ యొక్క; భరమున = భారముతో; ధర్మజుఁడు = ధర్మరాజు; ఎట్లు = ఏవిధముగ; రాజ్యలక్ష్మిన్ = రాజ్యమును; ఇచ్చగించె = అంగీకరించెను.

భావము:- తన సిరిసంపదలన్నీ అపహరించి తనతో యుద్ధానికి సిద్ధమైన దుర్మార్గపు ఆతతాయిలను (ఇంటికి నిప్పు పెట్టేవాడు, విషము పెట్టేవాడు, కత్తితో నరికేవాడు, ధనము దోచుకొనే వాడు, నేల నపహరించేవాడు, ఇతరుల భార్యను చెరపట్టేవాడు వీరారుగురుని ఆతతాయి అంటారు) సమరంలో సంహరించిన ధర్మరాజు చుట్టాలందరు మరణించారనే దుఃఖభారంతో కూడి ఉండి ఈ రాజ్యభారాన్ని భరించటానికి ఏ విధంగా అంగీకరించాడు అని అడిగాడు.

1-230-వ.

అనిన సూతుం డిట్లనియె.

టీక:- అనిన = అనగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఇలా అడిగిన శౌనకుడికి, సూతుడు ఇలా సమాధానం చెప్పాడు.

## ధర్మనందన రాజ్యాభిషేకంబు

1-231-క.

"కురుసంతతికిఁ బరీక్షి
న్నరవరు నంకురము సేసి నారాయణుఁ డీ
ధరణీరాజ్యమునకు నీ
శ్వరుఁగా ధర్మజుని నిలిపి సంతోషించెన్.

టీక:- కురు = కురువంశపు; సంతతి = వారసత్వము; కిన్ = నకు; పరీక్షిత్ = పరీక్షిత; నరవరు = మహారాజును; అంకురము = వంశాకురముగ; చేసి = చేసి; నారాయణుఁడు = కృష్ణుడు; ఈ = ఈ; ధరణీ = భూ; రాజ్యమున్ = మండలము; కున్ = నకు; ఈశ్వరుఁగాన్ = అధిపతిగా; ధర్మజుని = ధర్మరాజుని; నిలిపి = నియమించి; సంతోషించెన్ = సంతోషించెను.

భావము:- "పరీక్షిత్తును కురువంశాంకురంగా నిలబెట్టి, యుధిష్ఠిరుణ్ణి సమస్త సామ్రాజ్యానికి అధినేతగా నిలిపి శ్రీకృష్ణుడు సంతుష్టాంతరంగుడైనాడు.

1-232-వ.

ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబు గాని స్వతంత్రంబుగా దనునది మొదలగు భీష్ముని వచనంబులం గృష్ణుని సంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమాన విజ్ఞానుండును నివర్తిత శంకా కళంకుండునునై నారాయణాశ్రయుం డైన యింద్రుండునుం బోలెఁ జతుస్సాగరవేలాలంకృతం బగు వసుంధరామండలంబు సహోదర సహాయుండై యేలుచుండె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; జగంబు = ప్రపంచము; పరమేశ్వర = పరమమైన ఈశ్వరునికి, హరికి; ఆధీనంబు = లోబడి ఉండునది; కాని = కాని; స్వతంత్రంబు = స్వంతముగా నియత్రించుకొనగలది; కాదు = కాదు; అనునది = అన్నది; మొదలగు = మొదలగు; భీష్ముని = భీష్ముని; వచనంబులన్ = ఉపదేశములవలనను; కృష్ణుని = కృష్ణుని; సంభాషణంబులన్ = ఉపదేశములవలనను; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుండు-యమధర్మరాజు కొడుకు, ధర్మరాజు}; ప్రవర్ధమాన = పెరుగుచున్న; విజ్ఞానుండును = విజ్ఞానము కలవాడును; నివర్తిత = నివృత్తి చేయబడిన; శంక = అనుమానము అను; కళంకుండును = మచ్చకలవాడును; ఐ = అయి; నారాయణ = హరి {నారాయణుడు - నారములందు వసించు వాడు, హరి}; ఆశ్రయుండు = ఆశ్రయించినవాడు; ఐన = అయిన; ఇంద్రుండునున్ = ఇంద్రుడును; పోలెన్ = వలె; చతుస్ = నాలుగు; సాగర = సముద్రములు; వేల = సరిహద్దులుగా; అలంకృతంబు = అలంకరింపబడినది; అగు = అయినట్టి; వసుంధర = భూ; మండలంబు = మండలమును; సహోదర = సోదరుల యొక్క; సహాయుండు = సహాయము కలవాడు; ఐ = అయి; ఏలుచుండెన్ = పరిపాలించుచుండెను..

భావము:- ఈ విధంగా భీష్మాచార్యుని ఉపదేశాలవల్ల, శ్రీకృష్ణుని ప్రబోధాలవల్ల ధర్మరాజు జగత్తు స్వతంత్ర మైనది కాదు పరమేశ్వరాధీనం మొదలైన విజ్ఞానాన్ని పెంపొందించుకొని, తన సందేహా లన్నింటిని నివర్తించుకొని, ఉపేంద్రుని సహాయంతో అతిశయించే మహేంద్రుని వలె, శ్రీకృష్ణుని అండదండలతో చతుస్సముద్ర ముద్రితమైన మహీమండలాన్ని సహచరుల సహాయంతో పరిపాలించసాగాడు.

★1-233-సీ.

సంపూర్ణ వృష్టిఁ బర్జన్యుండు గురియించు,-
నిల యెల్లఁ గోర్కుల నీనుచుండు,
గోవులు వర్షించు ఘోషభూములఁ బాలు,-
ఫలవంతములు లతాపాదపములు,
పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల,-
ధర్మ మెల్లెడలనుఁ దనరి యుండు,

ద్దైవభూతాత్మ తంత్రము లగు రోగాది-

భయములు సెందవు ప్రజల కెందుఁ,

1-233.1-ఆ.

గురుకులోత్తముండు గుంతీతనూజుండు

దాన మానఘనుఁడు ధర్మజుండు

సత్యవాక్యధనుఁడు సకలమహీరాజ్య

విభవభాజి యయిన వేళ యందు

టీక:- సంపూర్ణ = సంపూర్ణమైన; వృష్టిన్ = వర్షమును; పర్జన్యుండు = మేఘుడు {పర్జన్యుడు - ఉరిమెడువాడు, మేఘుడు}; కురియించు = కురిపించును; ఇల = భూమి; ఎల్లన్ = సమస్తమైన; కోర్కులన్ = కోరికలను; ఈనుచుండున్ = పుట్టించును; గోవులు = ఆవులు; వర్షించున్ = ఎక్కువగా ఇచ్చును; ఘోషభూములన్ = గొల్లపల్లెలలో; పాలు = పాలు; ఫల = ఫలములతో; వంతములున్ = నిండి ఉండును; లతా = తీగలు; పాదపములు = చెట్లు; పండు = పండును; సస్యములున్ = ధాన్యములు; తప్పక = తప్పకుండగ; ఋతువులన్ = ఋతువులలో; ఎల్లన్ = సమస్తమును; ధర్మము = ధర్మవర్తనము; ఎల్ల = సమస్త; ఎడలను = స్థలములందును; తనరి = విస్తరించి; ఉండున్ = ఉండును; దైవ = దేవతలు; భూత = భూతములు; ఆత్మ = ఆత్మలు; తంత్రములు = హేతు భూతములు; అగు = అయినట్టి; రోగ = రోగములు; ఆది = మొదలగు; భయములు = భయములు; చెందవు = కలుగవు; ప్రజలు = లోకులు; కున్ = కు; ఎందున్ = ఎక్కడాకూడ; కురు = కురు; కుల = వంశములో; ఉత్తముండు = ఉత్తముడు; కుంతీ = కుంతియొక్క; తనూజుండు = పుత్రుడు;

దాన = దానమునందును; మాన = మానమునందును; ఘనుఁడు = గొప్పవాడు; ధర్మజుండు = ధర్మరాజు; సత్య = సత్యమైన; వాక్య = వాక్కు; ధనుఁడు = ధనముగాగలవాడు; సకల = సమస్త; మహీ = భూమియందలి; రాజ్య = రాజ్యములలోను; విభవ = (తన) వైభవము; భాజి = భజింపబడువాడు; అయిన = అయినట్టి; వేళ = సమయము; అందున్ = లో;

భావము:- దానఘనుడు, మానధనుడు, సత్యధనుడు, సత్యసంధుడు, కురుకులాలంకారుడు, కుంతికుమారుడు ఐన ధర్మరాజు సమస్త భూమండలాన్ని వైభవోపేతంగా పరిపాలిస్తున్న సమయంలో మేఘుడు వానలు సమృద్ధిగా కురిపించాడు; పృథివి బంగారు పంటలు పండించి, కోరిన కోర్కెలు తీర్చింది; గోశాలలోని గోవులు పాలను వర్షించాయి; వృక్షాలూ, లతలూ సంపూర్ణంగా ఫలించాయి; ఋతుధర్మం తప్పకుండా నిండుగా పంటలు పండాయి; దేశమంతటా ధర్మం పాతుకున్నది; ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవికాదులు అయిన తాపత్రయాలు, వ్యాధులు ప్రజలను బాధించలేదు.

1-234-వ.

అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయు కొఱకును, సుభద్రకుఁ బ్రియంబు సేయుకొఱకును, గజపురంబునం గొన్ని నెలలుండి ద్వారకానగరం

బునకుం బ్రయాణంబు సేయం దలంచి, ధర్మనందనునకుం గృతాభివందనుం డగుచు నతనిచే నాలింగితుండై, యామంత్రణంబు వడసి, కొందఱు దనకు నమస్కరించినం గౌఁగలించుకొని, కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు, రథారోహణంబు సేయు నవసరంబున సుభద్రయు, ద్రౌపదియుఁ, గుంతియు, నుత్తరయు, గాంధారియు, ధృతరాష్ట్రుండును, విదురుండును, యుధిష్ఠిరుండును, యుయుత్సుండును, గృపాచార్యుండును, నకుల, సహదేవులును, వృకోదరుండును, ధౌమ్యుండును సత్సంగంబు వలన ముక్తదుస్సంగుం డగు బుధుండు సకృత్కాల సంకీర్త్యమానంబై రుచికరం బగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువ నోపం డట్టి హరి తోడి వియోగంబు సహింపక దర్శన స్పర్శ నాలాప శయనాసన భోజనంబులవలన నిమిషమాత్రంబును హరికి నెడ లేని వారలైన పాండవులం గూడికొని హరి మరలవలయునని కోరుచు హరి చనిన మార్గంబు సూచుచు హరి విన్యస్త చిత్తు లయి లోచనంబుల బాష్పంబు లొలుక నంత నిలువంబడి రయ్యవసరంబున.

టీక:- అంతన్ = అంతట; కృష్ణుండు = కృష్ణుడు; చుట్టాలు = బంధువులు; కున్ = కు; శోకంబు = బాధ; లేకుండన్ = లేకుండగ; చేయు = చేయుట; కొఱకును = కోసమును; సుభద్ర = సుభద్ర; కున్ = కు; ప్రియంబు = సంతోషము; చేయు = కలుగ చేయుట; కొఱకును = కోసమును; గజపురంబునన్ = హస్తినాపురములో; కొన్ని = కొన్ని; నెలలు = నెలలు; ఉండి = ఆగి ఉండి; ద్వారకా = ద్వారక అను; నగరంబున్ = నగరము; కున్ = నకు; ప్రయాణంబు = ప్రయాణము; చేయన్ = చేయ వలెనని; తలంచి = అనుకొని; ధర్మనందనున = ధర్మరాజున {ధర్మనందనుడు – యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; కున్ = కు; కృత = చేసిన; అభివందనుండు = నమస్కారము కలవాడు; అగుచున్ = అవుతూ; అతని = అతని; చేన్ = చేత; ఆలింగితుండు = కౌగలింపబడినవాడు; ఐ = అయి; ఆమంత్రణంబు = అనుమతి; వడసి = పొంది; కొందఱు = కొందరు; తన = తన; కున్ = కు; నమస్కరించినన్ = నమస్కారముచేసిన; కౌఁగలించుకొని = ఆలింగనము చేసికొని; కొందఱు = కొందరు; తనున్ = తనను; కౌఁగిలింపన్ = ఆలింగనముచేయగ; ఆనందించుచున్ = సంతోషించుచు; రథ = రథమును; ఆరోహణంబున్ = ఎక్కుట; చేయు = చేయుచున్న; అవసరంబునన్ = సమయమున; సుభద్రయున్ = సుభద్ర; ద్రౌపదియున్ = ద్రౌపది; కుంతియున్ = కుంతి; ఉత్తరయున్ = ఉత్తర; గాంధారియున్ = గాంధారి; ధృతరాష్ట్రుండును = ధృతరాష్ట్రుడును; విదురుండును = విదురుడును; యుధిష్ఠిరుండును = యుధిష్టరుడును; యుయుత్సుండును = యుయుత్సుడును; కృపాచార్యుండును = కృపాచార్యుడును; నకుల = నకులుడును; సహదేవులును = సహదేవుడును; వృకోదరుండును = భీముడును {వృకోదరుడు – వృకము వంటి పొట్ట ఉన్నవాడు, భీముడు}; ధౌమ్యుండును = ధౌమ్యుడును; సత్ = మంచివారితో; సంగంబు = కలిసి ఉండుట;

వలనన్ = వలన; ముక్త = విడువబడిన; దుర్ = చెడ్డవారి; సంగుండు = చేరిక గల వాడు; అగు = ఐన; బుధుండు = జ్ఞాని; సకృత్కాల = ఎప్పుడైనా ఒకసారి; సంకీర్త్యమానంబు = స్తుతింపబడినది; ఐ = అయినను; రుచికరంబు = రుచించునది; అగున్ = అగునదై; ఎవ్వని = ఎవని యొక్క; యశంబు = కీర్తిని; ఆకర్ణించి = విని; విడువనోపండు = వదిలిపెట్టలేడో; అట్టి = అటువంటి; హరి = కృష్ణుని; తోడి = తోని; వియోగంబున్ = దూరమగుటను, విరహము; సహింపక = ఓర్చుకొనలేక; దర్శన = కనిపించుట; స్పర్శన = తాకుట; ఆలాప = కలిసి మాట్లాడుట; శయన = కలిసి పండుకొనుట; ఆసన = కలిసి కూర్చుండుట; భోజనంబుల = కలిసి తినుటలు; వలనన్ = వలన; నిమిష = నిమిషము; మాత్రంబును = మాత్రపు సమయమైన; హరి = హరి; కిన్ = కి; ఎడ = దూరముగా; లేని = ఉండలేని; వారలు = వారు; ఐన = అయిన; పాండవులన్ = పాండురాజు పుత్రులను; కూడికొని = కలిసి ఉంటూ; హరి = హరి; మరల = వెనుకకు వచ్చుట; వలయునని = చేయవలెనని; కోరుచున్ = కోరుతూ; హరి = హరి; చనిన = వెళ్ళిన; మార్గంబున్ = దారిని; సూచుచున్ = చూస్తూ; హరి = హరి యందు; విన్యస్త = ఉంచబడిన; చిత్తులు = చిత్తము కలవారు; అయి = అయి; లోచనంబులన్ = కన్నులనుండి; బాష్పంబులు = కన్నీరు; ఒలుకన్ = కారుచుండగా; అంతన్ = అక్కడే; నిలువంబడిరి = నిలుచుండిరి; ఆ = ఆ; అవసరంబునన్ = సమయమున.

భావము:- ప్రియ సోదరి సుభద్ర మనస్సుకు సంతోషం సమకూర్చుటం కోసం, బంధువులైన పాండవుల శోకం పోకార్చటం కోసం, యశోదానందనుడు హస్తినాపురంలో కొన్ని మాసాలపాటు ఉండి, పిమ్మట తన నగరానికి బయలుదేరాడు. తనకు అభివందనాలు సమర్పిస్తున్న నందనందనుణ్ణి ధర్మనందనుడు ఆనందంతో అభినందించి ఆలింగనం చేసుకొని వీడ్కోలిచ్చాడు. అనంతరం శ్రీకృష్ణుడు కొందరి నుండి నమస్కారాలు అందుకొన్నాడు. కొందరిని కౌగిలించుకొన్నాడు. కొందరు తనను కౌగిలించుకొనగా వారికి శుభాకాంక్ష లందించాడు. సజ్జనసాంగత్యం వల్ల దుర్జన సాంగత్యాన్ని పరిత్యజించిన బుద్ధిమంతుడు హరి మధురగాథలు ఒక్కమాటు వింటే మళ్లీ విడిచి పెట్టలేడు. అలాగ గోవిందుడు రథం ఎక్కబోతున్న సమయంలో సుభద్రా ద్రౌపదులు, కుంతీ గాంధారులు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ధర్మరాజు, యుయుత్సుడు, కృపాచార్యుడు, నకుల సహదేవులు, భీమసేనుడు, ధౌమ్యుడు మొదలైన వారంతా, శ్రీకృష్ణుని ఎడబాటు సహించలేని వారయ్యారు. అనుక్షణం ఆయనను చూస్తు, తాకుతు, మాట్లాడుతు, ఆయనతో కలిసి శయనిస్తు, కూర్చుంటు, భుజిస్తు ఉండే పాండవులతో పాటు శ్రీకృష్ణుడు వెనుకకు మరలి రావాలని అభిలషిస్తు, ఆయన వెళ్లిన మార్గాన్ని అవలోకిస్తు, హరిమయాలైన హృదయాలతో, అశ్రు నయనాలతో అల్లంత దూరంలో నిలబడి పోయారు.

### 1-235-సీ.

కనకసౌధములపైఁ గౌరవకాంతలు-
    గుసుమవర్షంబులు గోరి కురియ,
మౌక్తికదామ సమంచితధవళాత-
    పత్త్రంబు విజయుండు పట్టుచుండ,
నుద్ధవసాత్యకు లుత్సాహవంతులై-
    రత్నభూషితచామరములు వీవ,

గగనాంతరాళంబు గప్పి కాహళభేరి-
పటహశంఖాదిశబ్దములు మొరయ,

1-235.1-ఆ.

సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప
భద్రభాషణములు పలుకుచుండ,
భువనమోహనుండు పుండరీకాక్షుండు
పుణ్యరాశి హస్తిపురము వెడలె.

టీక:- కనక = బంగారు; సౌధములన్ = మేడల; పైన్ = మీదనున్న; కౌరవ = కౌరవ వంశపు; కాంతలు = స్త్రీలు; కుసుమ = పూల; వర్షంబులు = వానలు; కోరి = ఇష్టముతో; కురియన్ = కురి పించగ; మౌక్తిక = ముత్యాల; దామ = దండలు; సమంచిత = అలంకరింపబడిన; ధవళ = తెల్లని; అతపత్త్రంబు = గొడుగు; విజయుండు = అర్జునుడు; పట్టుచుండన్ = పట్టుతుండగ; ఉద్ధవ = ఉద్ధవుడు; సాత్యకులు = సాత్యకియు; ఉత్సాహవంతులు = ఉత్సాహముకలవారు; ఐ = అయ్యి; రత్న = రత్నములతో; భూషిత = అలంకరింపబడిన; చామరములు = చామరములు; వీవ = వీస్తుండగా; గగన = ఆకాశముయొక్క; అంతరాళంబున్ = లోపలంతా; కప్పి = నిండిన; కాహళ = బాకాలు; భేరి = భేరీవాద్యాలు; పటహ = పెద్దడోలు, రాండోలు; శంఖ = శంఖములు; ఆది = మొదలగువాని; శబ్దములు = శబ్దములు; మొరయ = చెలరేగు చుండగ; సకల = సమస్త; విప్ర = బ్రాహ్మణ; జనులు = ప్రజలు; సగుణ = సగుణ; నిర్గుణ = నిర్గుణ; రూప = రూపములలో; భద్ర = శుభమైన; భాషణములు = సంభాషణలు; పలుకుచు = పలుకుతూ; ఉండ = ఉండగా; భువన = లోకమును; మోహనుండు =మోహింప జేయువాడు; పుండరీకాక్షుండు= కృష్ణుడు {పుండరీ కాక్షుడు - పద్మముల వంటి కన్నులవాడు, కృష్ణుడు}; పుణ్యరాశి = పుణ్యముల కుప్ప, కృష్ణుడు; హస్తిపురము = హస్తినాపురము నుండి; వెడలె = బయలుదేరెను.

భావము:- భువనమోహనుడు, పుండరీకాక్షుడు అయిన శ్రీకృష్ణుడు ఘనీభవించిన పురజనుల పురాకృత పుణ్యంలా హస్తినాపుర వీథుల వెంట సాగిపోతున్నాడు. అంతఃపుర కాంతలు బంగారు మేడలపై నిలబడి నందనందనునిపై పుష్ప వర్షాలు కురిపించారు. విజయుడు వెనుక నిలబడి ముత్యాలసరాలతో విరాజిల్లే శ్వేతచ్ఛత్రాన్ని పట్టాడు. ఉద్ధవుడు, సాత్యకి ఉత్సాహంతో అటునిటు నడుస్తు రత్నఖచితాలైన పిడులు పట్టుకొని వింజామరలు వీస్తున్నారు. బాకాలు, నగారాలు, తప్పెటలు, శంఖాలు ఆకాశం దద్దరిల్లేలా మ్రోగుతున్నాయి. వేదవేత్తలైన బ్రాహ్మణులు సగుణ నిర్గుణ స్వరూప నిరూపకంగా స్వస్తివచనాలు పలుకుతున్నారు.

1-236-వ.

**తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖరభాగంబుల నిలిచి గోపాల సుందరుని సందర్శించి, వర్గంబులై మార్గంబు రెండు దెసల గరారవిందంబులు సాచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లి గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు బ్రవర్తింపని సమయంబున నొంటి దీపించు పురాణపురుషుం డితం డనువారును; జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లనువారును; జీవనోపాధి భూతంబు లయిన సత్త్వాదిశక్తుల లయంబు జీవుల లయం బనువారునుఁ; గ్రమ్మఱ సృష్టికర్త యైన యప్పరమేశ్వరుండు నిజవీర్యప్రేరితయై నిజాంశ భూతంబులైన జీవులకు మోహిని యగుచు సృష్టి సేయ నిశ్చయించి నామరూపం బులు లేని జీవు లందు నామరూపంబులు గల్పించుకొఱకు వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును; నిర్మలభక్తి సముత్కంఠావిశేషం బుల నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతు రను వారును; యోగమార్గంబునం గాని దర్శింపరాదను వారునునై; మఱియును.**

టీక:- తత్ = ఆ; సమయంబునన్ = సమయములో; పౌర = నగరమందలి; సుందరులు = స్త్రీలు; ప్రాసాద = మేడల; శిఖర = చివరి, డాబాలపై; భాగంబులన్ = భాగములందు; నిలిచి = నిలువబడి; గోపాలసుందరుని = గోపాలురలో సుందరుని, కృష్ణుని; సందర్శించి = చూసి; వర్గంబులు = వరుసలు తీరినవారు; ఐ = అయి; మార్గంబుల = వీధులకు; రెండు దెసలన్ = రెండుపక్కల; కర = చేతులు అనే; అరవిందంబులు = పద్మములు; సాచి = చాచి; ఒండొరుల = ఒకరింకొకరు; కున్ = కి; చూపుచున్ = చూపుకొనుచూ; తమలోనన్ = తమలోతాము; తొల్లి = పూర్వము; గుణంబులన్ = గుణములు {త్రిగుణములు - సత్త్వ, రజస్, తమస్}; కూడక = కలిగి ఉండక; జీవులు = సర్వ జనులు; లీన = పరబ్రహ్మలో లీనమైన; రూపంబులు = రూపములగలవి; ఐ = అయి; ఉండన్ = ఉండగా; ప్రపంచంబు = ప్రపంచము; ప్రవర్తింపని = నడచుట ఉండని; సమయంబున = సమయములో; ఒంటిన్ = ఒంటరిగా; దీపించు = ప్రకాశించు; పురాణ = పురాతనమైన; పురుషుండు = పురుషుడు; ఇతండు = ఇతడు; అను = అనెడి; వారును = వారును; జీవులు = మానవులు; కున్ = కు; బ్రహ్మత్వంబు = బ్రహ్మత్త్వము; కలుగ = కలుగగ; లయంబు = లయము {లయము - జీవాత్మ బ్రహ్మాత్మలో లయించుట}; సిద్ధించుట = సిద్ధించుట; ఎట్లు = ఏవిధముగ సాధ్యము; అను = అనెడి; వారును = వారును; జీవన = జీవనమునకు; ఉపాధి = ఆధార; భూతంబులు = భూతములు; అయిన = అయినట్టి; సత్త్వ = సత్త్వము; ఆది = మొదలగు; శక్తుల = శక్తుల; లయంబు = లయము; జీవుల = జీవుల; లయంబు = లయము; అను = అనెడి;

వారును = వారును; క్రమ్మఱ = మరల; సృష్టి = సృష్టిని; కర్త = చేయువాడు; ఐన = అయినట్టి; ఆ = ఆ; పరమేశ్వరుండు = పరమమైన ఈశ్వరుడు; నిజ = తనయొక్క; వీర్య = వీరత్వమువలన; ప్రేరిత = ప్రేరింపబడినది; ఐ = అయి; నిజ = తన; అంశ = అంశతో; భూతంబులు = కూడినవి; ఐన = అయినట్టి; జీవులు = జీవులు; కున్ = కు; మోహిని = మోహింపజేయునది; అగుచున్ = అవుతూ; సృష్టి = సృష్టి; చేయన్ = చేయుటకు; నిశ్చయించి = నిశ్చయించుకొని; నామ = పేర్లుగాని; రూపంబులు = రూపములుగాని; లేని = లేనట్టి; జీవులు = జీవులు; అందున్ = లో; నామ = నామములు; రూపంబులు = రూపములు; కల్పించు = ఏర్పరుచుట; కొఱకున్ = కోసము; వర్తిల్లు = ప్రవర్తిల్లు; స్వ = తనయొక్క; మాయన్ = మాయను; అంగీకరించున్ = అంగీకరించును; అను = అనెడి; వారును = వారును; నిర్మల = నిర్మలమైన; భక్తి = భక్తివలన; సముత్ = మిక్కిలి; ఉత్కంఠా = ఉత్కంఠల యొక్క; విశేషంబుల = విశిష్టలతో; అకుంఠితులు = కుంటుపడనివారు; ఐ = అయి; జిత్ = జయించిన; ఇంద్రియులు = ఇంద్రియములు కలవారు; అగు = అయినట్టి; విద్వాంసులు = పండితులు; ఈ = ఈ; మహానుభావు = మహానుభావుని యొక్క; నిజ = స్వంత; రూపంబు = రూపమును; దర్శింతురు = దర్శింప కలరు; అను = అనెడి; వారును = వారును; యోగ = యోగపద్ధతి; మార్గంబునన్ = పాటించుట ద్వారా; కాని = కాని; దర్శింప = దర్శించుటకు; రాదు = వీలుకాదు; అను = అనెడి; వారును = వారును; ఐ = అయి; మఱియును = ఇంకనూ.

భావము:- ఆ సమయంలో బహుసుందరుడైన గోపాలకష్ణుని దర్శించడానికి హస్తినానగర కాంతలు నగరంలోని భవనాలపై కెక్కారు. మార్గానికి ఇరువైపుల గుంపులు గూడి చేతులు చాపి వాసుదేవుణ్ణి ఒకరికొకరు చూపించుకోసాగారు. సృష్టి ఆదిలో జీవులు త్రిగుణాలతో కూడక ముందు, ప్రపంచం అంతా ఆయనలో లీనమై ఉండేది అని; అద్వితీయమైన పరబ్రహ్మ స్వరూప మీయనే అని కొందరు అంటున్నారు; జీవులకు పరబ్రహ్మత్వం కలిగితే లయం అనేది ఎలా కలుగుతుంది అని కొందరు అంటున్నారు; జీవనాలకి ఉపాధిభూతాలైన సత్వాది శక్తులు లయం కావటమే జీవుల లయం అని కొందరు చెప్పున్నారు; మరల సృష్టికి కారణభూతు డైన విశ్వేశుని ఆత్మ శక్తిచేత తన మాయను చేపట్టి నామరూపాలు లేని జీవులందు నామరూపాలు ఏర్పరచాడు అని కొందరు చెప్పున్నారు; నిర్మలమైన భక్తిగలవారు, కుంటుపడని ఉత్కంఠభరిత యత్నులై, జితేంద్రియులైన పరమ జ్ఞానులు ఈ భగవానుని దర్శించగలరు అని మరికొందరు అంటున్నారు; యోగ మార్గం ద్వారా తప్ప పరమేశ్వర సాక్షాత్కారం అసాధ్య మని యింకొందరు అంటున్నారు.

## 1-237-మ.

"రమణీ! దూరము వోయెఁ గృష్ణురథమున్ రాదింక వీక్షింప, నీ
కమలాక్షుం బొడఁగానలేని దినముల్ గల్పంబులై తోఁచు, గే
హము లం దుండఁగ నేల పోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం
దము రమ్మా" యనె నొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై.

టీక:- రమణీ = రమణతో కూడిన దానా, స్త్రీ; దూరము = దూరముగ; వోయెన్ = పోయెను; కృష్ణు = కృష్ణుని; రథమున్ = రథము; రాదు = వీలుకాదు; ఇంక = ఇకపైన; వీక్షింపన్ = చూచుటకు; ఈ = ఈ; కమలాక్షున్ = కృష్ణుని {కమలాక్షుడు - కమలములవంటి కన్నులు కలవాడు, కృష్ణుడు}; పొడఁగాన = చూడగలగుట; లేని =

లేని; దినముల్ = రోజులు; కల్పంబులు = కల్పములు {బ్రహ్మకు ఒక పగలు అయిన కాలము – కల్పము}; ఐ = అయి; తోఁచున్ = తోచుచుండగ; గేహములు = గృహములు; అందున్ = లో; ఉండఁగన్ = ఉండుట; ఏల = ఎందులకు; పోయి = వెళ్ళి; పరిచర్యల్ = పరిచర్యలు; చేయుచున్ = చేస్తూ; నెమ్మిన్ = చక్కగా; ఉందము = ఉండెదము; రమ్మా = రావమ్మా; అనెన్ = అనెను; ఒక్క ఒక; చంద్రముఖి = సుందరి {చంద్రముఖి – చంద్రునివంటి మోము కలామె, స్త్రీ}; కందర్ప = మన్మథుని {కందర్పుడు – సుఖం తత్ర ద్రపో యస్య, బ్రీ., సుఖ విషయమున గర్వము కలవాడు, మన్మథుడు}; ఆశుగ = బాణములవలన; భ్రాంత = భ్రాంతితో కూడినది; ఐ = అయి.

భావము:- “ఓ సఖీ! అదిగో శ్రీకృష్ణుని రథం దూరంగా వెళ్లిపోయింది. ఇక మన కళ్లకు కన్పించదు. కమలాక్షుణ్ణి కనుగొనలేని దినాలు కల్పాలులా తోస్తాయి. ఇక క్షణం సేపు కూడ ఉండలే మీ యిళ్ళలో. మాధవుని వెంట మనం కూడ వెళ్లి ఆయనకు సేవలు చేసుకుంటు అక్కడే హాయిగా ఉండిపోదా” మంది మన్మథుని బాణాలు నాటిన మగువ యొకతె.

## 1-238-మ.

"తరుణీ! యాదవరాజు గాఁ డితఁడు; వేదవ్యక్తుఁడై యొక్కఁడై
వరుసన్ లోకభవస్థితిప్రళయముల్ వర్తింపఁగాఁ జేయు దు
స్తరలీలారతుఁడైన యీశుఁ, డితనిన్ దర్శించితిం బుణ్యభా
సుర నే" నంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్.

టీక:- తరుణీ = తరుణ వయసు లోనున్న దానా, స్త్రీ; యాదవ = యాదవుల; రాజు = రాజు; కాడు = కాడు; ఇతఁడు = ఇతడు; వేద = వేదములవలన; వ్యక్తుఁడు = తెలియబడువాడు; ఐ = అయి; ఒక్కఁడు = ఒక్కడే; ఐ = అయి; వరుసన్ = వరుసగా; లోక = లోకముల; భవ = సృష్టి; స్థితి = స్థితి; ప్రళయముల్ = లయములను; వర్తింపఁగాన్ = ప్రవర్తించునట్లు; చేయు = చేయును; దుస్తర = దాటుటకువీలుకాని; లీలా = లీలతో; రతుఁడు = కూడినవాడు; ఐన = అయినట్టి; ఈశుఁడు = ఈశుడు, కృష్ణుడు; ఇతనిన్ = ఇతనిని; దర్శించితిన్ = చూడగలిగితిని; పుణ్య = పుణ్యముతో; భాసుర = ప్రకాశించుదానను; నేన్ = నేను; అంచున్ = అనుచు; నటించెన్ = నటించెను; ఒక్కతె = ఒకతె; మహా = గొప్ప; శుద్ధాంతరంగమునన్ = పరిశుద్ధమైన + అంతరంగముతో, అంతఃపురములో.

భావము:- “చెలీ! వేదవేద్యుడైన ఆదినారాయణుడే గాని ఈ కృష్ణుడు యాదవప్రభువు కాదే. ఈ దేవాధిదేవుడు విశ్వానికి సృష్టి స్థితి లయాలు కల్పించే మహానుభావుడే. ఈయన లీలలు మనం తెలుసుకోలేం. లోకేశ్వరుణ్ణి కనులారా దర్శించిన నేను ఎంత అదృష్టవంతురాలనో” అని ఒక అంగన ఆనంద తరంగాలు పొంగిపొరలే అంతరంగంతో చిందులు వేసింది.

1-239-క.

"తామసగుణు లగు రాజులు

భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స

త్త్వామలతనుఁడై యీతఁడు

భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్.

టీక:- తామస = తామసమైన; గుణులు = గుణముగలవారు; అగు = అయిన; రాజులు = రాజులు; భూమిన్ = భూమిమీద; ప్రభవించి = పుట్టి; ప్రజలన్ = ప్రజలను; పొలియింపఁగ = చంపగ; సత్త్వ = సత్త్వగుణముతో, సత్తతో; అమల = స్వచ్ఛమైన; తనుఁడు = తనువు కలవాడు; ఐ = అయి; ఈతఁడు = ఇతడు; భామిని = కాంతా; వారలన్ = వారిని; వధించున్ = సంహరించును; ప్రతి = ప్రతియొక్క; కల్పమునన్ = కల్పములోను.

భావము:- "భామినీ! ప్రతికల్పంలోనూ ఈ పుడమిమీద తమోగుణ దూషితులైన భూపతులు పుట్టి ప్రజానీకాన్ని బాధించి వేధించే సమయంలో, ఆ జగత్కంటకులను స్వచ్ఛమైన సత్త్వ స్వరూపుడై సముద్భవించి సంహరించే స్వామిని చూడవే" అన్నది ఒక కలహంసగామిని.

1-240-వ.

ఇదియునుం గాక.

టీక:- ఇదియునున్ = ఇదే; కాక = కాక.

భావము:- వారు ఇంకా ఈ విధంగా అనుకొన్నారు

1-241-సీ.

ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ-

యాదవకుల మెల్ల ననఘ మయ్యె,

నీ పుణ్యవర్తనుం డే ప్రొద్దు నుండంగ-

మథురాపురము దొడ్డ మహిమఁ గనియె,

నీ పూరుషశ్రేష్ఠు నీక్షింప భక్తితో-

ద్వారకావాసులు ధన్యులైరి,

యీ మహాబలశాలి యెటిఁగి శిక్షింపంగ-

నిష్కంటకం బయ్యె నిఖిలభువన,

1-241.1-తే.

మీ జగన్మోహనాకృతి నిచ్చగించి
పంచశర భల్ల జాల విభజ్యమాన
వివశమానసమై వల్లవీసమూహ
మితని యధరామృతము గ్రోలు నెల్ల ప్రొద్దు.

టీక:- ఈ = ఈ; ఉత్తమశ్లోకుఁడు = కృష్ణుడు {ఉత్తమశ్లోకుడు - ఉత్తములచే స్తుతింపబడు వాడు, కృష్ణుడు}; ఎలమిన్ = సంతోషముగా; జన్మింపంగ = అవతరించగా; యాదవ = యాదవులయొక్క; కులము = వంశము; ఎల్లన్ = సమస్తము; అనఘము = పాపము లేనిది; అయ్యెన్ = అయ్యెను; ఈ = ఈ; పుణ్య = పుణ్యమైన; వర్తనుండు = ప్రవర్తన కలవాడు; ఏప్రొద్దున్ = ఎల్లప్పుడును; ఉండంగ = ఉంటుండగ; మథురా = మథుర అను; పురము = పట్టణము; దొడ్డ = మిక్కిలి; మహిమన్ = గొప్పతనమును; కనియెన్ = పొందెను; ఈ = ఈ; పూరుష = పురుషులలో; శ్రేష్ఠుని = ఉత్తముని; ఈక్షింపన్ = చూచుచుండగ; భక్తి = భక్తి; తోన్ = తో; ద్వారకా = ద్వారకలో; వాసులు = నివసించువారు; ధన్యులు = ధన్యమైనవారు; ఐరి = అయ్యిరి; ఈ = ఈ; మహా = మిక్కిలి; బలశాలి = బలముగలవాడు; ఎఱిఁగి = తెలిసి; శిక్షింపంగన్ = శిక్షించగా; నిష్కంటకంబు = కష్టములు లేనిది; అయ్యెన్ = ఆయెను; నిఖిల = సమస్త; భువనము = ప్రపంచము; ఈ = ఈ;

జగత్ = లోకములను; మోహన = మోహింపచేయు; ఆకృతిన్ = ఆకారమును; ఇచ్ఛగించి = ఇష్టపడి; పంచశర = మన్మథుని {పంచశర - ఐదుబాణములవాడు, మన్మథుడు}; భల్ల = బాణముల; జాలన్ = సమూహముచేత; విభజ్యమాన = బద్దలుకొట్టబడుచున్న; వివశ = వశముతప్పిన; మానసము = మనసుకలది; ఐ = అయ్యి; వల్లవీ = గోపికాస్త్రీల; సమూహము = గుంపు; ఇతని = ఇతని; అధర = పెదవి వలన; అమృతమున్ = అమృతమును; క్రోలున్ = క్రోలును; ఎల్లప్రొద్దు = ఎల్లప్పుడు.

భావము:- “ఈపుణ్యమూర్తి జన్మించటం మూలంగానే యాదవవంశం పవిత్రమైనది. ఈ సచ్చరిత్రుడు నివసిస్తు ఉండటం వలననే మధురానగరం మహిమాన్వితమై ప్రసిద్ధమైనది. ఈ పురుషోత్తముణ్ణి అనుక్షణం వీక్షించటం చేతనె ద్వారకలో ఉండే పౌరులు ధన్యాత్ములైనారు. ఈ వీరాధివీరుడు క్రూరాత్ములను ఏరి పారవేయటం ద్వార ఈ విశాల విశ్వం ప్రశాంతంగా మనగలుగుతున్నది. ఈ జగన్మోహనుని సౌందర్యాన్ని సందర్శించి, మన్మథ శరపరంపరలకు చలించిన హృదయాలతో వ్రేపల్లెలోని గోపస్త్రీలు ఎల్లవేళల ఈ నల్లనయ్య మోవి తేనియలు త్రావుచూ ఉంటారు.

1-242-ఉ.

ఈ కమలాక్షు నీ సుభగు నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుఁగాఁ
జేకొని వేడ్కఁ గాపురము సేయుచు నుండెడు రుక్మిణీముఖా
నేక పతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా
స్తోకవిశేషతీర్థములఁ దొల్లిటి బాముల నేమి నోఁచిరో."

టీక:- ఈ = ఈ; కమలాక్షున్ = కృష్ణుని; ఈ = ఈ; సుభగు = కృష్ణుని {సుభగు - సౌభాగ్యస్వరూపుడు, కృష్ణుడు}; ఈ = ఈ; కరుణాంబుధిన్ = కృష్ణుని {కరుణాంబుధి - కరుణకు సముద్రమైన వాడు, కృష్ణుడు}; ప్రాణ నాథుఁగాన్ = భర్తగా, ప్రాణము లకు అధిపతిగా; చేకొని = స్వీకరించి; వేడ్కన్ = కోరికతో; కాపురము = కాపురము; సేయుచున్ = చేస్తూ; ఉండెడు = ఉండునట్టి; రుక్మిణీ = రుక్మిణి; ముఖ = మొదలగు; అనేక = అనేకమైన; పతివ్రతల్ = పతివ్రతలు; నియతి = నియమముతో; నిర్మల = నిర్మలమైన; మానసలు = మనసు కలవారు; ఐ = అయి; జగత్ = లోకముచేత; నుత = స్తుతింపదగిన; అస్తోక = మిక్కిలి; విశేష = విశేషముగల; తీర్థములన్ = పవిత్రస్థలములలో; తొల్లిటి = పూర్వపు; బాములన్ = జన్మములలో; ఏమి = ఏమి; నోఁచిరో = (నోములు) నోచినారో.

భావము:- ఈ కమలాలాంటి కళ్ళున్నవానిని, ఈ సౌందర్య రాశిని, ఈ దయాసముద్రుణ్ణి తమ జీవితేశ్వరునిగా స్వీకరించి ఆనందంగా కాపురం చేస్తున్న ఆ రుక్మిణీ, సత్యభామా మొదలైన సాధ్వీమణులు నిష్కల్మష హృదయాలతో పూర్వజన్మలో ఏ పుణ్యతీర్థాలు సేవించారో, ఏ మంచినోములు నోచారో కదా."

1-243-వ.

**అని యిట్లు నానావిధంబులుగాఁ బలుకు పురసుందరుల వచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె; ధర్మజుండును హరికి రక్షణంబులై కొలిచి నడువం జతురంగ బలంబులం బంచినఁ దత్సేనా సమేతులై దనతోడి వియోగం బున కోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి; కురుజాంగల, పాంచాల దేశంబులు దాటి; శూరసేన యామున భూములం గడచి; బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య, సారస్వత, మరుధన్వ, సౌవీరాభీర, సైంధవ, విషయంబు లతిక్రమించి' తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు నానర్తమండలంబు సొచ్చి, పద్మ బంధుండు పశ్చిమసింధు నిమగ్నుండయిన సమయంబునఁ బరిశ్రాంతవాహుం డై చనిచని**

టీక:- అని = అని; ఇట్లు = ఈవిధముగ; నానా = అనేక; విధంబులుగా = రకములుగా; పలుకు = స్తుతించుచున్న; పుర = పురమున కల; సుందరుల = అందమైన వారి; వచనంబులు = మాటలు; ఆకర్ణించి = విని; కటాక్షించి = కడగంటి చూపులతో చూసి; నగుచున్ = నవ్వుతూ; నగరంబున్ = పురమునుండి; వెడలెన్ = వెలువడెను; ధర్మజుండును = ధర్మరాజుకూడ; హరి = హరి; కిన్ = కి; రక్షణంబులు = రక్షణచేయునవి; ఐ = అయి; కొలిచి = సేవించి; నడువన్ = నడుచుచుండగ; చతురంగ = నాలుగు విభాగములు కల {చతురంగబలములు - రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, కాల్బలములు. - 4సైనిక విభాగములు}; బలంబులన్ = సేనలను; పంచినన్ = పంపించగా; తత్ = ఆ; సేనా = సేనతో; సమేతులు = కూడినవారు; ఐ = అయి; తన = తన; తోడి = తోటి; వియోగంబున్ = ఎడబాటు; కున్ = నకు; ఓర్వక = ఓర్చుకొనలేక; దూరంబు = దూరము; వెను = వెంట; తగిలిన = వచ్చిన; కౌరవులన్ = కౌరవులను; మరలించి = వెనుకకు పంపి; కురు = కురుభూములందు; జాంగల =

మెరకప్రదేశములు; పాంచాల = పాంచాల; దేశంబులు = దేశములు; దాటి = దాటి; శూరసేన = శూరసేన; యామున = యమున ఒడ్డున ఉన్న, యామున; భూములన్ = ప్రదేశములను; గడచి = దాటి; బ్రహ్మావర్త = బ్రహ్మావర్తము; కురుక్షేత్ర = కురుక్షేత్రము; మత్స్య = మత్స్య; సారస్వత = సారస్వత; మరుధన్వ = మరుధన్వ; సౌవీర = సౌవీర; ఆభీర = ఆభీర; సైంధవ = సైంధవ; విషయంబులు = ప్రదేశములు; అతిక్రమించి = దాటి; తత్తత్ = ఆయా; దేశవాసులు = దేశములలో నివసించు వారు; ఇచ్చిన = ఇచ్చినట్టి; కానుకలు = కానుకలను; కైకొనుచున్ = స్వీకరించుచు; ఆనర్త మండలంబు = ఆనర్తమండలము {కృష్ణుని ద్వారక ఆనర్త మండలము లో ఉన్నది}; చొచ్చి = ప్రవేశించి; పద్మబంధుండు = సూర్యుడు {పద్మబంధుడు - పద్మములకు బంధువు, సూర్యుడు}; పశ్చిమ = పడమటి; సింధున్ = సముద్రమున; నిమగ్నుండు = క్రుంకినవాడు; అయిన = అయిన; సమయంబునన్ = వేళకు; పరిశ్రాంత = అలసిన; వాహుండు = గుఱ్ఱములు కలవాడు; ఐ = అయి; చనిచని = వెళ్ళివెళ్ళి.

భావము:- అలా పలు విధాల సంభాషించుకొంటున్న పౌర కాంతామణుల పలుకులు వింటూ, క్రీగంటి చూపులతో కనుగొంటూ, మందహాస వదనారవిందంతో, గోవిందుడు ముమ్మందుకు సాగాడు. ధర్మరాజు శ్రీకృష్ణునికి అంగరక్షకులుగ చతురంగబలాలను పంపించాడు. ఆ సైన్యంతో పాటు తన ఎడబాటుకు ఓర్వలేక సాగనంపడానికి బహుదూరం వచ్చిన పాండునందనులను వెనుకకు పంపించి, వసుదేవనందనుడు యమునాతీరంలో ఉన్న కురుజాంగల పాంచాల శూరసేన దేశాలు దాటాడు. బ్రహ్మావర్తాన్నీ, కురుక్షేత్రాన్ని గడిచాడు. మత్స్య సారస్వత మరుధన్వ దేశాల గుండా సాగి ఆభీర సౌవీర సింధుదేశాలను దాటాడు. ఆ యా దేశప్రజలు సమర్పించిన కానుకలు అందుకొంటు ద్వారకానగరం అంతర్భాగంగా గల ఆనర్తమండలాన్ని ప్రవేశించాడు. సంధ్యాసమయం సమీపించింది. అశ్వాలు అలిసిపోయాయి. అలానే ప్రయాణం కొనసాగిస్తూ...

## గోవిందుని ద్వారకాగమనంబు

★1-244-మ.

**జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్రశృంగారకం,**
**గలహంసావృతహేమపద్మపరిఖా కాసారకం, దోరణా**
**వళిసంఛాదితతారకం, దరులతావర్గానువేలోదయ**
**త్ఫలపుష్పాంకుర కోరకన్, మణిమయప్రాకారకన్, ద్వారకన్.**

టీక:- జలజాతాక్షుఁడు = కృష్ణుడు {జలజాతాక్షుడు - పద్మముల వంటి కన్నులు ఉన్నవాడు, కృష్ణుడు}; శౌరి = కృష్ణుడు {శౌరిః- శూరుని మనుమడు, కృష్ణుడు, బలవత్తరములైన ఇంద్రియ మనో బుద్దులను అణచినవాడు, విష్ణుసహస్రనామాలు 340వ నామం}; డగ్గఱెన్ = సమీపించెను; మహా = పెద్ద; సౌధ = మేడల; అగ్ర = అగ్ర భాగములచే; శృంగారకన్ = అలంకరింపబడినదైన; కల = మనోహరమైన కంఠధ్వని కల; హంస = హంసలచే; ఆవృత = చుట్టబడిన; హేమ = బంగారు రంగు పుప్పొడి కలిగిన; పద్మ = పద్మములతో కూడిన; పరిఖా = కందకములు; కాసారకన్ = కోనేళ్ళు కలదైన; తోరణా = తోరణముల; ఆవళి = సమూహముచే; సంఛాదిత =

బాగాకప్పబడిన; తారకన్ = నక్షత్రములు కలదైన; తరు = చెట్లు; లతా = లత; వర్గ = వరుసలు; అనువేల = ఎల్లప్పుడు; ఉదయత్ = ఉద్భవిస్తున్న; ఫల = పండ్లు; పుష్ప = పుష్పములు; అంకుర = మొలకలు; కోరకన్ = మొగ్గలును కలదైన; మణి = రత్నములు; మయ = తాపిన; ప్రాకారకన్ = ప్రహారీగోడ కలదైన; ద్వారకన్ = ద్వారకా నగరమును.

భావము:- బంగారు కలశాలతో ప్రకాశించే ఎత్తైన మేడలు కలది; కలహంసలతో కాంచనవర్ణ కమలాలతో అలరారే అగడ్తలు చుట్టు కలది; చుక్కలు తాకే చక్కని తోరణాలు, పండ్లు, పువ్వులు, చివుళ్ళు, మొగ్గలుతో నిండిన లతాకుంజాలు, పంక్తులు పంక్తుల వృక్షాలు కలది; రత్నఖచిత ప్రాకారాలు కలది అయిన ద్వారకానగరాన్ని తామరరేకుల లాంటి కళ్ళున్న శ్రీకృష్ణుడు సమీపించాడు.

## 1-245-వ.

**ఇట్లు దన ప్రియపురంబు డగ్గఱి.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; తన = తనయొక్క; ప్రియ = ప్రియమైన; పురంబు = నగరము; డగ్గఱి = సమీపించి.

భావము:- ఈ విధంగా తనకు అత్యంత ప్రియమైన రాజధాని సమీపించి.

## 1-246-మత్త.

**అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్**
**ధన్యులై వినఁ బాంచజన్యము, దారితాఖిలజంతు చై**
**తన్యమున్, భువనైకమాన్యము, దారుణధ్వని భీతరా**
**జన్యముం, బరిమూర్ఛితాఖిలశత్రుదానవసైన్యమున్.**

టీక:- అన్య = శత్రువులచేత; సన్నుత = స్తుతింపబడిన; సాహసుండు = సాహసము కలవాడు, కృష్ణుడు; మురారి = కృష్ణుడు {మురారి - మురాసురుని శత్రువు, కృష్ణుడు}; ఒత్తెన్ = పూరించెను; యదు = యాదవులలో; ఉత్తముల్ = శ్రేష్ఠులు; ధన్యులు = ధన్యులు; ఐ = అయి; వినన్ = వినునట్లు; పాంచజన్యమున్ = పాంచజన్యమును; దారిత = చీల్చబడిన; అఖిల = సమస్త; జంతు = జంతువుల; చైతన్యమున్ = చైతన్యము కలది; భువనైక = లోకము మొత్తము చేత; మాన్యము = గౌరవింపబడునది; దారుణ = భయంకరమైన; ధ్వని = శబ్దముచేత; భీత = భీతిచెందిన; రాజన్యమున్ = రాజులు కలది; పరిమూర్ఛిత = మూర్ఛిల్లిన; అఖిల = సమస్త; శత్రు = శత్రువుల; దానవ = దానవుల; సైన్యమున్ = సైన్యము కలది;

భావము:- ఆత్మీయులే కాక అన్యులు సైతం అభినందించే ధైర్యసాహసాలు కల గోవిందుడు సమస్త ప్రాణులను నిశ్చేష్టులను చేసేడెది, లోకం ప్రశంసలు అందుకోగలిగినది, చెవులు బద్దలయ్యే శబ్దంతో రాజులను బెదరగొట్టేడిది, ప్రతిపక్షులైన రాక్షసయోధు లందరినీ మూర్ఛిల్లచేసేది అయిన పాంచజన్య మనే తన శంఖాన్ని పూరించాడు. మాన్యులైన యదుకులాగ్రగణ్యు లందరూ ఆ శంఖధ్వనిని విని ధన్యులైనారు.

1-247-శా.

శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబరద్రవ్యముల్
శంఖాతీతము గొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన
ప్రేంఖద్భక్తులు వంశ, కాహళ, మహాభేరీ, గజాశ్వావళీ
రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై.

టీక:- శంఖా = శంఖముయొక్క; రావము = ధ్వని; వీనులన్ = చెవులతో; విని = వినినవారై; జనుల్ = ప్రజలు; స్వర్ణ = బంగారము; అంబర = వస్త్రములు; ద్రవ్యముల్ = ద్రవ్యములును; శంఖాతీతము = లెక్కకు మించినవి, {శంఖాతీతము = శంఖమునకు (మిక్కిలి పెద్ద సంఖ్యకు; 1,000, 000,000,000,000,000; పదికి పద్దెనిమిదవ ఘాతము) అతీతము (మిక్కిలినవి), లెక్కకు మించినవి}; కొంచు = తీసికొనుచు; వచ్చిరి = వచ్చిరి; దిదృక్షా = దర్శించు కోరికతో; దర్పిత = తుళ్ళుతున్న; ఉత్కంఠన = ఉత్కంఠతో; ప్రేంఖత్ = చలించిన; భక్తులు = భక్తులు; వంశ = వేణవులు; కాహళ = బాకాలు; మహాభేరీ = పెద్దరాండోళ్ళు; గజ = ఏనుగులు; అశ్వ = గుఱ్ఱములు; ఆవళీ = వరుసలు; రింఖా = గిట్టల; రావములు = ధ్వనులు; ఉల్లసిల్ల = చెలరేగగా; దనుజారిన్ = కృష్ణుని {దనుజారి - రాక్షసుల శత్రువు, కృష్ణుడు}; చూడన్ = చూడవలెనను; ఆసక్తులు = ఆసక్తి కలవారు; ఐ = అయి.

భావము:- పాంచజన్యశంఖారావం చెవులలో పడగానే ప్రజలంతా ఉరకలేసే ఉత్సాహంతో, పరవళ్ళు తొక్కే భక్తితో, అతిశయించే ఆసక్తితో; వేణువులు, బాకాలు ఊదుతు, నగారాలు మ్రోగిస్తు, , ఏనుగులు చేస్తున్న గిట్టల చప్పుళ్లు చెలరేగుతుండగా, బంగారు వస్తువులు, విలువగల వలువలు మున్నగు కానుకలు లెక్కపెట్టలేనన్ని తీసుకు వచ్చి యదుకుల విభునికి ఎదురొచ్చారు.

1-248-క.

బంధులుఁ బౌరులుఁ దెచ్చిన
గంధేభ హయాదులైన కానుకలు దయా
సింధుఁడు గైకొనె నంబుజ
బంధుఁడు గొను దత్త దీప పంక్తులభంగిన్.

టీక:- బంధులున్ = బంధువులును; పౌరులున్ = పౌరులును; తెచ్చిన = తీసుకు వచ్చిన; గంధేభ = మదించిన ఏనుగులు; హయ = గుఱ్ఱములు; ఆదులు = మొదలగునవి; ఐన = అయినట్టి; కానుకలు = కానుకలు; దయాసింధుఁడు = కృష్ణుడు {దయాసింధుడు - దయాసముద్రుడు, కృష్ణుడు}; కైకొనె = స్వీకరించెను; అంబుజబంధుఁడు = సూర్యుడు {అంబుజబంధువు - పద్మముల బంధువు, సూర్యుడు}; కొను = స్వీకరించు; దత్త = ఒసగబడిన; దీప = దీపముల; పంక్తుల = వరుసలు; భంగిన్ = వలె.

భావము:- బంధుమిత్రులు, ప్రజలు తీసుకు వచ్చిన ఏనుగులు, గుఱ్ఱాలు మొదలైన బహుమతులను దయాసాగరుడైన శ్రీకృష్ణమూర్తి, భక్తు లర్పించిన దీపపంక్తులను పరిగ్రహించే పద్మబంధునిలా అందుకొన్నాడు.

1-249-వ.

ఇట్లాత్మారాముండునుఁ బూర్ణకాముండునునైన యప్పరమేశ్వరునికి నుపాయ నంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గదభాషణంబులతోడ డయ్యకుండ నడపునయ్యకు నెయ్యంపుఁజూపుల నడ్డంబులేని బిడ్డలచందంబున మ్రొక్కి యిట్లనిరి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ఆత్మారాముండును = ఆత్మ యందే రమించు వాడును; పూర్ణకాముండును = పూర్ణమైన కోరికలు కలవాడు; ఐన = అయిన; ఆ = ఆ; పరమేశ్వరుని = పరమమైన ఈశ్వరుని, కృష్ణుని; కిన్ = కి; ఉపాయనంబులు = కానుకలు; ఇచ్చుచున్ = ఇచ్చుచూ; నాగరులు = నగరమున నివశించువారు; వికసిత = వికసించిన; ముఖులు = ముఖము కలవారు; అయి = అయి; గద్గద = వణుకుచున్న గొంతుతో పలుకు; భాషణంబులు = మాటల; తోడన్ = తో; డయ్యకుండన్ = అలసిపోకుండగ; నడపున్ = నడిపించే; అయ్య = వాని; కున్ = కి; నెయ్యంపు = స్నేహపూరిత; చూపులన్ = చూపులతో; అడ్డంబు = అడ్డము; లేని = లేని; బిడ్డల = సంతానము; చందంబునన్ = వలె; మ్రొక్కి = నమస్కరించి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- ఈ విధంగా ద్వారకాపుర పౌరులు ఆత్మారాముడు, సంపూర్ణకాముడు ఐన శ్యామసుందరునికి కానుకలు సమర్పించి ఆనందంతో వికసించిన ముఖాలు, హర్షగద్గద భాషణలు కలవారు అయి, తమను కంటికి రెప్పలా కాపాడే నల్లనయ్యకు, కన్నతండ్రికి చిన్నబిడ్డల వలె నమస్కరించి ఇలా పలికారు.

1-250-శా.

"నీపాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసార సం
తాపధ్వంసినియౌఁ గదా, సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్.

టీక:- నీ = నీయొక్క; పాద = పాదము అనే; అబ్జము = పద్మము; బ్రహ్మ = బ్రహ్మచేత; పూజ్యము = పూజింపదగినది; కదా = కదా; నీ = నీమీది; సేవ = భక్తి; సంసార = సంసారమందలి; సంతాప = బాధలను; ధ్వంసిని = నాశనముచేయగలది; ఔన్ = అవును; కదా = కదా; సకల = సమస్త; భద్ర = శుభముల; శ్రేణులన్ = పంక్తులను; ప్రీతి = ప్రేమ; తోన్ = తో; ఆపాదింతు = సంక్రమింప చేయుదువు; కదా = కదా; ప్రపన్నులు = ఆశ్రితులు; కున్ = కు; కాల = కాలమునకు; అధీశ = అధిపతీ; కాలంబు = కాలము; నిర్వ్యాపారంబు = ప్రవర్తనలు లేనిది; కదా = కదా; అయ్య = అయ్యా; చాలరు = సరిపోరు; నినున్ = నిన్ను; వర్ణింపన్ = వర్ణించుటకు; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఆదులున్ = మొదలగువారును.

భావము:- "స్వామీ! నీ పాదపద్మాలు బ్రహ్మపూజ్యాలు; నీ చరణ సేవ సంతాపమయ మైన సంసార సముద్రాన్ని దాటించే నావ; నీవు ఆశ్రితులకు సకలసౌభాగ్యాలను సంతోషంగా ప్రసాదించే కరుణామూర్తివి; కాలస్వరూపుడవు; కాలానికి అధీశ్వరుడవు; బ్రహ్మాది దేవతలు కూడా నిన్ను ప్రశంసించ సమర్థులు కారు.

★1-251-క.

ఉన్నారము సౌఖ్యంబున,
విన్నారము నీ ప్రతాప విక్రమకథలన్,
మన్నారము ధనికులమై,
కన్నారము తావకాంఘ్రికమలములు హరీ!

టీక:- ఉన్నారము = ఉన్నాము; సౌఖ్యంబునన్ = సుఖంగ; విన్నారము = విన్నాము; నీ = నీ యొక్క; ప్రతాప =శౌర్యము; విక్రమ =పరాక్రమములయొక్క; కథలన్ =కథలు; మన్నారము = మంటిమి, బ్రతికుతున్నాము; ధనికులము = ధనవంతులము; ఐ = అయి; కన్నారము = కంటిమి, చూచితిమి; తావక = నీయొక్క; అంఘ్రి = పాద; కమలములు = పద్మములు; హరీ = కృష్ణా.

భావము:- కృష్ణయ్యా! నీ దయవల్ల మేమంతా సుఖంగా ఉన్నాం. నీ శౌర్యప్రతాపాల గురించిన విశేషాలు వింటున్నాం, సంతోషిస్తున్నాం. మాకు ఇన్నాళ్ళకి మళ్ళా నీ పాదపద్మాల దర్శనం అయింది. భాగ్యవంతులమై విలసిల్లుతున్నాం.

★1-252-క.

ఆరాటము మది నెఱుఁగము,
పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ,
జోరాటన మెగయదు నీ,
దూరాటన మోర్వలేము తోయజనేత్రా!

టీక:- ఆరాటము = ఆందోళనలు; మదిన్ = మా మనసులో; ఎఱుఁగము = లేనే లేవు; పోరాటములు = కలహములు; ఇండ్ల = గృహముల; కడలన్ = వద్ద; పుట్టవు = లేనే లేవు; పురి = నగరము; లోన్ = లో; చోర = దొంగల; ఆటనము = సంచారము; ఎగయదు = లేనే లేదు; నీ = నీనుండి; దూరాటనము = దూరముగ నుండుట; ఓర్వలేము = భరించలేము; తోయజనేత్రా = కృష్ణ {తోయజ నేత్రుడు - (నీటినుండి పుట్టునది) పద్మముల వంటి నేత్రములు కల వాడు - కృష్ణుడు}.

భావము:- కమలాల వంటి కన్నులున్న కన్నయ్యా! మా మనసులలో ఆరాటా లన్నవి లేవు. ఇళ్ళల్లో కలహా లన్నవి లేవు. నగరంలో చోర భయాలు లేనే లేవు. అయినా కూడ నీవు దూరప్రాంతాలకు వెళ్ళి నప్పుడు నీ వియోగాన్ని సహించలే మయ్యా.

★1-253-ఉ.

తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివిఁ, దల్లివిం, బతివి, దైవమవున్, సఖివిన్, గురుండ; వే
తండ్రులు నీ క్రియం బ్రజల ధన్యులఁ జేసిరి, వేల్పు లైన నో
తండ్రి భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మా విధంబునన్.

టీక:- తండ్రుల = తండ్రుల; కున్ = కు; ఎల్లన్ = అందరికి; తండ్రి = తండ్రి; అగు = అయిన; ధాత = బ్రహ్మ {ధాత – ధరించు వాడు, బ్రహ్మ}; కున్ = కి; తండ్రివి = తండ్రివి; దేవ = కృష్ణా; నీవు = నీవు; మా = మాయొక్క; తండ్రివిన్ = తండ్రివి; తల్లివిన్ = తల్లివి; పతివి = భర్తవి; దైవమవున్ = దేవుడవు; సఖివిన్ = స్నేహితుడవు; గురుండవు = గురువువి; ఏ = ఏ; తండ్రులు = తండ్రులు{తండ్రులు – అయిదుగురు తన్ను గన్నవాడు, ఉపనయనము జేసినవాడు, చదువు చెప్పినవాడు, విపత్తున కాపాడినవాడు, అన్నము పెట్టి పోషించినవాడు}; నీ = నీ; క్రియన్ = వలె; ప్రజల = లోకులను; ధన్యులన్ = ధన్యులనుగా; చేసిరి = చేసిరి; వేల్పులు = దేవతలు; ఐనన్ = అయినప్పటికిని; ఓ = ఓ; తండ్రి = తండ్రి; భవన్ = నీయొక్క; ముఖ = ముఖము అనే; అంబు జము = పద్మము; ధన్యతన్ = ధన్యతతో; కానరు = చూడలేరు; మా = మా; విధంబునన్ = వలె.

భావము:- తండ్రులందరికి తండ్రి యైన బ్రహ్మదేవునికి నీవు తండ్రివి. మా అందరికి తండ్రివి, తల్లివి, దైవానివి, భర్తవు, మిత్రుడవు, గురుడవు, సమస్తము నీవే; తండ్రులు ఐదుగురు (తన్ను గన్నవాడు, ఉపనయనము జేసినవాడు, చదువు చెప్పిన వాడు, విపత్తున కాపాడినవాడు, అన్నము పెట్టి పోషించినవాడు) ఎవరు కూడ నీలాగ ప్రజలను పరమానంద భరితులను చేసి ధన్యులను చేయలేరు. దేవతలైనా మా లాగా నీ ముఖ పద్మాన్ని వీక్షించి కృతార్థులు కాలేరు.

★1-254-క.

చెచ్చెరఁ గరినగరికి నీ
విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ
వెచ్చోటికి విచ్చేయక
మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్.

టీక:- చెచ్చెరన్ = తొందరతొందరగా; కరినగరి = హస్తినాపురము; కిన్ = నకు; నీవు = నీవు; విచ్చేసిన = వెళ్ళిన; నిమిషము = నిమిష మాత్రపు సమయము; ఐన = అయినను; వేయి = పది వందల; ఏండ్లు = సంవత్సరములు; అగు = వలె ఉండును; నీవు = నీవు; ఎచ్చోటి = ఎక్కడ; కిన్ = కును; విచ్చేయక = వెళ్ళకుండగ; మచ్చిక = ప్రేమ; తోన్ = తో; ఉండుము = ఉండుము; అయ్య = తండ్రీ; మా = మాయొక్క; నగరమునన్ = నగరములో.

భావము:- ప్రభు! నీవు మాటిమాటికి హస్తినాపురానికి వెళ్తున్నావు. అలా వెళ్ళినప్పు డల్లా ప్రతి నిమిషము మాకు పదివందల సంవత్సరాల లాగ అనిపిస్తున్నది. అందుచేత, మా ద్వారకానగరాన్ని వదలి ఎక్కడకి వెళ్ళకుండా ప్రేమగా ఇక్కడే ఉండిపోవయ్య నల్లనయ్య!

★-255-ఆ.

అంధకారవైరి యపరాద్రి కవ్వలఁ

జనిన నంధమయిన జగముభంగి

నిన్నుఁ గానకున్న నీరజలోచన!

యంధతమస మతుల మగుదు మయ్య."

టీక:- అంధకారవైరి = సూర్యుడు {అంధకార వైరి - చీకటికి శత్రువు, సూర్యుడు}; అపర = పడమటి; అద్రి = కొండ; కిన్ = కు; అవ్వలన్ = ఆవతల పక్కకి; చనినన్ = వెళ్ళగా; అంధము = చీకటిగా; అయిన = అయి నట్టి; జగము = లోకము; భంగిన్ = వలె; నిన్నున్ = నిన్ను; కానక = చూడగా లేకుండగ; ఉన్న = ఉన్న యెడల; నీరజలోచన = కృష్ణ {నీరజ లోచన - (నీటిలో పుట్టినది) పద్మము వంటి కన్నుల ఉన్న వాడు}; అంధతమస = చీకటి వంటి అజ్ఞానముతో కూడిన; మతులము = బుద్ధి కల వారము; అగుదుము = అవుతాము; అయ్య = తండ్రీ.

భావము:- సూర్యభగవానుడు పశ్చిమ పర్వతం చాటుకు పోయి నప్పుడు జగత్తు అంతా అంధకార బంధుర మైనట్లు నీవు కానరాకుంటే, మేము కటిక చీకటిలో పడి కొట్టుమిట్టాడు తుంటాము."

1-256-వ.

అని యిట్లు ప్రజలాడెడి భక్తియుక్త మధురమంజులాలాపంబులు గర్ణ కలాపంబు లుగా నవధరించి, కరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచుఁ, దన రాక విని మహానురాగంబున సంరంభ వేగంబుల మజ్జనభోజనశయనాది కృత్యంబు లొల్లక యుగ్రసే, నాక్రూర, వసుదేవ, బలభద్ర, ప్రద్యుమ్న, సాంబ, చారుదేష్ణ, గద ప్రముఖ యదు కుంజరులు కుంజర, తురగ, రథారూఢు లై దిక్కుంజరసన్నిభం బయిన యొక్కకుంజరంబు ముందటనిడుకొని; సూత, మాగధ, నట, నర్తక, వంది సందోహంబుల మంగళభాషణంబులును; భూసురాశీర్వాద వేద ఘోషంబు లును; వీణా, వేణు, భేరీ, పటహ, శంఖ, కాహళ ధ్వానంబు లును; రథారూఢ విభూషణ భూషిత వారయువతీగానంబులును; నసమానంబులైచెలంగ నెదురుకొని యథో చిత ప్రణామాభివాదన పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం

దానును భుజగేంద్రపాలితంబైన భోగవతీనగరంబు చందంబున స్వసమానబల యదు, భోజ, దశార్హ, కుకురాం ధక, వృష్ణి, వీరపాలితంబును; సకల కాలసంపద్య మానాంకుర పల్లవ, కోరక, కుట్మల, కుసుమ, ఫల, మంజరీపుంజ భార వినమిత లతా పాదపరాజ విరాజితో ద్యాన మహోవనోపవనారామ భాసితంబును; వనాంత రాళ రసాల, సాల, శాఖాం కురఖాదనక్షుణ్ణకషాయ కంఠ కలకంఠ మిథున కోలాహల ఫలరసాస్వాదపరిపూర్ణ శారికా, కీర, కుల, కలకల, కల్హార, పుష్ప మకరంద పాన పరవశ భృంగ భృంగీ కదంబ ఝుంకార సరోవర కనక కమల మృదులకాండ ఖండ స్వీకార మత్త వరటా యత్త కలహంస నివహ క్రేంకార సహితంబును; మహోన్నత సౌధజాల రంధ్రనిర్గత కర్పూరధూపధూమపటల సందర్శనసంజాత జలధరభ్రాంతి విభ్రాంతి సముద్ధూత పింఛ నర్తన ప్రవర్తమాన మత్తమయూర కేకారవ మహితంబును; నానారూప తోరణ ధ్వజ వైజయంతికా నికాయ నిరుద్ధ తారకాగ్రహప్రకాశంబును; ముక్తాఫల విరచితరంగవల్లి కాలంకృత మందిర ద్వారదేహళీ వేదికా ప్రదేశంబును; ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గేహ గేహళీ నికర కనకగళంతికా వికీర్యమాణ సలిలధారాసంసిక్త విపణిమార్గంబునుఁ; బ్రతినివాస బహిరంగణ సమర్పిత రసాల దండ, ఫల, కుసుమ, గంధాక్షత, ధూప, దీప, రత్నాంబరాది. వివిధోపహార వర్గం బునుఁ; బ్రవాళ, నీల, మరకత, వజ్ర, వైఢూర్య, నిర్మితగోపురాట్టాలకంబును, విభవ నిర్జిత మహేంద్రనగరాలకంబును నైన పురవరంబుం బ్రవేశించి; రాజమార్గంబున వచ్చు సమయంబున.

టీక:– అని = అని; ఇట్లు = ఈ విధముగ; ప్రజలు = జనులు; ఆడెడి = పలికెడి; భక్తి = భక్తితో; యుక్త = కూడుకొన్న; మధుర = తీయని; మంజుల = ఇంపైన; ఆలాపంబులు = పలుకులు; కర్ణ = చెవులకు; కలాపంబులుగాన్ = ఆభరణములుగా; అవధరించి = ధరించి; కరుణ = దయతో కూడిన; అవలోకనంబులు = చూపులు; వర్షించుచున్ = వెదజల్లుచు; హర్షించుచున్ = సంతోషించుచు; తన = తన; రాక = రాకను; విని = విని; మహా = గొప్ప; అనురాగంబున = అనురాగముతో; సంరంభ = ఆత్రుతతోను; వేగంబుల = తొందరతోను; మజ్జన = స్నానము చేయుట; భోజన = భోజనము తినుట; శయన = నిద్రించుట; ఆది = మొదలగు; కృత్యంబులు = పనులు; ఒల్లక = ఒప్పుకొనక; ఉగ్రసేనా = ఉగ్రసేనుడు; అక్రూర = అక్రూరుడు; వసుదేవ = వసుదేవుడు; బలభద్ర = బలభద్రుడు; ప్రధ్యుమ్న = ప్రద్యుమ్నుడు; సాంబ = సాంబుడు; చారుధేష్ణ = చారుధేష్ణుడు; గద = గదుడు;

ప్రముఖ = మొదలగు ముఖ్యులు; యదు = యదు వంశమున; కుంజరులు = ఏనుగుల వంటివారు; కుంజర = ఏనుగు; తురగ = గుఱ్ఱము; రథ = రథము; ఆరూఢులు = ఎక్కినవారు; ఐ = అయి; దిక్కుంజర = దిగ్గజమునకు; సన్నిభంబు = సమానమైన; అయిన = అయినట్టి; ఒక్క = ఒక; కుంజరంబు = ఏనుగు; ముందటన్ = ముందర; ఇడుకొని = ఉంచుకొని; సూత = రథము తోలువారు; మాగధ = స్తోత్రము చేయువారు; నట = అభినయము చేయువారు; నర్తక = నాట్యము చేయువారు; వంది = వంశవర్ణన చేయువారు; సందోహంబుల = గుంపులు గుంపులుగా; మంగళ = శుభకరమైన; భాషణంబులును = పలుకులును; భూసుర = బ్రాహ్మణులు చేయు; ఆశీర్వాద = ఆశీస్సుల; వేద = వేదమంత్రములను; ఘోషంబులును = గట్టిగా చదువుటలు; వీణ = వీణలు; వేణు = పిల్లన గ్రోవులు; భేరీ = డోళ్ళు; పటహ = రాండోళ్ళు; శంఖ = శంఖములు; కాహళ = బాకాలు యొక్క; ధ్వానంబులును = ధ్వనులును; రథ = రథములు; ఆరూఢ = ఎక్కిన; విభూషణ = విశిష్ట ఆభరణములను; భూషిత = అలంకరించు కొన్న; వార = భోగమువారిలో {వార జనులు - భోగమువారు, కుటుంబవ్యవస్థ నుండి దూరముగ నుండువారు}; యువతీ = యువతుల {యువతి - యౌవనమున ఉన్నామె, స్త్రీ}; గానంబులును = పాటలుతో; అసమానంబులు = మిక్కిలుచున్నవి; ఐ = అయి; చెలంగన్ = చెలరేగగా; ఎదురుకొని = అభిముఖముగ వచ్చి; యథోచిత = తగిన విధముగ; ప్రణామ = నమస్కారము చేయుట, చేతులు జోడించుట; అభివాదన = మ్రొక్కుట, నమస్కార పూర్వక పలకరింపు; పరిరంభ = కౌగలించు కొనుట; కరస్పర్శన = చేతులు స్పృశించుట; సంభాషణ = పలకరించుట; మందహాస = చిరునవ్వు చిందించుట; సందర్శన = గౌరవపూర్వకముగ వెళ్ళి చూచుట; ఆది = మొదలగు; విధానంబుల = విధములుగా; బహుమానంబులు = గౌరవములు; చేసి = చేసి; వారలున్ = వారును; తానును = తానే స్వయముగను; భుజగేంద్ర = నాగేంద్రునిచే; పాలితంబు = పరిపాలింప బడునది; ఐన = అయినట్టి; భోగవతీనగరంబు = భోగవతీనగరము {భోగవతీనగరము - నాగలోక ముఖ్య పట్నము}; చందంబున = వలె; స్వ = తనతో; సమాన = సమానమైన; బల = బలముగల; యదు = యాదవులు; భోజ = భోజులు; దశార్హ = దశార్హులు; కుకుర = కుకురలు; అంధక = అంధకులు; వృష్ణి = వృష్ణికులు; వీర = (ఐన) వీరులచే; పాలితంబును = పాలింప బడునదియును; సకల = సర్వ; కాల = కాలములందును; సంపద్యమాన = పొందబడుచున్న; అంకుర = మొలకలు; పల్లవ = చిగుళ్ళు; కోరక = మొగ్గలు; కుట్మల = అరవిచ్చుమొగ్గలు; కుసుమ = పూవులు; ఫల = పండ్లు; మంజరీ = గుత్తులు; పుంజ = గెలలు యొక్క; భార = బరువుచేత; వినమిత = వంగిన; లతా = తీగలు; పాదపరాజ = పెద్ద చెట్లు తోను; విరాజిత = ప్రకాశిస్తున్న; ఉద్యాన = తోటలు; మహోవన = పెద్దతోటలు; ఉపవన = పెరటితోటలు; ఆరామ = ఊరి వెలుపలి తోటలు తోను; భాసితంబును = ప్రకాశించు చుండగ; వన = తోటల; అంతరాళ = లోపలి భాగము నందు; రసాల = తీయ మామిడి చెట్లు; సాల = మద్దిచెట్లు; శాఖ = కొమ్మల; అంకుర = చివుళ్ళను; ఖాదన = తినుటవలన; క్షుణ్ణ = ఉత్పన్నమైన; కషాయ = పదునెక్కిన; కంఠ = కంఠములుగల; కలకంఠ = కోకిల; మిథున = జంటల; కోలాహల = కలకలములతోను; ఫల = పండ్ల యొక్క; రస = రసములను; ఆస్వాద = గ్రోలి; పరిపూర్ణ = సంతుష్టి చెందిన; శారికా = గోరువంకలు; కీరకుల = చిలుకలు; కలకల = కలకలములుతోను; కల్హార = కలువ; పుష్ప = పువ్వుల; మకరంద = తేనెలు; పాన = త్రావుటచే; పరవశ = ఒడలు మరచిన; భృంగ = గండు తుమ్మెదలు; భృంగీ = ఆడ తుమ్మెదలు; కదంబ = గుంపుల యొక్క; ఝుంకార = జుమ్మనే శబ్దముల తోకూడిన; సరోవర = కొలనుల లోని; కనక = బంగారు పుప్పొడి కల; కమల = పద్మముల; మృదుల = మెత్తని; కాండ = తూడుల; ఖండ = ముక్కలను; స్వీకార = తీసుకొనుటచే; మత్త = మత్తెక్కిన; వరట = ఆడ హంసతో; ఆయత్త = సంసిద్ధమైన; కలహంస = మంచి కంఠనాదము కల హంసల; నివహ = గుంపుల

యొక్క; క్రేంకార = కూతలతో; సహితంబును = కూడినదియు; మహ = మిక్కిలి; ఉన్నత = ఎత్తైన; సౌధ = మేడల; జాల = కిటికీల; రంధ్ర = కన్నముల నుండి; నిర్గత = వెలువడుచున్న; కర్పూర = కర్పూరము మొదలగునవాటిని; ధూప = దూపము వేయుట వలని; ధూమ = పొగల; పటల = చుట్టలు, అల్లికలు; సందర్శన = చూచుట వలన; సంజాత = కలిగిన; జలధర = మేఘములనే; భ్రాంతి = భ్రమచే; విభ్రాంతి = చక్కటి భ్రమణములతో; సముద్ధూత = విచ్చుకొన్న; పింఛ = పింఛములతో; నర్తన = నాట్యముతో కూడిన; ప్రవర్తమాన = నడకలతో ప్రకాశిస్తున్న; మత్త = మదించిన; మయూర = నెమళ్ళ; కేక = కేకల; ఆరవ = శబ్దములతోను; మహితంబును = పెచ్చరిల్లు తున్నదియును; నానా = అనేక; రూప = రూపముల; తోరణ = తోరణములు; ధ్వజ = జెండాలు; వైజయంతికా = ద్వారములకు అలంకరించిన విజయ మాలికల; నికాయ = సమూహములచేత; నిరుద్ధ = అడ్డగింప బడిన; తారకా = నక్షత్రముల యొక్క; గ్రహ = గ్రహముల యొక్క; ప్రకాశంబును = ప్రకాశము కలదియును; ముక్తాఫల = ముత్యములో; విరచిత = కూర్చబడిన; రంగవల్లికా = ముగ్గులతో; అలంకృత = అలంకరింప బడిన; మందిర = మందిరముల యొక్క; ద్వార = ద్వారములు; దేహళీ = గుమ్మములు; వేదికా = అరుగులు; ప్రదేశంబును = వాకిలి ప్రదేశములు కలదియును; ఘనసార = కర్పూరము; గంధసార = మంచి గంధము; కస్తూరికా = కస్తూరిచేత; సంవాసిత = సువాసనాభరితముగా కల; వణిక్ = వైశ్యుల; గేహ = ఇండ్ల; గేహళీ = ద్వారబంధముల; నికర = సమూహము; కనక = బంగారు; గళంతికా = గిండి చెంబులు నుండి, కళ్ళాపి యంత్రము నుండి; వికీర్యమాణ = వెదజల్ల బడచున్న; సలిల = జల; ధారా = ధారలచే; సంసిక్త = బాగుగా తడుపబడిన; విపణి = వాణిజ్య; మార్గంబును = వీథులును; ప్రతి = ఒక్కొక; నివాస = ఇంటియొక్క; బహిరంగణ = వాకిలి యందు; సమర్పిత = సమర్పింపబడిన; రసాల = చెరుకు; దండ = గడలు; ఫల = పండ్లు; కుసుమ = పుష్పములు; గంధా = గంధములు; అక్షత = అక్షతలు; ధూప = ధూపములు; దీప = దీపములు; రత్న = రత్నములు; అంబర = వస్త్రములు; ఆది = మొదలగు; వివిధ = అనేక విధములైన; ఉపహార = నైవేద్యముల; వర్గంబును = సమూహములతో కూడినదియు; ప్రవాళ = పగడములు; నీల = నీలములు; మరకత = పచ్చలు; వజ్ర = వజ్రములు; వైఢూర్య = వైఢూర్యములతోను; నిర్మిత = నిర్మింప బడిన; గోపుర = గోపురములు; అట్టాలకంబును = కోట బురుజులతోను; విభవ = వైభవముచే; నిర్జిత = ఓడింపబడిన; మహేంద్రనగర = అమరావతి {మహేంద్రనగరము – ఇంద్రుడి యొక్క నగరము, అమరావతి}; అలకంబును = అలకాపురము {కుబేరుని పట్టణము అలకాపురము}; ఐన = అయిన; పుర = పురములలో; వరంబున్ = శ్రేష్ఠమైనదానిని; ప్రవేశించి = ప్రవేశించి; రాజమార్గంబున = రాజమార్గమున; వచ్చు = వచ్చుచున్న; సమయంబున = సమయములో.

భావము:– ఈ విధంగా ద్వారాకానగర ప్రజలు పలుకుతున్న భక్తి బంధురమైన మధుర మంజులాలా పాలు వీనులవిందుగా వింటు, కరుణతో ఆర్ద్రాలైన కడకంటిచూపులను కురిపిస్తు, మురిపిస్తు తన ఆగమనం విని మిక్కిలి అనురాగంతో, సంరంభవేగంతో స్నాన భోజన శయనాది నిత్యకృత్యాలు కూడ పరిత్యజించి ఉగ్రసేనుడు, అక్రూరుడు, వసుదేవుడు, బలభద్రుడు మున్నగు పెద్దలు; ప్రద్యుమ్నుడు, సాంబుడు, చారుదేష్ణుడు, గదుడు మొదలైన యదువీరులు ఏనుగులు గుఱ్ఱాలు రథాలు అధిరోహించినవారై, ఐరావతం వంటి ఒక భద్రగజాన్ని ముందుంచుకొని; సూతులు, నటులు, నర్తకులు, వందిమాగధులు మొదలైనవారి మంగళభాషణాలతో భూసురోత్తముల ఆశీర్వాద వేదనినాదాలతో; వీణ, వేణువు, నగారా, తప్పెట, శంఖం, బాకా మొదలైన వాద్యధ్వనులతో; నానాలంకారాలూ ధరించి రథాలపై కూర్చున్న వారకాంతల కమనీయ గానాలతో

ఎదురువచ్చారు. వారందరినీ శ్రీకృష్ణుడు వందనాలతో, అభివాదాలతో, కౌగిలింతలతో, కరస్పర్శలతో యథోచితంగా గౌరవించాడు. వారితో కూడిన మధుర నాగరాజులచే పరిపాలింపబడెడి భోగవతీనగరంలా, తనంతటి బలసంపన్నులైన యదు భోజ దాశార్హ కుకుర అంధక వృష్ణి వీరులచేత సంరక్షింపబడుతున్న ద్వారకాపురాన్ని వాసుదేవుడు ప్రవేశించాడు. ఆ మహానగరం ఎల్లకాలము లందు కోకొల్లలుగా ఉండే అంకురాలతో, పల్లవాలతో, కోరకాలతో, కుట్మలాలతో, కుసుమాలతో, పండ్ల గుత్తులతో, వంగిన లతల యొక్క సమూహాలతో, విరాజిల్లే ఉద్యానవనాలతో, ఉపవనాలతో, క్రీడావనాలతో ప్రమదవనాలతో ప్రకాశిస్తున్నది. ఆ వనాల నడుమ నున్న బాలరసాల సాల నవపల్లవాలను కొరికి కషాయకంఠులైన కలకంఠ దంపతుల కుహూనినాదాలతో, ఫలరసాలను సంతృప్తిగా ఆస్వాదించిన గోరువంకల చిలుకల కలకల ధ్వనులతో, వికసించిన కలువపూవుల్లోని మకరందాన్ని పానంచేసి పరవశించిన తుమ్మెద దంపతుల కమ్మని ఝుంకారాలతోనూ, సరస్సులలో బంగరుతామరతూండ్ల తునుకలు తిని మైమరిచి కలహంస దంపతుల క్రేంకారాలతోను కూడి ఉన్నది. మహోన్నతాలైన మేడల గవాక్షాలలో నుంచి బయలు వెడలిన కర్పూర ధూపాలు, అగరుధూమాలు చూసి నీలమేఘాలనే భ్రాంతితో ఒడలు తెలియక పింఛాలు విప్పి నాట్యాలు చేస్తున్న మత్తమయూరాల కేకారవాలతో నిండి ఉంది. ఆ నగరంలోని నానావిధాలైన మకర తోరణాలతో, విజయధ్వజాలతో, వైజయంతికలతో ఆకాశంలోని నక్షత్ర గ్రహ మండలాల ప్రకాశాలు నిరుద్ధము లౌతున్నాయి; మంచిముత్యాలతో కూర్చిన రంగవల్లికలతో, అలంకరింపబడ్డ మందిరద్వారాలు, గడపలు, వేదికలు ప్రకాశిస్తున్నాయి; కర్పూరం, చందనం, కస్తూరి పరిమళించే వర్తకుల గృహాల ద్వారబంధాలు, బంగారు కళ్ళాపిగిండిగిలతో జల్లుమని చల్లుతున్న నీటి జల్లులతో బాగా తడిసిన రాజమార్గాలు; మంగళాక్షతలు, ధూపదీపాలు, రత్నాంబరాలు మొదలైన నానావిధాల కానుకలు కనువిందు కావిస్తున్నాయి; పగడాలతో, నీలాలతో, పచ్చలతో, వజ్రవైడూర్యాలతో నిర్మింపబడ్డ గోపురాలు, చంద్రశాలలు అంతటా ప్రకాశిస్తున్నాయి; తన మహావైభవంతో ఆ పట్టణం మహేంద్రుని స్వర్గపట్టణం అమరావతిని, కుబేరుని అలకాపట్టణాన్ని తిరస్కరిస్తున్న ట్లున్నది; ఇటువంటి ద్వారకానగరాన్ని ప్రవేశించి శ్రీకృష్ణుడు రాజమార్గము వెంట వస్తున్నాడు.

### 1-257-మత్త.

కన్నులారగ నిత్యమున్ హరిఁ గాంచుచున్ మనువార ల
య్యున్నవీన కుతూహలోత్సవయుక్తి నాగరకాంత ల
త్యున్నతోన్నతహర్మ్యరేఖల నుండి చూచిరి నిక్కి చే
సన్నలం దమలోనఁ దద్విభు సౌకుమార్యము సూపుచున్.

టీక:- కన్నుల = కళ్ళ; ఆరంగ = నిండుగ; నిత్యమున్ = ఎల్లప్పుడు; హరిన్ = హరిని; కాంచుచున్ = దర్శించుచు; మనువారలు = జీవించువారు; అయ్యున్ = అయినప్పటికిని; నవీన = కొత్తదనముతో కూడిన; కుతూహల = కుతూహలము అనే; ఉత్సవ = ఉత్సవములతో; యుక్తి = కూడిన; నాగర = నగరమున వసించు; కాంతలు = స్త్రీలు; అతి = అత్యంత; ఉన్నతోన్నత = బాగా ఎత్తైన; హర్మ్య = మేడల; రేఖల = పంక్తుల; నుండి = నుండి; చూచిరి = చూచినారు; నిక్కి = ఉత్సుకతో బొటనవేళ్ళపై నిలబడి; చేన్ = చేతులవలని; సన్నలన్ = సంజ్ఞలతో;

తమలోనన్ = తమలోతాము; తత్ = ఆయొక్క; విభు = ప్రభువు; సౌకుమార్యము = సుకుమార లక్షణములు; సూపుచున్ = చూపుచూ;

భావము:- అప్పుడు నగరంలోని పౌరకాంత లందరు ఆయన్ని చూడటానికి ఉన్నతోన్నతమైన సౌధాలను అధిరోహించారు. ప్రతినిత్యం కన్నుల విందుగా కనుగొంటున్నప్పటికీ వారు క్రొంగ్రొత్త కుతూహలాలతో కూడినవారై నిక్కినిక్కి చూడసాగారు. తమలో తాము ఆ శ్యామసుందరుని సౌందర్య సౌకుమార్య లావణ్యమయ స్వరూపాన్ని చేతుల చాచి తమలోతాము చూపించుకొంటు ఆనందించారు.

1-258-సీ.

కలుముల నీనెడు కలకంఠి యెలనాఁగ-
 వర్తించు నెవ్వాని వక్షమందు;
జనదృక్చకోరకసంఘంబునకు సుధా-
 పానీయపాత్ర మే భవ్యుముఖము;
సకలదిక్పాలకసమితికి నెవ్వాని-
 బాహుదండంబులు పట్టుఁగొమ్మ;
లాశ్రితశ్రేణి కే యధిపుని పాదరా-
 జీవయుగ్మంబులు చేరుగడలు;

1-258.1-ఆ.

భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ
డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర
రాజమాన లగుచు రాజమార్గంబున
రాజముఖులు గుసుమరాజిఁ గురియ.

టీక:- కలుములను = సంపదలను; ఈనెడు = ఇచ్చునట్టి; కలకంఠి = మనోహర కంఠధ్వని కలిగిన; ఎలనాఁగ = యౌవనము కల స్త్రీ, లక్ష్మి; వర్తించు = వసించును; ఎవ్వాని = ఎవని; వక్షము = వక్షస్థలము; అందున్ = అందు; జన = ప్రజల; దృక్ = చూపులు అనే; చకోరక = చకోర పక్షుల; సంఘంబున్ = సమూహము; కున్ = నకు; సుధా = వెన్నెల; పానీయ = తాగు; పాత్రము = పాత్ర; ఏ = ఏ; భవ్యు = శుభాకారుని; ముఖము = ముఖము; సకల = సమస్త; దిక్ = దిక్కులను; పాలక = పాలించువారి; సమితి = సమూహము; కిన్ = నకు; ఎవ్వాని = ఎవని; బాహు = భుజముల; దండంబులు = దండములు; పట్టుఁగొమ్మలు = ఆధారభూతములు; ఆశ్రిత = ఆశ్రయించిన; శ్రేణి = సమూహము; కిన్ = నకు; ఏ = ఏ; అధిపుని = అధికుని; పాద = పాదము లనే; రాజీవ = పద్మముల; యుగ్మంబులు = జంటలు; చేరు = గమ్య; గడలు = స్థానములు;

భువన = లోకములకే (కును); మోహనుండు = అందగాడు, మోహింప చేయువాడు; పురుష = పురుషు లలో; భూషణుఁడు = అలంకారము; ఎవ్వఁడు = ఎవడు; అట్టి = అటువంటి; కృష్ణుఁడు = హరి; అరిగెన్ = వెళ్ళెను; హర్మ్య = మేడల; శిఖర = పైభాగములందు – డాబాలపై; రాజమానలు = ప్రకాశించువారు; అగుచు = అవుతు; రాజ = ముఖ్యమైన; మార్గంబున = మార్గములో; రాజముఖులు = చంద్రముఖులు, స్త్రీలు; కుసుమ = పుష్పముల; రాజిన్ = రేఖలు; కురియన్ = కురిపిస్తుండగా.

భావము:- ఏ మహానుభావుని వక్షస్థలంలో సిరిసంపదలు కురిసే నారీ శిరోమణి శ్రీదేవి నర్తిస్తూ ఉంటుందో, ఏ మహాత్ముని పావనవదనం ప్రేక్షకుల నయనచకోరాలకు అమృతం చిందే వెన్నెల పాత్రమో, ఏ మహనీయుని భుజాదండాలు సర్వదిక్పాలకులకు పట్టుకొమ్మలో, ఏ మహితాత్ముని పాదపద్మాలు ఆశ్రితులకు అండదండలో, ఏ మహాపురుషుడు భువనమోహనుడో అట్టి పురుషోత్తముడు, శ్రీకృష్ణుడు, సౌధశిఖరాలపై విరాజిల్లే రాజీవలోచనలు కుసుమరాజి కురిపించగా రాజమార్గంలో వెళ్లసాగాడు.

## 1-259-ఉ.

**★జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ, జామరం**
**బులతోఁ, బుష్ప పిశంగ చేలములతో, భూషామణిస్ఫీతుఁ డై**
**నలినీభాంధవుతో, శశిధ్వజముతో, నక్షత్రసంఘంబుతో,**
**బలభిచ్చాపముతోఁ, దటిల్లతికతో, భాసిల్లు మేఘాకృతిన్.**

టీక:- జలజాతాక్షుడు = కృష్ణుడు {జలజాతాక్షుడు – జలజాత (పద్మములవంటి) అక్షుడు, కృష్ణుడు}; చూడన్ = చూచుటకు; ఒప్పె = చక్కగా ఉన్నాడు; ధవళత్ = తెల్లని; ఛత్రంబు = గొడుగుల; తోన్ = తో; చామరంబుల = చామరముల; తోన్ = తో; పుష్ప = పుష్పములతో; పిశంగ = కపిలవర్ణము గల; చేలముల = వస్త్రముల; తోన్ = తో; భూషా = భూషణములలోని; మణి = మణులు; స్ఫీతుఁడు = అధికముగా కలవాడు; ఐ = అయి; నలినీభాంధవు = పద్మముల బంధువు, సూర్యుని; తోన్ = తో; శశిధ్వజము = చంద్రుని (కుందేలు గుర్తుగల వాడు, చంద్రుడు); తోన్ = తో; నక్షత్ర = తారకల; సంఘంబు = సమూహము తోన్ = తో; బలభిచ్చాపము = ఇంద్రధనుస్సు; తోన్ = తో; తటిల్లతిక = మెరుపుల; తోన్ = తో; భాసిల్లు = ప్రకాశించు; మేఘ = మేఘము యొక్క; ఆకృతిన్ = ఆకృతితో.

భావము:- ఆ కమలనేత్రుడు శ్యామసుందరుడు శ్వేతఛత్రం అనే సూర్యునితో, చామరా లనే చంద్రునితో, పూలనే నక్షత్రాల సమూహంతో, కపిలవర్ణము గల అంబరాలనే ఇంద్రధనుస్సుతో, భూషణాలలోని మణుల కాంతులనే మెరుపు తీగలతో భాసిల్లే మేఘంలా ప్రకాశిస్తున్నాడు.

## 1-260-వ.

**ఇట్లరిగి తల్లిదండ్రుల నివాసంబుసొచ్చి దేవకీ ప్రముఖులయిన తల్లులకేడ్వురకు మ్రొక్కిన.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; అరిగి = వెళ్ళి; తల్లిదండ్రుల = తల్లిదండ్రుల; నివాసంబు = గృహము; చొచ్చి = ప్రవేశించి; దేవకీ = దేవకీదేవి; ప్రముఖులు = మొదలగు ప్రముఖులు; అయిన = అయినట్టి; తల్లుల = తల్లులకు; ఏడ్వురు = ఏడుగురు {వసుదేవుని భార్యలు - ఏడుగురు}; కున్ = కు; మ్రొక్కిన = నమస్కరించిన.

భావము:- శ్రీకృష్ణుడు జననీజనకుల సౌధానికి వెళ్లాడు. దేవకి మొదలైన తల్లులు ఏడుగురకు నమస్కరించాడు.

★1-261-క.

బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు
జడ్డన నంకముల నునిచి చన్నుల తుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున
జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా!

టీక:- బిడ్డఁడు = కుమారుడు; మ్రొక్కినన్ = నమస్కరింపగ; తల్లులు = తల్లులు; జడ్డనన్ = తటాలున; అంకములన్ = తొడలపై; ఉనిచి = ఉంచుకొని; చన్నుల = చన్నుల; తుదిన్ = మొనలలో; పాలు = క్షీరము; ఒడ్డగిలన్ = పొంగి రాగా; ప్రేమ = ప్రేమ యొక్క; భరమునన్ = భారము వలన; జడ్డువడన్ = ఆశ్చర్యకరముగ; తడిపిరి = చెమ్మగిల చేసిరి; అక్షిజలములన్ = కన్నీటితో; అనఘా = పాపము లేని వాడా.

భావము:- చాలా రోజుల తరువాత శ్రీకృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చి నమస్కరించగా, అతని తల్లులు అందరు బిడ్డడిమీది బద్దానురాగంతో చటుక్కున తమ తొడలపై కూర్చుండ బెట్టుకున్నారు. ఆపేక్షతో పొంగిపొర్లి చన్నులు చేపుతుండగా, తమ కన్నీటితో అతనిని అభిషేకించారు.

## కృష్ణుడు భామల జూడబోవుట

1-262-వ.

తదనంతరంబ యష్టోత్తర శత షోడశసహస్ర సౌవర్ణసౌధకాంతం బయిన శుద్ధాంతభవనంబు సొచ్చి హరి తన మనంబున.

టీక:- తదనంతరంబ = ఆ తరువాత; అష్టోత్తరశతషోడశసహస్ర = పదహారు వేలనూట ఎనిమిది, సహస్ర +షోడశ +శత +అష్ట ★; సౌవర్ణ = బంగారు; సౌధ = మేడలలో; కాంతంబు = కాంతలున్నవి, భార్యలు ఉన్నవి; అయిన = అయినట్టి; శుద్ధాంత = అంతఃపుర; భవనంబు = భవనములు; చొచ్చి = ప్రవేశించి; హరి = కృష్ణుడు; తన = తనయొక్క; మనంబున = మనసులో.

భావము:- పిమ్మట గోవిందుడు పదహారువేల నూటయెనిమిది స్వర్ణ సౌధాలతో కూడిన అంతఃపుర ప్రాంగణంలోకి ప్రవేశిస్తూ ఇలా అనుకొన్నాడు.

1-263-మ.

ఒక భామాభవనంబు మున్నుసొర వేఱొక్కర్తు లోఁగుందునో
సుకరాలాపము లాడదో సొలయునో సుప్రీతి వీక్షింపదో
వికలత్వంబున నుండునో యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా!

టీక:- ఒక = ఒక; భామా = భార్య యొక్క; భవనంబు = భవనము; మున్ను = ముందుగ; చొరన్ = చేరితే; వేఱొకర్తు = ఇంకొకామె; లోన్ = మనసులో; కుందునో = క్రుంగునేమో; సుకర = సుఖకరములైన; ఆలాపములు = మాటలు; ఆడదో = పలుకదేమో; సొలయునో = వైముఖ్యమును పొందునేమో; సుప్రీతిన్ = బాగా ప్రేమతో; వీక్షింపదో = చూడదేమో; వికలత్వంబునన్ = చెదిరినమనసుతో; ఉండునో = ఉండునేమో; అనుచున్ = అనుకొనుచు; ఆ = ఆ; వేళన్ = సమయములో; వధూ = భార్యల; గేహముల్ = గృహములు; ప్రకట = ప్రకటింపబడిన; ఆశ్చర్య = ఆశ్చర్యకరమైన; విభూతిన్ = వైభవముతో; చొచ్చె = ప్రవేశించెను; బహు = అనేకములైన; రూప = రూపములతో; వ్యక్తుఁడు = వ్యక్తమైనవాడు, కనిపించినవాడు; ఐ = అయి; భార్గవా = శౌనకా {భార్గవ – భృగు వంశమున జన్మించినవాడు, శౌనకుడు}.

భావము:-భృగువంశోద్భవుడవైన శౌనకా! ముందుగా ఒక సతి మందిరానికి వెళ్తే వేరొకామె కుందుతుందేమో; తొందరపాటుతో సరిగా మాట్లాడదేమో; సొక్కిపోతుందేమో; ప్రేమతో వీక్షించదేమో; వైకల్యం వహిస్తుందేమో అని అందరు భార్యల గృహాలలోకి అన్ని రూపాలు ధరించి అత్యద్భుతమైన మహిమతో ఒకేమారు ప్రవేశించాడు.

1-264-వ.

ఆ సమయంబున.

టీక:- ఆ = ఆ; సమయంబున = సమయమున.

భావము:- ఆవిధంగా వచ్చిన తమ హృదయేశ్వరుడైన నందనందనుణ్ణి చూసి.

1-265-క.

శిశువులఁ జంకలనిడి తను
కృశతలు విరహాగ్నిఁ దెలుప గృహగేహళులన్
రశనలు జాఱఁగ సిగ్గున
శశిముఖు లెదురేఁగి రపుడు జలజాక్షునకున్.

టీక:- శిశువులన్ = పిల్లలను; చంకలన్ = చంకలో; ఇడి = ఉంచి, ఎత్తుకొని; తను = శరీరము; కృశతలు = చిక్కిపోవుటలు; విరహ = ఎడబాటు అనే; అగ్నిన్ = అగ్నిని; తెలుప = తెలుపుతుండగ; గృహ = ఇంటి; గేహళులన్ = గుమ్మములలో; రశనలు = మొలనూళ్ళు; జాఱఁగ = జారిపోతుండగ; సిగ్గున = లజ్జవలన;

శశిముఖులు = స్త్రీలు {శశిముఖులు - (కుందేలు కలవాడు) చంద్రునివంటి ముఖము కలవారు, స్త్రీలు}; ఎదుర = ఎదురుగ; ఏఁగిరి = వెళ్ళిరి; అపుడు = ఆ సమయమున; జలజాక్షున్ = కృష్ణుని {జలజాక్షుడు - (నీట పుట్టిన) పద్మములవంటి కన్నులు ఉన్నవాడు, కృష్ణుడు}; కున్ = కి.

భావము:- ఆ చంద్రముఖు లందరు చంటిబిడ్డలను చంకలలో ఎత్తుకొని, విరహతాపంవల్ల చిక్కిపోయిన శరీరాలతో, దిగ్గున లేచి కాంచీకలాపాలు జారిపోగా సిగ్గుతో యదుచంద్రునికి ఎదురువచ్చారు.

★1-266-మ.

"పతి నా యింటికి మున్ను వచ్చె నిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహా
గతుఁడయ్యెన్ మును సేరెఁ బో తొలుత మత్కాంతుండు నా శాలకే
నితరాలభ్య సుఖంబు గంటి" నని తారింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁబదారువేలు నెనమం డ్రవ్వేళ నాత్మేశ్వరున్.

టీక:- పతి = భర్త; నా = నాయొక్క; ఇంటి = ఇంటి; కిన్ = కి; మున్ను = ముందు; వచ్చెన్ = వచ్చెను; ఇదె = ఇదిగో; నా = నాయొక్క; ప్రాణేశుఁడు = భర్త {ప్రాణేశుడు - ప్రాణములకు ఈశ్వరుడు, భర్త}; అస్మత్ = మాయొక్క; గృహా = ఇంటికి; ఆగతుఁడు = వచ్చినవాడు; అయ్యెన్ = ఆయెను; మును = ముందుగ; సేరెన్ = చేరెను; పో = కదా; తొలుత = ముందు; మత్ = నాయొక్క; కాంతుండు = ప్రియుడు; నా = నాయొక్క; శాల = ఇంటి; కిన్ = కి; ఏన్ = నేను; ఇతర = ఇంకొక విధమున; అలభ్య = లభ్యము కానట్టి; సుఖంబున్ = సుఖమును; కంటిని = చూసితిని; అని = అని; తారు = తాము; ఇంటింటన్ = అన్ని ఇళ్ళలోను; అర్చించిరి = పూజించిరి; ఆ = ఆ; అతివల్ = స్త్రీలు; నూఱుఁ బదారువేలు నెనమండ్రు = నూటపదహారువేల ఎనమిదిమంది, నూఱు + పదారు ★ వేలు + ఎనమండ్రు; ఆ = ఆ; వేళన్ = సమయములో; ఆత్మ = తమ; ఈశ్వరున్ = భర్తను.

భావము:- పదహారువేల నూట యెనిమిదిమంది రమణీమణులు"యిదుగో నా భర్త తొట్టతొలుత నా యింటికే వచ్చాడు. నా మనోనాథుడు ముందుగా నా గృహంలోనే అడుగుపెట్టాడు. నా ప్రాణేశ్వరుడు నా మందిరానికే ముందుగా చేరాడు. అనన్య సామాన్యమైన ఆనందాన్ని నేనే పొందాను" అనుకొంటూ ఇంటింటా తమ ఆత్మేశ్వరుణ్ణి అర్చించారు.

1-267-వ.

వారలం జూచి హరి యిట్లనియె.

టీక:- వారలన్ = వారిని; చూచి = చూసి; హరి = హరి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఆ శుభ సమయంలో ప్రేమాస్పదుడైన శ్రీకృష్ణుడు ఆ కామినీమణులను ఇలా క్షేమసమాచారాలు అడిగాడు.

1-268-మ.

"కొడుకుల్ భక్తివిధేయు లౌదురు గదా? కోడండ్రు మీ వాక్యముల్
గడవంజాలక యుందురా? విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థ రస సందోహంబులుం జాలునా?
కడమల్ గావు గదా? భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే?

టీక:- కొడుకుల్ = కొడుకులు; భక్తి = భక్తితో; విధేయులు = లొంగినవారు; ఔదురు = అవుతారు; కదా = కదా; కోడండ్రు = కోడళ్ళు; మీ = మీ యొక్క; వాక్యముల్ = మాటలు; గడవన్ = దాటుటకు; చాలక = సరిపోకుండగ; ఉందురా = ఉంటారా; విబుధ = పండితులకు; సత్కారంబున్ = మర్యాదలు; కావింతురా = చేయుదురా; తొడవుల్ = ఆభరణములు; వస్త్రములున్ = బట్టలు; పదార్థ = పదార్థములు; రస = రసముల; సందోహంబులున్ = సమూహములు; చాలునా = సరిపోవుచున్నవా; కడమల్ = కొరతలు; కావున్ = కలుగుట లేదు; కదా; భవత్ = మీయొక్క; నిలయముల్ = ఇండ్లలో; కల్యాణ = శుభములు; యుక్తంబులే = కూడినవేనా.

భావము:- "మీ కొడుకులు వినయవినమ్రులై మీ ఆజ్ఞలను పాలిస్తున్నారా; మీ కోడళ్లు మీ మాటలు జవదాటకుండ ఉన్నారా; బాగా చదువుకున్న విద్వాంసు లరుదెంచి నప్పుడు సత్కారాలు చేస్తున్నారా; నగలు, చీరలు, రసవంతాలైన మధర పదార్థాలు సమస్తం సమృద్ధిగా ఉన్నాయా; మీకు ఎట్టి లోటూ వాటిల్లటం లేదు కదా.

★1-269-సీ.

తిలక మేటికి లేదు తిలకనీతిలకమ!-
 పువ్వులు దుఱుమవా పువ్వుఁబోఁడి!
కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి!-
 తొడవులు దొడవవా తొడవుతొడవ!
కలహంసఁ బెంపుదే కలహంసగామిని!-
 కీరముఁ జదివింతె కీరవాణి!
లతలఁ బోషింతువా లతికాలలిత దేహ!-
 సరసి నోలాడుదే సరసిజాక్షి!

1-269.1-ఆ.

మృగికి మేఁత లిడుదె మృగశాబలోచన!

గురుల నాదరింతె గురువివేక!

బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి!

యనుచు సతులనడిగెనచ్యుతుండు."

టీక:- తిలకము = నుదిటి బొట్టు; ఏటి = ఎందుల; కిన్ = కు; లేదు = లేదు; తిలకనీ = తిలకము ధరించువారిలో, స్త్రీలలో; తిలకమా = గౌరవింపదగినదానా; పువ్వులున్ = పువ్వులను; తుఱుమవా = ధరింపవా; పువ్వున్ = పువ్వులవంటి; బోఁడి = శరీరము కలదానా; కస్తూరి = కస్తూరి అనే శ్రేష్ఠ మైన సుగంధం; అలఁదవా = రాయవా; కస్తూరికా = కస్తూరివంటి; గంధి = వాసన కలదానా; తొడవులు = ఆభరణములు; తొడవవా = ధరింపవా; తొడవు = ఆభరణములకే; తొడవ = ఆభరణమా; కలహంసన్ = (మధుర కంఠధ్వని) కలహంసలను; పెంపుదే = పెంచుతున్నావా; కలహంస = చక్కటిహంస; గామిని = నడక కలదానా; కీరమున్ = చిలుకలకు; చదివింతె = మాటలు చెప్పుతావా; కీర = చిలుకపలుకుల వంటి; వాణి = కంఠము కలదానా; లతలన్ = లతలను; పోషింతువా = పెంచుతావా; లతికా = పూలతీగవలె; లలిత = సుకుమార; దేహ = దేహము కలదానా; సరసిన్ = కొలనులో; ఓలాడుదే = జలకాలాడుదే; సరసిజ = పద్మముల వంటి; అక్షి = కన్నులు ఉన్నదానా;

మృగి = లేడి; కిన్ = కి; మేఁతల్ = గడ్డి, మేతలు; ఇడుదె = ఇచ్చెదవా; మృగ = లేడి; శాబ = పిల్లకి వంటి; లోచన = కన్నులు ఉన్నదానా; గురులన్ = గురువులను, పెద్దలను; ఆదరింతె = ఆదరించెదవా; గురు = గొప్ప; వివేక = వివేకము కలదానా; బంధుజనులన్ = బంధువులను; ప్రోతె = రక్షింతువా; బంధు = బంధువులకు; చింత = తలచినవి; ఆమణి = ఇచ్చుదానా; అనుచున్ = అంటూ; సతులన్ = భార్యలను; అడిగెన్ = అడిగెను; అచ్యుతుండు = కృష్ణుడు {అచ్యుతుడు - నాశము లేని వాడు, విష్ణువు}.

భావము:- నుదుటికి బొట్టంత ఉన్నతురాలా! నుదట బొట్టెందుకు పెట్టుకోలేదు? పువ్వులాంటి మృదువైన మోహనాంగి! తలలో పూలు పెట్టుకోవా? కస్తూరి పరిమాళాలు వెదజల్లే కాంతా! కస్తూరి రాసుకోవా? అలంకారాలకే అందాన్నిచ్చే అందగత్తె! ఆభరణాలు అలంకరించుకోవా? హంసనడకల చిన్నదాని! కలహంసలని పెంచుతున్నావా? చిలుకపలుకుల చిన్నారి! చిలుకలకి పలుకులు నేర్పుతున్నావా లేదా? పూతీగె అంతటి సుకుమారమైన సుకుమారి! పూలమొక్కలు పెంచుతున్నావా? పద్మాక్షి! కొలనులలో ఈతలుకొడుతున్నావు కదా? లేడికన్నుల లేమ! లేడికూనలకి మేత మేపుతున్నావు కదా? మహా వివేకవంతురాలా! పెద్దలను చక్కగా గౌరవిస్తున్నావు కదా? బందుప్రేమకి పేరుపొందిన పడతీ! బంధువుల నందరిని ఆదరిస్తున్నావు కదా?" అంటూ ప్రియకాంతల నందరినీ పరామర్శించాడు.

1-270-వ.

అని యడిగిన వారలు హరిం బాసిన దినంబు లందు శరీరసంస్కార కేళీవిహార హాస వనమందిరగమన మహోత్సవదర్శనంబు లొల్లని యిల్లాండ్రు కావున.

టీక:- అని = ఆ విధముగా; అడిగినన్ = అడుగగా; వారలు = వారు; హరిన్ = కృష్ణుని; పాసిన = ఎడబాటు చెందిన; దినంబులు = రోజులు; అందున్ = లో; శరీర = శరీరములను; సంస్కార = చక్కదిద్దు కొనుటలు; కేళీ = సరదాలకి; విహార = విహరించుటలు; హాస = నవ్వుటలు; వన = వనములకు; మందిర = మందిరములకు; గమన = వెళ్ళుటలు; మహోత్సవ = మహోత్సవములను; దర్శనంబులు = చూడబోవుటలు; ఒల్లని = అంగీకరింపని; ఇల్లాండ్రు = భార్యలు; కావున = అగుట మూలమున.

భావము:- ఆ కాంత లంతా తమ కాంతుడు ద్వారకలో లేని దినాలలో శరీర సంస్కారాలు, లీలా విలాసాలు, పరిహాస భాషణాలు, ఉద్యాన విహారాలు, ఆలయ గమనాలు, మహోత్సవ సందర్శనాలు ఇష్టపడని ఇల్లాండ్రు. అందువల్ల వారు.

1-271-మ.

సిరి చాంచల్యముతోడిదయ్యుఁ దనకున్ జీవేశ్వరుం డంచు నే
పురుషశ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులం
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణబాష్పంబు లా
భరణశ్రేణులుగాఁ బ్రతిక్షణ నవప్రాప్తానురాగంబులన్.

టీక:- సిరి = లక్ష్మి; చాంచల్యము = చంచలత్వము; తోడిది = కూడినది; అయ్యున్ = అయినప్పటికి; తన = తన; కున్ = కు; జీవేశ్వరుండు = భర్త, జీవమునకు ఈశ్వరుడు; అంచున్ = అనుచు; ఏ = ఏ; పురుషశ్రేష్ఠున్ = కృష్ణుని {పురుషశ్రేష్ఠుడు - పురుషులలో శ్రేష్ఠుడు, విష్ణువు}; వరించెన్ = వరించెను; అట్టి = అటువంటి; పరమున్ = అందరికన్న పైన ఉన్నవానిని; బుద్ధిన్ = బుద్ధిశాలిని; విలోకంబులన్ = చూపులతో; కర = చేతుల; యుగ్మంబులన్ = జంటలతో; కౌఁగిలించిరి = ఆలింనగనము చేసిరి; సతుల్ = సత్ప్రవర్తన కల స్త్రీలు; కల్యాణ = ఆనందపు; బాష్పంబులు = కన్నీళ్ళు; ఆభరణ = ఆభరణముల; శ్రేణులుగాన్ = వరుసలుగా; ప్రతిక్షణ = క్షణక్షణము; నవ = కొత్తగా; ప్రాప్త = పొందబడిన; అనురాగంబులన్ = అనురాగములతో.

భావము:- తన జీవితేశ్వరుడని ఏ పురుషోత్తముణ్ణి వరించి, చంచల స్వాభావం కలదైన శ్రీదేవి ఒక్క క్షణం కూడ వదలిపెట్టకుండా ఉందో, అటువంటి పరమాత్ముణ్ణి ముందు మనస్సుతో, తరువాత చూపులతో, అటుపిమ్మట చేతులతో ఆనందాతిశయంతో కనుల వెంట ద్రవించే కల్యాణ బాష్పాలు అణిముత్యాల సరాలుగా జాలువారుతుండగ, క్షణక్షణం క్రొత్తదనంతో కూడిన అనురాగంతో గట్టిగా కౌగిలించుకొన్నారు.

★1-272-మత్త.

పంచబాణుని నీఱు సేసిన భర్గునిం దన విల్లు వ
ల్గించి మూర్ఛలఁ జేయఁ జాలు విశేష హాస విలోక నో
దంచి దాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవున్
సంచలింపఁగఁ జేయ నేమియుఁ జాలరైరి బుధోత్తమా!

టీక:- పంచబాణుని = మన్మథుని {పంచబాణుడు – ఐదు బాణముల వాడు, మన్మథుడు}; నీఱు = భస్మము; సేసిన = చేసిన; భర్గునిన్ = శివుని; తన = తనయొక్క; విల్లు = ధనస్సు; వర్జించి = వదిలివేసి; మూర్ఛిల్లన్ = మూర్ఛ పోవునట్లు; చేయన్ = చేయుటకు; చాలు = సరిపడ; విశేష = విశిష్టమైన; హాస = నవ్వులు; విలోకన = చూపులు; ఉదంచిత = మిక్కిలి శోభ కలిగిన; ఆకృతులు = ఆకారములు కలవారు; అయ్యున్ = అయినప్పటికిని; కాంతలు = స్త్రీలు; దంభ = కపట; చేష్టలన్ = చేష్టలతో; మాధవున్ = కృష్ణుని {మాధవుడు – మాధవి భర్త, కృష్ణుడు}; సంచలింపఁగన్ = మనసుని చలింపగా; చేయన్ = చేయుటకు; ఏమియున్ = ఏమాత్రము; చాలరు = చాలని వారు; ఐరి = అయిరి; బుధోత్తమా = జ్ఞానులలో శ్రేష్ఠుడా, శౌనకుడా.

భావము:- ఓ సుధీసత్తమా! మన్మథుడిని మూడోకంటి మంటతో నుసి చేసిన మహేశ్వరుని సైతం విల్లు పడేసి మూర్ఛపోయేలా చేసే చిరునవ్వులు, వాల్చూపులు, మనోహర మైన దేహాలు కల వాళ్ళు అయి కూడ ఆ కాంతలు తమ శృంగార చేష్టలతో మాధవుని మనస్సు చలింప చేయ లేకపోయారు.

### 1-273-వ.

**ఇవ్విధంబున సంగవిరహితుం డైన కంసారి సంసారికైవడి విహరింప నజ్ఞాన విలోకులయిన లోకులు లోక సామాన్య మనుష్యుం డని తలంతు; రాత్మాశ్రయయైన బుద్ధి యాత్మ యందున్న యానందాదుల తోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతి తోడం గూడియు నా ప్రకృతి గుణంబు లైన సుఖదుఃఖంబులఁ జెందక యుండుఁ; బరస్పరసంఘర్షణంబులచే వేణువులవలనవహ్నిఁబుట్టించి వనంబుల దహించు మహావాయువుచందంబున భూమికి భారహేతువులై యనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజుల కన్యోన్యవైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబుసేసి, శాంతుండై పిదపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుండునుం బోలె సంచరించుచుండె నా సమయంబున.**

టీక:- ఈ = ఈ; విధంబున = విధముగ; సంగ = సంబంధము, బంధనములు; విరహితుండు = లేనివాడు; ఐన = అయినట్టి; కంసారి = కృష్ణుడు {కంసారి – కంసునకు శత్రువు, కృష్ణుడు}; సంసారి = సంసార బంధములు ఉన్నవాని; కైవడి = వలె; విహరింపన్ = చరించుచుండగ; అజ్ఞాన = అజ్ఞానముతోకూడిన; విలోకులు = దృష్టికలవారు; అయిన = అయినట్టి; లోకులు = ప్రజలు; లోక = లోకములో; సామాన్య = సామాన్యముగా ఉండు; మనుష్యుండు = మానవుడు; అని = అని; తలంతురు = అనుకొందురు; ఆత్మా = ఆత్మను; ఆశ్రయ = ఆశ్రయించినది; ఐన = అయినట్టి; బుద్ధి = బుద్ధి; ఆత్మ = ఆత్మ; అందున్ = లో; ఉన్న = ఉన్నట్టి; ఆనంద = ఆనందము; అదులు = మొదలగువాటి; తోడన్ = తో; కూడని = కూడకుండగా ఉండు; తెఱంగునన్ = విధముగ; ఈశ్వరుండు = హరి; ప్రకృతి = ప్రకృతి; తోడన్ = తో; కూడియున్ = కూడి ఉన్నప్పటికిని; ఆ = ఆ; ప్రకృతి = ప్రకృతి యొక్క; గుణంబులు = గుణములు; ఐన = అయినట్టి; సుఖ = సుఖములను; దుఃఖంబులన్ = దుఃఖములను; చెందక = సంబంధము

లేక; ఉండున్ = ఉండును; పరస్పర = ఒకదానికొకటి; సంఘర్షణంబుల = రాసుకొనుట, ఒరసికొనుట; చేన్ = చేత; వేణువుల = వెదుళ్ళు; వలనన్ = వలన; వహ్నిన్ = అగ్నిని; పుట్టించి = పుట్టించి; వనంబులన్ = అడవులను; దహించు = కాల్చివేయు; మహా = గొప్ప; వాయువు = గాలి; చందంబున = వలె; భూమి = భూమండలము; కిన్ = నకు; భార = బరువు పెరుగుటకు; హేతువులు = కారణములు; ఐ = అయి; అనేక = లెక్కకుమించిన; అక్షౌహిణులు = అక్షౌహిణులు; తోడన్ = తో; ప్రవృద్ధ = బాగుగా పెరిగిన; తేజులు = తేజస్సుకలవారు; అగు = అయిన; రాజులు = రాజులు; కున్ = కి; అన్యోన్య = వారిలోవారికి; వైరంబులు = శత్రుత్వములు; కల్పించి = కలుగజేసి; నిరాయుధుండు = ఆయుధములు లేనివాడు; ఐ = అయి; సంహారంబున్ = సంహారమును; చేసి = చేసి; శాంతుండు = శాంతిపొందినవాడు; ఐ = అయి; పిదపన్ = తరువాత; కాంతా = స్త్రీల; మధ్యంబునన్ = మధ్యలో; ప్రాకృత = సామాన్య; మనుష్యుండునున్ = మానవుని; పోలెన్ = వలె; సంచరించుచు = తిరుగుతూ; ఉండెన్ = ఉండెను; ఆ = ఆ; సమయంబునన్ = సమయములో.

భావము:- ఈ విధంగా సర్వసంగ పరిత్యాగియైన కంసారి, సంసారిలాగా విహరించటం చూసి, మూర్ఖులైన లోకులు సామాన్య మానవునిగా భావిస్తారు. ఆత్మాశ్రయమైన బుద్ధి ఆత్మగతమైన గుణాలతో కలవని విధంగా పరమేశ్వరుడు ప్రకృతితో కలిసి ఉండి కూడా ఆ ప్రకృతిగుణాలైన సుఖదుఃఖాలను పొందకుండా ఉంటాడు. వెదురు గడలకు పరస్పరం సంఘర్షణ కలిగించి. అగ్ని పుట్టించి. అరణ్యాలను దహించే మహాప్రభంజనం వలె వాసుదేవుడు, అనేక అక్షౌహిణీ సైన్యాలతో భూమికి బరువుచే టైన, ప్రవృద్ధ తేజులైన రాజులకు అన్యోన్యకలహాలు కల్పించి తాను మాత్రం ఆయుధం పట్టకుండా దుష్టసంహారం చేయించి పరమశాంతుడై ఇప్పుడు అంతఃపురాలలో కాంతాజనము మధ్యలో సామాన్య మానవుని వలె సంచరిస్తున్నాడు.

★1-274-క.

యతు లీశ్వరుని మహత్త్వము
మిత మెఱుఁగని భంగిఁ నప్రమేయుఁడగు హరి
స్థితి నెఱుఁగక కాముకుఁ డని
రతములు సలుపుదురు తిగిచి రమణులు సుమతీ!

టీక:- యతులు = ఇంద్రియములను నియమించినవారు; ఈశ్వరుని = కృష్ణుని; మహత్త్వము = గొప్పదనము యొక్క; మితమున్ = పరిమాణమును, హద్దులను; ఎఱుఁగని = తెలిసికొనలేని; భంగిన్ = విధముగ; అప్రమేయుఁడు = మితము లేనివాడు; అగు = అయినట్టి; హరి = కృష్ణుని; స్థితిన్ = స్థితిని; ఎఱుఁగక = తెలిసికొనలేక; కాముకుఁడు = కామ ప్రకోపముతో నుండువాడు; అని = అని; రతములు = సురతములు; సలుపుదురు = చేయుదురు; తిగిచి = ఆకర్షించి; రమణులు = స్త్రీలు; సుమతీ = మంచి బుద్ధి కలవాడా.

భావము:- ఓ బుద్ధిమంతుడైన శౌనకా! తపోనియతులైన యతులు పరమేశ్వరుని ప్రభావం ఇదమిత్థమని ఎరుగని విధంగా అప్రమేయుడైన వాసుదేవుని మహత్వాన్ని గుర్తించకుండా కాముకుడనే భావంతో రమణులందరూ ఆ రమారమణునితో క్రీడించారు.

★1-275-క.

"ఎల్లప్పుడు మా యిండ్లను
వల్లభుఁడు వసించు; నేమ వల్లభలము శ్రీ
వల్లభున" కనుచు గోపీ
వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా!"

టీక:- ఎల్లప్పుడు = ఎప్పుడు; మా = మా యొక్క; ఇండ్లను = ఇండ్ల యందే; వల్లభుఁడు = భర్త; వసించు = ఉండును; నేమ = మేమే; వల్లభలము = ప్రియ మైన వారము; శ్రీవల్లభు = కృష్ణున {శ్రీవల్లభుడు - లక్ష్మీపతి, విష్ణువు}; కున్ = కు; అనుచున్ = అంటూ; గోపీవల్లభు = కృష్ణుడు {గోపీవల్లభుడు - గోపికలకు ప్రియుడు, కృష్ణుడు}; చేన్ = చేత; సతులు = భార్యలు; మమత = మమకార మనెడి; వలన్ = వలలో; పడిరి = తగలు కొనిరి; అనఘా = పాపము లేనివాడా.

భావము:- పుణ్యవంతుడైన శౌనక! మా వల్లభుడు మా గృహాలను ఎప్పుడు వదలిపెట్టడు, రమావల్లభు డైన యదువల్లభునకు మేమే ప్రియమైన వారమని భావిస్తు ఆ భామ లందరు యశోదానందనుని వలపుల వలలో చిక్కుకొన్నారు."

1-276-వ.

అని చెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె.

టీక:- అని = అని; చెప్పిన = చెప్పగ; విని = వినిన; శౌనకుండు = శౌనకుడు; సూతున = సూతున; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా చెప్పిన సూతుని మాటలు విని శౌనకుడు ఇలా అన్నాడు.

1-277-సీ.

"గురునందనుండు సక్రోధుఁడై యేసిన-
బ్రహ్మశిరోనామబాణవహ్నిఁ
గంపించు నుత్తరగర్భంబు గ్రమ్మఱఁ-
బద్మలోచనుచేతఁ బ్రతికె నండ్రు;
గర్భస్థుఁ డగు బాలుఁ గంసారి యే రీతి-
బ్రతికించె? మృత్యువు భయము వాపి
జనియించి యతఁడెన్ని సంవత్సరములుండె?-
నెబ్భంగి వర్తించె? నేమిసేసె?

1-277.1-ఆ.

వినుము, శుకుఁడు వచ్చి విజ్ఞానపద్ధతి
నతని కెట్లు సూపె నతఁడు పిదపఁ
దన శరీర మే విధంబున వర్జించె
విప్రముఖ్య! నాకు విస్తరింపు."

టీక:- గురు = ద్రోణుని; నందనుండు = కొడుకు, అశ్వత్థామ; సక్రోధుఁడు = క్రోధముతో ఉన్నవాడు; ఐ = అయ్యి; యేసిన = ప్రయోగించిన; బ్రహ్మశిరస్ = బ్రహ్మశిరస్సు అను; నామ = పేరు కల; బాణ = బాణముయొక్క; వహ్నిన్ = అగ్నికి; కంపించు = వణికిపోతున్న; ఉత్తర = ఉత్తరయొక్క; గర్భంబున్ = గర్భమును; క్రమ్మఱన్ = మరల; పద్మలోచను = కృష్ణుని; చేతన్ = వలన; బ్రతికెను = బ్రతికెను; అండ్రు = అందురు; గర్భస్థుఁడు = గర్భములో ఉన్నవాడు; అగు = అయినట్టి; బాలున్ = పిల్లవానిని; కంసారి = కృష్ణుడు; ఏ = ఏ; రీతి = విధముగ; బ్రతికించెన్ = బ్రతికించెను; మృత్యువు = మరణము వలన; భయమున్ = భయమును; వాపి = పోగొట్టి; జనియించి = పుట్టి; అతఁడు = అతడు; ఎన్ని = ఎన్ని; సంవత్సరములు = ఏండ్లు; ఉండెన్ = ఉండెను; ఏ = ఏ; భంగిన్ = విధముగ; వర్తించెన్ = చరించెను; ఏమి = ఏమి; చేసెన్ = చేసెను;

వినుము = వినుము; శుకుఁడు = శుకుడు; వచ్చి = వచ్చి; విజ్ఞాన = విజ్ఞానము యొక్క; పద్ధతిన్ = మార్గమును; అతని = అతని; కిన్ = కి; ఎట్లు = ఎట్లు; సూపె = చూపెను; అతఁడు = అతడు; పిదపన్ = తరువాత; తన = తనయొక్క; శరీరము = శరీరము; ఏ = ఏ; విధంబునన్ = విధముగ; వర్జించెన్ = విడిచిపెట్టెను; విప్ర = బ్రాహ్మణులలో; ముఖ్య = ముఖ్యుడా; నాకు = నాకు; విస్తరింపు = వివరింపుము.

భావము:- "బ్రహ్మణ్యులలో అగ్రగణ్యుడవైన సూతమహర్షీ! అశ్వత్థామ ఆగ్రహావేశంతో ప్రయోగించిన బ్రహ్మశిరోనామకమైన మహాస్త్రం మంటలకు, తపించిపోతున్న ఉత్తర గర్భంలోని పసికందును దేవకీ నందనుడు తిరిగి బ్రతికించాడని విన్నాను. తల్లి గర్భంలో ఉన్న అర్భకుణ్ణి కమలాక్షుడు మృత్యువు బారిపడకుండా ఎలా రక్షించాడు? అలా రక్షింపబడి జన్మించిన ఆ బాలుడు భూమ్మీద ఎన్ని సంవత్సరాలు జీవించాడు? ఏ విధంగా ప్రవర్తించాడు? ఏయే ఘనకార్యాలు చేసాడు? చివరకి తన తనువును ఏ విధంగా త్యజించాడు? ఈ విషయాలన్నీ నాకు వివరించు."

1-278-వ.

అనిన సూతుండిట్లనియె; "ధర్మనందనుండు చతుస్సముద్రముద్రితాఖిల జంబూ ద్వీపరాజ్యంబు నార్జించియు; మిన్నుముట్టిన కీర్తినుపార్జించియు; నంగనా, తురంగ, మాతంగ, సుభట, కాంచ నాది దివ్యసంపదలు సంపాదించియు; వీర సోదర, విప్ర, విద్వజ్జన వినోదంబులఁ బ్రమోదించియు, వైభవంబులలవరించి యుఁ; గ్రతువులాచరించియు; దుష్శిక్షణ శిష్టరక్షణంబులొనరించియు; ముకుంద

చరణార వింద సేవారతుండై సమస్త సంగంబు లందు నభిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి రాజ్యంబు సేయుచు.

టీక:- అనినన్ = అనగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుండు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; చతుస్ = నాలుగు; సముద్ర = సముద్రములచే; ముద్రిత = ఆవరింపబడిన; అఖిల = సమస్తమైన; జంబూ = జంబూ; ద్వీప = ద్వీపపు; రాజ్యంబున్ = రాజ్యమును; ఆర్జించియు = సంపాదించినప్పటికి; మిన్ను = ఆకాశమును; ముట్టిన = అంటిన; కీర్తిన్ = కీర్తిని; ఉపార్జించియు = సముపార్జించినప్పటికిని; అంగనా = స్త్రీలు; తురంగ = గుఱ్ఱములు; మాతంగ = ఏనుగులు; సుభట = మంచి యోధులు; కాంచన = బంగారము; ఆది = మొదలగు; దివ్య = దివ్యమైన; సంపదలు = సంపదలు; సంపాదించియున్ = సంపాదించినప్పటికిని; వీర = వీరులైన; సోదర = సోదరులు; విప్ర = బ్రాహ్మణులు; విద్వత్ = విద్వాంసులైన; జన = జనుల వలన; వినోదంబులన్ = వినోదములతో; ప్రమోదించియున్ = మిక్కిలి సంతోషించినప్పటికిని; వైభవంబులు = వైభవములను; అలవరించియున్ = పొందియున్; క్రతువులు = యజ్ఞములు; ఆచరించియున్ = చేసినప్పటికిని; దుష్ట = దుష్టులను; శిక్షణ = శిక్షించుట; శిష్ట = శిష్టులను; రక్షణంబులు = రక్షించుటలు; ఒనరించియున్ = ఏర్పరిచినప్పటికిని; ముకుంద = హరియొక్క; చరణ = పాదములనే; అరవింద = పద్మముల; సేవా = భక్తిమీద; రతుండు = మిక్కిలి ప్రేమ కలవాడు; ఐ = అయి; సమస్త = సమస్తమైన; సంఘంబులు = సంబంధములు; అందున్ = ఎడల; అభిలాషంబు = కోరికలను; వర్జించి = వదిలి వేసి; అరిషడ్వర్గంబున్ = అరిషడ్వర్గములు {అరిషడ్వర్గములు - కామ క్రోధ లోభ మోహము మద మాత్సర్యములు అను ఆరుగురు శత్రువులు}; జయించి = జయించి; రాజ్యంబున్ = రాజ్యమును; చేయుచున్ = చేయుచు.

భావము:- అప్పుడు సూతుడు ఈ విధంగా చెప్పసాగాడు "ధర్మనందనుడు నాలుగు సముద్రాల నడుమ గల జంబూద్వీప సామ్రాజ్యానికి అధిపతి అయ్యాడు. ఆకాశాన్నంటే అఖండకీర్తిని ఆర్జించాడు. అంగనామణులు, ఉత్తమాశ్వాలు, మత్త మాతంగాలు, సుభట నికాయాలు, సురుచిర సువర్ణాలు మొదలైన అపార సంపదలను సంపాదించాడు. వీరాధివీరులైన తన సోదరులతో, విద్వాంసులైన విప్రవరేణ్యుల విద్యావినోదాలతో ఆనందించాడు. భోగభాగ్యాలను కైవసం చేసుకొన్నాడు. యజ్ఞాలు ఆచరించాడు. దుష్టులను శిక్షించాడు. శిష్టులను రక్షించాడు. గోవింద పాదారవింద సేవారతుడై, సమస్త ఐహిక విషయాల యందు విరక్తుడై, అరిషడ్వర్గాన్ని జయించినవాడై రాజ్యపాలన సాగించాడు.

★1-279-తే.

చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు
దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు
సంపదలు పెక్కుఁ గలిగియుఁ జక్రిపాద
సేవనంబులఁ బరిపూర్తి సెందకుండె.

టీక:- చందన = మంచిగంధం; ఆదులన్ = మొదలగు వాని వలన; ఆఁకటన్ = ఆకలితో; ప్రగ్గువాఁడు = కుంచించుకొనిపోవువాడు; తనివిన్ = సంతృప్తిని; ఒందని = పొందని; కైవడిన్ = విధముగ; ధర్మసుతుఁడు = ధర్మరాజు {ధర్మసుతుఁడు -యమధర్మరాజుపుత్రుడు, ధర్మరాజు}; సంపదలు; పెక్కున్ = చాలా; కలిగియున్ = కలిగి ఉన్నప్ప టికిని; చక్రి = చక్రాయుధుని, హరి{చక్రి – చక్రము ఆయుధముగా గల వాడు, కృష్ణుని }; పాద = పాదములను; సేవనంబులన్ = కొలచుట యందు; పరిపూర్తి = సంతృప్తి; చెందక = చెందకుండగ; ఉండెన్ = ఉండెను.

భావము:- మంచి గంధం లాంటి శృంగార ద్రవ్యాలు ఎన్ని ఉన్నా ఆకలితో అల్లాడే వాడు తిండి కోసం ఎంతో ఆతృతతో ఉంటాడు. కౌరవులను ఓడించి ధర్మరాజు సమస్త రాజ్య సంపదలు పొందాక కూడ, శ్రీకృష్ణ భగవానుని ఎంత సేవిస్తున్నా, ఇంకా సేవించాలని ఎంతో ఆతృత కలిగి ఉన్నాడుట.

1-280-వ.

అంతం గొన్ని దినంబులకు నభిమన్యుకాంతాగర్భంబు నందున్న డింభకుండు దశమమాసపరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణా నలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు.

టీక:- అంతన్ = అంతట; కొన్ని = కొన్ని; దినంబుల = రోజుల; కున్ = కి; అభిమన్యు = అభిమన్యుని {అభిమన్యుకాంత - ఉత్తర}; కాంతా = భార్యయొక్క; గర్భంబున్ = గర్భము; అందున్ = లోపల; ఉన్న = ఉన్నటువంటి; డింభకుండు = పిల్లవాడు; దశమ = పదవ; మాస = నెల; పరిచ్ఛేద్యుండు = దాటినవాడు; ఐ = అయి; గర్భ = గర్భముయొక్క; అంతరాళంబున = లోపల; దురంతంబు = అంతములేనిది; ఐన = అయినట్టి; అశ్వత్థామ = అశ్వత్థామ; బాణ = బాణముయొక్క; అనలంబునన్ = అగ్నివలన; దందహ్యమానుండు = దహింపబడుచున్న వాడు; ఐ = అయి; తల్లడిల్లుచున్ = తల్లడిల్లుతూ.

భావము:- ఇంతలో కొన్నాళ్ళకు, అభిమన్యుని అర్ధాంగి అయిన ఉత్తరకు నవమాసాలు నిండాయి. పదవనెల ప్రవేశించింది. ఇంతలో కడుపులోని శిశువు గురుపుత్రుడు అశ్వత్థామ అస్త్రపు అగ్నిజ్వాలలకు కమిలి, కమిలిపోతూ ఇలా ఆక్రోశించసాగాడు.

## గర్భస్థకుని విష్ణువు రక్షించుట

★1-281-ఉ.

"కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్నవాఁడ ది
క్కెయ్యది దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నే
డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావ నే
యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా!

టీక:- కుయ్యిడన్ = కుయ్ అని ఏడ్చుటకు; శక్తి = నేర్పు; లేదు = లేదు; ఉదర = కడుపులోని; గోళము = పిండము; లోపలన్ = లోపల; ఉన్నవాఁడన్ = ఉన్నవాడిని; దిక్కు = శరణు; ఎయ్యది = ఏది; అనాథను = దిక్కులేని వాడను; అని = అని; ఎప్పుడున్ = ఎప్పుడు; తల్లి = తల్లి; గణింప = ఎంచుతుండగ; విందున్ = వినుచుందును; నేడు = ఈవేళ; ఈ = ఈ; ఇషు = బాణముయొక్క; వహ్నిన్ = అగ్నిని; పాయుట = దూరము చేయుట; కున్ = కు; ఏయ్యది = ఏది; మార్గము = దారి; నన్నున్ = నన్ను; కావన్ = కాపాడుటకు; ఏ = ఏ; అయ్య = మహాత్ముడు; కలండు = ఉన్నాడు; గర్భ = గర్భములో; జనిత = కలుగుతున్న; ఆపదన్ = ప్రమాదమును; ఎవ్వఁడు = ఎవడు; ఎఱుంగున్ = తెలిసికొనగలవాడు; దైవమా = దేవుడా.

భావము:- "ఏడ్వటానికైనా ఓపిక లేదు; తల్లిగర్భంలో తల్లడిల్లుతున్నాను; దిక్కులేని దీనుణ్ణి; అనాథ నంటు అనుక్షణం అమ్మ ఆక్రందించటం ఆలకిస్తుంటాను; ఈ బాణాగ్ని నివారించే ఉపాయం ఏమిటి; ఈ అపాయంనుంచి నన్ను ఆదుకొనే తండ్రి ఎక్కడ ఉన్నాడో; తల్లి గర్భంలో నేను అనుభవించే ఈ వేదన అర్థంచేసుకొనే దైవ మెవ్వరో ఏమిటో? భగవంతుడా! (తల్లి ఉత్తర గర్భంలో అశ్వత్థామ వేసిన బ్రహ్మశిరోనామకాస్త్ర జ్వాలలకు దందహ్యమాను డగుచున్న పరీక్షిత్తు ఇలా రోదిస్తున్నాడు.)

1-282-క.

చిచ్చఱకోలవశంబునఁ

జచ్చి బహిర్గతుఁడఁ గాని సమయమునను దా

నుచ్చలిత గర్భవేదనఁ

జచ్చును మా తల్లి ఘోర సంతాపమునన్.

టీక:- చిచ్చఱ = అగ్నిమయమైన, చిచ్చు+అఱ (ఉకార సంధి); కోల = బాణము; వశంబునన్ = వలన; చచ్చి = చనిపోయి; బహిర్గతుఁడన్ = బయటపడువాడు; కాని = కానట్టి; సమయమునను = సమయములో; తాన్ = తను; ఉచ్చలిత = చెదరిపోయిన; గర్భ = గర్భమువలని; వేదనన్ = బాధతో; చచ్చును = చనిపోవును; మా = మాయొక్క; తల్లి = తల్లి; ఘోర = ఘోరమైన; సంతాపమునన్ = శోకముతో.

భావము:- అయ్యో ఈ చిచ్చులు చిమ్మే భయంకరబాణం వల్ల నేను చచ్చిపోవటం తథ్యం. కడుపులోని మృతశిశువును కనలేక అతిశయించిన గర్భవేదనతో అల్లాడి, అమ్మకూడా మరణించటం తప్పదు.

1-283-క.

చెచ్చెర బాణజ్వాలలు

వచ్చిన విష్ణుండు గావవచ్చు ననుచుఁ దా

ముచ్చటలు సెప్పు సతులకు

నిచ్చలు మాయవ్వ నేఁడు నిజమయ్యెడినో.

టీక:- చెచ్చెర = గబగబా; బాణ = బాణము యొక్క; జ్వాలలు = మంటలు; వచ్చినన్ = వచ్చినచో; విష్ణుండు = హరి; కావన్ = కాపాడుటకు; వచ్చున్ = వచ్చును; అనుచున్ = అంటూ; తాన్ = తను; ముచ్చటలు = కబుర్లు; చెప్పు = చెప్పును; సతులు = చెలికత్తెలు; కున్ = కి; నిచ్చలు = నిత్యమును; మా = మాయొక్క; అవ్వ = తల్లి; నేఁడు = ఈవేళ; నిజము = నిజము; అయ్యెడినో = అవుతుందోలేదో.

భావము:- అమాంతంగా అస్త్ర జ్వాలలు నా పైకి వచ్చి పడినప్పుడు శ్రీహరి కాపాడుటకు వచ్చునని మా అమ్మ అనుదినం అందరితో అంటూ ఉంటుంది. అమ్మ చల్లని మాట యథార్థమౌతుందా?

### 1-284-శా.

### రాఁడా చూడ సమస్తభూతములలో రాజిల్లు వాఁ డిచ్చటన్
### లేఁడా? పాఱుని చిచ్చఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా
### కీఁడా? నేఁ డభయప్రదాన మతఁ డూహింపన్ నతత్రాత మున్
### గాఁడా? యెందఱిఁ గావఁ డీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో?"

టీక:- రాఁడా = రాకపోతాడా; చూడన్ = చూచుటకు, కాపాడుటకు; సమస్త = అన్ని; భూతముల = జీవుల; లోన్ = లోను; రాజిల్లు = ప్రకాశించే; వాఁడు = వాడు; ఇచ్చటన్ = ఇక్కడ; లేఁడా = లేకపోతాడా; పాఱుని = బ్రాహ్మణుని; చిచ్చఱ = అగ్నిమయమైన; అమ్మున్ = బాణమును; తొలఁగన్ = తొలగించుటకు; లీలా = లీలతోకూడిన; గతిన్ = విధముగ; త్రోచి = తోసేసి; నాకు = నాకు; ఈఁడా = ఇవ్వడా; నేఁడు = ఇవాళ; అభయ = అభయమును; ప్రదానము = ప్రసాదించుట; అతఁడు = అతడు; ఊహింపన్ = ఆలోచించిన; నతన్ = మ్రొక్కినవారిని; త్రాత = సంరక్షించువాడు; మున్ = ఇంతకు ముందు; కాఁడా = అయి ఉండడా; ఎందఱిన్ = ఎందరిని; కావఁడు = కాపాడలేదు; ఈ = ఈ; ఎడల = విషయములో; మత్ = నాయొక్క; కర్మంబు = కర్మ; తాన్ = తాను; ఎట్టిదో = ఎలాంటిదో.

భావము:- అఖిల ప్రాణులలో అంతర్యామిగా ప్రకాశించే స్వామి నా కష్టాలు వీక్షించలేడా? నన్ను రక్షించటానికి రాడా? నిప్పులు చెరిగే ఈ బ్రహ్మాస్త్రాన్ని శాంతింపజేయడా? ఆపన్నుడనైన నాకు అభయమీయడా? కాపాడమని కైమోడ్చేవాళ్లను ఎందరినో కనికరించి కాచిన కరుణామయుడు నా మొరలాలించి నన్ను లాలించి పాలించడా? ఏమో నా అదృష్టం ఎలా ఉన్నదో?

### 1-285-వ.

### అని గతాగతప్రాణుండై భ్రూణగతుండైన శిశువు చింతించు సమయంబున.

టీక:- అని = అని; గత = ఉండినది; అగత = ఉండనిది యైన; ప్రాణుండు = ప్రాణము కలవాడు; ఐ = అయి; భ్రూణ = పిండము; గతుండు = వలె ఉన్నవాడు; ఐన = అయినట్టి; శిశువు = పిల్లవాడు; చింతించు = బాధపడుతున్న; సమయంబునన్ = సమయమున.

భావము:- ఇలా వస్తూపోతూ ఉన్న ప్రాణాలతో ఉత్తర కడుపులో పిండ రూపంలో ఉన్న చిన్నారి ఎన్నో విధాల చింతించసాగాడు.

1-286-సీ.

మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగుకైవడి మేని-

పై నున్న పచ్చని పటమువాఁడు;

గండభాగంబులఁ గాంచన మణి మయ-

మకరకుండలకాంతి మలయువాఁడు;

శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి-

కన్నుల నునుఁ గెంపు కలుగువాఁడు;

బాలార్కమండల ప్రతిమాన రత్న హా-

టక విరాజిత కిరీటంబువాఁడు;

1-286.1-తే.

కంకణాంగద వనమాలికా విరాజ

మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ

డొక్క గదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ

విష్ణుఁ డావిర్భవించె నవ్వేళ యందు.

టీక:- మేఘంబు = మేఘము; మీఁది = మీద ఉన్న; క్రొమ్మెఱుఁగు = క్రొత్త మెరుపుతీగ; కైవడిన్ = వలె; మేని = శరీరము; పైన్ = మీద; ఉన్న = ఉన్నట్టి; పచ్చని = పచ్చనిరంగు కల; పటమువాఁడు = వస్త్రము కలవాడు; గండభాగంబులన్ = చెక్కిళ్ళయందు; కాంచన = బంగారపు; మణి = రత్నములు; మయ = తాపింపబడిన; మకర కుండల = మకరకుండలములయొక్క; కాంతి = వెలుగు; మలయువాఁడు = పరచబడినవాడు; శర = బాణముల యొక్క; వహ్నిన్ = అగ్నిని; అడఁగించు = అణచివేయు; సంరంభమునన్ = ఆత్రుత, వేగిరిపాటు; చేసి = వలన; కన్నులన్ = కళ్ళలో; నును = చిక్కటి; కెంపు = ఎరుపురంగు; కలుగువాఁడు = కలవాడు; బాల = ఉదయిస్తున్న; అర్క = సూర్యుని; మండల = చక్రమును; ప్రతిమాన = పోలిన; రత్న = రత్నములతోను; హాటక = బంగారముతోను; విరాజిత = వెలుగొందుచున్న; కిరీటంబు = కిరీటము; వాఁడు = కలవాడు;

కంకణ = కంకణములు, మురుగులు; అంగద = భుజకీర్తులు; వనమాలికా = ఆకులు పువ్వులుతో కట్టిన మాలలతో; విరాజమానుడు = ప్రకాశించువాడు; అసమానుడు = సాటిలేనివాడు; అంగుష్ఠ = అంగుళం, ఏస్కుడు (బొటకనవేలు వెడల్పు); మాత్ర = అంతమాత్రమే; దేహుడు = దేహము కలవాడు; ఒక్క = ఒక; గదన్ = గదను; చేతన్ = చేతిలో; దాల్చి = ధరించి; నేత్ర =

నేత్రములకు; ఉత్సవముగన్ = పండుగ అగునట్లు; విష్ణుడు = హరి; ఆవిర్భవించెన్ = ప్రభవించెను, పుట్టెను; ఆ = ఆ; వేళ = సమయ; అందున్ = లో.

భావము:- అభిమన్యుని భార్య ఉత్తర గర్భంలో ఉన్న పరీక్షిత్తు, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్ర తాపానికి ఇలా కనలుతుండగా. శ్రీకృష్ణుడు ఉత్తర ప్రార్థన మన్నించి అంగుళమంంత వానిగా గదాధారియై ఆవిర్భవించి, గర్భస్త బాలకుడిని కాపాడేడు. మేఘంమీద మెరుపుతీగలా, నల్లని దేహం మీద పచ్చని చేలం ధరించినవాడు, చెక్కిళ్ళపై మణులు పొదిగిన మరకకుండలాల పసిడికాంతుల ప్రసరించేవాడు, ఆ బ్రహ్మాస్త్ర అగ్ని జ్వాలల్ని చల్లార్చే సంరంభం వల్ల కళ్ళు రవ్వంత జేవురించిన వాడు, ఉదయిస్తున్న సూర్యబింబాన్ని పోలిన రత్నఖచిత సువర్ణ కిరీటం తలపై దాల్చినవాడు, కంకణాలతో, భుజకీర్తులతో, వనమాలికలతో విరాజిల్లేవాడు, అంగుష్ఠమాత్ర దేహుడు అయిన శ్రీమహావిష్ణువు గదాధరుడై కన్నులపండువుగా ఆ సమయంలో గర్భంలోని అర్భకుని ముందు అవిర్భవించాడు.

## 1-287-వ.

## ఇట్లు భక్తపరాధీనుం డయిన పరమేశ్వరుం డావిర్భవించి మంచు విరియించు మార్తాండుచందంబున శిశువునకుదశదిశలం దనచేతి యఖండిత మహోల్కా సన్నిభంబైనగదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱంద్రిప్పి విప్రునిచిచ్చఱమ్ము వేఁడిమి పోఁడిమిఁజెఱచి డింభకుని పరితాపవిజృంభణంబు నివారించి గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబు గల్పించిన.

టీక:- ఇట్లు = ఈ విధముగ; భక్త = భక్తుల; పర = పరముగ; ఆధీనుండు = లొంగి ఉండువాడు; అయిన = అయినట్టి; పరమేశ్వరుండు = హరి; ఆవిర్భవించి = ప్రభవించి; మంచు = మంచును; విరియించు = విరిచేసే; మార్తాండు = సూర్యుని; చందంబునన్ = వలె; శిశువు = శిశువు; కున్ = కు; దశదిశలన్ = పది దిక్కులను {దశదిశలు - 4దిక్కులు 4మూలలు కింద పైన మొత్తం 10, తూర్పుదిక్కు, ఆగ్నేయమూల, దక్షిణదిక్కు, నైరృతిమూల, పడమరదిక్కు, వాయవ్యమూల, ఉత్తరదిక్కు, ఈశాన్యమూల, అథో, ఊర్ధ్వములు}; తన = తనయొక్క; చేతి = చేతి; అఖండిత = అఖండమైన; మహా = మిక్కిలి పెద్దదైన; ఉల్కా = ఉల్కతో; సన్నిభంబు = సమానమైనట్టిది; ఐన = అయినట్టి; గదాదండంబున్ = గదాదండము; మండల = గుండ్రని; ఆకారంబుగన్ = ఆకారముగా; జిఱజిఱన్ = మిక్కిలి వేగముగ; త్రిప్పి = తిప్పి; విప్రుని = బ్రాహ్మణుని; చిచ్చఱ = నిప్పులు చిమ్మే; అమ్ము = బాణముయొక్క; వేఁడిమిన్ = తాపముయొక్క; పోఁడిమిన్ = ఉద్రిక్తతను; చెఱచి = చెదరగొట్టి; డింభకుని = పిల్లవాని; పరితాప = పరితాపముయొక్క; విజృంభణంబు = చెలరేగుటను; నివారించి = అరికట్టి; గర్భంబున్ = గర్భమును; కందకుండన్ = కందిపోకుండగ; అర్భకుని = పసిబిడ్డ; కిన్ = కు; ఆనందంబున్ = ఆనందమును; కల్పించినన్ = కలుగజేయగా.

భావము:- ఈ విధంగా సాక్షాత్కరించి భక్తపరాధీనుడైన భగవానుడు భానుడు మంచును పటాపంచలు గావించినట్లు మండుతున్న ఉల్కవంటి గదాదండాన్ని మండలాకారంగా శిశువు దశదిశలా

గిరగిర త్రిప్పుతూ, సెగలు పొగలు గ్రక్కే బ్రహ్మాస్త్ర ప్రతాపాన్ని శాంతింపజేశాడు. కడుపు కసుకందకుండా పసికందు పరితాపాన్ని ఉపశమింపజేసి అపరిమితానందం కలిగించాడు.

1-288-మ.

"గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులం దుర్భయ
ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ
సదయుం డెవ్వఁడొకో?" యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁ డయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా!

టీక:- గదన్ = గదను; చేన్ = చేతితో; పట్టి = పట్టుకొని; పరిభ్రమించుచున్ = వేగముగ తిరుగుతూ; గదా = గదయొక్క; ఘాతంబులన్ = దెబ్బలచేత; దుర్భయ = మహచెడ్డభయమును; ప్రదము = పుట్టించునది; ఐ = అయి; వచ్చు = వచ్చుచున్న; శర = బాణమువలని; అగ్నిన్ = అగ్నిని; తుత్తుమురుగా = తుమురు+తుమురుగ, చిన్నచిన్నతునకలుగా; భంజించి = విరిచేసి; రక్షించు = రక్షించుచున్న; ఈ = ఈ; సదయుండు = మంచి దయ కలవాడు; ఎవ్వఁడొకో = ఎవరో; అటంచు = అనుకొనుచు; మది = మనసు; లోన్ = లోపల; చర్చించున్ = తర్కించుకొనుచు; శాబకుండు = శిశువు; ఎదురు = ఎదురుగ; ఐ = అయి; చూడన్ = చూడబోగా; అదృశ్యుఁడు = మాయమైనవాడు; అయ్యెన్ = ఆయెను; హరి = హరి; సర్వేశుండు = సమస్తమునకు ఈశ్వరుడు, కృష్ణుడు; విప్ర = బ్రాహ్మణులలో; ఉత్తమా = ఉత్తముడా.

భావము:- అరే ఎవరీ కరుణామూర్తి గదాహస్తుడై పరిభ్రమిస్తూ, భయంకరంగా పైనబడి బాధిస్తున్న బాణాగ్ని జ్వాలల్ని పటాపంచలు చేసి, నన్ను కటాక్షించి రక్షించిన ఈ దాక్షిణ్యమూర్తి ఎవరు అంటూ తర్కించుకొంటూ గర్భస్థశిశువు పరీక్షించేలోగా భగవంతుడు అంతర్హితుడైనాడు.

## పరీక్షి జ్జన్మంబు

1-289-వ.

అంత ననుకూల శుభగ్రహోదయంబును, సర్వగుణోత్తర ఫలసూచకం బును నైన శుభలగ్నంబునం బాండవవంశోద్ధారకుండయిన కుమారుండు జన్మించిన ధర్మనందనుండు ధౌమ్యాది భూసురవర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి జాతకర్మంబులు సేయించి కుమారు జన్మమహోత్సవ కాలంబున భూసురులకు విభవాభిరామంబు లయిన గో భూ హిరణ్య హయానేక గ్రామంబులును స్వాదు రుచిసంపన్నంబు లయిన యన్నంబు లిడిన వారలు తృప్తులై ధర్మపుత్రున కిట్లనిరి.

టీక:- అంతన్ = అంతట; అనుకూల = అనుకూలమైన; శుభ = శుభప్రదమైన; గ్రహ = గ్రహములు; ఉదయంబును = కలుగుటయును; సర్వ = సమస్త; గుణ = మంచిగుణములకు; ఉత్తర = భవిష్యత్తులోని; ఫల = ఫలములను; సూచకంబునున్ = సూచించునవియును; ఐన = అయినట్టి; శుభ = శుభకరమైన; లగ్నంబునన్ = లగ్నములో; పాండవ = పాండురాజు పుత్రులకు; వంశ = వంశమును; ఉద్ధారకుండు = ఉద్ధరించువాడు; అయిన = అయినట్టి; కుమారుండు = పుత్రుడు; జన్మించినన్ = పుట్టగా; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుండు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; ధౌమ్య = ధౌమ్యుడు; ఆది = మొదలగు; భూసుర = బ్రాహ్మణుల {భూసురులు - భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; వర్గంబున్ = సమూహమును; రప్పించి = పిలిపించి; పుణ్యాహంబు = పుణ్యాహము అను శుద్ధి మంత్రములు; సదివించి = చదివించి; జాతకర్మంబులు = పిల్లలు పుట్టినప్పుడు చేయు కార్యక్రమము; చేయించి = చేయించి; కుమారు = పుత్రుని; జన్మ = పుట్టిన సందర్భపు; మహా = గొప్ప; ఉత్సవ = పండుగ; కాలంబునన్ = సమయమున; భూసురులు = బ్రాహ్మణులు {భూసురులు భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; కున్ = కి; విభవ = వైభవముతో; అభిరామంబులు = మనోజ్ఞములు; అయిన = అయినట్టి; గో = గోవులను; భూ = భూములను; హిరణ్య = బంగారము; హయ = గుఱ్ఱములను; అనేక = అనేకమైన; గ్రామంబులును = గ్రామములను; స్వాదు = చక్కని; రుచి = రుచితో; సంపన్నంబులు = సమృద్ధములు; అయిన = అయినట్టి; అన్నంబులు = ఆహారములును; ఇడిన = ఇచ్చిన; వారలు = వారు; తృప్తులు = తృప్తి చెందిన వారు; ఐ = అయి; ధర్మపుత్రున = ధర్మరాజు {ధర్మపుత్రుడు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అనంతరం శుభగ్రహాలన్నీ ఉచ్చస్థానాల్లో ఉండగా, సర్వసౌభాగ్య సముదాత్తమైన ఉత్తమ ముహూర్తంలో, ఉత్తరకు పాండవ వంశోద్ధారకుడైన బాలుడు ఉద్భవించాడు. ధర్మరాజు ధౌమ్యుడు మొదలైన పురోహితులను పిలిపించి పుణ్యాహవాచనం, జాతకర్మాదులు జరిపించాడు. పుత్రోదయ మహోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వర్తించి, భూసురోత్తములకు షడ్రసోపేత భోజనాలు పెట్టించి, గోవులూ భూములూ సువర్ణాలూ అశ్వాలూ అగ్రహారాలూ దానం చేసాడు. సంతుష్టులైన బ్రాహ్మణ శ్రేష్ఠులు యుధిష్ఠిరుణ్ణి చూసి...

## 1-290-చ.

"ప్రకటిత దైవయోగమునఁ బౌరవ సంతతి యంతరింపఁగా
వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా
బకుఁ బ్రతికించెఁ గావున నృపాలక! శాబకుఁ డింక శాత్రవాం
తకుఁ డగు; విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై"

టీక:- ప్రకటిత = వ్యక్తమైన; దైవ = దైవముచే నిర్దేశించబడిన; యోగమునన్ = యోగము వలన; పౌరవ = పురువు; సంతతి = వంశము; అంతరింపఁగా = అంతరించుచుండగా; వికలత = చెదిరిపోవుట; ఒందనీక = సంభవించకుండగ; ప్రభవిష్ణుఁడు = కృష్ణుడు {ప్రభవిష్ణుడు - అవతరించు శీలము కలవాడు, విష్ణువు}; విష్ణుఁడు = కృష్ణుడు {విష్ణుడు - వ్యాపించు శీలము కలవాడు, విష్ణువు}; అనుగ్రహించి = అనుగ్రహించి; శాబకున్ = పిల్లవాడిని; బ్రతికించెన్ = బ్రతుకునట్లు కాపాడెను; కావునన్ = అందువలన; నృపాలక = రాజా

{నృపాలకుడు - నరులను ఏలు వాడు, రాజు}; శాబకుడు = పిల్లవాడు; ఇంక = ఇక; శాత్రవ = శత్రువులను; అంతకుఁడు = అంతముచేయువాడు; అగున్ = అగును; విష్ణురాతుడు = విష్ణురాతుడు; అనన్ = అని; ధాత్రిన్ = భూమిమీద; ప్రసిద్ధి = మంచిపేరు; కిన్ = ను; ఎక్కున్ = పొందును; పూజ్యుఁడు = పూజింప తగువాడు; ఐ = అయి.

భావము:- "మహారాజా! ప్రఖ్యాతమైన దైవనియోగం వల్ల భారతవంశం అంతరించి పోకుండా ప్రభవిష్ణువైన శ్రీమహావిష్ణువు పరమానుగ్రహంతో ఈ పసిపాపను బ్రతికించాడు. ఈ బాలుడు, పగవారిపాలిటి లయకాలుడై విష్ణువుచేత రక్షించబడినందున విష్ణురాతు డనే నామంతో విఖ్యాతుడై, జగన్మాన్యుడౌతాడు."

## 1-291-వ.

## అనిన విని భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె.

టీక:- అనినన్ = అని పలుకగా; విని = విన్నవాడై; భూదేవ = బ్రాహ్మణులలో {భూదేవులు - భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; ఉత్తములు = ఉత్తములు; కున్ = కు; నరదేవ = రాజులలో {నరదేవులు - నరులలో దేవతలు, రాజులు}; ఉత్తముండు = ఉత్తముడు; ఇట్లు = ఈ విధముగా; అనియె = పలికెను.

భావము:- బాలుడు జగన్మాన్యు డౌతాడనుచున్న విప్రోత్తములను ధర్మరాజు ఇలా అడిగాడు

## 1-292-శా.

## "ఓ పుణ్యాత్మకులార! నాపలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్
## మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు రాజర్షులై,
## యీ పిన్నాతఁడు వారిఁ బోలెడిఁ గదా యెల్లప్పుడున్? మాధవ
## శ్రీపాదాంబుజ భక్తియుక్తుఁ డగుచున్ జీవించునే? చూడరే."

టీక:- ఓ = ఓ; పుణ్య = పుణ్యవంతమైన; ఆత్మకులార = ఆత్మకలవారలు; నా = నా యొక్క; పలుకులు = మాటలు; మీరు = మీరు; ఊహింపుఁడా = ఆలోచించండి; మ్రొక్కెదన్ = వేడెదను; మా = మా యొక్క; పెద్దల్ = పెద్దలు, పూర్వీకులు; శ్రుత = వినపడుతున్న; కీర్తులు = కీర్తి కలవారు; ఐ = అయి; సదయులు = మంచి దయ కల వారు; ఐ = అయి; మన్నారు = బ్రతికితిరి; రాజర్షులు = రాజులలో ఋషులు; ఐ = అయి; ఈ = ఈ; పిన్న = చిన్న; అతఁడు = వాడు; వారిన్ = వారిని; పోలెడిన్ = పోల్చుటకు తగి ఉంటాడు; కదా = కదా; ఎల్లప్పుడున్ = ఎప్పుడును; మాధవ = కృష్ణుని {మాధవ – 1. మా (లక్ష్మీదేవి) ధవ (భర్త ఐనవాడు) , 2. యదువు తరువాతి తరపు మధువు యొక్క వంశము వాడు, శ్రీకృష్ణుడు}; శ్రీ = శుభకరమైన; పాద = పాదములనెడి; అంబుజ = పద్మములయందు; భక్తి = భక్తి; యుక్తుఁడు = కలిగినవాడు; అగుచున్ = అవుతూ; జీవించునే = బ్రతుకునా; చూడరే = చూడండి.

భావము:- "ఓ మహాత్ములారా మీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. నా పలుకులు ఆలకించి నా సందేహం తీర్చండి. మా పెద్దలంతా దిగంత విశ్రాంత కీర్తులై, కారుణ్యమూర్తులై, రాజర్షులై విరాజిల్లారు. ఈ చిన్నారి బాలుడు సైతం తన తాతముత్తాతల అడుగుజాడల్లో నడుస్తూ వారిలాగనే ఎల్లప్పుడూ శ్రీ వల్లభుని పాద పద్మాలను భక్తితో సేవిస్తూ జీవిస్తాడు గదా దయచేసి కొంచెము సెలవీయండి."

1-293-వ.

**అనినవిని "నరేంద్రా! భవదీయపౌత్రుండు మనుపుత్రుండయిన యిక్ష్వాకునిచందం బునఁ బ్రజలరక్షించు; శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్యప్రతిజ్ఞుండు నగు; డేగవెంటనంటిన బిట్టుభీతంబైవెనుకకువచ్చిన కపోతంబుఁగాచిన శిబిచక్రవర్తి రీతి శరణ్యుండును వితరణఖనియునగు; దుష్యంతసూనుండైన భరతుపగిది సోమాన్వయ జ్ఞాతివర్గంబులకు యజ్వులకు ననర్గళకీర్తివిస్తరించు; ధనంజయ కార్త వీర్యులకరణి ధనుర్ధరాగ్రేసరుండగుఁ; గీలిపోలిక దుర్ధర్షుండగు; సముద్రుని తెఱం గున దుస్తరుండగు; మృగేంద్రంబుకైవడి విక్రమశాలియగు; వసుమతివోలె నక్షయ క్షాంతియుక్తుం డగు; భానుని లాగునఁ బ్రతాపవంతుం డగు; వాసుదేవు వడువున సర్వభూతహితుం డగుఁ; దల్లిదండ్రులమాడ్కి సహిష్ణుం డగు; మఱియును.**

టీక:- అనినన్ = అని పలికిన; విని = విన్నవారై; నరేంద్రా = నరులలో ఉత్తముడా; భవదీయ = నీయొక్క; పౌత్రుండు = మనుమడు; మను = మనువు యొక్క; పుత్రుండు = పుత్రుడు; అయిన = అయిన; ఇక్ష్వాకుని = ఇక్ష్వాకుని; చందంబునన్ = వలె; ప్రజలన్ = ప్రజలను; రక్షించు = కాపాడును; శ్రీరామచంద్రుని = శ్రీరామచంద్రుని; భంగిన్ = వలె; బ్రహ్మణ్యుండు = బ్రాహ్మణహితుడు; సత్య = సత్యమును; ప్రతిజ్ఞుండున్ = ప్రతిజ్ఞలు కలవాడును; అగున్ = అగును; డేగ = డేగ; వెంటనంటిన = వెంట తరుమగా; బిట్టు = మిక్కిలి; భీతంబు = భయము చెందినది; ఐ = అయి; వెనుకకు = వెనుకకు; వచ్చిన = మరలి వచ్చిన; కపోతంబున్ = పావురమును; కాచిన = కాపాడిన; శిబి = శిబి అను; చక్రవర్తి = రారాజు; రీతి = వలె; శరణ్యుండును = శరణ మిచ్చువాడును; వితరణ = దాన మిచ్చుటలో; ఖనియున్ = గని వంటివాడును; అగున్ = అగును; దుష్యంత = దుష్యంతుని; సూనుండు = పుత్రుడు; ఐన = అయినట్టి; భరతు = భరతుని; పగిదిన్ = వలె; సోమ = చంద్ర; అన్వయ = వంశపు; జ్ఞాతి = బంధువుల; వర్గంబులు = సమూహములు; కున్ = కు; యజ్వులు = యజ్ఞముచేయువారి; కున్ = కు; అనర్గళ = అడ్డులేని; కీర్తిన్ = కీర్తిని; విస్తరించున్ = విస్తరింపజేయును; ధనంజయ = అర్జునుడు; కార్తవీర్యుల = కార్తవీర్యార్జునుడుల; కరణిన్ = వలె; ధనుస్ = ధనుస్సును; ధర = ధరించువారిలో; అగ్రేసరుడు = మిక్కిలి గొప్పవాడు; అగున్ = అగును; కీలి = అగ్ని {కీలి - కీలలు కలవాడు, అగ్ని}; పోలికన్ = వలె; దుర్ధర్షుండు = తిరస్కరింపదగనివాడు; అగున్ = అగును; సముద్రుని = సాగరుని; తెఱంగునన్ = వలె; దుస్తరుండు = దాటుటకు వీలుకానివాడు; అగున్ = అగును; మృగేంద్రంబు = సింహము {మృగేంద్రము - మృగములలో గొప్పది, సింహము}; కైవడిన్ = వలె; విక్రమశాలి = పరాక్రమవంతుడు; అగున్ = అగును; వసుమతి = భూదేవి; వోలెన్ = వలె; అక్షయ = తరుగని; క్షాంతి = ఓర్పు; యుక్తుండు = కలవాడు; అగున్ = అగును; భానుని = భానుని; లాగునన్ = వలె; ప్రతాపవంతుండు = ప్రతాపముకలవాడు; అగున్ = అగును; వాసుదేవు = కృష్ణుని {వాసుదేవుడు - వసుదేవుని కొడుకు, కృష్ణుడు}; వడువునన్ = వలె; సర్వ = సమస్త; భూత = జీవులకు; హితుండు =

హితవుచేయువాడు; అగున్ = అగును; తల్లిదండ్రుల = తల్లిదండ్రుల; మాడ్కిన్ = వలె; సహిష్ణుండు = సహనము కలవాడు, ఓర్పు కల వాడు; అగున్ = అగును; మఱియును = ఇంకా.

భావము:- అప్పుడు అజాతశత్రునితో విప్రులు ఈ విధంగా అన్నారు -ధర్మపుత్రా! ఈ నీ పౌత్రుడు మనువు కుమారుడైన ఇక్ష్వాకు నరేంద్రునిలాగా ప్రజలను పాలిస్తాడు. కారుణ్యసాంద్రుడైన శ్రీరామచంద్రునిలాగా సత్యసంధుడూ సౌజన్యసింధుడూ ఔతాడు. ఆకలిగొన్న డేగ వెన్నంటి తరమగా, అత్యంత భయసమేతమైన కపోతానికి అభయ మిచ్చిన శిబిచక్రవర్తిలాగా ఆర్తశరణ్యుడై వదాన్యులలో అగ్రగణ్యు డౌతాడు. దుష్యంతుని కుమారుడైన భరతునిలాగా యజన క్రియానిరతుడై. అఖండయశోభరితుడై చంద్రవంశానికి పేరు తెస్తాడు. అర్జునుని వలె, కార్తవీర్యార్జునునివలె విలుకాండ్రలో మేలుబంతి అవుతాడు. అగ్నిహోత్రుడులా చెనకరాని వాడూ, సముద్రునిలా అతిక్రమింపరాని వాడూ, సింహంవంటి పరాక్రమశాలీ, వసుంధరవంటి క్షమాశీలీ అవుతాడు. దినకరునిలా తేజో మహితుడూ, దేవకీనందనునిలా సకలభూత హితుడూ, జననీ జనకులులా సహన సహితుడూ అవుతాడు. అంతేకాదు...

1-294-సీ.

సమదర్శనంబున జలజాతభవుఁడనఁ-
  బరమప్రసన్నత భర్గుఁ డనగ
నెల్లగుణంబుల నిందిరావిభుఁడన-
  నధికధర్మమున యయాతి యనఁగ
ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁడన-
  నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ
రాజితోదారత రంతిదేవుండన-
  నాశ్రితమహిమ హేమాద్రి యనఁగ

1-294.1-తే.

యశము నార్జించుఁ, బెద్దల నాదరించు,
నశ్వమేధంబు లొనరించు, నాత్మసుతుల
ఘనులఁ బుట్టించు, దండించు ఖలులఁ బట్టి,
మానధనుడు నీ మనుమఁడు మానవేంద్ర!

టీక:- సమదర్శనంబునన్ = సమస్తమును సమానముగా చూచుటయందు; జలజాతభవుఁడు = బ్రహ్మ {జలజాతాక్షుడు - (నీటిలో పుట్టునది) పద్మము నందు పుట్టిన వాడు, బ్రహ్మ}; అనన్ = అనగా; పరమ = మిక్కిలి; ప్రసన్నతన్ = ప్రసన్నముగ ఉండుటలో; భర్గుఁడు = శివుడు; అనగన్ = అనగా; ఎల్ల = సమస్త; గుణములన్

= మంచి గుణములలోను; ఇందిరావిభుఁడు = లక్ష్మీపతి, విష్ణువు; అనన్ = అనగా; అధిక = అధికమైన; ధర్మమున = ధర్మపాలనలో; యయాతి = యయాతి; అనఁగన్ = అనగా; ధైర్య = ధైర్యము అనే; సంపద = సంపద కలిగి ఉండుటలో; బలి = బలి అను; దైత్య = రాక్షసులకు; వల్లభుఁడు = ప్రభువు; అనన్ = అనగా; అచ్యుత = హరి మీది; భక్తిన్=భక్తిలో; ప్రహ్లాదుఁడు= ప్రహ్లాదుడు; అనఁగన్ = అనగా; రాజిత = ప్రకాశించు; ఉదారతన్ = దానగుణములో; రంతిదేవుండు = రంతిదేవుడు; అనన్ = అనగా; ఆశ్రిత = ఆశ్రయింపదగిన; మహిమన్ = గొప్పదనములో; హేమాద్రి = హిమాలయము; అనఁగ = అనగా;

యశమున్ = కీర్తిని; ఆర్జించున్ = సంపాదించును; పెద్దలన్ = పెద్దవారిని; ఆదరించున్ = ఆదరించును; అశ్వమేధంబులు = అశ్వమేధ యజ్ఞములు; ఒనరించు = చేయును; ఆత్మ = తన; సుతులన్ = పుత్రులను; ఘనులన్ = గొప్పవారిని; పుట్టించు = కనును; దండించున్ = శిక్షించును; ఖలులన్ = దుష్టులను; పట్టి = పట్టుకొని; మాన = మానము అను; ధనుడు = ధనము కలవాడు; నీ = నీ; మనుమఁడు = మనుమడు; మానవేంద్ర = రాజా {మానవేంద్రుడు – మానవులకు ప్రభువు, రాజు}.

భావము:- ఇతడు సమదృష్టిలో జలజభవుడు-ప్రసాదంలో పరమశివుడు. రమణీయ గుణసంపదలో రమాధవుడు-అనిపించుకొంటాడు. ధర్మాతిశయంలో యయాతిగా, ధైర్యంలో బలిచక్రవర్తిగా, భక్తిద్రఢిమలో ప్రహ్లాదుడుగా, దాతృత్వగరిమలో రంతిదేవుడుగా, ఆశ్రయమహిమలో హిమగిరిగా ఖ్యాతి గాంచుతాడు. కీర్తిపై అనురక్తీ, పెద్దలపై భక్తీ, కలిగి అశ్వమేధాలు ఆచరిస్తాడు. తనవంటి తనయులకు తండ్రియై వంశాన్ని పండిస్తారు. దుర్మార్గులను దండిస్తాడు. నీ మనుమడ మానధనులో మాననీయు డౌతాడు.

## 1-295-భు.

హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్,
భరించున్ ధరన్ రామభద్రుండుఁ బోలెన్,
జరించున్ సదా వేదశాస్త్రానువృత్తిన్,
వరించున్ విశేషించి వైకుంఠుభక్తిన్.

టీక:- హరించున్ = పోగొట్టును; కలి = కలిచేత; ప్రేరిత = ప్రేరేపింపబడిన; అఘంబులు = పాపములు; ఎల్లన్ = అన్నిటిని; భరించున్ = పోషించును; ధరన్ = భూమిని; రామభద్రుండున్ = రామచంద్రుడు; పోలెన్ = వలె; చరించున్ = మెలగును; సదా = ఎల్లప్పుడు; వేద = వేదమును; శాస్త్ర = శాస్త్రమును; అనువృత్తిన్ = అనుసరించి; వరించున్ = కోరి స్వీకరించును; విశేషించి = ప్రత్యేకించి; వైకుంఠు = విష్ణుమూర్తి మీది {వైకుంఠుడు – వైకుంఠములో ఉండువాని, విష్ణుమూర్తి}; భక్తిన్ = భక్తితో.

భావము:- ఇతడు కలికల్మషాలను హరిస్తాడు. శ్రీరామచంద్రుడులాగా భూభారాన్ని భరిస్తాడు. వేదశాస్త్రాలను అనుసరించి సదా చరిస్తాడు విశిష్టమైన విష్ణుభక్తిని వరిస్తాడు.

## 1-296-వ.

ఇట్లు పెక్కేండ్లుజీవించి భూసురకుమారప్రేరితంబయిన తక్షకసర్పవిషానలంబు నం దనకుమరణంబని యెఱింగి, సంగవర్జితుం డయి, ముకుంద పదారవింద

**భజనంబుసేయుచు, శుకయోగీంద్రునివలన నాత్మవిజ్ఞానసంపన్నుండై, గంగా తటంబున శరీరంబువిడిచి, నిర్గతభయశోకంబయిన లోకంబుఁబ్రవేశించు" నని, జాతకఫలంబు సెప్పి లబ్ధకాము లయి భూసురులు సని రంత.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; పెక్రు = చాలా; ఏండ్లు = సంవత్సరములు; జీవించి = బ్రతికి; భూసుర = బ్రాహ్మణ {భూసురుడు - భూమికి దేవత, విప్రుడు}; కుమార = పుత్రునిచేత; ప్రేరితంబు = ప్రేరేపించబడినది; అయిన = అయినట్టి; తక్షక = తక్షకుడు అను; సర్ప = పాముయొక్క; విష = విషము అను; అనలంబునన్ = అగ్నివలన; తన = తన; కున్ = కు; మరణంబు = చావు కలుగును; అని = అని; ఎఱింగి = తెలిసికొన్నవాడై; సంగ = బంధములను; వర్జితుండు = విడిచిపెట్టిన వాడు; అయి = అయి; ముకుంద = హరియొక్క; పద = పాదములు అను; అరవింద = పద్మములమీద; భజనంబు = భక్తి; చేయుచు = చేయుచు; శుక = శుకుడు అను; యోగి = యోగులలో; ఇంద్రుని = శ్రేష్ఠుని; వలనన్ = వలన; ఆత్మ = ఆత్మ పరమాత్మల గురించిన; విజ్ఞాన = విశిష్ట జ్ఞానము అను; సంపన్నుండు = సంపద కలవాడు; ఐ = అయి; గంగా = గంగ యొక్క; తటంబునన్ = ఒడ్డున; శరీరంబు = శరీరమును; విడిచి = విడిచిపెట్టి; నిర్గత = తొలగింపబడిన; భయ = భయము; శోకంబు = శోకము కలది; అయిన = అయినట్టి; లోకంబున్ = లోకమును; ప్రవేశించును = చేరును; అని = అని; జాతక = జాతకము గణన చేయగా వచ్చిన; ఫలంబు = ఫలితమును; చెప్పి = చెప్పి; లబ్ధ = పొంద బడిన; కాములు = కామములు కలవారు; అయి = అయిన; భూసురులు = బ్రాహ్మణులు; సనిరి = వెళ్ళిపోయిరి; అంతన్ = అంతట.

భావము:- ఈ బాలుడు ఈ విధంగా అనేక సంవత్సరాలు గడిపి, మునికుమారునివల్ల ప్రేరేపించ బడిన తక్షకుని విషాగ్నిజ్వాలలచే తాను చనిపోతానని తెలుసుకొని సర్వసంగ పరిత్యాగియై, గోవింద చరణారవింద భజనానురాగియై, శుకయోగీంద్రులవల్ల బ్రహ్మజ్ఞాన సంపన్నుడై గంగానదీతీరంలో శరీరాన్ని పరిత్యజించి భయశోకాలు లేని పుణ్య లోకానికి చేరుకుంటాడు-అని ఈ ప్రకారంగా బాలకుని భవిష్యత్తు ప్రకటించి, ధర్మరాజు ఇచ్చిన కానుకలు అందుకొని, భూసురోత్తములు సంతుష్టచిత్తులై వెళ్ళిపోయారు.

1-297-క.

**తన తల్లి కడుపులోపల**
**మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం**
**డనుచుఁ బరీక్షింపఁగ జను**
**లనఘుఁ బరీక్షన్నరేంద్రుఁ డండ్రు మునీంద్రా!**

టీక:- తన = తనయొక్క; తల్లి = తల్లి; కడుపు = కడుపు; లోపలన్ = లోపల; మును = ఇంతకు ముందు; సూచిన = చూచిన; విభుఁడు = ప్రభువు; విశ్వమున = లోకమునకు; ఎల్లన్ = ఎల్లెడల; కలండు = ఉన్నాడు; అనుచున్ = అని; పరీక్షింపఁగన్ = పరీక్షించుండుటచేత; జనులు = ప్రజలు; అనఘున్ = పాపములేని వానిని; పరీక్షిత్ = పరీక్షిత్తు అను; నరేంద్రుడు = రాజు; అండ్రు = అందురు; ముని = మునులలో; ఇంద్రా = శ్రేష్ఠుడా.

భావము:- శౌనక మునీంద్రా తన కన్నతల్లిగర్భంలో మున్ను తాను సందర్శించిన భగవంతుడు విశ్వమంతటా విరాజిల్లుతున్నాడేమో నని పరీక్షించినందువల్ల ఆ బాలుణ్ణి లోకులు పరీక్షిత్తు అని పిలుస్తారు.

1-298-ఆ.

కళలచేత రాజు గ్రమమునఁ బరిపూర్ణు
డయిన భంగిఁ దాత లనుదినంబుఁ
బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ
పటలపాలకుండు బాలకుండు

టీక:- కళల = చంద్ర కళల; చేతన్ = వలన; రాజు = చంద్రుడు; క్రమమునన్ = క్రమముగ; పరిపూర్ణుడు = పూర్ణ చంద్రుడు; అయిన = అయిన; భంగిన్ = విధముగ; తాతలు = పితామహులు; అనుదినంబున్ = ప్రతిరోజు; పోషణంబు = పోషణ; చేయన్ = చేయుచుండగ; పూర్ణుండు = పరిపూర్ణుండు; అయ్యెను = ఆయెను; ధర్మ = ధర్మముల; పటల = సమూహమునకు; పాలకుండు = పరిపాలకుడు; బాలకుండు = బాలుడు.

భావము:- తాతలు దినదినమూ అనురాగంతో పెంచి పెద్దచేయగా ఆ బాలకుడు, షోడశకళలచేత పరిపూర్ణుడైన చంద్రునివలే క్రమంగా వృద్ధిపొందసాగాడు.

1-299-వ.

మఱియు ధర్మనందనుండు బంధుసంహారదోషంబువాయుకొఱకు నశ్వమేధ యాగంబు సేయం దలఁచి, ప్రజలవలనం గరదండంబుల నుపార్జితం బయిన విత్తంబు సాలక చిత్తంబునఁ జింతించు నెడ; నచ్యుతప్రేరితులై భీమార్జునాదులు, దొల్లి మరుత్తుండనురాజు మఖంబుసేసి పరిత్యజించినిక్షేపించిన సువర్ణ పాత్రాదికంబైన విత్తంబుత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన; నా రాజసత్తముండు సమాయత్త యజ్ఞోపకరణుండై సకలబంధు సమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి, పురుషోత్తము నుద్దేశించి మూడు జన్నంబులు గావించెఁ; దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబుకొఱకుఁ గరినగరంబునఁ గొన్నినెలలుండి ధర్మపుత్రాదులచే నామంత్రణంబు పడసి యాదవ సమేతుం డయి ధనుంజయుడు దోడరా నిజ నగరంబునకుం జనియె; నంతకు మున్ను విదురుండు తీర్థయాత్ర సని మైత్రేయుముందటఁ గర్మయోగవ్రతాదివిషయంబులయినప్రశ్నంబులఁ కొన్నింటింజేసి, యతనివలననాత్మవిజ్ఞానంబుదెలిసి, కృతార్థుండైహస్తినాపురంబునకు వచ్చిన

టీక:- మఱియు = ఇంకా; ధర్మనందనుండు = ధర్మరాజు; బంధు = బంధువులను; సంహార = సంహరించిన; దోషంబు = దోషము; పాయు = పోగొట్టుకొనుట; కొఱకున్ = కోసము; అశ్వమేధ = అశ్వమేధ; యాగంబు = యజ్ఞము; చేయన్ = చేయ వలనని; తలంచి = నిశ్చయించుకొని; ప్రజల = ప్రజల; వలనన్ = వలన; కరదండంబులు = కానుకలు కప్పములు రూపములో; ఉపార్జితంబు = ఆర్జింపబడినది; అయిన = అయినట్టి; విత్తంబు = ధనము; చాలక = చాలక; చిత్తంబునన్ = మనసులో; చింతించు = విచారించు; ఎడన్ = సమయమున; అచ్యుత = కృష్ణునిచే; ప్రేరితులు = ప్రేరింపబడిన వారు; ఐ = అయి; భీమ = భీముడు; అర్జున = అర్జునుడు; ఆదులు = మొదలగు వారు; తొల్లి = పూర్వము; మరుత్తుండు = మరుత్తుడు; అను = అని పేరు కల; రాజు = రాజు; మఖంబు = యజ్ఞము; చేసి = చేసి; పరిత్యజించి = వదిలివేసి; నిక్షేపించిన = భూమిలో దాచిన, నిధి; సువర్ణ = బంగారు; పాత్ర = పాత్రలు; ఆదికంబు = మొదలైనవి; ఐన = అయిన; విత్తంబున్ = ధనము; ఉత్తర = ఉత్తరపు; దిక్ = దిక్కు; భాగంబు = వైపు భూభాగము; వలనన్ = నుండి; బలవంతులు = బలము కలవారు; ఐ = అయి; తెచ్చినన్ = తీసుకొని వచ్చిన; ఆ = ఆ; రాజ = రాజులలో; సత్తముండు = శ్రేష్ఠుడు; సమాయత్త = కూర్చుకొనబడిన; యజ్ఞ = యజ్ఞమునకు కావలసిన; ఉపకరణుండు = పరికరములు కలవాడు; ఐ = అయి; సకల = సమస్త; బంధు = బంధువులతో; సమేతంబుగన్ = కలుపుకొని; కృష్ణుని = కృష్ణుని; ఆహ్వానంబు = ఆహ్వానము; చేసి = చేసి; పురుషోత్తమున్ = పురుషోత్తముని; ఉద్దేశించి = కొఱకు; మూడు = మూడు; జన్నంబులు = యజ్ఞములు; కావించెన్ = నిర్వహించెను; తత్ = ఆ; అనంతరంబ = తరువాత; కృష్ణుండు = కృష్ణుడు; బంధు = బంధువులకు; ప్రియంబు = ప్రీతి కలిగించుట; కొఱకున్ = కోసము; కరినగరంబునన్ = హస్తినాపురములో; కొన్ని = కొన్ని; నెలలు = నెలలు; ఉండి = ఉండి; ధర్మపుత్ర = ధర్మరాజు {ధర్మపుత్రుడు – యముని పుత్రుడు, ధర్మరాజు}; ఆదుల = మొదలగువారు; చేన్ = చేత; ఆమంత్రణంబు = అనుమతి; పడసి = పొంది; యాదవ = యాదవులతో; సమేతుండు = కూడిన వాడు; అయి = అయి; ధనుంజయుడు = అర్జునుడు; తోడ = తోడు; రాన్ = రాగా; నిజ = తనయొక్క; నగరంబు = నగరము; కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; అంతకు = అంతకన్న; మున్ను = ముందు; విదురుండు = విదురుడు; తీర్థయాత్ర = పుణ్యస్థలములను సేవించుటకు; చని = వెళ్ళి; మైత్రేయు = మైత్రేయుని; ముందటన్ = ఎదురుగ; కర్మయోగ = కర్మయోగమును; వ్రత = వ్రతములును; ఆది = మొదలగు; విషయంబులు = విషయములను గురించినవి; అయిన = అయినట్టి; ప్రశ్నంబులన్ = ప్రశ్నలను; కొన్నింటిన్ = కొన్నిటిని; చేసి = వేసి; అతని = అతని; వలనన్ = వలన; ఆత్మ = ఆత్మ పరమాత్మ ల గురించిన; విజ్ఞానంబున్ = విజ్ఞానమును; తెలిసి = తెలిసికొని; కృతార్థుండు = ధన్యుడు; ఐ = అయి; హస్తినాపురంబు = హస్తినాపురము; కున్ = కు; వచ్చిన = రాగా.

భావము:- తర్వాత ధర్మనందనుడు చుట్టాలను చంపిన పాపం పోగొట్టుకోవటం కోసం అశ్వమేధయజ్ఞం చేయాలనుకొన్నాడు. పన్నుల రూపంలోనూ, శిక్షలరూపంలోనూ ప్రజలనుంచి రాబట్టిన ధనం సరిపోదే అని అతడు విచారించసాగాడు. అప్పుడు పూర్వం మరుత్త మహారాజు యజ్ఞంచేసి మిగిలిన ధనాన్ని భూమిలో నిక్షేపించాడని విని శ్రీకృష్ణభగవానునిచే ప్రేరితులైన భీమార్జునులు ఉత్తరానికి వెళ్ళి సువర్ణరాసులు కొని తెచ్చారు. అనంతరం రాజవరేణ్యుడైన ధర్మనందనుడు యజ్ఞానికి కావలసిన ఉపకరణాలన్నీ సిద్ధంచేసుకొన్నాడు. శ్రీకృష్ణుణ్ణి బంధుసమేతంగా ఆహ్వానించాడు. పురుషోత్తముణ్ణి యజ్ఞపురుషుడుగా భావించి మూడు అశ్వమేధాలు కావించాడు. ఆ తర్వాత గోవిందుడు బంధువులైన పాండవుల సంతోషంకోసం హస్తినానగరంలో కొన్ని మాసాలపాటు ఉన్నాడు. అనంతరం ఆయన పాండవులను వీడ్కొని సకలబంధు

సమేతుడై, అర్జునుణ్ణి వెంటబెట్టుకొని ద్వారకా నగరానికి వెళ్లిపోయాడు. కొంతకాలానికి తీర్థయాత్రలకని బయలదేరిన విదురుడు మైత్రేయ మహాముని సన్నిధి చేరుకొన్నాడు. కర్మాలు, యోగాలు, వ్రతాలు మొదలైన అంశాలపై ఆయన్ని కొన్ని ప్రశ్నలు అడిగి సందేహ నివృత్తి కావించుకొన్నాడు. పరమార్థజ్ఞానం సంపాదించిన విదురుడు కృతార్థుడై తిరిగి హస్తినకు అరుదెంచాడు.

## విదురాగమనంబు

1-300-క.

బంధుఁడు వచ్చె నటంచును
గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం
బంధములు నెఱపి ప్రీతిం
బంధురగతిఁ జేసి రపుడు మన్నన లనఘా!

టీక:- బంధుండు = బంధువు; వచ్చెన్ = వచ్చెను; అటంచును = అనుచు; గాంధారీ = గాంధారియొక్క; విభుఁడు = భర్త; మొదలుగాన్ = మొదలగువారు; అందఱున్ = అందరు; సంబంధములు = సంబంధములు; నెఱపి = నెరవేర్చుచు; ప్రీతిన్ = ప్రీతితో; బంధుర = తగు; గతిన్ = విధముగ; చేసిరి = చేసిరి; అపుడు = అప్పుడు; మన్ననలు = గౌరవములు; అనఘా = పాపములేనివాడా.

భావము:- ఆత్మ బంధుడైన విదురుడు తీర్థయాత్రలు ముగించి తిరిగి వచ్చాడని విని, ధృతరాష్ట్రుడూ, మొదలైన వారంతా ఎంతో సంతోషంతో ఎదురేగి స్వాగతం పలికారు.

1-301-వ.

**అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాది సత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవార లందఱు విన నిట్లనియె.**

టీక:- అంత = అంతట; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుండు - యముని పుత్రుడు, ధర్మరాజు}; విదురు = విదురు; కిన్ = కి; మజ్జన = స్నానము; భోజన = భోజనము; ఆది = మొదలగు; సత్కారంబులు = గౌరవములు; చేయించి = చేయించి; సుఖ = సుఖముగ; ఆసీనుండు = కూర్చున్న వాడు; ఐ = అయి; తనవారలు = తనవారు; అందఱున్ = అందరును; వినన్ = వినుచుండగ; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అలా విదురుడు విచ్చేసినప్పుడు, యమధర్మరాజు పుత్రుడు అయిన ధర్మరాజు విదురునకు ఎదుర్కోలు వెళ్ళి సాదరంగా ఆహ్వానించాడు. తగిన గౌరవ సత్కారాలతో స్నానము, భోజనము

మున్నగు మర్యాదలు అన్నీ ఏర్పాటు చేసాడు. పిమ్మట సుఖముగా కూర్చుండజేసి, తనవారు అందరూ వింటూ ఉండగా విదురుని ఇలా అడిగాడు.

1-302-సీ.

"ఏ వర్తనంబున నింత కాలము మీరు-
సంచరించితి రయ్య జగతిలోన?
నే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి?-
భావింప మీవంటి భాగవతులు
తీర్థసంఘంబుల ధిక్కరింతురు గదా-
మీయందు విష్ణుండు మెఱయు కతన,
మీరు తీర్థంబులు, మీకంటె మిక్కిలి-
తీర్థంబు లున్నవే తెలిసి చూడ?

1-302.1-తే.

వేఱు తీర్థంబు లవనిపై వెదక నేల?
మిమ్ముఁ బొడగని భాషించు మేల చాలు,
వార్త లేమండ్రు లోకులు వసుధలోన?
మీకు సర్వంబు నెఱిఁగెడి మేధ గలదు.

టీక:- ఏ = ఏ; వర్తనంబునన్ = విధమున; ఇంతకాలము = ఇంతకాలము; మీరు = మీరు; సంచరించితిరి = తిరిగితిరి; అయ్య = ఓయయ్య; జగతి = లోకము; లోనన్ = అందు; ఏ = ఏ; తీర్థములు = పుణ్యస్థలములు; కంటిరి = చూచితిరి; ఎక్కడ = ఎక్కడ; ఉంటిరి = ఉంటిరి; భావింపన్ = ఆలోచించి చూసిన; మీ = మీ; వంటి = లాంటి; భాగవతులు = భాగవతులు, భగవద్భక్తులు; తీర్థ = పుణ్యస్థలముల; సంఘంబులన్ = సమూహములను; ధిక్కరింతురు = అధిగమింతురు; కదా = కదా; మీ = మీ; అందున్ = లోన; విష్ణుండు = విష్ణుమూర్తి, భగవంతుడు; మెఱయు = ప్రకాశించుట; కతనన్ = వలన; మీరు = మీరు; తీర్థంబులు = పుణ్యస్థలములు; మీకు = మీకు; కంటెన్ = మించి; మిక్కిలి = పెద్ద; తీర్థంబులు = పుణ్యస్థలములు; ఉన్నవే = ఉన్నవా, లేవు; తెలిసి = తెలుసుకొని; చూడ = చూడగా;

వేఱు = వేరే; తీర్థంబులున్ = పుణ్యస్థలములు; అవని = భూమి; పైన్ = మీద; వెదకన్ = వెతుకుట; ఏలన్ = ఎందులకు; మిమ్మున్ = మిమ్ములను; పొడగని = దర్శించుకొని; భాషించు = మాట్లాడుట అనే; మేల = మేలు; చాలున్ = చాలును; వార్తలు = వార్తావిశేషములు; ఏమి; అండ్రు = చెప్పుదురు; లోకులు = జనులు; వసుధ = లోకము; లోనన్ = లో; మీకు; సర్వంబున = సమస్తమును; ఎఱిఁగెడి = తెలిసికొను; మేధ = తెలివి; కలదు = ఉన్నది.

భావము:- అయ్యా ఇంతకాలమూ మీరు ఏయే ప్రాంతాలు సందర్శించారు ఎలా ఎలా సంచరించారు ఏయే పుణ్యతీర్థాలు సేవించారు ఏయే ప్రదేశాల్లో నివసించారు మీవంటి పరమభాగవతోత్తములు తీర్థాలను లెక్కచేయరుగదా మీలో భగవంతుడు సన్నిధిచేసి ఉన్నాడు. కనుక మీరే పుణ్యతీర్థాలు, ఆలోచించి చూస్తే మీకంటే మించిన పుణ్యతీర్థాలు పుడమిలో ఎక్కడో ఉన్నాయి మీవంటి మహాత్ములను దర్శించి సంభాషించే అదృష్టం అబ్బితే చాలదా వేరే తీర్థాలకోసం వెదకవలసిన పనేమున్నది మీరు సర్వజ్ఞులు, వివేకవంతులు. ఉన్న చోటనే ఉండి లోకంలో ఉన్న విశేషాలన్నీ తెలుసుకోగలరు.

## 1-303-మత్త.

తండ్రి సచ్చినమీఁద మా పెదతండ్రిబిడ్డలు దొల్లి పె
క్కండ్రు సర్పవిషాగ్నిబాధల గాసిఁ బెట్టఁగ మమ్ము ని
ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా
తండ్రి భంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే?

టీక:- తండ్రి = తండ్రి; సచ్చిన = మరణించిన; మీఁదన్ = పిదప; మా = మాయొక్క; పెదతండ్రి = తండ్రికి అన్నగారి; బిడ్డలు = కొడుకులు; తొల్లి = పూర్వము; పెక్కండ్రు = అనేకమంది; సర్ప = పాముల; విష = విషమువలన; అగ్ని = అగ్నివలన; బాధలన్ = బాధలతో; కాసిఁబెట్టఁగ = రాపాడించగా, బాధించగ; మమ్మున్ = మమ్ములను; ఇల్లాండ్రన్ = భార్యలను; అంతమున్ = మరణము; పొందకుండఁగన్ = చెందకుండగ; లాలనంబునన్ = సముదాయించుతూ; మీరు = మీరు; మా = మాయొక్క; తండ్రి = తండ్రి; భంగిన్ = వలె; సముద్ధరింతురు = పైకి తీసుకొనివచ్చిరి; తత్ = ఆ; విధంబున్ = విధమును; తలంతురే = జ్ఞప్తి చేసుకొందురా.

భావము:- మా తండ్రిగారు చనిపోయిన అనంతరం, మా పెదతండ్రి కుమారులు మమ్మల్ని ఎన్నో బాధలు పెట్టారు. సర్పాలచేత కరిపించారు. విషాన్నం తినిపించారు. ఇంటికి నిప్పు అంటించారు. మా తండ్రివంటి మీరు మమ్మల్నీ, మా భార్యలనూ మృత్యువుబారిని పడకుండా అత్యంత అనురాగంతో లాలించి పాలించారు. కష్టాలలో నుంచి ఉద్ధరించారు. ఆ విషయాలన్నీ ఎన్నడైన తలచుకొంటారా.

## 1-304-క.

పక్షులు తమఱెక్కలలోఁ
బక్షంబులు రాని పిల్లపదువుల మమతన్
రక్షించిన క్రియ మీరలు
పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే!

టీక:- పక్షులు = పక్షులు; తమ = తమయొక్క; ఱెక్కల = రెక్కలు; లోన్ = అందు; పక్షంబులు = రెక్కలు; రాని = రాని; పిల్ల = పిల్లల; పదువుల = గుంపును; మమతన్ = మమతతో {మమత - నాది అను భావము};

రక్షించిన = కాపాడు; క్రియన్ = విధముగ; మీరలు = మీరు; పక్షీకరణంబు = పక్షము వహించుట; చేయన్ = చేయుట వలన; బ్రతికితిమి = బ్రతికి బైట పడితిమి; కదే = కదా.

భావము:- రెక్కలురాని తమ పసికందుల్ని రెక్కల్లో దాచుకొని మమకారంతో రక్షించే పక్షుల విధంగా,మీరు ఎంతో దాక్షిణ్యంతో మాపక్షం వహించి మమ్మల్ని రక్షించారు.

1-305-క.

మన్నారా? ద్వారకలో
నున్నారా? యదువు లంబుజోదరు కరుణం
గన్నారా? లోకులచే
విన్నారా? మీరు వారి విధ మెట్టిదియో?"

టీక:- మన్నారా = జీవించి; ద్వారక = ద్వారకాపట్నము; లోన్ = లో; ఉన్నారా = ఉన్నారా; యదువులు = యాదవులు {యదువులు - యదు వంశస్తులు}; అంబుజోదరు = కృష్ణుని {అంబుజోదరు - (నీటిలోపుట్టినది) పద్మము ఉదరమున ఉన్నవాడు}; కరుణన్ = దయను; కన్నారా = పొందుచున్నారా; లోకుల = ప్రజల; చేన్ = వలన; విన్నారా = విన్నారా; మీరు = మీరు; వారి = వారు ఉన్న; విధము = విధము; ఎట్టిదియో = ఎలాంటిదో.

భావము:- మహానుభావా! మీరు తీర్థయాత్రలు చేస్తూ ద్వారకకు వెళ్లారా? యాదవులంతా ఆ స్వామి అనుగ్రహం వల్ల సుఖంగా ఉన్నారా? పోని ఎవరివల్లనైనా వారి వృత్తాంతం విన్నారా?"

1-306-చ.

అన విని ధర్మరాజునకు నా విదురుండు సమస్తలోక వ
ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు సె
ప్పిన నతఁ డుగ్రశోకమున బెగ్గిలుచుండెడి నంచు నేమియున్
విను మని చెప్పఁ డయ్యెఁ; యదువీరుల నాశము భార్గవోత్తమా!

టీక:- అనన్ = అనగా; విని; ధర్మరాజు = ధర్మరాజు; కున్ = కు; ఆ; విదురుండు = విదురుడు; సమస్త = సమస్తమైన; లోక = లోకముయొక్క; వర్తనమున్ = నడకను; క్రమంబు = క్రమము; తోడన్ = ప్రకారముగను; విశదంబుగన్ = వివరముగను; చెప్పి = చెప్పి; యదు = యాదవుల; క్షయంబు = నాశనము; చెప్పినన్ = చెప్పినచో; అతఁడు = అతడు; ఉగ్ర = భయంకరమైన; శోకమునన్ = దుఃఖమువలన; బెగ్గిలుచు = బెంగపడుతు, బాధపడుతూ; ఉండెడిన్ = ఉండును; అంచున్ = అనుకొనుచు; ఏమియున్ = ఏమీకూడా; వినుము = వినుము; అని = అని; చెప్పఁడయ్యెఁ = చెప్పుట లేదు; యదు = యాదవ; వీరుల = వీరులయొక్క; నాశమున్ = నాశనమును; భార్గవోత్తమా = శౌనకుడా {భార్గవోత్తముడు - భార్గవుని సంతానములో ఉత్తముడు, శౌనకుడు}.

భావము:- ఓ శౌనక మహర్షీ! ఈ విధంగా ప్రశ్నించిన ధర్మరాజుతో విదురుడు తన తీర్థ యాత్రా విశేషాలన్నీ వివరించి చెప్పాడు. అన్నీ చెప్పాడు. కాని యాదవుల నాశనం మాత్రం చెప్పలేదు. అలా చెప్పితే ధర్మరాజు దుఃఖా వేశంతో క్రుంగి కృశించిపోతాడనే భయంతో ఆ విషయాన్ని చెప్పకుండా దాటవేశాడు.

1-307-ఆ.

మేలు సెప్పెనేని మేలండ్రు లోకులు,
చేటు చెప్పెనేని చెట్టయండ్రు,
నంతమీఁద శూద్రుఁ డైన కతంబున
శిష్టమరణ మతడు సెప్పఁడయ్యె.

టీక:- మేలు = మంచి విషయము; సెప్పెనేని = చెప్పినట్లైతే; మేలు = మంచిది; అండ్రు = అందురు; లోకులు = ప్రజలు; చేటు = అశుభం, చెడ్డ విషయము; చెప్పెనేని = చెప్పినట్లైతే; చెట్ట = చెడ్డవాడు; అండ్రు = అందురు; అంత = ఆ; మీఁదన్ = పైన; శూద్రుఁడు = శూద్రుడు; ఐన = అయిన; కతంబునన్ = కారణముచేత; శిష్ట = శిష్టులయొక్క; మరణము = మరణమును; అతడు = అతడు; సెప్పఁడయ్యె = చెప్పుటలేదు.

భావము:- లోకులు మంచి విషయం చెప్పితే మేలు మేలని వింటారు. అశుభం చెబితే చెడ్డవాడంటారు. అందువల్ల సదయహృదయుడైన విదురుడు శూద్ర స్త్రీ యందు జన్మించినవాడు కనుక యదువీరుల మరణవార్తను ధర్మరాజుకు చెప్పలేకపోయాడు.

1-308-వ.

అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబునం దొల్లి యముండు శూద్ర యోని యందు విదురుండైజన్మించియున్న నూఱువత్సరంబు లర్యముండు యథాక్రమం బునం బాపకర్ములదండించె; నిట యుధిష్ఠిరుండు రాజ్యంబుఁగైకొని లోకపాల సంకాశులయిన తమ్ములుందానును గులదీపకుండైనమనుమని ముద్దు సేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండె నంత.

టీక:- అది = అది; ఎట్లు = ఏవిధముగ; అనిన = అనిన; మాండవ్య = మాండవ్యుడు అను; మహా = గొప్ప; ముని = ముని యొక్క; శాపంబునన్ = శాపమువలన; తొల్లి = పూర్వము; యముండు = యముడు; శూద్ర = శూద్రుల యొక్క; యోనియందు = గర్భము నందు; విదురుండు = విదురుడు; ఐ = అయి; జన్మించి = పుట్టి; ఉన్న = ఉండగ; నూఱు = వంద; వత్సరంబులు = సంవత్సరములు; అర్యముండు = సూర్యుడు; యథాక్రమంబునన్ = యథావిధిగ; పాప = పాపపు; కర్ములన్ = కర్మలు చేయు వారిని; దండించె = దండించెను; ఇట = ఇక్కడ; యుధిష్ఠిరుండు = ధర్మరాజు {యుధిష్ఠిరుండు - ధర్మరాజు అసలు పేరు}; రాజ్యంబున్ = రాజ్యమును; కైకొని = చేపట్టి; లోకపాల = లోకపాలురకు; సంకాశులు = సమానమైనవారు; అయిన = అయినట్టి;

తమ్ములున్ = తమ్ములును; తానును = తానును; కుల = కులమును; దీపకుండు = నిలబెట్టువాడు, దీపము వంటివాడు; ఐన = అయినట్టి; మనుమని = మనుమణ్ణి; ముద్దు = గారాబముగ పోషణ; సేయుచున్ = చేయుచు; పెద్ద = చాలా; కాలంబు = కాలము; మహా = గొప్ప; వైభవంబునన్ = వైభవముతో; సుఖ = సుఖము కలవారు; ఐ = అయి; ఉండెన్ = ఉండెను; అంత = అప్పుడు.

భావము:-విదురుడు ధర్మస్వరూపుడు, పూర్వకాలంలో మాండవ్యుడనే మహర్షి శాపంవల్ల, యమ ధర్మరాజు శూద్రకులంలో విదురుడై జన్మించాడు. ఆ నూరు సంవత్సరాలూ, అర్యముడు యథా విధిగా యమధర్మరాజుస్థానంలో ఉండి పాపాత్ముల పాపాలకుతగినశిక్షలువిధిస్తూ ఉన్నాడు.ఇక్కడ ధర్మరాజు రాజ్యాన్ని స్వీకరించి, దిక్పాలకుల వంటి సోదరులతో కూడి, కులదీపనుడైన మనుమడిని అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసి ఎంతో వైభవంతో సుఖంగా జీవించాడు

★1-309-క.

బాలాజన శాలా ధన
లీలావన ముఖ్య విభవ లీన మనీషా
లాలసు లగు మానవులనుఁ
గాలము వంచించు దురవగాహము సుమతీ!

టీక:- బాల = పిల్లలు; జన = అంతఃపుర స్త్రీలు; శాలా = భవనములు; ధన = ధనములు; లీలావన = ఉద్యానవనములు; ముఖ్య = మొదలగు; విభవ = వైభవము లందు; లీన = మునిగి, లీనమై; మనీషా = ప్రజ్ఞ; లాలసులు = రుచి మరిగిన వారు; అగు = అయినట్టి; మానవులను = మనుష్యులను; కాలము = కాలము; వంచించు = మోసము చేయును; దురవగాహము = తరించుటకు కష్టమైనది, అంతు చిక్కనిది; సుమతీ = మంచి బుద్ధి కల వాడా, శౌనకా.

భావము:- శౌనక మహర్షి! అందమైన బిడ్డలు, అందచందాల అంగనలు, ఆనంద సౌధాలు, అపార సంపదలు, అలరారే ఉద్యానవనాలు మొదలైన భోగభాగ్యాల యందు మునిగితేలుతూ, సుఖలాలసు లైన మానవులను కాలం మోసం చేస్తు ఉంటుంది. కాల ప్రవాహాన్ని తెలిసికొనుట దుస్సాధ్యం సుమా.

1-310-వ.

అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

టీక:- అది = ఆ; నిమిత్తంబుగాన్ = కారణమువలన; కాల = కాలముయొక్క; గతి = లక్షణము, నడక; ఎఱింగి = తెలిసి; విదురుండు; ధృతరాష్ట్రున = ధృతరాష్ట్రున; కు = కు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను;

భావము:- అందువల్ల కాలజ్ఞుడైన విదురుడు ధృతరాష్ట్రుని సమీపించి ఇలా ప్రబోధించాడు...

★1-311-మ.

"కనకాగార కళత్ర మిత్ర సుత సంఘాతంబులన్ ముందటం
గని ప్రాణేచ్ఛల నుండు జంతువుల నే కాలంబు దుర్లంఘ్యమై
యనివార్యస్థితిఁ జంపునట్టి నిరుపాయంబైన కాలంబు వ
చ్చె నుపాంతంబున; మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా!

టీక:- కనక = బంగారము; అగార = గృహములు; కళత్ర = భార్యలు; మిత్ర = మిత్రులు; సుత = సంతానముల; సంఘాతంబు లన్ = సమూహములను; ముందటన్ = ఎదురు గుండా; కని = చూసి; ప్రాణ = ప్రాణములమీద; ఇచ్ఛలన్ = మక్కువతో; ఉండు = ఉండు; జంతువులను = జీవులను; ఈ = ఈ; కాలంబు = కాలము; దుర్లంఘ్యము = దాటరానిది; ఐ = అయి; అనివార్య = నివారింపలేని; స్థితిన్ = విధముగ; చంపున్ = చంపును; అట్టి = అటువంటి; నిరుపాయంబు = ఉపాయములేనిది; ఐన = అయినట్టి; కాలంబు = కాలము; వచ్చెన్ = వచ్చెను; ఉపాంతంబున = సమీపమునకు; మాఱు = తిరుగు; దీని = దీని; కిన్ = కి; మదిన్ = మనసులో; చింతింపు = ఆలోచించుము; ధాత్రీశ్వరా = రాజా;

భావము:- "ఓరాజా! ప్రపంచంలోని మానవులు బంగారు భవనాలు, పుత్ర, మిత్ర, కళత్ర పరివారాన్ని ఎల్లప్పుడు ఎదురుగుండ చూచుకొంటు, ప్రాణాలమీద తీపిని పెంచుకొంటు ఉంటారు. అయితే దుర్నివారక మైన కాలం వాళ్లను చంపి తీరుతుంది. కాలాన్ని కాదని ఎదిరించే శక్తి ఎవరికీ లేదు. అక్కడ ఏ ఉపాయాలు పనిచేయవు. నీకు అలాంటి కాలం దగ్గరపడింది. మహారాజ! దీనికి ప్రతిక్రియ ఏదైన ఆలోచించండి.

(కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు పంచను చేరి రోజులు వెళ్ళదీస్తున్న ధృతరాష్ట్రునికి విదురుడు విరక్తి మార్గం ఉపదేశిస్తు ఇలా చెప్పసాగాడు.)

1-312-శా.

పుట్టంధుండవు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ
పట్టెల్లం జెడిపోయె, దుస్సహ జరాభారంబు పైఁగప్పె, నీ
చుట్టా లెల్లనుఁ బోయి; రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయలపంచ నుండఁదగవే? కౌరవ్యవంశాగ్రణీ!

టీక:- పుట్టు = పుట్టుకతోనే; అంధుండవు = గ్రుడ్డివాడవు; పెద్దవాఁడవు = వయసులో పెద్దవాడవు; మహా = గొప్ప; భోగంబులా = భోగములు అంటే అవీ; లేవు = లేవు; నీ = నీయొక్క; పట్టు = బలము; ఎల్లన్ = అంతా; చెడి = పాడు; పోయెన్ = అయిపోయినది; దుస్సహ = సహింప కష్టమైనది; జరా = ముసలితనము; భారంబున్ = బరువుగా; పైన్ = మీద; కప్పెన్ = పడెను; నీ = నీయొక్క; చుట్టాలు = బంధువులు; ఎల్లను = అందరును; పోయిరి = చనిపోయిరి; ఆలు = భార్య; మగఁడున్ = భర్తా; శోకంబునన్ = శోకములో; మగ్నులు = మునిగిన వారు; ఐ =

అయి; కట్టా = అయ్యో; దాయల = శత్రువులయొక్క, దాయాదులయొక్క; పంచన్ = నీడలో; ఉండన్ = ఉండగా; తగవే = ఉచితమా; కౌరవ్య = కౌరవులయొక్క; వంశ = వంశమునకు; అగ్రణీ = గొప్పవాడా.

భావము:- ఓ కురుకులశిరోమణీ అసలు నీవు పుట్టుకతోనే అంధుడవు. పైగా ఇప్పుడు మూడుకాళ్ల ముసలివైనావు. మహారాజ వైభవాలన్నీ అంతరించాయి. అధికారం అడుగంటింది. భరింపరాని వార్ధక్యం పైన బడింది. నా అన్నవారు అంతా గతించారు. ఇప్పుడు ఈ విధంగా బ్రతికి చెడ్డ మీ భార్యాభర్తలు బండు దుఃఖంతో మునిగి తేలుతూ అయ్యయ్యో దాయాదులైన పాండవుల పంచలో పడి ఉండటం ఏమంత బాగుంది.

★1-313-క.

పెట్టితిరి చిచ్చు గృహమునఁ
బట్టితిరి దదీయభార్యఁ, బాడడవులకుం
గొట్టితిరి, వారు మనుపఁగ
నెట్టన భరియింపవలెనె? యీ ప్రాణములన్.

టీక:- పెట్టితిరి = పెట్టినారు; చిచ్చు = నిప్పు; గృహమునన్ = ఇంటికి; పట్టితిరి = పట్టుకొన్నారు; తదీయ = వారి; భార్యన్; పాడు = చెడ్డ; అడవుల; కున్; కొట్టితిరి =గెంటివేసినారు; వారు; మనుపఁ =పోషిస్తుండగ;ఎట్టన = ఏవిధముగ; భరియింపన్ = బలవంతముగ నిలుపుకొన; వలెను; ఈ; ప్రాణములన్ = ప్రాణములను.

భావము:- మీరు పాండవుల కొంపకు చిచ్చుపెట్టారు. పాండవపత్నిని నిండుసభలో చెరబట్టారు. ఆ అమాయికుల్ని అన్యాయం చేసి అరణ్యాలకు వెళ్లగొట్టారు. ఇప్పుడు ఈ విధంగా వారి అండజేరి, వారు పెట్టిన తిండి తిని ప్రాణాలు నిలుపుకుంటున్నారు.

1-314-క.

"బిడ్డలకు బుద్ధి సెప్పని
గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పాం; డిదె పైఁ
బడ్డాఁ" డని భీముం డొఱ
గొడ్డెము లాడంగఁ గూడు గుడిచెద వధిపా!

టీక:- బిడ్డల = పిల్లల; కున్ = కి; బుద్ధి సెప్పని = మంచి దారిలో పెట్టుటకు శిక్షించని; గ్రుడ్డి = గ్రుడ్డివాని; కిన్ = కి; పిండంబు = పిండము {పిండము - (నిందా పూర్వకముగ) భోజనము, తద్దినము రోజు గుండ్రముగ చేయు ముద్దలు}; వండికొని = వండికొని; పాండు = తీసుకొని వెళ్ళండి; ఇదె = ఇదిగో; పైన్ = మీద; పడ్డాఁడు = పడ్డాడు; అని = అని; భీముండు = భీముడు; ఒఱ = మర్మపు; గొడ్డెములున్ = ఎత్తి పొడుపు మాటలు; ఆడంగన్ = పలుకు చుండగ; కూడు = తిండి; కుడిచెదవు = తింటున్నావు; అధిపా = రాజా;

భావము:- "ఏనాడు బిడ్డలకు బుద్ధిచెప్పనట్టి గ్రుడ్డివాడు, ఈ నాడు సిగ్గు లేకుండా మాయింటి మీద పడ్డాడు; ఈ కళ్లులేని కబోదికి ఇంత పిండం వండి పట్టుకెళ్లి పడెయ్యండి" అంటున్న భీముడు పలికే దెప్పుడు మాటలు వింటు, ఆ దిక్కుమాలిన తిండి ఎలా తినగలుగుతున్నావు మహారాజా!

(కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు పంచను చేరి రోజులు వెళ్ళదీస్తున్న ధృతరాష్ట్రునికి విదురుడు విరక్తి మార్గం ఉపదేశిస్తు ఇలా చెప్పసాగాడు. తన కొడుకులు పాండవులను అనేక బాధలు అవమానాలు పెడుతున్నప్పుడు తప్పని వారించ లేదు కదా. అలాంటిది సిగ్గు లేకుండ ఇవాళ ఎలా వాళ్ళ చేతికూడు తింటున్నావు అని అడుగుతున్నాడు. ద్విత్వాక్షరం"డ్డ' ప్రాసగా వేసి ఆపైన ఏడు డకారాలు వేసి ధ్వని సూచకం సాధించిన తీరు అద్భుతం.)

1-315-క.

కనియెదవో బిడ్డల నిఁక,

మనియెదవో, తొంటికంటె మనుమల మాటల్

వినియెదవో, యిచ్చెద ర

మ్మనియెదవో దానములకునవనీసురులన్.

టీక:- కనియెదవో = చూడగలవా ఏమిటి; బిడ్డలన్ = (నీ) పిల్లలను; ఇఁకన్ = ఇంకా; మనియెదవో = గొప్పగా జీవించెదవా ఏమిటి; తొంటి = పూర్వము; కంటెన్ = కంటే; మనుమల = మనవల యొక్క; మాటల్ = (ముద్దు) మాటలు; వినియెదవో = వింటావా ఏమిటి; ఇచ్చెదన్ = ఇచ్చెదను; రమ్ము = రండు; అనియెదవో = అంటావా ఏమిటి; దానముల = దానములు తీసుకొనుట; కున్ = కు; అవనీసురులున్ = బ్రాహ్మణులను {అవనీసురులు - భూమికి దేవతలు, విప్రులు};

భావము:- ఇక ఈ జన్మలో కన్నకొడుకుల ముఖాలు కనలేవు గదా; వెనుకటి దర్పంతో మనలేవు గదా; నీ మనుమల ముద్దు పలుకులు వినలేవు గదా; అగ్రహారాలు దానాలు గ్రహించటానికి ధరణీసురులను రమ్మనలేవు గదా; ఎందుకయ్యా ఇంకా ఈ బ్రతుకు.

1-316-క.

దేహము నిత్యము గా దని

మోహముఁ దెగఁ గోసి సిద్ధ మునివర్తనుఁడై

గేహము వెలువడు నరుఁడు

త్సాహముతోఁ జెందు ముక్తిసంపద ననఘా!"

టీక:- దేహము = శరీరము; నిత్యము = నిత్యమైనది; కాదు = కాదు; అని = అని; మోహమున్ = భ్రాంతిని; తెగన్ = తెగునట్లు; కోసి = నాశనము చేసి; సిద్ధ = సిద్ధులు; ముని = మునులు వలె; వర్తనుఁడు = ప్రవర్తించు వాడు;

ఐ = అయి; గేహము = గృహము; వెలువడు = విడుచు; నరుఁడు = మానవుని; ఉత్సాహము = ఉత్సాహము; తోన్ = తో; చెందు = చెందును; ముక్తి = ముక్తి అను; సంపద = భాగ్యము; అనఘా = పాపము లేనివాడా.

భావము:- ఈ దేహం నిత్యం కాదన్న సత్యం తెలుసుకొని దేహం మీద వ్యామోహం తెంచుకొని, యోగ్యమైన వైరాగ్యమార్గంలో ఉత్సాహంగా ముందడుగు వేసేవాడే మోక్షలక్ష్మిని కైవసం చేసుకోగలుగుతాడు.

## ధృతరాష్ట్రాదుల నిర్గమంబు

1-317-వ.

అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గంబుపదేశించిన, నతండు
ప్రజ్ఞాచక్షుం డై, సంసారంబుదిగనాడి, మోహపాశంబువలన నూడి
విజ్ఞానమార్గంబునంగూడి దుర్గమం బగు హిమవన్నగంబునకు నిర్గమించిన.

టీక:- అని = అని; విదురుండు = విదురుడు; ధృతరాష్ట్రున = ధృతరాష్ట్రున; కు = కు; విరక్తి = విరక్తి {విరక్తి - దేని అందు తగులము లేకపోవుట}; మార్గంబు = పద్ధతిని; ఉపదేశించిన = తెలియజేసిన; అతండు = అతడు; ప్రజ్ఞా = జ్ఞానముతో కూడుకొన్న; చక్షుండు = దృష్టి కలవాడు; ఐ = అయి; సంసారంబు = సంసార బంధములను; దిగనాడి = విడిచిపెట్టి; మోహ = భ్రాంతితో కూడిన; పాశంబు = పాశముల; వలనన్ = నుండి; ఊడి = విడివడి; విజ్ఞాన = జ్ఞానయోగ; మార్గంబునన్ = పద్ధతితో; కూడి = కలసి; దుర్గమంబు = దాటుటకు చాల కష్టమైనది; అగు = అయిన; హిమవన్నగంబు = హిమాలయము; కున్ = కు; నిర్గమించిన = బయలుదేరిన.

భావము:- ఈ విధంగా విదురుడు ధృతరాష్ట్రునికి విరక్తి మార్గాన్ని ఉపదేశించాడు. ఆ ప్రబోధంతో కురురాజు జ్ఞాననేత్రం విప్పారింది. అతడు సంసార సౌఖ్యాలను విసర్జించి, మోహ బంధాలను త్రెంచి, జ్ఞాన మార్గాన్ని అవలంబించి, దురంతాలైన హిమవత్పర్వత ప్రాంతాలకు ప్రయాణం సాగించాడు.

★1-318-శా.

అంధుండైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి, నియమప్రఖ్యాతయై యున్న త
ద్గాంధారక్షితినాథుకూఁతురును యోగప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతివెంట నేఁగె, నుదయత్సాధ్వీగుణారూఢయై.

టీక:- అంధుండు = గ్రుడ్డివాడు; ఐన = అయినట్టి; పతిన్ = భర్తను; వరించి = ప్రేమించి; పతి = పతి యొక్క; భావా = స్థితిని అనుసరించు; ఆసక్తి = ఇష్టపూర్వక నిర్ణయముతో; నేత్ర = కన్నులు; ద్వయీ = రెంటికిని; బంధ = కట్టుటవలన; ఆచ్ఛాదనమున్ = కప్పియుంచునది; ధరించి = కట్టుకొనిన; నియమ = నియమము కలిగి ఉండుట లో; ప్రఖ్యాత = కీర్తి పొందినది; ఐ = అయి; ఉన్న = ఉన్నటువంటి; తత్ = ఆ; గాంధార క్షితి నాథు కూఁతురును = గాంధారి కూడ {గాంధార క్షితి నాథు కూఁతురు - గాంధార (గాంధార) క్షితి (దేశ) నాథు (రాజు)

కూఁతురు (పుత్రిక), గాంధారి }; యోగప్రీతి = యోగమును అనుసరించు ఇష్టము; చిత్తంబు = మనసు; లోన్ = లో; సంధిల్లన్ = కూడిరాగా; పతి = భర్త; వెంటన్ = వెనుకనే; ఏఁగెన్ = వెళ్ళెను; ఉదయత్ = ఉద్భవించిన; సాధ్వీ = సాధు స్త్రీ; గుణ = గుణములు; ఆరూఢ = స్థిర పరచుకొన్నది; ఐ = అయి.

భావము:- గాంధారి ఉత్తమ ఇల్లాలు, పుణ్య పురంధ్రి, గాంధార మహారాజు గారాబు పుత్రిక. పుట్టంధు డైన భూ భర్తను భర్తగా వరించి, పతి చూడ లేని ప్రపంచాన్ని తను మాత్రం ఎందుకు చూడాలనే పట్టుదలతో కళ్ళకు గంతలు కట్టుకొని, లోకావలోకనం పరిహరించిన ఆ సాధ్వీమణి అతిశయించిన వైరాగ్యభావంతో పతి వెంట బయలుదేరి వెళ్ళింది హిమాలయలకి.

(విదురుడు విరక్తిమార్గం ఉపదేశించగా అతని వెనుక ధృతరాష్ట్రుడు, అతని సతి గాంధారి హిమాలయాలకు బయలుదేరిన సందర్భలోని పద్య మిది)

### 1-319-చ.

వెనుకకు రాక చొచ్చు రణవీరునికైవడి, రాజదండనం
బునకు భయంబు లేక వడిఁ బోయెడి ధీరుని భంగి, నప్పు డా
వనిత దురంతమైన హిమవంతము పొంత వనాంతభూమికిం
బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేగెఁ బ్రీతితోన్.

టీక:- వెనుకకు = వెనుకకు మరలి; రాక = రాకుండగ; చొచ్చు = దూసుకొని వెళ్ళు; రణ = యుద్ధము చేసే; వీరుని = యోధుని; కైవడిన్ = వలె; రాజ = రాజు చేత; దండనంబు = శిక్షింపబడుట; కున్ = కు; భయంబు = భయము; లేక = లేకుండగ; వడిన్ = వేగముగ; పోయెడి = వెళ్ళు; ధీరుని = ధీరుని; భంగిన్ = వలె; అప్పుడు = అప్పుడు; ఆ = ఆ; వనిత = స్త్రీ; దురంతము = అంతుపట్టుటకు కష్టము; ఐన = అయినట్టి; హిమవంతము = హిమాలయము; పొంతన్ = దగ్గరి; వన = అడవి; అంత = లోపలి; భూమి = ప్రదేశము; కిన్ = నకు; పెనిమిటి = భర్త; తోడన్ = తో; ఇంచుకయు = కొంచెముకూడ; భీతిన్ = భయమును; వహింపక = చెందకుండ; ఏగెన్ = వెళ్ళెను; ప్రీతి = ఇష్ట; తోన్ = పూర్వకముగ.

భావము:- సందేహం లేకుండా ముందుకు చొచ్చుకొనిపోయే సమర వీరుని రీతిగా, జంకూ గొంకూ లేకుండా రాజదండాన్ని అనుభవించటానికి చకచక సాగిపోయే మగధీరుని మాదిరిగా, తిరుగులేని నిర్భీతితో, తరిగిపోని ప్రీతితో, తన వల్లభుని వెంట హిమవంతం ప్రాంతంలోని దుర్గమవనాంతాలకు ఆమె నిర్గమించింది.

### 1-320-వ.

ఇట్లు విదురసహితులై గాంధారీధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబునసంధ్యావందనంబు సేసి, నిత్యహోమంబుగావించి, బ్రాహ్మణోత్తములకు గోహిరణ్య తిలవస్త్రాది దానంబులు సేసి నమస్కరించి, గురు వందనము గొఱకుఁ పూర్వప్రకారంబునం దండ్రిమందిరమునకుఁ జని యందు

విదురసహితులయిన తల్లిదండ్రులంగానక మంజుపీఠంబునఁ గూర్చున్న సంజయున కిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; విదుర = విదురునితో; సహితులు = కూడినవారు; ఐ = అయి; గాంధారి = గాంధారి; ధృతరాష్ట్రులు = ధృతరాష్ట్రులు; వనంబున = అడవి; కున్ = కి; చనిన = వెళ్ళగ; మఱునాఁడు = తరువాతి రోజు; ధర్మనందనుండు = ధర్మరాజు {ధర్మనందనుండు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; ప్రభాతంబున = ఉదయము నందు; సంధ్యావందనంబు = సంధ్యావందనము; చేసి = చేసికొని; నిత్య = ప్రతి నిత్యము చేయు; హోమంబు = హోమము; కావించి = పూర్తిచేసుకొని; బ్రాహ్మణ = బ్రాహ్మణులైన; ఉత్తములు = ఉత్తములు; కున్ = కు; గో = ఆవులు; హిరణ్య = బంగారము; తిల = నువ్వులు; వస్త్ర = వస్త్రములు; ఆది = మొదలగు; దానంబులున్ = దానములను; చేసి = చేసి; నమస్కరించి = నమస్కరించి; గురు = పెద్దలకు చేయు; వందనము = నమస్కారము; కొఱకున్ = కోసము; పూర్వ = ఇంతకు ముందు; ప్రకారంబునన్ = వలె; తండ్రి = తండ్రి యొక్క; మందిరము = భవనము; కున్ = కు; చని = వెళ్ళి; అందున్ = అందులో; విదుర = విదురునితో; సహితులు = కూడిన వారు; అయిన = అయినట్టి; తల్లిదండ్రులన్ = తల్లిదండ్రులను; కానక = కనుగొనలేక; మంజు = చక్కటి; పీఠంబునన్ = ఆసనమున; కూర్చున్న = కూర్చుండి యున్న; సంజయున = సంజయున; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఆ ప్రకారంగా గాంధారీ ధృతరాష్ట్రులు విదురునితో కూడి అరణ్యాలకు వెళ్లారు. ఆ మర్నాడు ధర్మరాజు ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకొని, సంధ్యవార్చుకొని, అగ్నికార్యాలు నెరవేర్చుకొన్నాడు. అనంతరం ఉత్తములైన విప్రులకు గోదాన సువర్ణదాన తిలదాన వస్త్రదానాదులు నిర్వర్తించి, పెద్దలకు నమస్కరించే నిమిత్తం యాథావిధిగా పెదతండ్రిగారి భవనానికి వెళ్లాడు. అక్కడ విదురుడూ, గాంధారీ ధృతరాష్ట్రులూ కనిపించలేదు. ఒక సురుచిరపీఠం మీద సుఖాసీనుడై ఉన్న సంజయుణ్ణి చూసి ధర్మరాజు ఇలా అడిగాడు…

1-321-సీ.

"మా తల్లిదండ్రు లీ మందిరంబున లేరు-
 సంజయ! వా రెందుఁ జనిరి నేఁడు
ముందఱ గానఁడు ముదుసలి మా తండ్రి-
 పుత్రశోకంబునఁ బొగులుఁ దల్లి
సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి-
 మందబుద్ధులమైన మమ్ము విడిచి
యెటఁ బోయిరో మువ్వు రెఱిఁగింపు గంగలోఁ-
 దన యపరాధంబుఁ దడవి కొనుచు

1-321.1-ఆ.

భార్యతోడఁ దండ్రి పరితాపమునఁ బడుఁ,

గపట మింత లేదు కరుణ గలదు,

పాండుభూవిభుండు పరలోకగతుఁడైన

మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు."

టీక:- మా = మాయొక్క; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; ఈ = ఈ; మందిరమునన్ = భవనములో; లేరు = లేరు; సంజయ = సంజయ; వారు = వారు; ఎందున్ = ఎక్కడికి; చనిరి = వెళ్ళితిరి; నేఁడు = ఈవేళ; ముందఱన్ = ఎదురుగ ఉన్నదే; కానఁడు = చూడలేడు; ముదుసలి = ముసలి వాడు; మా = మాయొక్క; తండ్రి = తండ్రి; పుత్ర = పుత్రుల వలని; శోకంబునన్ = వేదనతో; పొగులున్ = దుఃఖంచును; తల్లి = తల్లి; సౌజన్య = మంచితనమునకు; నిధి = నివాసము; ప్రాణ = ప్రాణముతో సమానమైన; సఖుఁడు = స్నేహితుడు; మా = మాయొక్క; పినతండ్రి = చిన్నాన్న; మంద = మందగించిన; బుద్ధులము = బుద్ధి కలిగిన వారలము; ఐన = అయినట్టి; మమ్మున్ = మమ్ములను; విడిచి = వదలివైచి; ఎటన్ = ఎక్కడకు; పోయిరో = వెళ్ళినారో; మువ్వురు = ముగ్గురు; ఎఱిఁగింపు = తెలియజేయుము; గంగ = గంగానది; లోన్ = లో; తన = తనయొక్క; అపరాధంబున్ = తప్పులను; తడవికొనుచు = తలచుకొనుచు;

భార్య = భార్య; తోడన్ = తోపాటు; తండ్రి = తండ్రి; పరితాపమునన్ = వేదనలో; పడున్ = పడును; కపటము = అబద్ధము; ఇంత = ఇంతకూడ; లేదు = లేదు; కరుణ = దయ; కలదు = కలదు; పాండు = పాండు; భూవిభుండు = రాజు; పరలోకగతుఁడు = చనిపోయిన వాడు; ఐన = అయినట్టి; మమ్మున్ = మమ్ములను; పిన్నవాండ్రన్ = పిల్లవాళ్ళను; మనిచె = పెంచి పోషించెను; అతఁడు = అతడు.

భావము:- "సంజయా!. మా తల్లీ తండ్రీ ఈ మేడలో కన్పించటం లేదు. వారెక్కడికి వెళ్లారో తెలియదు. మా తండ్రిగారు కంటిచూపు కరువైన మూడుకాళ్లముసలి. మా తల్లిగారు కడివెడు శోకంతో కన్నీరు మున్నీరుగా విలపిస్తుంటుంది. మా పినతండ్రిగారు మాకు ప్రాణ సమానుడు. సౌజన్యమూర్తి. ఈ ముగ్గురూ మందమతులమైన మమ్మల్ని వదలిపెట్టి ఎటు పాయారో తెలియదు. మా పెదతండ్రిగారు ఒకవేళ తాము చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెంది భార్యతో కూడా గంగలో దూకాడేమోనని అనుమానంగా ఉంది. తెలిస్తే చెప్పు. ఆయన చాలా అమాయకుడు, కరుణార్ద్రహృదయుడు. మా తండ్రి పాండుభూపాలుడు పరలోకగతుడు కాగా పిన్నవాళ్లమైన మమ్మల్ని ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేశారు."

1-322-వ.

అనిన సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుం డగుచు దన ప్రభువు వోయిన తెఱం గెఱుంగక, కొంత దడ వూరకుండి తద్వియోగ దుఃఖంబునఁ

గన్నీరు దుడిచికొనుచు, బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి, తన భర్తృ పాదంబుల మనంబుల నెన్నుచు ధర్మజున కిట్లనియె.

టీక:- అనిన = అనగా; సంజయుండు = సంజయుండు; దయా = దయ; స్నేహంబులన్ = స్నేహములకు; అతి = మిక్కిలి; కర్శితుండు = దిగులుచెందినవాడు; అగుచున్ = అవుతూ; తన = తనయొక్క; ప్రభువు = యజమాని; పోయిన = వెళ్ళిన; తెఱంగు = విధము; ఎఱుంగక = తెలియక; కొంత = కొంచెము; తడవు = సమయము; ఊరక = ఊరకనే; ఉండి = ఉండి; తత్ = ఆ; వియోగ = ఎడబాటు వలని; దుఃఖంబునన్ = బాధతో; కన్నీరు = కన్నీళ్ళని; తుడిచికొనుచున్ = తుడుచికొనుచు; బుద్ధి = మనో; బలంబునన్ = బలమువలన; చిత్తంబు = మనసుని; ధైర్య = ధైర్యముతో; ఆయత్తంబున్ = కూడినదిగ; చేసి = చేసి; తన = తన యొక్క; భర్తృ = యజమాని యొక్క; పాదంబులన్ = పాదములను; మనంబులన్ = మనసులో; ఎన్నుచున్ = ఎంచుకొనుచు; ధర్మజున్ = ధర్మరాజు {ధర్మజు – యముని కొడుకు, ధర్మరాజు}; కున్ = తో; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ధర్మజుని మాటలు విని సంజయుడు కనికరంతోనూ, ప్రేమతోనూ నిండిన గుండెతో తన ప్రభువు ఎక్కడికి పోయాడో తెలియక కొంచెము సేవు మౌనం వహించాడు. ఆ మహారాజు వెళ్లిపోయినందుకు పొంగివచ్చే కన్నీరు తుడుచుకొన్నాడు. గుండె దిటవుపరచుకొని తన ప్రభువు పాదాలు మనస్సులో ధ్యానిస్తూ ధర్మరాజుతో ఇలా అన్నాడు సంజయుడు.

1-323-తే.

"అఖిల వార్తలు మున్ను నన్నడుగుచుండు  
నడుగఁ డీ రేయి మీ తండ్రి యవనినాథ!  
మందిరములోన విదురుతో మంతనంబు  
నిన్న యాడుచు నుండెను నేఁడు లేఁడు.

టీక:- అఖిల = సమస్తమైన; వార్తలు = వార్తలు; మున్ను = ఇంతకు ముందు; నన్ను = నన్ను; అడుగుచుండున్ = అడుగుతుండేవాడు; అడుగఁడు = అడగలేదు; ఈ = ఈ; రేయి = రాత్రి; మీ = మీయొక్క; తండ్రి = తండ్రి; అవనినాథ = రాజ {అవనినాథుడు – భూమికి ప్రభువు, రాజు}; మందిరము = అంతఃపురము; లోనన్ = లోపల; విదురు = విదురుని; తోన్ = తో; మంతనంబు = ఇష్టాపూర్వక సంభాషణములు; నిన్న = క్రిందటి రోజు; ఆడుచున్ = మాట్లాడుచును; ఉండెను = ఉండెను; నేఁడు = ఈ రోజు; లేఁడు = లేడు.

భావము:- "ధర్మరాజా! నీపెద తండ్రిగారు ప్రతిదినమూ వార్తలేమిటని నన్ను అడుగుతుండేవారు. ఈ రాత్రి ఆయన నన్నేమీ అడగలేదు. నిన్నటివరకూ రాజమందిరంలో విదురునితో కలిసి రహస్యాలోచనలు చేస్తూ ఉండేవాడు. ఈనాడు కంటికి కన్పించకుండా వెళ్ళిపోయాడు.

1-324-వ.

విదురగాంధారీధృతరాష్ట్రులు నన్నువంచించి యెందుఁబోయిరో వారల నిశ్చ యంబు లెట్టివో యెఱుంగ"నని సంజయుండు దుఃఖించు సమయంబునఁ దుంబురు సహితుండై నారదుండు వచ్చిన; లేచి నమస్కరించి తమ్ములుం దాను నారదుం బూజించి కౌంతేయాగ్రజుం డిట్లనియె.

టీక:- విదుర = విదురుడు; గాంధార = గాంధారి; ధృతరాష్ట్రులు = ధృతరాష్ట్రులు; నన్ను = నన్ను; వంచించి = మోసగించి; ఎందున్ = ఎక్కడకు; పోయిరో = వెళ్ళినారో; వారల = వారియొక్క; నిశ్చయంబులు = నిర్ణయములు; ఎట్టివో = ఎలాంటివో; ఎఱుంగను = నాకు తెలియదు; అని = అని; సంజయుండు = సంజయుడు; దుఃఖించు = బాధపడు; సమయంబునన్ = సమయములో; తుంబురు = తుంబురుని; సహితుండు = కూడినవాడు; ఐ = అయి; నారదుండు = నారదుడు; వచ్చినన్ = రాగా; లేచి = లేచి; నమస్కరించి = మ్రొక్కి; తమ్ములున్ = తమ్ముళ్ళను; తానును = తానును; నారదున్ = నారదుని; పూజించి = పూజించి; కౌంతేయాగ్రజుండు = ధర్మరాజు {కౌంతేయాగ్రజుడు - కుంతి పెద్ద కొడుకు, ధర్మరాజు}; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- విదురుడూ గాంధారీ ధృతరాష్ట్రులూ నాకు చెప్పకుండా నా కన్నుగప్పి ఎక్కడికి వెళ్ళిపోయారో, ఏ ఉద్దేశ్యంతో వెళ్ళిపోయారో తెలియదు" అని సంజయుడు బావురుమన్నాడు. ఆ సమయంలో తుంబురునితో కూడి నారదుడు అక్కడికి విచ్చేసాడు. ధర్మరాజు లేచి ఎదురు వెళ్ళాడు. తమ్ముళ్ళూ తానూ వారికి నమస్కారం చేసి పూజించారు. అనంతరం అజాతశత్రుడు బ్రహ్మమానస పుత్రునితో.....

1-325-ఉ.

"అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ! వారు నేఁ
డెక్కడ వోయిరో యెఱుఁగ, నెప్పుడు బిడ్డల పేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచునుండుఁ దల్లి యెటు వోయెనొకో? విపదంబురాశికిన్
నిక్కము కర్ణధారుఁడవు నీవు జగజ్జనపారదర్శనా!"

టీక:- అక్కట = అయ్యో; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; గృహంబునన్ = ఇంటిలో; లేరు = లేరు; మహాత్మ = గొప్ప ఆత్మ కలవాడా; వారు = వాళ్ళు; నేఁడు = ఈ రోజు; ఎక్కడన్ = ఎక్కడకు; పోయిరో = వెళ్ళినారో; యెఱుఁగన్ = నాకు తెలియదు; ఎప్పుడు = ఎల్లప్పుడు; బిడ్డల = పుత్రుల యొక్క; పేరు = గొప్పదనము; గ్రుచ్చి = గురించి, నొక్కి; తాన్ = తాను; పొక్కుచున్ = దుఃఖ పడుచు; ఉండున్ = ఉండును; తల్లి = తల్లి; ఎటు = ఎక్కడకు; పోయెనొకో = పోయెనో పాపం; విపత్ = ప్రమాదములు అను; అంబు = సముద్రము; రాశి = దాటుట; కిన్ = కు; నిక్కము = నిజముగ; కర్ణధారుఁడవు = తరింపజేయువాడవు {కర్ణధారుడు - పడవ చుక్కాని పట్టు సరంగు, తరింపచేయువాడు}; నీవు; జగత్ = లోకములోని; జన = ప్రజలకు; పార = గమ్యము(ఒడ్డు); దర్శనా = చూపువాడా.

భావము:- "దేవర్షీ! నీవు సర్వజ్ఞుడవు. ముల్లోకాలలో నీకు తెలియనిది ఏమీలేదు. ఆపదలనే సముద్రం దాటించటానికి నిజంగా నీవు కర్ణధారుడవు. అయ్యో మహాత్మా! ఏమని చెప్పమంటావు. తెల్లవారి చూసే సరికి మాతల్లిదండ్రులు ఇంటిలో లేరు. వారు ఇల్లు వదలి ఎక్కడికి పోయారో తెలియకుండా ఉంది. సర్వదా తనబిడ్డలను పేరు పేరునా తలచుకొని తల్లడిల్లే మా తల్లి ఎటుపోయిందో ఏమయిపోయిందో."

1-326-వ.

అనిన విని సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె "నీశ్వరవశంబు విశ్వంబు ఈశ్వరుండ భూతముల నొకటితో నొకటిఁ జేర్చు నెడఁబాపు, సూచీ భిన్ననాసికలందు రజ్జుప్రోతంబులగుచుఁ గంఠరజ్జువులఁగట్టబడిఁన బలీవర్ధం బులంబోలెఁ గర్తవ్యాకర్తవ్యవిధాయక వేదలక్షణ యగు వాక్తంత్రి యందు వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులైన లోకపాలసహితంబు లై, లోకం బీశ్వరా దేశంబువహించు క్రీడాసాధనంబులగు నక్షకందుకాదులకెట్లు సంయోగ వియో గంబులట్లు క్రీడించు నీశ్వరుని క్రీడాసాధనంబు లైన జంతువులకు సంయోగ వియోగంబులగుచుండు, సమస్తజనంబును జీవరూపంబునధ్రువంబును, దేహ రూపంబుననధ్రువంబునై యుండు;మఱియు నొక్కపక్షంబునధ్రువంబునధ్రువం బునుం గాక యుండు, శుద్ధబ్రహ్మస్వరూపంబున ననిర్వచనీయంబుగ రెండునై యుండు, అజగరంబుచేత ఖ్రింగంబడిన పురుషుండన్యుల రక్షింపలేని తెఱం గునఁ బంచభూత మయంబై కాలకర్మ గుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు, కరంబులు గల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదంబు లాహారంబు లగుఁ; జరణంబులు గల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబు లగు; నధిక జన్మంబుగల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులుగల మృగాదులు భోజ్యంబులగు; సకలదేహి దేహంబు లందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు; అహస్త సహస్తాది రూపంబైన విశ్వ మంతయు నీశ్వరుండుగాఁ దెలియుము; అతనికి వేఱులేదు; నిజమాయా విశేషంబున మాయావియై జాతిభేదరహితుండైన యాశ్వరుండు బహుప్రకారంబుల భోగి భోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించు, గాన యనాథులు దీనులు నగు నాదు తల్లిదండ్రులు ననుం బాసి యేమయ్యెదరో యెట్లు వర్తింతురో

యని వగవం బని లేదు, అజ్ఞాన మూలం బగు స్నేహంబున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపు"మని మఱియు నిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; విని = విని; సర్వజ్ఞుండు = సర్వము తెలిసినవాడు; ఐన = అయినట్టి; నారదుండు = నారదుడు; ధర్మజున = ధర్మరాజు; కున్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = చెప్పెను; ఈశ్వర = భగవంతునికి; వశంబు = ఆధీనము అయి ఉండునది; విశ్వంబు = విశ్వము; ఈశ్వరుండ = భగవంతుడే; భూతములన్ = జీవులను; ఒకటి = ఒక; తోన్ = దానితో; ఒకటిన్ = ఒక దానిని; చేర్చున్ = చేరువ చేయును; ఎడఁ బాపున్ = దూరము జరుపును; సూచీ = సూదితో; భిన్న = పొడిచిన; నాసికలు = ముక్కులు; అందున్ = అందు; రజ్జు = త్రాడు; ప్రోతంబులు = గుచ్చబడినవి; అగుచున్ = అవుతూ; కంఠ = మెడలను; రజ్జువులన్ = తాళ్ళచేత; కట్టబడిఁన = కట్టబడినట్టి; బలీవర్ధంబులన్ = ఎడ్లను; పోలెన్ = వలె; కర్తవ్య = చేయతగినది; అకర్తవ్య = చేయతగనిది లలో; విధాయక = విధివత్ప్రకారమైనదానిని; వేద = తెలియజేయు; లక్షణ = లక్షణములు కలది; అగు = అయినట్టి; వాక్తంత్రి = మాట అను తంత్రి; అందున్ = లోని; వర్ణ = వర్ణములయొక్క; ఆశ్రమ = ఆశ్రమముల యొక్క; లక్షణంబులు = లక్షణములు; కల = ఉన్నట్టి; నామంబులు = నామములు; చేన్ = చేత; బద్ధులు = కట్టబడినవారు; ఐన = అయినట్టి; లోక = లోకులను; పాల = పాలించువారితో; సహితంబులు = కూడినవి; ఐ = అయి; లోకంబు = లోకములు; ఈశ్వర = భగవంతుని; ఆదేశంబు = ఆజ్ఞను; వహించున్ = శిరసావహించును; క్రీడా = ఆటకు; సాధనంబులు = పనికివచ్చు వస్తువులు; అగున్ = అయిన; అక్ష = పాచికలు; కందుక = బంతి; ఆదులు = మొదలగు వాని; కున్ = కి; ఎట్లు = ఏ విధముగనైతే; సంయోగ = కలయికలు; వియోగంబుల్ = ఎడబాటు లగునో; అట్లు = ఆ విధముగ; క్రీడించు = క్రీడించే; ఈశ్వరుని = భగవంతుని; క్రీడా = ఆటకు; సాధనంబులు = పనికివచ్చు వస్తువులు; ఐన = అయిన; జంతువులు = జీవులు {జంతువులు - పుట్టుక కలవి}; కున్ = కు; సంయోగ = కలయిక; వియోగంబులు = ఎడబాటులు; అగుచుండు = అవుతాయి; సమస్త = సమస్తమైన; జనంబును = జనమును; జీవ = జీవుని; రూపంబునన్ = రూపములో; ధ్రువంబును = స్థిరమైనది గను; దేహ = దేహము; రూపంబునన్ = రూపములో; అధ్రువంబును = అస్థిరమైనదిగను; ఐ = అయి; ఉండున్ = ఉండును; మఱియున్ = ఇంకనూ; ఒక్క = ఒక; పక్షంబునన్ = విధముగ; ధ్రువంబున్ = స్థిరమును; అధ్రువంబు నున్ = అస్థిరమును; కాక = కాకుండగను; ఉండున్ = ఉండును; శుద్ధబ్రహ్మ = శుద్ధబ్రహ్మ; స్వరూపంబునన్ = స్వరూపములో; అనిర్వచనీయంబుగన్ = వివరింపవీలుకానిదిగ; రెండును = రెండూకూడను; ఐ = అయి; ఉండున్ = ఉండును; అజగరంబు = కొండచిలువ; చేతన్ = చేత; ఖ్రింగంబడిన = మింగబడిన; పురుషుండు = మానవుడు; అన్యులన్ = ఇంకొకరిని; రక్షింపలేని = కాపాడలేని; తెఱంగునన్ = విధముగ; పంచ = ఐదు; భూత = భూతములతో; మయంబు = కూడినది; ఐ = అయి; కాల = కాలమునకును; కర్మ = కర్మలకును; గుణ = గుణముల కును; ఆధీనంబు = వశములో ఉండునది; ఐన = అయిన; దేహంబు = శరీరము; పరులన్ = ఇతరుల; రక్షింపన్ = రక్షించుటకు; సమర్థంబు = శక్తి కలది; కాదు = కాదు; కరంబులు = చేతులు; కల = కలిగిన; జంతువులు = జీవులు; కున్ = కు; కరంబులు = చేతులు; లేని = లేనట్టి; చతుష్పదంబులు = నాలుగు కాళ్ళు ఉన్నవి; ఆహారం బులు = ఆహారములు; అగున్ = అగును; చరణంబులు = కాళ్ళు; కల = కలిగిన; ప్రాణులు = జీవులు; కున్ = కు; చరణంబులు = కాళ్ళు; లేని = లేనట్టి; తృణ = గడ్డి; ఆదులు = మొదలగునవి; భక్షణీయంబులు = తినదగినవి; అగున్ = అగును; అధిక = పెద్ద; జన్మంబు = పుట్టుక; కల = కలిగిన; వ్యాఘ్ర = పులులు; ఆదుల = మొదలగు; కున్

= వానికి; అల్ప = చిన్న; జన్మంబులు = పుట్టుకలు; కల = కలిగిన; మృగ = లేడి; ఆదులు = మొదలగునవి; భోజ్యంబులు = తినదగినవి; అగున్ = అగును; సకల = సమస్త; దేహి = జీవుల యొక్క {దేహి – శరీరము కలిగినది, జీవి}; దేహంబులు = శరీరములు; అందున్ = లో; జీవుండు = జీవుడు; కలుగుటన్ = కలుగుట; చేసి = వలన; జీవుని = జీవి; కిన్ = కి; జీవుండ = జీవే; జీవిక = జీవించుటకు ఆధారము; అగున్ = అగును; అహస్త = హస్తములు లేనివి; సహస్త = హస్తములు ఉన్నవి; ఆది = మొదలగు; రూపంబు = రూపములు కలవి; ఐన = అయినట్టి; విశ్వము = విశ్వము; అంతయు = సమస్తమును; ఈశ్వరుండుగాన్ = ఈశ్వరుడు అని; తెలియుము = తెలిసికొనుము; అతని = అతని; కిన్ = కి; వేఱు = అన్యమైనది ఏమియును; లేదు = లేదు; నిజ = తన; మాయా = మాయ యొక్క; విశేషంబున = విశిష్టత వలన; మాయావి = మాయకలవాడు; ఐ = అయి; జాతి = జాతి, పుట్టుకతో వచ్చిన; భేద = భేదములు; రహితుండు = లేనివాడు; ఐన = అయిన; ఈశ్వరుండు = భగవంతుడు; బహు = అనేక; ప్రకారంబు లన్ = విధములుగా; భోగి = అనుభవించునది; భోగ్య = అనుభవింపబడునవి అనబడే; రూపంబులన్ = రూపములతో; అంతరంగ = లోపటలను; బహిరంగంబులన్ = బయటల యందును; దీపించున్ = ప్రకాశించును; కాన = కావున; అనాథులు = దిక్కులేనివారు; దీనులున్ = దీనులును; అగు = అయిన; నాదు = నాయొక్క; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; ననున్ = నన్ను; పాసి = వదలి; ఏమి = ఏమి; అయ్యెదరో = అవుతారో; ఎట్లు = ఏ విధముగ; వర్తింతురో = ఉండెదరో; అని = అని; వగవన్ = దుఃఖ పడుటకు; పనిలేదు = అవసరములేదు; అజ్ఞాన = అజ్ఞానమునకు; మూలంబు = మూలమైనట్టిది; అగు = అయిన; స్నేహంబునన్ = స్నేహభావమువలన; ఐన = అయినను; మనస్ = మనసు యొక్క; వ్యాకులత్వంబు = చీకాకుపడుటను; పరిహరింపుము = తొలగించుము; అని = అని; మఱియున్ = మళ్ళా; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = చెప్పెను.

భావము:- ఆ పలుకుల విని నారదుడు ఇలా అన్నాడు."ధర్మరాజా! ఈ విశ్వమంతా ఈశ్వరాధీనం. పరమేశ్వరుడే ప్రాణులను ఒకరితో ఒకరిని కలుపుతూ విడదీస్తూ ఉంటాడు. ముక్కుత్రాళ్ళు పొడిచి, మెడకు పలుపులు తగిలించి, పగ్గాలు చేత పట్టుకొని, కర్షకుడు ఎద్దులను త్రిప్పినట్లుగా భగవంతుడు కర్తవ్యాకర్తవ్యాలను బోధించి, వేద వాక్కులనే త్రాడు బిగించి, వర్ణాశ్రమధర్మాలకు అనుగుణమైన విధంగా ఇంద్రాది దిక్పాలకులతో సహా ప్రాణులను ఇష్టం వచ్చినట్లు త్రిప్పుతుంటాడు. క్రీడాకారుని ఇష్టానుసారం పాచికలూ, బంతులూ మొదలైన ఆటవస్తువులు కలుస్తూ విడిపోతూ ఉన్నట్లు, భగవంతుని ఇచ్ఛానుసారంగా ప్రాణులకు సంయోగ వియోగాలు ప్రాప్తిస్తుంటాయి. సమస్త దేవలోకమూ ఆత్మరూపంలో నిత్యమైనదై దేహరూపంలో అనిత్యమైనదై ఉంటుంది. మరోవిధంగా చూస్తే రెండు కాకుండా ఉంటుంది. అనిర్వచనీయమైన బ్రహ్మస్వరూపం పొందినప్పుడు నిత్యానిత్యమై కాలకర్మాధీనమై ఉంటుంది. సంసారపంక నిర్మగ్నమైన దేహం పరులను కాపాడలేదు. చేతులున్న ప్రాణులకు చేతులులేని చతుష్పాద జంతువులూ, కాళ్ళుండి కదలగల ప్రాణులకు కాళ్ళులేని తృణాదులూ, ఆహార మవుతున్నాయి. పెద్దజంతువులైన పెద్దపులులు మొదలైనవి లేళ్లు మొదలైన చిన్న జంతువులను తింటున్నవి. సమస్త దేహధారుల దేహాల్లో జీవుడు ఉన్నందువల్ల జీవికి జీవియే జీవనాధార మగుతున్నాడు. చేతులున్న ప్రాణులతోనూ, చేతులులేని ప్రాణులతోనూ నిండిన ఈ విశ్వమంతా ఈశ్వర స్వరూపంగా భావించు, ఆయన కంటే అన్యం లేదు. తన మాయావిశేషంచేత మహామాయావి అయిన పరాత్పరుడు బహురూపాలు ధరించి తానే భోక్తయై, భోజ్యమై; లోపలా, వెలుపలా అంతటా తానై విరాజిల్లుతున్నాడు. అందువల్ల మహారాజా! నా

తల్లిదండ్రులు దీనులే! దిక్కు లేనివారే! నన్ను వదలి ఏమైపోతారో? ఏలా జీవిస్తారో? అనే విచారం మాను, అజ్ఞానమూలకమైన మమకారం పెంచుకొని అనవసరంగా మనస్సును క్లేశపెట్టుకోవద్దు.

1-327-ఆ.

అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁ డగు విష్ణుఁ
డసురనాశమునకు నవతరించి
దేవకృత్యమెల్లఁ దీర్చి చిక్కిన పని
కెదురుసూచుచుండు నిప్పు డధిప!

టీక:- అట్టి = అటువంటి; కాల = కాలము; రూపుఁడు = రూపముగ కలవాడు; అఖిల = సమస్తమైనది; ఆత్ముఁడు = తానే ఐన వాడు; అగు = అయిన; విష్ణుఁడు = భగవంతుడు; అసుర = రాక్షస; నాశమున = నాశనము; కున్ = కొరకు; అవతరించి = అవతరించి; దేవ = దేవతల; కృత్యము = పని; ఎల్లన్ = సమస్తము; తీర్చి = పూర్తిచేసి; చిక్కిన = మిగిలిన; పని = పని; కిన్ = కోసము; ఎదురుసూచుచు = ఎదురుచూచుచు; ఉండున్ = ఉండును; ఇప్పుడు = ఇప్పుడు; అధిప = గొప్పవాడా;

భావము:- కాలస్వరూపుడై అఖిలాంతర్యామి అయిన భగవంతుడు అసురులను సంహరించటం కోసం అవతరించాడు. దేవకార్యం తీరిపోయింది. ఇప్పుడు మిగిలిన పనికోసం నిరీక్షిస్తున్నాడు.

## నారదుని గాలసూచనంబు

1-328-మత్త.

ఎంత కాలము గృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు మీ
రంత కాలము నుండుఁ డందఱుఁ నవ్వలం బనిలేదు, వి
భ్రాంతి మానుము కాలముం గడవంగ నెవ్వరు నోప రీ
చింత యేల నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్.

టీక:- ఎంత = ఎంత; కాలమున్ = కాలము; కృష్ణుఁడు = భగవంతుడు; ఈశ్వరుఁడు = భగవంతుడు; ఈ = ఈ; ధరిత్రిన్ = భూమి మీద; చరించున్ = విహరిస్తాడో; మీరు = మీరు కూడ; అంత కాలమున్ = అంత వరకు; ఉండుఁడు = ఉండండి; అందఱున్ = మీరు అందరును; అవ్వలన్ = ఆపైన; పని లేదు = అవసరము లేదు; విభ్రాంతి = మిక్కట మైన భ్రమను; మానుము = వదులుము; కాలమున్ = కాలమును; కడవంగన్ = దాటుటకు; ఎవ్వరున్ = ఎవరూ కూడా; ఓపరు = సమర్థులు కాలేరు; ఈ = ఈ; చింత = వగపు; ఏల = ఎందులకు; నరేంద్ర = రాజులలో; సత్తమ = ఉత్తముడా (ధర్మరాజ); చెప్పెదన్ = చెప్తాను; వినుము; అంతయున్ = జరిగింది అంతా.

భావము:- (నారదుడు ధృతరాష్ట్రాదుల గురించి కలత చెందిన ధర్మరాజుకి కాలసూచన చేస్తున్నాడు.)

"మహారాజా! కలవరపాటువదలిపెట్టు. శ్రీకృష్ణభగవానుడు ఎంతవరకు ఈభూమ్మీద ఉంటాడో, అప్పటి దాకా మీ పాండవులు అందరు కూడ ఉండండి. ఆయన అవతారంచాలించిన పిమ్మట మీరు ఉండనక్కర్లేదు; ఎంతటి వారైనా సరే కాల ప్రభావానికి తలవంచాల్సిందే. ధృతరాష్ట్రాదులకు ఏం జరిగిందో అంతా వివరంగా చెప్తా. విను; ఇంకా దుఃఖించటం అనవసరం.

1-329-వ.

ధృతరాష్ట్రుండు గాంధారీ విదుర సహితుండై హిమవత్పర్వత దక్షిణ భాగంబున నొక్క ముని వనంబునకుం జని, తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడు ప్రవాహంబులయి, పాఱిన పుణ్యతీర్థంబునం గృతస్నానుం డై యథావిధి హోమం బొనరించి, జలభక్షణంబు గావించి, సకల కర్మంబులు విస ర్జించి విఘ్నంబులం జెందక నిరాహారుండయి, యుపశాంతాత్ముండయి పుత్రార్థ దారైషణంబులు వర్జించి, విన్య స్తాసనుండై ప్రాణంబుల నియమించి, మనస్సహి తంబులైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి, హరిభావనారూపంబగు ధారణాయోగంబుచే రజస్సత్త్వతమోరూపంబు లగుమలంబులమూఁటిని హరించి, మనంబు నహంకారాస్పదంబైన స్థూల దేహంబు వలనం బాపి బుద్ధి యందు నేకీకరణంబు సేసి, యట్టి విజ్ఞా నాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞుని యందుఁ బొందించి దృష్టం బైన యీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి నాధారభూతంబైన బ్రహ్మ మందుఁ గలిపి, లోపలి గుణక్షోభంబును వెలుపలి యింద్రియవిక్షోపంబునులేక నిర్మూలితమాయాగుణవాసనుండగుచు, నిరుద్ధం బులగు మన శ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖిలాహారంబులను వర్జించి, కొఱడు చందంబున.

టీక:- ధృతరాష్ట్రుండు = ధృతరాష్ట్రుండు; గాంధారీ = గాంధారితోను; విదుర = విదురునితోను; సహితుండు = కూడినవాడు; ఐ = అయి; హిమవత్పర్వత = హిమాలయములకు; దక్షిణ = దక్షిణ; భాగంబున = దిగ్భాగమున; ఒక్క = ఒక; ముని = ముని యొక్క; వనంబు = ఆశ్రమము; కున్ = కు; చని = వెళ్ళి; తొల్లి = పూర్వము; సప్తర్షులు = సప్తర్షులు; కున్ = కు; సంతోషంబున్ = ఆనందమును; చేయు = కలుగ జేయుట; కొఱకున్ = కోసము; ఆకాశ గంగ = ఆకాశగంగ; ఏడు = ఏడు (7); ప్రవాహంబులు = పాయలు; అయి = అయి; పాఱిన = ప్రవహించిన; పుణ్య = పుణ్యమును ఒసగు; తీర్థంబునన్ = రేవులో; కృత = చేసిన; స్నానుండు = స్నానము కలవాడు; ఐ = అయి; యథా విధి = పద్ధతి ప్రకారము; హోమంబు = హోమము; ఒనరించి = పూర్తిచేసి; జలభక్షణంబు = నీటిని ఆహారముగ

తీసుకొనుట; కావించి = చేసి; సకల = సమస్త; కర్మంబులున్ = కర్మలు; విసర్జించి = విడిచిపెట్టి; విఘ్నంబులన్ = (నియమలకు) భంగములు; చెందక = కలుగకుండ; నిరాహారుండు = ఆహారము తీసుకొనని వాడు; అయి = అయి; ఉపశాంతి = ప్రశాంతి పొందిన; ఆత్ముండు = ఆత్మకలవాడు; అయి = అయి; పుత్ర = పుత్రులు; అర్థ = ధనము; దార = భార్యలు వలన; ఈషణంబులున్ = ఈషణములను (భావశేషములు); వర్జించి = విడిచిపెట్టి; విన్యస్త = చక్కగావేసిన; ఆసనుండు = ఆసనములో ఉన్నవాడు; ఐ = అయి; ప్రాణంబులన్; నియమించి = సంయమనముచేసి, ప్రాణాయామములు చేసి; మనస్సహితంబు = మనస్సుతో పాటువి; ఐన = అయినట్టి; చక్షుః = కన్నులు; ఆది = మొదలగు; ఇంద్రియంబులన్ = ఇంద్రియములను; ఆఱింటిని = ఆరింటిని {ఇంద్రియములు 6- మనస్సు, పంచేంద్రియములు}; విషయంబులన్ = విషయముల వెనుక {విషయములు – ఇంద్రియార్థ ములు}; ప్రవర్తింపనీక = నడవనీయక (చిత్తవృత్తిని నిరోధించి); నివర్తించి = మరల్చి; హరిభావన = భగవంతుని ధ్యానించుట అనే; రూపంబు = స్వభావము; అగు = కలిగిన; ధారణా = చిత్తమునందు ధరించు; యోగంబు = యోగాభ్యాసము; చేన్ = చేత; రజస్ = రజోగుణ; స్సత్త్వ = సత్త్వగుణ; తమో = తమోగుణ; రూపంబులు = స్వభావ ములు; అగు = కలిగిన; మలంబులన్ = మలములను; మూఁటిని = మూడింటిని; హరించి = నాశనముచేసి; మనంబున్ = మనసును; అహంకార = అహంకారమునందు; ఆస్పదంబు = నివాసము ఏర్పరుచుకొన్నది; ఐన = అయినట్టి; స్థూల = స్థూల; దేహంబు = దేహము; వలనన్ = వలన; పాపి = దూరముచేసి; బుద్ధి = బుద్ధి; అందున్ = లో; ఏకీకరణంబు = ఐక్యము; చేసి = చేసి; అట్టి = అటువంటి; విజ్ఞాన = విజ్ఞానరూప; ఆత్మను = ఆత్మను; దృశ్య = కంటికి; అంశంబు = కనిపించునది (జగత్తు); వలనన్ = నుండి; వియోగించి = విడదీసి; క్షేత్రజ్ఞుని = ఆత్మ; అందున్ = లో; పొందించి = చక్కగా కలిపి; దృష్టంబు = చూడబడినది; ఐన = అయినట్టి; ఈశ్వరుని = భగవంతుని; వలనన్ = వలన; క్షేత్రజ్ఞునిన్ = ఆత్మను; పాపి = దూరముచేసి; మహాకాశంబు = పైన అంతట ఉన్న ఆకాశము; తోడన్ = తో; ఘటాకాశమున్ = కుండలోని ఆకాశమును; కలుపు = కలుపు; కైవడిన్ = విధముగ; ఆధారభూతంబు = ఆధారభూతము, కారణాంశము; ఐన = అయినట్టి; బ్రహ్మము = బ్రహ్మము; అందున్ = లో; కలిపి = కలిపి; లోపలి = లోపలఉండే; గుణ = గుణములయొక్క; క్షోభంబును = ఘర్షణమును; వెలుపలి = వెలుపల ఉండే; ఇంద్రియ = ఇంద్రియముల; విక్షేపంబును = చాంచల్యమును; లేక = లేకుండగ; నిర్మూలిత = నిర్మూలింపబడిన; మాయా = మాయయు; గుణ = గుణముల యొక్కయు; వాసనుండు = సంస్కారము కలవాడు; అగుచున్ = అవుతూ; నిరుద్ధంబులు = నిరోధింపబడినవి; అగు = అయిన; మనస్ = మనసు; చక్షుః = కన్నులు; ఆది = మొదలగు; ఇంద్రియంబులు = ఇంద్రియములు; కలిగి = కలిగి; అఖిల = సమస్తమైన; ఆహారంబులను = ఆహారములను; వర్జించి = విడిచిపెట్టి; కొఱడు = కొయ్య; చందంబున = వలె.

<u>భావము:-</u> మీ పెత్తండ్రి ధృతరాష్ట్రుడు గాంధారీ విదురులతో కలిసి హిమవత్పర్వతానికి దక్షిణంగా ఉన్న మునుల తపోవనానికి వెళ్లాడు. అక్కడ పూర్వం సప్తమహర్షుల సంతోషం కోసం ఆకాశగంగ ఏడు పాయలుగా ప్రవహించింది. సప్తశ్రోత మనే ఆ పుణ్యతీర్థంలో మీ తండ్రిగారు మూడు వేళలా స్నానం చేస్తూ, యథావిధిగా అగ్నికార్యం ఆచరిస్తూ, నిరాహారుడై కేవలం జలం మాత్రమే స్వీకరిస్తూ, సకలకర్మలూ పరిత్యజించి నిరాటంకంగా ప్రశాంతచిత్తుడై, ఈషణత్రయాన్ని విసర్జించి దర్భాసనాసీనుడై, జితేంద్రియుడై, సత్వరజస్తమో గుణాల మాలిన్యాన్ని పోకార్చి, తదేకధ్యానంతో శ్రీహరిని చింతిస్తూ ఉన్నాడు. ఆ విధంగా ఆయన తన మనస్సును అహంకారానికి ఆలవాలమైన స్థూల దేహంనుంచి సమైక్యంచేసాడు. అట్టి విజ్ఞానాత్మకమైన బుద్ధిని

విషయాలనుండి బుద్ధియందు మళ్లించి ఆత్మయందు సంలగ్నం చేసాడు. అట్టి ఆత్మను మహాకాశంలో ఘటాకాశాన్ని కలిపినట్టు సమస్త జగత్తుకు ఆధారభూతుడైన పరమాత్మలో సంలీనం చేసాడు, ఇప్పుడు మీ తండ్రి అంతరింద్రియ బాహ్యేంద్రియాల సంక్షోభం లేకుండా మాయను నిరోధించి, వాంఛలను నిర్మూలించి స్థాణువువలె పర్ణశాల లోపల ఉన్న వేదికపై నిశ్చలంగా ఆసీనుడై ఉన్నాడు.

1-330-మ.

ఉటజాంతస్స్థలవేదికిన్ నియతుఁడై యున్నాఁడు నే డాదిగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా నిత్యాగ్ని యోగాగ్ని త
త్పటుదేహంబు దహింపఁ జూచి, నియమప్రఖ్యాత గాంధారి యి
ట్టటు వో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా!

టీక:- ఉటజ = పర్ణశాల; అంతః = లోపలి; స్థల = స్థలమున; వేదికిన్ = గట్టుమీద; నియతుఁడు = నియమముకలవాడు; ఐ = అయి; ఉన్నాఁడు = ఉన్నాడు; నేడు = ఈ రోజు; ఆదిగాన్ = మొదలుకొని; ఇటపైన్ = ఇంకనుంచి; ఏనవనాఁడు = ఐదవ దినమున; మేన్ = శరీరము; విడువఁగా = విడిచిపెట్టగ; నిత్య = నిత్యము చేయు హోమమునందలి; అగ్ని = అగ్ని; యోగ = యోగము వలని; అగ్ని = అగ్ని; తత్ = ఆ; పటు = బలిష్టమైన; దేహంబున్ = దేహమును; దహింపన్ = కాల్చివేయగ; చూచి = చూసినదై; నియమ = నియమ పాలనలో; ప్రఖ్యాత = పేరుపొందిన; గాంధారి = గాంధారి; ఇట్టట్టు = ఎటూ; ఓన్ = పోవుటకు; ఓల్లక = ఒప్పుకొనక; ప్రాణవల్లభు = ప్రాణములకు ప్రభువు, భర్త; తోన్ = తో; అగ్నిన్ = అగ్నిలో; పడున్ = పడును; భూవరా = భూమికి భర్తా.

భావము:- మహారాజా! మీ తండ్రి ధృతరాష్ట్రుడు నేటికి ఐదవనాడు యోగాగ్నిలో దేహత్యాగం చేయటానికి సంసిద్ధుడై ఉన్నాడు. ఆ విధంగా ఆయన యోగాగ్నిలో దగ్ధం కావటం చూసి మహాపతివ్రత అయిన గాంధారి నిస్సంకోచంగా తన ప్రాణేశ్వరునితోపాటు ఆ పావక జ్వాలల్లో పడి భస్మమై పోతుంది.

1-331-క.

అంతట వారల మరణము
వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా
సంతాప మొదవఁ బ్రీత
స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా!"

టీక:- అంతట = అప్పుడు; వారల = వారియొక్క; మరణమున్ = మరణములు; వింత = విచిత్రము; అగుచున్ = అవుతూ; చూడఁబడిన = చూసిన; విదురుఁడు = విదురుడు; చింతా = దుఃఖము వలన; సంతాపము = బాధ; ఒదవన్ = కలుగగా; ప్రీత = వదులైన; స్వాంతుండు = స్వాంతము కలవాడు; ఐ = అయి; తీర్థములు = పుణ్యక్షేత్రములు; కున్ = కు; చనియెడున్ = వెళ్ళును; అధిపా = గొప్పవాడా.

భావము:- అప్పుడు ఆ మహారాజ దంపతుల ఆత్మత్యాగానికి ఆశ్చర్యచకితుడైన విదురుడు చింతా సంతాపాలు పెనగొనిన హృదయంతో పుణ్యతీర్థాలకు వెళ్ళిపోతాడు."

1-332-వ.

అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనుని కెఱిగించి తుంబుర సహితుం డయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె.

టీక:- అని = అని; విదుర = విదురుడు; ఆదుల = మొదలగువారి; వృత్తాంతంబున్ = సమాచారము; అంతయున్ = సమస్తమును; ధర్మనందనుని = ధర్మరాజున; కిన్; ఎఱిగించి = తెలియజేసి; తుంబుర = తుంబురు నితో; సహితుండు = కూడినవాడు; అయిన = అయిన; నారదుండు = నారదుడు; స్వర్గంబున = స్వర్గమున; కున్ = కు; నిర్గమించిన = వెడలిన; వెనుక = తరువాత; ధర్మజుండు = ధర్మరాజు {ధర్మజుడు - యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; భీమునిన్ = భీముని; చూచి = చూసి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా విదుర, గాంధారీ, ధృతరాష్ట్రుల వృత్తాంతాన్ని ధర్మరాజుకు సంపూర్ణంగా వివరించిన నారదుడు తుంబురునితో కూడా స్వర్గలోకానికి సాగిపోయాడు. అనంతరం అజాతశత్రువు భీమసేనుణ్ణి చూసి ఇలా అన్నాడు....

1-333-సీ.

"ఒక కాలమునఁ బండు నోషధిచయము వే-
 ఱొక కాలమునఁ బండకుండు నండ్రు;
క్రోధంబు లోభంబుఁ గ్రూరత బొంకును-
 దీపింప నరులు వర్తింతు రండ్రు;
వ్యవహారములు మహావ్యాజయుక్తము లండ్రు-
 సఖ్యంబు వంచనా సహిత మండ్రు;
మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు-
 సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు;

1-333.1-తే.

గురుల శిష్యులు దూషించి కూడ రంద్రు;
శాస్త్రమార్గము లెవ్వియుఁ జరుగ వంద్రు;
న్యాయపద్ధతి బుధులైన నడవ రంద్రు;
కాలగతి నింతయై వచ్చెఁ గంటె నేఁడు.

టీక:- ఒక=ఒక; కాలమునన్ = కాలములో; పండు = పండునట్టి; ఓషధి = ధాన్యముల; చయము = సమూహము; వేఱొక = మరియొక; కాలమునన్ = కాలములో; పండకుండున్ = పండవు; అంద్రు = అందురు; క్రోధంబు = క్రోధము; లోభంబు = లోభము; క్రూరత = క్రూరత్వము; బొంకును = అసత్యము; దీపింపన్ = చెలరేగగ, ఎక్కువ కాగా; నరులు = మానవులు; వర్తింతురు = ఉండుదురు; అంద్రు = అందురు; వ్యవహారములు = తగవులు, పరిష్కారములు; మహా = మిక్కిలి; వ్యాజ = మిషలతో; యుక్తములు = కూడుకొన్నవి; అంద్రు = అందురు; సఖ్యంబు = స్నేహములు; వంచనా = వంచనతో; సహితము = కూడినవి; అంద్రు = అందురు; మగలు = భర్తలు; తోన్ = తో; ఇల్లాండ్రు = భార్యలు; మచ్చరించెదరు = స్పర్ధిస్తారు, ద్వేషిస్తారు; అంద్రు = అందురు; సుతులు = సంతానము; తండ్రులన్ = తండ్రులను; తెగన్ = దిక్కరించ వలనని; చూతురు = చూచెదరు; అంద్రు = అందురు;

గురుల = గురువులను; శిష్యులు; దూషించి=నిందించి; కూడరు=కలిసిరారు; అంద్రు=అందురు; శాస్త్ర = శాస్త్రీయ; మార్గములు = విధానములు; ఎవ్వియున్ = ఏవికూడా; జరుగవు = నడవవు, సాగవు; అంద్రు = అందురు; న్యాయ = న్యాయమైన; పద్ధతి = పద్ధతిలో; బుధులు = బుద్ధిమంతులు; ఐన = అయినను, కూడా; నడవరు = నడువరు; అంద్రు = అందురు; కాల = కాలానుగుణ; గతి = విధానములు; ఇంత = ఈ విధముగ; ఐ = అయ్యి; వచ్చెన్ = వచ్చెను; కంటె = చూచితివా; నేఁడు = ఈవేళ.

భావము:- తమ్ముడూ చూశావు కదా కాలగమనంలో ఎంత మార్పు వచ్చిందో పంటలు సకాలానికి పండటం లేదు. క్రోధం, లోభం క్రౌర్యం, అసత్యం మితిమీరి ప్రజలు ప్రవర్తిస్తున్నారు. వ్యాపారాలలో మోసం చోటు చేసుకొంటున్నది. స్నేహంలో ద్రోహం కనిపిస్తూ ఉంది. భార్యలు భర్తలతో స్పర్ధిస్తున్నారు. కొడుకులు కన్నతండ్రులపై కాలుదువ్వుతున్నారు. శిష్యులు గురువులను దూషిస్తున్నారు. శాస్త్రవిధులు కుంటుబడ్డాయి. విజ్ఞులు సైతం న్యాయ మార్గాన్ని విడిచిపెట్టారు. కాలగమనం ఎంతగా వింతగా మారిపోయింది.

★1-334-మ.

హరిఁ జూడన్ నరుఁ డేగినాడు నెల లే డయ్యెం గదా రారు కా
లరు లెవ్వారును; యాదవుల్ సమద లోలస్వాంతు లీవేళ సు
స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?
యెరవై యున్నది చిత్త మీశ్వరకృతం బెట్లో కదే! మారుతీ!

టీక:- హరిన్ = కృష్ణుని; చూడన్ = చూచుటకు; నరుఁడు = అర్జునుడు; ఏగినాడు = వెళ్ళినాడు; నెలలు = నెలలు; ఏడు = ఏడు (7); అయ్యెన్ = ఆయెను; కదా = కదా; రారు = వచ్చుటలేదు; కాలరులు = వార్తాహరులు; ఎవ్వారును = ఎవరును; యాదవుల్ = యాదవులు; సమతన్ = సమత్వము చెందిన; లోల = చాంచల్యముతో కూడిన; స్వాంతులు = మనసు కలవారు; ఈ = ఈ; వేళ = సమయములో; సుస్థిరులు = నిలకడకలవారు; ఐ = అయి; ఉండుదురా = ఉండే ఉంటారా; మురారి = కృష్ణుడు {మురారి - మురాసురుని శత్రువు, కృష్ణుడు}; సుఖి = సుఖము కల వాడు; ఐ = అయి; సేమంబు = క్షేమము; తోన్ = గా; ఉండునా = ఉండే ఉండునా; ఎరవు = వికలము; ఐ = అయి; ఉన్నది = ఉన్నది; చిత్తము = మనసు; ఈశ్వర = భగవంతునిచే; కృతంబు = చేయబడునది (ద్రైవ నిర్ణయము); ఎట్లో = ఎలా ఉంటుందో; కదే = ఏమో; మారుతీ = భీమసేనా {మారుతీ - వాయుదేవుని పుత్రుడు, భీముడు}.

భావము:- మరున్నందనా! భీమా! మాధవుని చూచుటకు మన అర్జునుడు కూడా ద్వారకానగరానికి వెళ్ళాడు గదా. ఇప్పటికి ఏడు మాసాలు గడిచి పోయాయి. ఇంతవరకూ తిరిగిరాలేదు. మళ్లీ మనకు వారిక్షేమం తెలియలేదు. చారులు కూడా ఎవరూ రాలేదు. యాదవులు కొంచెము ఉద్ధత స్వాభావులు. వారిది వేడిరక్తం. వారు ప్రశాంతచిత్తులై ఉండి ఉంటారు గదా? వాసుదేవుడు కుశలంగానే ఉంటాడు కదా? మనస్సంతా చికాకుగా ఉంది. ఈశ్వర సంకల్పం ఎలా ఉందో ఏమో?

1-335-క.

మానసము గలఁగుచున్నది

మానవు బహుదుర్నిమిత్త మర్యాదలు; స

న్మానవదేహక్రీడలు

మాన విచారింప నోపు మాధవుఁ డనుజా!

టీక:- మానసమున్ = మనస్సు; కలఁగుచున్ = కలతపడుతు; ఉన్నది = ఉన్నది; మానవు = మానుటలేదు; బహు = అనేకమైన; దుర్ = చెడు; నిమిత్త = సూచించు; మర్యాదలు = శకునములు; సత్ = మంచి; మానవ = మనుష్య; దేహ = దేహముతో; క్రీడలు = క్రీడించుటలు; మానన్ = మానవలెనని; విచారింపన్ = ఆలోచించుచు; ఓపున్ = ఉండవచ్చును; మాధవుఁడు = కృష్ణుడు; అనుజా = సోదరుడా.

భావము:- భీమసేనా! నా మనస్సంతా వ్యాకులంగా ఉంది. అన్నీ దుశ్శకునాలే తోస్తున్నాయి. వాసుదేవుడు లీలామానుష దేహాన్ని చాలించాలని ఆలోచిస్తున్నాడేమో.

1-336-క.

మనవులు సెప్పక ముందఱ

మన దార ప్రాణ రాజ్య మానశ్రీలన్

మనుపుదు నని మాధవుఁ డిట

మనమునఁ దలపోసి మనిచె మనలం గరుణన్.

టీక:- మనవులు = విన్నపములు; చెప్పక = విన్నవించుకోక; ముందఱ = ముందరనే; మన = మన యొక్క; దార = భార్యలు; ప్రాణ = ప్రాణములు; రాజ్య = రాజ్యములు; మాన = మానములు అనే; శ్రీలన్ = సంపదలను; మనుపుదును = రక్షింతును; అని = అని; మాధవుఁడు = హరి {మాధవుడు – మాధవి (లక్ష్మి) ధవుడు (భర్త), భగవంతుడు}; ఇట = ఇక్కడ; మనమునన్ = మనసులో; తలపోసి = అనుకొని; మనిచెన్ = మనజేసెను, బ్రతికించెను; మనలన్ = మనలను; కరుణన్ = కరుణతో.

భావము:- ఆ మధుసూదనుడు మనం విన్నవించుకొనక ముందే మన కష్టాలన్నీ గుర్తించి మన ధర్మపత్నినీ, ప్రాణాలనూ, రాజ్యాన్నీ, మర్యాదనూ, సిరిసంపదలనూ కంటికి రెప్పలా కాపాడాడు.

1-337-క.

నారదుఁ డాడిన కైవడిఁ,

గ్రూరపుఁ గాలంబు వచ్చెఁ గుంభిని మీఁదన్

ఘోరములగు నుత్పాతము

లారభటిం జూడఁబడియె ననిలజ! కంటే.

టీక:- నారదుఁడు = నారదుడు; ఆడిన = పలుకిన; కైవడిన్ = విధముగ; క్రూరపున్ = క్రూరమైన; కాలంబు = కాలము; వచ్చున్ = వచ్చును; కుంభిని = భూమి; మీఁదన్ = మీద; ఘోరములు = భయంకరములు; అగు = అయినట్టివి; ఉత్పాతము = ఆపదలు; ఆరభటిన్ = మ్రోతమ్రోగుతూ; చూడఁబడియెన్ = కనబడుతున్నవి; అనిలజ = వాయు పుత్రుడా; కంటే = చూచితివా.

భావము:- నాయనా! భీమా! ఈ భూమిమీద భయంకరములైన ఉపద్రవాలు కనిపిస్తున్నాయి. చూశావు కదా! నారదుడు చెప్పినట్లుగా క్రూరమైన కాలం వస్తుంది.

1-338-సీ.

ఓడక ముందట నొక సారమేయంబు-

మొఱగుచు నున్నది మోర యెత్తి;

యాదిత్యుఁ డుదయింప నభిముఖంబై నక్క-

వాపోయె మంటలు వాతఁ గలుగ;

మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు-

గర్దభాదులు దీర్చి క్రందుకొనియె;

నుత్తమాశ్వంబుల కుదయించెఁ గన్నీరు-

మత్తగజంబుల మదము లుడిగె;

1-338.1-ఆ.

గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము;

మండ దగ్ని హోమ మందిరములఁ;

జుట్టుఁ బొగలు దిశల సొరిది నాచ్ఛాదించెఁ;

దరణి మాసెఁ; జూడు ధరణి గదలె.

టీక:- ఓడక = జంకక; ముందటన్ = ముందర; ఒక = ఒక; సారమేయంబు = కుక్క; మొఱగుచున్ = మొఱగుచును (కుక్కఅరుపు); ఉన్నది = ఉన్నది; మోర = మెడ; ఎత్తి = పైకెత్తి; ఆదిత్యుఁడు = సూర్యుడు; ఉదయింప = ఉదయిస్తుంటే; అభిముఖంబు = ఎదురు; ఐ = అయ్యి; నక్క = నక్క; వాపోయె = ఏడుస్తున్నట్టు అరుచుచున్నది; మంటలు = మంటలు; వాతన్ = వాంతి; కలుగ = చేసు కుంటుండగ; మిక్కిలుచున్నవి = గుంపులు కడుతున్నవి; మెఱసి = బయల్పడుచు; గృధ = గద్దలు; ఆదులు = మొదలగునవి; గర్దభ = గాడిదలు; ఆదులు = మొదలగునవి; తీర్చి = బారులు తీరి; క్రందుకొనియె = మూగుతున్నవి; ఉత్తమ = ఉత్తమ జాతి; అశ్వంబుల = గుఱ్ఱముల; కున్ = కు; ఉదయించెన్ = కనిపిస్తున్నది; కన్నీరు = కన్నీరు; మత్త = మదపు; గజంబుల = ఏనుగుల యొక్క; మదము = మదములు; ఉడిగె = ఎండిపోవు తున్నది; కాలు = యముని; దూత = భటుని; భంగిన్ = వలె; కదిసెన్ = మీదకి వచ్చింది; కపోతము = పావురము;

మండదు = మంటలు రావడంలేదు (రాజేస్తున్నా); అగ్ని = నిప్పునుంచి (హోమగుండాలలో); హోమ = హోమాలు చేయు; మందిరములన్ = శాలలో; చుట్టున్ = చుట్టూ; పొగలు = పొగలు; దిశల = దిశలువెంట; సొరిది = క్రమముగా; ఆచ్ఛాదించెన్ = క్రమ్మినవి; తరణి = సూర్యుడు; మాసెన్ = మసకబారెను; చూడు = చూడుము; ధరణి = భూమి; కదలె = కంపించెను.

భావము:- అదుగో మన ముందుగా ఒక్క కుక్క ముఖం పై కెత్తి మొరుగుతున్నది. నక్క ఉదయించే సూర్యునికి ఎదురుగా నిలబడి నోటి వెంట నిప్పులు గ్రక్కుతూ ఏడుస్తున్నది. గ్రద్దలు మొదలైన పక్షులు గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. గాడిదలు మొదలైన జంతువులు బారులు తీర్చినాయి. మేలిజాతి గుఱ్ఱాలు కన్నీరు కారుస్తున్నాయి. మదపుటేనుగులు నీరుగారి పోతున్నాయి. కపోతాలు యమదూతల్లాగా పైపైకి వస్తు న్నాయి. హోమకుండాల్లో అగ్నిహోత్రాలు మండటంలేదు. దట్టమైన పొగలు దిక్కు లంతటా చుట్టుముట్టాయి. సూర్యబింబం మసక వేసినట్లుగా ఉంది. భూమి కంపించుతూ ఉంది.

1-339-క.

వాతములు విసరె; రేణు

వ్రాతము లాకసముఁ గప్పె; వడి సుడిగొని ని

ర్ఘాతములు వడియె; ఘన సం

ఘాతంబులు రక్తవర్ష కలితము లయ్యెన్.

టీక:- వాతములు = పెనుగాలులు; విసరె = వీస్తున్నవి; రేణు = ధూళి, దుమ్ము; వ్రాతములు = తెరలు; ఆకసమున్ = ఆకాశమును; కప్పె = కప్పివేసినవి; వడిన్ = మిక్కిలి వేగముగా; సుడిగొని = సుడులు తిరుగుతూ; నిర్ఘాతములు = పిడుగులు; వడియెన్ = పడినవి; ఘన = మబ్బుల యొక్క; సంఘాతంబులు = గుంపులు; రక్త = రక్తపు; వర్ష = వాన; కలితములు = కలిగించునవి; అయ్యెన్ = అయ్యెను.

భావము:- విపరీతమైన వాయువులు వీచాయి. ఆకాశం ధూళి ధూసరితమైంది. పైనుండి పిడుగులు పడుతున్నాయి. మేఘాలు రక్తవర్షాన్ని కురుస్తున్నాయి.

1-340-క.

గ్రహములు పోరాడెడి నా
గ్రహముల వినఁ బడియె; భూత కలకలములు దు
స్సహములగుచు శిఖికీలా
వహముల క్రియఁ దోచె; గగన వసుధాంతరముల్.

టీక:- గ్రహములు = గ్రహములు; పోరాడెడిన్ = పోరాడుతున్నవి; ఆగ్రహముల = కోపములతో; వినఁబడియెన్ = వినబడుతున్నవి; భూత = జీవులు యొక్క; కలకలములు = కలకలారావములు; దుస్సహములు = సహించుటకు మిక్కిలి కష్టమగునవి; అగుచున్ = అవుతూ; శిఖి = అగ్ని; కీలా = కీలలు; ఆవహముల = ఆవహించిన; క్రియన్ = వలె; దోచెన్ = అనిపిస్తున్నవి; గగన = ఆకాశము; వసుధ = భూమి; అంతరముల్ = కలిసిన చోట్లు, దిజ్మండల రేఖలు.

భావము:- గ్రహాలు ఆగ్రహంతో పోరాడుకొంటున్నాయి. ఎటు చూసినా భూతాల కలకలాలు వినబడుతున్నాయి. మన్నూ మిన్నూ ఏకమై భగ భగ మండిపోతున్నట్లు తోస్తున్నది.

1-341-క.

దూడలు గుడువవు చన్నులు;
దూడలకున్ గోవు లీవు దుగ్ధము; లొడలం
బీడలు మానవు; పశువులఁ
గూడవు వృషభములు తఱిపి కుఱ్ఱల నెక్కున్.

టీక:- దూడలున్ = దూడలు {దూడలు - ఆవుల పిల్లలు}; కుడువవు = పాలు తాగుట లేదు; చన్నులున్ = చన్నుల నుండి; దూడల = దూడల; కున్ = కి; గోవులు = ఆవులు; ఈవు = ఇయ్యవు; దుగ్ధములు = పాలు; ఒడలన్ = దేహములకు; పీడలు = బాధలు, వ్యాధులు; మానవు = మానుటలేదు; పశువులన్ = పశువులను; కూడవు = కలియవు; వృషభములు = ఎద్దులు; తఱిపి = లేగ; కుఱ్ఱలన్ = దూడలను; ఎక్కున్ = ఎక్కును.

భావము:- దూడలు పాలు తాగటం లేదు. ఆవులు దూడలకు పాలీయటం లేదు. దేశమంతటా వ్యాధులు వ్యాపించాయి. ఎద్దులు ఆవులను వదలి దూడల మీద ఎక్కుతున్నాయి.

1-342-క.

కదలెడు వేల్పుల రూపులు,
వదలెడుఁ గన్నీరు, వానివలనం జెమటల్
వొదలెడిఁ, బ్రతిమలు వెలిఁ జని
మెదలెడి నొక్కక్క గుడిని మేదిని యందున్.

టీక:- కదలెడున్ = కదలుచున్నవి; వేల్పుల = దేవతల; రూపులు = విగ్రహములు; వదలెడున్ = కార్చుతున్నవి; కన్నీరు = కన్నీరు; వాని = వాటి; వలనన్ = నుండి; చెమటల్ = స్వేదములు; ఒదలెడిన్ = చమరించుచున్నవి; ప్రతిమలు = విగ్రహములు; వెలిన్ = బయటకు; చని = వెళ్ళి; మెదలెడిన్ = సంచరించుచున్నవి; ఒక్కక్క = ఒక్కొక్క; గుడిని = గుడియందు; మేదిని = భూమి; అందున్ = మీద.

భావము:- దేవమందిరాలలో దేవతావిగ్రహాలు కదులుతున్నాయి. కన్నీరు వదులుతున్నాయి. గుడిలోని ప్రతిమలు ఉక్క తాళలేకనేమో వెలుపలకు వెళ్ళిపోతున్నాయి.

1-343-క.

కాకంబులు వాపోయెడి;
ఘూకంబులు నగరఁ బగలు గుండ్రలు గొలిపెన్;
లోకంబులు విభ్రష్ట
శ్రీకంబుల గతి నశించి శిథలము లయ్యెన్.

టీక:- కాకంబులు = కాకులు; వాపోయెడిన్ = గుంపులు కట్టి అరుస్తున్నవి; ఘూకంబులు = గుడ్లగూబలు; నగరన్ = నగరములో; పగలు = పగటి పూట; గుండ్రలున్ = గుండ్రలును (గుడ్లగూబ కూత); కొలిపెన్ = చేసెను, కూసెను; లోకంబులు = లోకములు; విభ్రష్ట = భ్రష్టమైన, నష్టపోయిన; శ్రీకంబులు = కళలు కలిగినవాని; గతిన్ = వలె; నశించి = నాశనమగుచు; శిథలములు = పాడుబడినవి; అయ్యెన్ = అయిపోయినవి.

భావము:- కాకులు కేకలు వేస్తున్నాయి. గుడ్లగూడలు పట్టపగలే కూస్తున్నాయి. లోకాలు శోభను కోల్పోయి చీకాకుల పాలైనాయి.

1-344-మ.

యవ, పద్మాంకుశ, చాప, చక్ర, ఝష రేఖాలంకృతంబైన మా
ధవు పాదద్వయ మింక మెట్టెడు పవిత్రత్వంబు నేఁ డాదిగా
నవనీకాంతకు లేదు పో? మఱి మదీయాంగంబు వామాక్షి బా
హువు లాకంపము నొందుచుండు నిల కే యుగ్రస్థితుల్ వచ్చునో?

టీక:- యవ = యవలు వంటి (ధాన్యంగింజ వంటి); పద్మ = పద్మముల వంటి; అంకుశ = అంకుశము వంటి {అంకుశము – ఏనుగు కుంభ స్థలమును పొడచుటకు వాడు ఆయుధము}; చాప = ధనుస్సు వంటి; చక్ర = చక్రము వంటి; ఝష = చేప వంటి; రేఖా = రేఖలతో; అలంకృతంబు = అలంకరింపబడినది; ఐన = అయినట్టి; మాధవు = కృష్ణుని {మాధవుడు – మాధవి భర్త, హరి }; పాద = పాదముల; ద్వయము = జంట; ఇంకన్ = ఇంక; మెట్టెడు = త్రొక్కుట వలని; పవిత్రత్వంబున్ = పవిత్రత కలుగుటలు; నేఁడు = ఈ దినము; ఆదిగాన్ = మొదలు పెట్టి; అవనీకాంత = భూదేవి; కున్ = కి; లేదు పోమఱి = లేదేమో మరి; మదీయ = నా యొక్క; అంగంబున్ = అవయవములును; వామ = ఎడమ ప్రక్క; అక్షి = కన్నును; బాహువులు = బాహువును; ఆకంపము = అదురుట; ఒందుచుండున్ = కలుగుచున్నది; ఇల = భూమి; కున్ = కి; ఏ = ఏ; ఉగ్ర = భయంకరమైన; స్థితుల్ = పరిస్థితులు; వచ్చునో = వచ్చునో.

భావము:- నాయనా! భీమసేనా! యవగింజ, చక్ర, చాప, పద్మ, అంకుశాది శుభరేఖలతో అలంకృతమైన వాసుదేవుని పాదపద్మాల ముద్రలతో పావనమయ్యే అదృష్టం ఇకపైన ఈ భూదేవికి లేదేమో? నా అవయవాలు ఎడం కన్నూ, ఎడం భుజం మాటిమాటికీ అదురుతున్నాయి. ఈ లోకానికి ఇంకా ఎలాంటి భీకర పరిస్థితులు రానున్నాయో కదా.

## 1-345-వ.

## మఱియు మహోత్పాదంబులు పెక్కులుపుట్టుచున్నయవి; మురాంతకుని వృత్తాంతంబు వినరా"దని, కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున.

టీక:- మఱియున్ = ఇంకనూ; మహ = భయంకరమైన; ఉత్పాదంబులు = ప్రకృతి వైపరీత్యములు; పెక్కులు = ఎన్నో; పుట్టుచు = కలుగుతూ; ఉన్నయవి = ఉన్నవి; మురాంతకుని = కృష్ణుని {మురాంతకుడు – ముర అను రాక్షసుని సంహరించిన వాడు, కృష్ణుడు}; వృత్తాంతంబున్ = సమాచారములు, వార్తలు; వినరాదు = వినబడుట లేదు; అని = అని; కుంతీసుతాగ్రజుండు = ధర్మరాజు { కుంతీసుతాగ్రజుడు – కుంతీ (కుంతి యొక్క) సుత (పుత్రులలో) అగ్రజుండు (పెద్దవాడు), ధర్మరాజు}; భీముని = భీమసేనునితో; తోన్ = కలిసి; విచారించు = బాధపడుతున్న; సమయంబున = సమయములో.

భావము:- ఇంకా ఎన్నో ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి. అక్కడ ద్వారకలో మన బావ శ్రీకృష్ణుడు ఎలా ఉన్నాడో ఏమో? ఆయన క్షేమవృత్తాంతం ఇంతవరకూ తెలియరాలేదు" అని ధర్మరాజు విషణ్ణహృదయంతో భీమసేనునితో మాటాడుతున్నాడు. ఇంతలో....

## యాదవుల కుశలం బడుగుట

1-346-క.

ఖేదమున నింద్రసూనుఁడు

యాదవపురినుండి వచ్చి యగ్రజుఁ గని త

త్పాదముల నయనసలిలో

త్పాదకుఁడై పడియె దీనుభంగి నరేంద్రా!

టీక:- ఖేదమునన్ = దుఃఖముతో; ఇంద్రసూనుడు = అర్జునుడు {ఇంద్రసూనుడు - ఇంద్రుని పుత్రుడు, అర్జునుడు}; యాదవ = యాదవుల యొక్క; పురి = నగరము; నుండి = నుండి; వచ్చి = వచ్చి; అగ్రజుఁనిన్ = అన్నను; కని = చూసి; తత్ = అతని; పాదములన్ = పాదములమీద; నయన సలిల = కన్నీరు; ఉత్పాదకుఁడు = కలిగినవాడు; ఐ = అయి; పడియెన్ = పడెను; దీనున్ = దీనుని; భంగిన్ = వలె; నరేంద్ర = రాజా {నరేంద్రుడు - నరులకు ఇంద్రుడు, రాజు}.

భావము:- ఇంతలో ద్వారకానగరం నుంచి వచ్చిన అర్జునుడు అశ్రుపూరిత నేత్రాలతో భరింపరాని దుఃఖంతో దీనుడై అగ్రజుని పాదాలపై వాలాడు.

1-347-క.

పల్లటిలిన యుల్లముతోఁ

దల్లడపడుచున్న పిన్నతమ్ముని గని వె

ల్వెల్లనగు మొగముతో జను

లెల్లను విన ధర్మపుత్రుఁ డిట్లని పలికెన్.

టీక:- పల్లటిలిన = అల్లకల్లోలమైన; ఉల్లము = మనస్సు; తోన్ = తో; తల్లడపడుచున్న = తల్లడిల్లు చున్న; పిన్న = చిన్న; తమ్మునిన్ = తమ్ముడిని; కని = చూసి; వెల్వెల్లన్ = వెలవెలబోతున్నది; అగు = అయిన; మొగము = ముఖము; తోన్ = తో; జనులు = ప్రజలు; ఎల్లను = అందరును; వినన్ = వినుచుండగ; ధర్మపుత్రుడు = ధర్మరాజు {ధర్మపుత్రుడు - యమునికొడుకు, ధర్మరాజు}; ఇట్లని = ఈవిధముగ; పలికెన్ = అడిగెను.

భావము:- అల్లకల్లోలమైన మనస్సుతో తల్లడిల్లిపోతున్న చిన్న తమ్ముణ్ణి చూసి ధర్మరాజు ముఖం వెలవెలబోయింది. ఆయన అందరూ వింటుండగా అర్జునునితో ఇలా పలికాడు....

1-348-సీ.

"మాతామహుండైన మనశూరుఁ డున్నాడె?-

మంగళమే మనమాతులునకు?

మోదమే నలుగురు ముగురు మేనత్తల?-

కానందమే వారి యాత్మజులకు?

నక్రూర కృతవర్మ లాయు స్సమేతులే?-

జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు?

కల్యాణయుక్తులే గద సారణాదులు-

మాధవుతమ్ములు మానధనులు?

1-348.1-తే.

నందమే మనసత్యకనందనునకు?

భద్రమే శంబరాసురభంజనునకుఁ?

గుశలమే బాణదనుజేంద్రకూఁతుపతికి?

హర్షమే పార్థ! ముసలికి హలికి బలికి?

టీక:- మాతామహుండు = తల్లి యొక్క తండ్రి, తాత; ఐన = అయినట్టి; మన = మన యొక్క; శూరుఁడు = శూరసేనుడు; ఉన్నాడే = ఉన్నాడా; మంగళమే = శుభమేనా; మన = మన యొక్క; మాతులున = మేనమామ; కున్ = కి; మోదమే = సంతోషమేనా; నలుగురుముగురు = నలుగురు+ముగురు, ఏడుగురు {వసుదేవుని భార్యలు - ఏడుగురు}; మేనత్తల = మేనత్తల; కున్ = కు; ఆనందమే = ఆనందమేనా; వారి = వారియొక్క; ఆత్మజుల = పిల్లల; కున్ = కి; అక్రూర = అక్రూరుడును; కృతవర్మలు = కృతవర్మయును; ఆయుః = ఆయుష్షు; సమేతులే = కలిగి ఉన్నారా; జీవితుఁడే = జీవించి ఉన్నాడా; ఉగ్రసేన = ఉగ్రసేన; విభుఁడు = ప్రభువు; కల్యాణ = శుభములతో; ఉక్తులే = కూడి ఉన్నారా; గద = గదుడు; సారణ = సారణుడు; ఆదులు = మొదలగువారు; మాధవు = కృష్ణుని {మాధవుడు - మాధవి (లక్ష్మి)భర్త, కృష్ణుడు}; తమ్ములు = తమ్ముళ్ళు; మాన = అభిమానము; ధనులు = ధనముగా కలవారు;

నందమే = ఆనందమే; మన = మనయొక్క; సత్యక = సత్యకుని {సత్యకనందనుడు - సాత్యకి}; నందనున = కొడుకు, సాత్యకి; కున్ = నకు; భద్రమే = క్షేమమే; శంబర = శంబరుడు అను {శంబరాసురభంజనుడు - ప్రద్యుమ్నుడు}; అసుర = రాక్షసుని; భంజనున = చంపినవాని, ప్రద్యుమ్నుని; కున్ = కి; కుశలమే = బాగున్నాడా; బాణ = బాణుడు అను {బాణదనుజేంద్రకూఁతుపతి - బాణాసుర పుత్రిక పతి, అనిరుద్ధుడు}; దనుజ = రాక్షసుని; ఇంద్ర = ప్రభువు; కూఁతు = కూతురు యొక్క; పతి = భర్త, అనిరుద్ధుని; కిన్ = కి; హర్షమే = సంతోషమేనా; పార్థ =

అర్జునా; ముసలి = బలరాముని {ముసలి – ముసలాయుధము ధరించినవాడు, బలరాముడు}; కిన్ = కి; హలి = బలరాముని {హలి – హలాయుధము ధరించినవాడు, బలరాముడు}; కిన్ = కి; బలి = బలరాముని; కిన్ = కిని.

భావము:- నాయనా అర్జునా మన మాతామహుడైన శూరసేనుడు కుశలమే కదా మన మేనమామ వసుదేవుడు సుఖంగా ఉన్నాడు కదా మన మేనత్తలు ఏడుగురూ సంతోషంగా ఉన్నారు కదా వారి కొడుకు లందరూ క్షేమమే కదా అక్రూర కృతవర్మలకు ఆరోగ్యమే కాదా ఉగ్రసేన మహారాజు తిన్నగా తిరుగుతున్నాడా మానధనులూ వాసుదేవుని సోదరులూ అయిన గదుడు, సారణుడు మొదలైన వారంతా కుశలమేనా మన సాత్యకి క్షేమమేనా ప్రద్యుమ్నుడు బాగా ఉన్నాడా అనిరుద్ధుడు కులాసాగా ఉన్నాడా మన పెద్దబావ బలరాముడు సుఖంగా ఉన్నాడా.

## 1-349-వ.

**మఱియు నంధక, యదు, భోజ, దశార్హ, వృష్ణి, సాత్వతులు మొదలయిన యదు వంశ వీరులును, హరికుమారులైన సాంబ సుషేణప్రముఖులును, నారాయణా నుచరులైన యుద్ధవాదులును, గృష్ణసహచరులైన సునంద నందాదులును, సుఖా నందులే?"యని, యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ నిట్లనియె.**

టీక:- మఱియున్ = ఇంకనూ; అంధక = అంధకులు; యదు = యాదవులు; భోజ = భోజులు; దశార్హ = దశార్హులు; వృష్ణి = వృష్ణికులు; సాత్వతులు = సాత్వతులు; మొదలయిన = మొదలగు; యదు = యాదవ; వంశ = వంశపు; వీరులును = వీరులును; హరి = కృష్ణుని, భగవంతుని; కుమారులు = పుత్రులు; ఐన = అయినట్టి; సాంబ = సాంబుడు; సుషేణ = సుషేణుడు మొదలగు; ప్రముఖులును = ముఖ్యమైనవారును; నారాయణ = నారాయణునకు, కృష్ణునకు; అనుచరులు = తోటివారు; ఐన = అయినట్టి; యుద్ధవ = యుద్ధవుడు; ఆదులునున్ = మొదలగువారును; కృష్ణ = కృష్ణుని; సహచరులు = స్నేహితులు; ఐన = అయినట్టి; సునంద = సునందుడు; నంద = నందుడు; ఆదులును = మొదలగువారును; సుఖా = సుఖమును; నందులే = ఆనందమును కలవారేనా; అని = అని; అందఱన్ = అందరిని; అడిగి = అడిగి; ధర్మజుండు = ధర్మరాజు {ధర్మజుండు – యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు}; క్రమ్మఱ = మరల; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇంకా అంధకులూ, యాదవులూ, భోజులూ దశార్హులు, వృష్ణులూ, సాత్వతులూ మొదలైన యదువంశ వీరులందరూ క్షేమంగా ఉన్నారా? శ్రీకృష్ణుని పుత్రులైన సాంబుడూ, సుషేణుడూ మొదలైనవారూ, అనుచరులైన ఉద్ధవుడూ మొదలైనవారూ, సహచరులైన నందుడూ, సునందుడూ మొదలైన వారూ సుఖంగాను, ఆనందంగానూ ఉన్నారా?" అని ఈవిధంగా అందరి క్షేమమూ అడిగి ఇంకా ఇలా అన్నాడు ధర్మరాజు.

1-350-సీ.

"వైకుంఠవాసుల వడువున నెవ్వని-
    బలమున నానందభరితు లగుచు
వెఱవక యాదవ వీరులు వర్తింతు?-
    రమరులు గొలువుండు నట్టి కొలువు
చవికె నాకర్షించి చరణసేవకులైన-
    బంధుమిత్త్రాదుల పాదయుగము
నెవ్వడు ద్రొక్కించె నింద్రపీఠముమీఁద?-
    వజ్రంబు జళిపించి వ్రాలువాని

1-350.1-తే.

ప్రాణవల్లభ కెంగేలఁ బాదు సేసి
యమృతజలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ
కిచ్చె? నట్టి మహాత్మున కిపుడు శుభమె?

టీక:-వైకుంఠ= వైకుంఠ లోకమున; వాసుల = వసించువారి; వడువునన్ = వలె; ఎవ్వని = ఎవని; బలమునన్ = బలము వలనైతే; ఆనంద = ఆనందముతో; భరితులు = నిండినవారు; అగుచు = అవుతూ; వెఱవక = బెదరక; యాదవ = యాదవులలో; వీరులు = వీరులు; వర్తింతురు = చరించెదరో; అమరులు = దేవతలు యొక్క {ఇంద్ర సభామండపము - సుధర్మామండపము}; కొలువు = ఆస్థానమున; ఉండున్ = ఉండునో; అట్టి = అటువంటి; కొలువు = కొలువు తీరే, సభా, ఆస్థానము; చవికెన్ = మండపమును, సుధర్మామండపము; ఆకర్షించి = తిగిచి; చరణ = పాదములను; సేవకులు = సేవించువారు; ఐన = అయిన; బంధు = బంధువులు; మిత్ర = మిత్రులు; ఆదుల = మొదలగువారి; పాద = పాదములయొక్క; యుగమున్ = జంటలచే; ఎవ్వడున్ = ఎవడైతే; ద్రొక్కించెన్ = త్రొక్కించెనో; ఇంద్ర = ఇంద్రుని; పీఠము = సింహాసనము; మీఁద = మీద; వజ్రంబున్ = వజ్రా యుధమును {వజ్రాయుధము జళిపించువాడు - ఇంద్రుడు}; జళిపించి = జళిపించి; వ్రాలువాని = శోభిల్లువాని, ఇంద్రుని; ప్రాణవల్లభ = భార్య, శచీదేవి {వజ్రంబుజళిపించివ్రాలువానిప్రాణవల్లభ - ఇంద్రుని భార్య, శచీదేవి}; కెంగేలన్ = చేతులతో; పాదు = పాదు; చేసి = చేసి; అమృత = అమృతము అను; జలములన్ = నీటితో; పోషింపన్ = పెంచుతుండగ; అలరు = అలరారే; పారిజాతము = పారిజాతమును; ఎవ్వఁడు = ఎవడైతే; కొనివచ్చి = తీసుకొనివచ్చి; సత్యభామ = సత్యభామ; కున్ = కు; ఇచ్చెన్ = ఇచ్చెనో; అట్టి = అటువంటి; మహా = గొప్ప; ఆత్మున = ఆత్మ కలవాని, కృష్ణుని; కున్ = కి; ఇపుడు = ఇప్పుడు; శుభమే = శుభమేనా.

భావము:- అర్జునా ఏ మహానుభావుని అండదండలవల్ల వైకుంఠంలో నివసించే వారిలాగా, ద్వారకలో నివసించే యాదవవీరులు ఆనందసహితులై భయరహితులై ఉంటున్నారో, ఏ మహానుభావుడు దేవతలు కొలువు తీర్చే సుధర్మామంటపంలో తన భక్తులనూ బంధువులనూ మిత్రులనూ కూర్చుండ పెట్టాడో, ఏ మహానుభావుడు, వజ్రాయుధం ధరించి ముక్కోటి దేవతల మధ్య ముత్యాల గద్దెపై కొలువు తీర్చే ఇంద్రుని ప్రాణేశ్వరి అయిన శచిదేవి తన చేతులతో పాదుచేసి అమృతం పోసి పెంచిన పారిజాత వృక్షాన్ని, దివినుంచి భువికి తీసుకొని వచ్చి తన ప్రియురాలైన సత్యభామకు బహూకరించాడో, ఆ మహానుభావుడు వాసుదేవుడు క్షేమమేనా.

1-351-శా.

అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు, బ్రహ్మణ్యుండు, గోవిందుఁ డా
పన్నానీకశరణ్యుఁ డీశుఁడు, జగద్భద్రానుసంధాయి, శ్రీ
మన్నవ్యాంబుజ పత్రనేత్రుఁడు, సుధర్మామధ్యపీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁ గూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్?

టీక:-అన్నా = నాయనా; ఫల్గున = అర్జునా; భక్త = భక్తులయందు; వత్సలుండు = ఆపేక్ష కలవాడు; బ్రహ్మణ్యుండు = వేదధర్మమును నిలుపువాడు; గోవిందుఁడు = కృష్ణుడు { గోవిందుడు - గోవులకు ఒడయుడు, కృష్ణుడు}; ఆపన్న = ఆపద చెందిన; అనీక = జనసమూహమునకు; శరణ్యుడు = శరణ్యమైన వాడు, కృష్ణుడు; ఈశుఁడు = అధిపతి, కృష్ణుడు; జగత్ = జగత్తులకు; భద్ర = భద్రమును; అనుసంధాయి = కలుగజేయు వాడు, భగవంతుడు; శ్రీమాన్ = శ్రీమంతమైన; నవ్య = లేత; అంబు = నీటిలో; జ = పుట్టిన (పద్మము) యొక్క; పత్ర = పత్రమువంటి; నేత్రుడు = కన్నులుఉన్నవాడు, భగవంతుడు; సుధర్మా = సుధర్మామండపముయొక్క; మధ్య = మధ్యన ఉన్న; పీఠంబునన్ = ఆసనమునందు; ఉన్నాఁడా = ఉన్నాడా; బలభద్రున్ = బలభద్రునితో; కూడి = కలిసి ఉండి; సుఖి = సుఖముగ ఉన్నవాడు; ఐ = అయి; ఉత్సాహి = ఉత్సాహముతో ఉన్నవాడు; ఐ = అయి; ద్వారకన్ = ద్వారకలో.

భావము:- నాయనా! అర్జునా! భక్తుల యందు వాత్సల్యం కురిపించే వాడూ, బ్రహ్మణ్యుడూ, ఆపన్నశరణ్యుడూ, సర్వేశ్వరుడూ, లోకాలకు మేలు కలిగించేవాడూ, శోభవంతములై అప్పుడప్పుడే వికసిస్తున్న తామరరేకుల వంటి కన్నులు కలవాడూ, అయిన గోవిందుడు ద్వారకలో సుధర్మ సభా మండపం మధ్యన సింహాసనం మీద అన్నగారైన బలరామునితో కూడి సుఖంగా ఉత్సాహంగా ఉన్నాడా.

1-352-క.

ఆ రామకేశవులకును
సారామలభక్తి నీవు సలుపుదువు గదా;
గారాములు సేయుదురా
పోరాముల బంధు లెల్ల ప్రొద్దు? జితారీ!

టీక:- ఆ = ఆ; రామ = బలరామునకు; కేశవుల = కృష్ణున, భగవంతున; కును = కును; సార = చిక్కని; అమల = నిర్మలమైన; భక్తిన్ = భక్తిని; నీవు = నీవు; సలుపుదువు = చేయుదువు; కదా = కదా; గారాములు = గౌరవములు; సేయుదురా = చేయుదురా; పోన్ = పోవుటల యందు; రాములన్ = వచ్చుటల యందును; బంధులు = బంధువులు; ఎల్ల = అన్ని; ప్రొద్దున్ = వేళలందు; జితారి = అర్జునా {జితారి - జయింపబడిన శత్రువులు కలవాడు, అర్జున}.

భావము:- విజయా! ఆ రామకృష్ణులను నీవు స్థిరమైన భక్తితో సేవించావు గదా? అక్కడి మన చుట్టాలంతా నిన్ను అనుదినం రాకపోకలందు అప్యాయంగా అనురాగంగా ఆదరించారు కదా?

★1-353-శా.

మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచోఁ,
సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ, బ్రాభవ
స్కన్నుండై చను కౌరవేంద్రు పనికై గంధర్వులం దోలుచోఁ,
గన్నీరెన్నడుఁ దేవు తండ్రి! చెపుమా కల్యాణమే చక్రికిన్?

టీక:- మున్ను = ఇంతకు ముందు; ఉగ్ర = భయంకరమైన; అటవి = అడవి; లోన్ = అందు; వరాహమున = పంది; కై = కోసము; ముక్కంటి = శివుని {ముక్కంటి - మూడు కన్నులు ఉన్నవాడు, శివుడు}; తోన్ = తో; పోరు చోన్ = యుద్ధము చేయు నప్పుడు కాని; సన్నాహం బునన్ = పోరుకు =దిగినప్పుడు; కాలకేయులన్ = కాలకేయులనురాక్షసులను; అనిన్ = యుద్ధ ములో; జక్కాడుచోన్ = చెండాడుచునున్నప్పుడు కాని; ప్రాభవ =వైభవమును; స్కన్నుండు = కోల్పోయిన వాడు; ఐ = అయి; చను = వెళ్ళు; కౌరవేంద్రు = దుర్యోధనుని {కౌరవేంద్రుడు - కురువంశపు రాజు, దుర్యోధనుడు}; పని = పని; కై = కోసము; గంధర్వులన్ = గంధర్వులను; తోలు చోన్ = పారదోలు నప్పుడు కాని; కన్నీరు = కన్నీరు; ఎన్నడున్ = ఎప్పుడును; తేవు = తీసుకొని రాలేదు, కార్చ లేదు; తండ్రి = నాయనా; చెపుమా = చెప్పుము; కల్యాణమే = శుభమేనా; చక్రి = కృష్ణుని {చక్రి - చక్రాయుధము ధరించు వాడు, కృష్ణుడు}; కిన్ = కి.

భావము:- "ఇదేమి టయ్యా? కళ్ళల్లో నీళ్ళు కారుతున్నాయి. పూర్వం భయంకరమైన ఆ అడవిలో పంది కోసం మూడు కళ్ళున్న ఆ పరమేశ్వరునితో పోరే టప్పుడు కాని, సర్వసన్నాహాలతో వెళ్ళి కాలకేయులను కదనరంగంలో చీల్చి చెండాడే టప్పుడు కాని, పరువు పోయి వైభవం కోల్పోయిన దుర్యోధనుని విడిపించే పనిలో గంధర్వులను తరిమే టప్పుడు కాని ఇంతకు ముందు ఎప్పుడు కంట నీరు పెట్టి ఎరుగవు కదా. ఇప్పుడే మయిం దయ్యా? కృష్ణుడు కులాసాగానే ఉన్నాడా? చెప్పు

1-354-వ.

అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండా. భావము:- అంతే కాకపోతే

1-355-క.

ఓడితివో శత్రువులకు,

నాడితివో సాధు దూషణాలాపములం;

గూడితివో పరసతులను,

వీడితివో మానధనము వీరుల నడుమన్;

టీక:- ఓడితివో = ఓడిపోయావా ఏమిటి; శత్రువుల = పగవారి; కున్ = కి; ఆడితివో = పలికితివా ఏమిటి; సాధు = మంచివారిని; దూషణ = దూషించు; ఆలాపములన్ = మాటలతో; కూడితివో = కలిసితివా ఏమిటి; పర = ఇతరుల; సతులను = భార్యలను; వీడితివో = విడిచితివా ఏమిటి; మాన = మానము అను; ధనము = సంపదను; వీరుల = వీరుల; నడుమన్ = మధ్యన.

భావము:- పగవారితో పోరాడి ఓడిపోలేదు కదా? సజ్జనులను తూలనాడలేదు కదా? పరాంగనలను కూడలేదు కదా? అరివీరుల నడుమ అభిమానాన్ని వీడలేదు కదా?

1-356-క.

తప్పితివో యిచ్చెదనని;

చెప్పితివో కపటసాక్షి; చేసిన మేలున్

దెప్పితివో; శరణార్థుల

రొప్పితివో ద్విజులఁ, బసుల, రోగుల, సతులన్;

టీక:- తప్పితివో = తప్పితివా ఏమిటి; ఇచ్చెదను = ఇస్తాను; అని = అని చెప్పి; చెప్పితివో = చెప్పితివా ఏమిటి; కపట = దొంగ; సాక్షి = సాక్ష్యము; చేసిన = చేసినటువంటి; మేలున్ = సహాయమును; దెప్పితివో = దుస్సహమగునట్లు చెప్పితివా ఏమిటి; శరణార్థులన్ = శరణుకోరినవారిని; రొప్పితివో = తరిమికొట్టితివా ఏమిటి; ద్విజులన్ = బ్రాహ్మణులను కాని {ద్విజులు - రెండు జన్మలు కలవారు, బ్రాహ్మణుల}; పసులన్ = పసువులను కాని; రోగులన్ = రోగిష్టివారిని కాని; సతులన్ = స్త్రీలను కాని.

భావము:- అన్నమాట తప్పలేదు కదా? దొంగసాక్ష్యం చెప్పలేదు కదా? ఇతరులకు మేలు చేసి తిరిగి చెప్పలేదు కదా? శరణార్థుల మీదా, బ్రాహ్మణుల మీదా, గోవుల మీదా, రోగులమీదా, స్త్రీల మీదా పొరపాటున బాణాలు గుప్పలేదు కదా?

★1-357-క.

**అడిచితివో భూసురులనుఁ;**
**గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా;**
**విడిచితివో యాశ్రితులను;**
**ముడిచితివో పరుల విత్తములు లోభమునన్;"**

టీక:- అడిచితివో = అణగ్గొట్టితివా ఏమిటి; భూసురులను = బ్రాహ్మణులను {భూసురులు - భూమికి దేవతలు, బ్రాహ్మణులు}; కుడిచితివో = తింటివా ఏమిటి; బాల = పిల్లలను కాని; వృద్ధ = ముసలివారిని కాని; గురువులు = గురువులను కాని; వెలిగా = విడిచి పెట్టి; విడిచితివో = విడిచిపెట్టావా ఏమిటి; ఆశ్రితులను = ఆశ్రయించినవారిని; ముడిచితివో = మూటగట్టితివా ఏమిటి; పరుల = ఇతరుల; విత్తములు = ధనములను; లోభమునన్ = పిసినారితనముతో.

భావము:- ఆరాధ్యులైన భూసురులను అణచివేసావా? లేకపోతే బాలురకు వృద్ధులకు గురువులకు పెట్టకుండా కుడిచినావా? శరణని చేరిన వారిని కాపాడకుండా వదలిపెట్టావా? పోనీ పరుల ధనాలను లోభం కొద్దీ ముడిచేసావా? తప్పు చేసినవాడికి కాని నీ కెందుకయ్యా యీ విచారం?"

1-358-వ.

**అనిపలికినం గన్నీరు కరతలంబునందుడిచికొనుచు గద్గదస్వరంబున మహానిధిం గోలుపోయినపేదచందంబున నిట్టూర్పులునిగిడించుచు నర్జునుండన్నకిట్లనియె.**

టీక:- అని = అని; పలికినన్ = పలుకగా; కన్నీరు = కన్నీరు; కరతలంబునన్ = అరచేతితో; తుడిచికొనుచు = తుడుచుకొనుచు; గద్గద = గద్గదమైన; స్వరంబున = స్వరముతో; మహా = గొప్ప; నిధిన్ = నిధిని, ధనరాశిని; కోలుపోయిన = పోగొట్టుకొన్న; పేద = పేదవాని; చందంబునన్ = వలె; నిట్టూర్పులు = నిట్టూర్పులు {నిట్టూర్పు - నిడుపైనఊర్పు (దీర్ఘమైన ఊపిరి తీయుట)}; నిగిడించుచు = పెద్దగా చేస్తూ; అర్జునుండు = అర్జునుడు; అన్న = అన్న; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ధర్మజుడు ఇలా ప్రశ్నించగానే అరచేతులతో అశ్రువులు తుడుచుకొంటూ, గద్గదకంఠంతో, పెన్నిధిని పోగొట్టుకొన్న పేదవాని మాదిరిగా వేడి వేడి నిట్టూర్పులు నిగిడిస్తూ అర్జునుడు అన్నగారితో ఇలా అన్నాడు-

## కృష్ణనిర్యాణంబు వినుట

★1-359-క.

"మన సారథి, మన సచివుడు,

మన వియ్యము, మన సఖుండు, మన భాంధవుఁడున్,

మన విభుడు, గురుడు, దేవర,

మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

టీక:- మన = మన యొక్క; సారథి = మార్గదర్శకుడు, రథసారథి; మన = మనకు; సచివుడు = మంత్రాంగము చెప్పువాడు; మన = మన యొక్క; వియ్యము = వియ్యంకుడు; మన = మనకు; సఖుండు = స్నేహితుడు; మన = మనకు; భాంధవుఁడున్ = బంధువు; మన = మన యొక్క; విభుడు = వైభవమునకు కారకుడును; గురుడు = పెద్ద; దేవర = దేవతా స్వరూపుడును; మనలను = మనలను; దిగనాడి = విడిచిపెట్టి; చనియెన్ = వెళ్ళిపోయాడు; మనుజాధీశా = రాజా {మనుజాధీశుడు - మనుజులకు అధీశుడు, రాజు}.

భావము:- "ఏం చెప్పమంటారు మహారాజా! మనకు సారథ్యం చేసేవాడు, తోడుగా ఉండి మంత్రాంగం చెప్పేవాడు, సన్నిహితంగా ఉండే వియ్యంకుడు, తోడునీడలా ఉండే స్నేహితుడు, మేలుకోరే మేన బావ, వెన్నుదన్నుగా ఉండే ప్రభువు, ఆదరించే ఇంటి పెద్ద, కాపాడే దేవుడు ఐన కృష్ణుడు మనలని వదలిపెట్టి వెళ్ళిపోయాడయ్యా"

1-360-క.

కంటకులు నృపులుసూడఁగ,

మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్

గెంటించి మనము వాలుం

గంటిం జేకొంటి మతని కరుణన కాదే?

టీక:- కంటకులు = శత్రువులు {కంటకులు - ముండ్లవంటి వారు, శత్రువులు}; నృపులున్ = రాజులు {నృపులు - నరులను పాలించువారు, రాజులు}; చూడఁగ = చూస్తుండగా; మింటన్ = పైన ఆకాశములో; కంపించు = కదులుతున్న; యంత్ర = (మత్స్య) యంత్రమందు ఉన్న; మీనమున్ = చేపను; కోలన్ = బాణముతో; గెంటించి = పడగొట్టి; మనము = మనము; వాలుంగంటిన్ = ద్రౌపదిని {వాలుగంటి - వాలుచూపులు ఉన్నది, స్త్రీ (ద్రౌపది)}; చేకొంటిమి = వివాహమాడితిమి; అతని = అతని యొక్క; కరుణన = దయవలననే; కాదే = కదా.

భావము:- శత్రురాజు లందరూ కళ్ళు అప్పగించి చూస్తూ ఉండగా ఆకాశాన తిరిగే మత్స్యయంత్రాన్ని గురిపెట్టి కొట్టి మనం పాంచాలరాజు పుత్రిని పరిణయమాడింది ఆ కరుణామయుని కటాక్షం వల్లనే కదా!

1-361-క.

దండిననేకులతో నా
ఖండలుఁ డెదు రయిన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన
గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా!

టీక:- దండిన్ = దండకారణ్యములో; అనేకుల = అనేకమంది; తోన్ = తో; ఆఖండలుఁడు = ఇంద్రుడు {ఆఖండలుడు - పర్వతములను ఖండించినవాడు, ఇంద్రుడు}; ఎదురయిన = ఎదుర్కొనినను; గెలిచి = గెలిచి; ఖాండవమున్ = ఖాండవ వనమును; చండార్చి = భయంకరమైన అగ్ని, అగ్నిదేవుని; కిన్ = కి; అర్పించిన = సమర్పించిన; గాండీవమున్ = గాండీవమును; ఇచ్చెన్ = ఇచ్చెను; చక్రి = చక్రాయుధుడు, కృష్ణుడు; కలుగుట = ఉండుట వలననే; అధిపా = గొప్పవాడా.

భావము:- గండర గండడై, అమర సమూహంతో ఆఖండలుడు ఎదురై నిల్చినా, గెల్చి ఖాండవవనాన్ని అగ్నిదేవునికి అర్పించి, గాండీవాన్ని గైకొన్నది ఆ చక్రధరుని చలువ వల్లనే కదా.

1-362-క.

దిక్కుల రాజుల నెల్లను
మక్కించి ధనంబు గొనుట, మయకృతసభ ము
న్నెక్కుట, జన్నము సేయుట,
నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే?

టీక:- దిక్కుల = దిక్కుల కల; రాజులను = రాజులను; ఎల్లను = అందరిని; మక్కించి = గెలిచి; ధనంబున్ = ధనమును; కొనుట = తీసుకొనుట; మయ = మయునిచేత; కృత = కట్టబడిన; సభ = సభా భవనమును; మున్ను = ముందు; ఎక్కుట = అధిరోహించుట; జన్నము = యజ్ఞము; సేయుట = చేయుట; నిక్కమున్ = నిజమునకు; హరి = కృష్ణుడు; మన = మన; కున్ = కు; దండన్ = ప్రాపుగ; నిలిచినన్ = నిలబడుటవలననే; కాదే = కాదా.

భావము:- నానా దిశలలోని నరనాథులను సమరంలో జయించి అశేష ధనరాసులను కైవసం చేసుకొన్నదీ, మయసభను అందుకొన్నదీ, రాజసూయ మహాయాగం నిర్వర్తించిందీ నిజానికి ఆ వాసుదేవుడు మనకు బాసటగా నిల్చినందువల్లనే కదా!

1-363-మ.

ఇభజిద్వీర్య! మఖాభిషిక్తమగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్
సభలో శాత్రవు లీడ్చినన్, ముడువకా చంద్రాస్య దుఃఖింపఁగా,
నభయం బిచ్చి, ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతా శిరో
జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్?

టీక:- ఇభజిత్ = సింహమువంటి {ఇభజిద్వీర్యుడు - ఏనుగును జయించు సింహమువంటి పరాక్రమము కలవాడు}; వీర్య = పరాక్రమము కలవాడా; మఖ = యజ్ఞమునందు; అభిషిక్తము = స్నానము చేసినది; అగు = అయినట్టి; నీ = నీయొక్క; ఇల్లాలి = భార్య యొక్క; ధమ్మిల్లమున్ = కొప్పు, జుట్టుముడిని; సభ = సభ; లోన్ = లో; శాత్రవు = శత్రువులు; ఈడ్చినన్ = ఈడ్చి లాగగ; ముడువక = ముడి వేసుకొనక; ఆ = ఆ; చంద్రాస్య = సుందరి {చంద్రాస్య - చంద్రుని వంటి ముఖము కలామె, స్త్రీ}; దుఃఖింపఁగాన్ = బాధ పడుతుండగ; అభయంబు = శరణు; ఇచ్చి = ఇచ్చి; ప్రతిజ్ఞ = ప్రతిన; సేసి = చేసి; భవదీయ = నీయొక్క; ఆరాతి = శత్రువుల; కాంతా = స్త్రీల యొక్క; శిరోజ = తలవెంట్రుకలను; భర = భారము అను; శ్రీలన్ = సంపదలను, శోభను; హరింపఁడే = పోగొట్టలేదా; విధవలు = భర్త పోయినవాళ్ళు, ముండమోపులు; ఐ = అయి; సౌభాగ్యముల్ = సౌభాగ్యములు {సౌభాగ్యములు - సౌభాగ్య చిహ్నములైన తలకట్టు తిలక ధారణాదులు}; వీడఁగన్ = తొలగిపోగా.

భావము:- సింహపరాక్రముడైన మహారాజా రాజసూయ మహాయజ్ఞంలో అభిషేకపూతమైన నీ యిల్లాలి కబరీభరాన్ని పట్టి లాగి ఈడ్చుకొని వచ్చి నిండు సభలో నీ శత్రువులు అవమానించి నప్పుడు ఆ సతి ఆక్రోశించగా, ఆమెకు అభయమిచ్చి దీక్ష వహించి, నీ శత్రుకాంతల శిరోజ వైభవాన్ని వారి సౌభాగ్యాన్ని హరించి మనకు జయం చేకూర్చిన ఆప్తబంధుడు ఆయనే కదా!

1-364-శా.

వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా, వారింప నా వల్లభుల్
రారీవేళ, నుపేక్ష సేయఁ దగవే, రావే, నివారింపవే?
లే రే త్రాతలు కృష్ణ! యంచు సభలో లీనాంగి యై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁ జేయఁడే ద్రౌపదిన్?

టీక:- వైరుల్ = శత్రువులు; కట్టిన = కట్టుకొన్న; పుట్టముల్ = వస్త్రములను; విడువఁగా = విప్పుతుండగా; వారింపన్ = ఆపుటకు; నా = నాయొక్క; వల్లభుల్ = భర్తలు; రారు = వచ్చుటలేదు; ఈ = ఈ; వేళన్ = సమయమును; ఉపేక్షన్ = ఆలస్యమును; చేయన్ = చేయుటకు; తగవే = తగదు; రావే = రమ్ము; నివారింపవే = అడ్డగింపుము; లేరు = లేరు; ఏ = ఏ; త్రాతలు = రక్షించేవారు; కృష్ణ = కృష్ణా; అంచున్ = అంటూ; సభ = సభ; లోన్ = లోపల; లీన = ఒదిగిన; అంగి = శరీరము కలది; ఐ = అయి; కుయ్యిడన్ = మొరపెట్టుకొనగా; కారుణ్యంబున =

దయతో; భూరి = అత్యధికములు అయిన {భూరి - మిక్కిలి పెద్ద సంఖ్య, 1 తరువాత 32 సున్నాలు}; వస్త్ర = వస్త్రములు; కలితంగాన్ = కలిగినది అగునట్లుగ; చేయఁడే = చేయలేదా ఏమి; ద్రౌపదిన్ = ద్రౌపదిని.

భావము:- ఆనాటి మహాసభలో క్రూరాత్ములై కౌరవులు బట్టలు విప్పేటప్పుడు నా వల్లభులు నన్ను ఉపేక్షించారు. ఇక నీవే నన్ను రక్షించాలి, రావే రక్షించవే అని పాంచాలి లజ్జాసంకుచితాంగియై ప్రార్థించినప్పుడు చీరలిచ్చి కారుణ్యంతో కాపాడాడు కదా!

1-365-సీ.

దుర్వాసుఁ డొకనాడు దుర్యోధనుఁడు వంపఁ-
పదివేల శిష్యులు భక్తిఁ గొలువఁ
జనుదెంచి, మనముఁ బాంచాలియుఁ గుడిచిన-
వెనుక నాహారంబు వేఁడికొనినఁ,
బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు,-
ననుచుఁ దోయావగాహమున కేఁగఁ,
గడవల నన్న శాకములు దీఱుటఁ జూచి,-
పాంచాలపుత్త్రిక పర్ణశాల

1-365.1-తే.

లోనఁ దలఁచిన విచ్చేసి లోవిలోని
శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి, తపసి
కోప ముడిగించి, పరిపూర్ణకుక్షిఁ జేసె,
నిట్టి త్రైలోక్య సంతర్పి యెందుఁ గలఁడు?

టీక:- దుర్వాసుఁడు = దుర్వాసుఁడు; ఒకనాడు = ఒకరోజు; దుర్యోధనుఁడు = దుర్యోధనుఁడు; వంపన్ = పంపగా; పదివేల = పదివేలమంది; శిష్యులు = శిష్యులు; భక్తిన్ = భక్తితో; కొలువన్ = మొక్కుతుండగ; చనుదెంచి = వచ్చి; మనమున్ = మనమందరము; పాంచాలియున్ = ద్రౌపది కూడా {పాంచాలి - పాంచాల దేశ రాకుమారి, ద్రౌపది}; కుడిచిన = తినిన; వెనుకన్ = తరువాత; ఆహారంబున్ = భోజనమును; వేఁడికొనినన్ = భిక్షగా అడిగి; పెట్టెదన్ = పెట్టెదను; అనవుడున్ = అనుడు; పెట్టకున్న = పెట్టకున్న; శపింతున్ = శాపము ఇచ్చెదను; అనుచున్ = అంటూ; తోయ = నీటిలో; అవగాహమున = స్నానముచేయుట; కున్ = కు; ఏఁగన్ = వెళ్ళగా; గడవలన్ = కుండలలో; అన్న = అన్నమును; శాకములు = కూరలును; తీఱుటన్ = నిండుకొనిన, ఖాళీ అగుటను; చూచి = చూసి; పాంచాలపుత్త్రిక = పాంచాలి {పాంచాలపుత్త్రిక - పాంచాలదేశ రాకుమారి, ద్రౌపది}; పర్ణశాల = పాక; లోనన్ = లోపల; తలఁచినన్ = స్మరించగ;

విచ్చేసి = వచ్చి; లోవి = వంటపాత్రలు; లోనిన్ = లోపలి; శిష్ట = మంచి; శాకాన్న = శాకాహారములు; లవమున్ = మిగిలిపోయిన పిసరుని; ప్రాశించి = స్వీకరించి; తపసి = తపస్సు చేయువాడు, ముని; కోపము = కోపము; ఉడిగించి = తగ్గించి; పరిపూర్ణ = పూర్తిగా నిండిన; కుక్షిన్ = కడుపు కలవానిగ; చేసెన్ = చేసెను; ఇట్టి = ఇలాంటి; త్రై = మూడు; లోక్య = లోకములకును; సంతర్పి = సంతృప్తిని కలిగించగలవాడు; ఎందున్ = ఎక్కడ; కలఁడు = ఉన్నాడు.

భావము:- ఒకనాడు ముక్కోపి అయిన దుర్వాసుడు దుర్యోధన ప్రేరితుడై పదివేల మంది శిష్యులతో మన వద్దకు వచ్చాడు, అప్పటికే మన మందరమూ, పాంచాలీ భుజించాము. ఆ సమయంలో ఆ మునీంద్రుడు "మాకు అన్నం పెట్టండి" అని అడిగాడు. పెడతాను అనగా, "పెట్టకపోతే శాపం పెడతాను"అంటూ చరచరా నదికి స్నానానికి సాగిపోయాడు. అప్పుడు పర్ణశాలలోకి పోయి పాంచాలి పాత్రలన్నీ పరికించి చూచింది. ఎక్కడా ఒక్క కూరముక్క కూడా కన్పించలేదు. ఆమె నిశ్చల హృదయంతో ఆ మహానుభావుణ్ణి తలచుకొంది. తక్షణం ఆ దయామయుడు ప్రత్యక్షమై, గిన్నిలో మిగిలి ఉన్న పిసరు తిన్నాడు. అంతే, మునీశ్వరుల కడుపులన్నీ నిండిపోయాయి. వారు శాంతించి తేనుపులు తేనుస్తూ వెళ్ళిపోయారు. సంకల్పమాత్రం చేతనే ముల్లోకాలకూ సంతుష్టి కలిగించే అటువంటి మహానుభావుడు మనకు మరెక్కడ దొరుకుతాడు.

### 1-366-సీ.

పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని-
  బలమున నా కిచ్చెఁ బాశుపతము?
నెవ్వని లావున నిమ్మేన దేవేంద్రు-
  పీఠార్ధమున నుండ బెంపుఁ గంటిఁ?
గాలకేయ నివాతకవచాది దైత్యులఁ-
  జంపితి నెవ్వని సంస్మరించి?
గోగ్రహణము నాఁడు కురుకులాంభోనిధిఁ-
  గడచితి నెవ్వని కరుణఁ జేసి?

### 1-366.1-ఆ.

కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల
తలలపాగ లెల్లఁ దడవి తెచ్చి
యే మహాత్ము బలిమి నిచ్చితి విరటుని
పుత్రి యడుగ బొమ్మపొత్తికలకు?

టీక:- పంది = వరాహము; కై = కోసము; పోరాడ = యుద్ధము చేయగ; ఫాలాక్షుఁడు = శివుడు {ఫాలాక్షుడు - ఫాలమునందు కన్ను కలవాడు, శివుడు}; ఎవ్వని = ఎవని యొక్క; బలమునన్ = శక్తివలన; నాకు

= నాకు; ఇచ్చెన్ = ఇచ్చెను; పాశుపతమున్ = పాశుపతాస్త్రము; ఎవ్వని = ఎవనియొక్క; లావునన్ = శక్తివలన; ఈ = ఈ; మేనన్ = శరీరముతో; దేవేంద్రు = దేవేంద్రుని; పీఠ = సింహాసనము; అర్ధమున = సగములో {పీఠార్ధము – అర్ధసింహాసన మిచ్చుట అను గౌరవము.}; ఉండన్ = ఉండేటట్టి; పెంపున్ = గొప్పదనమును; కంటిన్ = పొందితిని; కాలకేయ = కాలకేయులు; నివాతకవచ = నివాతకవచులు {నివాతకవచుడు = బాణములచే ఛేదింపబడని కవచము కలవాడు}; ఆది = మొదలగు; దైత్యులన్ = రాక్షసులను; చంపితిన్ = సంహరించితిని; ఎవ్వని = ఎవనిని; సంస్మరించి = సంస్మరణ చేసి; గో = గోవులను; గ్రహణము = పట్టుకుపోవుచున్న; నాఁడు = రోజు; కురు = కౌరవ; కుల = వంశము అను; అంభోనిధిన్ = సముద్రమును; గడచితిన్ = దాటితిని; ఎవ్వని = ఎవనియొక్క; కరుణన్ = దయ; చేసి = వలన;

కర్ణ = కర్ణుడు; సింధురాజ = సైంధవుడు; కౌరవేంద్ర = దుర్యోధనుడు; ఆదుల = మొదలగువారి; తలల = శిరములందున్న; పాగలు = (తల)పాగాలు (వస్త్రాభరణములు); ఎల్లన్ = అన్నిటిని; తడవి = చేతులతో నిమురుట ద్వారా వెదకి; తెచ్చి = తీసుకొనివచ్చి; ఏ; మహాత్ము = గొప్ప ఆత్మకలవాని; బలిమిన్ = శక్తివలన; ఇచ్చితి = ఇచ్చితిని; విరటుని = విరాటరాజు; పుత్రిక = కూతురు, ఉత్తర; అడుగన్ = అడగగ; బొమ్మ = ఆటబొమ్మల; పొత్తికల = పొత్తికల {పొత్తికల –పురుటికందులు, బొమ్మలు మొదలగువాని కొరకు వాడు మెత్తని గుడ్డలు}; కున్ = కోసము.

భావము:– అన్నా ఆ నాడు వరాహం కోసం సాగిన సమరంలో ఫాలనేత్రుని వల్ల పాశుపత మహాస్త్రాన్ని ఆయన దయవల్లనే కదా అందుకొన్నాను. త్రిలోకాధిశుడైన దేవేంద్రుని అర్ధసింహాసనాన్ని అయన అనుగ్రహం వల్లనే కదా అధిష్ఠింప గలిగాను. కాలకేయులు, నివాతకవచులు మొదలైన రాక్షసులను ఆ మహనీయుని బలం వల్లే కదా పరిమార్చాను. ఉత్తర గోగ్రహణ సందర్భంలో పొంగి వచ్చిన కౌరసేనావాహినిని ఆయన కరుణాకటాక్షం వల్లనే కదా దాట గలిగాను. ఆనాడు బొమ్మ పొత్తికలకు వస్త్రములు తెమ్మని ఉత్తర అడిగితే కర్ణ సైంధవ సుయోధనాదుల తలపాగలు తెచ్చి ఆమె ముద్దు చెల్లించగలిగింది ఆ పరమ పురుషుని దయవల్లనే కదా.

## ★1-367-మ.

**గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశచక్రంబులో,**
**గురుశక్తిన్ రథయంత యై, నొగలపైఁ గూర్చుండి, యా మేటి నా**
**శరముల్ వాఱక మున్న, వారల బలోత్సాహాయు రుద్యోగ త**
**త్పరతల్ చూడ్కుల సంహరించె, నమితోత్సాహంబు నా కిచ్చుచున్.**

టీక:– గురు = గురువు, ద్రోణుడు; భీష్మ = భీష్ముడు; ఆదులున్ = మొదలగువారు; కూడి = కలిసి; పన్నిన = రచించిన; కురు = కౌరవవంశపు; క్షోణీశ = రాజుల; చక్రంబు = (సైనికుల) దండు; లోన్ = లో; గురు = గొప్ప; శక్తిన్ = శక్తితో; రథయంత = సారథి; ఐ = అయి (ఉండి); నొగల = రథమునకు ముందు భాగము; పైన్ = మీద; కూర్చుండి = కూర్చొని; ఆ = ఆ; మేటి = సమర్థుడు; నా = నాయొక్క; శరముల్ = బాణములు; వాఱక = వాడక; మున్న = ముందే; వారల = వారియొక్క; బల = బలము; ఉత్సాహ = ఉత్సాహము; ఆయుస్ = అయువు;

ఉద్యోగ = ప్రయత్నములు; తత్పరతల్ = లక్ష్యములను; చూడ్కులన్ = చూపులతోనే; సంహరించెన్ = నాశనముచేసెను; అమిత = మిక్కిలి; ఉత్సాహంబున్ = ఉత్సాహమును; నాకు = నాకు; ఇచ్చుచున్ = ఇచ్చుచు.

భావము:- భీష్మ ద్రోణాది మహాయోధులతో కూడిన కురుక్షేత్ర మహాసంగ్రామంలో నాకు సారథ్యం చేస్తు, రథం నొగలపై కూర్చుండి నేను బాణ పరంపరలను వర్షింపక ముందే, తన చూపులతో శత్రువుల శక్తినీ, ఉత్సాహాన్నీ, ఆయుర్దాయాన్నీ, తదేకదీక్షనూ అపహరించి, నాకు అమితానందాన్ని అందించిన విజయ సారథి ఆయనే కదా!

(అర్జునుడు ద్వారకనుంచి వచ్చి శ్రీకృష్ణనిర్యాణం చెప్పలేకచెప్తు తమ జీవనసారథిని తలుస్తున్నాడు.)

## 1-368-మ.

అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ; గృపాశ్వత్థామ, గాంగేయ, సూ
ర్యసుత, ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్రప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగె మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా!

టీక:- అసురేంద్రుండు = దానవులకు అధిపతి, హిరణ్యకశిపుడు; ఒనరించు = చేయించు; కృత్యములు = పనులు; ప్రహ్లాదున్ = ప్రహ్లాదుని; ప్రవేశించిన్ = చేరినప్పటికిని; గెల్వ = గెలుచుటకు; సమర్థంబులున్ = సామర్థ్యములు కలవి; కాని = కాకుండెడిని; కైవడిన్ = వలె; కృప = కృపాచార్యుడు; అశ్వత్థామ = అశ్వత్థామ; గాంగేయ = భీష్ముడు {గాంగేయుడు - గంగ యొక్క పుత్రుడు, భీష్ముడు}; సూర్యసుత = కర్ణుడు {సూర్యసుత - సూర్యుని కుమారుడు, కర్ణుడు}; ద్రోణ = ద్రోణుని యొక్క; ధనుస్ = ధనుస్సుల నుండి; విముక్త = వదలబడిన; బహు = అనేకమైన; దివ్య = గొప్ప; అస్త్ర = అస్త్రములు అను; ప్రపంచంబున్ = పెద్ద సముదాయము; నా = నా; దెస = వైపు; కున్ = నకు; రాక = రాకుండగ; తొలంగెన్ = పక్కకుపోయినవి; మాధవు = కృష్ణుని {మాధవుడు - మాధవి భర్త, విష్ణువు}; దయా = దయతోకూడిన; దృష్టిన్ = చూపులు వలననే; నరేంద్రోత్తమ = మహారాజ {నరేంద్రోత్తముడు -ఉత్తముడైన నరులకింద్రుడు రాజు, మహారాజు}.

భావము:- మహారాజా! పూర్వం హిరణ్యకశిపుని క్రూరకృత్యాలు ప్రహ్లాదుని విషయంలో విఫలములైనట్లే, భీష్మద్రోణ కర్ణ కృప అశ్వత్థామల ధనుస్సుల నుంచి వెలువడిన నానావిధములైన శస్త్రాస్త్రాలు నా మీదకు రాకుండా ఆ మాధవుని దయాధృక్కులతో ప్రక్కకు తొలగి పోయాయి.

## 1-369-చ.

వసుమతి దివ్యబాణముల వ్రక్కలు వాపి కొలంకు సేసి, నా
రసములు మాటుగాఁ బఱపి రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు, నా
కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె? భూవరా!

టీక:- వసుమతిన్ = భూమిని; దివ్య = గొప్ప; బాణముల = బాణములతో; వ్రక్కలు = పగుళ్ళు; వాపి = కొట్టి; కొలంకు = కొలను; సేసి = తయారుచేసి; నారసములు = బాణములు {నారసములు - నారినుండి వెలువడునవి, బాణములు}; మాటుగాన్ = అడ్డము ఉండేలాగ; పఱపి = వేసి; రథ్యములన్ = గుఱ్ఱములను; రిపులు = శత్రువులు; ఎల్లన్ = అందరును; చూడ = చూచుచు ఉండగ; సాహసమున = సాహసముతో; నీటన్ = నీటిలో; పెట్టితి = పెట్టితిని; రణావనిన్ = యుద్ధభూమిలో; సైంధవున్ = సైంధవుని; చంపు = సంహరించు; నాఁడు = దినమున; నాకు = నాకు; అసురవిరోధి = కృష్ణుడు; భద్ర = కాపాడే; గతిన్ = విధముగ; అండ = రక్షణ, ప్రాపు; అయి = అయి; వచ్చినన్ = రావటమువలననే; కాదె = కదా; భూవరా = రాజా {భూవరుడు - భూమికి భర్త రాజు}.

భావము:- వసుమతీ వల్లభా! సైంధవుని వధించే ఆ నాటి రణరంగంలో శత్రువులు కళ్లారా చూస్తుండగానే నా దివ్య బాణాలతో భూమిని వ్రయ్యలు చేసి జలాశయాన్ని కల్పించి, బాణముల చాటున, అలసి సొలసిన నా రథాశ్వాలకు దప్పిక తీర్చింది; ఆ దయామయుని అండవల్లనే కదా!

1-370-సీ.

చెలికాఁడ రమ్మని చీరు న న్నొకవేళ,-
  మన్నించు నొకవేళ మఱఁది యనుచు,
బంధుభావంబునఁ బాటించు నొకవేళ,-
  దాతయై యొకవేళ ధనము లిచ్చు,
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు,-
  బోధియై యొకవేళ బుద్ధి సెప్పు,
సారథ్య మొనరించుఁ జనవిచ్చి యొకవేళఁ,-
  గ్రీడించు నొకవేళ గేలి సేయు,

1-370.1-తే.

నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న
తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు,
హస్తములు వట్టి పొత్తున నారగించు,
మనుజవల్లభ! మాధవు మఱవ రాదు.

టీక:- చెలికాఁడ = మిత్రుడా; రమ్ము = రా; అని = అని; చీరున్ = పిలుచును; నన్ను = నన్ను; ఒక = ఒక; వేళ = సమయమందు; మన్నించున్ = గౌరవించును; ఒక = ఒక; వేళ = సమయమందు; మఱఁది = బావమరిది, చెల్లెలు భర్త; అనుచు = అనుచును; బంధు = చుట్టరికపు; భావంబునన్ = భావమును, ఆత్మీయతను; పాటించు = వ్యవహరించును; ఒక = ఒక; వేళ = సమయమందు; దాత = దానమిచ్చువాడు; ఐ = అయ్యి; ఒక = ఒక; వేళ =

సమయమున; ధనములు = ధనములను; ఇచ్చు = ఇచ్చును; మంత్రి = మంత్రి {మంత్రి - మంత్రాంగమున సహాయము చేయువాడు}; ఐ = అయ్యి; ఒక = ఒక; వేళ = సమయమందు; మంత్రము = ఆలోచనా వ్యూహము; ఆదేశించు = ఆజ్ఞాపించును; బోధి = బోధించువాడు; ఐ = అయ్యి; ఒక = ఒక; వేళ = సమయమందు; బుద్ధి = నీతి; చెప్పు = చెప్పు; సారథ్యము = రథసారథ్యము; ఒనరించున్ = చేయును; చనవు = అనురాగము; ఇచ్చి = ఇచ్చి; ఒక = ఒక; వేళన్ = సమయమందు; క్రీడించున్ = ఆటలాడును; ఒక = ఒక; వేళ = సమయమందు; గేలి = ఎగతాళి; చేయు = చేయును; ఒక్క = ఒకే;

శయ్యాసనంబున = పాన్పునందు; ఉండున్ = ఉండును; కన్న = జన్మనిచ్చిన; తండ్రి = తండ్రి; కైవడిన్ = వలె; చేసిన = చేసిన; తప్పున్ = తప్పులను; కాచు = కాయును; హస్తములున్ = చేతులు; వట్టి = పట్టుకొని; పొత్తునన్ = కలిసి; ఆరగించు = భుజించు; మనుజవల్లభ = రాజా {మనుజవల్లభ - మానవులకు భర్త, రాజు}; మాధవు = కృష్ణుని యొక్క {మాధవుడు - మాధవి భర్త, విష్ణువు}; మఱవ = మరచు విధము; రాదు = చేతకాదు.

భావము:- ఆవాసుదేవునికి నేనంటే ఎంత ప్రేమ ఒకమాటు చెలికాడా రారమ్మని పిలిచేవాడు. ఒకమాటు ముద్దుల మరదీ అని ముద్దు చేసేవాడు, ఒకమాటు ఆత్మబంధువై ఆదరించేవాడు. ఒకమాటు ఔదార్యమూర్తియై బహుధనాలు బహూకరించేవాడు. ఒకమాటు మంత్రియై హితోపదేశం చేసేవాడు. ఔదార్యమూర్తియై బహుధనాలు బహూకరంచేవాడు. ఒకమాటు మంత్రియై హితోపదేశం చేసేవాడు. ఒకమాటు గురువై కర్తవ్యాన్ని బోధించేవాడు. మరొకమాటు సారథియై చనువు చూపేవాడు. ఒకమాటు కూడి ఆటలాడుతూ విహరించేవాడు, వేరొకమాటు ఆత్మీయుడై హాస్యమాడుతూ ఆటలు పట్టించేవాడు. ఇంకొక మాటు ఒకే ప్రక్కమీద కూర్చోపెట్టుకొని కన్నతండ్రి వలె నా తప్పులు సరిదిద్దేవాడు. మరొకమాటు నా చేతులు పట్టుకొని బలవంతం చేసి పొత్తున ఆరగింప జేసేవాడు. అటువంటి మన ముద్దులబావ అయిన మాధవుణ్ణి మరచిపోవటం ఎలా మహారాజా.

1-371-క.

విజయ, ధనంజయ, హనుమ
ద్ధ్వజ, ఫల్గున, పార్థ, పాండుతనయ, నర, మహేం
ద్రజ, మిత్రార్జున, యంచును
భుజములు తలకడవ రాకపోకలఁ జీరున్.

టీక:- విజయ = అర్జున {విజయ - విజయము కలవాడు, అర్జున}; ధనంజయ = అర్జున {ధనంజయ - (దిగ్విజయమున) ధనమును గెలిచిన వాడు, అర్జున }; హనుమద్ధ్వజ = అర్జున {హనుమద్ధ్వజ - హనుమంతుని జండాపై కలవాడు, అర్జున }; ఫల్గున = అర్జున {ఫల్గున - ఉత్తర ఫల్గుని నక్షత్రము నందు పుట్టినవాడు, వేగముగా పాదరసం వలె ప్రసరించువాడ, అర్జున }; పార్థ = అర్జున {పార్థుడు - పృథాదేవి (కుంతి) పుత్రుడు, అర్జునుడు}; పాండుతనయ = అర్జున {పాండుతనయా - పాండురాజు పుత్రా, అర్జున }; నర = అర్జున {నర - నరనారాయణులలో నరుడా, అర్జున}; మహేంద్రజ = అర్జున {మహేంద్రజ - మహేంద్రుని పుత్రా, అర్జున}; మిత్ర = మిత్రుడ, {మిత్రుడు = కొలతలు వేయుటలో నేర్పరి, సూర్యుని వలె నిస్వార్థం గలవాడు, అర్జునుడు};

అర్జున = అర్జున {అర్జునా – తెల్లని వాడా, అర్జున}; అంచును = అనుచును; భుజములున్ = చేతులు; తలకడవన్ = అతిక్రమించగా, చాచి; రాకపోకలన్ = రాకపోకలందు; చీరున్ = పిలుచును.

భావము:- అటు ఇటు తిరుగుతున్నప్పుడల్లా చేతులు చాచి ఆప్యాయంగా తట్టుతు విజయ, ధనంజయ, హనుమద్ధ్వజ, ఫల్గున, పార్థ, పాండుతనయ, నర, మహేంద్రజ, మిత్రమ, అర్జున అంటు రకరకాలుగా చనువుగా నన్ను పిలిచేవాడు కదా!

1-372-క.

వారిజగంధులు దమలో

వారింపఁగరాని ప్రేమ వాదము సేయన్,

వారిజనేత్రుఁడు ననుఁ దగ

వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా!

టీక:- వారిజగంధులున్ = సుందరీమణులు {వారిజగంధులు – నీట పుట్టినది (పద్మము) వంటి సువాసన కలవారు, పద్మినీజాతి స్త్రీలు}; తమ = తమ; లోన్ = మధ్యన; వారింపఁగరాని = తీర్చలేని; ప్రేమ = ప్రణయ; వాదమున్ = కలహమును; చేయన్ = చేయగా; వారిజనేత్రుఁడు = కృష్ణుడు {వారిజనేత్రుఁడు – పద్మములవంటి కన్నులు కలవాడు, కృష్ణుడు}; ననున్ = నన్ను; తగన్ = తగ, సరిగ; వారి = వారియొక్క; ఇండ్ల = నివాసముల; కున్ = కు; పనుపున్ = పంపును; అలుక = అలక (కోప విశేషము); వారింప = పోగొట్టుటకు; నృపా = రాజా {నృప – నరులను పాలించువాడు, రాజు}.

భావము:- అప్పుడప్పుడు తనకు అంతఃపుర కాంతలతో ప్రణయకలహం సంభవించినప్పుడు వారి వాలయలుకను తీర్చటంకోసం నన్ను బ్రతిమాలి వారియిండ్లకు పంపే వారిజాక్షుని ఏవిధంగా విస్మరించగలం? ప్రభూ!

1-373-క.

నిచ్చలు లోపలికాంతలు

మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్

ముచ్చటలు సెప్పు మెల్లన

విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా!

టీక:- నిచ్చలు = ఎల్లప్పుడు; లోపలి = అంతఃపురము లోపలి; కాంతలు = స్త్రీలు; మచ్చికన్ = చనువు కొద్దీ; తన = తన; తోడన్ = తో; ఆడు = మాట్లాడు; మాటలు = మాటలు; నాకున్ = నాకు; ముచ్చటలు = ముచ్చటగా, సరదా కబుర్లుగా; చెప్పున్ = చెప్పును; మెల్లన = మెల్లని స్వరముతో; విచ్చలవిడిన్ = స్వతంత్రముగా; తొడలమీఁద = మోకాళ్ళమీద; విచ్చేసి = వచ్చి; నృపా = రాజా {నృప – నరులను పాలించువాడు, రాజు}.

భావము:- తాను చనువుగా నా చెంత చేరి, నా ఒడిలో కూర్చొని, నిత్యమూ తన ప్రియురాళ్లకూ తనకూ మధ్య జరిగే రహస్య సంభాషణలన్నీ పూసగ్రుచ్చినట్లు మెల్లగా నా చెవిలో చెప్పేవాడు.

★1-374-చ.

అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేఁడు సూడుమా
యిటువలె గారవించు జగదీశుఁడు గృష్ణుఁడు లేని పిమ్మటం
బటుతర దేహలోభమునఁ బ్రాణములున్నవి వెంటఁబోక, నేఁ
గటకట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో?

టీక:- అటమటము = గజిబిజి, వృథా; అయ్యెన్ = అయ్యెను; నా = నా యొక్క; భజనము = పూజలు; అంతయు = మొత్తము అంతా; భూవర = భూమికి భర్తా, రాజా; నేఁడు = ఇవాళ; సూడుమా = చూడవోయి; ఇటువలె = ఇలా; గారవించు = ఆదరించు, గారాబము చేయు; జగధీశుఁడు = జగత్తునకు ఈశుడు; కృష్ణుఁడు = కృష్ణుడు; లేని = లేకపోయిన; పిమ్మటన్ = తరువాత కూడ; పటుతర = చాలా గట్టిదైన {పటు - పటుతరము - పటుతమము}; దేహ = శరీరము మీది; లోభమునన్ = పిసినారితనముతో, మమకారముతో; ప్రాణములు = ప్రాణములు; ఉన్నవి = ఉన్నవి; వెంటన్ = కూడా; పోకన్ = వెళ్ళకుండగనే; నేన్ = నేను కటకట = అయ్యయ్యో; పూర్వ = క్రిందటి; జన్మమునన్ = జన్మలలో; కర్మములు = పాపం పనులు; ఎట్టివి = ఎలాంటివి; చేసినాఁడనో = చేసానో.

భావము:- అయ్యయ్యో! నా సేవ అంతా నిరర్థకం అయిపోయింది మహాప్రభో! చూడు ఇవాళ, ఇలా ఆప్యాయంగా నన్ను ఆదరించే విశ్వేశ్వరుడు, శ్రీకృష్ణుడు ఈ లోకం విడిచి వెళ్ళిపోయాక కూడ ఇంకా నా ప్రాణాలు ఆయన వెంట పోకుండ ఉన్నాయి. దేహం మీద ఇంతటి లోభం ఉందంటే పూర్వ జన్మలలో ఎంతటి పాపకృత్యాలు చేసానో కదా!

1-375-శా.

కాంతారంబున నొంటి దోడుకొని రాఁగాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల, మదరాగాయత్తులై తాఁకి నా
చెంతన్ బోయలు మూఁగి పట్టికొన, నా సీమంతినీ సంఘమున్
భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్ లేక; ధాత్రీశ్వరా!

టీక:- కాంతారంబునన్ = అడవిలో; ఒంటిన్ = ఒంటరిగా; తోడుకొని = తీసుకొని; రాఁగాన్ = వస్తుండగ; చూచి = చూసి; గోవిందు = కృష్ణుని {గోవిందుడు - గోవులకు ఒడయుడు, కృష్ణుడు}; శుద్ధాంత = అంతఃపుర; స్త్రీలన్ = స్త్రీలను; పదాఱువేల = పదహారువేలమంది; మద = మదముతోను; రాగ = కామముతోను; ఆయత్తులు = నిండినవారు; ఐ = అయి; తాఁకి = ముట్టడించి; నా = నా; చెంతన్ = దగ్గరగ; బోయలు = బోయవాళ్ళు; మూఁగి = చుట్టూ ముసురుకొని; పట్టికొనన్ = పట్టికొనగా; ఆ = ఆ; సీమంతినీ = అంతఃపురములో నుండు స్త్రీల; సంఘమున్ = సమూహమును; భ్రాంతిన్ = భ్రమతో; భామిని = ఆడుదాని; భంగిన్ = వలె; ఉంటిన్

= ఉండిపోతిని; విడిపింపన్ = విడిపించగా; లేక = లేక, రాక; ధాత్రీశ్వరా = రాజా, ప్రభూ {ధాత్రీశ్వరుడు – భూమికి ప్రభువు, రాజు}.

భావము:- ఆ మహానుభావుడు తనువు చాలించిన అనంతరం ఆయన అంతఃపురకాంతలను పదహారువేలమందినీ వెంటబెట్టుకొని వస్తుండగా అరణ్యమధ్యంలో మదోన్మత్తులైన కిరాతులు చుట్టుముట్టి పట్టుకొన్నారు. వారి బారినుండి ఆ నారీమణులను కాపాడలేక ఆడుదానిలాగా విస్తుపోయి కళ్లప్పగించి చూస్తూ ఊరుకొన్నాను.

★1-376-శా.

ఆ తే, రా రథికుండు, నా హయము, లా యస్త్రాసనం, బా శర
వ్రాతం, బన్యులఁ దొల్లి జంపును, దుదిన్ వ్యర్థంబు లైపోయె; మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి భసితక్షిప్తాజ్య మాయావి మా
యాతంత్రోషరభూమిబీజముల మర్యాదన్ నిమేషంబునన్.

టీక:- ఆ = అదే; తేరు = రథము; ఆ = అదే; రథికుండున్ = రథమునెక్కిన వీరుడు; ఆ = అదే; హయములు = గుఱ్ఱములు; ఆ = అదే; అస్త్రాసనంబు = విల్లు; ఆ = అదే; శర = అస్త్రముల; వ్రాతంబు = సమూహము; అన్యులన్ = పరులను; తొల్లి = ఇంతకుముందు; చంపును = సంహరిస్తుండేవి; తుదిన్ = చిట్టచివరకి, ఆఖరికి; వ్యర్థంబులు = నిరుపయోగములు; ఐపోయెన్ = అయిపోయినవి; మత్ = నా యొక్క; చేతస్ = మనసునకు, ప్రజ్ఞకు; అధీశుండు = అధిపతి; చక్రి = కృష్ణుడు {చక్రి – చక్రాయుధుడు – కృష్ణుడు}; లేమి = లేకపోవుటచేత; భసిత = బూడిదలో; క్షిప్త = చిమ్మబడిన; ఆజ్య = నేయియును; మాయావి = ఐంద్రజాలికుని; మాయాతంత్ర = గారడీయును; ఊషరభూమి = చవిటిపఱ్ఱలో చల్లిన; బీజముల = విత్తనములును; మర్యాదన్ = వలె; నిమేషంబునన్ = నిమిషములో.

భావము:- (అర్జునుడు శ్రీకృష్ణ నిర్యాణానంతరం వెనుకకు హస్తిన చేరి అన్నగారు ధర్మరాజువద్ద వాపోతున్నాడు.) ఆత్మేశ్వరుడు చక్రధారి యైన శ్రీకృష్ణుడు లేకపోడంతో ఆ రథం, ఆ రథంపై నున్న నేను, ఆ గుఱ్ఱాలు, ఆ విల్లంబులు శత్రుసంహారకా లైన అవన్ని ఇదివరకటివే అయినా నిరుపయోగ మైపోయాయి. అన్నీ బూడిదలో పోసిన నెయ్యిలా, మాయావి యందు ప్రయోగించిన మాయలా, చవిటిపఱ్ఱ ఐన పొలంలో చల్లిన విత్తనాల్లా తుదకు అన్ని క్షణకాలంలో నిరర్థకాలు అయిపోయాయి.

1-377-మ.

యదువీరుల్ మునినాథుశాపమునఁ గాలాధీనులై, యందఱున్
మదిరాపాన వివర్ధమాన మదసమ్మర్దోగ్ర రోషాంధులై
కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి నీఱైరి న
ష్టదశం జిక్కిరి నల్వు రేవు రచటన్ సర్వంసహావల్లభా!

టీక:- యదు = యాదవ; వీరుల్ = వీరులు; మునినాథు = దూర్వాసుని; శాపమునన్ = శాపము వలన; కాల = కాలమునకు; ఆధీనులు = లొంగినవారు; ఐ = అయి; అందఱున్ = అందరును; మదిరా = మద్యమును; పాన = త్రాగుటచేత; వివర్ధమాన = పెచ్చుపెరిగిన; మద = మదముతోను; సమ్మర్ద = ఘర్షణలతోను; ఉగ్ర = భయంకరమైన; రోష = రోషముతోను, కినుకతోను; అంధులు = గ్రుడ్డివారు; ఐ = అయి; కదనంబుల్ = యుద్ధములు; తమలోన = తమలోతామే; ముష్టి = పిడికిలి; హతులన్ = పోటులను; కావించి = చేసుకొని; నీఱైరి = భస్మమైరి; నష్ట = నశించే; దశన్ = అవస్థను; చిక్కిరి = తగ్గిరి, కృశించిరి, తగులుకొనిరి; నల్వురు = నలుగురేసి; ఏవురు = ఐదుగురేసి; అచటన్ = అక్కడ; సర్వంసహావల్లభా = ప్రభూ {సర్వంసహావల్లభుడు – భూమికిరాజా, ప్రభూ}.

భావము:- ధరణీవల్లభా! ఇంతకు ముందు మీరు పేర్కొన్న యాదవ వీరులంతా విధివైపరీత్యం వల్ల మునిశాపోపహతులై, వారందరూ మద్యపానం చేసిన మత్తులో మైమరిచి, ఆగ్రహావేశంతో ద్వేషరోషాలతో కన్నూ మిన్నూ కానక తమలో తాము పోరాడుకొన్నారు. ముష్టిఘాతాలతో పరస్పరం కొట్టుకొని ప్రాణాలు పోగొట్టుకొన్నారు. పోయినవారు పోగా నలుగు రైదుగురు మాత్రం ఎలాగో బ్రతికి బయటపడ్డారు.

★1-378-క.

**భూతములవలన నెప్పుడు**

**భూతములకు జన్మ మరణ పోషణములు ని**

**ర్ణీతములు సేయుచుండును**

**భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా!**

టీక:- భూతముల = జీవుల; వలనన్ = వలన; ఎప్పుడు = ఎప్పుడును; భూతముల = తోటి జీవుల; కున్ = కు; జన్మ = పుట్టుకలు; మరణ = మరణములు; పోషణములు = పోషణములను; నిర్ణీతములు = నిర్ణయించుటలు; చేయుచుండును = చేయుచుండును; భూత = సర్వభూతములలో; మయుండు = నిండి ఉండువాడు; ఈశ్వరుండు = భగవంతుడు; భూతశరణ్యా = రాజా {భూతశరణ్య — ఆశ్రయించిన ప్రజలకు శరణము ఇచ్చువాడు, రాజు}.

భావము:- ఆశ్రితవత్సలా! అన్నా! ధర్మరాజా! పరమేశ్వరుడు సర్వభూతాంతర్యామి. ఆయన ప్రాణులకు సృష్టి స్థితి సంహారాలు తోటి ప్రాణుల వలననే కలుగజేస్తు ఉంటాడు. (అర్జునుడు అన్న ధర్మరాజుకి కృష్ణనిర్యాణము తెలుపుతు ఆప్తునిగా భగవంతునిగా స్మరిస్తున్న సందర్భంలోది ఈ పద్యం.)

★1-379-క.

**బలములు గల మీనంబులు**

**బలవిరహితమీనములను భక్షించు క్రియన్**

**బలవంతు లయిన యదువులు**

**బలరహితులఁ జంపి రహితభావముల నృపా!**

టీక:- బలములు = బలము; కల = కలిగిన; మీనంబులు = చేపలు; బల = బలము; విరహిత = లేని; మీనములను = చేపలను; భక్షించు = తినెడి; క్రియన్ = విధముగ; బల = బలము; వంతులు = కలవారు; అయిన = అయినట్టి; యదువులు = యాదవులు; బల = బలము; రహితులన్ = లేనివారిని; చంపిరి = సంహరించిరి; అహిత = శత్రు; భావముల = భావములతో; నృపా = రాజా {నృప - నరులను పాలించువాడు, రాజు}.

భావము:- పెద్దచేపలు అనేక చిన్నచేపలను గుట్టుక్కున మింగుతాయి. అలా యాదవులలో బలవంతులు తమలో తాము తమకంటే బలహీను లందరిని పగబట్టినట్లు చంపేసారు. అవును జీవులు జీవుల వలననే పుట్టింపబడతారు; పోషింపబడతారు; అంతరింపబడతారు కదా! (ఆవిధంగా అనితరసాధ్యు లైన యాదవులు తుడుచుపెట్టుకుపోయా రని ద్వారకనుండి తిరిగి వచ్చిన అర్జునుడు అన్నగారికి తెలిపాడు.)

## 1-380-మ.

బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థి భావోద్యమం
బులు గల్పించి, వినాశమున్ నెఱపి, యీ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిం గృతకార్యుఁడై చనియె; నా సర్వేశ్వరుం, డచ్యుతుం,
డలఘుం, డేమని చెప్పుదున్ భగవదాయత్తంబు పృథ్వీశ్వరా!

టీక:- బల = బలము; హీన = తక్కవగా కల; అంగుల = అంగములు కలవారి; కున్ = కిని; బల = బలము; అధికుల = అధికముగా కలవారి; కున్ = కిని; ప్రత్యర్థి = శత్రుత్వ; భావ = భావము యొక్క; ఉద్యమంబులు = ఉద్యమములు, ప్రయత్నములు; కల్పించి = ఏర్పరచి; వినాశమున్ = వినాశమును; నెఱపి = వ్యాపింపజేసి; ఈ = ఈ; భూ = భూమి యొక్క; భారమున్ = భారమును; పాపి = పాగొట్టి; నిశ్చల = నిశ్చలమైన; బుద్ధిన్ = బుద్ధితో; కృత = చేయవలసినది; కార్యుఁడు = చేసినవాడు; ఐ = అయి; చనియెన్ = దేహము వదలి వెళ్ళిపోయెను; ఆ = ఆ; సర్వేశ్వరుండు = కృష్ణుడు {సర్వేశ్వరుండు - సర్వులకును ఈశ్వరుడు, కృష్ణుడు}; అచ్యుతుండు = కృష్ణుడు {అచ్యుతుండు - నాశములేనివాడు, కృష్ణుడు}; అలఘుండు = కృష్ణుడు {అలఘుండు - (ఏవిధముగను) తక్కువ కాని వాడు, కృష్ణుడు}; ఏమి = ఎమిటి; అని = అని; చెప్పుదున్ = చెప్పమన్నావు; భగవత్ = భగవంతుని; ఆయత్తంబు = ఆధీనము; పృథ్వీశ్వరా = ప్రభువా {పృథ్వీశ్వరుడు - పృథివికి ఈశ్వరుడు, రాజు}.

భావము:- పృథ్వీనాథా! బలవంతులైన వారికీ బలహీనులైన వారికీ నడుమ పగలు కల్పించి, పరస్పర సంహారం చేయించి, ఈ భూభారాన్ని తీర్చి ఆ అచ్యుతుడు, ఆ అప్రమేయుడు, ఆ అఖిలేశ్వరుడు, ఆ శ్రీకృష్ణుడు వచ్చిన కార్యం పూర్తి చేసుకొని నిబ్బరంగా, నిశ్చలంగా వెళ్లిపోయాడు. ఇంకా ఏమి చెప్పేది ఆ సర్వేశ్వరుని సంకల్పం ప్రకారం జరిగిపోయింది.

## పాండవుల మహాప్రస్థానంబు

1-381-వ.

మఱియు దేశకాలార్థయుక్తంబులు, నంతఃకరణ సంతాప శమనంబులు నయిన హరివచనంబులందలంచి, చిత్తంబు పరాయత్తంబయియున్నది;" అని యన్నకుం జెప్పి నిరుత్తరుండై, నిరంతర హరిచర ణారవిందచింతామలబుద్ధియై, శోకంబు వర్జించి, సదా ధ్యానభక్తి విశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయ సేనామధ్యంబున నచ్యుతుండానతిచ్చిన గీతలుదలంచి, కాలకర్మ భోగాభి నివేశంబులచేత నావృతంబయిన విజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి, హేతుమద్భా వంబున శోకహేతు వహంకార మమకారా త్మకంబయిన ద్వైతభ్రమం బనియును, ద్వైతభ్రమంబునకుఁగారణంబు దేహంబనియును, దేహంబునకుబీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబులనియును, గుణంబులకు నిదా నంబు ప్రకృతియనియును, "బ్రహ్మాహ"మనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండుననియు, ప్రకృతి యడంగుటయ నైర్గుణ్యంబనియును నైర్గుణ్యంబు వలనఁ గార్యలింగనాశంబనియును, గార్యలింగనాశంబున నసంభవంబగు ప్రక్ర తింబాసి, క్రమ్మఱస్థూలశరీరప్రాప్తుండుగాక పురుషుండు సమ్యగ్యోగంబున నుండు ననియును నిశ్చయించి యర్జునుండు విరక్తుండై యూరకుండె; ధర్మజుండు భగవదీయ మార్గంబు దెలిసి యాదవుల నాశంబు విని నారదు వచనంబులం దలంచి నిశ్చలచిత్తుండై స్వర్గమార్గ గమనంబునకు యత్నంబు సేయుచుండె; నా సమయంబున.

టీక:- మఱియున్ = ఇంకనూ; దేశ = ప్రదేశముతో; కాల = కాలముతో; అర్థ = అర్థముతోను; యుక్తంబులున్ = కూడినవి; అంతఃకరణ = అంతఃకరణమునందలి, మనసులోపలి; సంతాప = మిక్కిలి తాపములను; శమనంబులు = శమింపజేయునవి; అయిన = అయినట్టి; హరి = హరి యొక్క; వచనంబులన్ = వచనములు; తలంచి = స్మరించి; చిత్తంబు = మనసు; పరాయత్తంబు = వికలము {పరాయత్తము - ఆయత్తమునకు పరమైనది, వికలము}; అయి = అయి; ఉన్నది = ఉన్నది; అని = అని; అన్న = అన్న; కున్ = కి; చెప్పి = చెప్పి; నిరుత్తరుండు = మౌని {నిరుత్తరుండు - జవాబు లేనివాడు, మౌని}; ఐ = అయి; నిరంతర = ఎడతెగ కుండగ; హరి = భగవంతుని; చరణ = పాదములు అను; అరవింద = పద్మములందు; చింత = ధ్యానించుట వలన; అమల = మలములు లేని, నిర్మలమైన; బుద్ధి = బుద్ధికలవాడు; ఐ = అయి; శోకంబు = దుఃఖ మును; వర్జించి =

విడిచిపెట్టి; సదా = ఎల్లప్పుడు; ధ్యాన = ధ్యానించుట యొక్క; భక్తి = భక్తి కలిగి ఉండుట యొక్క; విశేషంబులన్ = ప్రత్యేకతల వలన; కామ = కామము; క్రోధ = క్రోధము; ఆదులన్ = మొదలగువానిని; జయించి = జయించి; తొల్లి = ఇంతకు పూర్వము; తన = తన; కున్ = కి; ఉభయ = రెండు; సేనా = సేనల; మధ్యంబునన్ = మధ్యస్థలములో; అచ్యుతుండు = కృష్ణుడు; ఆనతి = ఉపదేశముగ; ఇచ్చిన = ఇచ్చినట్టి; గీతలు = భగవద్గీతా వాక్యములు; తలంచి = తలచుకొని; కాల = కాలమును; కర్మ = ప్రారబ్ధములును; భోగ = భోగములును; ఆభినివేశంబులు = అభిలాష కలిగి ఉండుట, సక్తులు; చేతన్ = చేతను; ఆవృతంబు = కప్పబడినది; అయిన = అయినట్టి; విజ్ఞానంబున్ = విజ్ఞానమును; క్రమ్మఱన్ = మరల; అధిగమించి = దాటి; హేతు = హేతువును, తార్కిక; మత్ = తెలుసుకొనిన, శాస్త్ర; భావంబున = లక్షణముచేత; భావము వలన; శోక = శోకమునకు; హేతువు = కారణము; అహంకార = నేను; మమకార = నాది; ఆత్మకంబు = అను భావములు కలది; అయిన = అయినట్టి; ద్వైతభ్రమంబు = ద్వైతభ్రమ {ద్వైతభ్రమ – రెండు ఉన్నట్లు అనిపించు భ్రాంతి; జీవాత్మ పరమాత్మ అనునవి రెండు అను భ్రమ}; అనియును = అనియును; ద్వైతభ్రమంబున = ద్వైతభ్రమమున; కున్ = కు; కారణంబు = కారణము; దేహంబు = దేహము; అనియును = అనియును; దేహంబున = దేహమున; కున్ = కు; బీజంబు = మూలము; లింగంబు = లింగశరీరము {లింగశరీరము – సూక్ష్మశరీరము, మనస్సు}; అనియును = అనియును; లింగంబున = లింగశరీరమున; కున్ = కు; మూలంబు = మూలము; గుణంబులు = గుణములు; అనియును = అనియును; గుణంబుల = గుణముల; కున్ = కి; నిదానంబు = మొదలి కారణము; ప్రకృతి = ప్రకృతి; అనియును = అనియును; బ్రహ్మోహం = బ్రహ్మనునేనే; అనియెడు = అనే; జ్ఞానంబున = జ్ఞానము వలన; లీనము = లయించి పోయినది; ఐ = అయి; ప్రకృతి = ప్రకృతి {ప్రకృతి – చావు పుట్టుకల చక్రము లక్షణముగ కలది}; లేకుండును = లేకుండగ పోవును, అణగును; అనియు = అనియును; ప్రకృతి = ప్రకృతి; అడంగుటయ = అణగుటయే; నైర్గుణ్యంబు = నిర్గుణత్వము; అనియును = అనియును; నైర్గుణ్యంబు = నైర్గుణ్యము; వలనన్ = వలన; కార్యలింగ = ప్రారబ్ధలింగ శరీరము {కార్యలింగం – ప్రారబ్ధలింగ శరీరము – ప్రకృతి లక్షణముల ద్వారా కలిగినది ప్రారబ్ధము}; నాశంబు = నాశనమగు; అనియును = అనియును; కార్యలింగ = కార్యలింగ; నాశంబున = నాశనమున; అసంభవంబు = ముక్తి {అసంభవము – జన్మరాహిత్యము, ముక్తి}; అగున్ = కలుగును; ప్రకృతిన్ = ప్రకృతిని; పాసి = విడచి; క్రమ్మఱన్ = మరల; స్థూల = స్థూలమైన, భౌతిక; శరీర = శరీరము; ప్రాప్తుండున్ = పొందినవాడు; కాక = అవ్వకుండక; పురుషుండు = జీవుడు; సమ్యగ్భోగంబునన్ = సమ్యగ్భోగము యందు {సమ్యగ్భోగము – చక్కటి అనుభవము}; ఉండున్ = ఉండును; అనియును = అనియును; నిశ్చయించి = నిశ్చయించుకొని; అర్జునుండు = అర్జునుడు; విరక్తుండు = విరక్తి చెందినవాడు; ఐ = అయి; ఊరక = ఊరకనే; ఉండెన్ = ఉండెను; ధర్మజుండు = యమధర్మరాజు పుత్రుడు, ధర్మరాజు; భగవదీయ = భగవంతుని యొక్క; మార్గంబున్ = మార్గమును, పోవుటను; తెలిసి = తెలిసికొని; యాదవుల = యాదవుల; నాశంబు = మరణము; విని = విని; నారదు = నారదుని యొక్క; వచనంబులన్ = మాటలను; తలంచి = స్మరించి; నిశ్చల = చలింపని; చిత్తుండు = మనస్సు కలవాడు; ఐ = అయి; స్వర్గ = స్వర్గమునకు పోవు; మార్గ = దారి వెంట – మార్గము వెంట; గమనంబున = వెళ్ళుట; కున్ = కు; యత్నంబు = ప్రయత్నము; చేయుచుండెన్ = చేయుచుండెను; ఆ = ఆ; సమయంబున = సమయమున.

భావము:- అని ఇంకా, దేశ కాల అర్థములకు తగినవి, మానసిక సంతాపాన్ని శమింపజేసేవీ ఐన వాసుదేవుని వాక్కులు స్మరించుకొని, అర్జునుడు అన్నకు "చిత్తము వికలమై ఉన్న" దని చెప్పి, మౌనం

వహించాడు. సంతత గోవింద చరణారవింద సంస్మరణంచేత స్వచ్ఛమైన బుద్ధికలవాడై శోకాన్ని విసర్జించాడు. నిరంతర ధ్యానరూపమైన భక్తివిశేషంతో కామక్రోధాదులను జయించాడు. పూర్వం కురుక్షేత్రంలో కౌరవ పాండవ సేనామధ్యంలో భగవానుడైన వాసుదేవుడు తనకు బోధించిన గీతావాక్యాలు మననం చేసుకొన్నాడు. కాలానుగుణంగా కర్మలను అనుభవించటంచేత మరుగుపడిన గీతావిజ్ఞానాన్ని మళ్లీ అందుకొన్నాడు. అర్జునుడు కార్యకారణభావాన్ని అనుసరించి శోకానికి అహంకార మమకారాలతో కూడిన ద్వైతభ్రాంతి కారణమని, ఆ ద్వైతభ్రాంతికి శరీరం కారణమనీ, ఆ శరీరానికి లింగం కారణమనీ, ఆ లింగానికి గుణాలు కారణమనీ, ఆ గుణాలకు ప్రకృతి కారణమమనీ గ్రహించాడు. "అహం బ్రహ్మాస్మి" అనే జ్ఞానంతో ప్రకృతి విలీనమైపోతుందని. ప్రకృతి నశించిపోవటమే గుణారాహిత్యమనీ, గుణరాహిత్యమే పురుషుడు తిరిగి స్థూల శరీరాన్ని పొందక బ్రహ్మైక్యాన్ని పొందుతాడని నిశ్చయించుకొని అర్జునుడు విరక్తుడైనాడు. ధర్మరాజు భగవంతుడైన శ్రీకృష్ణుని అవతార సమాప్తిని, యాదవుల వినాశనాన్ని విని, నారదుని ప్రబోధ వాక్కులు, అచంచల వాక్కులు తలంచుకొని, అచంచల హృదయుడై పుణ్యలోక ప్రాప్తికి ప్రయత్నించ సాగాడు.

1-382-క.

యదువుల నాశము మాధవు
పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ
త్పదచింతాతత్పరయై
ముదమున సంసారమార్గమునకుం బాసెన్.

టీక:- యదువుల = యాదవుల; నాశము = మరణము; మాధవు = కృష్ణుడు {మాధవుడు – మాధవి (లక్ష్మీదేవి) భర్త, కృష్ణుడు}; పదవియు = పైకి వెళ్ళుటయు; విని = విని; కుంతి = కుంతి; విమల = నిర్మలమైన; భక్తిన్ = భక్తితో; భగవత్ = భగవంతుని యొక్క; పద = పాదములమీది; చింతా = ధ్యానము యందు; తత్పర = ఆసక్తి కలది; ఐ = అయి; ముదమున = సంతోషముతో; సంసార = సంసారము అను; మార్గమున = మార్గము; కున్ = నుండి; పాసెన్ = దూరమాయెను, మరణించెను.

భావము:- యాదవు మరణమూ, మాధవుని నిర్యాణము ఆలకించిన కుంతీదేవి నిర్మలమైన భక్తితో హరిచరణ సంస్మరణంలో ఆసక్తురాలై ప్రశాంతంగా శరీరాన్ని పరిత్యజించింది.

1-383-వ.

ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబుసేసి కంటకంబులురెంటిని పరిహ
రించు విన్నాణి తెఱంగున యాదవ రూప శరీరంబునం జేసి యీశ్వరుండు
లోకకంటకశరీరంబులు సంహరించి నిజశరీరంబు విడిచె; సంహారంబునకు
నిజశరీర పరశరీరంబులు రెండు నీశ్వరునకు సమంబులు, నిజరూపంబున
మెలంగుచు రూపాంతరంబులు ధరియించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందు

నటుని కైవడి లీలా పరాయణుండైన నారాయణుండు, మీన కూర్మాది రూపం బులు ధరియించుఁ బరిహరించు"నని చెప్పి, మఱియు నిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కంటకంబునన్ = ముల్లుతో; కంటక = ముల్లు; ఉన్మూలనంబున్ = పెల్లగించుట; చేసి = చేసి; కంటకంబులు = ముల్లులను; రెంటిని = రెండింటిని; పరిహరించు = విసర్జించు; విన్నాణి = నేర్పు కలవాని; తెఱంగునన్ = వలె; యాదవ = యాదవుని వంటి; రూప = రూపము కల; శరీరంబునన్ = శరీరము; చేసి = వలన; ఈశ్వరుండు = భగవంతుడు; లోక = లోకమునకు; కంటక = ముల్లుల వంటి, బాధించు; శరీరంబులు = శరీరధారులను; సంహరించి = సంహరించి; నిజ = తన; శరీరంబు = శరీరమును; విడిచెన్ = విడిచిపెట్టెను; సంహారంబు = సంహరించుట; కున్ = కు; నిజ = తన; శరీర = శరీరము; పర = ఇతరుల; శరీరంబులు = శరీరములు; రెండున్ = రెండును; ఈశ్వరు = భగవంతున; కున్ = కు; సమంబులు = సమానములు; నిజ = తన; రూపంబునన్ = రూపములో; మెలంగుచున్ = జీవించి ఉండి; రూప = రూపములు, వేషములు; అంతరంబులు = ఇతరమైనవి; ధరియించి = ధరించి; క్రమ్మఱన్ = మరల; అంతర్ధానంబు = మాయమగుటను; పొందు = పొందెడి; నటుని = నటుని; కైవడిన్ = వలె; లీలా = లీలకు; పరాయణుండు = ఆశ్రయము అయినవాడు; ఐన = అయినట్టి; నారాయణుండు = భగవంతుడు; మీన = చేప; కూర్మ = తాబేలు; ఆది = మొదలగు; రూపంబులు = రూపములు; ధరియించున్ = తాల్చును; పరిహరించున్ = విడిచిపెట్టును; అని = అని; చెప్పి = చెప్పి; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా కంటకంతో మరో కంటకాన్ని పెకలించి, రెండు కంటకాలనూ దూరంగా పారవేసే వివేకవంతునిలాగా, పరమేశ్వరుడు యాదవశరీరం ధరించి జగత్కంటకాలైన పరుల శరీరాలను అంత మొందించి తనశరీరాన్నివదిలిపెట్టాడు. పరమేశ్వరునికి సంహారవిషయంలో స్వపరదేహాలనేభేదంలేదు. రెండూ సమానమే, స్వస్వరూపంతో ప్రవర్తిస్తూ, అన్యరూపాలు పెక్కులు ధరించి, మళ్ళీ స్వస్వరూపాన్ని పొంచే నటునిలాగా విచిత్రలీలావిలాసుడైన వైకుంఠవాసుడు మత్స్యకూర్మాది అవతారాలు ధరిస్తూ, పరిహరిస్తూ ఉంటాడు.

1-384-క.

"ఏ దినమున వైకుంఠుఁడు
మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁ
డా దినమున నశుభప్రతి
పాదక మగు కలియుగంబు ప్రాప్తం బయ్యెన్.

టీక:- ఏ = ఏ; దినమున = రోజు; వైకుంఠుఁడు = విష్ణువు {వైకుంఠుడు - వైకుంఠమున ఉండువాడు; విష్ణువు}; మేదినిపైన్ = భూమి మీద; తాల్చిన = ధరించిన; అట్టి = అటువంటి; మేను = శరీరము; విడిచినాఁడు = విడచిపెట్టెనో; ఆ = ఆ; దినమునన్ = రోజు; అశుభ = అశుభమునకు; ప్రతిపాదకము = మొదలు పెట్టునది; అగు = అయిన; కలియుగంబు = కలి యుగము; ప్రాప్తంబు = మొదలు; అయ్యెన్ = అయ్యెను.

భావము:- "శ్రీమన్నారాయణుడు లీలానుషరూపాన్ని దాల్చి ఏనాడు అవతారసమాప్తి కావించాడో ఆనాడే అమంగళ దాయకమైన కలియుగం ఆరంభమయింది.

1-385-సీ.

కలివర్తనంబునఁ గ్రౌర్యహింసా/సత్య-
దంభకౌటిల్యాద్యధర్మ చయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ-
గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజవై మను మని దీవించి-
సింధుతోయకణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధనందనుండైన వజ్రునిఁ దెచ్చి-
మధురఁ బట్టము గట్టి మమతఁ బాసి

1-385.1-ఆ.

కరుల హరుల భటులఁ గంకణాదికముల
మంత్రిజనుల బుధుల మానవతుల
నఖిల మయిన ధనము నభిమన్యుసుతునకు
నప్పగించి బుద్ధి నాశ్రయించి.

టీక:- కలి = కలికాలము; వర్తనంబునన్ = ప్రవర్తిల్లుటలో, నడచుటలో; క్రౌర్య = క్రూరత్వము; హింస = హింస; అసత్య = అసత్యము; దంభ = దంభము; కౌటిల్య = కుటిలత్వము; ఆది = మొదలగు; అధర్మ = అధర్మముల; చయము = సమూహము; పురముల = జనవాస; గృహముల = నివాస; భూములన్ = ప్రదేశములలోను; తమ = తమ; లోనన్ = లోను; కలుగుటన్ = ఏర్పడుటను; తలపోసి = తెలిసికొని; కరిపురమున = హస్తినాపురములో; మనుమని = పౌత్రుని, మనవడుని; రాజవు = రాజు; ఐ = అయ్యి; మనుము = జీవించుము; అని = అని; దీవించి = ఆశీర్వదించి; సింధు = సింధు నది యొక్క – సముద్రపు; తోయ = నీటి; కణ = బిందువులతో; అభిషిక్తున్ = పట్టాభిషేకమును {అభిషేకము చేయుట –పట్టాభిషేకము}; చేసి = చేసి; అనిరుద్ధ = అనిరుద్ధుని యొక్క; నందనుండు = పుత్రుడు; ఐన = అయినట్టి; వజ్రునిన్ = వజ్రుని; తెచ్చి = తీసుకువచ్చి; మధురన్ = మధురను; పట్టమున్ = పట్టము {పట్టము - రాజ్యాభిషేక కాలమున నుదట కట్టెడు పట్టీ}; కట్టి = కట్టి, పట్టాభిషేకముచేసి; మమతన్ = మమత్వము, మమకారమును; పాసి = తొలగించుకొని;

కరులన్ = ఏనుగులను; హరులన్ = గుఱ్ఱములను; భటులన్ = భటులను; కంకణ = కంకణములు; ఆదికముల = మొదలగువానిని; మంత్రి = మంత్రాగము చెప్పువారి; జనులన్ = సమూహమును; బుధులన్ = పండితులను, జ్ఞానులను;

మానవతులన్ = మానము కల స్త్రీలను; అఖిలము = సమస్తము; అయిన = అయినట్టి; ధనమున్ = సంపదలను; అభిమన్యు = అభిమన్యుని; సుతున = పుత్రున, పరీక్షిత్తున; కున్ = కు; అప్పగించి = అప్పచెప్పి; బుద్ధిన్ = జ్ఞానమును; ఆశ్రయించి = ఆశ్రయించి, అండగొని.

భావము:- కలి ప్రవేశం వల్ల క్రౌర్యం, హింస, అసత్యం, ఆడంబరం, కౌటిల్యం మొదలైన వానితో అధర్మచక్రం పట్టణాలలో, పల్లెలలో, గృహాలలో, సమస్త ప్రదేశాలలో విస్తరించిందని తెలుసుకొన్న ధర్మరాజు తన మనుమడైనను పరీక్షిత్తును రాజును కావించి హస్తినాపుర సింహాసనం పైన కూర్చుండబెట్టాడు. పవిత్ర సింధుజలాలతో అభిషేకించి ఆశీర్వదించాడు. అనిరుద్ధుని కుమారుడైన వజ్రుణ్ణి మధురా రాజ్యానికి అధిపతి చేసాడు. మమకారాలను పరిత్యజించి ఏనుగులు గుఱ్ఱాలు, సైనికులు, కంకణాది ఆభరణాలు, అమాత్యులు, విద్వాంసులు, స్త్రీలు మొదలైన సకల ధన కనక వస్తు వాహనాలను అభిమన్యు నందనుడైన పరీక్షిత్తుకు అప్పగించి ధర్మనందనుడు వైరాగ్యమార్గాన్ని ఆశ్రయించాడు.

1-386-వ.

**విరక్తుండైన ధర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిఁ గావించి యగ్నుల నాత్మారోపణంబు సేసి నిరహంకారుండును నిర్దళితాశేష బంధనుండును నై సక లేంద్రియంబుల మానసంబున నడంచి ప్రాణాధీనవృత్తి యగు మానసంబునుఁ బ్రాణమందునుఁ, బ్రాణము నపానమందును, నుత్సర్గసహితంబయిన యపానము మృత్యువునందును, మృత్యువును పంచభూతంబులకునైక్యంబైన దేహంబు నందును, దేహము గుణత్రయంబు నందును, గుణత్రయంబు నవిద్య యందును, సర్వారోప హేతువగు నవిద్యను జీవుని యందును, జీవుండయిన తన్ను నవ్యయం బయిన బ్రహ్మ మందును, లయింపంజేసి బహిరంతరంగ వ్యాపారంబులు విడిచి, నారచీరలు ధరియించి, మౌనియు, నిరాహారుండును, ముక్తకేశుండునునై; యున్మత్త, పిశాచ, బధిర, జడుల చందంబున నిరపేక్షకత్వంబున.**

టీక:- విరక్తుండు = రక్తిని విసర్జించినవాడు; విరక్తుడు; ఐన = అయినట్టి; ధర్మనందనుండు = ధర్మరాజు; ప్రాజాపత్యంబు = పాజాపత్యము; అనియెడి = అనెడి; ఇష్టిన్ = యజ్ఞమును; కావించి = చేసి; అగ్నులన్ = అగ్ను లను; ఆత్మ = తనలో; ఆరోపణంబున్ = ఆరోపించుకొనుటను; చేసి = చేసి; నిరహంకారుండును = అహంకా రములేనివాడును; నిర్దళిత = చక్కగా భేదించబడిన; అశేష = సమస్తమైన; బంధనుండును = బంధములుకల వాడును; ఐ = అయి; సకల = సర్వమైన; ఇంద్రియంబులన్ = ఇంద్రియములను; మానసంబునన్ = మనసునందు; అడంచి = అణగకొట్టి; ప్రాణ = ప్రాణములకు; అధీన = లొంగి; వృత్తి = వ్యవహరించునది; అగు = అయినట్టి; మానసంబును = మనసును; ప్రాణము = ప్రాణము; అందునున్ = లోను; ప్రాణమున్ = ప్రాణమును; అపానము = అపానము; అందునున్ = లోను; ఉత్సర్గ = వెలువడుట అను లక్షణముతో; సహితంబు = కూడునది;

అయిన = అయినట్టి; అపానమున్ = అపానమును; మృత్యువున్ = మృత్యువు; అందునున్ = లోను; మృత్యువును = మృత్యువును; పంచ = ఐదు; భూతంబులు = భూతములు {పంచ భూతములు - భూమి నీరు వాయువు అగ్ని ఆకాశము}; కున్ = కు; ఐక్యంబు = కూడిక; ఐన = అయినట్టి; దేహంబున్ = దేహము; అందున్ = లోను; దేహమున్ = దేహమును; గుణ = గుణములు; త్రయంబున్ = మూడింటి {గుణ త్రయము - సత్త్వ, రజో, తమో గుణములు}; అందునున్ = లోను; గుణ = గుణములు; త్రయంబున్ = మూడింటిని; అవిద్య = అవిద్య; అందునున్ = లోను; సర్వ = సమస్తమైన; ఆరోప = మిథ్యాజ్ఞానమునకు; హేతువు = కారణము; అగు = అయినట్టి; అవిద్యను = అవిద్యను; జీవుని = జీవుని; అందునున్ = లోని; జీవుండు = జీవుడు; అయిన = అయినట్టి; తన్నున్ = తనను; అవ్యయంబు = తరుగనిది; అయిన = అయినట్టి; బ్రహ్మమున్ = బ్రహ్మము; అందునున్ = లోను; లయింపన్ = లీనము అగునట్లు; చేసి = చేసి; బహిర్ = బయటి; అంత = లోపలి; రంగ = విషయములయొక్క; వ్యాపారంబులు = వర్తనలు; విడిచి = విడిచిపెట్టి; నార = నారతో నేసిన; చీరలు = వస్త్రములను; ధరియించి = ధరించి; మౌనియున్ = మౌనమును వహించినవాడును; నిరాహారుండును = ఆహారమును వర్జించినవాడును; ముక్త = వదిలివేసిన; కేశుండును = కేశములు కలవాడును; ఐ = అయి; ఉన్మత్త = పిచ్చివాడు; పిశాచ = పిశాచము పట్టినవాడు; బధిర = చెవిటివాడు; జడుల = మందమైన మతి కలవార్ల; చందంబునన్ = వలె; నిరపేక్షకత్వంబునన్ = నిరపేక్షతో {నిరపేక్షణ - దేనియందును కుతూహలము లేకుండు}.

భావము:- విరక్తుడైన ధర్మరాజు ప్రాజాపత్యమనే యాగం చేసి గార్హపత్యం మొదలైన అగ్నులను ఆత్మయందు ఆరోపించుకొన్నాడు. నిరహంకారుడై సంసారబంధాలు తెగతెంపులు చేసి వాక్కు మొదలైన ఇంద్రియాలను మనస్సునందూ, మనస్సును ప్రాణమందూ, ప్రాణాన్ని అపానమందూ అపానాన్ని మృత్యువు నందూ, మృత్యువును పాంచభౌతికమైన శరీరమందూ, శరీరాన్ని సత్త్వరజస్తమో గుణములందూ, ఆ గుణ త్రయాన్ని అవిద్యయందూ, అరోపా లన్నిటికి హేతువైన అవిద్యను జీవాత్మయందూ, జీవాత్మను అవ్యయమైన పరమాత్మయందూ లయింపజేశాడు. సర్వసంగ పరిత్యాగియై నార చీరలు ధరించాడు. మౌనంతో నిరాహారుడై ముక్తకేశుడై, పిచ్చివాని వలె, పిశాచగ్రస్తుని వలె, బధిరుని వలె, జడుని వలె నిరపేక్షుడైనాడు.

### 1-387-క.

**చిత్తంబున బ్రహ్మము నా**
**వృత్తముఁ గావించుకొనుచు విజ్ఞానధనా**
**యత్తులు దొల్లి వెలింగెడి**
**యుత్తరదిశ కేఁగె నిర్మలోద్యోగమునన్.**

టీక:- చిత్తంబున = మనస్సునందు; బ్రహ్మమున్ = పరబ్రహ్మమును; ఆవృత్తమున్ = స్మరించుటను, ధ్యానమును; కావించుకొనుచున్ = చేసుకొనుచు; విజ్ఞాన = విజ్ఞానము అను; ధన = సంపదను; ఆయత్తులున్ = కూడబెట్టుకొన్నవారు; తొల్లి = పూర్వము; వెలింగెడి = ప్రకాశించెడి; ఉత్తర = ఉత్తరము; దిశ = దిక్కున; కున్ = కు; ఏఁగెన్ = వెళ్ళెను; నిర్మల = నిర్మలమైన; ఉద్యోగమునన్ = ప్రయత్నముతో.

భావము:- మనస్సులో పరబ్రహ్మాన్ని మననం చేసుకొంటూ పూర్వం విజ్ఞానవంతులైన మహానుభావులు అనుసరించిన ఉత్తర దిక్కుగా ఏకాగ్రచిత్తంతో ప్రస్థానం సాగించాడు ధర్మనందనుడు.

1-388-సీ.

అంత నాతని తమ్ము లనిలపుత్త్రాదులు-
    గలిరాకచేఁ బాపకర్ము లగుచుఁ
జరియించు ప్రజల సంచారంబు లీక్షించి-
    యఖిల ధర్మంబుల నాచరించి
వైకుంఠ చరణాబ్జ వర్తిత హృదయులై-
    తద్భక్తినిర్మలత్వమునుఁ జెంది
విషయయుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక-
    నిర్ధూతకల్మష నిపుణమతులు

1-388.1-తే.

బహుళవిజ్ఞానదావాగ్ని భసితకర్ము
లైన యేకాంతులకు లక్ష్యమై వెలుంగు
ముఖ్యనారాయణస్థానమునకుఁ జనిరి
విగతరజమైన యాత్మల విప్రముఖ్య!

టీక:- అంతన్ = అంతట; ఆతని = అతనియొక్క; తమ్ములు = తమ్ముళ్ళు; అనిలపుత్ర = భీముడు {అనిలపుత్రుడు - వాయుదేవుని కొడుకు, భీముడు}; ఆదులు = మొదలగువారు; కలి = కలికాలము; రాక = వచ్చుట; చేన్ = చేత; పాప = పాపపు; కర్ములు = కర్మలుచేయువారు; అగుచున్ = అవుతూ; చరియించున్ = చరించు; ప్రజల = ప్రజలయొక్క; సంచారంబుల్ = ప్రవర్తనలు; ఈక్షించి = చూసి; అఖిల = సమస్తమైన; ధర్మంబులన్ = ధర్మబద్ధముగ చేయవలసిన కార్యములు; ఆచరించి = చేసి; వైకుంఠ = హరి {వైకుంఠుడు - వైకుంఠమున ఉండువాడు, విష్ణువు}; చరణ = పాదములు అను; అబ్జ = పద్మములవెంట {అబ్జము - నీటపుట్టునది, పద్మం}; వర్తిత = ప్రవర్తిల్లు; హృదయులు = హృదయము కలవారు; ఐ = అయ్యి; తత్ = ఆ; భక్తి = భక్తి యొక్క; నిర్మలత్వమునున్ = నిర్మలత్వమును; చెంది = చెంది; విషయ = ఇంద్రియార్థములందు; యుక్తుల = తగుల్కొని ఉండువారి; కున్ = కి; ప్రవేశింపఁగాన్ = ప్రవేసించుటకు; రాక = వీలుకాని; నిర్ధూత = క్షాళనముచేసికొన్న; కల్మష = కల్మషముకల; నిపుణ = నేర్పరి ఐన; మతులు = మనస్సులు కలవారు;

బహుళ = ఎక్కువ; విజ్ఞాన = విజ్ఞానము అను; దావాగ్నిన్ = కారుచిచ్చుచేత; భసిత = భస్మమైన; కర్ములు = కర్మ కలవారు; ఐన = అయినట్టి; ఏకాంతులు = ఏకాంతులు {ఏకాంతులు - ఉన్నది భగవంతుడు ఒక్కడే అన్న స్థితి లో ఉన్నవారు}; కున్ =

కు; లక్ష్యము = గమ్యస్థానమైనది – కామిడి యైనది; ఐ = అయ్యి; వెలుంగు = ప్రకాశించు; ముఖ్య = ముఖ్యమైన; నారాయణ = విష్ణు {నారాయణుడు – నారములందువసించువాడు – హరి}; స్థానము = లోకము, సన్నిధి; కున్ = కి; చనిరి = వెళ్ళిరి; విగత = విడిచిపెట్టిన; రజము = రజోగుణము; ఐన = కలిగిన; ఆత్ములు = ఆత్ములతో; విప్ర = బ్రాహ్మణులలో; ముఖ్య = ముఖ్యమైనవాడా.

భావము:- అనంతరం ధర్మజుని సోదరులైన భీమసేనాదులు కలిప్రభావంతో ప్రజలంతా పాప మార్గంలో సంచరించటం గమనించారు. దానధర్మాలు ఆచరించారు. శ్రీమన్నారాయణుని పాదపద్మాలను తమ హృదయంలో పదిలపరచుకొన్నారు. భగవద్భక్తిచే పరిశుద్ధ జీవనులైనారు. ఈ విధంగా వారు రజోగుణ రహితమైన హృదయాలతో విషయాసక్తులకు ప్రవేశింపరానిదీ, పాపరహితులూ, విజ్ఞాన సంపన్నులూ అయిన ఏకాంతభక్తులకు గమ్యస్థానమై వెలుగొందేదీ అయిన విష్ణు లోకాన్ని చేరుకున్నారు.

## 1-389-వ.

**అంత విదురుండు ప్రభాసతీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబుతోడ దండధరుం డగుటం జేసి నిజాధికారస్థానంబునకుం జనియె; ద్రుపదరాజపుత్రియుఁ బతులవలనను పేక్షితయై జగత్పతియైన వాసుదేవు నందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె; నిట్లు.**

టీక:- అంతన్ = అంతట; విదురుండు = విదురుడు; ప్రభాస = ప్రభాసము అను {ప్రభాసము - మిక్కిలి భాసించునది}; తీర్థంబునన్ = స్నాన ఘట్టమున్న పుణ్య స్థలమున; హరి = భగవంతుని; అందున్ = లో; చిత్తంబున్ = మనస్సును; చేర్చి = చేర్చి; శరీరంబు = తనువును; విడిచి = వదిలి; పితృవర్గంబు = పితృదేవతలు; తోడన్ = తో; దండధరుండు = యముడు {దండధరుడు - దండము ధరించు వాడు, యముడు}; అగుటన్ = అగుట; చేసి = చే; నిజ = తనయొక్క; అధికార = అధికార ప్రవర్తన; స్థానంబు = పదము (యమ లోకము); కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; ద్రుపదరాజ = ద్రుపదరాజుయొక్క; పుత్రియున్ = కుమారియును; పతుల = భర్తల; వలనన్ = వలన; ఉపేక్షిత = అశ్రద్ధ చేయబడినది; ఐ = అయి; జగత్ = విశ్వమునకు; పతి = భర్త; ఐన = అయినట్టి; వాసుదేవున్ = కృష్ణుని {వాసుదేవుడు - ఆత్మలయందు వసించువాడు}; అందున్ = లో; చిత్తంబున్ = మనస్సును; చేర్చి = చేర్చి; తత్ = ఆతని; పదంబు = లోకమును, సన్నిధిని; చేరెన్ = చేరెను; ఇట్లు = ఈ విధముగ.

భావము:- తరువాత విదురుడు పవిత్రమైన ప్రభాసతీర్థంలో భగవంతుని యందు మనస్సు లగ్నంచేసి తన శరీరాన్ని త్యజించి, పూర్వజన్మలో యమధర్మరాజు అయినందువల్ల పితృదేవతలతో కలసి, తన అధికార పీఠాన్ని అధిష్ఠించాడు. ద్రౌపది నిరపేక్షులైన భర్తలచే ఉపేక్షతయై దేవదేవుడైన వాసుదేవుని యందు ఆసక్తమైన హృదయంతో పరమేశ్వర సాన్నిధ్యాన్ని పొందింది.

1-390-క.

పాండవకృష్ణుల యానము,

పాండురమతి నెవ్వఁడైనఁ బలికిన విన్నన్

ఖండితభవుఁడై హరిదా

సుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా!

టీక:- పాండవ = పాండవులయొక్క; కృష్ణుల = కృష్ణుని యొక్క; యానము = ప్రయాణము; పాండుర = స్వచ్ఛమైన; మతిన్ = బుద్ధితో; ఎవ్వఁడు = ఎవడు; ఐనన్ = అయినప్పటికిని; పలికినన్ = చెప్పినను, స్మరించినను; విన్నన్ = విన్నను; ఖండితభవుఁడు = జన్మరాహిత్యుడు {ఖండితభవుడు - ఖండింపబడిన జన్మలు కలవాడు, జన్మరాహిత్యము}; ఐ = అయి; హరి = భగవంతునికి; దాసుండు = దాసుడు; ఐ = అయి; కైవల్యపదమున్ = మోక్షమును; పరమ పదమును; చొచ్చున్ = చేరును; నరేంద్రా = రాజా {నరేంద్రుడు - నరులకు ఇంద్రుడు; రాజు}.

భావము:- రాజా! పాండవుల మహాప్రస్థానమూ, శ్రీకృష్ణుని పరమపద యానమూ, స్వచ్ఛమైన హృదయంతో చదివినవాడూ, విన్నవాడూ, భవబంధ విముక్తుడై, పరమేశ్వర భక్తుడై కైవల్య పథాన్ని కైవసం చేసుకొంటాడు.

## పరీక్షిత్తు దిగ్విజయయాత్ర

1-391-వ.

అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన కోవిదులు సెప్పిన చందంబున భూసురోత్తమ శిక్షావశంబున మహాభాగవత శేఖరుండై ధరణీపాలనంబు సేయుచు నుత్తరుని పుత్త్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లి యయి, జనమేజయ ప్రముఖులైన నలువురుగొడుకుల నుత్పాదించి, గంగాపులినతలంబునఁ గృపాచార్యుండు గురుత్వంబు సేయ యాగభాగంబులకువచ్చిన దేవతలనీక్షించుచు భూరిదక్షిణంబులుగా మూఁడశ్వ మేధంబులాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁదన్ను శూద్రుండును, రాజ చిహ్నాముద్రితుండును నగు కలిం బట్టి నిగ్రహించె"నని చెప్పిన, శౌనకుండు పౌరాణికున కిట్లనియె.

టీక:- అంతన్ = అంతట; అటన్ = అక్కడ; పరీక్షిత = పరీక్షత్తు అను; కుమారుండు = పిల్లవాడు; జాత = ప్రారబ్ద; పుట్టుక వలన వచ్చు; కర్మ = కర్మల గురించిన; విదులు = ;తెలిసిన వారు; ఐన = అయినట్టి; కోవిదులు = విద్వాంసులు, జ్యోతిష్కులు; చెప్పిన = చెప్పిన; చందంబునన్ = వలె; భూసు/రోత్తమ = బ్రాహ్మణోత్తములు {భూసురోత్తమ - భూమికి దేవతలు బ్రాహ్మణులలో ఉత్తములు, బ్రాహ్మణోత్తములు}; శిక్షా = విద్యాభ్యాసము;

వశంబున = వలన; మహా = గొప్ప; భాగవత = భాగవతులలో {భాగవతులు – భాగవతము పద్ధతిలో వర్తించువారు}; శేఖరుండు = శిఖరము వంటివాడు; ఐ = అయి; ధరణీ = భూమిని; పాలనంబున్ = పరిపాలించుట; చేయుచున్ = చేయుచు; ఉత్తరుని = ఉత్తరునియొక్క; పుత్రికన్ = కుమార్తెను; ఇరావతి = ఇరావతి; అను = అను; మత్తకాశినిన్ = సుందరిని {మత్తకాశిని – మదముచేత ప్రకాశించు ఆమె, స్త్రీ}; పెండ్లి = పెండ్లి; అయి = చేసుకొని; జనమేజయ = జనమేజయుడు; ప్రముఖులు = మొదలైన ప్రముఖులు; ఐన = అయినట్టి; నలువురు = నలుగురు; కొడుకులన్ = పుత్రులను; ఉత్పాదించి = పుట్టించి; గంగా = గంగానదియొక్క; పులిన = ఇసుకతిన్నె మీది; తలంబునన్ = సమస్థలమున; కృపాచార్యుండు = కృపాచార్యుండు; గురుత్వంబు = గురువుగా ఉండుట; చేయన్ = చేయగ; యాగ = యజ్ఞము లందలి; భాగంబులు = భాగములు; కున్ = కోసము; వచ్చిన = వచ్చిన; దేవతలన్ = దేవతలను; ఈక్షించుచున్ = చూచుచు; భూరి = అత్యధిక గొప్ప; దక్షిణంబులుగాన్ = దక్షిణలు కలవిగా; మూఁడు = మూడు; అశ్వమేధంబులున్ = అశ్వమేధ యాగములు; ఆచరించి = చేసి; దిక్ = దిక్కులను; విజయ = జయించు; కాలంబునన్ = సమయమున; గోమిథునంబున్ = ఆవు ఎద్దుల జంటను; తన్ను = తన్నుచున్న; శూద్రుండును = శూద్రుడును; రాజ = రాజుల యొక్క; చిహ్న = గుర్తులను; ముద్రితుండును = ధరించినవాడును; అగు = అయినట్టి; కలిన్ = కలిని; పట్టి = పట్టుకొని; నిగ్రహించెన్ = శిక్షించెను – హద్దులలో పెట్టెను; అని = అని; చెప్పినన్ = చెప్పగా; శౌనకుండు = శౌనకుడు; పౌరాణికుడు = సూతున {పౌరాణికుడు – పురాణములు చెప్పువాడు, సూతుడు}; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అక్కడ హస్తినాపురంలో రాజకుమారుడైన పరీక్షిత్తు, ప్రాజ్ఞులైన దైవజ్ఞులు చెప్పిన విధంగా భూసురోత్తముల ఉత్తమమైన శిక్షణ వలన మహాభక్త శిరోమణియై రాజ్యపాలనం చేయసాగాడు. పరీక్షిన్నరేంద్రుడు ఉత్తరుని కుమార్తెయైన ఇరావతి అనే తరుణీమణిని పరిణయమాడాడు. ఆ దంపతులకు జనమేజయుడు మొదలైన నలుగురు కుమారులు జన్మించారు. పరీక్షిత్తు గంగానదీతీరంలో కృపాచార్యుని పర్యవేక్షణలతో కూడిన మూడు అశ్వమేధయాగాలు చేసాడు. ఆ యజ్ఞాలలో దేవతలు ప్రత్యక్షంగా వచ్చి హవిర్భాగాలు అందుకొన్నారు. అనంతరం పరీక్షిన్మహారాజు జైత్రయాత్రకు బయలుదేరి దిక్కులన్నీ జయిస్తూ ఒక్కచోట గోమిథునాన్ని తన్నుతూ రాజచిహ్న ముద్రితుడై శూద్రవేషంలో ఉన్న కలి పురుషుని పట్టుకొని శిక్షించాడు." అని చెప్పగానే శౌనకుడు సూతునితో ఇలా అన్నాడు.

### 1-392-క.

"భూవరరూపుఁడు శూద్రుఁడు
గోవుం దా నేల తన్నెఁ, గోరి పరీక్షి
ద్భూవరుఁడు దిశల గెలుచుచు
నే విధిఁ గలి నిగ్రహించె, నెఱిఁగింపఁ గదే.

టీక:- భూవర = రాజు యొక్క {భూవర – భూమికి భర్త, రాజు}; రూపుఁడు = వేషము ధరించిన వాడు; శూద్రుఁడు = శూద్రుడు; గోవున్ = గోవులను; తాన్ = తాను; ఏల = ఎందులకు; తన్నెన్ = తన్నెను; కోరి = కావాలని; పరీక్షిత్ = పరీక్షితుడు అను; భూవరుఁడు = రాజు; దిశలన్ = నలు దిశలందలి రాజ్యములను;

గెలుచుచున్ = గెలుచుచు; ఏ = ఏ; విధిన్ = విధముగ; కలిన్ = కలిని; నిగ్రహించెన్ = శిక్షించెను; కట్టుదిట్టము చేసెను; ఎఱిఁగింపఁగదే = తెలుపుము.

భావము:- "అయ్యా! సూతమహర్షీ! రాజవేషంలో ఉన్న శూద్రుడు గోవును ఎందుకు తన్నాడు. జైత్రయాత్ర సాగిస్తున్న పరీక్షిన్నరేంద్రుడు ఆ కలిని ఏ విధంగా నిగ్రహించాడు నాకు వివరంగా చెప్పు.

1-393-మ.

అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు
ర్నరవార్తాకథనప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండఁ జన దీ సంసారమోహంబునన్.

టీక:- అరవిందాక్ష = కృష్ణుని {అరవిందాక్షః - అరవిందములవంటి కన్నులున్నవాడు, విష్ణువు, కృష్ణుడు, విష్ణుసహస్రనామాలు 347వ నామం}; పద = పాదములు అను; అరవింద = పద్మముల; మకరంద = తేనె యందు; ఆసక్తులు = ఆసక్తి కలవారు; ఐ = అయి; ఉన్న = ఉన్నట్టి; సత్ = మంచి; పురుష = పురుషులలో; శ్రేష్ఠుల = శ్రేష్ఠమైనవారి యొక్క; వృత్తముల్ = వృత్తాంతములు; వినక = వినక; దుర్బుద్ధిన్ = దుర్బుద్ధితో; విలంఘించి = దూకి; దుర్నర = చెడ్డ మానవుల; వార్తా = వృత్తాంతములు కల; కథన = కథల; ప్రపంచములున్ = మొత్తములను; కర్ణ = చెవులలో; ప్రాప్తముల్ = పడునట్లు; చేసి = చేసి; వాసరముల్ = రోజులు; వ్యర్థతన్ = వ్యర్థముగా; తోచుచు = గడుపుతూ; ఉండన్ = ఉండుట; చనదు = చేయరాదు, తగదు; ఈ = ఈ; సంసార = సంసార మందలి; మోహంబునన్ = మోహముతో.

భావము:- నందనందన పాదారవింద మకరంద పానంచేత పరవశులైన ఉత్తమ పురుషుల పవిత్ర చరిత్రలు వినకుండా పెచ్చు పెరిగిన మచ్చరంతో దుశ్చరిత్రులకు చెవులొగ్గి. సంసారబంధాలకు లోబడి, పరమార్థాన్ని విస్మరించి, వ్యర్థంగా కాలం గడపరాదు.

1-394-సీ.

మనుట నిత్యము గాదు మరణంబు నిజ మని-
యెఱిఁగి మోక్షస్థితి నిచ్ఛగించు
నల్పాయువు లగు మా కన్యదుర్జన చరి-
త్రములోలిఁ గర్ణరంధ్రములఁ బెట్టి
బంగారు వంటి యీ బ్రతికెడు కాలంబుఁ-
బోనాడఁ గానేల పుణ్యచరిత!

మాధవపదపద్మ మకరందపానంబు-
సేయింపవే యేము సేయునట్టి

1-394.1-ఆ.

సత్రయాగమునకు సన్మునీంద్రులు సీర
వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు
చంపఁ డొకనినైన జన్న మయ్యెడుదాక,
వినుచు నుండుఁ దగిలి విష్ణుకథలు.

టీక:- మనుట = జీవించుట; నిత్యమున్ = శాశ్వతము; కాదు = కాదు; మరణంబు = మరణము; నిజము = తథ్యము; అని = అని; ఎఱిఁగి = తెలిసికొని; మోక్షస్థితిన్ = మొక్షమును; ఇచ్ఛగించు = వాంఛించు; అల్ప = స్వల్పమై మిగిలిన; ఆయువులు = జీవిత కాలము కలవారు; అగు = అయిన; మాకు = మాకు; అన్య = ఇతర; దుర్జన = చెడ్డవారి; చరిత్రముల్ = వృత్తాంతములు; ఓలిన్ = వరుసగా; కర్ణ = చెవుల; రంధ్రములన్ = కన్నములలో; పెట్టి = పెట్టి; బంగారు = బంగారము; వంటి = వంటి; ఈ = ఈ; బ్రతికెడు = బ్రతికి ఉండే; కాలంబున్ = కాలమును (కూడా); పోనాడఁగాన్ = పోగొట్టుకొనుట; ఏల = ఎందులకు; పుణ్య = పుణ్య వంతమైన; చరిత = ప్రవర్తనము కలవాడా; మాధవ = భగవంతుని; పద = పాదములు అను; పద్మ = పద్మముల; మకరంద = తేనెను; పానంబు = తాగుట; సేయింపవే = చేయించుము; ఏము = మేము; సేయునట్టి = చేయుచున్నట్టి;

సత్ర = సత్ర అను; యాగము = యజ్ఞము; కున్ = కు; సత్ = మంచి; ముని = మునులలో; ఇంద్రులన్ = ఇంద్రులు; చీరన్ = పిలువగా; వాఁడె = అతడే; దండధరుఁడు = యమధర్మరాజు {దండధరుఁడు - దండమును ధరించువాడు, యమధర్మరాజు}; వచ్చెన్ = వచ్చెను; చూడు = చూడుము; చంపఁడు = చంపడు; ఒకనిన్ = ఒక్కని; ఐన = అయినను; జన్నము = యజ్ఞము; అయ్యెడు = అయ్యే; దాకన్ = వరకు; వినుచున్ = వినుచును; ఉండున్ = ఉండును; తగిలి = (ఆసక్తితో) తగులుకొని; విష్ణు = విష్ణువుమూర్తి; కథలు = కథలు.

భావము:- పుణ్యచరిత్రా! బ్రతుకు శాశ్వతం కాదు. పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు. అన్న సత్యాన్ని గుర్తించి మోక్షాన్ని కాంక్షించే అల్పాయుష్కులం మేము. అటువంటి మాకు అపవిత్రాలైన అల్పుల చరిత్రాలు చెవులొగ్గి ఆలకిస్తూ, బంగారం వంటి జీవిత కాలాన్ని పాడుచేసుకోవటం యుక్తం కాదు. అందువల్ల గోవింద పవిత్ర పదారవింద మకరందధారలు మాకు అనుగ్రహించు, మహానుభావా! మేము సాగిస్తున్న ఈ సత్త్రయాగానికి మునీంద్రులు ఆహ్వానించగా యమధర్మరాజు విచ్చేసాడు చూశావా? ఈ యజ్ఞం పూర్తయ్యేదాకా ఆయన ఏ ఒక్కని ప్రాణం కూడా తీయకుండా, మైమరచి ఆసక్తితో వాసుదేవుని కథలు ఆలకిస్తున్నాడు.

★1-395-క.

మందునకు, మందబుద్ధికి,
మందాయువునకు, నిరర్థమార్గునకును, గో
విందచరణారవింద మ
రందము గొనఁ దెఱపి లేదు రాత్రిందివముల్."

టీక:- మందున = చురుకు లేనివాని; కున్ = కి; మంద = మందమైన; బుద్ధి = బుద్ధి కలవాని; కిన్ = కి; మంద = తక్కవగా ఉన్న; ఆయువున = జీవితకాలము కలవాని; కున్ = కి; నిరర్థ = ప్రయోజనము లేని; మార్గున = జీవన మార్గము కలవాని; కును = కిని; గోవింద = కృష్ణుని స; చరణ = పాదములు అను; అరవింద = పద్మముల యొక్క; మరందమున్ = తేనె; కొనన్ = తీసుకొనుటకు, ఆస్వాదించుటకు; తెఱపి = సమయము; లేదు = లేదు; రాత్రిన్ = రాత్రులందును; దివముల్ = పగళ్ళందును, ఎప్పుడును.

భావము:- మందబుద్ధి, సోమరిపోతుతనం, అల్పాయుష్షు, పనికిమాలిన మార్గాలలో పయనించుట కల వానికి హరిచరణ కమల సుధాధారలను చవిచూడటానికి రాత్రింబవళ్లు తీరిక (సమయమే) దొరకదు."

గమనిక:- పారీక్షిత్త భాగవతం వివరించమని సూతుని అడుగుతు శౌనకుడు కలియుగపు మానవుల గురించి పలికిన పలుకులు. కలి ప్రభావం వల్ల మానవులు మందబుద్ధులు అల్పతరాయువులు అవుతారని తెలిసే వ్యాసభగవానుడు భాగవత రచనకి ఉపక్రమించాడు కదా.

1-396-వ.

అని శౌనకుండు పలికిన సూతుం డిట్లనియెఁ "బరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీ సందోహ సురక్షితంబగు కురుజాంగలదేశంబునం గలి ప్రవేశంబు నాకర్ణించి, యుద్ధకుతూహలత నంగీకరించి, యొక్కనాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని, నీల నీరద నిభ తురంగ నివహ యోజితంబును, ఫలిత మనోరథంబును నైన రథంబునారోహణంబుసేసి, మృగేంద్రధ్వజంబు వెలుఁగ రథ, కరి, తురంగమ, సుభట, సంఘటితంబగు వాహినీచక్రంబు నిర్వక్రంబుగం గొలువ, దిగ్విజయా ర్థంబు వెడలి పూర్వ దక్షిణ పశ్చిమోత్తర సముద్ర లగ్నంబు లయిన యిలావృత, రమ్యక, హిరణ్మయ, హరివర్ష, కింపురుష, భద్రాశ్వ, కేతుమాల, భారతవర్షంబులు, నుత్తరకురు దేశంబులును, జయించి, పుష్కల ధన ప్రదానపూర్వికలగు సపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు, మంగళ పాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజ వృత్తాంతంబు లాకర్ణించుచుఁ, బాఠకపఠిత

పద్యంబుల వలనం బాండవులకు భక్తవత్సలుండైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్య, సఖ్య, సాచివ్య, సభాపతిత్వ, వీరాసనత్వ, దూతభావాది కర్మంబులు, నశ్వత్థామాస్త్ర తేజంబు వలనఁ దన్ను రక్షించుటయు, యాదవ పాండవు లందలి స్నేహానుబంధంబును, వారలకుఁగలిగిన భగవద్భక్తివిశేషంబునువిని, విశ్వంభరుని భక్త వాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, వందిబృందంబులకున్మహార్ఘంబులగు హారాంబరాభరణాది సందోహంబుల నొసంగుచుఁ, బద్మనాభ పాద పద్మభజనపరతంత్ర పవిత్ర మానసుండై యుండె; నయ్యెడ వృషభరూపంబున నేక పాదంబున సంచరించు ధర్మదేవుండు దన సమీపంబున లేఁగలేని లేఁగటికుఱ్ఱి చందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె.

టీక:- అని = అని; శౌనకుండు = శౌనకుండు; పలికినన్ = పలుకగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఈవిధముగ; అనియెన్ = పలికెను; పరీక్షిత్ = పరీక్షిత్తు అను; నరేంద్రుడు = రాజు; నిజ = తన; వాహినీ = సేనల {వాహిని - ఒక వాహిని అనే సేనావిశేషమునకు 81 రథములు 81 ఏనుగులు 243 గుఱ్ఱములు 405 కాల్బలము}; సందోహ = సమూహముచేత; సురక్షితంబు = సురక్షితముగ చేయబడినది; అగు = అయినట్టి; కురు = కురు రాజ్యములో; జాంగల = పల్లపు; దేశంబునన్ = ప్రదేశములో; కలి = కలియొక్క; ప్రవేశంబున్ = ప్రవేశించుటను; ఆకర్ణించి = విని; యుద్ధ = యుద్ధము నందు; కుతూహలతన్ = కుతూహలమును; అంగీకరించి = సమ్మతించి; ఒక్క = ఒక; నాఁడు = రోజు; సముల్లాసంబునన్ = చక్కటి ఉత్సాహముతో; బాణాసనంబున్ = విల్లును; కైకొని = చేతపట్టి; నీల = నల్లని; నీరద = మబ్బులు; నిభ = వంటి; తురంగ = గుఱ్ఱముల; నివహ = గుంపు; యోజితంబును = పూన్చబడినది; ఫలిత = ఫలింపజేయబడిన; మనోరథంబును = కోరిక కలది {మనోరథము – కోరిక, మనస్సును అటు ఇటు తీసుకుపోయే రథము}; ఐన = అయినట్టి; రథంబున్ = రథమును; ఆరోహణంబు = ఎక్కుట; చేసి = చేసి; మృగేంద్ర = సింహము గుర్తున్న {మృగములలో ఇంద్రుడు — సింహము}; ధ్వజంబు = పతాకము; వెలుఁగన్ = ప్రకాశించగ; రథ = రథములు; కరి = ఏనుగులు; తురంగమ = గుఱ్ఱములు; సుభట = మంచి కాలిబంట్లు — యోధులు; సంఘటితంబు = కూడుకొన్నది; అగు = అయిన; వాహినీ = సేనా; చక్రంబు = సమూహము; నిర్వక్రంబుగన్ = లోపాలు లేకుండగ; కొలువన్ = కొలుచుచుండగ; దిగ్విజయ = దిగ్విజయము {దిగ్విజయము - దిక్కులను కల రాజ్యములను జయించుటకు చేయునది}; అర్థంబు = కోసము; వెడలి = బయలుదేరి; పూర్వ = తూర్పు; దక్షిణ = దక్షిణ; పశ్చిమ = పశ్చిమ; ఉత్తర = ఉత్తర దిక్కులందు; సముద్ర = సముద్రముచే; లగ్నంబులు = చుట్టబడి ఉన్నవి; అయిన = అయినట్టి; ఇలావృత = ఇలావృతము; రమ్యక = రమ్యకము; హిరణ్మయ = హిరణ్మయము; హరివర్ష = హరివర్షము; కింపురుష = కింపురుషము; భద్రాశ్వ = భద్రాశ్వము; కేతుమూల = కేతుమూలము; భారత = భారత; వర్షంబులున్ = వర్షములును; ఉత్తర = ఉత్తర దిక్కున; కురు = కురు భూములలో ఉన్న; దేశంబులును = దేశములను; జయించి = నెగ్గి; పుష్కల = సమృద్ధమైన;

ధన = ధనము; ప్రదాన = ప్రకృష్ట దానము (గొప్ప ఈవి); పూర్వికలు = ముందుండునది; అగు = అయినట్టి; సపర్యలన్ = సేవలచే; అభ్యర్చితుండు = చక్కగ పూజింపబడినవాడు; ఐ = అయి; తత్తత్ = ఆయా; దేశ = దేశములందు; వాసులు = వసించు వారు; ఇచ్చిన = ఇచ్చినటువంటి; కానుకలు = కానుకలు; కైకొనుచు = చేకొనుచూ; మంగళ = మంగళ కరమైన; పాఠక = చదువరుల {పాఠకులు — పద్యములు చదువు వారు}; సంఘాత = సంఘములచేత; జేగీయమాన = కొనియాడబడుచున్న; పూర్వ = పూర్వకాలపు; రాజ = రాజుల; వృత్తాంతంబులు = చారిత్రములు; ఆకర్ణించుచున్ = వినుచూ; పాఠక = చదువరులుచేత {పాఠకులు — పద్యములు చదువు వారు}; పఠిత = చదవబడిన; పద్యంబుల = పద్యముల; వలనన్ = వలన; పాండవుల = పాండవుల {పాండవులు – పాండురాజుపుత్రులు}; కున్ = కి; భక్త = భక్తులయందు; వత్సలుండు = వాత్సల్యము కలవాడు; ఐన = అయిన; పుండరీకాక్షుండు = కృష్ణుడు {పుండరీకాక్షుడు – పుండరీకముల వంటి కన్నులు కలవాడు, కృష్ణుడు}; ఆచరించిన = చేసిన; సారథ్య = రథము నడపుటలు; సఖ్య = స్నేహములు; సాచివ్య = మంత్రిత్వములు; సభాపతిత్వ = సభాపతిగా ఉండుటలు; వీరాసనత్వ = వీరాసనమున ఉండుటలు; దూతభావ = దూతగా చేయుటలు; ఆది = మొదలగు; కర్మంబులున్ = పనులును; అశ్వత్థామ = అశ్వత్థామ యొక్క; అస్త్ర = అస్త్రముల; తేజంబు = అగ్ని; వలనన్ = వలన; తన్ను = తనను; రక్షించుటయున్ = కాపాడుటయును; యాదవ = యాదవులు {యాదవ వంశస్థులగు వారు – యాదవులు}; పాండవులు = పాండవులు {పాండురాజు పుత్రులు – పాండవులు}; అందలి = మధ్యనున్న; స్నేహ = స్నేహమును; అనుబంధంబునున్ = అనుబంధమును; వారలు = వారల; కున్ = కు; కలిగిన = సంభవించిన; భగవత్ = భగవంతుని యందలి; భక్తి = భక్తియొక్క; విశేషంబును = ప్రత్యేకతలును; విని = విని; విశ్వంభరుని = కృష్ణుని {విశ్వంభరుడు – విశ్వమును భరించువాడు, విష్ణువు}; భక్త = భక్తులయెడ కల; వాత్సల్యంబు = వాత్సల్యము; కున్ = కు; ఆశ్చర్యంబున్ = ఆశ్చర్యమును; ఒందుచు = పొందుచు; వంది = వంశస్తోత్రము చేయు వారి {వంది – వంశమును స్తోత్రము చేయువాడు}; బృందంబులు = బృందములు; కున్ = కు; మహా = గొప్ప; అర్ఘంబులు = వెలగలవి; అగు = అయిన; హార = హారములు; అంబర = వస్త్రములు; ఆభరణ = అలంకారములు; ఆది = మొదలగు; సందోహంబులన్ = సమూహములను; ఒసంగుచున్ = ఇచ్చుచున్; పద్మనాభ = కృష్ణుని {పద్మనాభుడు – పద్మము నాభి యందు కలవాడు, హరి}; పాద = పాదములు అను; పద్మ = పద్మముల ఎడల; భజన = భక్తియందు; పరతంత్ర = పరాధీనమైన; పవిత్ర = పవిత్ర; మానసుండు = మనసు కలవాడు; ఐ = అయి; ఉండెన్ = ఉండెను; ఆ = ఆ; ఎడ = సమయమున; వృషభ = ఎద్దు; రూపంబునన్ = రూపములో; ఏక = ఒకే; పాదంబున = పాదముతో; సంచరించు = తిరుగుతున్న; ధర్మదేవుండు = ధర్మదేవుడు; తన = తనకు; సమీపంబునన్ = దగ్గరలో; లేఁగలేని = లేవలేని; లేఁగటి = కొత్తగా ఈనిన; కుఱ్ఱి = ఆవు; చందంబునన్ = వలె; హత = దెబ్బతిన్న; ప్రభ = తేజస్సుకలది; ఐ = అయి; నేత్రంబులన్ = కన్నులవెంట; సలిలంబులు = కన్నీరు; కురియుచున్ = కార్చుచు; గో = గోవు; రూప = రూపములో ఉన్నది; ఐ = అయి; ఉన్న = ఉన్నట్టి; ధాత్రి = భూదేవి; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా పలికిన శౌనకుని మాటలు విని సూతుడు ఇలా చెప్పసాగాడు–"మునీంద్రా పరీక్షిన్నరేంద్రుడు తన సేనా సమూహం చేత రక్షించబడుతున్న కురు జాంగలదేశంలో కలిపురుషుడు ప్రవేశించాడని విన్నాడు. ఒకనాడు కదన కుతూహలం కలవాడై ఉప్పొంగే ఉల్లాసంతో విల్లు చేబట్టాడు. నీలమేఘాలవంటి గుఱ్ఱాలను కట్టిన సఫల మనోరథమైన రథాన్ని అధిరోహించాడు, సింహధ్వజం కాంతులు

వెదజల్లుతుండగా రథ గజ తురగ పదాతి సంఘటిత అయి ముందుకు సాగే అపారసేనా వాహినితో విజయ యాత్రకు బయలుదేరాడు. తూర్పున, దక్షిణాన పశ్చిమాన, ఉత్తరాన ఉన్న సాగర తీరాలలోని ఇలావృత్తం. రమ్యకం, హిరణ్మయం, హరివర్షం, కింపురుషం, భద్రాశ్వం, కేతుమాలు, భారతవర్షం అనే దేశాలనూ ఉత్తర కురుదేశాలనూ జయించి. ఆయా దేశవాసులు కొనివచ్చి యిచ్చిన కానుకలు అందుకొన్నాడు వందిమాగధ బృందాలచే గానం చేయబడుతున్న పూర్వభూపతుల వృత్తాంతాలను ఆకర్ణించాడు. స్తోత్ర పాఠకులు పఠించిన పద్యాలవల్ల భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు పాండవులకు సారథిగా, ఇష్టసఖుడుగా, సచివుడుగా, సభాపతిగా, సంరక్షకుడుగా, దూతగా ఆచరించిన కృత్యాలన్నీ అర్థం చేసుకున్నాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం విరజిమ్మే అగ్నిజ్వాలల నుంచి తనను రక్షించిన వృత్తాంతం తెలుసుకొన్నాడు. యాదవులకూ పాండవులకూ ఉన్న పరస్పర స్నేహానుబంధాన్నీ, వారికి గల శ్రీకృష్ణ భక్తినీ గ్రహించాడు. విశ్వంభరుని భక్తవాత్సల్యానికి పరమాశ్చర్య భరితుడైనాడు. స్తుతి పాఠకులకు బహుమూల్యాలైన హారాలూ, వస్త్రాలూ, అభరణాలూ బహూకరించాడు. పద్మనాభుని పాదపద్మారాధనంలో పరవశమై పవిత్రమైన మానసంతో ఉన్నాడు. ఆ సమయంలో వృషభాకారం ధరించి ఒంటికాలితో సంచరిస్తున్న ధర్మదేవుడు, దూడను వీడిన పాడి ఆవు మాదిరిగా కాంతి కోల్పోయి కన్నీళ్లు కారుస్తూ గోరూపధారిణి అయిన భూదేవితో ఇలా అన్నాడు.

## గోవృషభ సంవాదం

1-397-మ.

"నయనాంభఃకణజాల మేల విడువన్ నా తల్లి నీ మేను సా
మయమై యున్నది; మోము వాడినది; నీ మన్నించు చుట్టాలకున్
భయదుఃఖంబులు నెందు వొందవు గదా? బంధించి శూద్రుల్ పద
త్రయహీనన్ ననుఁ బట్టవత్తురనియో, తాపంబు నీ కేటికిన్.

టీక:- నయన = కన్నులనుండి; అంభః = నీటి; కణ = కణముల; జాలము = సమూహము; ఏల = ఎందులకు; విడువన్ = విడువగా; నాతల్లి = నాతల్లి; నీ = నీయొక్క; మేను = శరీరము; స = కూడిన; ఆమయము = రోగములుకలది; ఐ = అయి; ఉన్నది = ఉన్నది; మోము = ముఖము; వాడినది = వాడిపోయినది; నీ = నిన్ను; మన్నించు = గౌరవించు; చుట్టాల = బంధువుల; కున్ = కును; భయ = భయములును; దుఃఖంబులున్ = దుఃఖములును; ఎందు = ఎక్కడను; ఒందవున్ = పొందకుండును; కదా = కదా; బంధించి = బంధించి; శూద్రుల్ = శూద్రులు; పద = పాదములు; త్రయ = మూడు; హీనన్ = నష్టపోయిన; ననున్ = నన్ను; పట్టన్ = పట్టుటకు; వత్తురు = వచ్చెదరు; అనియో = అనియా ఏమి; తాపంబు = వేదన; నీకు = నీకు; ఏటి = ఎందుల; కిన్ = కు.

భావము:- "తల్లీ! నీ కన్నుల నుంచి బాష్పధారలు ప్రవహిస్తున్నాయి యేమిటి? నీ దేహం వ్యాధిగ్రస్తమై ఉన్నదేమిటి? నీ వదనమంతా అలా వాడిపోయిందే మిటి? నీ ప్రియ బంధువులకు భయదుఃఖాలు ప్రాప్తించలేదు కదా? శూద్రులు ఒంటికాలితో కుంటుతూ ఉన్న నన్ను పట్టి బంధిస్తారేమోనని దిగులు పడుతున్నావా? పిచ్చి తల్లీ! ఎందుకిలా ఉన్నావు?

1-398-సీ.

మఖములు లేమి నమర్త్యుల కిటమీఁద-

మఖభాగములు లేక మాను ననియొ?

రమణులు రమణుల రక్షింప రనియొ? పు-

త్త్రులఁ దల్లిదండ్రులు ప్రోవరనియొ?

భారతి గుజనులఁ బ్రాపించుననియొ? స-

ద్విప్రులు నృపుల సేవింతు రనియొ?

కులిశహస్తుఁడు వాన గురియింపకుండఁగఁ-

బ్రజలు దుఃఖంబులఁ బడుదురనియొ?

1-398.1-ఆ.

హీనవంశ జాతు లేలెదరనియొ? రా

జ్యములు పాడిగలిగి జరుగవనియొ?

మనుజు లన్న, పాన, మైథున, శయ, నాస

నాది కర్మసక్తు లగుదు రనియొ?

టీక:- మఖములు = యజ్ఞములు; లేమిన్ = లేకపోవుట వలన; అమర్త్యుల = దేవతల; కిన్ = కి; ఇట = ఇక; మీఁదన్ = పైన; మఖభాగములు = హవిర్భాగములు; లేక = లేక; మానున్ = పోవుననియు; అనియొ = అనియేమో; రమణులు = భర్తలు; రమణులన్ = భార్యలను; రక్షింపరు = కాపాడరు; అనియొ = అనియేమో; పుత్రులన్ = కొడుకులను; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; ప్రోవరు = పోషింపరు; అనియొ = అనియేమో; భారతి = సరస్వతి; కుజనులన్ = చెడ్డవారిని; ప్రాపించున్ = పొందును; అనియొ = అనియేమో; సత్ = మంచి; విప్రులు = బ్రాహ్మణులు; నృపులన్ = రాజులని {నృపులు - నరులను పాలించువారు, రాజులు}; సేవింతురు = కొలచెదరు; అనియొ = అనియేమో; కులిశహస్తుఁడు = ఇంద్రుడు {కులిశము హస్తమున కలవాడు - ఇంద్రుడు}; వానన్ = వర్షమును; కురియింపక = కురియింపక; ఉండఁగన్ = ఉండటవలన — పోవుటవలన; ప్రజలు = జనులు; దుఃఖంబులన్ = బాధలను; పడుదురు = పొందుదురు; అనియొ = అనియేమో;

హీన = తక్కువ; వంశ = వంశమందు; జాతులు = పుట్టినవారు; ఏలెదరు = పాలించెదరు; అనియొ = అనియేమో; రాజ్యములు = రాజ్యములు; పాడి = నీతి నియమములు; కలిగి = కలిగి, సరిగ; జరుగవు = నడువవు; అనియొ = అనియేమో; మనుజులు = మానవులు; అన్న = భుజించుట; పాన = పానముచేయుట; మైథున = మైథునము; శయన = శయనించుట; ఆసన = ఆసీనులగుట; ఆది = మొదలగు; కర్మ = కర్మలందు; సక్తులు = ఆసక్తి కలవారు; అగుదురు = అవుతారు; అనియొ = అనియేమో.

భావము:- యజ్ఞాలు లేనందువల్ల ఇకముందు దేవతలకు హవిర్భాగాలు లభించవనీ; భర్తలు భార్యలను రక్షింపరనీ; పిల్లలు తల్లిదండ్రులను పోషించరనీ బాధపడుతున్నావా? సరస్వతి దుర్జనులను ఆశ్రయిస్తుందనీ; ఉత్తమ విప్రులు రాజులకు సేవ చేస్తారనీ; ఇంద్రుడు వర్షం కురిపించక ప్రజలు కష్టాల పాలవుతారనీ ఖేదపడుతున్నావా? హీన వంశ సంజాతులు రాజ్యాలు ఏలుతారనీ; దేశంలో న్యాయం నశించి పోతుందనీ; మానవులు ఆహార నిద్రా మైథునాది కర్మలయందు ఆసక్తు లౌతారనీ విచారిస్తున్నావా? ఎందుకు నీ కీ ఆవేదన?

1-399-మ.

జననీ! నీ భరమెల్ల డించుటకునై చక్రాయుధుం డిన్ని హా
యనముల్ దాను నరాకృతిన్ మెలఁగి నిత్యానందముం జేసి పో
యిన నే నింక ననాథ నైతిఁ గుజనుం డెవ్వాఁడు శాసించునో?
పెను దుఃఖంబులఁ నేమి పొందు ననియో? భీతిల్లి చింతించుటల్.

టీక:- జననీ = తల్లీ; నీ = నీ యొక్క; భరము = భారము; ఎల్లన్ = అంతటను; డించుట = దింపుట; కున్ = కోసము; ఐ = అయి; చక్రాయుధుండు = కృష్ణుడు; ఇన్ని = ఇన్ని; హాయన ముల్ = సంవత్సరములు; తాను = తాను; నర = నరుని; ఆకృతిన్ = రూపమున; మెలఁగి = వర్తించగ; నిత్య = నిత్యమైన; ఆనందమున్ = సంతోష మును; చేసి = కలుగజేసి; పోయినన్ = పోవుటవలన; నేను = నేను; ఇంకన్ = ఇకపై; అనాథన్ = దిక్కులేని దానను; ఐతిన్ = అయితినని; కుజనుండు = చెడ్డమనిషి; ఎవ్వాఁడు = ఎవడు; శాసించునో = శాసించునో; పెను = పెద్ద; దుఃఖంబులన్ = బాధలు; ఏమి = ఏమి; పొందును = కలుగును; అనియో = అనియేమో; భీతిల్లి = భయపడి; చింతించుటల్ = వగచుటలు.

భావము:- భూభారాన్ని తగ్గించటం కోసం చక్రధరుడైన శ్రీహరి ఇన్ని సంవత్సరాలు మానవాకారం ధరించి, చరించి, ఆనందం చేకూర్చి అవతారం చాలించాడే. ఇక నేను దిక్కులేనిదాన నైనాను. ఏ దుర్మార్గుడు ఇక ముందు నన్ను పాలిస్తాడో, ఎటువంటి దుఃఖాలు ప్రాప్తిస్తాయో అని దిగులుపడి ఆక్రోశిస్తున్నావా? తల్లీ!

1-400-క.

దెప్పర మగు కాలముచే
నెప్పుడు దేవతల కెల్ల నిష్టం బగు నీ
యొప్పిదము కృష్ణుఁ డరిగినఁ
దప్పెఁ గదా! తల్లి! నీవు తల్లడపడఁగన్."

టీక:- దెప్పరము = ఆపదలు కలిగించునది; అగు = అయినట్టి; కాలము = కాలము; చేన్ = వలన; ఎప్పుడున్ = ఎప్పుడును; దేవతలు = దేవతలు; కున్ = కు; ఎల్ల = అందరకు; ఇష్టంబు = ఇష్టము; అగు = అయినట్టి;

నీ = నీ యొక్క; ఒప్పిదము = చక్కదనము; కృష్ణుఁడు = కృష్ణుఁడు; అరిగినన్ = వెళ్ళిన తరువాత; తప్పెన్ = తప్పెను; కదా = కదా; తల్లి = తల్లీ; నీవు = నీవు; తల్లడ = తల్లడిల్లు; పడఁగన్ = పడునట్లు.

భావము:- అనర్థాలకు ఆలవాలమైన కాలంలో కృష్ణుడు ఉన్నంత వరకూ దేవతలకు కూడా సంస్తవనీయమైనది నీ సౌభాగ్యం. ఇప్పుడు కృష్ణుడు వెళ్లిపోగానే అదృష్టం మారిపోయింది. అనర్థం వాటిల్లింది కదా తల్లీ!"

1-401-వ.

అనిన భూదేవి యిట్లనియె.

టీక:- అనిన = అని పలుకగా; భూదేవి = భూదేవి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అనిన భూదేవి యిట్లనియె.

1-402-క.

"ఈ లోకంబునఁ బూర్వము
నాలుగు పాదముల నీవు నడతుఁవు నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమినిఁ
గాలముచే నీకు నొంటి కాలయ్యెఁ గదే! "

టీక:- ఈ = ఈ; లోకమునన్ = లోకములో; పూర్వము = ఇదివరకు; నాలుగు = నాలుగు; పాదములన్ = పాదములతో; నీవు = నీవు; నడతుఁవు = నడుచుచుండెదవు; నేఁడు = ఇప్పుడు; ఆ = ఆ; శ్రీలలనేశుఁడు = కృష్ణుడు {శ్రీ లలనేశుడు - శ్రీకరమైన స్త్రీ రుక్మిణికి భర్త, కృష్ణుడు}; లేమినిన్ = లేకపోవుటచేత; కాలము = కానికాలము; కాలప్రభావము; చేన్ = చే; నీకున్ = నీకు; ఒంటి = ఒకటే; కాలు = కాలు; అయ్యెన్ = ఆయిపోయింది; కదే = కదా ఏమి.

భావము:- "ధర్మదేవతా! స్వరూపుడవైన నీవు పూర్వం ఈ లోకంలో నాలుగు పాదాలతో నడుస్తూ ఉండే వాడివి. ఈ నాడు ఇందిరావల్లభుడైన గోవిందుడు లేనందువల్లనే కదా కాలప్రభావానికి లోబడి ఒంటి కాలితో నడుస్తున్నావు.

1-403-వ.

మఱియు సత్య, శౌచ, దయా, క్షాంతులునుఁ, ద్యాగ, సంతోషార్జవంబులును, శమ, దమ, తపంబులును, సమత్వంబును, పరాపరాధ సహనంబును, లాభంబు గల యెడ నుదాశీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, జ్ఞాన, విరక్తులును, నైశ్వర్య, శౌర్య, ప్రభా, దక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యంబునుఁ,

**గౌశల, కాంతి, ధైర్య, మార్దవ, ప్రతిభాతిశయ, ప్రశ్రయ, శీలంబులును, జ్ఞానేంద్రియ కర్మేం ద్రియ,మనోబలంబులును, సౌభాగ్య, గాంభీర్య, స్థైర్యంబులును, శ్రద్ధా, కీర్తి, మానగర్వా భావంబులును, ననియెడి ముప్పదితొమ్మిది గుణంబులు నవియునుం గాక బ్రహ్మణ్యతా, శరణ్యతాది, మహాగుణ సముహంబును శ్రీకృష్ణదేవుని యందు వర్తిల్లుం గావున.**

టీక:- మఱియున్ = ఇంకను; సత్య = సత్యము, నిజము; శౌచ = శౌచము, పరిశుభ్రత; దయ = దయ, జాలి; క్షాంతులును = క్షాంతులును, ఓర్పు; త్యాగ = త్యాగము, ఈవి; సంతోష = సంతోషము, అనందము; ఆర్జవంబులును = ఆర్జవములును; సూటియైన ప్రవర్తన; శమ = శమము, శాంతి; దమ = దమము – ఇంద్రియ నిగ్రహము; తపంబులును = తపములును, తపస్సు; సమత్వంబును = సమత్వమును {సమత్వము – కష్ట సుఖములెడ సమభావము}; పర = ఇతరుల; అపరాధ = తప్పుల ఎడ; సహనంబును = ఓర్పు; లాభంబు = లాభము; కల = ఉన్న; ఎడ = ఎడ; ఉదాశీనుండు = ఉదాశీనముగ ఉండు వాడు; ఐ = అయి; ఉండుటయును = ఉండుటయును; శాస్త్ర = శాస్త్రములను; విచారంబును = అభ్యసించుట, అధ్యయనము; జ్ఞాన = జ్ఞానము; విరక్తులును = విరక్తులును, వైరాగ్యము; ఐశ్వర్య = ఐశ్వర్యము; సంపద; శౌర్య = శౌర్యము; ప్రభ = ప్రభ; మెరుపు; దక్షత్వంబులును = దక్షత్వములును, సమర్థత; స్మృతియును = స్మృతియును, జ్ఞాపకము; స్వాతంత్ర్యంబును = స్వతంత్రతయును; స్వచ్ఛందముగ కార్య నిర్వహణ; కౌశల = కౌశల్యము; కుశలత; నేర్పరితనము; కాంతి = కాంతి; ఒప్పిదము; ధైర్య = ధైర్యము; సాహసము; మార్దవ = మార్దవము; మృదుత్వము; ప్రతిభ = ప్రతిభ; అప్పటికప్పుడు వికసించెడు బుద్ధి; అతిశయ = అతిశయము; అధిక్యత; ప్రశ్రయ = ప్రశ్రయము; అనునయము; శీలంబులును = శీలములును; మంచి నడవడిక; జ్ఞాన = జ్ఞానమును ఇచ్చు {జ్ఞానేంద్రియములు – కన్ను ముక్కు నోరు చెవులు చర్మము - 5}; ఇంద్రియ = ఇంద్రియముల; కర్మ = కర్మమునకైన {కర్మేంద్రియములు – పాయువు ఉపస్థ చేతులు కాళ్ళు నాలిక - 5}; ఇంద్రియ = ఇంద్రియముల; మనస్ = మనస్సు యొక్క; బలంబులును = బలములును; సౌభాగ్య = సౌభాగ్యము; అదృష్టము కలసివచ్చుట; గాంభీర్య = గాంభీర్యము; లోతైన స్వభావము; స్థైర్యంబులును = స్థైర్యము; స్థిరత్వము; శ్రద్ధ = శ్రద్ధ; చేయుపని యందు లగ్నమగుట; కీర్తి = కీర్తి; యశము; మాన = మానము; చిత్తౌన్నత్యము; అభిమానము; గర్వ = గర్వము; అభావంబులును = లేకపోవుటలును, అణుకువ; అనియెడి = అనెడి; ముప్పది తొమ్మిది = ముప్పైతొమ్మిది; గుణంబులు = గుణములు; అవియునుంగాక = అవేకాక; బ్రహ్మణ్యత = బ్రహ్మణ్యత {బ్రహ్మణ్యత - వేదములను అనుసరించి జీవించుట}; శరణ్యత = శరణ్యత {శరణ్యత - శరణుజొచ్చుటకు తగి ఉండుట}; ఆది = మొదలగు; మహా = గొప్ప; గుణ = గుణముల; సమూహంబును = సముదాయమును; శ్రీకృష్ణదేవుని = శ్రీకృష్ణుని; అందున్ = ఎడల; వర్తిల్లున్ = ప్రవర్తిల్లును; కావునన్ = అందుచేత.

భావము:- సత్యం, శౌచం, దయ, క్షమ, త్యాగం, సంతోషం, ఆర్జవం, శమం, దమం, తపస్సు, సమభావం, తితిక్ష, ఉపరతి, శ్రుతం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, శౌర్యం, తేజస్సు, సామర్థ్యం, స్మృతి, స్వాతంత్ర్యం, కౌశలం, కాంతి, ధైర్యం, మార్దవం, ప్రతిభ, వినయం, శీలం, జ్ఞానేంద్రియ పటుత్వం, కర్మేంద్రియ పటుత్వం, మనోబలం, సౌభాగ్యం, గాంభీర్యం, స్థైర్యం, శ్రద్ధ, కీర్తి, గౌరవం, నిరహంకారం అనే ముప్పై తొమ్మిది సుగుణాలే

కాకుండా వేదవిజ్ఞానం, శరణాగత పరిత్రాణం మొదలైన అనంత గుణగణాలు ఆ శ్రీ కృష్ణపరమాత్మ యందు అలరారుతుంటాయి.

1-404-క.

గణనాతీతము లగు స
ద్గుణములు గల చక్రి సనిన ఘోరకలిప్రే
రణమునఁ బాప సమూహ
వ్రణ యుతు లగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ!

టీక:- గణన = లెక్కించుటకు, ఎంచుటకు; అతీతములు = మిక్కిలినవి, మీలుకానివి; అగు = అయినట్టి; సత్ = మంచి; గుణములు = లక్షణములు; కల = కలిగిన; చక్రి = కృష్ణుడు {చక్రి - చక్రాయుధుడు, కృష్ణుడు}; చనినన్ = చనిన తరువాత; ఘోర = భయంకరమైన; కలి = కలిచేత; ప్రేరణమునన్ = ప్రేరేపించుట వలన, ఉసిగొల్పుట వలన; పాప = పాపముల; సమూహ = సమూహములు అను; వ్రణ = కురుపులు, పుండ్లు; యుతులు = కలిగినవారు; అగు = అయినట్టి; జనులన్ = ప్రజలను; చూచి = చూసి; వగచెదన్ = చింతించెదను; తండ్రీ = తండ్రీ.

భావము:- ఓ తండ్రీ! ఈ విధంగా లెక్కించటానికి శక్యంకాని సద్గుణాల రాశి చక్రధరుడు అవతారం చాలించగానే, కలుషాత్ముడైన కలిపురుషునిచే ఉసిగొల్పబడిన భయంకర పాపకృత్యాలు అనే పుండ్లతో కూడిన ప్రజాసమూహాన్ని చూడగానే నాకు దుఃఖం పొంగి వస్తున్నది.

1-405-క.

దేవతలకు, ఋషులకుఁ, బితృ
దేవతలకు, నాకు, నీకు, ధీరులకును, నా
నావర్ణాశ్రమములకును
గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా!

టీక:- దేవతలు = దేవతలు; కున్ = కు; ఋషులు = ఋషులు; కున్ = కును; పితృదేవతలు = వంశపురుషులు; కున్ = కు; నాకు = నాకు; ధీరులు = ధైర్యము కలవారల; కున్ = కును; నానా = అన్ని; వర్ణ = వర్ణములకు {చాతుర్వర్ణములు— బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర}; ఆశ్రమముల = ఆశ్రమముల {చాతురాశ్రమములు – బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస.}; కును = కును; గోవుల = ఆవుల; కును = కును; బాధ = బాధ; అనుచున్ = అనుచు; కుందెదన్ = దుఃఖపడెదను; అనఘా = పాపములేనివాడా.

భావము:- ఓ పుణ్యమూర్తీ దేవతలకూ, పితృదేవతలకూ, ఋషులకూ, నాకూ, నీకూ, నానావిధాలైన వర్ణాశ్రమాలకూ, గోవులకూ, మహానుభావులకూ బాధలు ప్రాప్తిస్తున్నందుకు బాధపడుతున్నాను.

1-406-సీ.

బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్ష వీ-

క్షణము వాంఛింతురు సత్తపములఁ?

గమలాలయము మాని కమల యెవ్వని పాద-

కమలంబు సేవించుఁ గౌతుకమునఁ?

బరమ యోగీంద్రులు భవ్యచిత్తములందు-

నిలుపుదు రెవ్వని నియతితోడ?

వేదంబులెవ్వని విమలచారిత్రముల్-

వినుతింపఁగా లేక వెగడుపడియె?

1-406.1-ఆ.

నట్టి వాసుదేవు నబ్జ, వజ్రాంకుశ,

చక్ర, మీన, శంఖ, చాప, కేతు

చిహ్నితంబులైన శ్రీచరణము లింక

సోఁక వనుచు వగపు సోఁకెనయ్య!

టీక:- బ్రహ్మ = బ్రహ్మ; ఆదులు = మొదలగువారు; ఎవ్వని = ఎవనియొక్క; భద్ర = క్షేమకరమైన; కటాక్ష = దయతోకూడిన, కడ+అక్ష,కడకంటి; వీక్షణమున్ = చూపు; వాంఛింతురు = కోరుదురు; సత్ = మంచి; తపములన్ = తపస్సులతో; కమలాలయము = సరస్సునందు {కమలాలయము - కమలములకు స్థానము, సరస్సు}; మాని = ఉండుటమాని, వదలి; కమల = లక్ష్మి; ఎవ్వని = ఎవనియొక్క; పాద = పాదములు అను; కమలంబున్ = కమలమును; సేవించున్ = పూజించును; కౌతుకమునన్ = కుతూహలముతో; పరమ = గొప్ప; యోగ = యోగులలో; ఇంద్రులు = ఇంద్రులు; భవ్య = శుభమైన; చిత్తములు = మనస్సు; అందున్ = అందు; నిలుపుదురు = స్థిర పరచుకొందురు; ఎవ్వని = ఎవని; నియతి = నియములు; తోడన్ = తో; వేదంబులు = వేదములు; ఎవ్వని = ఎవని; విమల = నిర్మలమైన; చారిత్రముల్ = వృత్తాంతములు; వినుతింపఁగాన్ = కీర్తించ; లేక = లేక; వెగడు = తల్లడిల్లు, తడబాటు; పడియెన్ = పడినవి;

అట్టి = అటువంటి; వాసుదేవు = కృష్ణుని; అబ్జ = పద్మము వంటి; వజ్ర = వజ్రము వంటి; అంకుశ = అంకుశము వంటి; చక్ర = చక్రము వంటి; మీన = చేప వంటి; శంఖ = శంఖము వంటి; చాప = విల్లు వంటి; కేతు = జండా వంటి; చిహ్నితంబులు = గుర్తులు ఉన్నట్టివి; ఐన = అయినట్టి; శ్రీ = పవిత్రమైన; చరణములు = పాదములు; ఇంకన్ = ఇక మీదట; సోఁకవు = తగలవు; అనుచున్ = అనుకొనుచు; వగపు = విచారము; సోఁకెన్ = పుట్టెను; అయ్య = నాయనా.

భావము:- బ్రహ్మాది దేవతలంతా ఎంతో కాలం తపస్సులు చేసి చేసి ఏ దేవుని కల్యాణ కరుణా కటాక్షవీక్షణాలను కాంక్షిస్తారో, పద్మాలయ అయిన లక్ష్మీదేవి తన నివాసమైన పద్మాన్ని సైతం విడిచి, అత్యంత కుతూహలంతో ఏ దేవుని పాదపద్మాలను ఆరాధిస్తున్నదో, పరమ నిష్ఠాగరిష్ఠులైన మునిశ్రేష్ఠులు తమ పవిత్ర హృదయ ఫలకాలపై ఏ దేవుని పావన స్వరూపాన్ని నియమపూర్వకంగా నిలుపు కొంటున్నారో, సమస్త వేదాలూ ఏ దేవుని దివ్య చరిత్రలు సరిగా వర్ణించలేక తడబాటు పడుతున్నాయో, అటువంటి దేవాదిదేవుడైన వాసుదేవుని పద్మ, వజ్ర, అంకుశ, శంఖ, చక్ర, చాప, మీన, ధ్వజ రేఖలతో అలంకృతాలైన శ్రీచరణాలు ఇక మీద, నా మీద సోకవు గదా అని శోకిస్తున్నాను. తండ్రీ!

1-407-క.

హరిపాదంబులు సోఁకెడి
సిరికతమున నఖిల భువన సేవ్యత్వముతో
స్థిర నైతి నిన్ని దినములు
హరి నా గర్వంబు మాన్చి యరిగె మహాత్మా!

టీక:- హరి = హరి యొక్క; పాదంబులున్ = పాదములు; సోఁకెడి = తగలేటటువంటి; సిరి = భాగ్యము; కతమునన్ = వలన; అఖిల = సమస్త; భువన = భువనముల; సేవ్యత్వము = సేవింపబడుట; తోన్ = తో; స్థిరను = స్థిరముగ, కుదురుకొని ఉన్నదానను; ఐతిన్ = అయితిని; ఇన్ని = ఇన్ని; దినములు = రోజులు; హరి = హరి; నా = నా; గర్వంబున్ = మదమును; మాన్చి = పోగొట్టి; అరిగెన్ = చనెను; మహాత్మా = గొప్ప ఆత్మ కలవాడా.

భావము:- మహాత్మా! భగవంతుని పాదపద్మాలు నాపై సోకే మహాభాగ్యం నాకు లభించటం మూలాన అఖిలలోకాలకు ఆరాధ్యురాలనై ఇన్నాళ్ళూ కుదురుకొని యున్నాను. ప్రభువు నా అభిమానాన్ని అంతం చేసి ఇప్పుడు అంతర్ధానం చెందాడు.

1-408-క.

లీలాకారము దాల్చెను
శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును
నాలుగు పాదముల నిన్ను నడిపించుటకున్

టీక:- లీలాకారమున్ = లీలాకారము {లీలాకారము - క్రీడకై ధరించిన రూపమును; నిజము కాని రూపమును}; తాల్చెను = ధరించెను; శ్రీలలనేశుండు = కృష్ణుడు {శ్రీ లల నేశుడు - శ్రీకరమైన స్త్రీ రుక్మిణికి భర్త, కృష్ణుడు}; ఖలులన్ = దుష్టులను; శిక్షించి = శిక్షించి; భవ = సంసార బంధనములు; ఉన్మూలనమున్ = తొలగించుట; చేయు = చేయుట; కొఱకును = కోసము; నాలుగు = నాలుగు (4); పాదములన్ = కాళ్ళతో; నిన్ను = నిన్ను; నడిపించుట = నడపించుట; కున్ = కు.

భావము:- శ్రీమన్నారాయణుడు దుష్ట శిక్షణ కోసం, సంసార బంధాలను తొలగించుట కోసం, ధర్మస్వరూపుడవైన నిన్ను నాలుగు పాదాలతో నడిపించటం కోసం లీలామానుష దేహాన్ని ధరించాడు.

1-409-ఉ.

ఆ మధురోక్తు లా నయము లా దరహాసము లా దయారసం
బా మురిపంబు లా తగవు లా గమనక్రియ లా మనోహర
ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవుం
గామినులేల? నిర్దళితకర్ములు యోగులుఁ బాయనేర్తురే?

టీక:- ఆ = ఆ; మధుర = తీయని; ఉక్తులున్ = మాటలు; ఆ = ఆ; నయములున్ = లాలనలు; ఆ = ఆ; దరహాసములున్ = చిరునవ్వులు; ఆ = ఆ; దయ = దయతో కూడిన; రసంబున్ = రసము, రసభావము; ఆ = ఆ; మురిపంబులున్ = మురిపించుటలు, కులుకులు; ఆ = ఆ; తగవులున్ = చిలిపి తగవులు; ఆ = ఆ; గమన = నడచే; క్రియలున్ = విధానములు; ఆ = ఆ; మనస్ = మనసును; హర = చూరగొను; ప్రేమ = ప్రేమ; కర = పుట్టించునట్టి; అవలోకనము = చూపు; ప్రీతిన్ = ఇష్టముతో; కనుంగొన = చూచుకొనుటలు; లేమిన్ = లేకపోవుటను; మాధవున్ = కృష్ణుని; కామినులు = స్త్రీలు {కామిని - కామము కలామె, స్త్రీ}; ఏల = ఏమి; నిర్దళిత = తెంచుకొన్న; కర్ములు = కర్మములు కలవారు; యోగులున్ = యోగులైన; పాయన్ = సహించుటను; నేర్తురే = ఓపకలరా.

భావము:- మాధవునిలీలలు మరిచిపోలేము. ఆతీయతీయనిమాటలు, ఆనయగారాలు, ఆ చిరు నవ్వులు, ఆ కనికరాలు, ఆ ముద్దు మురిపాలు, ఆ ప్రణయకలహాలు, ఆ సుందరమందయానాలు, మనస్సులను హరించే ఆ మధుర కటాక్షవీక్షణాలు దూరమై పోతాయే అనే విచారంతో అంగనలే కాదు సర్వసంగ పరిత్యాగులైన యోగులు కూడా ఆ దయామయుని వియోగాన్ని సహించలేరు.

1-410-క.

మెల్లన నాపై యాదవ
వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నేరం
జిల్లగ రోమాంచము క్రియ
మొల్లములై మొలచు సస్యములు మార్గములన్."

టీక:- మెల్లన = మెల్లగా; నా = నా; పై = పైన; యాదవవల్లభుఁడు = కృష్ణుడు {యాదవవల్లభుఁడు - యాదవులకు ప్రియమైనవాడు, కృష్ణుడు}; అడుగు = అడుగు; ఇడఁగన్ = పెట్టగా; మోహ = మోహమునకు; వశను = లొంగినదానను; ఐ = అయి; నేన్ = నేను; రంజిల్లగ = అనురాగ ముప్పతిల్లగా; రోమాంచము = గగుర్పాటు; క్రియన్ = వలె; మొల్లములు = అధికములు; ఐ = అయి; మొలచు = అంకురించు; సస్యములు = ధాన్యపుగింజలు; మార్గములన్ = దారులమ్మట.

భావము:- ఆ గోపికా వల్లభుండు నా పైన మెల్ల మెల్లగా అడుగుల పెడుతూ నడుస్తుంచే ఆనంద పారవశ్యంలో నా ఒళ్ళు గగుర్పొడిచేది. నా దేహం నిండా మొలిచిన ఆ పులకాంకురాలే దట్టమైన సస్యాంకురాలై అడుగడుగునా పొడచూపేవి."

1-411-వ.

**అని యిట్లు పూర్వవాహినియైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును, భూమియు; వృషభ, ధేనురూపంబుల భాషింప రాజర్షి యైన పరీక్షి ద్భూవరుండు డగ్గఱియె; నా సమయంబున.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పూర్వ = పూర్వము; తూర్పు దిక్కునకు; వాహిని = ప్రవహించునది; ఐన = అయినట్టి; సరస్వతీ = సరస్వతీ నదీ; తీరంబున = గట్టున; ధర్మదేవుండును = ధర్మదేవతయును; భూమియు = భూదేవియును; వృష = ఆవు; ధేను = ఎద్దు; రూపంబులన్ = రూపములతో; భాషింపన్ = మాట్లాడగ; రాజర్షి = రాజర్షి {రాజర్షి - వైదిక సంప్రదాయి అగు రాజు}; ఐన = అయినట్టి; పరీక్షిత = పరీక్షిత్తు; భూవరుండు = మహారాజు {భూవరుడు - భూమికి వరుడు, మహారాజు}; డగ్గఱియెన్ = దగ్గరయ్యెను; ఆ = ఆ; సమయంబునన్ = సమయమునకు.

భావము:- ఈ విధంగా వృషభ ధేను రూపాలతో ధర్మదేవుడూ, భూదేవి ఇద్దరూ తూర్పుగా ప్రవహించే సరస్వతీ నది ఒడ్డును సంభాషించు కొంటున్న సమయంలో రాజర్షి అయిన పరీక్షిన్మహీపాలుడు అచ్చటికి వచ్చాడు. అప్పుడు-

★1-412-శా.

**కైలాసాచలసన్నిభంబగు మహాగంభీరగోరాజముం**
**గాలక్రోధుఁడు, దండహస్తుఁడు, నృపాకారుండు, క్రూరుండు, జం**
**ఘాలుం డొక్కఁడు, శూద్రుఁ డాసురగతిం గారుణ్యనిర్ముక్తుఁడై**
**నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్.**

టీక:- కైలాస = కైలాస; అచల = పర్వతమునకు; సన్నిభంబు = సమానము; అగు = అయి నట్టి; మహా = చాలా; గంభీర = గంభీర మైన; గో = ఎద్దులలో; రాజమున్ = శ్రేష్ఠ మైన దానిని; కాల = యముని వలె మిక్కిలి; క్రోధుఁడు = కోపిష్టి; దండ = దుడ్డుకఱ్ఱను; హస్తుఁడు = చేత పట్టుకున్న వాడు; నృప = రాజు యొక్క; ఆకారుండు = ఆకారమున ఉన్న వాడు; క్రూరుండు = క్రూరుడు; జంఘాలుండు = వడిగ నడచు వాడు {జంఘాలుడు = పిక్క గట్టి కల వాడు}; ఒక్కఁడు = ఒకడు; శూద్రుఁడు = శూద్రుడు; ఆసుర = అసురుని; గతిన్ = వలె; కారుణ్య = దయను; నిర్ముక్తుఁడు = విడిచిన వాడు; ఐ = అయి; నేలన్ = నేలమీద; కూలంగన్ = కూలిపోవు నట్లు; తన్నెన్ = తన్నెను; పంచితిలఁగాన్ = మూత్రము పోసుకునేలాగ {పంచితిలు (క్రియ) — గోవు మూత్రము విడుచు}; నిర్ఘాత = పిడుగుపాటు వంటి; పాద = కాలి; హతిన్ = తన్నుతో.

భావము:- కదలి వచ్చిన కైలాస పర్వతంలా తెల్లగా గంభీరంగా అంతెత్తు ఉన్న ఉత్తమ మైన ఆ మహా వృషభాన్ని క్రోధోన్మత్తుడు, కఠోరచిత్తుడు, రాజవేషధారి, దుడ్డుకఱ్ఱ పట్టుకొన్న వాడు, బలమైన పిక్కలు కల వాడు అయిన ఒక శూద్రుడు కటిక రాక్షసుడిలా కనికరం అన్నది లేకుండా కాలితో బలంగా తన్నాడు. అంతటి వృషభ రాజం మూత్రం విసర్జిస్తూ నేలపై కూలిపోయింది. (పరీక్షిన్మహారాజు జైత్రయాత్ర పిమ్మట తిరిగి వెళ్తు, ఇలా శూద్రుని రూపంలో ఉన్న కలిపురుషుడు ఎద్దు రూపంలో ఉన్న ధర్మదేవతను తన్నటం చూసాడు.)

1-413-వ.

మఱియును.

టీక:- మఱియును = ఇంకను.

భావము:- వాడు అంతటితో ఆగలేదు

1-414-శా.

ఆలోలాంగక నశ్రు తోయ కణ జాలాక్షిన్, మహాంభారవన్,
బాలారూఢ తృణావళీకబళలోభవ్యాప్త జిహ్వాగ్ర, నాం
దోళస్వాంతనజీవవత్స నుదయద్దుఃఖాన్వితన్, ఘర్మకీ
లాలాపూర్ణశరీర, నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్.

టీక:- ఆలోల = వణుకుతున్న; అంగకన్ = అవయవములు కలది; అశ్రు = కన్నీటి; తోయ = నీటి; కణ = బిందువులు; జాల = జాలువారుతున్న, చిమ్ముతున్న; అక్షిన్ = కన్నులు కలది; మహా = పెద్దగా; అంభా = అంభా అనుచు; రవన్ = అరచినది; బాల = కొత్తగ; ఆరూఢ = మొలకెత్తిన; తృణ = గడ్డి; వళీ = సముదాయపు; కబళ = కడిపై, ముద్దపై; లోభ = ఆపేక్ష వలన; వ్యాప్త = చాచిన; జిహ్వా = నాలుక; అగ్రన్ = చివర కలది; ఆందోళ = చలించిన, దుఃఖపడిన; స్వాంతన్ = మనసు కలదానిని; అజీవ = చనిపోయిన; వత్సన్ = దూడ కలదానిని; ఉదయ = పెల్లుబుకుచున్న; దుఃఖ = దుఃఖము; అన్వితన్ = కూడి ఉన్నదానిని; ఘర్మ = చెమట; కీలాలా = నీటితో; పూర్ణ = నిండిన; శరీరన్ = శరీరము కలది; ఆ = ఆ; మొదవున్ = పాడియావును; ఉల్లంఘించి = ఎగిరి దూకి; తన్నెన్ = తన్నెను; వడిన్ = బలంగా.

భావము:- గడగడ వణుకుతూ కన్నుల వెంబడి అశ్రుధారలు కారుస్తున్న దాన్ని, గొంతెత్తి అంబా అని అరుస్తున్నదాన్ని, జంపుగా పెరిగిన లేత పచ్చిక మేయటానికి నాలుక చాస్తున్న దాన్ని, చెదరిన గుండెకలదాన్ని, లేగదూడ లేకుండా ఒంటరిగా వచ్చిన దాన్ని, ఉబికి వస్తున్న దుఃఖము కలదానిని, సేదజలంతో నిండిన దేహం కలదానిని, ఆ గోమాతను, ఆ పాపాత్ముడు ఎగిరి తన్నాడు

## కలి నిగ్రహంబు

1-415-వ.

ఇట్లాధేను వృషభంబుల రెంటిం గంటకుండై తన్నుచున్న రాజలక్షణ ముద్రితుం డయిన శూద్రునిం జూచి, సువర్ణ పరికరస్యందనారూఢుం డగు నభిమన్యునంద నుండు గోదండంబు సగుణంబు సేసి, మేఘగంభీర రవంబు లగు వచనంబుల నిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ఆ = ఆ; ధేను = ఆవు; వృషభంబులన్ = ఎద్దులను; రెంటిన్ = రెండింటిని; కంటకుడు = ముల్లు వంటివాడు; బాధపెడుతున్న వాడు; ఐ = అయి; తన్నుచున్న = తన్నుచున్న; రాజ = రాజు యొక్క; లక్షణ = లక్షణములు; ముద్రితుండు = గుర్తులు కలవాడు; అయిన = అయినట్టి; శూద్రునిన్ = శూద్రుని; చూచి = చూసి; సువర్ణ = బంగారు; పరికర = ఉపకరణములు కల, మంచ కల; స్యందన = రథమును; ఆరూఢుండు = ; ఎక్కినవాడు; అగున్ = అయినట్టి; అభిమన్యునందనుండు = పరీక్షిత్తు; కోదండంబు = విల్లు; సగుణంబు = అల్లెత్రాడు కట్టబడినదిగా {గుణము – అల్లెత్రాడు}; చేసి = చేసి; మేఘ = మేఘముల యొక్క; గంభీర = గంభీరమైన; రవంబులు = ధ్వనులు కలవి; అగు = అయిన; వచనంబులన్ = మాటలతో; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఈ విధంగా తన కంటి ముందే ఆ ధేను వృషభాలను రెంటినీ వెంటబడి తన్నుతున్న జగత్కంటకుడైన ఆ శూద్రుణ్ణి పరికించి, కాంచన రథారూఢుడై ఉన్న పరీక్షిన్నరేంద్రుడు విల్లెక్కు పెట్టి మేఘ గంభీర భాషణాలతో ఇలా అన్నాడు.

1-416-శా.

"నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో? కదిసెనో? నిర్భీతివై గోవులం
దన్నం గారణ మేమి? మద్భుజసనాథక్షోణి నే వేళలం
దున్నేరంబులు సేయ రా; దెఱుఁగవా? ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొనర్చి దెవ్వఁడవు? నిన్ శాసించెదన్ దుర్మతీ!

టీక:- నిన్నున్ = నిన్ను; కొమ్ములన్ = కొమ్ములతో; చిమ్మెనో = చిమ్మెనో {చిమ్ముట – కొమ్ములతో పొడిచి దూరముగ తోయుట}; కదిసెనో = సమీపించెనో, మీదికి వచ్చెనో; నిర్భీతివి = భయము లేనివాడవు; ఐ = అయి; గోవులన్ = గోవులను – అవు ఎద్దులను; తన్నన్ = తన్నుటకు; కారణము = కారణము; ఏమి = ఏమిటి; మత్ = నా యొక్క; భుజ = భుజముల; సనాథ = అండ కలిగిన; క్షోణిన్ = రాజ్యము నందు; ఏ = ఏ; వేళలు = సమయము; అందున్ = అందు; నేరంబులున్ = అపరాధములను; సేయరాదు = చేయరాదు; ఎఱుఁగవా = తెలియవా; ధూర్తత్వమున్ = మోసముతో; భూమిభృత్ = రాజరికపు {భూమిభృత్ - భూమికిభర్త, రాజు};

సన్నాహంబున్ = ఆటోపములు, యత్నములు; ఒనర్చెదు = చేసెదవు; ఎవ్వఁడవు = ఎవరవు; నిన్ = నిన్ను; శాసించెదన్ = శిక్షించెదను; దుర్మతీ = దుర్బుద్ధి కలవాడా.

భావము:- "ఎవడవురా నువ్వు? నిన్ను కొమ్ములతో చిమ్మలేదే; నీ మీదికి రాలేదే; ఏ పాపమూ ఎరుగని ఈ గోవులను భయం లేకుండా తన్నా వెందుకురా? నా భుజదండం సంరక్షించే ఈ మహీమండలంలో ఏ వేళా నేరాలు చేయకూడదని తెలియదా? దుర్బుద్ధితో రాజవేషాన్ని ధరించి రాజసం ఒలకబోస్తున్న ధూర్తుడా! నిన్ను కఠినంగా శిక్షిస్తాను.

1-417-క.

గాండీవియుఁ జక్రియు భూ

మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడవై

దండింపఁ దగనివారల

దండించెదు నీవ తగుదు దండనమునకున్."

టీక:- గాండీవియున్ = అర్జునుడును {గాండీవి - గాండీవము కలవాడు, అర్జునుడు}; చక్రియు = కృష్ణుడును; భూమండలిన్ = భూలోకమును; పెడఁబాసి = వదిలివేసి; చనినన్ = చనగా, వెళ్ళిపోగా; మద = మదముతో; మత్తుఁడవు = మత్తెక్కినవాడవు; ఐ = అయి; దండింపన్ = , శిక్షించుటకు; తగని = యుక్తము కాని; వారలన్ = వారిని; దండించెదు = దండించెదవు, శిక్షించెదవు; నీవ = నీవె; తగుదు = తగినవాడవు; దండనమున = , శిక్షింపబడుట; కున్ = కు.

భావము:- గాండీవధారి అయిన అర్జునుడూ, చక్రధారి అయిన శ్రీకృష్ణుడూ ఈ భూమండలాన్ని విడిచి వెళ్లారనే ధీమాతో మదోన్మత్తుడవై దండింపతగని సాధువులను దండిస్తున్న నీకు ప్రచండమైన రాజదండన తప్పదు."

1-418-వ.

అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె.

టీక:- అని = అని; వృషభంబున్ = ఎద్దును; ఉద్దేశించి = గురించి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అని పలికి పరీక్షన్మహారాజు వృషభరాజాన్ని చూసి ఇలా అన్నాడు-

1-419-మ.

"కురుధాత్రీశ్వర బాహు వప్ర యుగళీ గుప్తక్షమా మండలిం

బరికింపన్ భవదీయ నేత్ర జనితాంభశ్శ్రేణిఁ దక్కన్, జనుల్

దొరఁగం జేయ రధర్మ సంజనిత జంతుశ్రేణిబాష్పంబులన్,

గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తిదేవోత్తమా!

టీక:- కురు = కురువంశపు; ధాత్రీశ్వర = రాజు యొక్క {ధాత్రీశ్వరుడు – ధాత్రికి ఈశ్వరుని, రాజు}; బాహు = చేతులనే; వప్ర = కోటల; యుగళీ = జంటచేత; గుప్త = రక్షింపబడు; క్షమా = రాజ్యము లోని; మండలిన్ = ప్రదేశము నందు – రాజ్యములో; పరికింపన్ = చూడగా; భవదీయ = నీయొక్క; నేత్ర = కన్నులో; జనిత = జనించిన, పుట్టిన; అంభ = నీటి; శ్రేణిన్ = జాలువారుటను; తక్కన్ = తప్పించి; జనుల్ = ప్రజలు; తొరఁగన్ = స్రవించునట్లు; చేయరు = చేయరు; అధర్మ = అధర్మముగ; సంజనిత = జనించిన – పుట్టిన; జంతు = జంతువుల; శ్రేణి = సమూహముల; బాష్పంబులన్ = కన్నీటిని; గురు = గొప్ప; శక్తిన్ = బలముతో, సామర్థ్యముతో; విదళింతున్ = ఖండించివేసేదను; చూడుము = చూడుము; ఇతనిన్ = వీనిని; గో = ఆవు; మూర్తి = రూపమున ఉన్న; దేవ = దేవతలలో; ఉత్తమా = ఉత్తమా.

భావము:- "ఓ వృషభ రూపంలో ఉన్న ధర్మదేవా! కురువంశీయులైన నరేంద్రుల బాహుదండాలనే కోటగోడల నడుమ సురక్షితమైన ఉన్న ఈ ధరాచక్రంలోని జనులు, నీ కనుల వెంట స్రవించే బాష్పధారలు తప్ప అధర్మబాధితులైన ఏ యితర జీవుల కన్నీరు ఇంతవరకు చూసి ఎరుగరు. ఇదిగో చూడు! నా అవక్రపరాక్రమంతో ఈ దురాత్ముణ్ణి చించి చెండాడుతాను.

1-420-క.

జాలిఁ బడ నేల? నా శర
జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్
భూలోకంబున నిపుడే
నాలుగు పాదముల నిన్ను నడిపింతుఁ జుమీ.

టీక:- జాలిన్ = విచారములో; పడన్ = పడుట; ఏల = ఎందులకు; నా = నాయొక్క; శర = బాణముల; జాలంబుల = సమూహములకి; పాలు = వశము; చేసి = చేసి; చంపెద = సంహరించెద; వీనిన్ = వీనిని; భూలోకంబునన్ = భూలోకములో; ఇపుడే = ఇప్పుడే; నాలుగు = నాలుగు; పాదములన్ = కాళ్ళమీద; నిన్ను = నిన్ను; నడిపింతున్ = నడిపించెదను; చుమీ = చూడుమీ.

భావము:- ఓ ధర్మస్వరూపా! దిగులు పడబోకు, నా వాడితూపులతో ఈ పాపాత్ముణ్ణి రూపుమాపుతాను. నిన్ను ఇప్పుడే ఈ భూమి మీద మళ్లీ నాలుగు పాదాలతో నడిపించుతాను.

★1-421-ఉ.

వాచవియైన గడ్డిఁ దిని, వాహిను లందు జలంబు ద్రావఁగా,
నీ చరణంబు లెవ్వఁ డిటు నిర్దళితంబుగఁ జేసె? వాఁడు దా
ఖేచరుఁడైన, వాని మణి కీలిత భూషణ యుక్త బాహులన్
వేచని త్రుంచివైతు వినువీథికి నేగిన నేల డాఁగినన్."

టీక:- వాచవి = నోటికి రుచి; ఐన = అయినట్టి; గడ్డిన్ = గడ్డిని; తిని = తిని; వాహినులు = నదులు కాలువలు; అందున్ = అందు; జలంబున్ = నీరు; త్రావఁగా = తాగుచుండగ; నీ = నీ యొక్క; చరణంబులు = పాదములను; ఎవ్వఁడు = ఎవడు; ఇటు = ఈ విధముగ; నిర్దళితంబుగన్ = ఖండితముగ; చేసెన్ = చేసెను; వాఁడు = వాడు; తాన్ = తాను; ఖేచరుఁడు = ఆకాశమున తిరుగు వాడు; ఐన = అయినప్పటికిని; వాని = వాని యొక్క; మణి = రత్నములు; కీలిత = చెక్కిన; భూషణ = అలంకారములతో; యుక్త = కూడిన; బాహువులన్ = చేతులను; వే చని = శీఘ్రముగ వెళ్ళి; త్రుంచి = ఖండించి; వైతున్ = వేయుదును; విను = ఆకాశ; వీథి = మార్గము; కిన్ = కు; ఏగినన్ = వెళ్ళిన; నేలన్ = నేలలో; డాఁగినన్ = దాగికొనినను.

భావము:- నోటికి రుచించిన గడ్డి పరకలు తిని, కాలవల్లో నీళ్ళు తాగి బతికే సాధు జీవివైన నీ పాదాలను ఇలా ఎవడు నరికేసాడు. వాడు ఆకాశంలో తిరిగే వాడైనా సరే వెంటనే వెళ్ళి వాడి చేతులు మణికంకణాదులుతో సహా నరికి పారేస్తాను. వాడిని వదలను. వాడు నింగికి ఎగిరిపోయినా, నేలలో దూరిపోయినా సరే వదలనే వదలను."

(భూదేవి ధర్మదేవతలు గో వృషభ రూపాలలో ఒక చోట గడ్డి మేస్తున్నాయి. కలికాలం ప్రవేశించటం వల్ల, ఇద్దరు దీనంగా ఉన్నారు. పైగా ధర్మదేవత ఒంటికాలిమీద ఉంది. ఇంతలో కలిపురుషుడు వచ్చి ఇద్దరిని చితక తన్నుతున్నాడు. పరీక్షిత్తు విధివశాత్తు ఇదంతా చూసాడు. కోపంతో కలిని నిగ్రహిస్తు, గో వృషభ రూపులను ఓదారుస్తు, వృషభ రూపునితో ఇలా అంటున్నాడు.)

## 1-422-వ.

## అని మఱియు గోరూప యయిన భూదేవితో నిట్లనియె.

టీక:- అని = అని; మఱియున్ = ఇంకనూ; గో = ఆవు; రూప = రూపము ధరించినది; అయిన = అయినట్టి; భూదేవి = భూదేవి; తోన్ = తో; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అని పలికి పరీక్షిత్తు గోరూపధారిణి అయిన భూదేవితో ఇలా అన్నాడు

## 1-423-చ.

## "అగణితవైభవుం డగు మురాంతకుఁ డక్కట పోయె నంచు నె
## వ్వగలఁ గృశించి నేత్రముల వారికణంబులు దేకు మమ్మ! లో
## బెగడకు మమ్మ! మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు నా
## మగఁటిమిఁ జూడ వమ్మ! వెఱ మానఁ గదమ్మ! శుభప్రదాయినీ!

టీక:- అగణిత = ఎంచుటకు వీలుకాని; లెక్కింపవీలుకాని; వైభవుండు = వైభవము కలవాడు; అగు = అయినట్టి; మురాంతకుడు = కృష్ణుడు {మురాంతకుడు - ముర అను రాక్షసుని సంహరించిన వాడు, కృష్ణుడు}; అక్కట = అయ్యో; పోయెన్ = చనెను; అంచున్ = అనుచును; ఏ = ఏ విధమైన; వగలన్ = శోకముతోను; కృశించి = కృశించిపోయి, చిక్కిపోయి; నేత్రముల = కన్నులలో; వారి = నీటి; కణంబులున్ =

బిందువులను; తేకుము = తీసుకు రాకుము; అమ్మ = తల్లీ; లోన్ = లోలోపల; బెగడకుము = భయపడకు; బెంగపడకు; అమ్మ = తల్లీ; మత్ = నా యొక్క; విశిఖ = బాణముల; బృందములన్ = సమూహములచేత; వృషలున్ = పాపాత్ముని; వధింతున్ = సంహరించుదును; నా = నా యొక్క; మగఁటిమిన్ = మగతనమును, శౌర్యమును; చూడవమ్మ = చూడుము తల్లీ; వెఱ = భయపడుట; మానన్ = మానవలసినది; కద = కదా; అమ్మ = తల్లీ; శుభ = శుభములను; ప్రదాయినీ = ఇచ్చేదానా.

భావము:- "అమ్మా! అనంత వైభవోపేతుడైన శ్రీకృష్ణుడు ఈ లోకాన్ని వదలి వెళ్ళిపోయాడనే ఆవేదనతో కృశించి కన్నీరు మున్నీరుగా ఏడువకు. మనస్సులో దిగులు పెట్టుకోబోకు, కల్యాణదాయిని వైన నిన్ను తన్నిన ఈ దుర్మార్గుణ్ణి ఇప్పుడే నా బాణాలతో నేల కూలుస్తాను, నా పౌరుషమును, చూడు తల్లీ! భయకంపితవు కాబోకు మమ్మా!

1-424-క.

సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ!

టీక:- సాధువులు = అహింసా మార్గలము; అగు = అయినట్టి; జంతువుల = ప్రాణుల; కున్ = కు; బాధలున్ = బాధలు; కావించు = కలుగజేయు, పెట్టు; ఖలుల = దుష్టులను; భంజింపని = భంజకము చేయని, ఖండించని; రాజ = రాజులలో; అధముని = అధముని, నీచుని; ఆయున్ = ఆయుష్షు; స్వర్గ = స్వర్గసుఖములు; శ్రీ = సిరి, శోభ; ధనములు = విత్తములు; వీటిఁబోవున్ = వ్యర్థమగుట; సిద్ధము = సిద్ధించును, తప్పదు; తల్లీ = తల్లీ.

భావము:- సాధులయిన జీవులను బాధించే దుర్మార్గులను రాజైనవాడు అవశ్యం శిక్షించాలి. అలా శిక్షించకుండా ఉపేక్షించిన రాజాధముని జీవితమూ, ఆయుస్సూ, ఐశ్వర్యమూ, సర్వం వ్యర్థం. ఈ మాట ముమ్మాటికీ యథార్థం తల్లీ!

1-425-క.

దుష్టజననిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్
స్రష్ట విధించెఁ, బురాణ
ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ!"

టీక:- దుష్ట = దుష్టులైన – చెడ్డవారైన; జన = ప్రజలను; నిగ్రహంబును = అదుపులోపెట్టుటయు – శిక్షించుటయు; శిష్ట = శిష్టులైన – మంచివారైన; జన = ప్రజలను; అనుగ్రహంబున్ = పాలించుటయు, రక్షించు

టయు; చేయఁగన్ = చేయుటకు; నృపులన్ = రాజుని {నృపుడు – నరపతి, రాజు}; స్రష్ట = బ్రహ్మదేవుడు {స్రష్ట – సృష్టించువాడు, బ్రహ్మ}; విధించెన్ = నియమించెనని; పురాణ = పురాణములను; ద్రష్టలున్ = దర్శించినవారు; సెప్పుదురు = చెప్పుదురు; పరమ = అతిముఖ్యమైన; ధర్మము = ధర్మము, విధి; సాధ్వీ = సాధు శీలము కలదానా.

భావము:– సాధ్వీమణివైన పృథ్వీ! దుష్టులను శిక్షించటం కోసం శిష్టులను రక్షించటం కోసమే భగవంతుడైన బ్రహ్మదేవుడు రాజులను సృష్టించాడని శాస్త్రవేత్తలు చెబుతారు. కనుక ఇప్పుడు రాజునైన నాకు ఆర్తరక్షణం అన్నది పరమధర్మం.”

## 1-426-వ.

## అనిన ధర్మనందనపౌత్రునకు వృషభమూర్తి నున్న ధర్మదేవుం డిట్లనియె.

టీక:– అనిన = అనగా; ధర్మనందనపౌత్రున = పరీక్షిత్తు {ధర్మనందనపౌత్రుడు – యమధర్మరాజు పుత్రుని మనుమడు, పరీకిన్మహారాజు}; కున్ = కి; వృషభ = ఎద్దుయొక్క; మూర్తిన్ = రూపమున; ఉన్న = ఉన్నటువంటి; ధర్మదేవుండు = ధర్మదేవత; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను;

భావము:– ఇలా పలికిన ధర్మనందనుని మనుమడైన పరీక్షిన్నరేంద్రునితో వృషభరూపంలో ఉన్న ధర్మదేవుడు ఇలా అన్నాడు–

## 1-427-ఉ.

## "క్రూరులఁ జంపి సాధువులకున్ విజయం బొనరించు నట్టి యా
## పౌరవవంశజాతుఁడవు భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ
## వా రిటువంటివా రగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్యసం
## చారము సేసెఁ గాదె నృపసత్తమ! భక్తిలతానిబద్ధుఁడై.

టీక:– క్రూరులన్ = క్రూరులను; చంపి = సంహరించి; సాధువుల = మంచివారి; కున్ = కి; విజయంబున్ = జయమును; ఒనరించునట్టి = కలుగ చేయునట్టి; ఆ = ఆ; పౌరవ = పురువు యొక్క; వంశ = వంశమునందు; జాతుఁడవు = జన్మించినవాడవు; భాగ్యసమేతుఁడవు = భాగ్యవంతుడవు; ఔదు = అయి ఉన్నావు; తొల్లి = పూర్వము; మీ = మీ; వారు = వాళ్ళు; ఇటువంటి = ఇటువంటి; వారు = వారు; అగుటన్ = అగుట వలన; వారిజనేత్రుఁడు = కృష్ణుడు {వారిజనేత్రుఁడు – పద్మముల వంటి నేత్రములు ఉన్న వాడు, కృష్ణుడు}; మెచ్చి = మెచ్చుకొని; దౌత్య = దూతగా; సంచారమున్ = వ్యవహరించుట; సేసెన్ = చేసెను; కాదె = కాదా ఏమిటి; నృపసత్తమ = పరీక్షిన్మహారాజ {నృపసత్తమ – నరులను పాలించు వారిలో శ్రేష్ఠుడు — మహారాజ, పరీక్షిత్తు}; భక్తి = భక్తి అనే; లతా = లతలచే; నిబద్ధుఁడు = చక్కగా బంధింప బడువాడు; ఐ = అయి.

భావము:– “నరనాథ శిరోమణీ! దుర్జనులను నిగ్రహించి, సజ్జనులను అనుగ్రహించే పురువంశంలో పుట్టిన ధర్మమూర్తులు కనుకనే భగవంతుడైన శ్రీకృష్ణుడు మీ వారి భక్తి శ్రద్ధలకు మెచ్చి దూతయై రాయబారాలు నడిపాడు.

1-428-వ.

నరేంద్రా! యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము; మా వలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేడు; వాది వాక్య భేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబునాచ్ఛాదించి, తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభు వని చెప్పుదురు; దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు; లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; ఇందెవ్వరికిని సుఖదుఃఖ ప్రదానంబు సేయ విభుత్వంబు లేదు; పరుల వలన దుఃఖంబువచ్చిన నధర్మంబు పరులు సేసి రని విచారింప వలదు; తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు"ననిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుం డిట్లనియె.

టీక:- నరేంద్ర = రాజా {నరేంద్రుడు - నరులకు ఇంద్రుడు, రాజు}; ఏము = మేము; ప్రాణులు = జీవులు; కున్ = కు; దుఃఖ = దుఃఖము కలుగుటకు; హేతువులము = కారణభూతులము; కాము; మా; వలనన్ = వలన; దుఃఖంబు = బాధను; ఒందెడు = పొందెడు; పురుషుండు = మానవుడు; లేడు; వాది = వాదించువారి; వాక్య = మాటల, వాదనలలో; భేదంబులన్ = వ్యత్యానుసారము, తేడానుబట్టి; యోగీశ్వరులు = యోగులలో శ్రేష్ఠులు; మోహితులు = మోహింపబడినవారు – భ్రమలో పడినవారు; ఐ = అయి; భేదంబున్ = భేద భావమును; ఆచ్ఛాదించి = ఆపాదించి {ఆచ్ఛాదించి - ఆపాదించి, లేనిది ఉన్నట్లు చెప్పు ఆరోపణ}; తమ; కున్ = కు; ఆత్మ = ఆత్మయే; సుఖదుఃఖంబులన్ = సుఖదుఃఖంబులను; ఇచ్చు = ఇచ్చెడి; ప్రభువు = అధికారి {ప్రభువు - ప్రభుత్వము కలవాడు, అధికారి}; అని = అని; చెప్పుదురు = చెప్పదురు; దైవజ్ఞులు = జ్యోతిష్కులు {దైవజ్ఞులు - గ్రహములను అధ్యయనము చేయువారు, జ్యోతిష్కులు}; గ్రహదేవత = గ్రహ అధి దేవతలు; ఆదులు = మొదలగు వాని; కున్ = కి; ప్రభుత్వంబున్ = అధికారమును; సంపాదింతురు = చూపుదురు; మీమాంసకులు = మీమాంసకులు {మీమాంసకులు - పూర్వ మీమాంస యను మార్గానువర్తులు}; కర్మంబు = కర్మలు; కున్ = కే; ప్రాభవంబున్ = ప్రభావము ఉన్నదని; ప్రకటింతురు = చెప్పుదురు; లోకాయతికులు = లోకాయతికులు {లోకాయతికులు - స్వభావమును అనుసరించి లోకములు ప్రాప్తించుననెడి వారు}; స్వభావంబు = స్వభావము; కున్ = నకు; ప్రభుత్వంబు = అధికారము; సంపాదింతురు = చూపుదురు; ఇందు = ఇందులో; ఎవ్వరు = ఏ ఒక్కరు; కిన్ = కిను; సుఖదుఃఖ = సుఖదుఃఖములను; ప్రదానంబున్ = ఇచ్చుటను; చేయు = చేయ; విభుత్వంబు = అధికారము; లేదు = లేదు; పరుల = ఇతరుల; వలనన్ = వలన; దుఃఖంబు = దుఃఖము; వచ్చినన్ = వచ్చినట్లయినను; అధర్మంబు = అధర్మమును; పరులు = ఇతరులు; సేసిరని = చేసిరని; విచారింపన్ = బాధపడుట; వలదు = చేయ వద్దు; తర్కింపను = ఊహించుటకును; నిర్దేశింపను = నిర్ణయించుటకును; రాని = సాధ్యముకాని; పరమేశ్వరుని = భగవంతుని; వలనన్ = వలన; సర్వంబున్ = సర్వమున, సమస్తమును; అగుచున్ = అవుతూ; ఉండును =

ఉండును; అనిన = అనగా; ధర్మదేవుడు = ధర్మదేవత; కిన్ = కి; ధర్మనందనపౌత్రుండు = పరీక్షిత్తు {ధర్మనందన పౌత్రుడు – యమధర్మరాజు పుత్రుని మనుమడు, పరీక్షిత్తు}; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:– రాజేంద్రా! మేము ఇతర ప్రాణులను బాధ పెట్టేవాళ్లం కాము. మా మూలంగా ఏ ప్రాణికీ ఎటువంటి ఆపదాకలుగదు. నానావిధాలైన వాదోపవాదాలకుసమ్మోహితులైన యోగీశ్వరులు ఆత్మయే సుఖదుఃఖాలు కల్పించే ప్రభువంటారు. దైవజ్ఞులు గ్రహాలకూ, దేవతలకూ ప్రభుత్వాన్ని ఆపాదిస్తారు; మీమాంసకులు కర్మానికే ప్రాభవం అంగీకరిస్తారు; లోకాయతికులు స్వభావానికి ప్రభుత్వం కట్టబెడతారు; కాని వారు చెప్పేవారిలో ఎవ్వరికీ సుఖదుఃఖాలను ఇచ్చే సామర్థ్యం లేదు; ఎవరి వల్లనో తమకు దుఃఖం కలిగిందనీ, ఎవరో తమకు ఎగ్గు చేశారనీ అనుకోవటం పొరపాటు. బుద్ధికీ మనస్సుకీ అతీతుడైన పరమేశ్వరుని వల్లనే సమస్తమూ జరుగుతుంది." అని పలికే ధర్మదేవునితో ధర్మరాజు పౌత్రుడైన పరీక్షిత్తు ఇలా అన్నాడు....

1-429-ఆ.

"ధర్మమూర్తివయ్య ధర్మజ్ఞ! వృషరూప!
పరమధర్మ మీవు పలుకు త్రోవ,
పాపకర్ము చేయు పాపంబు సూచింపఁ
బాపకర్ముఁ డేఁగు పథము వచ్చు.

టీక:– ధర్మ = ధర్మమము; మూర్తివి = మూర్తీభవించిన వాడవు; అయ్య = తండ్రీ; ధర్మ = ధర్మము యొక్క; జ్ఞ = జ్ఞానము కలవాడవు; వృష = ఎద్దు యొక్క; రూప = రూపమున ఉన్నవాడా; పరమ = ఉత్తమమైన; ధర్మము = ధర్మము; ఈవు = నీవు; పలుకు = చెప్పు; త్రోవ = విధానము, విషయము; పాప = పాపమును; కర్ము = చేయువాడు, పాపి; చేయు = చేయు; పాపంబున్ = పాపమును; సూచింపన్ = తెలియజేయగా; పాప = పాప; కర్ముడు = కర్మము చేయువాడు, పాపి; ఏఁగు = వెళ్ళు; పథము = లోకము; వచ్చున్ = కలుగును.

భావము:– "వృషభ రూపంలో ఉన్న ధర్మదేవా! నీవు ధర్మమూర్తివి. ధర్మజ్ఞుడవు. నీ పలకుల తీరు పరమధర్మంగా ఉంది. పాపకర్మలు చేసేవాని పాపాన్ని ప్రకటించేవారు ఆ పాపి పోవు లోకానికే పోతారు.

1-430-వ.

మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మానసంబులకు వధ్యఘాతుక లక్షణం బగు వృత్తి సులభంబునం దెలియ రాదు; నీవుధర్మదేవతవు; కృతయుగంబునం దపశ్శౌచదయాసత్యంబు లనునాలుగు నీకు బాదంబు లని చెప్పుదురు; త్రేతాయు గంబునఁ బూర్వోక్త పాదచతుష్కంబు నందొక్క పాదంబు క్షీణంబయ్యె; ద్వాపరం బునం పాద ద్వయంబు నశించెం గలియుగం బందు నివ్వడువుననిప్పుడు నీకుఁ

బాదత్రయంబుభగ్నంబయ్యె నవశిష్టంబగు, భవదీయచతుర్థపాదంబున ధర్మంబు గల్యంతంబున నిగ్రహింప గమకించుచున్నయది విను మదియునుం గాక.

టీక:- మఱియున్ = ఇంకను; దేవ = దేవుని; మాయ = మాయ; వలనన్ = వలన; భూతంబుల = జీవుల యొక్క; వాక్ = వాక్కునకు – బయటపడినదానికి; మానసంబుల = మనస్సుల – లోపల ఉన్నదాని; కున్ = కిని; వధ్య = వధింపబడు – దెబ్బ తిను; ఘాతుక = ఘాతముచేయు – దెబ్బ తీయు; లక్షణంబు = లక్షణము కలది; అగు = అయినట్టి; వృత్తి = ప్రవర్తన; సులభంబునన్ = సులభముగ; తెలియరాదు = తెలిసికొనుటకు సాధ్యముకాదు; నీవు = నీవు; ధర్మదేవతవు = ధర్మదేవతవు; కృతయుగంబునన్ = కృతయుగములో; తపస్ = తపస్సును; శౌచ = శౌచమును; దయ = దయయు; సత్యంబులు = సత్యమును; అను = అనే; నాలుగు = నాలుగు (4); నీకు = నీకు; పాదంబులు = కాళ్ళు; అని = అని; చెప్పుదురు = అందురు; త్రేతా = త్రేత అను; యుగంబునన్ = యుగములో; పూర్వ = ముందు; ఉక్త = చెప్పిన; పాద = కాళ్ళు; చతుష్కంబునన్ = నాలిగింటను; ఒక్క = ఒకటే (1); పాదంబు = కాలు; క్షీణంబు = నశించుట; అయ్యెన్ = జరిగెను; ద్వాపరంబునన్ = ద్వాపరములో; పాద = కాళ్ళు; ద్వయంబు = రెండు (2); నశించెన్ = నశించినవి; కలి = కలి అను; యుగంబు = యుగము; అందున్ = లోపల; ఈ = ఈ; వడువున = విధముగ; ఇప్పుడు = ఇప్పుడు; నీకున్ = నీకు; పాద = కాళ్ళు; త్రయంబు = మూడు (3); భగ్నంబు = నష్టము; అయ్యెన్ = అయ్యెను; అవశిష్టంబు = మిగిలినది; అగు = అయినట్టి; భవదీయ = నీయొక్క; చతుర్థ = నాలుగవ; పాదంబునన్ = కాలిమీద; ధర్మంబు = ధర్మము; కలి = కలికాలము యొక్క; అంతంబునన్ = అంతములో; నిగ్రహింపన్ = నిగ్రహించుకొనుటకు; గమకించుచు = ప్రయత్నించుచు; ఉన్నయది = ఉన్నది; వినుము = వినుము; అదియునున్ = అంతియే; కాక = కాకుండగ.

భావము:- వాక్కుకూ మనస్సుకూ అతీతమైన దైవమాయవల్ల జీవులకు మధ్యఘాతుక స్వరూపం సులభవేద్యం కాదు. నీవు ధర్మ దేవతవు. కృతయుగంలో నీకు తపం, శౌచం, దయ, సత్యం అనే నాలుగు పాదాలు ఉండేవని చెబుతారు. త్రేతాయుగంలో ఆ నాలుగు పాదాలలో ఒక పాదం భగ్నమయింది. ద్వాపరయుగం రాగానే రెండు పాదాలు లోపించాయి. ఇప్పుడు కలియుగంలో మూడు పాదాలు లుప్తమైపోయి సత్యమనే ఒక్కపాదం మాత్రం మిగిలి ఉంది. ఆ పాదాన్ని కూడా కలియుగాంతంలో అధర్మం ఆక్రమించి భగ్నం చెయ్యాలని కాచుకొని ఉంది. ఇదుగో ఇటు చూడు-

1-431-మ.

భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం దొక్కఁగా
స్థిరయై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందె భూదేవి; త
చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచున్ నిరం
తరశోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ! వీక్షించితే."

టీక:- భరమున్ = భారమును; పాపి = పోగొట్టి; రమావిభుండు = లక్ష్మీపతి, కృష్ణుడు; కరుణన్ = కరుణతో; పాదంబులన్ = పాదములతో; తొక్కఁగాన్ = తొక్కుతుండగ; స్థిర = స్థిరముగ ఉన్నది – స్థిమితముగ

ఉన్నది; ఐ = అయి; వేడుకన్ = వేడుకతో, వినోదముతో; ఇంత = ఇప్పటి; కాలము = వరకు; సుఖ = సుఖ; శ్రీ = సంపదను; ఒందె = పొందెను; భూదేవి = భూదేవి; తత్ = అతని; చరణ = పాదముల; స్పర్శము = స్పర్శ – తాకుట; లేమిన్ = లేకపోవుట వలన; శూద్ర = శూద్రపు; కులజుల్ = కులమున పుట్టిన వారు; శాసింతురు = ఏలెదరు; అంచున్ = అనుచు; నిరంతర = ఎడతెగని; శోకంబునన్ = బాధతో; నీరు = నీరు; కన్నులన్ = కన్నులలో; ఇడెన్ = పెట్టెను; ధర్మ = ధర్మము యొక్క; జ్ఞ = జ్ఞానము కలవాడా; వీక్షించితే = చూసితివా.

భావము:- శ్రీకృష్ణభగవానుడు అవతరించి భూభారం తీర్చాడు. శ్రీకృష్ణదేవుని శ్రీపాదస్పర్శవల్ల భూదేవి పులకించి సుస్థిరానందంతో మైమరిచి పోయింది. ఇప్పుడు భగవంతుని పాదస్పర్శకు దూరమై పాపాత్ము లైనవారు తనమీద పెత్తనం చలాయిస్తారేమో ననే భయంతో కన్నులవెంట బాష్పాలు కారుస్తున్నది. ధర్మస్వరూపా! ఈమెను వీక్షించు."

## 1-432-వ.

**అని యిటు ధరణీధర్మదేవతల బుజ్జగించి, మహారథుండయిన విజయపౌత్రుండు క్రొక్కారుమెఱుంగుచక్కదనంబుఁధిక్కరించి దిక్కులకువెక్కసంబయిన యడి దంబు బెడిదంబుగజడిపించి పాపహేతువయిన కలిని రూపుమాప నుద్యోగిం చిన, వాఁడు రాజరూపంబు విడనాడి, వాడిన మొగంబుతోడ, భయవిహ్వలుండై హస్తంబులు సాఁచి, తత్పాదమూల విన్యస్తమస్తకుండై, ప్రణామంబు సేసి.**

టీక:- అని = అని; ఇటు = ఇటుపక్క; ధరణీ = భూదేవి; ధర్మదేవతలన్ = ధర్మదేవతలను; బుజ్జగించి = సముదాయించి; మహారథుండు = గొప్పరథికుడు {మహారథుడు - పెక్కు రథికులతో యుద్ధము చేయగలవాడు}; అయిన = అయినట్టి; విజయపౌత్రుండు = పరీక్షితు {విజయుపౌత్రుడు – అర్జునుని మనుమడు , పరీక్షితు}; క్రొక్కారు = తొలకరి మబ్బు నందలి; మెఱుంగు = మెరుపు తీగ; చక్కదనంబున్ = చక్కదనమును; ధిక్కరించి = తిరస్కరించి; దిక్కుల = దిక్కుల; కున్ = కు; వెక్కసంబు = దుస్సహము; అయిన = అయినట్టి; అడిదంబున్ = కత్తిని; బెడిదంబుగన్ = భయంకరముగ; జడిపించి = జళిపించి {జడిపించి - జళిపించి, ఆడించు}; పాప = పాపమునకు; హేతువు = కారణము; అయిన = అయినట్టి; కలిని = కలిని; రూపుమాపన్ = సంహరించుటకు; ఉద్యోగించినన్ = సిద్ధపడగా; వాఁడు = వాడు; రాజ = రాజుల యొక్క; రూపంబున్ = రూపమును; విడనాడి = విడిచిపెట్టి; వాడిన = వాడిపోయిన; మొగంబు = ముఖము; తోడన్ = తో; భయ = భయముతో; విహ్వలుండు = విహ్వలుడు {విహ్వలుడు - అవయవముల పట్టు తప్పినవాడు}; ఐ = అయి; హస్తంబులున్ = చేతులను; సాఁచి = చాచి; తత్ = అతని; పాదమూల = కాలి పాదములందు; విన్యస్త = ఉంచబడిన; మస్తకుండు = తల కలవాడు; ఐ = అయి; ప్రణామంబున్ = నమస్కారమును; చేసి = చేసి.

భావము:- ఈ విధంగా పరీక్షిన్నహారాజు ధరణినీ, ధర్మదేవుణ్ణీ ఊరడించాడు. మహారథుడూ, అర్జునుని మనుమడూ అయిన ఆ వీరాగ్రేసరుడు తొలకరి మెరుపుతీగలా తళ తళ మెరుస్తూ కళ్లకు మిరుమిట్లు గొలిపే దుస్సహమైన తన ఖడ్గాన్ని భయంకరంగా జళిపించి, పాపాత్ముడైన కలిని రూపుమాపాలని

నిశ్చయించాడు. అప్పుడు తననుసంహరించటానికి ఉద్యుక్తుడైన మహారాజునుచూసి, కలి రాజచిహ్నాలన్నీ విడిచి, వడలినవదనంతో గడగడలాడుతూ భయవిహ్వలుడై ఆరాజుపాదాలమీదపడి సాష్టాంగనమస్కారం చేసి

1-433-క.

"కంపించె దేహ మెల్లం,
జంపకు మో! రాజతిలక! శరణాగతు ర
క్షింపు" మని, తనకు మ్రొక్కినఁ
జంపక కలిఁ జూచి నగచు జనపతి పలుకున్.

టీక:- కంపించె = వణుకు తున్నది; దేహము = శరీరము; ఎల్లన్ = అంతయు; చంపకుము = చంపవద్దు; ఓ = ఓ; రాజ = రాజులలో; తిలక = శ్రేష్ఠుడా; శరణు = శరణము వేడి; ఆగతున్ = వచ్చిన వానిని; రక్షింపుము = రక్షింపుము; అని = ని; మ్రొక్కినన్ = ప్రార్థించగా; చంపక = చంపకుండ; కలిన్ = కలిని; చూచి = చూసి; నగచు = నవ్వుతూ; జనపతి = జనులకు పతి, రాజు; పలుకున్ = పలికెను.

భావము:- "ఓ నృపాలతిలకా! భయంతో నా దేహమంతా కంపిచి పోతున్నది. నన్ను చంపవద్దు, నీ చరణాలను శరణు వేడుతున్నాను. నన్ను కరణించు" అని మ్రొక్కాడు. పరీక్షిత్తు కలిపురుషుణ్ణి చంపకుండా క్షమించి ఇలా మందలించాడు...

1-434-క.

"అర్జునకీర్తిసమేతుం,
డర్జునపౌత్రుండు, భయర సావృత జనులన్
నిర్జితులఁ జంప నొల్లడు;
దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా!

టీక:- అర్జున = స్వచ్ఛమైన; కీర్తి = కీర్తి; సమేతుండు = కలిగినవాడు; అర్జున = అర్జునుని; పౌత్రుండు = మనుమడు; భయ = భయము అను; రస = రసముతో; ఆవృత = ఆవరించిన; జనులన్ = మానవులను; నిర్జితులన్ = జయములేని వారిని, ఓడినవారిని; చంపన్ = చంపుటకు; ఒల్లడు = ఒప్పుకొనడు; దుర్జన = చెడ్డవారి; భావంబున్ = భావమును; విడిచి = వదలి; తొలఁగు = దూరముగ పొమ్ము; దురాత్మా = చెడ్డ స్వభావము కలవాడా.

భావము:- "ఓయీ! అత్యంత నిర్మలయశోవిశాలుడైన అర్జునుని అనుగు మనుమడు ఓడి, ధైర్యం వీడి, దోసిలొగ్గిన వారిని వధింపడు. ఇక నీ ధూర్తస్వభావాన్ని విడిచి దూరంగా తొలగిపో దుర్మార్గుడా!

1-435-వ.

నీవు పాపబంధుండవు, మదీయబాహుపాలితం బయిన మహీ మండలంబున నిలువవలవదు; రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్య, లోభ, చౌర్య, దౌర్జన్య, దురాచార, మాయాకలహ, కపట, కలుషాలక్ష్మ్యాది, ధర్మేతర సమూహంబు లాశ్రయించు; సత్యధర్మంబు లకు నివాసం బగు బ్రహ్మావర్త దేశంబున యజ్ఞ విస్తార నిపుణులయినవారు యజ్ఞేశ్వరుం డయిన హరిం గూర్చి యాగంబు సేయచున్న వారు, యజించువారలకు సుఖప్రదాయనంబు సేయుచు, సకలభూతాంతర్యామి యై భగవంతుడయిన హరి జంగమ స్థావరంబులకు నంతరంగ బహిరంగముల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబున మనోరథంబుల నిచ్చుం; గావున, నీ విందుండ వలవ"దనుచు దండహస్తుండయిన జమునికైవడి మండ లాగ్రంబు సాఁచిన రాజవర్యునకుం గలి యిట్లనియె.

టీక:- నీవు = నీవు; పాప = పాపమునకు; బంధుండవు = బంధువువి; మదీయ = నా యొక్క; బాహు = భుజములచే; పాలితంబు = పాలింపబడుతున్నది; అయిన = అయినట్టి; మహీ = భూ; మండలంబునన్ = మండలములో; నిలువ = ఉండ; వలదు = వద్దు; రాజ = రాజువంటి; దేహంబు = దేహధారణ; అందున్ = అందు; వర్తించు = ఉండు; నిన్నున్ = నిన్ను; అసత్య = అసత్యము, అబద్ధము; లోభ = లోభము; పిసినారి తనము; చౌర్య = చౌర్యము, దొంగతనము; దౌర్జన్య = దౌర్జన్యము, చెడ్డతనము; దురాచార = చెడు ఆచారము; మాయా = మోసముతోకూడిన; కలహ = కలహము, దెబ్బలాట; కపట = కపటము, మోసము; కలుష = కలుషము, పాపము; అలక్ష్మి = దౌర్భాగ్యము; ఆది = మొదలగు; ధర్మ = ధర్మమునకు; ఇతర = వ్యతిరేకమైన లక్షణముల; సమూహంబులు = గుంపులు; ఆశ్రయించున్ = చేరి ఉండును; సత్య = సత్యము; ధర్మంబులు = ధర్మములు; కున్ = కు; నివాసంబు = ఇల్లు; అగు = అయినట్టి; బ్రహ్మావర్త = బ్రహ్మావర్తన; దేశంబునన్ = దేశమున; యజ్ఞ = యజ్ఞమును; విస్తార = విస్తరించుటలో – బాగుగ చేయించుటలో; నిపుణులు = మంచి నేర్పు కలవారు; అయిన = అయినట్టి; వారు = వారు; యజ్ఞ = యజ్ఞమునకు; ఈశ్వరుండు = ఈశ్వరుడు, అధిపతి; అయిన = అయినట్టి; హరిన్ = హరిని; భగవంతుని; గూర్చి = గురించి; యాగంబున్ = యజ్ఞము; సేయుచు = చేయుచూ; ఉన్నవారు = ఉన్నారు; యజించు = యజ్ఞము చేయు; వారల = వారి; కున్ = కి; సుఖ = సుఖమును; ప్రదాయనంబు = ప్రసాదించుట, కలుగజేయుట; చేయుచు = చేయుచు; సకల = సమస్త; భూత = భూతముల; జీవుల; అంతర్ = లోపల; యామి = చరించువాడు; ఐ = అయి; భగవంతుడు = భగవంతుడు; అయిన = అయినట్టి; హరి = హరి; జంగమ = జంతువులు, పక్షులు {జంగమములు – కదలిక ఉన్న జీవులు, జంతువులు}; స్థావరంబుల = చెట్లు {స్థావరములు – కదలికలేని జీవులు, చెట్లు}; కున్ = కును; అంతరంగ = అంతరంగముల, లోపల; బహిరంగములన్ = బహిరంగమున; బయట; సంచరించు = వర్తించు; కదులు; వాయువు = గాలి; చందంబునన్

= వలె; ఆత్మ = తన యొక్క; రూపంబునన్ = రూపమున; మనోరథంబులన్ = మనోకామ్యములను, కోరికలను; ఇచ్చును = ఇచ్చును; కావున = అందుచేత; నీవు = నీవు; ఇందు = ఇక్కడ; ఉండన్ = ఉండుటకు; వలవదు = వీలులేదు; అనుచు = అనుచు; దండ = దండము; హస్తుండు = చేత కలవాడు; అయిన = అయినట్టి; జముని = యముని; కైవడిన్ = వలె; మండలాగ్రంబున్ = ఖడ్గమును; సాఁచినన్ = చాచగా; రాజ = రాజులలో; వర్యుడు = వరించతగినవాడు, శ్రేష్ఠుడు; కున్ = కి; కలి = కలి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- పరమ పాపాత్ముడవైన నీకు నేను పాలించే ఈ భూమండలంలో స్థానం లేదు. రాజవేషధారి వైన నీలో అసత్యం, లోభం, దొంగతనం, దౌర్జన్యం, దురాచారం, మోసం, కలహం, కపటం, కలుషం, దౌర్భాగ్యం మొదలైన అధర్మ గుణాలు గూడుకట్టుకొని ఉన్నాయి. సత్యానికీ ఆలవాలమైన ఈ బ్రహ్మావర్తదేశంలో యజ్ఞవేత్తలైన పెద్దలు యజ్ఞేశ్వరుడైన శ్రీమహావిష్ణువును యజ్ఞాలతో ఆరాధిస్తూ ఉన్నారు. చరాచర ప్రపంచంలో వెలుపలా లోపలా నిండి సంచరించే వాయువులాగా సర్వాంతర్యామి అయిన ఆ స్వామి, వారికి సమస్త శుభాలూ చేకూరుస్తూ వారి కోరికలు తీరుస్తూ ఉంటాడు. అందువల్ల ఈ ప్రదేశంలో నీవు ఉండటానికి వీలులేదు." అని కత్తిని పైకెత్తిన చక్రవర్తితో కలిపురుషుడు ఇలా పలికాడు-

★1-436-క.

"జగదీశ్వర! నీ యడిదము
ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్
బెగడెం జిత్తము గుండెలు
వగిలెడి నిఁక నెందుఁ జొత్తు భావింపఁ గదే.

టీక:- జగత్ = జగత్తునకు; ఈశ్వర = అధిపతీ; నీ = నీ యొక్క; అడిదము = ఖడ్గము; ధగధగిత = ధగధగలాడుతున్న; ప్రభల = కాంతుల; తోడన్ = తో; తఱచుగ = ఎక్కువగ; మెఱయున్ = మెరుయును; బెగడెన్ = భయపడిపోయెను; చిత్తము = మానసము; గుండెలు = గుండెలు; వగిలెడిన్ = పగిలి పోవు చున్నవి; ఇంకన్ = ఇంక; ఎందున్ = ఎందులో; చొత్తు = చొరబడను, దూరను; భావింపఁ గదే = ఆలోచింపుము.

భావము:- "జగత్పతీ! ధగద్ధగిత కాంతులతో మెరుస్తున్న నీ కరకు కరవాలాన్ని చూసి నా గుండెలు పగులు తున్నాయి. నా హృదయం బెదురుతున్నది. ఇప్పుడు నే నెక్కడికి పోయేది. ఎక్కడ ఉండేది నీవే ఆలోచించు.

## ధరణీ ధర్మదేవత లుద్ధరణంబు

1-437-వ.

"నరేంద్రా! నిన్ను నారోపితశరశరాసను సర్వప్రదేశంబు లందును విలోకిం చుచున్నవాడ; నే నెక్కడ నుండుదు నానతిమ్మ"నిన, రాజన్యశేఖరుండు ప్రాణవధ, స్త్రీ, ద్యూత, పానంబు, లనియెడు నాలుగుస్థానంబులనిచ్చి, మఱియునడిగిన సువర్ణమూలంబగు నసత్య, మద,

**కామ, హింసా, వైరంబు, లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితర స్థలంబుల స్పృశియింపకుండ నియమించె; నిట్లు కలినిగ్రహంబు సేసి; హీనంబు లయిన తప, శ్శౌచ, దయలనియెడి మూఁడుపాదంబులు వృషభమూర్తి యయిన ధర్మదేవుని కిచ్చి, విశ్వంభ రకు నిర్భరం బయిన సంతోషంబు సంపాదించి.**

టీక:- నరేంద్రా = రాజా {నరేంద్ర - నరులకు ఇంద్రుడు రాజు}; నిన్నున్ = నిన్ను; ఆరోపిత = ఎక్కుపెట్టిన; శరశరాసను = విల్లంబులు కలవానిగా; సర్వ = సమస్త; ప్రదేశంబులు = స్థలములు; అందునున్ = లోను; విలోకించుచున్ = చూచుచు; ఉన్నవాడ = ఉన్నాడను; నేన్ = నేను; ఎక్కడన్ = ఎక్కడ; ఉండుదున్ = ఉండను; ఆనతి = ఆజ్ఞ; ఇమ్ము = ఇమ్ము; అనిన = అనగా; రాజన్య = రాజులలో, క్షత్రియులలో; శేఖరుండు = శిఖరము వంటివాడు, శ్రేష్ఠుడు; ప్రాణవధ = జీవులను చంపుట; స్త్రీ = స్త్రీలోలత్వమును; ద్యూత = ద్యూతమును, జూదమును; పానంబులు = మద్యపానమును, తాగుడును; అనియెడు = అనెడు; నాలుగు = నాలుగు (4); స్థానంబులన్ = స్థలములను; చోటులను; ఇచ్చి = ఇచ్చి; మఱియున్ = ఇంకను; అడిగిన = అడుగగా; సువర్ణ = బంగారము, విత్తము; మూలంబు = మూలకారణము; అగు = అయిన; అసత్య = అసత్యమును, అబద్ధమును; మద = మదమును, గర్వమును; కామ = అధికమైన ఆసక్తి; హింస = జీవులను బాధించుట; వైరంబులు = కయ్యములు, కలహములు; అనియెడు = అనే; పంచ = ఐదు; ప్రదేశంబులన్ = స్థలములను; ఒసంగి = ఇచ్చి; ఇతర = ఇతర; స్థలంబులన్ = స్థలములను; స్పృశియింపక = ముట్టుకొనక; ఉండన్ = ఉండునట్లు; నియమించెన్ = కట్టడి చేసెను; ఇట్లు = ఈ విధముగ; కలి = కలి యొక్క; నిగ్రహంబు = కట్టడి; చేసి = చేసి; హీనంబులు = క్షీణించినవి; అయిన = అయినట్టి; తపస్ = తపస్సును; శ్శౌచ = శౌచమును; దయలు = దయయు; అనియెడి = అనెడి; మూఁడు = మూడు (3); పాదంబులున్ = కాళ్ళు; వృషభ = ఎద్దు; మూర్తి = రూపమున ఉన్నవాడు; అయిన = అయినట్టి; ధర్మదేవుడు = ధర్మదేవత; కిన్ = కు; ఇచ్చి = ఇచ్చి; విశ్వంభర = విశ్వమును భరించునది, భూదేవి; కున్ = కి; నిర్భరంబు = నిర్భరము, అధికము; అయిన = అయినట్టి; సంతోషంబున్ = సంతోషమును; సంపాదించి = కలిగించి.

భావము:- రాజేంద్రా! ఎటు చూస్తే అటు సర్వత్రా ధనుర్ధరుడవైన నీ రూపమే నా లోచనాలకు గోచరిస్తున్నది. మరి నేను ఎచట తలదాచుకొనేది ఆజ్ఞాపించు" అని అలమటించే కలిపురుషుని ప్రార్థన ఆలకించి పరీక్షిత్తు వానికి "జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ" అనే నాలుగు స్థానాలు ఇచ్చాడు. ఇంకా అతడు అర్థించగా మహారాజు "సువర్ణం" కారణంగా కలుగు అసత్యం, గర్వం, కామం, హింస, వైరం అనే ఇంకా ఐదు స్థానాలు ఇచ్చాడు. ఈ స్థానాలలో తప్ప ఇతర స్థలాలను స్పృశించవద్దని కలిని కట్టడి చేసాడు పరీక్షిత్తు. ఈ ప్రకారం ఆ మహారాజు కలిపురుషుణ్ణి నిగ్రహించి పోగొట్టుకొన్న తపస్సు, శౌచం, దయ అనే మూడు పాదాలూ వృషభమూర్తి అయిన ధర్మదేవతకు అర్పించి భూదేవికి అపారమైన ఆనందాన్ని కలిగించాడు.

★1-438-క.

గజనామధేయపురమున
గజరిపుపీఠమున ఘనుఁడు గలిదమనుం డున్
గజవైరిపరాక్రముఁ డే
గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్.

టీక:- గజనామధేయపురమున = హస్తినాపురమునందు {గజ నామధేయ పురము - గజ (హస్తిన అను) నామధేయ (పేరు కల) పురము (పురము) హస్తినాపురము}; గజరిపుపీఠమున = సింహాసనమున {గజ రిపు పీఠము - గజ (ఏనుగు) రిపు (శత్రువు, సింహము) పీఠము (ఆసనము), సంహాసనము}; ఘనుఁడున్ = గొప్పవాడు; కలి = కలిని; దమనుండున్ = అణచిన వాడును; గజ వైరి పరాక్రముడు = సింహపరాక్రముడు {గజ వైరి పరాక్రముడు — (గజ (ఏనుగు) వైరి (శత్రువు, సింహ) పరాక్రముఁడు (పరాక్రమము కలవాడు, - సింహపరాక్రముడు}; ఏ = ఎట్టి; గజిబిజి = గజిబిజి, గందరగోళం; లేకుండన్ = లేకుండగ; తాల్చెన్ = ధరించెను; గౌ(కౌ)రవ = గౌరవము అను, కౌరవ సామ్రాజ్యం అను; లక్ష్మిన్ = సంపదను.

భావము:- సింహపరాక్రముడు, కలిని నిగ్రహించిన ఘనుడు ఆయిన పరీక్షిత్తు హస్తినాపురంలో సింహాసనాసీను డై కౌరవ రాజ్యలక్ష్మిని గౌరవపూర్వకంగా ప్రశాంతంగా పరిపాలించాడు.

1-439-వ.

ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామ బాణపావకంబు వలన బ్రతికి; వృషభ మూర్తి యయిన ధర్మదేవతకు నభయం బిచ్చిన పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణశాప ప్రాప్త తక్షకాహిభయంబు వలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి, సర్వసంగం బులు వర్జించి శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి, గంగాతరంగిణీ తీరంబునం గళేబరంబువిడిచె వినుఁడు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కృష్ణుని = శ్రీకృష్ణుని; అనుగ్రహంబునన్ = అనుగ్రహము వలన; అశ్వత్థామ = అశ్వత్థామ యొక్క; బాణ = బాణముల; పావకంబు = అగ్ని; వలనన్ = నుండి; బ్రతికి = జీవించి; వృషభ = ఎద్దు; మూర్తి = రూపి; అయిన = అయినట్టి; ధర్మదేవత = ధర్మదేవత; కున్ = కు; అభయంబున్ = అభయము; ఇచ్చిన = ఇచ్చిన; పరీక్షిత్ = పరీక్షిత్తుడు అను; నరేంద్రుండు = నరులకు ఇంద్రుడు; రాజు; బ్రాహ్మణ = బ్రాహ్మణుని యొక్క; శాప = శాపము ద్వారా; ప్రాప్త = కలిగిన; తక్షక = తక్షకుడు అను; అహి = పాము యొక్క; భయంబు = భయము; వలనన్ = వలన; ప్రాణంబులు = ప్రాణములు; వోవున్ = పోవును; అని = అని; ఎఱింగి = తెలిసి; సర్వ = సమస్తమైన; సంగంబులు = బంధములు; వర్జించి = విడిచిపెట్టి; శుకుడు = శుకుడు; కున్ = కి; శిష్యుండు; ఐ = అయి; విజ్ఞానంబున్ = విశిష్టమైన జ్ఞానమును; కలిగి = పొంది; గంగా = గంగ అను; తరంగిణీ = నది యొక్క; తీరంబునన్ = ఒడ్డున; కళేబరంబున్ = శరీరమును; విడిచెన్ = విడిచి పెట్టెను; వినుఁడు = వినుడు.

భావము:- ఈ విధంగా వాసుదేవుని అనుగ్రహం వల్ల అశ్వత్థామ అస్త్రానల జ్వాలలో నుంచి బ్రతికి బయటపడి వృషభరూపంలోని ధర్మ దేవతకు అభయమిచ్చిన పరీక్షిత్తు మునిశాపగ్రస్తుడై, తక్షకుని విషానలజ్వాలల వల్ల మరణం ప్రాప్తిస్తుందన్న సంగతి తెలుసుకొని సర్వసంగ పరిత్యాగియై శుకయోగిని ఆశ్రయించి, పరమార్థాన్ని గ్రహించి, గంగానదీ తీరంలో శరీరాన్ని పరిత్యజించాడు" అని చెప్పి సూతుడు శౌనకునితో ఇంకా ఇలా అన్నాడు.

ఈ భాగవతాన్ని పారీక్షితం అని కూడా చెప్తారు. ఎందుకంటే భాగవత పురాణం, పరీక్షిత్తు అడుగగా, పరీక్షిత్తు ముక్తి పొందడం కోసం, పరీక్షిత్తుకు చెప్పబడింది. అలా కృతకృత్యం అయింది. అట్టి మహానుభావుని జీవితం పుట్టుక నుండి భౌతికదేహం విడవటం వరకు ఈ చిన్న వచనంలో సంక్షిప్తంగా చెప్పబడింది. .

1-440-క.

హరివార్త లెఱుఁగువారికి

హరిపదములు దలఁచువారి కనవరతంబున్

హరికథలు వినెడివారికి

మరణాగతమోహసంభ్రమము లే దనఘా!

టీక:- హరి = హరి యొక్క; వార్తలు = విశేషములు; ఎఱుఁగు = తెలియు; వారు = వారు; కిన్ = కి; హరి = హరి యొక్క; పదములు = పాదములు; తలఁచు = స్మరించు; వారు = వారు; కిన్ = కి; అనవరతంబున్ = ఎడతెగక; హరి = హరి యొక్క; కథలు = కథలు; వినెడి = వినుచుండు; వారు = వారు; కిన్ = కి; మరణ = మృత్యువు; ఆగత = పొందుట వలన; మోహ = భ్రాంతి; సంభ్రమమున్ = భయము; లేదు; అనఘా = పాపము లేనివాడా.

భావము:- పవిత్ర చరిత్రా! హరి లీలలు అర్థం చేసుకొనేవారూ, హరి చరిత్రలు ఆలకించేవారూ, హరి చరణాల స్మరణం చేసుకోనేవారూ మరణ సమయంలో కూడా ఎటువంటి వేదనా, ఆవేదనా, తొందరపాటూ, తొట్రుపాటూ పొందరయ్యా!

1-441-క.

శుభచరితుఁడు హరి యరిగినఁ

బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా

నభిమన్యుసుతుని వేళను

బ్రభవింపక యడఁగి యుండె భార్గవముఖ్యా!

టీక:- శుభ = శుభకరమైన; చరితుఁడు = నడవడిక కలవాడు; హరి = హరి; అరిగినన్ = చనగా; ప్రభవించి = పుట్టి, రెచ్చిపోయి; ధరిత్రిన్ = భూమిని; ఎల్లన్ = అంతటి యందు; ప్రబ్బియున్ = అతిశయించియు, వ్యాపించియు; కలి = కలి; తాన్ = తాను; అభిమన్యు = అభిమన్యుని; సుతుని = పుత్రుని; పరీక్షితుని; వేళను =

కాలములో; ప్రభవింపక = అతిశయింపక; అడఁగి = అణగి; ఉండెన్ = ఉండెను; భార్గవముఖ్యా = శౌనక మహర్షీ {భార్గవ ముఖ్యా – భృగు వంశములో ముఖ్యుడా, శౌనక మహర్షీ}.

భావము:- పుణ్యచరిత్రుడైన పురుషోత్తముడు అవతారం చాలించిన అనంతరం కలి లోకమంతా వ్యాపించి విజృంభించాడు; కానీ అభిమన్యనందనుడైన పరీక్షిత్తు కాలంలో తలవంచి అణగిమణగి ఉన్నాడు.

1-442-వ.

ఇవ్విధంబునఁ జతుస్సముద్రముద్రితాఖిలమహీమండలప్రాజ్య సామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నా యభిమన్యుసంభవుండు

టీక:-ఈ = ఈ; విధంబునన్ = విధముగా; చతుస్ = నాలుగు (4); సముద్ర = సముద్రముల చేతను; ముద్రిత = చుట్టబడిన; అఖిల = సమస్తమైన; మహీ = భూమి యొక్క; మండల = మండలముకల; ప్రాజ్య = విస్తారమైన; సామ్రాజ్యంబు = సామ్రాజ్యమును; పూజ్యంబుగాన్ = పూజనీయముగా; చేయుచున్ = పాలించుచు; ఆ; అభిమన్యుసంభవుండు= పరీక్షిన్మహారాజు {అభిమన్యుసంభవుండు— అభిమన్యునిపుత్రుడు, పరీక్షిన్మహారాజు}.

భావము:- ఈ ప్రకారంగా నాలుగు సముద్రాల నడుమ ఉన్న విస్తారమైన భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా ప్రజారంజకంగా పరిపాలించాడు ఆ అభిమన్యుని పుత్రుడైన పరీక్షిన్నరేంద్రుడు.

★1-443-ఉ.

చేసినఁ గాని పాపములు సెందవు; చేయఁ దలంచి నంతటం
జేసెద నన్నమాత్రమునఁ జెందుఁ గదా కలివేళఁ బుణ్యముల్
మోసము లే దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటి కైవడిన్.

టీక:- చేసినన్ = చేసిన; కాని = కాని; పాపములు = పాపములు; సెందవు = చెందవు; చేయన్ = చేయుటను; తలంచిన్ = తలచిన; అంతటన్ = అంతటనే; చేసెదన్ = చేసెదను; అన్న = అనిన; మాత్రమునన్ = మాత్రముచేతనే; చెందున్ = చెందును; కదా = కదా; కలి = కలి; వేళన్ = కాలములో; పుణ్యముల్ = పుణ్యములు; మోసము = మోసము; లేదు = లేదు; అటంచున్ = అనుచును; నృపముఖ్యుఁడు = పరీక్షిత్తుడు {నృపముఖ్యుఁడు — నరపాలకులలో ముఖ్యమైనవాడు, పరీక్షిత్తుడు}; కాచెన్ = కాపాడెను; కలిన్ = కలిని; మరందము = మకరందము, తేనె; ఉల్లాసము = ఉత్సాహము; తోడన్ = తో; గ్రోలి = త్రాగి; విరులన్ = పువ్వులను; తెగన్ = తెగబడి; చూడని = చూడని; తేఁటి = తేనేటి; కైవడిన్ = వలె.

భావము:- అయితే ఈ కలియుగంలో ఒక విశేషముంది, చేస్తేనే గాని పాపాలు పట్టుకోవు. ఇక పుణ్యాలందామా "చేస్తాను' అని అనుకొంటే చాలు ఫలితాన్ని ఇచ్చేస్తాయి. అందుకనే అభిమన్య కుమారుడు, కలి విజృంభణాన్ని మాత్రం అరికట్టి ప్రాణాలతో విడిచిపెట్టాడు. తుమ్మెద, లోపల ఉన్న మకరందాన్ని మాత్రం ఆనందంతో త్రాగి పూలను వదులుతుంది కదా! అలాగన్నమాట.

పరీక్షిత్తు కలిపురుషుని నిగ్రహించాడు కాని నిర్మూలించలేదు ఎందుకు అనే సందేహానికి తావు లేకుండా వివరించబడింది.

## 1-444-వ.

**మఱియుం బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబున నొదిఁగి కాచుకొని యుండి చేష్టించుం గాని, ధీరులైనవారికిం గలివలని భయంబు లేదని కలి నంతంబు నొందింప డయ్యె"ననిన విని ఋషులు సూతున కిట్లనిరి.**

టీక:- మఱియున్ = ఇంకను; ప్రమత్తులు = పొరపాటు పడినవారు; ఐ = అయి; అధీరులు = ధైర్యము లేనివారు; అగు = అయినట్టి; నరుల = మానవుల; అందున్ = లో; వృకంబు = తోడేలు; చందంబునన్ = వలె; ఒదిఁగి = ఒదిగి, ఒరిగి; కాచుకొని = పొంచి; ఉండి = ఉండి; చేష్టించున్ = ప్రవర్తించును; కాని = కాని; ధీరులు = ధైర్యము కలవారు; ఐన = అయిన; వారి = వారి; కిన్ = కి; కలి = కలి; వలని = వలన; భయంబు = భయము; లేదు = లేదు; అని = అని; కలిన్ = కలిని; అంతంబున్ = అంతము, తుద; ఒందింపడు = పొందింపడు, ముట్టింపడు; అయ్యెన్ = ఆయెను; అనినన్ = అనగా; విని = విని; ఋషులు = మునులు; శౌనకాది మునులు; సూతుడు = సూతుడు; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అదీగాక కాచుకుని పొంచి యుండి పైకి దూకే తోడేలులాగా ప్రమత్తులై ధైర్యము లేని వారిని మాత్రమే కలి బాధిస్తుంది, కానీ ధీరులైన వారికి కలి వల్ల ఎట్టి భయమూ కలగదని భావించినవాడై ఆ మహారాజు కలిని సర్వనాశనం చెయ్యలేదు" అని చెప్పగానే విని శౌనకాది మహర్శులు సూతుని అభినందిస్తూ ఇలా అన్నారు.

## 1-445-సీ.

**"పౌరాణికోత్తమ! బ్రతుకుము పెక్కేండ్లు-**
**తామరసాక్షుని ధవళయశము**
**మరణశీలురమైన మా కెఱింగించితి-**
**కల్పితంబగు క్రతుకర్మమందుఁ**
**బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తులమైన-**
**మము హరి పదపద్మ మధుర రసమున్**
**ద్రావించితివి నీవు ధన్యులమైతిమి-**
**స్వర్గమేనియు నపవర్గమేని**

1-445.1-తే.

భాగవత సంగ లవ భాగ్యఫలము కీడె?
ప్రకృతిగుణహీనుఁడగు చక్రి భద్రగుణము
లీశ కమలాసనాదులు నెఱుగఁ లేరు
వినియు వినఁజాల ననియెడి వెఱ్ఱి గలఁడె?

టీక:- పౌరాణిక = పురాణములు తెలుపు వారిలో; ఉత్తమ = ఉత్తముడా, సూతుడా; బ్రతుకుము = జీవించుము; పెక్కు = చాలా; ఏండ్లు = సంవత్సరములు; తామరసాక్షుని = కృష్ణుని {తామరసాక్షుని – పద్మముల వంటి కన్నులున్నవాడు, కృష్ణుడు}; ధవళ = స్వచ్ఛమైన; యశము = కీర్తి; మరణ = మరణము; శీలురము = లక్షణము కలవారము; ఐన = అయిన; మాకు = మాకు; ఎఱింగించితి = తెలియజేసితివి; కల్పితంబు = సంకల్పిత మైనది; అగు = అయినట్టి; క్రతు = యజ్ఞ; కర్మము = కర్మము; అందున్ = లోపల; పొగల = పొగల; చేన్ = తో; పొగిలి = మసిబారి; అబుద్ద = తెలివిలేని; చిత్తులము = మనసుకలవారము; ఐన = అయిన; మము = మమ్ములను; హరి = హరియొక్క; పద = పాదములను; పద్మ = పద్మముల; మధుర = తీయని; రసమున్ = రసము; త్రావించితివి = త్రాగునట్లు చేసితివి; నీవు = నీవు; ధన్యులము = ధన్యత పొందిన వారిమి; ఐతిమి = అయినాము; స్వర్గము = స్వర్గము; ఏనియున్ = అయినను; అపవర్గము = ముక్తి; ఏని = అయినను;

భాగవత = భాగవతముతో; సంగ = సంబంధముయొక్క; లవ = కొంచెము, పిసరు; భాగ్య = అదృష్టము యొక్క; ఫలము = ఫలితము; కున్ = కు; ఈడె = సమానమా ఏమి; ప్రకృతి = ప్రకృతి యందలి; గుణ = గుణములు – త్రిగుణములు; హీనుఁడు = లేనివాడు; అగు = అయినట్టి; చక్రి = హరి {చక్రి - చక్రాయుధుడు, విష్ణువు}; భద్ర = శుభ; గుణములు = గుణములు; ఈశ = ఈశుడు, శివుడు; కమలాసన = బ్రహ్మ {కమలాసన - పద్మము ఆసనముగ కలవాడు, బ్రహ్మ}; ఆదులున్ = మొదలగువారు కూడ; ఎఱుగన్ = తెలియ; లేరు = లేరు; వినియున్ = వినినప్పటికిని; వినజాలన్ = వినలేను; అనియెడి = అనెడి; వెఱ్ఱి = వెఱ్ఱివాడు; కలఁడె = కలడాఏమి.

భావము:- “పౌరాణిక శిరోమణీ! నీవు చిరకాలం వర్ధిల్లు. మరణశీలురమైన మాకు అమృతమయ మైన హరి లీలావిశేషాలు వినిపించావు. బరువైన ఈ యజ్ఞకార్యం ఆరంభించి హోమధూమాలతో పొగచూరి పోయిన మా హృదయాలకు గోవింద చరణారవింద మధురమకరందాన్ని తనివితీరా త్రాగించావు. ధన్యులమై నాము. స్వర్గమే కాదు. అపవర్గం కూడా భగవద్భక్తుల సాంగత్య ఫలంలో పిసరంతకు కూడా సాటి రాదు కదా! ప్రాకృత గుణాతీతుడైన వాసుదేవుని కల్యాణ గుణవిశేషాలు తెలుసుకోవటం భవునకూ పద్మభవునకూ కూడా సాధ్యం కాదు. అటువంటి భగవంతుని పవిత్రగాథలు వీనులవిందుగా వింటూ, "చాలు, ఇంక వినలేను" అనెడి వెఱ్ఱివాళ్ళు ఎక్కడైనా ఉంటారా?

★1-446-క.

శ్రీపంబులు, ఖండిత సం

తాపంబులు, గల్మషాంధతమస మహోద్య

ద్దీపంబులు, పాషండ దు

రాపంబులు, విష్ణు వందనాలాపంబుల్.

టీక:- శ్రీ = సంపదలను; పంబులు = అతిశయింప చేయునది; ఖండిత = బద్దలు చేయబడిన; సంతాపంబులు = వ్యధలు కలవి; కల్మష = పాపము అను; అంధతమస = కటిక చీకటికి {అంధము - అంధతరము - అంధతమము}; మహా = గొప్ప; ఉద్యత్ = పెద్దవి, పైకెత్త బడిన; దీపంబులు = దీపములు; పాషండ = పాషండులకు; దురాపంబులు = పొందవీలుకానివి; విష్ణు = విష్ణుదేవుని; వందన = నమస్కారములు; ఆలాపంబుల్ = స్మరణములు.

భావము:- ఆ నందనందమని వందనాలాపాలు, శ్రీలను చెందించేవి, సంతాపాలను సమూలంగా తొలగించేవి, ఉద్దీపితమైన దివ్వెలై పాపాలనే కటిక చీకట్లను పోగొట్టేవి, పాషండులు పొందలేనివి. భాగవత భక్తిప్రపత్తుల విశిష్ఠతను ఇలా తలచుకుంటు, శుకుడు పరీక్షిత్తునకు చెప్పిన భాగవతాన్ని వివరించమని శౌనకాదులు సూతుని వేడుకుంటున్నారు

★1-447-క.

పావనములు, దురితలతా

లావనములు, నిత్యమంగళప్రాభవ సం

జీవనములు, లక్ష్మీ సం

భావనములు, వాసుదేవు పదసేవనముల్.

టీక:- పావనములు = పవిత్రము చేయునవి; దురిత = పాపములు అను; లతా = తీగలను; లావనములు = కోసివేయునవి (కొడవళ్ళు); నిత్య = శాశ్వత మైన; మంగళ = శుభములను ఇచ్చు; ప్రాభవ = వైభవాలను; సంజీవనములు = బ్రతికించునవి; లక్ష్మీ = సంపదలను; సంభావనములు = గౌరవములు ఇచ్చునవి; వాసుదేవు = హరి {వాసుదేవుడు - ఆత్మల వసించు దేవుడు, భగవంతుడు}; పద = పదముల; సేవనముల్ = పూజనములు.

భావము:- విశ్వమంత ఆత్మగా వసించి ఉండే పరమాత్మ వసుదేవుని ఇంటి పంట, శ్రీకృష్ణుని పాదాల యందలి భక్తి ప్రపత్తులు విశ్వానికి పవిత్రత ప్రసాదించేవి; సమస్త పాపాలనే బంధనాలను కోసేసే కొడవళ్ళు; శాశ్వత శుభ వైభవాలను సమకూర్చే సాధనాలు; సిరిసంపదల సుప్రదానములు.

శౌనకాది మహర్షులు భాగవత మహత్యాన్ని, భాగవతుల తోడి సాంగత్య ప్రభావాలను తెలిసిన మహా జ్ఞానులు. వారు హరిభక్తి విశిష్ఠతలను స్మరిస్తు, సూతునికి భాగవతోత్తము డైన పరీక్షిత్తు కథారూప మైన శ్రీమద్భాగవతాన్ని ఉపన్యసించ మని విన్నవించారు.

1-448-ఆ.

**పరమ భాగవతుఁడు పాండవపౌత్రుండు**
**శుకుని భాషణముల శుద్ధబుద్ధి**
**యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు**
**పాదమూల మెట్లు వడసె ననఘ!**

టీక:- పరమ = ఉత్కృష్టమైన; భాగవతుఁడు = భాగవత ధర్మము కలవాడు; పాండవపౌత్రుండు = పరీక్షిత్తు {పాండవపౌత్రుండు - పాండవుల యొక్క మనుమడు, పరీక్షిన్మహారాజు}; శుకుని = శుకుని యొక్క; భాషణములన్ = ప్రవచనముల వలన; శుద్ధ = శుద్ధి చేయబడిన; బుద్ధి = బుద్ధి కలవాడు; ఐ = అయి; విరాజ = వెలుగొందుచున్న; మానుఁడు = మానసము కలవాడు; ఐ = అయి; ముక్తి = తామే ముక్తి; అగు = అయినట్టి; విష్ణు = విష్ణుదేవుని; పాదమూలము = చరణములు; ఎట్లు = ఏ విధముగ; వడసెన్ = పొందెను; అనఘ = పాపములేనివాడా;

భావము:- పరమ భాగవతాగ్రేసరుడూ, పాండవ పౌత్రుడూ, సద్గుణ సాంద్రుడూ అయిన పరీక్షిన్నంద్రుడు శుకమహర్షి సూక్తులు ఆలకించి పరిశుద్ధమైన పరమార్థబుద్ధితో తేజరిల్లుతూ ముక్తికి ఆలవాలమైన వాసుదేవుని పాదమూలాన్ని ఎలా పొందాడు.

1-449-వ.

**మహాత్మా! విచిత్రయోగనిష్ఠాకలితంబును, విష్ణుచరితలలితంబునుఁ, బరమ పుణ్యంబును, సకలకల్యాణగుణగణ్యంబును, భాగవతజ నాపేక్షితంబునునైన పారీక్షితభాగవతాఖ్యానంబు వినిపింపు" మనిన సూతుం డిట్లనియె.**

టీక:- మహా = గొప్ప; ఆత్మా = ఆత్మ కలవాడా; విచిత్ర = విచిత్రమైన; యోగ = యోగ; నిష్ఠా = నిష్ఠలతో; కలితంబును = కూడినవి; విష్ణు = విష్ణుదేవుని; చరిత = ప్రవర్తన వలన; లలితంబును = సుకుమారమైనవి; పరమ = ఉత్కృష్టమైన; పుణ్యంబును = పుణ్యవంతమును; సకల = సమస్త; కల్యాణ = శుభకర; గుణ = గుణములలోను; గణ్యంబును = ఎంచదగ్గవియు; భాగవత = భాగవత ధర్మానుయాయులైన; జన = జనులచే; ఆపేక్షితంబును = కోరదగినది; ఐన = అయినట్టి; పారీక్షిత = పరీక్షితుని; భాగవత = భాగవతము; ఆఖ్యానంబున్ = వ్యాఖ్యనములు; వినుపింపుము = వివరింపుము; అనినన్ = అనగా; సూతుండు = సూతుడు; ఇట్లు = ఇలా; అనియెన్ = పలికెను.

భావము:- మహానుభావా! యోగవిద్యాసముపేతమూ, భగవత్కథాపరిపూతమూ, పరమపుణ్యమూ, సమస్త కల్యాణ సాద్గుణ్యమూ, భక్త జనులకు అపేక్షితమూ అయిన పరీక్షిత్తు శ్రవణం చేసిన భాగవతగాథను మాకు వినిపించు" అని అడుగుతున్న మహర్షులతో సూతుడిలా చెప్పసాగాడు-

1-450-క.

"మిముబోఁటి పెద్దవారలు

కమలాక్షుని చరిత మడుగఁగాఁ జెప్పెడి భా

గ్యము గలిగె నేఁడు నా జ

న్మము సఫలం బయ్యె వృద్ధమాన్యుఁడ నగుటన్

టీక:- మిము = మిమ్ములను; బోఁటి = పోలిన; పెద్ద; వారలు; కమలాక్షుని = హరి {కమలాక్షుడు - పద్మములవంటినేత్రములు కలవాడు, హరి}; చరితము = వర్తనలు; అడుగఁగాన్ = అడిగిన; చెప్పెడి = చేప్పేటటువంటి; భాగ్యమున్ = అదృష్టము; కలిగెన్ = కలిగెను; నేఁడు =ఇవేళ; నా=నాయొక్క; జన్మము; సఫలంబు = సఫలము; అయ్యె; వృద్ధ = పెద్దలచే; మాన్యుఁడను = గౌరవింపబడినవాడను; అగుటన్ = అగుట వలన.

భావము:- "అయ్యా! పెద్దలైన మీవంటివారు కావాలని కోరగా కమలాక్షుని గాథలు వినిపించే మహాభాగ్యం నాకు ప్రాప్తించింది. నా జన్మం ధన్యమైంది. నా జీవితం సజ్జన సమ్మాన్య మయింది.

1-451-క.

కులహీనుఁడు నారాయణ

విలసత్కథనములు గడఁక వినిపించినఁ ద

త్కులహీనతఁ బాసి మహో

జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా!

టీక:- కుల = కులములో; హీనుఁడు = తక్కువైనవాడు; నారాయణ = నారాయణుని; భగవంతుని; విలసత్ = వెలుగొందెడి; కథనములు = కథలు; కడఁకన్ = పట్టుదలతో; వినిపించినన్ = వినిపించినచో; తత్ = ఆ; కుల = కులము యొక్క; హీనతన్ = హీనత్వమును; పాసి = విడిచి; మహా = గొప్ప; ఉజ్జ్వల = ఉజ్జ్వలమైన; కుల = కులములో; జత్వమును = పుట్టుటను; పొందు = పొందును; సత్ = మంచి; మునులారా = మునులారా.

భావము:- నికృష్టకులంలో జన్మించినవాడు కూడా ప్రకృష్టమైన భగవంతుని గాథలు పరులకు వినిపించగలిగితే అత్యుత్తమ కులగౌరవాన్ని అందుకొంటాడు.

1-452-సీ.

ఎవ్వని గుణజాల మెన్న జిహ్వాలు లేక-

నలినగర్భాదు లనంతుఁ డండ్రు?

కోరెడు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి-

ప్రార్థించె నెవ్వని పాద రజము?

బ్రహ్మ యెవ్వని పాదపద్మంబుగడిగిన-
జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల?
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు-
నెవ్వఁ డర్థాకృతి నేపు మిగులు?

1-452.1-ఆ.

నే మహాత్ము నాశ్రయించి శరీరాది
సంగకోటి నెల్ల సంహరించి
ప్రాభవమున మునులు పారమ హంస్యంబు
నొంది తిరిగి రాక యుందు రెలమి.

టీక:- ఎవ్వని = ఎవ్వాని; గుణ = గుణముల; జాలము = సమూహము; ఎన్నన్ = ఎన్నుటకు; జిహ్వలు = నాలుకలు; లేక = లేక; నలిన = పద్మము అను; గర్భ = గర్భములో పుట్టినవాడు, బ్రహ్మ; ఆదులు = మొదలగు వారు; అనంతుఁడు = అంతము లేని వాడు; అండ్రు = అందురు; కోరెడు = కోరుచున్న; విబుధ = మిక్కిలి బుద్ధిమంతులలో; ఇంద్ర = ఉత్తముల; కోటిన్ = కోటిమందిని, సమూహమును; ఒల్లక = ఒప్పుకొనక; లక్ష్మి = లక్ష్మీదేవి; ప్రార్థించెన్ = ప్రార్థించెను; ఎవ్వని = ఎవ్వని; పాద = పాదముల; రజము = రజము – ధూళి; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఎవ్వని = ఎవ్వని; పాద = పాదములు అను; పద్మంబు = పద్మములు; కడిగిన = కడిగిన; జలము = జలమును; ధన్యతన్ = ధన్యతతో, పుణ్యముతో; ఇచ్చెన్ = ఇచ్చెను; జనులు = మానవులు; కున్ = కు; ఎల్లన్ = అందరికి; భగవంతుఁడు = భగవంతుడు; అనియెడి = అనెడి; భద్ర = శుభమైన, క్షేమకరమైన; శబ్దము = పేరు; కున్ = కు; ఎవ్వఁడు = ఎవ్వడు; అర్థ = అర్థము యొక్క; ఆకృతిన్ = ఆకారమునకు; ఏపు = అతిశయించి; మిగులున్ = ఉండును; ఏ = ఏ;

మహా = గొప్ప; ఆత్మున్ = ఆత్మకలవానిని; ఆశ్రయించి = ఆశ్రయించి; శరీర = శరీరము; ఆది = మొదలగు; సంగ = బంధముల; కోటి = పెద్ద సమూహమును; ఎల్లన్ = అంతటిని; సంహరించి = అణిచివేసి; ప్రాభవమునన్ = ప్రాభవముతో; మునులు = మునులు; పారమ హంస్యంబున్ = పరమహంసత్వమును, ముక్తిని; ఒంది = పొంది; తిరిగి = తిరిగి; రాక = రాకుండగ; ఉందురు = ఉందురు; ఎలమిన్ = వికసించి.

భావము:- ఏ దేవుని గుణగణాలను గణించటానికి నాలుకలు చాలక పద్మగర్భాది దేవతలు అనంతుడని అంటారో? తనను వాంఛించే తక్కిన ముక్కోటి దేవతలనూ తిరస్కరించి శ్రీదేవి ఎవని పాద పరాగాన్ని స్వీకరించిందో? బ్రహ్మదేవుడు ఏ పాదపద్మాలు కడిగి ఆ పవిత్రగంగను అఖిలజగతికి అనుగ్రహించాడో? భగవంతుడు అనే పరమ పవిత్ర శబ్దానికి అర్థంగా ఏ దేవుని స్వరూపం విరాజిల్లుతున్నదో? ఏ దేవుని ఆశ్రయించి మహామునులు నిస్సంగులై తిరిగిరాని పరమహంస పదాన్ని అందుకొన్నారో?

ఆ వాసుదేవుని దివ్యగాథలు సమగ్రంగా గుర్తించి తెలుసుకోవటానికి ఎవరికి సాధ్యమౌతుంది?

★1-453-చ.

క్రమమున మింటికై యెగయుఁగాక విహంగము మింటిదైన పా

రము గన నేర్చునే? హరిపరాక్రమ మోపినయంతఁ గాక స

ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ? మునులార! నాదు చి

త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్.

టీక:- క్రమమునన్ = క్రమముగ - చక్కగ; మింటి = ఆకాశము; కై = నకు; ఎగయుఁన్ = ఎగురును; కాక = ఐతే ఐ ఉండవచ్చు - అయినప్పటికిని; విహంగము = పక్షి; మింటిది = ఆకాశమునది; ఐన = అయినట్టి; పారమున్ = అంతు - దరి; కనన్ = చూచుట – కనుగొనుట; నేర్చునే = నేర్చుకొన కలదా; హరి = హరి యొక్క; పరాక్రమము = తేజస్సు; ఓపిన = అనుమతించిన; అంతన్ = అంతే; కాక = కాకుండగ; సర్వము = సమస్తము; వివరింపన్ = వివరించుటకు; ఎవ్వండు = ఎవడు మాత్రము; ప్రవర్తకుఁడు = సామర్థ్యము కలవాడు; ఔ = అవుతాడు; మునులార = మునులారా; ఓ మునులూ; నాదు = నా యొక్క; చిత్తము = మనసు; కున్ = కు; ఎంతన్ = ఎంత అయితే; కానఁబడెన్ = కనబడెనో; తప్పక = తప్పకుండగ; చెప్పెదన్ = చెప్పుదును; మీకున్ = మీకు; అంతయున్ = అంతా.

భావము:-పక్షులు తమ శక్తి కొద్దీ రెక్కలాడిస్తూ ఎంత పైకి ఎగిరినా, ఆకాశం అంతు కనుక్కోలేవు. అదేవిధంగా, వాసుదేవుని మహావైభవాన్ని తనకు తెలిసినమాత్రం తప్ప సమగ్రంగా వివరించి చెప్పగల సమర్థు డెవడున్నాడు.

## పరీక్షిత్తు వేటాడుట

1-454-క.

వేదండపురాధీశుఁడు,

గోదండము సేతఁ బట్టికొని గహనములో

వేదండాదుల నొకనాఁ

డే దండలఁ బోవనీక యెగచెన్ బలిమిన్.

టీక:- వేదండ = హస్తినా; పురా = పురమునకు; అధీశుఁడు = రాజు; కోదండము = విల్లు; చేతన్ = చేతిలో; పట్టికొని = పట్టుకొని; గహనము = అరణ్యము; లోన్ = లో; వేదండ = ఏనుగు; ఆదులన్ = మొదలగువాటిని; ఒక = ఒక; నాఁడు = దినమున; ఏ = ఏ; దండలన్ = ప్రక్కకు; పోవ నీక = వెళ్ళనీయకుండగ; ఎగచెన్ = తరిమెను; బలిమిన్ = బలము కొద్ది.

భావము:- ఒకనాడు కరిపూరాధీశ్వరుడైన పరీక్షిత్తు ఎక్కు పెట్టిన కోదండమును చేతబట్టి కాంతారభూముల్లో ఏనుగులు మొదలైన జంతువులను వెంటాడి వేటాడ సాగాడు.

1-455-క.

ఒగ్గములు ద్రవ్వి పడు మని
యొగ్గెడు పెనుదెరల, వలల, నురలు మృగములన్
డగ్గఱి చంపెడు వేడుక
వెగ్గలమై చిత్తమందు వేఁటాడింపన్.

టీక:- ఒగ్గములున్ = అవపాతములు {ఒగ్గములు - అవపాతములు – ఏనుగులు మొదలగునవి పడుటకు పైన కఱ్ఱలు కంపలు కప్పి లోపల వెలితిగ నుండు గోతులు}; త్రవ్వి = తవ్వి; పడుము = పడుము; అని = అని; ఒగ్గెడు = పరిచిన; పెను = పెద్ద; తెరలన్ = తెరలును; వలలన్ = వలలును; ఉరలున్ = ఉచ్చులుతోను; మృగములన్ = జంతువులను; డగ్గఱి = దగ్గరకు వెళ్ళి; చంపెడు = చంపవలెననే; వేడుక = కోరిక; వెగ్గలము = అధికము; ఎక్కువ; ఐ = అయి; చిత్తము = మనసు; అందున్ = లో; వేఁటాడింపన్ = వెంటాడగా.

భావము:- లోతైన కందకాలు త్రవ్వి, పెద్ద పెద్ద వలలు పరచి, ఉచ్చులు పన్ని మృగాలనూ, పక్షులనూ పట్టుకొని బంధించే ఉత్సాహంతో అరణ్యమంతా విచ్చలవిడిగా తిరిగాడు.

1-456-క.

కోలముల గవయ, వృక, శా
ర్దూలములఁ, దరక్షు, ఖడ్గ, రోహిత, హరి, శుం
డాలముల, శరభ, చమర,
వ్యాలముల వధించె విభుఁడు వడి నోలములన్,

టీక:- కోలములన్ = అడవి పందులను; గవయ = గురుపోతులను; అడవి దున్నలను; వృక = తోడేళ్ళను; శార్దూలములన్ = పెద్దపులులను; తరక్షు = సివంగులను; ఖడ్గ = ఖడ్గ మృగములను; రోహిత = కేసరి మృగములను - అడవిగొఱ్ఱెలను; హరి = సింహములను; శుండాలములన్ = ఏనుగులను; శరభ = శరభ మృగములను; చమర = చామర మృగములను; వ్యాలములన్ = కొండచిలువలను; వధించెన్ = సంహరించెను; విభుఁడు = ప్రభువు; వడిన్ = వేగముగ; ఓలములన్ = మాటులలో {ఓలములు -మాటులు - వేట కోసము ఏర్పరచిన మరుగు ప్రదేశములు}.

భావము:- వనవరాహాలనూ, అడవిఎద్దులనూ, తోడేళ్ళనూ, పెద్దపులులనూ, సివంగులనూ, ఖడ్గమృగాలనూ, అడవిగొఱ్ఱెలనూ, సింహాలనూ, ఏనుగులనూ, శరభాలనూ, జడలబఱ్ఱెలనూ, కొండచిలువలనూ ఆ మహారాజు నైపుణ్యంతో పడగొట్టాడు.

1-457-క.

మృగయులు మెచ్చ నరేంద్రుఁడు
మృగరాజ పరాక్రమమున మెఱసి హరించెన్
మృగధరమండలమునఁ గల
మృగ మొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్.

టీక:- మృగయులు = వేటగాళ్ళు; మెచ్చన్ = మెచ్చుకొనేలా; నరేంద్రుఁడు = నరులకు ఇంద్రుడు; రాజు; మృగరాజపరాక్రమమున = సింహపరాక్రమముతో; మెఱసి = ప్రకాశించి - అతిశయించి; హరించెన్ = సంహరించెను; మృగ = లేడిని; ధర = ధరించిన; మండలమునన్ = బింబములో - చంద్రబింబములో; కల = ఉన్న; మృగము = మృగము; ఒక్కటి = ఒకటి మాత్రము; తక్క = తప్పించి; సర్వ = సమస్తమైన; మృగములన్ = జంతువులను; ఎల్లన్ = అన్నిటిని.

భావము:- ఆ నరేంద్రుడు మృగేంద్ర విక్రమంతో వేటగాళ్లు మెచ్చేటట్లుగా చంద్రమండలంలోని మృగాన్ని తప్ప అరణ్యంలో ఉన్న మృగాలన్నింటినీ వేటాడాడు.

1-458-వ.

ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంబడిం బడి యెగచుచుం జరించుటంజేసి బుభుక్షా పిపాసల వలన మిగుల బరిశ్రాంతుండయి, ధరణీ కాంతుండు చల్లని నీటి కొలంకుం గానక కలంగెడు చిత్తంబుతోఁ జని, యొక్క తపోవనంబు గని; యందు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; వాటంబు = కౌతుక సహితము; వాడిది; అయిన = అయినట్టి; వేఁట = వేటమీది; తమకంబున = పరవశత్వముతో; మృగంబులన్ = జంతువులను; వెంబడిన్ = వెనకాతల; పడి = పడి; ఎగచుచున్ = తరుముతూ; చరించుటన్ = తిరుగుట; చేసి = వలన; బుభుక్షా = ఆకలియును; పిపాసల = దాహముల; వలనన్ = వలన; మిగులన్ = మిక్కిలి; పరిశ్రాంతుండు = అలసినవాడు; అయి = అయి; ధరణీకాంతుండు = రాజు, పరీక్షిత్తు {ధరణీకాంతుండు - భూమికిభర్త - రాజు, పరీక్షిత్తు}; చల్లని = చల్లని; నీటి = నీటి; కొలంకున్ = కొలనును - చెరువును; కానక = కనుగొన లేక; కలంగెడు = కలత పడిన; చిత్తంబు = మనసు; తోన్ = తో; చని = వెళ్ళి; ఒక్క = ఒక; తపస్ = తపస్సు చేసుకొను; వనంబున్ = వనమును; కని = చూసి - కనుగొని; అందున్ = అందులో.

భావము:- ఈ విధంగా మృగయాకౌతుకంతో మృగాల వెంటబడి తరుమూతూ పరుగులెత్తటం మూలాన ఆకలి దప్పుల వల్ల అలసి పోయాడు మహారాజు, పరిశ్రాంతుడైన ఆ భూకాంతుడు చల్లని జలాశయం కోసం వెదకి వేసారి ఒక తపోవనాన్ని ప్రవేశించాడు.

1-459-సీ.

మెలఁగుట చాలించి, మీలితనేత్రుఁడై,-
శాంతుఁడై కూర్చుండి, జడత లేక,
ప్రాణ మనోబుద్ధి పంచేంద్రియంబుల-
బహిరంగవీథులఁ బాఱనీక,
జాగరణాదిక స్థానత్రయము దాఁటి,-
పరమమై యుండెడి పదముఁ దెలిసి,
బ్రహ్మభూతత్వ సంప్రాప్య విక్రియుఁ డయి,-
యతిదీర్ఘజటలుఁ ద న్నావరింప,

1-459.1-తే.

నలఘు రురు చర్మధారియై యలరుచున్న
తపసిఁ బొడగని, శోషితతాలుఁ డగుచు,
నెండి తడిలేక కుత్తుక నెలుఁగు డింద,
మందభాషల నిట్లను మనుజవిభుఁడు.

టీక:- మెలఁగుట = కదలుట మెదలుట; చాలించి = ఆపి; మీలిత = మూసిన; నేత్రుఁడు = కన్నులు కలవాడు; ఐ = అయ్యి; శాంతుఁడు = శాంతము పొందిన వాడు; ఐ = అయ్యి; కూర్చున్ = కూర్చొని; ఉండి = ఉండి; జడత = మందకొడి తనము; లేక = లేకుండగ; ప్రాణ = ప్రాణమును; మనస్ = మనసును; బుద్ధిన్ = బుద్ధిను; పంచఇంద్రియంబులన్ = పంచఇంద్రియంబులను {పంచఇంద్రియంబులు - కళ్ళు చెవులు ముక్కు నోరు చర్మము}; బహిరంగ = బయటి; వీథులన్ = దారులలో; పాఱనీక = ప్రసరింపనీయక; జాగరణ = జాగృతము; ఆదిక = మొదలగు; స్థాన = అవస్థల {అవస్థాత్రయములు - జాగృత - మెలకువ, సుషిప్తి - నిద్ర, స్వప్న – కల.}; త్రయము = మూడు (3); దాఁటి = దాటి; పరమము = పైది –ఉత్తమమైనది; ఐ = అయ్యి; ఉండెడి = ఉండెడి; పదమున్ = అవస్థను తురీయము {నాలుగవ అవస్థ - తురీయము, క్రింది అవస్థాత్రయములు - జాగృత - మెలకువ, సుషిప్తి - నిద్ర – స్వప్న – కల,}; తెలిసి = తెలిసికొని – అందుకొని; బ్రహ్మ = బ్రహ్మము; ఆభూత = తన యందే ప్రతిష్టితమైన - తానే అయిన; తత్వ = తత్వము - స్వభావము; సంప్రాప్య = అందుకొన్న; విక్రియుడు = క్రియా శూన్యుడు - సమాధి స్థితుడు; అయి = అయ్యి; అతి = మిక్కిలి; దీర్ఘ = పొడవైన; జటలున్ = జటలు; తన్ను = తనను; ఆవరింపన్ = కప్పుకొనగ; అలఘు = కురచకాని – కుంచించుకుపోని; రురు = లేడి; చర్మ = చర్మమును; ధారి = ధరించినవాడు; ఐ = అయ్యి;

అలరుచున్ = ప్రకాశించుతు; ఉన్న = ఉన్న; తపసిన్ = తపసు చేయువాని - మునిని; పొడగని = చూసి - గుర్తించి; శోషిత = శోష వచ్చిన — ఎండిపోయిన; తాలుఁడు = నోరు కలవాడు - అంగిలి కలవాడు; అగుచున్ = అవుతూ; ఎండి = ఎండిపోయి; తడి = తడి — చెమ్మ; లేక = లేక పోయి; కుత్తుకన్ = గొంతుక లోని - అంగిలిలోని; ఎలుఁగు = కంఠ స్వరము; డిందన్ = మందగించగ - తగ్గగ; మంద = మెల్లని; భాషలన్ = పలుకులతో; ఇట్లు = ఈ విధముగ; అను = పలికెను; మనుజవిభుఁడు = పరీక్షిన్మహారాజు {మనుజవిభుడు - ప్రజలకు విభుడు — రాజు, పరీక్షిత్తు}.

భావము:- అక్కడ నిమీలితనేత్రాలతో కూర్చుని శాంతంగా తపస్సు చేస్తున్న శమీకమునిని చూచాడు. ఆ తపస్వి జాగ్రతం, స్వప్నం, సుషుప్తి అనే మూడు అవస్థలనూ అతిక్రమంచి నాలుగవదైన సమాధి అవస్థలో ఏకాగ్రచిత్తుడై, బ్రహ్మానుసంధానం చేసి ఉన్నాడు. పరీక్షిత్తు ఆ సంయమీంద్రుని సమీపించి దవడలు ఎండి, నాలుక తడారి, డగ్గుత్తికతో మెల్ల మెల్లగా.

★1-460-క.

**"తోయములు, దెమ్ము మా కీ**
**తోయము వేఁటాడు వేళ దొల్లి పొడమ దీ**
**తోయము క్రియ జలదాహము,**
**తోయమువారలును లేరు, దుస్సహ మనఘా!"**

టీక:- తోయములు = నీరు; తెమ్ము = తీసుకొని రమ్ము; మాకు = మాకు; ఈ = ఈ; తోయము = తడవు; వేఁటాడు = వేటాడు; వేళ = సమయములో; తొల్లి = ఇంతకు ముందు; పొడమదు = కలుగదు; ఈ = ఈ; తోయము = విధము; క్రియ = వలె; జల = నీటి కోసము; దాహము = దాహము; తోయము = తోటి; వారలును = వారును; లేరు = లేరు; దుస్సహము = సహించుటకు కష్టమైనది; అనఘా = పాపము లేనివాడా.

భావము:-"మంచినీళ్ళియ్యి పుణ్యాత్ముడ! నీకుపుణ్యం ఉంటుంది. వేటాడలేనంత దాహంతోవచ్చానిప్పుడు. ఇంత దుస్సహమైన దాహం ఎప్పుడూలేదు. మావాళ్ళా అందబాటులోలేరు. తట్టుకోలేకపోతున్నా తొందరగా ఇయ్యి."

పరీక్షిన్మహారాజు తీవ్ర దాహంతో ముని వాటిక చేరి తపోమగ్ను డైన శమీకుని చూసి నీళ్ళి మ్మని అడిగాడు. మహారాజు కదా ఎంత అందంగా అడుగు తున్నాడో చూడండి. (సాహిత్యంలో అందా లద్దడానికి వాడేవి అలంకారాలు. ఆడంబరానికి శబ్దాలంకారం ప్రసిద్ధి. రెండు కాని అంతకంటె ఎక్కువ అక్షరాలు ఉన్న పదాలు తిరిగి తిరిగి వస్తూ అర్థ బేధం ఉంటే అది యమకం).

1-461-వ.

**అని భూవరుండు శమీకమహాముని సమాధినిష్ఠానిమీలితనేత్రుండును విస్మృత బాహ్యాంతరింద్రియకృతసంచారుండును హరిచింతాపరుండునునై యుండుటం దెలియలేక.**

టీక:- అని = అని; భూవరుండు = రాజు, పరీక్షితు {భూవరుండు – భూమికి వరుడు, రాజు}; శమీక = శమీకుడు అను; మహా = గొప్ప; ముని = ముని; సమాధి = సమాధి; నిష్ఠా = నియ మానుసారము; నిమీలిత = మూసిన; నేత్రుండును = కళ్ళు కలవాడును; విస్మృత = మరచిన; బాహ్య = వెలుపలి; అంతర = లోపలి; ఇంద్రియ = ఇంద్రియములచే; కృత = చేయబడిన, చేసిన; సంచారుండును = కదలికలు ఉన్నవాడు; హరి = హరి యొక్క; చింతా = ధ్యానమున; పరుం డును = నిమగ్నుడును; ఐ; ఉండుటన్; తెలియన్ = తెలుసికొన; లేక = లేక.

భావము:- ఆ ముని మాట్లాడలేదు. ఆ మునీంద్రుడు నిమీలితనేత్రుడై, సమాధిస్థుడై బాహ్యేంద్రియజ్ఞానం లేక హరి చింతా పరతంత్రుడై ఉన్నాడని మహారాజు తెలుసుకోలేక ....

1-462-ఉ.

"కన్నులుమూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుతనున్నవాఁడు, చే
సన్నలనైన రమ్మనఁడు, సారజలంబులు దెచ్చి పోయఁ, డే
మన్నన లైనఁ జేయఁడు, సమగ్రఫలంబులు వెట్టఁ, డింత సం
పన్నత నొందెనే? తన తపశ్చరణాప్రతిమప్రభావముల్.

టీక:- కన్నులు = కన్నులు; మూసి = మూసికొని; బ్రాహ్మణుఁడు = బ్రాహ్మణుడు; గర్వము = అహంకారము; తోడుత = తోకూడి; ఉన్నవాఁడు = ఉన్నాడు; చేన్ = చేతి; సన్నలన్ = గుర్తులతో; ఐన్ = అయినను; రమ్ము = రమ్ము; అనఁడు = అనుట లేదు; సార = మంచి; జలంబులున్ = నీరు; తెచ్చి = తీసుకొని వచ్చి; పోయఁడు = పోయుట లేదు; ఏ = ఏ విధమైన; మన్ననలు = మర్యాదలు; ఐనన్ = అయినను; చేయఁడు = చేయుట లేదు; సమగ్ర = పక్వమునకు వచ్చిన; పండిన; ఫలంబులు = పండ్లు; వెట్టఁడు = పెట్టుట లేదు; ఇంత = ఇంత ఎక్కువగ; సంపన్నతన్ = సంపదను; ఒందెనే = సంపాదించాడా ఏమి; తన = తన యొక్క; తపస్ = తపస్సు; చరణ = చేయుట వలన; అప్రతిమ = సాటిలేని; ప్రభావముల్ = ప్రభావములతో; గొప్పదనముతో.

భావము:- "ఈ బ్రాహ్మణుడు కళ్లు తెరవడు! ఎంత గర్వం! పోనీ రమ్మని చేతితో సైగ అయినా చెయ్యడు! మంచినీళ్లు ఇయ్యడు! ఏవిధమైన మర్యాదలూ చేయడు. పండిన ఫలమూ పెట్టడు. తన తపోశక్తితో సాటిలేని ప్రభావంతో అంత సంపదలు సంపాదించాడా?

★1-463-ఆ.

వారిఁ గోరుచున్నవారికి శీతల
వారి యిడుట యెట్టివారికయిన
వారితంబుగాని వలసిన ధర్మంబు;
వారి యిడఁడు దాహవారి గాఁడు."

టీక:- వారిన్ = నీరు; కోరుచు = అడుగుచు; ఉన్న = ఉన్న; వారు = వారు; కిన్ = కి; శీతల = చల్లని; వారి = నీరు; ఇడుట = ఇచ్చుట; ఎట్టి = ఎటువంటి; వారు = వారు; కిన్ = కి; అయినన్ = అయినను; వారితంబు = నివారింప బడుటకు - తప్పించుకొన; కాని = కాని, లేని; వలసిన = ముఖ్యమైన; ధర్మంబు = ధర్మము; వారి = నీరు; ఇడఁడు = ఇవ్వడు; దాహ = దాహమును; వారి = వారించువాడు; కాఁడు = కాడు.

భావము:- దాహంతో నోరెండి పోయి వాకిట్లోకి వచ్చి మంచినీళ్ళు అడిగిన అతిథికి, చల్లని మంచినీళ్ళు ఇవ్వటం ఎటువంటి వారికి అయినా సరే కాదనరాని కనీస కర్తవ్యమే. కాని ఇతడు మంచినీళ్ళు ఇవ్వటంలేదు, దాహం తీర్చటం లేదు."

దాహంతో అల్లాడిపోతూ పరీక్షిత్తు నీ ళ్ళడిగితే ధ్యానంలో ఉన్న శమీకమహర్షి స్పందించ లేదు. అది గమనించక ఉక్రోషంతో పరీక్షిన్మహారాజు మరోలా అనుకుంటున్నాడు.

### 1-464-చ.

**అని మనుజేశ్వరుండు మృగయాపరిఖేదనితాంతదాహసం**
**జనిత దురంతరోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి పూ**
**జనములు సేయఁడంచు మృతసర్పమునొక్కటి వింటికోపునం**
**బనివడి తెచ్చి వైచె నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్.**

టీక:- అని = అని; మనుజేశ్వరుండు = రాజు, పరీక్షిత్తు {మనుజేశ్వరుండు - మానవులకు ప్రభువు, రాజు}; మృగయా = వేట వలన కలిగిన; పరిఖేద = బాధతో - అలసటతో; నితాంత = అధికమైన; దాహ = దాహము వలన; సంజనిత = పుట్టుచున్న; దురంత = అంతులేని; రోషమున = రోషముతో; సంయమి = సంయమనము కలవాడు, తపస్వి; తన్నున్ = తనను; తిరస్కరించి = లెక్కచేయక; పూజనములు = మర్యాదలు; సేయఁడు = చేయడు; అంచున్ = అనుచును; మృత = మరణించిన; సర్పమున్ = పామును; ఒక్కటి = ఒకటి; వింటి = విల్లు యొక్క; కోపునన్ = కొప్పున - చివరతో - బాణముతో; పనివడి = పనిగట్టుకొని; తెచ్చి; వైచెన్ = వేసెను; అటు; బ్రహ్మ = బ్రహ్మ; మునీంద్రుని = ఋషి యొక్క; అంసవేదికన్ = గూడలందలిసమస్థలములో, మెడలో.

భావము:- అలా అనుకుని పరీక్షిత్తు వేటలో కలిగిన అలసట, అధికమైన దాహములతో జనించిన దురంత రోషముతో ముని తనను లెక్కచేయటంలేదు, గౌరవించుట లేదు అంటూ, వింటి కొప్పుతో ఒక చచ్చిన పామును పనికట్టుకొని తీసుకొచ్చి ఆ బ్రహ్మర్షి భుజాన పడవేశాడు.

### 1-465-వ.

**"ఇట్లతండు ప్రత్యాహృతబాహ్యాంతరింద్రియుం డగుట నిమీలితలోచ నుండు గా నోపునో? యట్లుగాక గతాగతులగు క్షత్రబంధులచే నేమి యని మృషాసమాధి నిష్ఠుండుగా నోపునో?"యని వితర్కించుచు, వృథారోషదర్పంబున ముని మూఁపున గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు దన పురంబునకుం**

జనియె; నంత సమీపవర్తులైన మునికుమారు లంతయుం దెలియం జూచి శమీకనందనుం డైన శృంగి కడకుం జని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; అతండు = అతడు; ప్రత్యాహృత = వెనుకకు మరల్చబడిన; బాహ్య = బయటి; అంతర = లోపటి; ఇంద్రియుండు = ఇంద్రియములు కలవాడు; అగుటన్ = అయి ఉండుటను; నిమీలిత = మూసుకుపోయిన; లోచనుండున్ = కళ్ళు ఉన్నవాడు; కాన్ = అయి; ఓపునో = ఉండవచ్చునేమో; అట్లు = ఆ విధముగ; కాక = కాకపోయిన; గతా = పోయేవాళ్ళు; ఆగతులు = వచ్చేవాళ్ళు; అగు = అయిన; క్షత్రబంధులు = భ్రష్టక్షత్రియులు {క్షత్రబంధులు - భ్రష్టులైన క్షత్రియులకు వాడు జాతీయము}; చేన్ = వలన; ఏమి = ఏమి; అని = అని; మృషా = కపట; సమాధి = సమాధి; నిష్ఠుండున్ = నిష్ఠలో ఉన్నవాడు; కాన్ = అయి; ఓపునో = ఉండవచ్చేమో; అని = అని; వితర్కించుచు = వ్యతిరిక్తముగ తర్కించుచు; వృథా = వ్యర్థమైన; అనవసరపు; రోష = రోషముతో కూడిన; దర్పంబున = దర్పముతో - గర్వముతో; ముని = ముని యొక్క; మూఁపున = మూపుమీద, మెడలో; గత = పోయిన; ఆసువు = ఆయువు; అయిన = కల, చనిపోయిన; సర్పంబున్ = పామును; ఇడి = ఉంచి - వేసి; నరేశ్వరుండు = రాజు, పరీక్షిత్తు {నరేశ్వరుడు — నరులకు ప్రభువు, రాజు}; తన = తన యొక్క; పురంబున = పురమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; అంత = అంతట; సమీప = సమీపములో; దగ్గరలో; వర్తులు = తిరుగుచున్నవారు; ఐన = అయినట్టి; ముని = మునుల యొక్క; కుమారులు = కొడుకులు; అంతయున్ = మొత్తం అంతా; తెలియన్ = తెలిసేలాగ; చూచి = చూసి; శమీక = శమీకుని యొక్క; నందనుండు = పుత్రుడు; ఐన = అయినట్టి; శృంగి = శృంగి; కడ = దగ్గర; కున్ = కి; చని = వెళ్ళి.

భావము:- “ఈ ముని ఏకాగ్రచిత్తంతో నిజంగానే నిష్ఠాగరిష్ఠుడై నిమీలిత నేత్రుడై కూర్చున్నాడా లేక ఎప్పుడూ వస్తూ పోతూ ఉండే సామాన్య రాజులతో ఏమి పని అని దొంగజపం చేస్తున్నాడా?” అని మనస్సులో వితర్కించుకొంటూనే భూపాలుడు ఆపుకోలేని కోపాటోపంతో దాపున పడి ఉన్న మృతసర్పాన్ని ముని మూపున వేసి హస్తినాపురానికి వెళ్ళిపోయాడు. అప్పుడు చుట్టుప్రక్కల తిరుగుతున్న మునికుమారులు ఇదంతా చూసి శమీకముని కుమారుడైన శృంగి సమీపానికి వెళ్ళి....

1-466-క.

"నరగంధ గజస్యందన
తురంగములనేలు రాజు తోయాతురుఁడై
పరఁగన్ నీజనకునిమెడ
నురగముఁదగిలించిపోయెనోడక తండ్రీ!"

టీక:- నర = నరులను; గంధ = మదమెక్కిన; గజ = ఏనుగులను; స్యందన = రథములను; తురంగంబులన్ = గుఱ్ఱములను; ఏలు = పాలించు; రాజు = రాజు; తోయ = దాహముతో; ఆతురుడు = ఆత్రుత కలవాడు; ఐ = అయి; పరఁగన్ = పనిగట్టుకొని; నీ = నీ; జనకుని = తండ్రి; మెడన్ = మెడలో; ఉరగమున్ = పామును; తగిలించి = చిక్కునట్లు చేసి; పోయెన్ = పోయెను; ఓడక = సంకోచించక; తండ్రీ = అయ్యా.

భావము:- "భటులు, ఏనుగులు రథాలు, గుఱ్ఱాలు అనే చతురంగ సైన్యానికి అధిపతి అయిన ఎవడో ఒక రాజు జలం కోసం వచ్చి సంకోచించకుండా నీ జనకుని కంఠంలో సర్పాన్ని తగిలించి పోయాడయ్యా" అని చెప్పారు.

1-467-వ.

**అనిపలికిన, సమానవయోరూప మునికుమారలీలాసంగియయిన శృంగి శృంగం బులతోడి మూర్తిధరించినట్లు విజృంభించి రోషసంరంభంబున నదిరిపడి, "బల్యన్నంబుల భుజించి పుష్టంబు లగు నరిష్టంబులుం బోలె బలిసియు ద్వారంబుల గాచికొని యుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్రి యాభాసులెట్లు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితు లయిరి? అట్టివార లెట్లు తద్గృహం బుల భాండసంగతంబగునన్నంబు భుజింపనర్హులగుదురు? తత్కృతంబులయిన ద్రోహంబు లెట్లు నిజస్వామింజెందు?"నని మఱియు నిట్లనియె.**

టీక:- అని = అని; పలికిన = పలుకగ; సమాన = సమానమైన; వయస్ = వయస్సు కల; రూప = రూపము కల; ముని = మునుల యొక్క; కుమార = కుమారులతో; లీలా = క్రీడలకు; సంగి = కూడినవాడు; అయిన = అయినట్టి; శృంగి = శృంగి; శృంగంబులన్ = కొమ్ములతో; తోడి = కూడి యున్న (నందీశ్వరుని); మూర్తి = వేషమును - రూపమును; ధరించినట్లు = వేసుకొన్నట్లు; విజృంభించి = చెలరేగి; రోష = రోషము వలన; సంరంభ బునన్ = తొట్రుపాటుతో; అదిరి = అదిరి; ఉలికి; పడి = పడి; బలి = బలిగా పెట్టిన; అన్నంబులన్ = అన్నములను; భుజించి = తిని; పుష్టంబులు = బలిష్టులు; అగున్ = అయిన; అరిష్టంబులున్ = కాకులు; పోలెన్ = వలె; బలిసి యున్ = బలము కల వైనప్పటికిని; ద్వారంబులన్ = ద్వారముల వద్ద; కాచికొని = ఎదురు చూచుచు; ఉండు = ఉండు; సారమేయంబుల = కుక్కల; పగిదిన్ = వలె; దాస = పనివాని; భూతులు = వంటివారు; అగు = అయినట్టి; క్షత్రియ = క్షత్రియ; అభాసులు = బ్రష్టులు; ఎట్లు = ఏ విధముగ; బ్రాహ్మణ = బ్రాహ్మణులను; ఉత్తముల = ఉత్తముల; చేన్ = చేత; స్వ = తమ; రక్షకులుగ = రక్షించువారుగ – పరిపాలకులుగ; నిరూపితులు = నియమింపబడినవారు; అయిరి = అయితిరి; అట్టి = అటువంటి; వారలు = వారు; ఎట్లు = ఏ విధముగ; తత్ = వారి; గృహంబులన్ = ఇండ్లలోని; భాండ = కుండలలో; సంగతంబు = కూడిఉన్నది; కూడు; అగు = అయినట్టి; అన్నంబున్ = అన్నమును; భుజింపన్ = తినుటకు; అర్హులు = అర్హత కలవారు – యోగ్యులు; అగుదురు = అవుతారు; తత్ = వారిచేత; కృతంబులు = చేయబడినవి; అయిన = అయిన; ద్రోహంబులు = కీడులు; ఎట్లు = ఏ విధముగ; నిజ = తమ; స్వామిన్ = యజమానిని; చెందున్ = చెందును; అని = అని; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- ఆ మాటలు విని తోడి మునికుమారులతో ఆటలాడుతున్న శృంగి కొమ్ములు తిరిగిన క్రోధరసంలాగా హుంకరించి, రోషావేశంతో అదరిపడుతూ ఇలా అన్నాడు- "ఈ రాజులు బలిముద్దలు తిని బలిసిన కాకుల వంటివారు. ద్వారాలవద్ద కాచుకొని ఉండే సారమేయాల వంటివారు. గృహదాసులైన ఈ ఆభాస

క్షత్రియులను భూసురోత్తములు తమ రక్షకులుగా ఎలా అయ్యారు. ద్వారపాలకులుగా ఉండదగినవారు వంటింటిలో ప్రవేశించి వండిన అన్నాన్ని భుజించటానికి ఎలా అర్హులైతారు. వారు చేసే ద్రోహాలకు గృహస్వామి ఎందుకు బాధ్యు డవుతాడు."ఇలా పలికి

1-468-ఉ.

"ఆడడు తన్ను దూషణము, లాశ్రమవాసులఁ గాని వైరులం
గూడఁడు, కందమూలములు గూడుగఁ దించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోనిచూడ్కులను, విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు, మద్గురుండు, ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్?

టీక:- ఆడడు = పలుకడు; తన్నున్ = తనను; దూషణములు = నిందలు; ఆశ్రమ = ఆశ్రమములో; వాసులన్ = వసించువారిని; కాని = తప్ప; వైరులన్ = శత్రువులను; కూడఁడు = కలవడు; కంద = కంద; మూలములు = మొదలగునవి (దుంపలు); కూడుగన్ = భోజనముగ; తించు = తినుచు; సమాధి = సమాధిలో; నిష్ఠుఁడు = నిమగ్నమైనవాడు; ఐ = అయి; వీడఁడు = వదలడు; లోని = (ఆత్మ) లోపలి; చూడ్కులను = చూపులను; విష్ణునిన్ = విష్ణుమూర్తిని; తక్కన్ = కాని; పర = ఇతరమైన; ప్రపంచమున్ = ప్రపంచార్థములను; చూడఁడు = చూడడు; మత్ = నా యొక్క; గురుండు = తండ్రి; ఫణిన్ = పామును; చుట్టఁగన్ = చుట్టుట; ఏటి = ఎందుల; కిన్ = కు; రాచ = రాజకులపు – క్షత్రియకులపు; వాడు = వాడు; కిన్ = కి.

భావము:- "మా తండ్రి తనను తూలనాడలేదే ఆశ్రమవాసులతోనే గాని తమ శత్రు రాజులతో కూడలేదే అడవిలో కందమూలాలు భుజిస్తూ అచంచల మనస్కుడై అంతర్ దృష్టిని వీడకుండా, విష్ణుమూర్తిని తప్ప ఇతర ప్రపంచాన్ని చూడకుండా, తపోనిష్ఠలో ఉన్న ఆయన మీద ఆ రాచవాడు పామును వేసిపోతాడా?

1-469-ఉ.

పోము హిరణ్యదానములఁ బుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము, స వంచనంబులుగ దీవనలిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ; జెల్లరే!
పామును వైవఁగాఁ దగునె? బ్రహ్మమునీంద్రు భుజార్గళంబునన్.

టీక:- పోము = వెళ్ళము; హిరణ్య = బంగారు; దానములన్ = దానములను; పుచ్చుకొనంగ = తీసుకొనుటకు; ధనంబులు = విత్తములు (దక్షిణలు); ఏమియున్ = ఏవియును; తేము = తీసుకొనిరాము; సవంచనములుగన్ = మోసములతో కూడిన; దీవనలు = దీవనలు – ఆశీర్వాదములను; ఇచ్చుచున్ = ఇచ్చుచు; చేయుచు; వేసరింపఁగా = విసిగించుచు; రాము = రాము; వనంబులన్ = అడవిలో; గృహ = గృహస్తాశ్రమ; ఆశ్రమము నందే; విరాములము = విరతులము; ఐ = అయి; నివసింపన్ = ఉండగ; చెల్లరే = అయ్యో; పామును =

పామును; వైవఁగా = వేయుట; తగునె = తగునా ఏమి – ఏమి ధర్మము; బ్రహ్మముని = బ్రహ్మర్షులలో; ఇంద్రు = శ్రేష్ఠుని; భుజా = భుజముల యొక్క; గళంబునన్ = కంఠములో.

భావము:-మేము హిరణ్యదానాలు పుచ్చుకోవటానికి పోమే ఆశీర్వాదాలని మోసం చేసి ధనం గుంజుకోమే! పరులను వేధించేవాళ్లం కామే! ఇళ్లూ వాకిళ్లూ విడిచిపెట్టి అడవుల్లోపడి ఉన్నామే! అటువంటప్పుడు బ్రహ్మర్షి అయిన మా తండ్రిగారి మెడలో పామును పడవేయటానికి ఆ రాజుకు ఏం పోయే కాలం వచ్చిందో.

1-470-క.

పుడమిఁగల జనులు వొగడఁగఁ

గుడుతురు గట్టుదురుఁ గాక కువలయపతులై

యడవుల నిడుమలఁ బడియెడి

బడుగులమెడఁ నిడఁగ దగునె పన్నగశవమున్?

టీక:- పుడమిన్ = భూమి మీద; కల = కల; జనులున్ = జనులు; ఒగడఁగన్ = పొగడునట్లు; కుడుతురున్ = (తింటే) తిందురు; కట్టుదురున్ = (కడితే) కట్టుదురు; కాక = అంతేకాని; కువలయ = భూమండలమునకు; పతులు = భర్తలు; ఐ = ఐ ఉండి; అడవులన్ = అడవులలో; ఇడుమలన్ = బాధలు - ఇబ్బందులు; పడియెడి = పడు; బడుగుల = అశక్తుల – బలహీనుల; మెడన్ = మెడలో; ఇడఁగన్ = వేయుట; తగునె = తగునా ఏమి – ఏమి ధర్మము; పన్నగ = పాము; శవమున్ = శవమును.

భావము:- ప్రపంచాన్ని పాలించే ప్రభువు లయితే పంచభక్ష్యపరమాన్నాలు కడుపునిండా కుడవమనండి. విలువగల వలువలు ముడవమనండి. అంతేకాని అడవులలో ఇడుములు పడే బడుగు తాపసుల మెడలో పామును చుడతారా.

1-471-క.

భగవంతుఁడు గోవిందుఁడు

జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ

దగువారు లేమి దుర్జను

లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా!

టీక:- భగవంతుఁడు = మహిమాన్వితుడు; గోవిందుఁడు = కృష్ణుడు; జగతిన్ = భూలోకమును; పెడఁబాసి = విడిచిపెట్టి; చనినన్ = చనగా; వెళ్ళగా; శాసింపంగాన్ = కట్టుబాటుచేయుటకు; తగు = సామర్థ్యము కల; వారు = వారు; లేమిన్ = లేకపోవుటచేత; దుర్జనులు = చెడ్డమనుష్యులు; ఎగసి = చెలరేగి; మహా = గొప్ప; సాధు = సాత్వికులైన; జనులన్ = ప్రజలను; ఏఁచెదరు = బాధించెదరు; విసిగించెదరు; అకటా = అయ్యో.

భావము:- అయ్యో! భగవంతుడైన శ్రీకృష్ణుడు లోకాన్ని విడిచి వెళ్లిన తర్వాత సమర్థుడైన శాసకుడు ఎవరూ లేకపోవటంతో దుర్మార్గులు విజృంభించి నిరపరాధులైన సాధువులను బాధింప సాగారు.

1-472-క.

“బాలకులారా! ధాత్రీ
పాలకు శపియింతు"ననుచుఁ బలువడిని విలో
లాలకుఁడగు మునికుంజర
బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకు లదరన్.

టీక:- బాలకులారా = బాలకులారా; ధరిత్రీపాలకున్ = రాజును {ధరిత్రీపాలకుడు — భూమిని పాలించువాడు, రాజు}; శపియింతున = శపించెదను; అనుచున్ = అనుచు; పలు = మిక్కిలి; వడిని = వేగముతో; విలోల = చెదిరిన; అలకుఁడు = ముంగురులు కలవాడు; అగు = అయిన; మునికుంజరబాలకుఁడు = శృంగి {మునికుంజరబాలకుఁడు - మునులలో ఏనుగువంటి (శ్రేష్ఠుడైన) శమీకుని కుమారుడు, శృంగి}; అరిగెన్ = వెళ్ళెను; త్రి = మూడు (3); లోక = లోకముల; పాలకులు = పాలకులు - అధిపతులు; అదరన్ = ఉలికి పడునట్లు;

భావము:- “బాలకులాలా! వినండి. ఇప్పుడే ఆ భూపాలకునికి శాపం పెడతాను” అని మిక్కిలి వేగంగా చెదరినముంగురులతోనున్న మునిబాలకుడైన శృంగి ముల్లోకపాలకులు అదిరేటట్లు పెద్దకేకలు వేస్తూ-

శృంగి శాపంబు

1-473-వ.

ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శంబు సేసి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; రోషించి = రోషపడి — కినుక వహించి; కౌశికీ = కౌశికి అను; నది = నది; కిన్ = కి; చని = వెళ్ళి; జల = నీటిని; ఉపస్పర్శంబున్ = (సంకల్పమునకు) తాకుట, ఆచమనము; చేసి = చేసి.

భావము:- ఈ విధంగా కోపించి, (శృంగి) కౌశికీనదికి వెళ్ళాడు. నీళ్ళు చేతిలోకి తీసుకొన్నాడు.

1-474-ఉ.

"ఓడక వింటికోపున మృతోరగముం గొని వచ్చి మాఱు మా
టాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించు రాజు హరకేశవు లడ్డినఁ నైనఁ జచ్చుఁ బో
యేడవ నాఁడు తక్షకఫణీంద్ర విషానల హేతి సంహతిన్."

టీక:- ఓడక = జంకు లేకుండగ; వింటి = విల్లుయొక్క; కోపున = కొప్పున - చివరతో; మృత = చనిపోయిన; ఉరగమున్ = పామును; కొని = తీసికొని; వచ్చి = వచ్చి; మాఱు = బదులు; మాటాడక = చెప్పక; ఉన్న = ఉన్నట్టి; మత్ = నా; జనకున్ = తండ్రి యొక్క; అంస = భుజము, మూపు; తలంబునన్ = స్థలములో, భాగమున;

పెట్టి = పెట్టి; దుర్ = చెడ్డ; మద = మదపు, గర్వపు; క్రీడన్ = ఆటతో; చరించు = తిరుగు; రాజు = రాజు; హర = శివుడును; కేశవులు = విష్ణువును; అడ్డినన్ = అడ్డువచ్చుట; ఐనన్ = జరిగినను; చచ్చున్ = మరణించి; పో = పోవుగాక; ఏడవ = ఏడవ (7); నాఁడు = దినమున; తక్షక = తక్షకుడు అను; ఫణి = పాములలో; ఇంద్ర = శ్రేష్ఠుని; విష = విషము యొక్క; అనల = అగ్ని; హేతి = జ్వాలల; సంహతిన్ = సమూహమునకు.

భావము:- "సంకోచం లేకుండా వచ్చిన సర్పాన్ని కొనివచ్చి మౌనముద్రలో ఉన్న మా తండ్రిగారి భుజంపైన పడవేసి దురహంకారంతో కన్నూ మిన్నూ కానని ఆ రాజు, హరిహరులు అడ్డుపడినా నేటికి ఏడవనాడు తక్షకుని విషాగ్ని జ్వాలలకు దగ్ధమైపోతాడు."

1-475-వ.

**అని శమీకమహామునికుమారుం డయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి, నిజాశ్రమంబునకుం జనుదెంచి, కంఠలగ్న కాకోదర కళేబరుండైన తండ్రిం జూచి.**

టీక:- అని = అని; శమీక = శమీకుడు అను; మహా = గొప్ప; ముని = ముని యొక్క; కుమారుండు = పుత్రుడు; అయిన = అయినట్టి; శృంగి = శృంగి; పరీక్షిత్ = పరీక్షత్తు; నరేంద్రుని = మహారాజుని; శపియించి = శపించి; నిజ = తన; ఆశ్రమంబున = ఆశ్రమమున; కున్ = కు; చనుదెంచి = వచ్చి; కంఠ = కంఠమందు; లగ్న = తగిలిఉన్న; కాకోదర = పాము; కళేబరుండు = శవముకలవాడు; ఐన = అయిన; తండ్రిన్; చూచి = చూసి.

భావము:- అని పరీక్షిన్నరేంద్రుణ్ణి భయంకరంగా శపించి శమీక మహాముని కుమారుడైన శృంగి ఆశ్రమానికి అరుదెంచి ధ్యానముద్రలో ఉన్న తండ్రిని దర్శించాడు. ఆయన మెడలో ఇంకా ఆ మృతసర్పం అలా వ్రేలాడుతూనే ఉంది.

1-476-క.

**"ఇయ్యెడ నీ కంఠమునను**
**నియ్యురగ కళేబరంబు నిటు వైచిన యా**
**యయ్య నిఁక నేమి సేయుదు**
**నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ!**

టీక:- ఈ = ఈ; ఎడన్ = తావున; నీ = నీ; కంఠమునను = మెడలో; ఈ = ఈ; ఉరగ = పాము; కళేబరంబున్ = శవమును; ఇటు = ఈ విధముగ; వైచిన = వేసిన; ఆ = ఆ; అయ్యన్ = పెద్దమనిషిని; ఇఁకన్ = ఇంకనూ; ఏమి = ఏమి; చేయుదున్ = చేయుదును; నెయ్యంబులు = స్నేహధర్మములు; లేవు = లేవు; సుమ్ము = సుమా; నృపులు = రాజులు {నృపులు - నరులను పాలించు వారు, రాజులు}; కున్ = కి; తండ్రీ = తండ్రీ.

భావము:- "అయ్యో! తండ్రీ! ఈ రాజులకు పరువు మర్యాదలు తెలియవు. ఇతడెవడో మృతసర్పాన్ని తెచ్చి నీ కంఠంలో వేశాడు. మరి ఈ దొరగారికి ఎలా బుద్ధి చెప్పాలో ఏమో.

1-477-శా.

**ప్రారంభంబున వేఁట వచ్చి ధరణీపాలుండు, మా తండ్రిపై**
**నేరం బేమియు లేక సర్పశవమున్ నేఁ డుగ్రుఁడై వైచినాఁ**
**డీరీతిన్ ఫణి గ్రమ్మఱన్ బ్రతుకునో? హింసించునో కోఱలన్?**
**రారే తాపసులార! దీనిఁ దివరే, రక్షింపరే, మ్రొక్కెదన్."**

టీక:- ప్రారంభంబున = ముందేమో; వేఁటన్ = వేటకి; వచ్చి = వచ్చి; ధరణీ = భూమిని; పాలుండు = పాలించువాడు - రాజు; మా = మా; తండ్రి = తండ్రి; పైన్ = పైన; నేరంబు = అపరాధము; ఏమియున్ = ఏమాత్రము; లేక = లేకుండగ; సర్ప = పాము; శవమున్ = కళేబరమును; నేఁడు = ఈ దినమున; ఉగ్రుఁడు = కోపిష్టి; ఐ = అయి; వైచినాఁడు = వేసినాడు; ఈ = ఈ; రీతిన్ = విధముగ; ఫణి = పాము; క్రమ్మఱన్ = మరల; బ్రతుకునో = బ్రతుకుతుందో ఏమో; హింసించునో = హింసించునో ఏమో; కోఱలన్ = కోరలతో; రారే = రండి; తాపసులార = మునులారా; దీనిన్ = దీనిని; తివరే = తీసివేయండి; రక్షింపరే = రక్షించండి; మ్రొక్కెదన్ = ప్రార్థించెదను.

భావము:- ఓ తాపసులారా! ఎవరో రాజుగారు ముందు వేటకోసం అని అడవికి వచ్చి నిరపరాధి అయిన మా తండ్రి మీద నిర్దాక్షిణ్యాంగా ఈ చచ్చిన పామును పడవేసి వెళ్ళాడు. ఈ భయంకర సర్పం మళ్లీ బ్రతుకుతుందో ఏమో క్రూరమైన కోరలతో కాటు వేస్తుందేమో మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. వేగిరం రండి. ఈ పామును తోసేయండి. మా తండ్రిని రక్షించండి."

1-478-వ.

**అని వెఱపున సర్పంబుఁ దిగుచు నేర్పు లేక యెలుంగెత్తి యేడ్చు చున్న కుమారకు రోదనధ్వని విని, యాంగిరసుం డయిన శమీకుండు సమాధి సాలించి, మెల్లన కన్నులు దెఱచి, మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి, తీసి పాఱవైచి; కుమారకుం జూచి.**

టీక:- అని = అని; వెఱపునన్ = భయముతో; సర్పంబున్ = పామును; తిగుచు = తీసివేయు; నేర్పు = నేర్పు, సామర్థ్యము; లేక; ఎలుంగు = గొంతు - కంఠస్వరము; ఎత్తి = ఎత్తి, పెంచి; ఏడ్చుచున్ = ఏడుచుచు; ఉన్న = ఉన్నట్టి; కుమారకున్ = పుత్రుని; రోదన = ఏడుపు; ధ్వని = స్వరము; విని; ఆంగిరసుండు = (బుద్ధిలో) బృహస్పతి; అయిన = అయినట్టి; శమీకుండు = శమీకుడు; సమాధిన్ = సమాధి; సాలించి = చాలించి; మెల్లన = మెల్లగా; కన్నులు; తెఱచి = తెరచి; మూఁపున = మెడలో; వ్రేలుచు = వ్రేలాడుచు; ఉన్న; మృత = మరణించిన; ఉరగంబున్ = పామును; ఈక్షించి = చూసి; తీసి; పాఱ = దూరముగ; వైచి = వేసి; కుమారకున్ = కొడుకుని; చూచి = చూసి.

భావము:- అంటూ భయంతో ఆ సర్పాన్ని తొలగించే నేర్పులేక పెద్దగా ఏడవసాగాడు. అనుగు నందనుని ఆక్రందనం ఆకర్ణించి, అంగీరస వంశంవాడైన శమీక మహాముని సమాధి చాలించి మెల్లగా కళ్ళు తెరిచాడు. భూజాన వ్రేలాడుతున్న భుజంగాన్ని తీసి దూరంగా పారవేసి కుమారుణ్ణి చూసి....

★1-479-క.

"ఏ కీడు నాచరింపము
లోకులకున్ మనము సర్వలోక సములమున్
శోకింప నేల పుత్రక
కాకోదర మేల వచ్చెఁ? గంఠంబునకున్."

టీక:- ఏ = ఏ; కీడున్ = కీడు, అపకారమును; ఆచరింపము = కలుగజేయము; లోకులు = జనులు; కున్ = కు; మనము = మనము; సర్వ = సమస్త; లోక = లోకులను; సములమున్ = సమానముగా చూచు వారము; శోకింపన్ = ఏడ్చుట; ఏల = ఎందుకు; పుత్రక = కుమారా; కాకోదరము = పాము; ఏల = ఎందుకు; వచ్చెన్ = వచ్చెను; కంఠంబు = మెడమీద; కున్ = కు.

భావము:- "నాయనా! మనం లోకంలో ఎవరికి ఎలాంటి అపకారము చేసేవాళ్ళం కాదు కదా. మనం, లోకంలో అందరిని సమానంగానే చూస్తాం కదా. అయినా, నా మెడలోకి ఈ పాము ఎలా వచ్చింది? నువ్వు ఎందుకు ఏడుస్తున్నావు?"

అని తండ్రి యైన శమీక మహర్షి పరీక్షితుని శపించిన శృంగిని అడిగాడు.

1-480-వ.

అనియడిగినఁ దండ్రికిఁ గొడుకు, రాజువచ్చి సర్పంబువైచుటయుం దాను శపించుటయును వినిపించిన, నమ్ముని తన దివ్యజ్ఞానంబున నమ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుం డని యెఱింగి, కొడుకువలన సంతసింపక యిట్లనియె.

టీక:- అని = అని; అడిగినన్ = అడుగగా; తండ్రి = తండ్రి; కిన్ = కి; కొడుకు = కుమారుడు; రాజు = రాజు; వచ్చి = వచ్చి; సర్పంబున్ = పామును; వైచుటయున్ = వేసుటయును; తాను = తాను; శపించుటయును = శపించుటయును; వినిపించిన = వినిపించిన; ఆ = ఆ; ముని = ముని; తన = తన యొక్క; దివ్య = దివ్యమైన; జ్ఞానంబున = జ్ఞానము వలన; ఆ = ఆ; మానవ = మానవులలో; ఇంద్రుండు = శ్రేష్ఠుడు; పరీక్షిన్నరేంద్రుండు = పరీక్షిన్మహారాజు; అని = అని; ఎఱింగి = తెలిసికొని; కొడుకు = కుమారుని; వలనన్ = వలన; సంతసింపక = ఇష్టపడక; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అని (శమీకుడు) ప్రశ్నించాడు. అప్పుడు శృంగి రాజు వచ్చి పామును వేయటం, ఆ రాజును తాను శపించటం తన తండ్రికి విన్నవించాడు. వెంటనే శమీకమహర్షి తన దివ్యదృష్టితో ఆ రాజు పరీక్షిన్నరేంద్రుడని తెలుసుకొని కొడుకు చేసిన పనికి సంతోషింపక ఇలా అన్నాడు–

1-481-క.

"బెట్టిదమగు శాపమునకు
దట్టపు ద్రోహంబు గాదు, ధరణీకాంతుం
గట్టా! యేల శపించితి
పట్టీ! తక్షకవిషాగ్ని పాలగు మనుచున్.

టీక:- బెట్టిదము = కఠినము; అగు = అయిన; శాపము = శాపము; కున్ = కు; దట్టపు = బలమగు; ద్రోహంబున్ = ద్రోహము; కాదు = కాదు; ధరణీ = భూమికి; కాంతున్ = భర్తని - రాజును; కట్టా = అయ్యో; ఏల = ఎందుకు; శపించితి = శపించితివి; పట్టీ = పుత్రా; తక్షక = తక్షకుడు అను; విష = విషము యొక్క; అగ్ని = అగ్నికి; పాలు = వశము; అగుము = అవ్వుము; అనుచున్ = అని.

భావము:- "నాయనా! ఇంతటి కఠోరమైన శాపం పెట్టటానికి అంతటి మహాపరాధం ఆ మహారాజు ఏంచేసాడు. తక్షకవిషాగ్ని జ్వాలల పాలు కమ్మని ఆ ధరణీపాలుణ్ణి, అయ్యయ్యో! ఎందుకు శపించావు?

1-482-ఆ.

తల్లి కడుపులోన ధగ్ధుడై క్రమ్మఱఁ
గమలనాభు కరుణఁ గలిగినాఁడు;
బలిమి గలిగి ప్రజలఁ బాలించుచున్నాడు;
దిట్టవడుగ! రాజుఁ దిట్టఁ దగునె?

టీక:- తల్లి = తల్లి; కడుపు = గర్భము; లోన = లోపల; ధగ్ధుఁడు = కాలిన వాడు; ఐ = అయి; క్రమ్మఱన్ = మరల; కమలనాభుడు = కృష్ణుని {కమలనాభుడు - కమల (పద్మము) నాభు (నాభి యందు కలవాడు), విష్ణువు}; కరుణన్ = కరుణతో; కలిగినాఁడు = బ్రతికినవాడు; బలిమిన్ = బలము - శక్తి; కలిగి = కలిగి ఉండి; ప్రజలన్ = జనులను; పాలించుచున్ = ఏలుచు; ఉన్నాడు = ఉన్నాడు; దిట్ట = సామర్థ్యము గల; వడుగ = ఓ బ్రహ్మచారీ; రాజున్ = రాజును; తిట్టన్ = తిట్టుట; తగునె = తగునా ఏమి, సరియైనదా ఏమి.

భావము:- పాపం! పరీక్షిత్తు తల్లి గర్భంలోనే దగ్ధుడైనాడు. మళ్ళీ శ్రీకృష్ణుని కటాక్షం వల్ల బ్రతికి బయటపడ్డాడు. ఇప్పుడు పెరిగి పెద్దవాడై పరాక్రమవంతుడై ప్రజలను పరిపాలిస్తున్నాడు. ఓ బ్రహ్మచారీ! అటువంటి మంచిరాజును శపించవచ్చా?

1-483-ఉ.

కాపరి లేని గొఱ్ఱియల కైవడిఁ గంటక చోర కోటిచే
నేపఱి యున్నదీ భువన మీశుఁడు గృష్ణుఁడు లేమి నిట్టిచో,
భూపరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ, జెల్లరే!
యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగ నేల? బాలకా!

టీక:- కాపరి = కాపలా కాసేవాడు; లేని = లేని; గొఱ్ఱియల = గొఱ్ఱెల; కైవడిన్ = వలె; కంటక = దుష్టులు; చోర = దొంగలు; కోటి = పెద్ద సమూహము; చేన్ = చేత; ఏపు = అభివృద్ధి - బలము; అఱి = చెడి - లేక; ఉన్నది = ఉన్నది; ఈ = ఈ; భువనము = లోకము; ఈశుఁడు = ఈశ్వరుడు; కృష్ణుఁడు = కృష్ణుడు; లేమిన్ = లేకపోవుటచేత; ఇట్టిచో = ఈ విధముగ అయినచో; భూ = భూమిని; పరిపాలనంబు = ఏలుట; సమ = సమన్వయమగు; బుద్ధిన్ = బుద్ధితో; ఇతండు = ఇతడు; ఒనరింపన్ = చేయుచుండగ; చెల్లరే = తగునా ఏమి; చెల్లునా ఏమి; ఈ పరిపాటి = ఇంత చిన్న; ద్రోహము = అపరాధము, కీడు; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; శపింపఁగ = శపించుట; ఏల = ఎందుకు; బాలకా = పిల్లవాడా.

భావము:- వాసుదేవుడు లేకపోవటం మూలాన లోకమంతా చీకాకు పాలైంది. ప్రజలు కాపరిలేని గొఱ్ఱెల్లాగా ఆపద పాలయ్యారు. దొంగలూ దుండగులూ పెచ్చరిల్లారు. ఇటువంటి క్లిష్ట సమయంలో మన మహారాజు సమదృష్టితో సమర్థంగా ప్రజలను పాలిస్తున్నాడు. అయ్యో ఈ రవ్వంత అపరాధానికి ఇలా రాజును ఎందుకు శపించావు నాయనా?

1-484-సీ.

పాపంబు నీచేత ప్రాపించె మన; కింక-
రాజు నశించిన రాజ్యమందు
బలవంతుఁ డగువాఁడు బలహీను పశు, దార,-
హయ, సువర్ణాదుల నపహరించు;
జార చోరాదులు సంచరింతురు; ప్రజ-
కన్యోన్య కలహంబు లతిశయిల్లు;
వైదికంబై యున్న వర్ణాశ్రమాచార-
ధర్మ మించుక లేక తప్పిపోవు;

1-484.1-ఆ.

నంతమీఁద లోకు లర్థకామంబులఁ
దగిలి సంచరింప, ధరణి నెల్ల
వర్ణసంకరములు వచ్చును మర్కట
సారమేయ కులము మేరఁ బుత్ర!

టీక:- పాపంబున్ = పాపము; నీ = నీ; చేతన్ = చేతను; ప్రాపించెన్ = కలిగెను; మనకు = మనకు; ఇంక = ఇక; రాజు = రాజు; నశించిన = లేకపోయిన; రాజ్యము = రాజ్యము; అందున్ = లో; బలవంతుఁడు = బలముతో కూడినవాడు; అగు = అయిన; వాఁడు = వాడు; బల = బలము; హీను = తక్కువవాని; పశు = పశువులు; దార = స్త్రీలు; హయ = గుఱ్ఱములు; సువర్ణ = బంగారము; ఆదులన్ = మొదలగువానిని; అపహరించున్ = దొంగిలించును; జార = వ్యభిచారులు; చోర = దొంగలు; ఆదులు = మొదలగువారు; సంచరింతురు = మిక్కిలి తిరుగుదురు; ప్రజ = ప్రజలు; కున్ = కు; అన్యోన్య = ఒకరితోఒకరికి; కలహంబులు = జగడములు; అతిశయిల్లు = అధికము అగును; వైదికంబు = వేదానుసారమైనది; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; వర్ణ = వర్ణములయొక్క {చతుర్వర్ణములు – బ్రాహ్మణ ,క్షత్రియ, వైశ్య, శూద్ర.}; ఆశ్రమ = ఆశ్రమములయొక్క {చతురాశ్రమములు – బ్రహ్మచర్య ,గృహస్త, వానప్రస్త, సన్యాస}; ఆచార = ఆచారముల - ఆచరింపబడు; ధర్మము = ధర్మము – విధములు; ఇంచుక = కొంచెము కూడ; లేక = లేనివై; తప్పి; పోవున్ = చరించును; అంత = ఆ; మీఁదన్ = పైన;

లోకులు = ప్రజలు; అర్థ = అర్థమునకు; కామంబులన్ = కామమునకు; తగిలి = లొంగిపోయి; సంచరింప = వర్తింపగ; ధరణిన్ = భూమిమీద; ఎల్లన్ = అంతట; వర్ణ = వర్ణములు; సంకరములు = కలుషితమగుటలు; వచ్చును; మర్కట = కోతుల; సారమేయ = కుక్కల; కులము = గుంపుల; మేరన్ = వలె; పుత్ర = కొడుకా.

భావము:- నీ మూలంగా మనకు పాపం ప్రాప్తించింది. రాజు మరణిస్తే రాజ్యంలో అరాచకం ప్రబలుతుంది. బలం కలవాడు బలం లేనివాడి మీద పడి వాడి సర్వస్వం దోచుకుంటాడు. జార చోరులు నిరాఘాటంగా విహరిస్తారు. ప్రజలలో పరస్పర కలహాలు పెరిగి పోతాయి. వేదానుసారమైన వర్ణాశ్రమాచారాలు సమూలంగా నశిస్తాయి, పరస్పర కలహాలు పెరిగి పోతాయి. ధర్మం నశించిపోగా లోకులు అర్థకామాల వెంటబడతారు. రాజ్యమంతటా వానర శునకాలలో వలె వర్ణసంకరం వ్యాపిస్తుంది.

1-485-ఉ.

భారతవంశజుం, బరమభాగవతున్, హయమేధయాజి, నా
చారపరున్, మహానయవిశారదు, రాజకులైకభూషణున్,
నీరము గోరి నేఁడు మన నేలకు వచ్చిన;యర్థి భక్తి స
త్కారము సేసి పంపఁ జనుఁ గాక శపింపఁగ నీకు ధర్మమే?

టీక:- భారత = భరతుని; వంశజున్ = వంశము నందు పుట్టినవాని; పరమ = ఉత్కృష్టమైన; భాగవతున్ = భాగవత మార్గానుయాయిని; భాగవతుని; హయ = అశ్వ; మేధ = మేధ; యాజి = యజ్ఞము చేసినవానిని; ఆచారపరున్ = ఆచారవంతుని; మహా = గొప్ప; నయ = నీతికల; విశారదున్ = నేర్పరిని; రాజ = రాజుల; కుల = సమూహమునకు; ఏక = ముఖ్యమైన; భూషణున్ = ఆభరణము వంటివానిని; నీరము = నీరు; కోరి = కోరి; నేఁడు = ఇవేళ; మన = మన యొక్క; నేల = ప్రదేశమున; కున్ = కు; వచ్చిన = వచ్చిన; అర్థిన్ = అర్థించువానిని; భక్తి = భక్తితో; సత్కారము = గౌరవము; చేసి = చేసి; పంపన్ = పంపుట; చనున్ = తగును; కాక = అంతే కాని; శపింపఁగన్ = శపించుట; నీకు = నీకు; ధర్మమే = ధర్మమా ఏమిటి.

భావము:- పవిత్రమైన భారతదేశంలో జన్మించాడు. పరమ భాగవతుడని పేరుగాంచాడు. అశ్వమేధం ఆచరించాడు. సదాచారసంపన్నుడూ, రాజనీతిజ్ఞుడూ, రాజకులాలంకారుడూ అయిన అంతటి మహారాజు దాహమై మన తపోవనానికి వస్తే ఆదరంతో అతిథిసత్కారాలు ఆచరించి పంపాలి. అంతే కాని, ఇలా శపించటం ఏమి ధర్మమయ్యా?

1-486-క.

భూపతికి నిరపరాధమ

శాపము దా నిచ్చె బుద్ధి చాపలమున మా

పాపఁడు; వీఁ డొనరించిన

పాపము దొలఁగింపు కృష్ణ! పరమేశ! హరీ!

టీక:-భూపతి = భూమికి భర్త అయినవాని, రాజు; కిన్ = కి; నిరపరాధమ = అపరాధ మేమిలేక; శాపమున్ = శాపమును; తాన్ = తాను; ఇచ్చెన్ = ఇచ్చెను; బుద్ధి = బుద్ధి; చాపలమున = చపలత్వముతో; మా = మా; పాపఁడు = పిల్లవాడు; వీఁడు = వీడు; ఒనరించిన = చేసిన; పాపమున్ = పాపమును; తొలఁగింపు = తొలగింపుము; కృష్ణ = కృష్ణా; పరమేశ = ఉత్కృష్టమైన ప్రభువా – పరమేశ్వరా; హరీ = పాపములను హరించువాడా – హరీ.

భావము:- ఓ! పరమేశ్వారా! శ్రీకృష్ణా! వాసుదేవా! నా పిల్లవాడు బుద్ధి చాపల్యంవల్ల భూపాలుడైన పరీక్షిత్తుకు శాపం పెట్టి పాపం కట్టుకొన్నాడు. దోషాన్ని తొలగించు తండ్రీ.

★1-487-క.

పొడిచినఁ, దిట్టినఁ, గొట్టినఁ,

బడుచుందురు గాని పరమభాగవతులు; దా

రొడఁబడరు మాఱు సేయఁగఁ

గొడుకా! విభుఁ డెగ్గు సేయఁ గోరఁడు నీకున్.

టీక:- పొడిచినన్ = పొడిచినను; తిట్టినన్ = తిట్టినను; కొట్టినన్ = కొట్టినను; పడుచున్ = పడుతు; ఉందురు = ఉంటారు; కాని = కాని; పరమ = ఉత్కృష్టమైన; భాగవతులు = భాగవతానుయాయులు –

భాగవతులు; తారు = తాము; ఒడఁబడరు = సిద్ధపడరు; మాఱు = ప్రతీకారము; సేయఁగన్ = చేయుటకు; కొడుకా = పుత్రా; విభుఁడు = ప్రభువు; ఎగ్గు = కీడు; సేయన్ = చేయుటను; కోరఁడు = కోరుకొనడు; నీకున్ = నీకు.

భావము:- కుమారా! కొట్టినా తిట్టినా పరమభక్తులైన వారు, పరమభాగవతులు శాంతంతో భరిస్తారే తప్ప ప్రతీకారం చెయ్యటానికి అంగీకరించరు. మన మహారాజు నీకు కీడు చేయాలనుకొనడు. శమీకమహర్షి తన మెడలో పరీక్షిత్తు వేసిన చచ్చిన పామును తొలగించి, శపించిన తన పుత్రుడు శృంగికి ఇలాబుద్ధిచెప్పసాగాడు. పరమభాగవతులతత్వం నిర్వచించిన మహా అద్భుత పద్య మిది.

★1-488-క.

చెలఁగరు కలఁగరు సాధులు
మిళితములయి పరులవలన మేలుం గీడున్
నెలకొనిన నైన నాత్మకు
నొలయవు సుఖదుఃఖచయము యుగ్మము లగుచున్."

టీక:- చెలఁగరు = రెచ్చిపోరు; కలఁగరు = క్రుంగిపోరు; సాధులు = మంచి నడవడిక కలవారు; మిళితములు = కలగలుపులు; అయి = అయి; పరుల = ఇతరుల; వలనన్ = వలన; మేలున్ = మంచి; కీడున్ = చెడులు; నెలకొనినన్ = కలిగినట్లు; ఐన = అయినను; ఆత్మ = ఆత్మ; కున్ = కి; ఒలయవు = కలుగవు; సుఖ = సుఖముల; దుఃఖ = దుఃఖముల; చయములు = సమూహములు; యుగ్మములు = ద్వంద్వములు; అగుచున్ = అవుతూ.

భావము:- ద్వంద్వాలకు కోపతాపాలకు లొంగరు, భగవంతునిపై ప్రపత్తి విడువరు, సుఖదుఃఖాలకు కలగరు. సజ్జనులు ఇతరులు చేసిన మేలులకు పొంగిపోరు, కీడులకు కుంగిపోరు. మహాత్ముల ఆత్మలను సుఖదుఃఖాలు ఆవహించవు."

భాగవతుల లక్షణాలను తెలుపుతు భాగవతంలో తన కొడుకు పరీక్షిత్తును శపించుటకు సంతోషించని శృంగి తండ్రి శమీకమహర్షి నోట ఇలా పలికించారు.

1-489-వ.

అని యిట్లు శమీకమహామునీంద్రుండు గ్రమ్మఱింప శక్తి లేని కొడుకు సేసిన పాపంబునకు సంతాపంబు నొంది, తన శిష్యు నొక ముని కుమారునిం బిలిచి, యేతద్వృత్తాంతం బంతయు రాజున కెఱింగించి రమ్మని పంచె; నంత నా యభిమన్యుపుత్రుండు శమీకముని శిష్యుని వలన శాపవృత్తాంతంబు విని కామక్రోధాది విషయాసక్తుండగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తి బీజం బగు; ననుచుఁ గరినగరంబునకుం జని యేకాంతంబున.

టీక:- అని = అని; యిట్లు = ఈ విధముగ; శమీక = శమీకుడు అను; మహా = గొప్ప; ముని = మునులలో; ఇంద్రుండు = శ్రేష్ఠుడు; క్రమ్మఱింపన్ = మరలింపుటకు; శక్తి = సామర్థ్యము; లేని = లేని; కొడుకు = కుమారుడు; సేసిన = చేసిన; పాపంబున = పాపమున; కున్ = కు; సంతాపంబున్ = వేదన; ఒంది = పొంది; తన = తనయొక్క; శిష్యున్ = శిష్యులలో; ఒక = ఒక; ముని = మునులలో; కుమారునిన్ = కుమారుని; పిలిచి = పిలిచి; ఏ = ఏదైతే ఉందో; తత్ = ఆ; వృత్తాంతంబు = సంగతిని; అంతయున్ = సమస్తమును; రాజు = రాజు; కున్ = కు; ఎఱింగించి = తెలియజేసి; రమ్ము = రావలసినది; అని = అని; పంచెన్ = పంపెను; అంతన్ = అంతట; ఆ = ఆ; అభిమన్యు = అభిమన్యుని; పుత్రుండు = కొడుకు, పరీక్షిత్తు; శమీక = శమీకుడు అను; ముని = ముని యొక్క; శిష్యు = శిష్యుని; వలనన్ = వలన; శాప = శాపము గురించిన; వృత్తాంతంబున్ = సంగతులు; విని = విని; కామ = కామము; క్రోధ = క్రోధము; ఆది = మొదలగు; విషయ = విషయము అందు; ఆసక్తుండు = తగులుకొన్నవాడు; అగు = అయినట్టి; తన = తన; కున్ = కు; తక్షక = తక్షకుని; విష = విషపు; అగ్ని = అగ్ని; విరక్తిన్ = విరక్తికి; బీజంబున్ = మూలకారణము; అగు = అగును; అనుచున్ = అనుచు; కరి = హస్తినా; నగరంబు = పురము; కున్ = కు; చని = వెళ్ళి; ఏకాంతంబున = ఒంటరితనములో.

భావము:- అని ఈ విధంగా శమీకమహాముని కుమారుడు చేసిన తిరుగులేని శాపరూపమైన పాపానికి సంతాపంచెందాడు. వెంటనే తనశిష్యుడైన ఒకమునిపుత్రుణ్ణిపిలిచి ఈవృత్తాంతమంతా మహారాజుకు చెప్పిరమ్మనిపంపించాడు. అభిమన్యుపుత్రుడైన పరీక్షిత్తు శమీకముని శిష్యునివలన, శృంగిపెట్టిన శాప వృత్తాంతంవిన్నాడు. కామక్రోధాదిసంసారవిషయాలలో మునిగితేలుతున్న తనకు తక్షకునివిషాగ్నికీలా జాలము, వైరాగ్యానికి మూలమౌతుందనివిచారిస్తూ హస్తినాపురికిచేరి ఏకాంతంగా తనలో ఇలా అనుకొన్నాడు-

## 1-490-ఉ.

"ఏటికి వేఁట వోయితి మునీంద్రుఁడు గాఢసమాధి నుండఁగా
నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి? నేఁ
డేటికిఁ బాపసాహసము లీ క్రియఁ జేసితి? దైవయోగమున్
దాఁటఁగ రాదు, వేగిరమ తథ్యము గీడు జనించు ఘోరమై.

టీక:- ఏమిటి = ఎందుల; కిన్ = కు; వేఁటన్ = వేటకొరకు; ఓయితిన్ = వెళ్ళితిని; ముని = మునులలో; ఇంద్రుఁడు = శ్రేష్ఠమైనవాడు; గాఢ = గాఢమైన; సమాధిన్ = సమాధిలో; ఉండగా = ఉండఁగా; ఏటి = ఎందుల; కిన్=కు; తత్ =అతని; భుజ =భుజము; అగ్రమునన్ = పైన; ఏసితి = వేసితిని; సర్ప = పాముయొక్క; శవంబున్ = శవమును; తెచ్చి = తీసుకొని వచ్చి; నేడు = ఇవేళ; ఏటి = ఎందుల; కిన్ = కు; పాప = పాపముతో కూడిన; సాహసములు = తెగువలు; ఈ = ఈ; క్రియన్ = విధముగా; చేసితి = చేసితిని; దైవ = దైవము వలన; యోగమున్ = కూడునది, కలుగు నది; దాఁటఁగన్ = దాటుటకు; తరించుటకు; రాదు = వీలుకాదు; వేగిరమ = శ్రీఘ్రమే; తథ్యము = తప్పక; కీడు = అశుభము; జనించు = కలుగును; ఘోరము = భయంకరము; ఐ = అయి.

భావము:- “నేను వేటకోసమని అరణ్యానికి ఎందుకు వెళ్లాను? ఆ మహాముని నిశ్చలధ్యాన సమాధిలో ఉన్నప్పుడు ఒక మృతసర్పాన్ని కొనివచ్చి ఆయన మెడలో ఎందుకు వేశాను? ఈ విధమైన పాపకార్యాలు ఎందుకు చేశాను? దైవ సంకల్పాన్ని ఎవ్వరూ అతిక్రమించలేరు. తప్పదు, ఘోరమైన కీడు జరిగి తీరుతుంది.

### 1-491-ఉ.

పాము విషాగ్నికీలలనుఁ బ్రాణము లేగిఁన నేఁగుఁగాక, యీ
భూమియు రాజ్యభోగములుఁ బోయిన నిప్పుడ పోవుఁగాక, సౌ
దామనిఁ బోలు జీవనము దథ్యముగాఁ దలపోసి యింక నే
నేమని మాఱు దిట్టుదు మునీంద్రకుమారకు దుర్నివారకున్.

టీక:- పాము = పాము యొక్క; విష = విషపు; అగ్ని = అగ్ని; కీలలను = మంటల వలన; ప్రాణములు = ప్రాణములు; ఏగిఁనన్ = పోయినచో; ఏఁగున్ = పోవును; కాక = కాక; ఈ = ఈ; భూమియున్ = ఆస్తియును; రాజ్య = రాజ్యము వలని; భోగములున్ = భోగములును {అష్టభోగములు – గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము}; పోయినన్ = పోయినచో; ఇప్పుడన్ = ఇప్పుడే; పోవున్ = పోవును; కాక = కాక; సౌదామనిన్ = మెరుపుతీగ; పోలున్ = వంటిదైన; జీవనము = జీవితము; తథ్యముగాన్ = సత్యమైనదిగా; తలపోసి = అనుకొని; ఇంక = ఇంక; నేన్ = నేను; ఏమి = ఏమి; అని = అని; మాఱున్ = ఎదురు; తిట్టుదున్ = తిట్టుదును; ముని = మునులలో; ఇంద్ర = శ్రేష్ఠుని; కుమారు = కొడుకు; కున్ = కును; దుర్నివార = నివారించుటకు కష్టమైనవాని; కున్ = కి.

భావము:- భీకరమైన తక్షకుని విషాగ్ని జ్వాలలకు ప్రాణాలు పోతేపోనీ! ఈ సామ్రాజ్యమూ, భోగభాగ్యాలూ లేకపోతే లేకపోనీ! విద్యుల్లత వంటి బ్రతుకు శాశ్వతమని భావించి దుర్నివారుడైన ఆ మునికుమారుణ్ణి నేను తిరిగి ఏమని శపించేది.

### 1-492-ఆ.

రాజ ననుచుఁ బోయి రాజ్యగర్వంబున
వనముకొఱకు వారి వనము సొచ్చి
దందశూక శవముఁ దండ్రిపై వైచినఁ
బొలియఁ దిట్ట కేల పోవు సుతుఁడు?

టీక:- రాజన్ = రాజును; అనుచున్ = అనుచు; పోయి = వెళ్ళి; రాజ్య = రాజ్యము వలని; గర్వంబున = మదముతో; వనము = నీరు; కొఱకున్ = కోసము; వారి = వారి యొక్క; వనమున్ = అశ్రమమును; సొచ్చి = ప్రవేశించి; దందశూక = పాము యొక్క; శవమున్ = శవమును; తండ్రి = తండ్రి; పైన్ = పైన; వైచినన్ = వేసిన; పొలియన్ = చచ్చునట్లు; తిట్టక = శపింపక; ఏల = ఎలా; పోవు = వెళ్ళును; సుతుఁడు = పుత్రుడు.

భావము:- మహారాజును గదా అని రాజ్యాహంకారంతో దాహంకోసం వారి తపోవనంలోకి ప్రవేశించి తండ్రిపై చచ్చినపామును పడవేస్తే కొడుకు చావమని శపించకుండా నోరు మూసుకు కూర్చుంటాడా?

1-493-క.

గోవులకును, బ్రాహ్మణులకు,
దేవతలకు నెల్ల ప్రొద్దుఁ దెంపునఁ గీడుం
గావించు పాపమానస
మే విధమునఁ బుట్టకుండ, నే వారింతున్,"

టీక:- గోవులు = గోవులు; కున్ = కు; బ్రాహ్మణులు = బ్రాహ్మణులు; కున్ = కు; దేవతలు = దేవతలు; కున్ = కు; ఎల్ల = అన్ని; ప్రొద్దున్ = వేళలందు; తెంపునన్ = తెంపరితనముచో; కీడున్ = అశుభములు; కావించు = చేయు; పాప = పాపపు; చెడు; మానసము = బుద్ధి; ఏ = ఎట్టి; విధమునన్ = విధము వలన; పుట్టకుండన్ = కలుగకుండగ; నేన్ = నేను; వారింతున్ = ఆడ్డగలను.

భావము:- గోవులకూ, దేవతలకూ, బ్రాహ్మణులకూ, తెంపరితనముతో కీడు చెయ్యాలనే దుర్బుద్ధి నాలో ఏ సమయంలోనూ పుట్టకుండా నివారించుకొనుట ఎట్లు?"

1-494-వ.

అని వితర్కించె.

టీక:- అని = అని; వితర్కించె = విశిష్టముగ విమర్శించెను.

భావము:- అని తనలో తర్కించుకొన్నాడు.

1-495-క.

దామోదరపదభక్తిం
గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్
భూమీశుఁ డలుగఁ డయ్యెను
సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్.

టీక:- దామోదర = తులసి మాలిక ఉదరమున కలవాని, కృష్ణుని {దామోదరః- దమాది సాధనలచే ఉదారమైన బుద్ధిద్వారా పొందబడువాడు, యశదాదేవిచే త్రాడుతో ఉదరమున కట్టబడినవాడు, లోకములు ఉదరమున కలవాడు, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 369వ నామం}; పద = పదముల ఎడ; భక్తిన్ = భక్తివలన; కామ = కామము; ఆదుల = మొదలగువానిని; గెల్చినాఁడు = జయించెను; కావునన్ = అందుచేత; కరుణన్ = దయతో; భూమి = భూమికి; ఈశుఁడు = ప్రభువు; పరీక్షిత్తు; అలుగన్ = కినియ కుండువాడు;

అయ్యెను = అయ్యెను; సామర్థ్యము = శక్తి; కలిగిన్ = ఉండియు; దోష = అపరాధమును; సంగిన్ = కూడిన వానిని; శృంగిన్ = శృంగిని.

భావము:- దేవదేవుడైన వాసుదేవుని దివ్యచరణాల మీది భక్తి ప్రపత్తుల వల్ల కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జయించి కరుణార్ద్ర హృదయుడైన పరీక్షిత్తు తనకు సామర్థ్యం ఉండి కూడా, తనను శపించిన దోషమంటిన శృంగి మీద కోపగించ లేదు.

## 1-496-వ.

**అంత మునికుమారుండు శపించిన వృత్తాంతంబు దక్షకుండు విని యెడరు వేచి యుండె; నిటఁ దక్షకవ్యాళవిషానలజ్వాలాజాలంబునం దనకు సప్తమ దినంబున మరణంబని యెఱింగినవాఁడుగావున, భూపాలుండు భూలోకస్వర్గలోకభోగం బులు హేయంబులని తలంచి, రాజ్యంబువిసర్జించి, నిరశన దీక్షాకరణంబు సంకల్పించుకొని.**

టీక:- అంత = అంతట; ముని = ముని; కుమారుండు = కుమారుడు (శృంగి); శపించిన = శపించి నట్టి; వృత్తాంతంబున్ = సమాచారమును; తక్షకుండు = తక్షకుడు; విని = విని; ఎడరు = సమయము కోసము; వేచి = ఎదురు చూచుచు; ఉండెన్ = ఉండెను; ఇటన్ = ఇక్కడ; తక్షక = తక్షకుడు అను; వ్యాళ = పాము; విష = విషపు; అనల = అగ్ని; జ్వాల = మంటల; జాలంబునన్ = సమూహముతో; తన = తన; కున్ = కి; సప్తమ = ఏడవ (7); దినంబునన్ = నాడు; మరణంబు = మరణము; అని = అని; ఎఱింగిన = తెలిసిన; వాఁడు = వాడు; కావున = అగుటవలన; భూ = భూమిని; పాలుండు = పాలించువాడు - రాజు; భూ = భూమి అను; లోక = లోక మందలి; స్వర్గ = స్వర్గము అను; లోక = లోకమందలి; భోగంబులు = భోగములు; హేయంబులు = అసహ్యకర మైనవి; అని = అని; తలంచి = తలచుకొని; రాజ్యంబున్ = రాజ్యమును; విసర్జించి = వదలిపెట్టి; నిరశన = నిరాహారము అను; దీక్ష; కరణంబున్ = ఆచరించుటను; సంకల్పించుకొని = సంకల్పముతో నిర్ణయించుకొని.

భావము:- మునికుమారుడు రాజును శపించిన వృత్తాంతం విన్న తక్షకుడు సమయం కోసం ఎదురుచూస్తున్నాడు. పరీక్షిన్నరేంద్రుడు తక్షకుని దారుణ విషాగ్ని జ్వాలల మూలాన తనకు ఏడవనాడు మరణం తప్పదని నిర్ణయించుకొన్నాడు. భూలోక భోగాలూ, స్వర్గలోక సుఖాలూ పనికిమాలినవని భావించాడు. రాజ్యాన్ని పరిత్యజించాడు. నిరాహార దీక్ష అవలంబించటానికి నిశ్చయించాడు.

## పరీక్షిత్తుని ప్రాయోపవేశంబు

1-497-మ.

తులసీసంయుతదైత్యజిత్పదరజస్తోమంబుకంటెన్ మహో

జ్జ్వలమై, దిక్పతిసంఘసంయుతజగత్సౌభాగ్యసంధాయియై,

కలిదోషావళి నెల్లఁ బాపు, దివిషద్గంగాప్రవాహంబు లో

పలికిం బోయి, మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్.

టీక:- తులసీ = తులసితో; సంయుత = కూడి యుండి; దైత్య = దైత్యులను; జిత్ = జయించిన వాని; పద = పదముల యొక్క; రజస్ = రేణువుల; స్తోమంబు = గుంపు; కంటెన్ = కంటెను; మహా = అధికమైన; ఉజ్జ్వలము = ప్రకాశవంతము; ఐ = అయి; దిక్ = దిక్కులకు; పతి = పాలకుల; సంఘ = సమూహముతో; సంయుత = కూడిన; జగత్ = లోకమునకు; సౌభాగ్య = సౌభాగ్యమును; సంధాయి = కూర్చునది; ఐ = అయి; కలి = కలి వలని; దోష = దోషముల యొక్క; ఆవళిన్ = సమూహము; ఎల్లన్ = సమస్తమును; పాపు = పోగొట్టు; దివిషత్ = దేవలోకము నందలి; గంగా = గంగ యొక్క; ప్రవాహంబు = ప్రవాహము; లోపలి = లోపలి; కిన్ = కి; పోయి = వెళ్ళి; మరిష్య = మరణమునకు; మాణుఁడు = సిద్ధపడినవాడు; అగుచున్ = అగుచు; ప్రాయస్ = పోవుటకొరకైన; ఉపవేశంబునన్ = ఉపవాసములో ( ఆహారాదులు మాని మరణమునకు కెదురు చూచుట).

భావము:- తులసీదళాలతో విలసిల్లే శ్రీమన్నారాయణ చరణకమల రేణువుల కంటే మిక్కిలి మహోజ్జ్వలంగా ప్రవహిస్తూ లోకపాలురతో పాటు సకల లోకాల వారికీ సౌభాగ్య సంపదలు ప్రసాదిస్తూ కలి కలుషాల నన్నింటినీ కడిగివేసే దివ్యమైన గంగానదీ ప్రవాహంలోకి పోయి, ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడవటానికి సంకల్పించుకొన్నాడు.

1-498-క.

చిత్తము గోవిందపదా

యత్తముఁ గావించి, మౌనియై తనలో నే

తత్తఱము లేక, భూవర

సత్తముఁడు వసించె ముక్తసంగత్వమునన్.

టీక:- చిత్తమున్ = మనసును; గోవింద = కృష్ణుని; పద = పదములందు; ఆయత్తమున్ = నిలువబడినదిగా; కావించి = చేసి; మౌని = మౌనము ధరించిన వాడు; ఐ = అయి; తన = తన; లోన్ = లో; ఏ = ఏ; తత్తఱము = కంగారు – తొట్రుపాటు; లేక = లేకుండగ; భూ = భూమికి; వర = భర్తలలో; సత్తముఁడు = ఉత్తముడు; వసించె = ఉండెను; ముక్త = విడిచిన; సంగత్వమునన్ = సమస్త బంధనములతో {సంగత్వము – సంగములు కల స్థితి; సమస్త బంధనములు}.

భావము:- ఆ రాజసత్తముడు తన చిత్తాన్ని గోవింద పదాయత్తం చేసి సర్వసంగ పరిత్యాగియై ఎటువంటి మనోవైకల్యం లేకాండా మౌనంగా కూర్చున్నాడు.

1-499-వ.

**ఇట్లు పాండవపౌత్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయమాన మానసుండై విష్ణుపదీతీరంబునఁ బ్రాయోపవేశంబున నుండుట విని, సకలలోక పావనమూర్తులు మహానుభావులు నగుచుఁ దీర్థంబులకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, వసిష్ఠ, పరాశర, చ్యవన, భరద్వాజ, పరశురామ, దేవల, గౌతమ, కశ్యప, కవష, కణ్వ, కలశసంభవ, వ్యాస, పర్వత, నారద ప్రముఖులైన బ్రహ్మర్షి, దేవర్షి, రాజర్షిపుంగవులునుఁ; గాండర్షులయిన యరుణాదులును; మఱియు నానాగోత్రసంజాతులైన మునులును; శిష్య ప్రశిష్య సమేతులై చనుదెంచిన, వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి, పూజించి, దండప్రణామంబు లాచరించి, కూర్చుండ నియోగించి.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; పాండవ = పాండవుల యొక్క; పౌత్రుండు = మనుమడు; ముకుంద = విష్ణుమూర్తి యొక్క; చరణ = పాదములు అను; అరవింద = పద్మములకు; వందన = నమస్కరించుట వలన కలిగిన; ఆనంద = ఆనందముతో; కందాయ = మేఘమే; మాన = అగుచున్న; మానసుండు = మానసము కలవాడు; ఐ = అయి; విష్ణుపదీ = గంగానది {విష్ణుపది /- విష్ణుమూర్తి పాదమున పుట్టినది, గంగ}; తీరంబునన్ = ఒడ్డు నందు; ప్రాయోపవేశంబున = ప్రాయోపవేశము {ప్రాయోపవేశము - ఆహారాదులు మాని మరణమున కెదురుచూచుచు కూర్చొనుట అను దీక్ష}; ఉండుట = ఉండుట; విని = విని; సకల = సమస్త; లోక = లోకములందలి; పావన = పవిత్రము కలుగ చేయగల; మూర్తులు = రూపము కలవారు; మహా = గొప్ప; అనుభావులు = అనుభవము కలవారు; అగుచున్ = అగుచు; తీర్థంబుల = పుణ్యమును ఒసగు క్షేత్రముల; కున్ = కు; తీర్థత్వంబులు = పుణ్యము ఒసగగల స్వభావములను; ఒసంగ = కలిగింపగల; సమర్థులు = సామర్థ్యము కలవారు; ఐన = అయినట్టి; అత్రి = అత్రి; విశ్వామిత్ర = విశ్వామిత్రుడు; మైత్రేయ = మైత్రేయుడు; భృగు = భృగువు; వసిష్ఠ = వసిష్టుడు; పరాశర = పరాశరుడు; చ్యవన = చ్యవనుడు; భరద్వాజ = భరద్వాజుడు; పరశురామ = పరశురాముడు; దేవల = దేవలుడు; గౌతమ = గౌతముడు; కశ్యప = కశ్యపుడు; కణ్వ = కణ్వుడు; కలశసంభవ = కలశసంభవుడు; వ్యాస = వ్యాసుడు; పర్వత = పర్వతుడు; నారద = నారదుడు; ప్రముఖులు = మొదలగు ప్రసిద్ధులు; ఐన = అయినట్టి; బ్రహ్మర్షి = బ్రహ్మర్షులు; దేవర్షి = దేవర్షులు; రాజర్షి = రాజర్షులు అగు; పుంగవులును = శ్రేష్ఠులును; కాండర్షులు = కాండర్షులు {కాండర్షులు - వేద కాండములను అధ్యయనము చేసినవారు}; అయిన = అయిన; అరుణ = అరుణుడు; ఆదులును = మొదలగువారును; మఱియున్ = ఇంకను; నానా = అనేక; గోత్ర = గోత్రములలో; సంజాతులు = పుట్టిన వారు; ఐన = అయిన; మునులును = మునులును; శిష్య = శిష్యులను;

ప్రశిష్య = శిష్యుల శిష్యులను; సమేతులు = కూడినవారు; ఐ = అయి; చనుదెంచినన్ = వచ్చిన; వారలు = వారలు; కున్ = కు; ప్రత్యుత్థానంబున్ = లేచి ఎదురు వచ్చి ఆహ్వానించుట; సేసి = చేసి; పూజించి = పూజలు చేసి; దండప్రణామంబున్ = సాష్టాగ నమస్కారము {దండప్రణామము -సాష్టాగ నమస్కారము, దండము వలె భూమిపై పడి నమస్కరించుట}; ఆచరించి = చేసి; కూర్చుండ = కూర్చుండమని; నియోగించి = నియమించి.

భావము:- ఈ విధంగా పాండవపౌత్రుడైన పరీక్షిత్తు హరిచరణ సంస్మరణానంద కందళిత హృదయారవిందుడై విష్ణు పాదోద్భవ యైన గంగానది ఒడ్డున ప్రాయోపవిష్టుడై ఉన్నాడన్న సంగతి విన్నవారు అయి, అఖిలభువన పవిత్రులై, మహోదారచరిత్రులై, తీర్థయాత్రా వ్యాజంతో తీర్థాల తీర్థత్వాన్ని సార్థకం చేసే, సర్వ సమర్థులైనవారు అత్రి, విశ్వామిత్రుడు, మైత్రేయుడు, భృగువు, వసిష్ఠుడు, పరాశరుడు, చ్యవనుడు, భరద్వాజుడు, పరశురాముడు, దేవలుడు, గౌతముడు, కశ్యపుడు, కవషుడు, కణ్వుడు, కలశసంభవుడు (అగస్త్యుడు), వ్యాసుడు, పర్వతుడు, నారదుడు మొదలైన బ్రహ్మర్షులూ, దేవర్షులూ, రాజర్షులూ, అరుణుడు మొదలైన కాండర్షులూ, ఇంకా వివిధ గోత్రసంభవులైన మహర్షులు శిష్యులతోనూ, ప్రశిష్యులతోనూ కలిసి అచ్చటికి విచ్చేశారు. పరీక్షిన్నరేంద్రుడు ఆ విధంగా వచ్చన మునీంద్రులకు ఎదురువచ్చి, అర్ఘ్యపాద్యాలిచ్చి, అర్చించి, సాష్టాంగ నమస్కారాలు చేసి, సుఖాసీనులను కావించాడు.

1-500-క.

క్రమ్మఱ నమ్మునివిభులకు
నమ్మనుజేంద్రుండు మ్రొక్కి హర్షాశ్రుతతుల్
గ్రమ్మఁగ ముకుళితకరుఁడై
సమ్మతముగఁ జెప్పె నాత్మ సంచారంబున్.

టీక:- క్రమ్మఱన్ = మరల; ఆ = ఆ; ముని = మునులలో; విభుల = శ్రేష్ఠుల; కున్ = కు; ఆ = ఆ; మనుజ = మనుజులలో; ఇంద్రుండు = శ్రేష్ఠుడు; మ్రొక్కి = నమస్కరించి; హర్ష = ఆనందము వలని; అశ్రు = కన్నీటి; తతుల్ = ధారలు; క్రమ్మఁగ = కమ్ముకొనగ; ముకుళిత = మోడ్చిన; కరుఁడు = చేతులు కలవాడు; ఐ = అయి; సమ్మతముగన్ = మనస్పూర్తిగ; చెప్పెన్; ఆత్మ = తన యొక్క; సంచారంబున్ = సంచరించిన విధములను.

భావము:- ఆ మహారాజు ఆనందబాష్పాలు పొంగిపొరలగా ఆ మునిరాజుల ముందు ముకుళిత కరకమలుడై ఇలా విన్నవించుకొన్నాడు.

1-501-ఉ.

"ఓపిక లేక చచ్చిన మహోరగముం గొని వచ్చి కోపినై
తాపసు మూపుఁపై నిడిన దారుణచిత్తుఁడ; మత్తుఁడన్; మహా
పాపుఁడ; మీరు పాపతృణపావకు; లుత్తము లయ్యలార! నా
పాపము వాయు మార్గముఁ గృపావరులార! విధించి చెప్పరే.

టీక:- ఓపిక = ఓర్పు; లేక = నశించి; చచ్చిన = మరణించిన; మహా = పెద్ద; ఉరగమున్ = పామును; కొని = తీసికొని; వచ్చి = వచ్చి; కోపినై = కోపిష్టినై; తాపసు = మునియొక్క; మూపు = భుజముల; పైన్ = మీద; ఇడిన = వేసిన; దారుణ = భయంకరమైన; చిత్తుఁడన్ = మనసుకలవాడను; మత్తుఁడన్ = మదించినవాడను; మహా = గొప్ప; పాపుఁడన్ = పాపము చేసినవాడను; మీరు = మీరు; పాప = పాపము అను; తృణ = గడ్డిపోచకు; పావకులు = అగ్నివంటి వారు; ఉత్తములు = శ్రేష్ఠులు; అయ్యలార = తండ్రులారా; నా = నాయొక్క; పాపము = పాపము; పాయు = పోవు; మార్గమున్ = దారిని; కృపా = దయను; వరులార = ప్రసాదించు వారలారా; విధించి = నిర్ణయించి; చెప్పరే = చెప్పండి.

భావము:- "దయానిధులైన తపోధనులారా! నేను సహనం కోల్పోయి కోపాన్ని ఆపుకోలేక చచ్చిన సర్పాన్ని తెచ్చి మునీంద్రుని మూపుపై వేసిన పాపాత్ముణ్ణి, క్రూరచిత్తుణ్ణి; మీరు పాపారణ్య పావకులు, ఉత్తములు. సంయమసత్తములు. అయ్యలారా! నా పాపం పరిహార మయ్యే మార్గం సెలవీయండి.

## 1-502-ఉ.

భూసురపాదరేణువులు పుణ్యులఁజేయు నరేంద్రులన్ ధరి
త్రీసురులార! మీచరణరేణుకణంబులు మేను సోఁక నా
చేసిన పాపమంతయు నశించెఁ; గృతార్థుఁడ నైతి; నెద్ది యేఁ
జేసిన ముక్తి పద్ధతికిఁజెచ్చెరఁ బోవఁగఁ వచ్చుఁ జెప్పరే.

టీక:- భూసుర = బ్రాహ్మణుల {భూసురులు - భూమికిదేవతలు, బ్రాహ్మణులు}; పాద = పాదముల; రేణువులు = ధూళి కణములు; పుణ్యులన్ = పుణ్యవంతులునుగా; చేయున్ = చేయును; నరేంద్రులన్ = రాజులను {నరేంద్రులు- నరులలో శ్రేష్ఠులు, రాజులు}; ధరిత్రీసురులార = బ్రాహ్మణులారా {భూసురులు - భూమికిదేవతలు, బ్రాహ్మణులు}; మీ = మీయొక్క; చరణ = పాదముల యొక్క; రేణు = దుమ్ము; కణంబులున్ = కణములు; మేనున్ = శరీరమును; సోఁకన్ = తగలగా; నాన్ = నేను; చేసిన = చేసినట్టి; పాపము = పాపము; అంతయున్ = సమస్తమును; నశించెన్ = నశించి పోయినది; కృతార్థుఁడన్ = ధన్యుఁడను; ఐతిన్ = అయితిని; ఎద్ది = ఏది; ఏన్ = ఎలా; చేసిన = చేసినట్లైతే; ముక్తి = ముక్తి; పద్ధతి = మార్గము; కిన్ = నకు; చెచ్చెరన్ = శీఘ్రముగ; పోవఁగన్ = వెళ్ళుట; వచ్చున్ = కలుగునో - సిద్ధించునో; చెప్పరే = చెప్పండి — ఉపదేశించండి.

భావము:- మహీసురుల చరణరేణువులు మహీపతుల పాపాలను పారదోలి పవిత్రులను చేస్తాయి. బ్రహ్మజ్ఞులారా! మీ పాదపరాగాలు నాపై ప్రసరించగానే నా పాపం పటాపంటలయింది. నేను కృతార్థుణ్ణి అయ్యాను. ఇప్పుడు నేను ఏమి చేస్తే నాకు వేగంగా ముక్తి ప్రాప్తిస్తుందో దయచేసి చెప్పండి.

1-503-క.

భీకరతర సంసార

వ్యాకులతన్ విసిగి దేహ వర్జన గతి నా

లోకించు నాకుఁ దక్షక

కాకోదరవిషము ముక్తికారణ మయ్యెన్.

టీక:- భీకరతర = మిక్కిలి భయంకరమైన {భీకరము - భీకరతరము - భీకరతమము}; సంసార = సంసారము వలన; వ్యాకులతన్ = చీకాకులతో; విసిగి = విసుగు చెంది; దేహ = శరీరమును; వర్జన = వర్జించు; గతి = మార్గము గురించి; ఆలోకించు = చూచుచున్న; నాకున్ = నాకు; తక్షక = తక్షకుడు అను; కాకోదర = పాము; విషము = విషము; ముక్తి = ముక్తికి; కారణము = కారణము; అయ్యెన్ = అయినది.

భావము:- మిక్కిలి భయంకరమైన సంసార పంకంలో చిక్కుకొని విసిగి వేసారి విడిచి పెడదామని ఆలోచిస్తున్న నాకు తక్షకుని మహావిషం మోక్షహేతువైంది.

1-504-క.

ఏపారు నహంకార

వ్యాపారము లందు మునిఁగి వర్తింపంగా

నాపాలిటి హరి భూసుర

శాపవ్యాజమున ముక్తసంగుం జేసెన్.

టీక:- ఏపారు = అధికమైన; అహంకార = అహంకార పూరితములగు; వ్యాపారములు = ప్రవర్తనలు; అందున్ = లో; మునిఁగి = లీనమై; వర్తింపంగాన్ = తిరుగుచుండగ; నా = నా; పాలిటి = వంతుకి; వరకు; హరి = హరి; భూసుర = బ్రాహ్మణుని {భూసురులు - భూమికి దేవతలు; బ్రాహ్మణులు}; శాప = శాపము అను; వ్యాజమున = మిషచేత; ముక్త = విడిచిన; సంగున్ = బంధములు కలవాడు {ముక్తసంగుడు - సంగములను విడిచినవాడు; సంసారబంధనములు విడిచినవాడు}; చేసెన్ = చేసెను.

భావము:- అతిశయించిన అహంకారంతో కూడిన సంసార సాగరంలో మునిగి తేలుతున్న నాకు నా పాలిటి భగవంతుడు బ్రాహ్మణశాప మనే మిషతో విముక్తి ప్రసాదించాడు.

1-505-మ.

ఉరుగాధీశువిషానలంబునకు మే నొప్పింతు శంకింప; నీ
శ్వరసంకల్పము నేఁడు మానదు; భవిష్యజ్జన్మజన్మంబులన్
హరి చింతారతియున్, హరిప్రణుతి, భాషాకర్ణ నాసక్తియున్,
హరిపాదాంబుజ సేవయుం గలుగ మీ రర్థిం బ్రసాదింపరే?

టీక:- ఉరుగ = పాములలో; అధీశు = ప్రభువు యొక్క- తక్షకుని; విష = విషము అను; అనలంబున = అగ్ని; కున్ = కి; మేను = శరీరమును; ఒప్పింతున్ = అప్ప చెప్పుదును; శంకింపన్ = సందేహించను; ఈశ్వర = ఈశ్వరునిచేత; సంకల్పము = సంకల్పించబడినది; నేఁడు = ఈవేళ; మానదు = తప్పదు; భవిష్య = భవిష్యత్తులో రాబోవు; జన్మంబులన్ = జన్మలలోను; హరి = హరిని; భగవంతుని; చింతా = స్మరించు; రతియున్ = ఆసక్తియు; హరి = భగవంతుని; ప్రణుతి = స్తోత్రము చేయు; భాష = సంభాషణములను; ఆకర్ణన = వినుట యందు; ఆసక్తియున్ = ప్రీతియును; హరి = భగవంతుని; పాద = పాదములు అను; అంబుజ = పద్మములందు {అంబుజము – నీట పుట్టునది, పద్మము}; సేవయున్ = భక్తియు; కలుగన్ = కలుగునట్లు; మీరు = మీరు; అర్థిన్ = ఆదరముతో; ప్రసాదింపరే = ప్రసాదించండి.

భావము:- తక్షకుని భయంకర విషాగ్ని జ్వాలలకు సంకోచం లేకుండా నా శరీరం సమర్పిస్తాను. సందేహం లేదు. ఈశ్వరసకల్పం అనివార్యం. అయితే రాబోయే ప్రతిజన్మలో కూడా శ్రీకృష్ణ చింత యందు అనురక్తీ, శ్రీకృష్ణకథాశ్రవణ మందు ఆసక్తీ, శ్రీకృష్ణ చరణకమలాల యందు భక్తీ, కలిగి ఉండేటట్లుగా ప్రీతితో మీరు నాకు అనుగ్రహించండి.

1-506-క.

చూడుఁడు నా కల్యాణము;
పాడుఁడు గోవిందుమీఁది పాటలు దయతో;
నాడుఁడు హరిభక్తులకథ;
లే డహముల లోన ముక్తి కేఁగఁగ నిచటన్.

టీక:- చూడుఁడు = చూడండి; నా = నా యొక్క; కల్యాణము = శ్రేయస్సును; పాడుఁడు = పాడండి; గోవిందు = కృష్ణుని; మీఁది = మీది; పాటలు = పాటలు; దయ = కృప; తోన్ = తో; ఆడుఁడు = పలుకుడు; హరి = భగవంతుని; భక్తుల = భక్తుల; కథలు = కథలు; ఏడు = ఏడు (7); అహముల = దినముల; లోనన్ = లోపల; ముక్తి = మోక్షము; కిన్ = నకు; ఏఁగఁగ = వెళ్ళగలుగునట్లు; ఇచటన్ = ఇక్కడ.

భావము:- నా శ్రేయస్సును కాంక్షించండి. కమలాక్షుని లీలలు గానం చేయండి, హరిభక్తుల చరిత్రలు వినిపించండి. ఏడు దినాల్లో నాకు కైవల్యం ప్రసాదించండి.

★1-507-క.

**అమ్మా! నినుఁ జూచిన నరుఁ**

**బొమ్మా యని ముక్తి కడకుఁ బుత్తు వఁట కృపన్**

**లెమ్మా నీ రూపముతో**

**రమ్మా నా కెదుర గంగ! రమ్యతరంగా!"**

టీక:- అమ్మా = తల్లీ; నినున్ = నిన్ను; చూచిన = దర్శించిన మాత్రముననే; నరున్ = మానవుని; పొమ్మా = వెళ్ళు; అని = అని; ముక్తి = మోక్షము; కడ = వద్ద; కున్ = కి; పుత్తువు = పంపుదువు; అఁటన్ = అట; కృపన్ = దయతో; లే = లేచిరా; అమ్మా = తల్లీ; నీ = నీ యొక్క; రూపము = రూపము; తోన్ = తో; రా = రా; అమ్మా = తల్లీ; నాకు = నాకు; ఎదుర = ఎదురుగా; గంగ = గంగామాత; రమ్య = మనోహరమైన; తరంగా = కెరటాలు కలదానా.

భావము:- అమ్మా! మనోహర అలలతో అలరారే గంగమ్మతల్లి! నిన్ను దర్శించినంత మాత్రంచేతనే మోక్షానికి పంపిస్తావని విన్నాను, కదిలి రావమ్మా! కనికరించమ్మా!"

పుణ్యంతో స్వర్గంప్రాప్తిస్తుంది. అర్హుడైన జ్ఞాని వైరాగ్యంపొంది తగినసమయమెరిగి చేసిన ప్రాయోప వేశంతో మోక్షంప్రాప్తిస్తుంది. ఏ ఒక్కటిలేకపోయినా అది ఆత్మహత్యే, మహాపాపమే. పరమజ్ఞాని పరీక్షిన్మహా రాజుకి అర్హత ఉంది. శృంగిశాప మెరుగుటచే వైరాగ్యం సిద్ధించింది. తక్షకవిషంతో మరణం తప్పదని తెలిసిన ఆ సమయం తగింది. పరమ పావనమైన గంగానది తగిన స్థలం. అప్పుడు అక్కడ పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశానికి సిద్ధ మయ్యి గంగమ్మ తల్లిని స్తుతించేడు. పరమయోగి శుకుడు వచ్చి మహామంత్రరాజం మహాభాగవతం చెప్పాడు. పరీక్షిత్తు మోక్షాన్ని అందుకున్నాడు.

1-508-వ.

**అని తనకు మీఁదనయ్యెడి జన్మాంతరంబు లందును హరిపాదభక్తి సౌజన్యంబులు సంధిల్లుంగాతమని, గంగాతరంగిణీ దక్షిణకూలంబునం బూర్వాగ్రదర్భాసనం బున నుత్తరాభిముఖుండై యుపవేశించి, జనమేజయు రప్పించి, రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసార బంధంబునకుం దప్పించి, చిత్తంబు హరికి నొప్పించి, పరమ భాగవతుం డైన పాండవపౌత్రుండు ప్రాయోపవిష్టుండై యున్న సమయంబున.**

టీక:- అని = అని; తన = తన; కున్ = కి; మీఁదన్ = భవిష్యత్తులో; అయ్యెడి = కలిగెడు; జన్మ = జన్మల; అంతరంబులు = సమయములు - జీవితకాలముల; అందునున్ = లోపల; హరి = భగవంతుని; పాద = పాదముల మీద; భక్తి = భక్తి; సౌజన్యంబులు = సుజనత్వములు - సత్ప్రవర్తనలు; సంధిల్లున్ = కలుగును; కాత = కాక; అని = అని; గంగా = గంగ అను; తరంగిణి = నది యొక్క; దక్షిణ = దక్షిణపు; కూలంబునన్ = ఒడ్డునందు;

తీరమునందు; పూర్వ = తూర్పవైపునకు; అగ్ర = కొసలు ఉండునవి యైన; దర్భ = దర్భలతో కూర్చిన; ఆసనంబునన్ = ఆసనమున; పీఠము మీద; ఉత్తర = ఉత్తరపు వైపునకు; అభి = ఎదురుగా; ముఖుండు = ముఖముకలవాడు; తిరిగినవాడు; ఐ = అయి; ఉపవేశించి = కూర్చుండి; జనమేజయు = జనమేజయుని; రప్పించి = పిలిపించి; రాజ్య = రాజ్యము యొక్క; భారంబున్ = భారమును; సమర్పించి = అప్పజెప్పి; యత్నంబున్ = ప్రయత్నమును; సంసార = సంసారము యొక్క; బంధంబున = బంధముల; కున్ = కు; తప్పించి = తప్పించి; చిత్తంబున్ = మనస్సును; హరి = భగవంతుని; కిన్ = కి; ఒప్పించి = అర్పించి; పరమ = ఉత్కృష్టమైన; భాగవతుండు = భాగవత మార్గనుయాయి; ఐన = అయినట్టి; పాండవపౌత్రుండు = పరీక్షిత్తు {పాండవపౌత్రుండు - పాండవులమనుమడు, పరీక్షిత్తు}; ప్రాయోపవిష్టుండు = ప్రాయోపవిష్టుడు {ప్రాయోపవిష్టుడు - ఆహారాదులు మాని మరణమునకు ఎదురు చూచుట అను నిష్ఠలో ఉన్నవాడు}; ఐ = అయి; ఉన్న = ఉన్నట్టి; సమయంబున = సమయమున.

భావము:- అని రాబోయే జన్మ జన్మాలకూ భగవత్ భక్తి సౌభాగ్యం తనకు ప్రాప్తించాలని ప్రార్థించాడు. గంగాతరంగిణి దక్షిణతీరంలో తూర్పుకొనలు ఉండేటట్లుగా పరచిన దర్భాసనం మీద ఉత్తరాభిముఖుడై కూర్చున్నాడు. తనయుడైన జనమేజయుణ్ణి రప్పించి రాజ్యభారం అప్పగించాడు. తన చిత్తాన్ని సంసార బంధాల నుంచి నివృత్తం చేసి పరమేశ్వరాయత్తం కావించాడు, ఈ విధంగా భాగవతోత్తముడైన పాండవ పౌత్రుడు ప్రాయోపవిష్టుడై ఉన్న శుభ సమయంలో.

1-509-క.

ఒత్తిలి పొగడుచు సురలు వి
యత్తలముననుండి మెచ్చి యలరుల వానల్
మొత్తములై కురిసిరి నృప
సత్తముపై భూరి భేరి శబ్దంబులతోన్.

టీక:- ఒత్తిలి = గట్టిగా; పొగడుచు = కీర్తించుచు; సురలు = దేవతలు; వియత్తలమునన్ = ఆకాశమున; ఉండి = ఉండి; మెచ్చి = అభినందించి; అలరుల = పూల; వానల్ = వర్షములు; మొత్తములు = అధికములు; ఐ = అయి; కురిసిరి = కురిపించిరి; నృపసత్తము = పరీక్షితుని; పైన్ = మీద; భూరి = పెద్ద; భేరి = భేరీల; శబ్దంబులు = మోతలు; తోన్ = తో.

భావము:- గుణగణాలు పొగడుతూ, నగారాలు మ్రోగిస్తూ, సురలు ఆకాశం మీంచి పరీక్షిత్తుపై విరులవానలు కురుపించారు.

1-510-వ.

ఆ సమయంబున సభాసీనులయిన ఋషు లిట్లనిరి.

టీక:- ఆ=ఆ; సమయంబునన్= సమయమున; సభ=సభయందు; ఆసీనులు = కూర్చున్న వారు; అయిన = అయిన; ఋషులు = ఋషులు; ఇట్లు = ఈ విధముగా; అనిరి = పలికిరి.

భావము:- ఆ సమయంలో సభాసీను లయిన ఋషు లిట్లనిరి.

1-511-మ.

"క్షితినాథోత్తమ! నీ చరిత్రము మహాచిత్రంబు; మీ తాత లు

గ్ర తపోధన్యులు; విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్యశో

భిత కోటీర మణిప్రభాన్విత మహాపీఠంబు వర్జించి రు

న్నతులై; నీవు మహోన్నతుండవు గదా నారాయణధ్యాయివై.

టీక:- క్షితినాథోత్తమ = పరీక్షిన్మహారాజ {క్షితినాథోత్తముడు - భూమికి భర్తలలో శ్రేష్ఠుడు, పరీక్షిన్మహారాజు}; నీ = నీ; చరిత్రము = నడవడిక; మహా = గొప్ప; చిత్రంబు = ఆశ్చర్యకరమైనది; మీ = మీ; తాతలు = తాతలు; పూర్వులు; ఉగ్ర = ఉగ్రమైన; భీకరమైన; తపస్ = తపస్సు వలన; ధన్యులు = చరితార్థులు; విష్ణు = విష్ణువు; పార్శ్వ = ప్రక్కన ఉండుట అను; పదవిన్ = గొప్పస్థితిని; కామించి = కోరుకొని; రాజన్య = రాజుల యొక్క; శోభిత = శోభకలిగిన, ప్రకాశిస్తున్న; కోటిర = కిరీటముల; మణి = రత్నపు; ప్రభ = ప్రభలచే; కాంతులచే; ఆన్విత = కూడిన; మహా = గొప్ప; పీఠంబున్ = సింహాసనమును; వర్జించిరి = విడిచిపెట్టిరి; ఉన్నతులు = గొప్పవారు, శ్రేష్ఠులు; ఐ = అయి; నీవు = నీవు; మహా = మిక్కిలి; ఉన్నతుండవున్ = గొప్పవాడివి; కదా = కదా; నారాయణ = భగవంతుని; అధ్యాయివి = ధ్యానించువాడవు; ఐ = అయి.

భావము:- "రాజేంద్రా! నీ చరిత్రం చాలా చిత్రం. స్తుతిపాత్రం. మీ పూర్వీకులు మహా తపస్సంపన్నులు, వారు వాసుదేవుని సన్నిధిని వాంఛించి నానారాజ కిరీట రత్న రత్న ప్రభారాజితో విరాజిల్లే రాజపీఠాన్ని విసర్జించారు. వారే ఉన్నతు లనుకొంటే నారాయణ నామ పారాయణుడవైన నీవు వారి కంటె మహోన్నతుడవు.

1-512-మ.

వసుధాధీశ్వర! నీవు మర్త్య తనువున్ వర్జించి; నిశ్శోకమై,

వ్యసనచ్ఛేదకమై, రజోరహితమై వర్తించు లోకంబు స

ర్వసమత్వంబునఁ జేరునంతకు; భవద్వాక్యంబులన్ వించు నే

దెసకుం బోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్."

టీక:- వసుధాధీశ్వర = రాజా; నీవు = నీవు; మర్త్య = మానవ; తనువున్ = శరీరమును; వర్జించి = విడిచిపెట్టి; నిశ్శోకము = శోకములేనిది; ఐ = అయి; వ్యసన = పాపములు {వ్యసనములు - పాపములు; కామక్రోధముల వలన పుట్టిన దోషములు [ఇవి యేడు (7) పానము, స్త్రీ, మృగయ, ద్యూతము, (ఇవి కామము వలన పుట్టినవి) వాక్పారుష్యము, దండ పారుష్యము, అర్థ పారుష్యము, (ఇవి కోపము వలన పుట్టినవి]}; ఛేదకము = త్రుంచివేయబడినవి; ఐ = అయి; రజస్ = రజోగుణము; రహితము = లేనిది; ఐ = అయి; వర్తించు = ఉండు; లోకంబు = లోకము; సర్వ = సమస్తమునందు; సమత్వంబునన్ = సమత్వముతో; చేరున్ = చేరెడి; అంత = సమయము; కున్ = వరకు; భవత్ = నీ యొక్క; వాక్యంబులన్ = భాషణములను - మాటలను; వించున్ =

వినుచు; ఏ = ఏ; దెస = ప్రక్క; కున్ = కు; పోవక = వెళ్ళకుండగ; చూచుచున్ = చూచుచు; ఉండెదము = ఉంటాము; నీ = నీ యొక్క; దివ్య = లోకాతీతమైన; ప్రభావంబులన్ = మహిమలను.

భావము:- వసుమతీవల్లభా! నీవు ఈ మనుష్యదేహాన్ని వదలి శోకరహితమై, వ్యసనరహితమై, రజోరహితమై వర్తించే పుణ్యలోకాన్ని చేరేటంతవరకూ మేమిక్కడే ఉంటాము. ఎక్కడకీ పోకుండా నీ మాటలు వింటూ నీ దివ్యప్రభావము అంతా తిలకిస్తూ ఇక్కడే కూర్చుంటాము."

## 1-513-వ.

**అని యిట్లు పక్షపాత శూన్యంబులును; మహనీయ, మాధుర్య, గాంభీర్య, సౌజన్య, ధుర్యంబులును నైన భాషణంబు లాడుచు; మూఁడులోకంబులకు నవ్వలిదైన సత్యలోకంబునందు మూర్తిమంతంబులై నెగడుచున్న నిగమంబుల చందం బునం దేజరిల్లు చున్నఋషులంజూచి, భూవరుండు నారాయణకథాశ్రవణ కుతూహలుండయి నమస్కరించి యిట్లనియె.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగా; పక్ష = ఒక పక్షముపై; పాత = ఆసక్తి యుండుట; శూన్యంబులును = లేనివియును; మహనీయ = గొప్పవి; మాధుర్య = తీయనివి; గాంభీర్య = గంభీరమైనవి; సౌజన్య = సౌమ్యమైనవి; ధుర్యంబులు = బరువైనవియును - శ్రేష్ఠమైనవియును; ఐన = అయినట్టి; భాషణం బులు = స్తోత్రములు; మాటలు; ఆడుచు = పలుకుచు; మూఁడు = మూడు; లోకంబుల = లోకముల {మూడు లోకములు - భూలోకము, భువర్లోకము, సువర్లోకము. భూ అథో ఊర్ధ్వ లోకములు}; కున్ = కును; అవ్వలిది = అవలతలది, పైది; ఐన = అయినట్టి; సత్య = సత్య; లోకంబున్ = లోకము; అందున్ = లోపల; మూర్తిమంతంబులు = ఆకారము ధరించినవి; ఐ = అయి; నెగడుచున్న = వర్ధిల్లుతున్న, ప్రసిద్ధచెందిన; నిగమంబుల = వేదముల; చందంబునన్ = వలె; తేజరిల్లుచున్న = ప్రకాశిస్తున్న; ఋషులన్ = ఋషులను; చూచి = చూసి; భూవరుండు = భూమికి భర్త, రాజు; నారాయణ = నారాయణుని {నారాయణుడు - నారములందు వసించువాడు, హరి}; కథా = కథలను; శ్రవణ = వినవలెనను; కుతూహలుండు = కుతూహలము కలవాడు; అయి = అయి; నమస్కరించి = నమస్కరించి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అని ఇలా నిరపేక్షంగా నిష్పక్షపాతంగా మహర్షులు పలికిన మధుర గంభీర భాషణాలు విని, ముల్లోకాలకూ అవతల ఉన్న సత్యలోకంలో మూర్తిమంతాలై వెలిగే వేదాల్లాగా విరాజిల్లే మహర్షులను మహారాజు నమస్కరించాడు. విష్ణులీలలు వినాలనే కుతూహలంతో ఇలా అన్నాడు.......

1-514-క.

"ఏడు దినంబుల ముక్తిం

గూడఁగ నేరీతి వచ్చు గురు సంసార

క్రీడన మే క్రియ నెడతెగుఁ,

జూడుఁడు మాతండ్రులార! శ్రుతివచనములన్.

టీక:- ఏడు = ఏడు (7); దినంబులన్ = రోజులలో; ముక్తిన్ = ముక్తిని; కూడఁగన్ = పొందుట; ఏ = ఏ; రీతి = విధముగ; వచ్చున్ = కలుగును; గురు = భారమైన; సంసార = సంసారము యొక్క; క్రీడనము = ప్రవర్తనము; ఏ = ఏ; క్రియన్ = విధముగ; ఎడతెగున్ = తెగిపోవును; చూడుఁడు = చూడండి; మా = మా; తండ్రులార = తండ్రులూ; శ్రుతి = వేద; వచనములన్ = వాక్కులను.

భావము:- "తండ్రులారా! వేదవాక్యాలు బాగా పరిశీలించి సెలవీయండి. సప్తదినాలలో సంసార బంధాలు త్రెంచుకొని అపవర్గాన్ని అందుకొనే మార్గం కృపతో ఉపదేశించండి.

1-515-శా.

ప్రాప్తానందులు, బ్రహ్మబోధన కళాపారీణు, లాత్మప్రభా

లుప్తాజ్ఞానులు, మీర, లార్యులు, దయాళుత్వాభిరాముల్, మనో

గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా!

సప్తాహంబుల ముక్తి కేఁగెడు గతిం జర్చించి భాషింపరే."

టీక:- ప్రాప్త = పొందిన; ఆనందులు = ఆనందం గల వారు; బ్రహ్మ = పరబ్రహ్మమును; బోధన = బోధించు; కళా = కళ యందు; పారీణులు = పరిపక్వము చెందినవారు; పారము ముట్టినవారు; ఆత్మ = తమ; ప్రభా = ప్రభావముచేత; లుప్త = లోపింప జేయబడిన; అజ్ఞానులు = అజ్ఞానము కల వారు; మీరలు = మీరు; ఆర్యులు = గౌరవింప దగినవారు; దయాళుత్వ = దయాస్వభావముతో; అభిరాముల్ = సొంపైనవారు; మనస్ = మనసు నందు; గుప్తంబుల్ = దాచబడినవి; సకల = సమస్త మైన; అర్థ = ప్రయోజనముల; జాలములు = సమన్వయములు; మీకున్ = మీకు; కానన్ = తెలిసి; వచ్చున్ = వచ్చును; కదా = కదా; సప్త = ఏడు (7); అహంబులన్ = దినములలో; ముక్తి = ముక్తి; కిన్ = కి; ఏఁగెడు = వెళ్ళుటకు; గతిన్ = దారిని; విధమును; చర్చించి = విమర్శించి; భాషింపరే = చెప్పండి.

భావము:- మీరు ఆనంద స్వరూపులు, బ్రహ్మజ్ఞాన బోధనా పారీణులు, ఆత్మతత్త్వ మెరిగి అవిద్య తొలగిన వారు, సకలము తెలిసిన విజ్ఞులు, దయార్ద్ర హృదయులు, లోకంలోని సమస్త విషయాలను మనోనేత్రాలతో దర్శించగలవారు. మీరు విచారించి ఏడురోజులలో మోక్షంపొందే మార్గం నాకు చెప్పండి. అని గంగానది వద్ద ప్రాయోపవిష్టుడైన పరీక్షిత్తు వచ్చిన ఋషులు సంయమీంద్రులు అందరిని అడుగుతున్నాడు.

1-516-వ.

**అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు ముని లందఱుఁ బ్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున.**

టీక:- అని = అని; ఉత్తరానందనుండు = పరీక్షిత్తు {ఉత్తరానందనుడు - ఉత్తర యొక్క కొడుకు, పరీక్షిత్తు}; ఆడిన = పలికిన; వచనంబులు = మాటలు; కున్ = కు; మునులు = మునులు; అందఱున్ = అందరును; ప్రతి = తిరుగు; ఉత్తరంబున్ = సమాధానమును; విమర్శించు = చర్చించుకొను; ఎడ = సమయమునకు; దైవ = దైవ; యోగంబునన్ = అనుగ్రహము వలన.

భావము:- అని పలుకుతున్న ఉత్తరానందనుని ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరం కోసం సంయమీంద్రు లందరూ సమాలోచనలు జరుపుతున్నారు.

## శుకముని యాగమనంబు

1-517-సీ.

**ప్రతినిమేషము పరబ్రహ్మంబు నీక్షించి-**
**మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు;**
**కమలంబుమీఁది భృంగముల కైవడి మోము-**
**పై నెఱపిన కేశపటలివాఁడు;**
**గిఱి వ్రాసి మాయ నంగీకరించని భంగి-**
**వసనంబుఁ గట్టక వచ్చువాఁడు;**
**సంగిగాఁ డని వెంటఁ జాటు భూతములు నా-**
**బాలుర హాస శబ్దములవాఁడు;**

1-517.1-తే.

**మహిత పద, జాను, జంఘోరు, మధ్య, హస్త,**
**బాహు, వక్షోగళానన, ఫాల, కర్ణ,**
**నాసికా, గండ, మస్తక, నయన యుగళుఁ**
**డైన యవధూతమూర్తి వాఁ డరుగుదెంచె.**

టీక:- ప్రతి = ప్రతి ఒక్క; నిమేషము = రెప్పపాటు కాలమందును; పరబ్రహ్మంబున్ = పరబ్రహ్మమును; ఈక్షించి = చూసి; మదిన్ = మనసులో; చొక్కి = పరవశుడై; వెలుపల = బాహ్య ప్రపంచమును; మఱచు = మరచిపోవు; వాఁడు = వాడు; కమలంబు = పద్మము; మీఁది = మీది; భృంగముల = తుమ్మెదల; కైవడిన్ = వలె; మోము = ముఖము; పైన్ = మీద; నెఱపిన = పరచ బడిన; కేశ = వెంట్రుకల; పటలి = గుంపు; వాఁడు = కలవాడు; గిఱి = గీత; వ్రాసి = గీసినట్లు; మాయన్ = మాయను; అంగీకరించని=అంగీకరింపని; భంగి = విధముగ; వసనంబున్ = వస్త్రము; కట్టక = కట్టుకోకుండగ; వచ్చు = ఉండు; వాఁడు = వాడు; సంగి గాఁడు = ఏమీ పట్టని వాడు; అని = అని; వెంటన్ = వెంటపడి; చాటు = చాటుతున్న; భూతములు = సర్వభూతములు; నా = అన్నట్లు; బాలుర = పిల్లల; హాస = నవ్వుల; శబ్దంబుల = శబ్దముల; వాఁడు = వాడు;

మహిత = గొప్పవి యైన; పద = పదములు; జాను = మోకాళ్ళు; జంఘ = పిక్కలు; ఉరు = తొడలు; మధ్య = నడుము; హస్త = చేతులు; బాహు = భుజములు; వక్షస్ = ఛాతి; గళ = కంఠము; ఆనన = ముఖము; ఫాల = ఫాలము; కర్ణ = చెవులు; నాసిక = ముక్కు; గండ = చెక్కిళ్ళు; మస్తక = తల; నయన = కళ్ళ; యుగళుడు = జంట ఉన్న వాడు; ఐన = అయినట్టి; అవధూత = దిగంబరమైన; మూర్తి = స్వరూపము - ఆకారము; వాడు = కలవాడు; అరుగుదెంచెన్ = వచ్చెను.

భావము:- ఆ సమయంలో దైవయోగంవల్ల, ప్రతిక్షణమూ పరబ్రహ్మ స్వరూపాన్ని సందర్శిస్తూ పరవశించిన హృదయంతో బయటి ప్రపంచాన్ని మరచినవాడూ, కమలం మీద తుమ్మెదల్లాగా ముఖంపైన ముంగురులు ముసురుతున్న వాడూ, గీత గీసి మాయను తిరస్కరించినట్లు వస్త్రాన్ని విసర్జించినవాడూ, సర్వసంగ పరిత్యాగియైన మహాయోగి ఇతడని చాటుతున్నట్లు పరిహాసవచన పరిచాలకులైన బాలకులు వెంటనంటి వస్తున్నవాడూ, సహజ సుందరాలైన చరణాలూ, జంఘలూ, ఊరువులూ, నడుమూ, చేతులూ, భుజాలూ, వక్షస్థలమూ, కంఠమూ, ముఖమూ, లలాటమూ, వీనులూ, కన్నులూ, నాసికా, చెక్కిళ్లూ, శిరస్సూ కలిగిన ఒక అవధూతమూర్తి అనుకోకుండా అచ్చటికి విచ్చేసాడు.

### 1-518-ఉ.

**ఊరని లోకులం గినిసి యెగ్గులు వల్కనివాఁడు, గోరికల్**
**గోరనివాఁడు, గూటువలఁ గూడనివాఁడు, వృథా ప్రపంచముం**
**జేరనివాఁడు, దైవగతిఁ జేరిన లాభము సూచి తుష్టుఁడై**
**నేరనివాని చందమున నేర్పులు సూపెడువాఁడు, వెండియున్.**

టీక:- ఊరు = ఊయరు; అని = అని; లోకులన్ = ప్రజలను; కినిసి = కోపించి; ఎగ్గులు = నిందలు; పల్కని = పలుకని; వాఁడు = వాడు; కోరికల్ = కోరికలు ఏమియు; కోరని = అడగని; వాఁడు = వాడు; కూటు = గుంపులు; జన సమ్మర్థము ఉన్న చోటులు; వలన్ = వలలో; కూడని = కలవని; వాఁడు = వాడు; వృథా = వ్యర్థముగ; ప్రపంచమున్ = ప్రాపంచిక విషయములను; చేరని = కూడని; వాఁడు = వాడు; దైవ = దైవము; గతిన్ = వలన; చేరిన = వచ్చినది; లాభమున్ = దొరికినది; సూచి = చూసి; తుష్టుఁడు = సంతృప్తితో కూడిన సంతోషము కలవాడు; ఐ = అయి; నేరని = చేతగాని; వాని = వాని; చందమునన్ = వలె ఉండి; నేర్పులు = తెలివి; సూపెడు = చూపు; వాఁడు = వాడు; వెండియున్ = ఇంకను.

భావము:- ఈయలేదని ఎవరినీ కోపంతో ఎగ్గులు పలకడు, కావాలని ఏ కోరికలూ కోరడు. ఎవరితోనూ సంబంధాలు పెట్టుకోడు. వ్యర్థమైన ప్రపంచ విషయాల మీదికి మనస్సు పోనీయడు. దైవవశం వల్ల తనకు ప్రాప్తించిన దానితో సంతృప్తి చెంది ఏమీ ఎరుగని అమాయకునిలా కనబడుతాడు.

1-519-ఆ.

అమ్మహాత్ము షోడశాబ్ద వయోరూప,
గమన, గుణ, విలాస, కౌశలములు,
ముక్తికాంత సూచి మోహిత యగునన
నితర కాంత లెల్ల నేమి సెప్ప.

టీక:- ఆ = ఆ; మహా = గొప్ప; ఆత్ము = ఆత్మ కలవాని; షోడశ = పదహారు (16); అబ్ద = సంవత్సరముల; వయస్ = ఈడు; రూప = రూపము; గమన = నడవడిక; గుణ = గుణములు; విలాస = శోభ, ప్రకాశము; కౌశలములు = నేర్పరితనములు; ముక్తి = ముక్తి అను; కాంత = స్త్రీ; చూచి = చూసి; మోహిత = మోహింపబడినది; అగున్ = అగును; అనన్ = అనగా; ఇతర = ఇతర; కాంతలు = స్త్రీలు; ఎల్లన్ = అందరి గురించి; ఏమి = ఏమి; సెప్పన్ = చెప్పగలము.

భావము:-ఆ మహాత్ముని పదహారేళ్ల నవయౌవనం చూస్తే ఆ సుందర గమనం గమనిస్తే, ఆ గుణవిశేషాలు ఆలోకిస్తే, ముక్తికాంత సైతం ముచ్చటపడి మోహిస్తుందంటే ఇక ఇతరకాంతల విషయం వేరే చెప్పే దేముంది.

1-520-ఆ.

వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై
బ్రహ్మభావముననుఁ బర్యటింప,
వెఱ్ఱి యంచు శుకుని వెంట నేతెంతురు
వెలఁదు లర్భకులును వెఱ్ఱు లగుచు.

టీక:- వెఱ్ఱి = కపట; తనము = స్వభావము; మాని; విజ్ఞాన = విజ్ఞానమునే; మూర్తి = స్వరూపముగా కలవాడు; ఐ = అయి; బ్రహ్మ = బ్రహ్మము తానే; భావమునను = అను భావముతో; పర్యటింపన్ = చరించు చుండ; వెఱ్ఱి=ఉన్మాదుడు; అంచున్= అనుచు; శుకుని=శుకమహర్షి; వెంటన్ = వెంటపడి; ఏతెంతురు = వస్తూ ఉంటారు; వెలఁదులు = ఆడవారును; అర్భకులును = పిల్లలును; వెఱ్ఱులు = తెలివితక్కువ వారు; అగుచున్ = అగుచు.

భావము:- వెఱ్ఱిలోకాన్ని విసర్జించి విజ్ఞానమూర్తితో, బ్రహ్మజ్ఞాన పరిస్ఫూర్తితో పర్యటిస్తున్న మహానుభావుడైన శ్రీశుకుణ్ణి వెఱ్ఱివాడని భావించి ఏదో వెఱ్ఱెత్తినట్టు స్త్రీలూ, బాలకులూ ఆయన వెంటబడి పరుగెత్తుకొంటూ వస్తుంటారు.

1-521-వ.

ఇట్లు వ్యాసనందనుండైన శుకుం డరుగుదెంచిన నందలి మునీంద్రు లమ్మహా నుభావుని ప్రభావంబు లెఱుంగుదురు కావున నిజాసనం బులు డిగ్గి ప్రత్యుత్థా నంబు సేసిరి; పాండవపౌత్రుండు నా యోగిజన శిఖామణికి నతిథి సత్కారంబులు గావించి దండప్రణామంబుసేసి పూజించె; మఱియు గ్రహ నక్షత్ర తారకా మధ్యం బునం దేజరిల్లు రాకాసుధాకరుండునుం బోలె బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబున గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; వ్యాస = వ్యాసుని; నందనుండు = కుమారుడు; ఐన = అయినట్టి; శుకుండు = శుకుడు; అరుగుదెంచినన్ = వచ్చిన; అందలి = అక్కడి; ముని = మునులలో; ఇంద్రులు = శ్రేష్ఠులు; ఆ = ఆ; మహా = గొప్ప; అనుభావుని = అనుభవములు కలవాని; ప్రభావంబులు = గొప్పతనములు; ఎఱుంగుదురు = తెలిసినవారు; కావున = అగుటవలన; నిజ = తమ; ఆసనంబులు = ఆసనములు; డిగ్గి = దిగి; ప్రతి = ఎదురేగుటకు; ఉత్థానంబున్ = లేచుట; లేచి ఎదురేగుటలు; చేసిరి = చేసిరి; పాండవపౌత్రుండున్ = పరీక్షిన్మహారాజును; ఆ = ఆ; యోగి = యోగులగు; జన = జనులలో; శిఖా = శిఖలోని; మణి = రత్నము వంటి వాని; ఉత్కృష్టుని; కిన్ = కి; అతిథి = అతిథి; సత్కారంబులు = గౌరవములు; కావించి = పూర్తిచేసి; దండప్రణామంబు = సాష్టాంగ నమస్కారము {దండప్రణామము - సాష్టాంగ నమస్కారము, కఱ్ఱవలె భూమిపై పరుండి నమస్కరించుట}; చేసి = చేసి; పూజించెన్ = పూజించెను; మఱియున్ = ఇంకనూ; గ్రహ = గ్రహములు; నక్షత్ర = నక్షత్రములు {నక్షత్రములు - తారకల సమూహములు}; తారక = తారకలు; మధ్యంబునన్ = మధ్యలో; తేజరిల్లు = ప్రకాశించుచున్న; రాకా = పౌర్ణమి నాటి; సుధాకరుండునున్ = చంద్రుని {సుధాకరుడు - వెన్నెల కలుగ జేయు వాడు, చంద్రుడు}; పోలెన్ = వలె; బ్రహ్మర్షి = బ్రహ్మర్షులు; దేవర్షి = దేవర్షులు; రాజర్షి = రాజర్షులు; మధ్యంబునన్ = మధ్యలో; గూర్చుండి = కూర్చుండి; విరాజమానుండు = విరాజిల్లుతున్నవాడు; ఐన = అయినట్టి; శుక = శుకుడను; యోగి = యోగులలో; ఇంద్రున్ = శ్రేష్ఠుని; కనుంగొని = చూసి.

భావము:- ఈ విధంగా వేదవ్యాస నందనుడైన శుకయోగీంద్రుడు అక్కడకు రాగా ఆ మహానుభావుని మహత్త్వం తెలిసిన అక్కడి మునివర్యులంతా తమతమ ఆసనాల నుంచి లేచి ఎదురువచ్చారు. పాండవ పౌత్రుడైన పరీక్షిత్తు ఆ మహాయోగికి అతిథి సత్కారాలు కావించాడు. సాష్టాంగదండప్రణామంచేసి పూజించాడు. గ్రహనక్షత్రతారకాసమూహం నడుమవిరాజిల్లే సంపూర్ణ పూర్ణిమచంద్రుడులాగా బ్రహ్మర్షి దేవర్షి మధ్యలో కూర్చుండి విరాజిల్లే శుకయోగీంద్రుని చూచి ...

1-522-ఉ.

ఫాలము నేలమోపి భయభక్తులతోడ నమస్కరించి, భూ
పాలకులోత్తముండు గరపద్మములన్ ముకుళించి, "నేఁడు నా
పాలిటి భాగ్య మెట్టిదియొ పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవు వచ్చితి వివేకవిభూషణ! దివ్యభాషణా!

టీక:- ఫాలమున్ = నుదుటిని; నేలన్ = నేలపై; మోపి = ఆన్చి; భయ = భయమును; భక్తుల = భక్తియును; తోడన్ = తోకూడి; నమస్కరించి = నమస్కరించి; భూ = భూమికి {భూపాలకులోత్తముడు - రాజుల వంశములో శ్రేష్ఠుడు, పరీక్షిత్తు}; పాలక = పాలకుల; కుల = వంశములో; ఉత్తముండు = శ్రేష్ఠుడు; పరీక్షిన్మహారాజు; కర = చేతులు అను; పద్మములన్ = పద్మములను; ముకుళించి = ముడిచి; నేఁడు = ఇవేళ; నా = నా; పాలిటి = పాలిటి; భాగ్యము = భాగ్యము; ఎట్టిదియొ = ఎలాంటిదో; పావన = పవిత్రమైన; మూర్తివి = ఆకారము కలవాడవు; పుణ్య = పుణ్యములవలన; కీర్తివి = ప్రసిద్ధి పొందినవాడవు; ఈ = ఈ; వేళ = సమయము; కున్ = నకు; నీవు = నీవు; వచ్చితి = వచ్చితివి; వివేక = వివేకము అను; విభూషణ = విశిష్ట అలంకారము కలవాడా; దివ్య = జ్ఞాన పూరితము లగు; భాషణా = భాషణములు చేయువాడా.

భావము:- కురుకులావతంసమైన పరీక్షిత్తు మళ్లీ క్షోణితలాన వెన్నుదురు సోకేటట్లుగా ప్రణామంచేసి కరకమలాలు జోడించి ఇలా విన్నవించుకొన్నాడు-"మహానుభావా! శుకదేవా! నా అదృష్టమేమో గాని పావనమూర్తివీ, పుణ్యకీర్తివీ, విజ్ఞాన విభూషణుడవూ, దివ్యభాషణుడవూ అయిన నీవు సమయానికి విజయం జేశావు.

1-523-మ.

అవధూతోత్తమ! మంటి, నేఁడు నిను డాయం గంటి, నీవంటి వి
ప్రవరుం బేర్కొను నంతటన్ భసిత మౌఁ బాపంబు నా బోటికిన్,
భవదాలోకన, భాషణార్చన, పదప్రక్షాళన, స్పర్శనా
ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే?

టీక:- అవధూత = అవధూతలలో {అవధూత - పైపొరలు తొలగినవాడు; స్థూలార్థము దిగంబరుడు; సూక్ష్మార్థము జీవులలో వసించు పరబ్రహ్మము చుట్టును కల మాయ అను పొరలు తొలగినవాడు}; ఉత్తమ = శ్రేష్ఠుడా; మంటి = బ్రతికితిమి; నేఁడు = ఇవేళ; నినున్ = నిన్ను; డాయన్ = దగ్గరలో; కంటి = చూడకలిగితిమి; నీ = నీ; వంటి = వంటి; విప్ర = బ్రాహ్మణ; వరున్ = శ్రేష్ఠుని; పేర్కొనున్ = తలచిన; అనుకొనిన; అంతటన్ = అంతటనే; భసితము = భస్మము; ఔన్ = అగును; పాపంబున్ = పాపములు; నా = నా; బోటి = వంటి వాని; కిన్ = కి; భవత్ = తమను; ఆలోకన = చూచుట; భాషణ = మాట్లాడుట; అర్చన = పూజించుట; పద =

పదముల; ప్రక్షాళన = కడుగుట; స్పర్శన = స్పర్శించుట; ఆది = మొదలగు; విధానంబుల = పద్ధతుల వలన; ముక్తి = ముక్తి; చేన్ = చేతిలో; పడుట = పడుట; దొరకుట; చింతింపంగన్ = ఆలోచించిన; ఆశ్చర్యమే = ఆశ్చర్యమా ఏమి.

భావము:- అవధూతశిరోమణీ! నేను ధన్యుణ్ణయితిని. నేడు నీవు నా వద్దకు రావడం చూచితిని. నీవంటి బ్రాహ్మణ శ్రేష్ఠుని నామం ఉచ్చరించినంత మాత్రమున పాపాలన్నీ భస్మీపటల మౌతాయి. ఇక నిన్ను దర్శించుట, నీ మాటలు వినుట, నిన్ను అర్చించుట, నీ కాళ్లు కడిగుట, నిన్ను స్పృశించుట మున్నగు విధానాలు లభించడం వలన నా వంటి వానికి మోక్షం సంప్రాప్తించుటలో ఆశ్చర్య మేముంది.

1-524-క.

హరిచేతను దనుజేంద్రులు

ధరఁ ద్రుంగెడు భంగి నీ పదస్పర్శముచే

గురుపాతకసంఘంబులు

పొరిమాలుఁ గదయ్య యోగిభూషణ! వింటే.

టీక:- హరి = భగవంతుని; చేతను = వలనను; దనుజ = రాక్షస; ఇంద్రులు = రాజులు; ధరన్ = భూమి మీదకు; త్రుంగెడు = తెగిపడుట; భంగిన్ = వలె; నీ = నీ; పాద = పాదముల; స్పర్శము = స్పర్శ - తగులుట; చేన్ = చేత; గురు = మిక్కిలి బరువైన; పాతక = పాపపు; సంఘంబులు = సమూహములు; పొరిమాలున్ = రూపుమాసిపోవును - నశించును; కదా = కదా; అయ్య = తండ్రీ; యోగి = యోగులకు; భూషణ = అలంకారమా; వింటే = వింటే.

భావము:- ఓ యోగీశ్వరా! శుకా! భగవంతుడైన వాసుదేవుని వల్ల జగత్కంటకులైన నిశాచరులు నశించిపోయినట్లే, పరమయోగివైన నీ పాదస్పర్శ వలన పాపాలు అన్నీ భస్మీభూత మవుతాయి కదా!

1-525-మ.

ఎలమిన్ మేనమఱందియై, సచివుఁడై, యే మేటి మాతాతలన్

బలిమిం గాచి సముద్ర ముద్రిత ధరం బట్టంబుఁ గట్టించె, న

య్యలఘుం, డీశుఁడు, చక్రి, రక్షకుఁడు గాకన్యుల్ విపద్రక్షకుల్

గలరే? వేఁడెద భక్తి నా గుణనిధిం, గారుణ్యవారాన్నిధిన్.

టీక:- ఎలమిన్ = సంతోషముగ; మేనమఱంది = మేనమరిది; ఐ = అయి; సచివుఁడు = మంత్రి; ఐ = అయి; ఏ = ఏ; మేటి = శ్రేష్ఠుడు – గొప్పవాడు; మా = మా; తాతలన్ = తాతలను; బలిమిన్ = బలముగ; గట్టిగా; కాచి = కాపాడి; సముద్ర = సముద్రములచే; ముద్రిత = చుట్టబడిన; ధరన్ = భూమిని; పట్టంబున్ = పట్టము; కట్టించెన్ = కట్టించెను; పట్టాభిషిక్తులను చేసెను; ఆ = ఆ; అలఘున్ = చిన్న కానివాడు; గొప్పవాడు; ఈశుఁడు = ప్రభువు; చక్రి = కృష్ణుడు {చక్రి - చక్రాయుధుడు, కృష్ణుడు}; రక్షకుఁడు = రక్షించువాడు; కాక = అంతేగాని; అన్యుల్ = ఇతరులు; విపత్ = ఆపదల నుండు; రక్షకుల్ = రక్షించువారు; కలరే = కలరా ఏమి; లేరు; వేఁడెదన్ =

ప్రార్థించెదను; భక్తిన్ = భక్తితో; ఆ = ఆ; గుణ = గుణముల; నిధిన్ = పాతర వంటివాని; కారుణ్య = దయకు; వారాన్నిధిన్ = సముద్రుని.

భావము:- ఏ మహానుభావుడు ప్రియమైన మరదియై, మంత్రియై మా పితామహులైన పాండవులను చతుస్సముద్ర ముద్రితమైన ధరణీచక్రానికి చక్రవర్తులను చేసాడో, ఆ మహాత్ముడు, ఆ లోకేశ్వరుడు, ఆ చక్రాయుధుడు అందరికీ రక్షకుడై ఉంటాడు. ఆపదలో ఉన్నవారిని ఆదరాభిమానాలతో ఆదుకొనే రక్షకులు ఆయన కాకపోతే లోకంలో మరెవరున్నారు? ఆ భక్తులపాలిటి పెన్నిధిని ఆ కారుణ్యవారాన్నిధిని భక్తితో వేడుకొంటాను.

## శుకుని మోక్షోపాయం బడుగట

1-526-సీ.

అవ్యక్తమార్గుండవైన నీ దర్శన-

మాఱడి పోనేర; దభిమతార్థ

సిద్ధి గావించుట సిద్ధంబు; నే డెల్లి-

దేహంబు వర్జించు దేహధారి

కేమి చింతించిన? నేమి జపించిన?-

నేమి గావించిన? నేమి వినిన?

నేమి సేవించిన? నెన్నఁడు సంసార-

పద్ధతిఁ బాసిన పదవి గలుగు,

1-526.1-తే.

నుండు మనరాదు; గురుఁడవు, యోగివిభుఁడ,

వావుఁ బిదికిన తడ వెంత యంత సేపు

గాని యొక దెస నుండవు, కరుణతోడఁ

జెప్పవే తండ్రి! ముక్తికిఁ జేరు తెరువు."

టీక:- అవ్యక్త = తెలియుటకు కష్టమైన; మార్గుండవు = మార్గము కలవాడవు; ఐన = అయినట్టి; నీ = నీ; దర్శనము = దర్శనము; ఆఱడిన్ = వ్యర్థము; పోన్ = అయిపోవుట; నేరదు = జరగదు; అభిమత = కోరిన; అర్థ = ప్రయోజనము; సిద్ధిన్ = సిద్ధించునట్లుగా; కావించుట = చేయుట; సిద్ధంబు = తప్పదు; నేడు = ఇవేళో; ఎల్లి = రేపో; దేహంబున్ = శరీరమును; వర్జించు = విడవబోవుచున్న; దేహ = శరీరమును; ధారి = ధరించినవాని; కిన్ =

కి; ఏమి = ఏమి; చింతించినన్ = ధ్యానము చేసిన; ఏమి = ఏమి; జపించిన = జపమును చేసిన; ఏమి = ఏమి; కావించిన = చేయించిన; ఏమి = ఏమి; వినినన్ = విన్న; ఏమి = ఏమి; సేవించినన్ = పూజించిన; ఎన్నఁడున్ = ఎప్పుడును; సంసార = సంసారము వలన; పద్ధతిన్ = మార్గము (పునర్జన్మల దారి); పాసిన = తొలగిన; పదవి = పరిస్థితి – ముక్తి; కలుగున్ = దొరుకును; ఉండుము = ఉండుము; అనరాదు = అనకూడదు;

గురుఁడవు = గురుదేవుడవు; యోగి = యోగులలో; విభుఁడవు = శ్రేష్ఠుడవు; ఆవున్ = ఆవుకు; పిదికిన = పాలు పితుకుటకు పట్టు; తడవు = సమయము; ఎంత = ఎంతో; అంత = అంత; సేపు = సమయము; కాని = తప్పు; ఒక = ఒకే; దెసన్ = స్థలములో; ఉండవు = ఉండవు; కరుణ = దయ; తోడన్ = కలిగి; చెప్పవే = చెప్పుము; తండ్రి = తండ్రీ; ముక్తి = ముక్తి; కిన్ = కి; చేరు = చేరుటకు; తెరువు = దారి – పద్ధతి.

భావము:- అవధూతలతో అగ్రగణ్యుడవు. అవ్యక్తమైన గమనంకలవాడవు. నీ సందర్శనం వ్యర్థం కాదు, నావాంఛితార్థం ముమ్మూటికి సిద్ధిస్తుంది. ఈనాడో రేపో దేహాన్నే త్యజించబోయే జీవికి సంసారబంధాలు సమసిపోయి మోక్షం ప్రాప్తించే నిమిత్తం చింతింపవలసిందీ, జపించవలసిందీ, చేయవలసిందీ, వినవలసిందీ, సేవలందించవలసిందీ ఏమిటో దయచేసి విశదీకరించమని వేడుకొంటున్నాను. నీవు జగద్గురుడవు. నీకు తెలియంది ఏమి లేదు. ఆవు నుండి పాలను పిదికినంత సేపటి కంటే ఎక్కువ సేపు ఎక్కడా ఉండవు. నిన్ను ఉండమని అనరాదు. అయినా, ఓ దయగల తండ్రీ! మోక్ష మార్గాన్ని నాకు తెలియజెప్పు అని అడుగుతున్నాను."

## 1-527-వ.

## అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె"నని చెప్పి.

టీక:- అని = అని; పరీక్షిత్ = పరీక్షత్తు అను; నర = నరులకు; ఇంద్రుండు = ప్రభువు – మహారాజు; బాదరాయణిన్ = బాదరాయణుని కుమారుని – శుకుని; అడిగెన్ = అడిగెను; అని = అని; చెప్పి = చెప్పి.

భావము:- అని పరీక్షిన్నరేంద్రుడు వ్యాసపుత్రుడైన శుకబ్రహ్మను అడిగెను"అని చెప్పి

## పూర్ణి

## ★1-528-క.

రాజీవపత్రలోచన!

రాజేంద్ర కిరీట ఘటిత రత్న మరీచి

భ్రాజితపాదాంభోరుహా!

భూజనమందార! నిత్యపుణ్యవిచారా!

టీక:- రాజీవ = తామర; పత్ర = రేకుల వంటి; లోచన = కన్నులు ఉన్న వాడా; రాజ = రాజులలో; ఇంద్ర = శ్రేష్ఠుల యొక్క; మహా రాజుల యొక్క; కిరీట = కిరీటములలో; ఘటిత = పొదగ బడిన; రత్న = రత్నముల

యొక్క; మరీచి = కాంతి చేత; భ్రాజిత = ప్రకాశించుచున్న; పాద = పాదములు అను; అంభోరుహ = పద్మములు కలవా డా; భూ = భూమి పై; జన = జనించిన జీవులకు; మందార = కల్పవృక్షమా {(మందార – కల్పవృక్షము వలె కోరికలు తీర్చు వాడు), (మంద + ఆర = అజ్ఞాన ఛేధకుడు)}; నిత్య = నిత్యమును; పుణ్య = పుణ్యాత్ముల గురించి; విచారా = ఆలోచించు వాడా – పాలించు వాడా.

భావము:- కలువరేకుల వంటి కన్నులు కల వాడా! మహారాజుల కిరీటాలలోని మణుల కాంతులు ప్రతిఫలిస్తున్న పాదపద్మాలు కల వాడా! భూలోకవాసుల పాలిటి కల్పవృక్షమా! మంచివారిని ఎల్లప్పుడు పాలించు వాడా! నమస్కారము.

ఇది ప్రథమ స్కంధాంత స్తోత్రం., కళ్ళు కలువరేకులవలె అందంగా ఉన్నాయి అంటే స్వామి చక్కటి అనుగ్రహాల్ని వర్షిస్తూ ఉంటావు అని. లోకంలోని మహారాజులు సైతం నీపాదాభివందనాలు చేస్తుంటారు కనుక వారి కిరీటాలలోని మణుల కాంతులు నీ పాదాలపైన నిత్యం పడుతుంటాయి అంటే అంతటి శక్తిసామర్థ్యాలతో మమ్ము పాలిస్తావు అని. భూలోకులకు మందార అంటే ఆ మహారాజులు నుండి జనసమాన్యం వరకు మేమెవరి మైనా వలసినవి అనుగ్రహిస్తావు అని. ఎప్పుడు పుణ్యాత్ముల క్షేమ సమాచారాలు చూస్తుంటావు అంటే పుణ్యులమైన మమ్ము పాలిస్తుంటావు అని.

★1-529-మాలి.

అనుపమగుణహారా! హన్యమా నారివీరా!
జన వినుతవిహారా! జానకీ చిత్త చోరా!
దనుజ ఘన సమీరా! దానవశ్రీ విదారా!
ఘన కలుష కఠోరా! కంధి గర్వాపహారా!

టీక:- అనుపమ = సాటి లేని; గుణ = గుణములు అను; హారా = హారము కల వాడా; హన్యమాన = చంపబడిన; అరివీరా = శత్రువీరులు కల వాడా; జన = జనుల చేత; వినుత = స్తుతింప దగ్గ; విహారా = విహారములు కల వాడా; జానకీ = జానకి యొక్క; చిత్త = మనస్సును; చోరా = దొంగిలించిన వాడా; దనుజ = రాక్షసులు అను; ఘన = మేఘములకు; సమీరా = వాయువు వంటి వాడా; దానవ = దానవుల; శ్రీ = ని; విదారా = విదళించు వాడా, బ్రద్దలు కొట్టు వాడా; ఘన = అత్యధిక, కరడు గట్టిన; కలుష = పాపుల ఎడ; కఠోరా = కఠోరముగా ఉండు వాడా; కంధి = సముద్రుని; గర్వ = గర్వమును; అపహారా = తొలగించిన వాడా.

భావము:- సాటిలేని కల్యాణ గుణ హారుడా! వైరులందరు పరాజితులుగా గల వీరుడా! సర్వ లోకాలకు స్తుతింప తగిన విహారాలు గల మహాత్మా! సీతా మానస చోరుడా! శత్రువులనే మేఘాల పాలిటి సమీర మైన వాడా! రాక్షసుల వైభవాలు విదళించే వాడా! కరడు గట్టిన కలుషాత్ముల పాలిటి అతి కఠినుడా! సముద్రుని సమస్త గర్వాన్ని హరించిన వాడా! దయతో చిత్తగించుము.

1-530-గ.

**ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహా పురాణంబు నందు నైమిశారణ్య వర్ణనంబును, శౌనకాదుల ప్రశ్నం బును, సూతుండు నారాయణకథా సూచనంబు సేయుటయు, వ్యాస చింతయు, నారదాగమనంబును, నారదుని పూర్వకల్ప వృత్తాంతం బునుఁ, బుత్రశోకాతురయైన ద్రుపదరాజనందన కర్జునుం డశ్వత్థామం దెచ్చి యొప్పగించి గర్వపరిహారంబు సేయించి విడిపించు టయు, భీష్మనిర్యాణంబును, ధర్మనందను రాజ్యాభిషేకంబును, గోవిందుని ద్వారకా గమనంబును, విరాటకన్యకాగర్భ విద్యమానుండైన యర్భకు నశ్వత్థామ బాణా నలంబు వలనం బాపి విష్ణుండు రక్షించు టయుఁ, బరీక్షిజ్జన్మంబును, గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిర్గమం బును, నార దుండు ధర్మజునకుఁ గాలసూచనంబు సేయుటయుఁ, గృష్ణనిర్యాణంబు విని పాండవులు మహాపథంబునం జనుటయు, నభిమన్యుపుత్రుండు దిగ్విజయంబు సేయుచు శూద్రరాజలక్షణ లక్షితుండగు కలిగర్వంబు సర్వంబు మాపి గోవృషాకారంబుల నున్న ధరణీ ధర్మదేవతల నుద్ధ రించుటయు, శృంగిశాపభీతుండై యుత్తరానందనుండు గంగాతీరంబునం బ్రాయోపవేశంబున నుండి శుక సందర్శనంబు సేసి మోక్షోపాయం బడుగటయు నను కథలు గల ప్రథమ స్కంధము సంపూర్ణము.**

టీక:- ఇది = ఇది; శ్రీ = శ్రీ; పరమేశ్వర = ఉత్కృష్టమైన ఈశ్వరుడు; శివుని; కరుణా = దయ వలన; కలిత = పుట్టిన వాడును; కవితా = కవిత్వ రచనములో; విచిత్ర = విశేషమైన చిత్రములు కలవాడును; కేసనమంత్రి = కేసన మంత్రికి; పుత్ర = పుత్రుడును; సహజ = స్వాభావికముగా అబ్బిన; పాండిత్య = పాండిత్యము కలవాడును; పోతనామాత్య = పోతనామాత్యునిచే; ప్రణీతంబు = చక్కగా రచింపబడినది; ఐన = అయినట్టి; శ్రీ = శుభకరమైన; మహా = గొప్ప; భాగవతంబు = భాగవతము; అను = అను; మహా = గొప్ప; పురాణంబు = పురాణము; అందున్ = లో; నైమిశ = నైమిశము అను; అరణ్య = అడవి; వర్ణనంబును = వర్ణనమును; శౌనక = శౌనకుడు; ఆదుల = మొదలగు వారి; ప్రశ్నంబును = ప్రశ్నలును; సూతుండు = సూతుడు; నారాయణ = విష్ణుమూర్తి {నారాయణుడు – నారములందు ఉండువాడు హరి}; కథ = కథల యొక్క, గ్రంథమునకు; సూచనంబు = ప్రారంభమును; సేయుటయున్ = చేయుటయును; వ్యాస = వ్యాసుని; చింతయున్ = విచారమును; నారద = నారదుని; ఆగమనంబును = వచ్చుటయును; నారదుని = నారదుని; పూర్వ = పూర్వ; కల్ప = జన్మ; వృత్తాంతంబును =

సమాచారమును; పుత్ర = పుత్రులను గూర్చిన; శోక = శోకము వలన; ఆతుర = కలత చెందినది; ఐన = అయినట్టి; ద్రుపద = ద్రుపద {ద్రుపద రాజ నందన - ద్రౌపది}; రాజ = రాజు యొక్క; నందన = కుమార్తె; కున్ = కి; అర్జునుండు = అర్జునుండు; అశ్వత్థామన్ = అశ్వత్థామను; తెచ్చి = తీసుకొని వచ్చి; ఒప్పగించి = అప్పజెప్పి; గర్వ = గర్వమునకు; పరిహారంబు = పరిహారము; చేయించి = చేయించి; విడిపించుటయున్ = విడిపించుటయును; భీష్మ = భీష్ముని; నిర్యాణంబును = నిర్యాణమును; ధర్మనందను = ధర్మరాజునకు {ధర్మనందనుడు — యమధర్మ రాజు పుత్రుడు ధర్మరాజునకు}; రాజ్యా = రాజ్యమును; అభిషేకంబును = అభిషేకము చేయించుటయును; గోవిందుని = శ్రీకృష్ణుని {గోవిందుడు - గోవులకు ఒడయుడు, శ్రీకృష్ణు}; ద్వారక = ద్వారకకు; ఆగమనంబును = వచ్చుటయును; విరాట = విరాటుని {విరాట కన్యక - విరాట రాకుమారి, ఉత్తర. అభిమన్య ఉత్తరల పుత్రుడు - పరీక్షిత్తు}; కన్యక = పుత్రిక యొక్క; ఆగర్భ = గర్భమందు; విద్యమానుండు = ప్రవర్తమానుడు; ఐన = అయినట్టి; అర్భకున్ = పిల్లవానిని; అశ్వత్థామ = అశ్వత్థామ; బాణ = బాణము యొక్క; అనలంబు = అగ్ని; వలనన్ = వలని బాధలను; పాపి = పోగొట్టి; విష్ణుండు = విష్ణువు; రక్షించుటయున్ = రక్షించుటయును; పరీక్షిత్ = పరీక్షిత్తు; జన్మంబును = జన్మించుటయును; గాంధారీ = గాంధారియును; ధృతరాష్ట్ర = ధృతరాష్ట్రుడును; విదురుల = విదురుల; నిర్గమంబును = నిష్క్రమణమును; నారదుండు = నారదుడు; ధర్మజున = ధర్మరాజు; కున్ = కి; కాల = (రాబోవు) కాలమును; సూచనంబు = సూచించుటలు; సేయుటయున్ = చేయుటయున్; కృష్ణ = శ్రీకృష్ణుని; నిర్యాణంబు = నిర్యాణమును — వెడలిపోవుటను; విని = విని; పాండవులు = పాండురాజు పుత్రులు; మహా = మహా; పథంబునన్ = ప్రస్థానమునకు; చనుటయున్ = వెళ్ళుటయును; అభిమన్యుపుత్రుండు = పరీక్షిన్మహారాజు; దిగ్విజయంబున్ = దిగ్విజయయాత్ర; చేయుచు = చేయుచు; శూద్ర = శూద్రుని యొక్క; రాజ = రాజుల యొక్కయు; లక్షణ = లక్షణములు; లక్షితుండు = తో ఉన్నవాడు; అగు = అయిన; కలి = కలియొక్క; గర్వంబు = గర్వము; సర్వంబు = అంతయు; మాపి = పోగొట్టి; గో = గోవు; వృష = ఎద్దు; ఆకారంబులన్ = రూపములలో; ఉన్న = ఉన్నటువంటి; ధరణీ = వసుంధరా; ధర్మ = ధర్మ; దేవతలన్ = దేవతలను; ఉద్ధరించుటయున్ = ఉద్ధరించుట యును; శృంగి = శృంగి యొక్క; శాప = శాపము వలన; భీతుండు = భయపడినవాడు; ఐ = అయి; ఉత్తర = ఉత్తరయొక్క; నందనుండు = పుత్రుడు; గంగా = గంగానదీ; తీరంబునన్ = తీరములో; ప్రాయోపవేశంబునన్ = మరణాయత్త దీక్షలో; ఉండి = ఉండి; శుక = శుకుని; సందర్శనంబు = సందర్శనము — చూచుట; చేసి = చేసి; మోక్ష = మోక్షమునకు; ఉపాయంబు = ఉపాయము; అడుగటయున్ = అడుగుటయును; అను = అనే; కథలున్ = కథలు; కల = ఉన్నట్టి; ప్రథమ = మొదటి; స్కంధము = స్కంధము; సంపూర్ణము = సంపూర్ణము.

భావము:- భాగవతమనే మహాపురాణాన్ని పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్రుడూ, కేసనామాత్యుని పుత్రుడూ, సహజపాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించాడు; ఈ మహాగ్రంథంలో నైమిశారణ్య వర్ణనమూ; శౌనకాది మహర్షుల సంప్రశ్నమూ; సూతులవారి నారాయణ కథా సూచనమూ; వ్యాసులవారి విచారమూ; నారదాగమనమూ; నారదులవారి పూర్వజన్మ వృత్తాంతమూ; ద్రౌపది పుత్రశోకంతో పరితపించడమూ; అర్జునుడు అశ్వత్థామను బంధించి తీసుకొనిరావడమూ; అశ్వత్థామ గర్వ పరిహారమూ; భీష్ముని నిర్యాణమూ; ధర్మరాజు పట్టాభిషేకమూ; శ్రీకృష్ణుని ద్వారకాగమనమూ; ఉత్తరా గర్భస్థుడైన అర్భకుణ్ణి అశ్వత్థామ అస్త్ర జ్వాల నుంచి విష్ణుమూర్తి రక్షించడమూ; పరీక్షిత్తు పుట్టడమూ, గాంధారీ, ధృతరాష్ట్ర, విదురుల నిర్యాణమూ; నారదుడు ధర్మరాజునకు భవిష్యత్తు సూచించడమూ; కృష్ణుడు అవతారం చాలించడమూ;

పాండవుల మహాప్రస్థానమూ; పరీక్షిత్తు దిగ్విజయమూ; కలి గర్వం సమస్తమూ తప్పించడమూ; భూ ధర్మదేవతలను ఉద్ధరించడమూ; శృంగిశాపానికి భయంతో పరీక్షిత్తు గంగ ఒడ్డున ప్రాయోపవేశము చేపట్టడమూ; శుకముని దర్శనముచేసి మోక్షోపాయం అడుగడమూ అనెడి కథలు కలిగిన ప్రథమ స్కందము సంపూర్ణము.

*ఓం నమో భగవతే వాసుదేవాయ॥*

*ఓం। ఓం। ఓం।*

*ఓం। శాంతిః। శాంతిః। శాంతిః।*

*సర్వే జనా స్సుఖినో భవతు॥*

# అనుబంధము

## బమ్మెఱ పోతనామాత్య వంశవృక్షము

పటం 1 (శ్రీ మహా భాగవతం ప్రకారం) –ఈ పటంలో గల వ్యక్తుల పేర్లు 11:-

భీమన మంత్రి; అన్నయ; గౌరమాంబ; సోమన మంత్రి; మల్లమ; ఎల్లన; మాచమ; కేతన / కేసయ; లక్కమాంబ; తిప్పన; పోతన.

పటం 2 (వీరభద్ర విజయం ప్రకారం) –ఈ పటంలో గల వ్యక్తుల పేర్లు 20:-

అన్నయ; అన్నయ; అయ్యల ప్రగ్గడ; ఇమ్మడి; ఎల్లన; కేసన / కేసయ; గోపన; గౌరమాంబ; తిప్పన; పోతన; భీమన; మల్లమ; మల్లయ; మాచమ; మాచమాంబ; మాచయ; మాధవుడు; రేచన; లక్కమాంబ / లక్ష్మి; సోమన మంత్రి.

**వంశవృక్షం**
**బమ్మెర పోతన**

**తెలుగు భాగవతం**
**1-24-సీ.**

↓
కౌండిన్య గోత్రం
ఆపస్తంబ సూత్రం
బమ్మెర వంశం
↓
భీమన మంత్రి
↓
~ అన్నయ
గౌరమాంబ
↓
~ సోమన మంత్రి
మల్లమ
↓
~ ఎల్లన
మాచమ
↓
~ కేతన / కేసయ
లక్కమాంబ
↓
↓ ↓
తిప్పన [1] **పోతన [2]**

భాగవతము – గాయత్రి

ఓం శ్రీ గురుభ్యోనమః

శ్రీమత్ పోతన తెలుగు భాగవతము – గాయత్రీ మహా మంత్రము.

1-35-వ.

ఇట్లు "సత్యంపరంధీమహి" యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీ నామ బ్రహ్మ స్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసుర వధం బును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి, యీ పురాణంబు శ్రీమహా భాగవతం బన నొప్పుచుండు.

పోతన తెలుగు భాగవత కథా ప్రారంభ ఇలా మొదలైంది. "సత్యం పరం ధీమహీ" అనే గాయత్రీ మహా మంత్రంతో ప్రారంభిపబడింది కనుక గాయత్రి 'పర బ్రహ్మ స్వరూపం' అయ్యింది; మత్స్యపురాణంలో "గాయత్రిని మించుతు ధర్మ ప్రస్తారాన్ని, వృత్రాసుర సంహారాన్ని అభివర్ణించే గ్రంథాన్ని భాగవతం అంటారు" అని ప్రమాణీకరించబడింది. ఇట్లే స్కాంధపురాణంలో "హయగ్రీవ బ్రహ్మ విద్య మరియు పారమహంస్యము కలది వృత్రాసుర సంహారాన్ని అభివర్ణించే గ్రంథం గాయత్రీ మంత్రంతో కూడినది భాగవతం" అని ప్రమాణీకరించబడింది. కాబట్టి శ్రీమద్భాగవతం తన సార్థక నామధేయంతో ప్రసిద్ధి చెందింది. పోతనామాత్యుల వారిచే తెలుగీకరింప బడుటచే యిమ్మహాగ్రంథం శ్రీమత్ "పోతన తెలుగు భాగవతం" అని లోకంలో తెలియబడుతు ఉన్నది.

శ్లో. యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః|
వృత్రాసుర వధోపేతం తద్భాగవతమిష్యతే||
లిఖిత్వా తచ్చయో దద్యాద్ధేమసింహ సమన్వితమ్|
ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం స యాతి పరమం పదమ్||
అష్టాదశ సహస్రం తత్పురాణం పరికీర్తితమ్|| – మత్స్య పురాణం

శ్లో. గ్రంథోష్టాదశ సాహస్రో ద్వాదశ స్కంధ సమ్మితః|
హయగ్రీవ బ్రహ్మ విద్యా యత్ర వృత్ర వధాస్తథా|
గాయత్ర్యా చ సమారంభస్తద్వై భాగవతం విదుః|| – సాంధపురాణం

భాగవతము కలియుగమున మానవ కోటికి ఏకైక ముక్తి సోపానము. అందుకే పెద్దలు అంటారు "చదువుకుందాం భాగవతం; బాగుపడదాం; మనం అందరం". ఇంతటి వరేణ్యానికి మూల కారణం, అది గాయత్రిని అధికరించిన మహా మంత్ర స్వరూపం కావటం. ఇక్కడ అధికరించిన అంటే అధికం చేయబడిన, వ్యాహృతి గావింపబడిన అని గ్రహించ వచ్చును. గాయత్రి మహా మంత్రం ఓంకార రూపం కనుక సాక్షాత్ శక్తి స్వరూపం. పర బ్రహ్మ తత్వం అని చెప్పబడుతుంది. ఓంకారం త్రైవర్ణాత్మకం.

---

అకార, ఊ కార, పూర్ణానుస్వరములు అనే మూడు వర్ణాలు లేదా శబ్దాల సమన్వితం. అకారం ఆరంభానికి, సృష్టికి, సృష్టికర్తకు ప్రతీక అనవచ్చు. ఇది ద్వి మాత్ర పరిమితం. ద్వితీయ భావంతోనే సృజన ఆరంభం. పూర్ణం ఇది లయానికి, ప్రళయానికి, శివునికి ప్రతీక అనవచ్చు. ఇది కూడ ద్వి మాత్ర పరిమితం. ద్వితీయ భావన ఏకంలో లయించటం పూర్ణత్వం. ఉన్నది అనుకున్నది ఖాళీ కావటం అదే అనంతంతో నిండిపోవటం. ఊ కారం స్థితికి, విశ్వానికి, సర్వ వ్యాపకానికి, విష్ణునికి ప్రతీక అనవచ్చు. ఇది త్రి మాత్ర పరిమితం. కార్య, కారణ, కర్తృత్వ ఆదుల సమన్వితం.

ఓంకారం బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే త్రిమూర్తులకు, సత్వరజస్తమము లనే త్రిగుణాలకి, భూఃభువస్సువః అనే త్రిలోకాలకు, బ్రహ్మచర్య గృహస్త వానప్రస్త లనే ఆశ్రమ త్రయానికి, బ్రహ్మణ, క్షత్రియ, శూద్ర అనే త్రైవర్ణికానికి, ఋగ్యజుస్సామ ములనే త్రయి రూప వేదానికి, త్రికోణాత్మకమైన శక్తి స్వరూపికి, జాగృతి నిద్రా సుషుప్తులనే అవస్థా త్రయానికి మున్నగు వానికి అధిదేవత. ఇవి గాయత్రీ మహా మంత్రానికి, భాగవత మహా పురాణానికి సంపూర్ణంగా అన్వయిస్తాయి.

వీటికి అతీతమైనది తురీయం, నాలుగవది. గాయత్రీ మంత్రంలో మూడు పాదాలు వరకు సామాన్యులకు అర్హం. తురీయ పాదం, తురీయాశ్రమం సన్యాసంలో పరిణితి అందుకున్న వారికి అర్హం అయింది. ఆ తురీయావస్థ ముక్తి, మోక్షం, వైకుంఠం. . . అంటుంది భాగవతం. ఈ త్రయీ మార్గం దృష్టితో ఓంకారం, గాయత్రీ మహా మంత్రం, భాగవతం మధ్య సమత్వ ముంది.

ఇలా భాగవతం దేనితో సరిపోల్చ బడినదో అట్టి పరబ్రహ్మ స్వరూప మైన గాయత్రీ మంత్రం సాక్షాత్ పరదేవతా స్వరూపమే. గాయత్రీ అంతరార్థాన్ని మహాత్మ్యాన్ని ఎంతటి వారైనా ఎంత కాలం ప్రయత్నించినా సంపూర్ణంగా వివరించ గలుగుట సాధ్యం కాదు. అంతటి గాయత్రి గురించి గాయత్రి మహాత్యం గురించి సహజంగానే మహా పురుషులు మహర్షులు అనేకులు అనేక విధాలగా ప్రవచించారు ప్రస్తుతించారు. శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ విమలానంద నృసింహ భారతీ స్వామి, గుంటూరు వారు గాయత్రీ మంత్రార్థ విచారాన్ని నిరూపించే వివరణ ఒక చక్కటి పట్టిక రూపంలో అనుగ్రహించారు. ఓంకార పూర్వకంగా అనుష్టించే గాయత్రీలోని నాలుగవపాదం పొందడానికి సర్వసంగ పరిత్యాగులకే అర్హత ఉంది. కనుక మూడు పాదాల నిరూపణ అనుగ్రహింప బడింది. ఆ పట్టిక వివరాన్ని గాయత్రీ యంత్ర పటాన్ని మీతో పంచుకొనే అదృష్టం అనుగ్రహించిన గురుదేవులకు, విశ్వగురువు శ్రీకృష్ణ భగవానులకు పాదాభివందానాలు తెలుపు కుంటు ఇక్కడ ఉంచుతున్నాను.

## గాయత్రి పట్టిక

## గురుభ్యోనమః

ఓం శ్రీ గాయత్రి మహా మంత్రార్థ విచార నిరూపణ పట్టిక – త్రిపద గాయత్రి

(గురూపదేశమున సర్వసంగపరిత్యాగులు చతుష్పదను పొందవచ్చు)

ఇది శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ విమలానంద నృసింహ భారతీ స్వామి గుంటూరు వారిచే 1965లో ప్రచురింపబడిన విగ్రహారాధన పరమార్థము అను గ్రంథము యొక్క అనుబంధము నుండి గ్రహింపబడినది – గురుతుల్యులు, గణనాధ్యాయికి సోదరతుల్యులు, శ్రీ నేమాని కాశీపతి వారు వ్రాసుకొన్న వ్రాతప్రతికి నకలు అనుగ్రహించారు అది:-

### గాయత్రి

గాయాతం త్రాయతే యితి గాయత్రీః = జపించు వారిని తరింప జేయునది

సవితుః = సకలాన్ని సృష్టించేవాడు

### ఓం+వ్యాహృతి+సావిత్రి||

వేదమాతాయ విద్మహే|

విప్రప్రియాయ ధీమహీ|

తన్నోః శ్రీ గాయత్రీ ప్రచోదయాత్||

ఓం గాయత్రీ పాహిమాం| ఓం గాయత్రీ రక్షమాం||



గాయత్రీ యంత్రము

| సం. | అక్షరః | ఋషిః | ఛంధః | దేవతాః | వర్ణః | తత్వః |
|---|---|---|---|---|---|---|
| 1 | త | వశిష్టః | గాయత్రీ | అగ్నిః | చంపక | పృథివీః |
| 2 | త్స | భరద్వాజః | ఉష్టిక్ | వాయుః | అతసీ | ఆపః |
| 3 | వి | గౌతమః | అనుష్టుప్ | సోమః | విద్రుమ | తేజః |
| 4 | తు | భృగుః | భృహతీ | ఈశానః | స్పటిక | వాయుః |
| 5 | ర్వ | శాండిల్యః | పంజ్కిః | ఆదిత్యః | పద్మ | ఆకాశః |
| 6 | రే | లోహితః | త్రిష్టుప్ | బృహస్పతీః | తరుణాదిత్య | గంధః |
| 7 | ణి | గర్గః | జగతీ | పితరః | శంఖ | రసః |
| 8 | యం | శాతాతపః | అతిజగతీ | భర్గః | కుంద | రూపః |
| 9 | భ | సనత్కుమారః | పద పంజ్కిః | అర్యమాః | ఇందు | స్పర్శః |
| 10 | ర్గో | కశ్యపః | విష్టార పంజ్కిః | సవితః | ప్రవాళ | శబ్దః |
| 11 | దే | అత్రిః | విరాట్ | త్వష్టః | పద్మ | ఉపస్థః |
| 12 | వ | భార్గవః | అక్షర పంజ్కిః | పుషిః | పద్మరాగ | పాయుః |
| 13 | స్య | పరాశరః | కాత్యాయన | ఇంద్రః | వజ్ర | పాదః |
| 14 | ధీ | పుండరీకః | జ్యోతిష్మతీః | వాయుః | చంద్ర | పాణిః |
| 15 | మ | క్రతుః | త్రిష్టుప్ | వాసుదేవః | మౌక్తిక | వాక్ |
| 16 | హి | దక్షః | జాగరితః | మిత్రావరుణః | కుంకుమ | ఘ్రాణం |
| 17 | ధి | ఆంగిరాః | జగతీ | ధాతాః | అంజన | జిహ్వా |
| 18 | యో | కార్తికేయః | సంయః | విశ్వేదేవాః | గంగ | చక్షుం |
| 19 | యో | ముద్గలః | మహః | విష్ణుః | వైఢూర్య | త్వక్ |
| 20 | నః | ఉశనాః | భూః | వాసవః | క్షౌద్ర | శ్రోత్రం |
| 21 | ప్ర | రోమశః | భువః | సర్వదైవత్యం | హరిద్ర | మనః |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 22 | చో | మృగః | సువః | కుబేరః | దుగ్ధ | బుద్ధిః |
| 23 | ద | అగస్త్యః | భూర్భువః | అశ్వినీ | సూర్య | చిత్తం |
| 24 | యాత్ | విశ్వామిత్రః | గాయత్రీ | బ్రహ్మ | సుకపించ | అహంకార |

| సం. | అక్షరః | శక్తిః | ముద్రాః | కళాః | ఫలః | బీజః |
|---|---|---|---|---|---|---|
| | త | ప్రహ్లాదినీ | సుముఖం | తపసీ | మోక్షదం | ఆం |
| 2 | త్స | ప్రభా | సంపుటం | సకలా | ఆరోగ్యదం | ఈం |
| 3 | వి | సత్యా | వితతం | విశ్వా | ఐశ్వర్యదం | ఊం |
| 4 | తు | విశ్వభద్రా | విస్తృతం | తుషా | ధనదం | ఔం |
| 5 | ర్వ | విలాసినీ | ద్విముఖం | వరదా | కామదం | ఇౌం |
| 6 | రే | బ్రావతీ | త్రిముఖం | రేవతీ | విద్యాదం | ఐం |
| 7 | ణి | జయా | చతుః | సూక్ష్మా | కామదం | ఔం |
| 8 | యం | శాంతా | పంచముఖం | జ్ఞానా | ధనదం | సం |
| 9 | భ | కాళీ | షణ్ముఖం | భర్గో | సంతతిదం | హం |
| 10 | ర్గో | దుర్గా | అధోముఖం | గోమతీ | అభీష్టదం | లం |
| 11 | దే | సరస్వతీ | వ్యాపికాంజలికం | దర్వికా | ఇష్టకన్యాదం | క్షం |
| 12 | వ | విద్రుమా | శకటం | ధ్యానాం | కాంతిదం | కం |
| 13 | స్య | విశాలా | యమపాశం | సిద్ధాత | చింతితసిద్ధిదం | ఖం |
| 14 | ధీ | ఈశాని | గ్రథితం | ధ్యానాం | కీర్తిదాయకం | గం |
| 15 | మ | వ్యాపినీ | సన్ముఖోన్ముఖం | సుర్యాదా | సౌభాగ్యదం | ఘం |
| 16 | హి | విమలా | ప్రలంబం | స్ఫుటా | అభీష్టసిద్ధిదం | ఙం |
| 17 | థి | తమోహారిణీ | ముష్టికం | బుద్ధిః | త్రైలోక్యమోహదం | చం |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 18 | యో | సూక్ష్మా | మత్స్యం | యోగమాతా | పరాశ్రయఘుమత్ | ఛం |
| 19 | యో | విశ్వయోనిః | కూర్మం | యోగాంతరా | దేవప్రతిగ్రహదోషమత్ | జం |
| 20 | నః | జయావహా | వరాహకం | పృథివీ | త్రైలోక్యదం | ఝం |
| 21 | ప్ర | పద్మాలయ | సింహాక్రాంతం | ప్రభవా | ప్రజానుగ్రహాశక్తిదం | ఞం |
| 22 | చో | పద్మశోభ | మహాక్రాంతం | ఉష్మా | తేజసాతిజయదం | టం |
| 23 | ద | పద్మరూపా | మద్గరం | విద్యుమానా | స్వర్గప్రదం | ఠం |
| 24 | యాత్ | బ్రాహ్మీ | పల్లవం | నిరంజనా | స్వర్గలోకప్రదంv | పం జం<br>స్రః |

| సం. | అక్షరః | స్వరః | స్వరూపః | స్థానః | సిద్ధిః |
|---|---|---|---|---|---|
| 1 | త | ఉదాత్తః | త్రిమూర్త్యాత్మకం | పాదాంగుష్టః | అజ్ఞాన దోష పరిహారం |
| 2 | త్స | అనుదాత్తః | వాయవ్యాత్మకం | గుల్ఫమధ్యే | ఉపపాతకహరం |
| 3 | వి | – | సోమాత్మకం | జంఘే | మహాపాతకహరం |
| 4 | తు | ఉదాత్తః | విశ్వధరాత్మకం | జానూ | దుష్టగ్రహదోషహరం |
| 5 | ర్వ | – | సోమాత్మకం | ఊరూ | భ్రూణహత్యాదోషహరం |
| 6 | రే | – | తరుణాత్మకం | గుహ్యం | అగమ్యాగమనహరం |
| 7 | ణి | స్వరితః | బృహస్పత్యాత్మకం | వృషాణీ | అభక్ష్యాభక్షణహరం |
| 8 | యం | ప్రచయః | చంద్రాత్మకం | కటి | బ్రహ్మహత్యాహరం |
| 9 | భ | ఉదాత్తః | పర్జన్యాత్మకం | నాభి | పురుషహత్యాదోషహరణం |
| 10 | ర్గో | స్వరితః | ఇంద్రాత్మకం | ఉదరం | గోహత్యాదోషహరణం |
| 11 | దే | అనుదాత్తః | గంధర్వాత్మకం | స్తనం | స్త్రీహత్యాదోషహరణం |
| 12 | వ | ఉదాత్తః | పూషాత్మకం | హృదయం | గురుహత్యాదోషహరణం |
| 13 | స్య | స్వరితః | మిత్రాత్మకం | కంఠం | మానసికపాపహరణం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 14 | ధీ | అనుదాత్తః | త్వష్టాత్మకం | వదనం | పితృమాతృవధదోషహరణం |
| 15 | మ | – | వాసవాత్మకం | తాలుమధ్యం | పూర్వజన్మార్జితపాపహరణం |
| 16 | హి | – | మరుదాత్మకం | నాసాగ్రం | అశేషపాపహరణం |
| 17 | థి | ఉదాత్తః | సోమాత్మకం | నేత్రం | ప్రాణివధపాపహరణం |
| 18 | యో | స్వరితః | యామాత్మకం | భ్రూమధ్యం | ప్రతిగ్రహదోషహరణం |
| 19 | యో | ఉదాత్తః | విశ్వేదేవాత్మకం | లలాటం | సర్వపాపవినాశనపాపహరణం |
| 20 | నః | అనుదాత్తః | అశ్వ్యిన్యాత్మకం | పశ్చిమముఖం | ఈశ్వరపదప్రాప్తిః |
| 21 | ప్ర | – | ప్రజాపత్యాత్మకం | ఉత్తరముఖం | విష్ణుపదసిద్ధిః |
| 22 | చో | – | సర్వదేవతాత్మకం | దక్షిణముఖం | రుద్రపదసిద్ధిః |
| 23 | ద | ఉదాత్తః | రుద్రాత్మకం | పూర్వముఖం | బ్రహ్మపదసిద్ధిః |
| 24 | యాత్ | – | బ్రహ్మాత్మకం | ఊర్ధ్వముఖం | బ్రహ్మ విష్ణు రుద్ర ప్రసాద సిద్ధిః |

# నైమిశారణ్యం – గణన

## నైమిశారణ్యం-పదాలు

నైమిశారణ్యం వర్ణిస్తూ వాడిన పదాలలో ఉపమానం చెప్పదగిన వాటికి చెందిన పదాలకు చెందిన నానార్థాలు సరిపోయేలా వాడారు;

ఆ పదాలు వాటి రెండు రకాల అర్థాలు జాబితా క్రింద ఇవ్వబడ్డాయి:-

| వ. సం | పదం | వనానికి చెందిన అర్థం | నానార్థం | ఉపమాన పదం |
|---|---|---|---|---|
| 1 | మాధవి | పూలగురివింద గురువింద | లక్ష్మి | విష్ణువు అంతఃపురం |
| 2 | మన్మథ | వెలగ చెట్లు | మన్మథుడు | విష్ణువు అంతఃపురం |
| 3 | శారద | ఏడాకులఅరటి చెట్లు | సరస్వతీదేవి | బ్రహ్మలోకం |
| 4 | వహ్ని | చిత్రమూలం | అగ్నిదేవుడు | శివుడి సభ |
| 5 | వరుణ | ఉలిమిరి చెట్లు | వరుణదేవుడు | శివుడి సభ |
| 6 | సమీరణ | మరువము | వాయుదేవుడు | శివుడి సభ |
| 7 | చంద్ర | పెద్ద ఏలకి చెట్లు క్యేలకి పూలు | చంద్రుడు | శివుడి సభ |
| 8 | రుద్ర | రుద్రాక్ష | ఏకాదశ రుద్రులు | శివుడి సభ |
| 9 | హైమవతి | కరక చెట్లు | పార్వతీదేవి | శివుడి సభ |
| 10 | కుబేర | నంది వృక్షాలు | కుబేరుడు | శివుడి సభ |
| 11 | వృషభ | అడ్డపర చెట్లు | వృషభవాహనము | శివుడి సభ |
| 12 | గాలవ | లొద్దుగ చెట్లు | గాలవముని | శివుడి సభ |
| 13 | శాండిల్య | మారేడు చెట్లు | శాండిల్య ముని | శివుడి సభ |
| 14 | పాశుపత | శ్రీవల్లీ చెట్లు | శివభక్తులు | శివుడి సభ |

| | | | | |
|---|---|---|---|---|
| 15 | జటి పటల | జువ్వి చెట్లు | ముని సమూహముల | శివుడి సభ |
| 16 | ఐరావత | నారిజ చెట్లు | ఏనుగు ఐరావతము | ఇంద్రుడి ఇల్లు |
| 17 | అమృత | ఉసిరిక చెట్లు | అమృతము | ఇంద్రుడి ఇల్లు |
| 18 | రంభ | అరటి చెట్లు | అప్సరస రంభ | ఇంద్రుడి ఇల్లు |
| 19 | గణిక | అడవిమొల్లలు<br>సన్నజాజి (అడవి మల్లె) | దేవవేశ్యల | ఇంద్రుడి ఇల్లు |
| 20 | ఉన్మత్త | ఉమ్మెత్త | మదించిన | మురాసురుడి ఇల్లు |
| 21 | రాక్షస | బలురక్కెస | రాక్షసుల | మురాసురుడి ఇల్లు |
| 22 | వంశ | వెదురు | సమూహాలు | మురాసురుడి ఇల్లు |
| 23 | శంఖ | శంఖాలు | నవనిధులు లోని శంఖము | కుబేరుడి ఖజానా |
| 24 | పద్మ | పద్మ పుష్పాలు | నవనిధుల లోని పద్మము | కుబేరుడి ఖజానా |
| 25 | కుంద | మొల్లలు<br>కుంద మల్లి | నవనిధుల లోని కుందము | కుబేరుడి ఖజానా |
| 26 | ముకుంద | ఎర్ర తామరలు | నవనిధుల లోని ముకుందము | కుబేరుడి ఖజానా |
| 27 | నిరంతర | దట్టమైన | అంతరము లేని | రాముడి యుద్ధం |
| 28 | శర | రెల్లు పొదలు | బాణ | రాముడి యుద్ధం |
| 29 | అనలశిఖ | శక్రపుష్పి పూవులు | అగ్నిజ్వాలలు | రాముడి యుద్ధం |

| | | | | |
|---|---|---|---|---|
| 30 | బహుళంబు | తఱచుగా ఉన్నది | అనేకం ఉన్నది | రాముడి యుద్ధం |
| 31 | అర్జునోద్భేదం బు | మద్ది అంకురాలు కలది | కార్తవీర్యార్జుని సంహారం కలది | పరశురాముడి యుద్ధం |
| 32 | అరిష్ట | వేప చెట్లు | అరిష్టాసురుడు | రాక్షసుల యుద్ధాలు |
| 33 | జంభ | నిమ్మ చెట్లు | జంభాసురుడు | రాక్షసుల యుద్ధాలు |
| 34 | నికుంభ | దంతి చెట్లు | నికుంభాసురుడు | రాక్షసుల యుద్ధాలు |
| 35 | ద్రోణ | తుమ్మ చెట్లు | ద్రోణుడు | కురుపాండవుల యుద్ధం |
| 36 | అర్జున | మద్ది చెట్లు | అర్జునుడు | కురుపాండవుల యుద్ధం |
| 37 | కాంచన | సంపెంగ చెట్లు<br>కాంచన (సంపంగి) | బంగారు | కురుపాండవుల యుద్ధం |
| 38 | స్యందన | నిమ్మి చెట్లు | రథాలు | కురుపాండవుల యుద్ధం |
| 39 | కదంబ | కడిమి చెట్లు<br>కదంబము (కడిమి) | సమూహము | కురుపాండవుల యుద్ధం |
| 40 | మహోన్నత | చాలా ఎత్తైన | చాలా ఉన్నతమైన | కురుపాండవుల యుద్ధం |

| | | | | |
|---|---|---|---|---|
| 41 | శల్య | మంగ చెట్లు<br>కొండ మంగ పూలు | శల్యుడు | కర్ణుడి యుద్ధం |
| 42 | సహకారం | మామిడి చెట్లు కలది | సహాయం కలది | కర్ణుడి యుద్ధం |
| 43 | నల | వట్టివేరు | నలు డనే వానర వీరుడు | రామసేతువు నిర్మాణం |
| 44 | నీల | నీలి చెట్లు | నీలు డనే వానర వీరుడు | రామసేతువు నిర్మాణం |
| 45 | పనస | పనస చెట్లు | పనసు డనే వానర వీరుడు | రామసేతువు నిర్మాణం |
| 46 | అద్రి | చెట్ల | (వానరులనే) కొండల | రామసేతువు నిర్మాణం |
| 47 | నానా | వివిధ రకాలైన | వివిధము లైన | శివ భజన |
| 48 | అశోక | అశోక చెట్లు<br>అశోకము | శుభ | శివ భజన |
| 49 | లేఖా | పంక్తుల కొద్దీ | పత్రికల | శివ భజన |
| 50 | ఫలితంబు | వృక్షాలు ఉన్నదై | ఫలితాన్ని ఇచ్చేది | శివ భజన |
| 51 | పున్నాగ | సుర పొన్నలు | పున్నాగ పుష్పాల<br>పున్నాగ | మన్మథుడి విల్లు |
| 52 | శిలీముఖ | తుమ్మెదల | బాణాల | మన్మథుడి విల్లు |
| 53 | కేసర | పొన్న చెట్లు | జూలు | నరసింహరూపం |
| 54 | కరజ | కానుగ చెట్లు | గోళ్ళు | నరసింహ రూపం |

| | | | | |
|---|---|---|---|---|
| 55 | నట | దుండిగ చెట్లు | నటులు | నాట్యరంగం |
| 56 | నటీ | దొండ చెట్లు | నటీమణులు | నాట్యరంగం |
| 57 | సుషిర | గువ్వగుతిక చెట్లు | వాద్యవిశేషాలు | నాట్యరంగం |
| 58 | చందన | చందనవృక్షాలు<br>చందన (మంచి<br>గంధము) చెట్టు | మంచిగంధము | పార్వతీదేవి నుదురు |
| 59 | కర్పూరతిలకా | కలిగొట్లు బొట్టుగ చెట్ల | కర్పూరతిలకము | వర్షాకాలం రాక |
| 60 | ఇంద్రబాణాస<br>న | మరువం నల్లగోరింట<br>వేగిస చెట్లు | ఇంద్రధనస్సు | వర్షాకాలం రాక |
| 61 | మేఘ | తుంగముస్తెలు చెట్లు | మేఘాలు | వర్షాకాలం రాక |
| 62 | కరక | దానిమ్మ చెట్లు<br>పూలు (దాడిమ<br>పువ్వులు) | వడగళ్లు | వర్షాకాలం రాక |
| 63 | గాయత్రీ | చండ్ర చెట్లు | గాయత్రీ మంత్రం | వేదములు |
| 64 | విరాజితంబు | మంచి పంక్తులు కలది | ప్రకాశిస్తున్నది | వేదములు |
| 65 | సరళ | తెల్లతెగడ చెట్లు | సరళత్వము | మహాకావ్యం |
| 66 | మృదులతా | కోమలమైన తీగలు | సౌకుమార్యములు | మహాకావ్యం |
| 67 | సుపర్ణ | సుందరమైన ఆకులు | గరుత్మంతుడు | వినత గృహం |
| 68 | సుమనస్ | మంచి పుష్పాల | దేవతలు | అమరవతీ నగరం |
| 69 | మధు | పూదేనె | మధుడనే రాక్షస<br>వీరుడు | కైటభాసురుడి సభ |

| | | | | |
|---|---|---|---|---|
| 70 | అమృత | తియ్యని | మోక్షమును | విష్ణుభక్తి |
| 71 | ఫలదంబు | పండ్లుకలది | ప్రసాదించేది | విష్ణుభక్తి |
| 72 | పరాగంబు | పుప్పొడి కలది | ధూళి కలది | అర్జునుడి సేన |
| 73 | హరి | సింహము | విష్ణుమూర్తి | వైకుంఠపురం |
| 74 | ఖడ్గ | ఖడ్గమృగము | (నందకము) | వైకుంఠపురం |
| 75 | పుండరీక | బెబ్బులి | పండరీకుడు | వైకుంఠపురం |
| 76 | విలసితంబు | క్రీడలు కలది | ప్రకాశిస్తున్నది | వైకుంఠపురం |
| 77 | కృష్ణసార | నల్లజింకలు | కృష్ణుని శక్తిసామర్థ్యాలు | నందుడి గొల్లపల్లి |
| 78 | రామ | పెద్దదుప్పి | రాముడు | లంకానగరం |
| 79 | మహిషి | దున్నపోతు | భార్య | లంకానగరం |
| 80 | వంచక | నక్క | వంచించినవా డైన రావణాసురుడు | లంకానగరం |
| 81 | గజ | ఏనుగులు | వానర వీరుడు | సుగ్రీవుడి సైన్యం |
| 82 | గవయ | కురుఃబోతులు | వానర వీరుడు | సుగ్రీవుడి సైన్యం |
| 83 | శరభ | శరభమృగము | వానర వీరుడు | సుగ్రీవుడి సైన్యం |
| 84 | నీలకంఠ | నెమళ్ళు | శివుడు | నారాయణస్థానం |
| 85 | హంస | హంసలు | పరమహంసలు | నారాయణస్థానం |
| 86 | కౌశిక | గుడ్లగూబలు | కౌశిక మహర్షి | నారాయణస్థానం |
| 87 | భరద్వాజ | ఏంట్రిత పక్షులు | భరద్వాజ మహర్షి | నారాయణస్థానం |
| 88 | తిత్తిరి | తీతువు పక్షులు | తిత్తిరి మహర్షి | నారాయణస్థానం |
| 89 | ఏకచక్ర | చక్రవాక పక్షులు | ఏకచక్రపురము | మహాభారతం |
| 90 | బక | కొంగ | బకాసురుడు | మహాభారతం |
| 91 | కంక | రాబందులు | కంకుభట్టుగ (ధర్మరాజు) | మహాభారతం |

| | | | | |
|---|---|---|---|---|
| 92 | ధార్తరాష్ట్ర | హంసలు {దార్తరాష్ట్ర – కాళ్ళు, ముక్కు ఎఱ్ఱగాను, మిగతా శరీరం తెల్లగా నుండే హంసలు} | ధృరాష్ట్రుని కొడుకు లైన కౌరవులు | మహాభారతం |
| 93 | శకుని | శకుని పక్షులు | శకుని | మహాభారతం |
| 94 | నకుల | ముంగిసలు | నకులుడు | మహాభారతం |
| 95 | ఉరుతర | మంచి | మేలుజాతి | సూర్యరథం |
| 96 | ప్రవాహంబు | జల ప్రవాహాలు కలది | గుఱ్ఱములు కలది | సూర్యరథం |
| 97 | బహువితత | మిక్కిలి | మిక్కిలి విశాలమైన | వానాకాలపు సంధ్యాసమయం |
| 98 | జాతిసామన స్యంబు | జాజిపూలు కలది | జాతీయ భావాలు కలది | వానాకాలపు సంధ్యాసమయం |

## నైమిశారణ్యంలోని జీవాల గణన

నైమిశారణ్యంలో ఉన్నాయి అని వర్ణించిన వివిధ జీవాలకు చెందిన పదాల గణాంకాలు:-

(అ) నైమిశారణ్యంలోని జీవాల సంఖ్యలు

(అ) కీటక పదాలు = 1 (ఆ) జంతు పదాలు = 11

(ఇ) జలచర పదాలు = 1 (ఈ) పక్షులు పదాలు = 10

(ఉ) వృక్ష పదాలు = 66

(ఆ) నైమిశారణ్యంలోని జీవాల గణన

*(అ) కీటకము 1 తుమ్మెదలు*

*(ఆ) జంతువిలు*

1 ఏనుగులు 2 కురుఁబోతులు 3 ఖడ్గమృగము 4 దున్నపోతు

5 నక్క 6 నల్లజింకలు 7 పెద్దదుప్పి 8 బెబ్బులి

9 ముంగిసలు 10 శరభమృగము 11 సింహము

(ఇ) జలచరములు 1 శంఖాలు

(ఈ) పక్షులు

| | | | |
|---|---|---|---|
| 1 ఏంట్రిత పక్షులు | 2 కొంగ | 3 గుడ్లగూబలు | 4 చక్రవాక పక్షులు |
| 5 తీతువు పక్షులు | 6 నెమళ్ళు | 7 రాబందులు | 8 శకుని పక్షులు |
| 9 హంసలు | 10 హంసలు | | |

(ఉ) వృక్ష

| | | | |
|---|---|---|---|
| 1 అడవిమొల్లలు | 2 అడ్డపర చెట్లు | 3 అరటి చెట్లు | 4 అశోక చెట్లు |
| 5 ఉమ్మెత్త | 6 ఉలిమిరి చెట్లు | 7 ఉసిరిక చెట్లు | 8 ఎర్ర తామరలు |
| 9 ఏడాకులఅరటి | 10 కడిమిచెట్లు | 11 కరకచెట్లు | 12 కలిగొట్లు బొట్టుగ |
| 13 కానుగ చెట్లు | 14 కోమలమైనతీగ | 15 గువ్వగుతిక | 16 చంద్ర |
| 17 చందనవృక్షాలు | 18 చిత్రమూలం | 19 జాజిపూలు | 20 జువ్వి |
| 21 తుంగముస్తెలు | 22 తుమ్మ చెట్లు | 23 తెల్లతెగడ | 24 దంతి |
| 26 దానిమ్మ | 27 దుండిగ చెట్లు | 28 దొండ | 29 నంది వృక్షాలు |
| 30 నారిజ చెట్లు | 31 నిమ్మ చెట్లు | 32 నిమ్మి చెట్లు | 33 నీలి చెట్లు |
| 34 పండ్లుకలది | 35 పద్మ పుష్పాలు | 36 పనస చెట్లు | 37 పుప్పొడి కలది |
| 38 పూదేనె | 39 పూలగురివింద | 40 పెద్ద ఏలకి | 41 పొన్న చెట్లు |
| 42 బలురక్కెస | 43 మంగ చెట్లు | 44 మంచిపుష్పాలు | 45 మద్ది అంకురాలు |
| 46 మద్ధి | 47 మరువం | 48 మరువము | 49 మామిడి చెట్లు కలది |
| 50 మారేడు చెట్లు | 51 మొల్లలు | 52 రుద్రాక్ష | 53 రెల్లు పొదలు |
| 54 లొద్దుగ చెట్లు | 55 వట్టివేరు | 56 వృక్షాలున్నద్రై | 57 వెదురు |
| 58 వెలగ చెట్లు | 59 వేప చెట్లు | 60 శక్రపుష్పి | 61 శ్రీవల్లీ చెట్లు |
| 62 సంపెంగ చెట్లు | 63 సుందరమైన ఆకులు | | 64 సుర పొన్నలు |
| 65 నల్లగోరింట చెట్లు | | 66 వేగిస చెట్లు | |

## అవతారాలు

| ఏకవింశత్యవతారాలు (21) | పంచవింశతి అవతారాలు (25) | దశావ తారాములు (10) |
|---|---|---|
| 1-63-వ. | ద్వితీయస్కంధము | 11-71-వ. |
| 1 కౌమారాఖ్య | నారదునికి ఉపదేశించే నాటికి, 18 | 1 మత్స్యావతారము |
| 2 యజ్ఞవరాహ | 1 ఆదిపురుష (2-112-చ) | 2 కూర్మావతారము |
| 3 నారద | 2 యజ్ఞవరాహ(2-115-మ) | 3 వరాహావతారము |
| 4 నరనారాయణ | 3 సుయజ్ఞ (2-117-వ) | 4 నరసింహావతారము |
| 5 కపిల | 4 కపిల (2-119-చ) | 5 వామనావతారము |
| 6 దత్త | 5 దత్తాత్రేయ (2-121-సీ) | 6 పరశురామావతారము |
| 7 యజ్ఞేశ్వర | 6 సనకసనందన (2-123-సీ) | 7 రఘురామావతారము |
| 8 ఉరుక్రమ | 7నరనారయణ (2-125-క,134-) | 8 బలరామావతారము |
| 9 పృథ | 8 ధ్రువ (2-136-సీ) | 9 బుద్ధావతారము |
| 10 మీనా | 9 పృథ (2-138-ఉ) | 10 కల్క్యవతారము. |
| 11 కూర్మ | 10 వృషభ (2-139-వ) | మొత్తం = 10 అవతారాలు. |
| 12 ధన్వంతరి | 11 హయగ్రీవ (2-140-చ) | ... |
| 13 జగన్మోహిని | 12 మత్స్య (2-142-సీ) | ... |
| 14 నరసింహ | 13 కూర్మ (2-144-మ) | . |
| 15 వామన | 14 నృసింహ (2-146-మ) | . |
| 16 పరశురామ | 15 ఆదిమూల (2-148-మ) | . |
| 17 వ్యాస | 16వామన(2-150-సీ,2-151-చ) | . |
| 18 శ్రీరామ | 17 హంస (2-152-వ) | . |
| 19 బలరామ | 18 మనువు (2-152-వ) | . |
| 20 శ్రీకృష్ణ | పిమ్మట 6అవతారాలు నడిచాయి | . |
| 21 జైన | 19 ధన్వంతరి (2-152-వ) | . |
| మొత్తం 21 అవతారాలు | 20 పరశురామ (2-153-మ) | . |

| | | |
|---|---|---|
| భవిష్యత్తులో కల్కి | 21 శ్రీరామ (2-155-సీ.2-171-సీ) | . |
| . | 22శ్రీకృష్ణ(2-173-సీ,2-192-మ) | . |
| . | 23వ్యాస(2-194-చ) | . |
| . | 24బుద్ధ(2-196-మ) | . |

## అరిషడ్వర్గాలు - వివరణ

వర్గము = చిత్తవృత్తి ఉదాహరణ

కామము = మిక్కలిగా సంపాదించ వలెనని యావకల చిత్తవృత్తి.

*(నరకాసుర, జరాసంధు లనేక స్త్రీలను, రాజులను చెఱపట్టి నశించుట.)*

క్రోధము = తన పనికి విఘ్నము కలిగించిన వాని శిక్షించవలె ననెడి చిత్తవృత్తి.

*(శిశుపాలుడు తను కోరిన రుక్మిణిని కృష్ణుడు వివాహ మాడెనని కృష్ణుని క్రోధించి నశించుట.)*

లోభము = తనకు లభించిన దానిని ఇతరులకు ఇవ్వలేని చిత్తవృత్తి.

*(దుర్యోధనుడు లోభం వలన నశించుట.)*

మోహము = పుత్ర, కళత్ర, ధనాదుల ఎడ మిక్కుటమైన తగులము కల చిత్తవృత్తి.

*(దశరథుడు కైక మీది మోహముచేత నశించుట.)*

మదము = జన్మ, విద్య, ధన, వైభ వాదుల కలిమి వలన గర్వాంధం కల చిత్తవృత్తి.

*(కార్తవీర్యుని పుత్రుల మదము వలన నశించుట.)*

మాత్సర్యము = తన కంటె ఎక్కుడు భోగాలు కల వారి యందు ఓర్వ లేకపోవు చిత్తవృత్తి.

(శిశుపాలుడు కృష్ణుని వైభవము చూసి ఓర్వలేక వదరి నశించుట)

# రాగద్వేషాలు – వివరములు

10.2-1077-సీ

త్రయోదశ రాగద్వేషములు – 1రాగము 2ద్వేషము 3కామము 4క్రోధము 5లోభము 6మోహము 7మదము 8మాత్సర్యము 9ఈర్ష్య 10అసూయ 11దంభము 12దర్పము 13అహంకారము.

వాటి వివరములు – – – – – –

1 = రాగము = పరస్త్రీ విషయకముగ కలిగెడి చిత్తవృత్తి = రావణాసురుడు సీతను చెరపట్టి రాగము చెంది ఆ రాగము వలన నశించుట.

2 = ద్వేషము = అపకారముచేసినవానికి మరల అపకారము చేయవలెననెడి చిత్తవృత్తి = హిరణ్యకశిపుడు అన్నని హరి చంపెనని హరిని ద్వేషించి నశించుట.

3 = కామము = మిక్కలిగా సంపాదించవలెనని యావ కల చిత్తవృత్తి = నరకాసురుడు, జరాసంధుడు అనేక స్త్రీలను, రాజులను చెఱపట్టి నశించుట.

4 = క్రోధము = తన పనికి విఘ్నము కలిగించిన శిక్షించవలెననెడి చిత్తవృత్తి = శిశుపాలుడు తను వివాహమాడదలచిన రుక్మిణిని కృష్ణుడు వివాహమాడెనని కృష్ణుని క్రోధించి నశించుట.

5 = లోభము = తన లభించిన దానిని ఇతరులకు ఇవ్వలేని చిత్తవృత్తి = దుర్యోధనుడు లోభము వలన నశించుట.

6 = మోహము = పుత్ర కళత్ర ధనాదుల ఎడ మిక్కుటమైన తగులము కల చిత్తవృత్తి = దశరథుడు కైకమీది మోహముచేత నశించుట.

7 = మదము = కలిమి వలన గర్వాంధము కల చిత్తవృత్తి = కార్తవీర్యుని పుత్రుల మదము వలన నశించుట.

8 = మాత్సర్యము = తన కంటె ఎక్కుడు భోగములు కల ఇతరులందు ఓర్వలేకపోవు చిత్తవృత్తి = శిశుపాలుడు కృష్ణుని వైభవము చూసి ఓర్వలేక వదరి నశించుట.

9 = ఈర్ష్య = తనకు వచ్చిన కష్టము ఇతరులకు రావలెననెడి చిత్తవృత్తి = అరుణాసురుడు తోటి బాణాసురునకు దుఃఖమురాగోరి నశించుట.

10 = అసూయ = తనకు కలిగిన సుఖము ఇతరులకు కలుగ రాదను చిత్తవృత్తి = పౌండ్రక వాసుదేవుడు కృష్ణుని ఎడల అసూయ వలన నశించుట.

11 = దంభము = గొప్పలు చెప్పుకొని ఇతరులనుండి అధిక మెచ్చుకోలు ఆశించు చిత్తవృత్తి = అపూర్వుడు తన యాగము అతి విశిష్ఠత్వమనెడి దంభము వలన దూర్వాసుని చేత భంగపడుట.

12 = దర్పము = సాటిలేని వాడననెడి చిత్తవృత్తి = రావణాసురుడు అధిక దర్పమువలన నశించుట.

13 = అహంకారము = అధిక సామర్థ్యుడనని ఇతరులుకు అపకారము చేయు చిత్తవృత్తి = మధుకైటభులు అహంకారము వలన నశించుట.

## అక్షౌహిణి వివరణ

అక్షౌహిణి – సేనాసమూహవిశేషము

- ఒక పత్తి = 1 రథం + 1 ఏనుగు + 3 గుర్రాలు + 5 కాలిబంట్లు కలిస్తే
- పత్తి x 3 =సేనాముఖము (అంటే 3 రథములు + 3 ఏనుగులు + 9 గుర్రాలు + 15 కాలిబంట్లు)
- సేనాముఖము x 3 =గుల్మము (అంటే 9 రథములు + 9 ఏనుగులు + 27 గుర్రాలు + 45 కాలిబంట్లు)
- గుల్మము x 3 =గణము (అంటే 27 రథములు + 27 ఏనుగులు + 81 గుర్రాలు + 135 కాలిబంట్లు)
- గణము x 3 =వాహిని (అంటే 81 రథములు + 81 ఏనుగులు + 243 గుర్రాలు + 405 కాలిబంట్లు)
- వాహిని x 3 =పృతన (అంటే 243 రథములు + 243 ఏనుగులు + 729 గుర్రాలు + 1215 కాలిబంట్లు)
- పృతన x 3 =చమువు (అంటే 729 రథములు + 729 ఏనుగులు + 2187 గుర్రాలు + 3645 కాలిబంట్లు)
- చమువు x 3 =అనీకిని (అంటే 2187 రథములు + 2187 ఏనుగులు + 6561 గుర్రాలు + 10935 కాలిబంట్లు)
- అనీకిని x 10 =అక్షౌహిణి (అంటే 21870 రథములు + 21870 ఏనుగులు + 65610 గుర్రాలు + 109350 కాలిబంట్లు).

అక్షౌహిణి కన్నా పెద్దవి – సుగ్రీవుని సైన్యము లెక్క

| | | | |
|---|---|---|---|
| అక్షౌహిని | X 18 =ఏకము | కుముదము | X 8 =పద్మము |
| ఏకము | X 8 =కోటి (కోటి సంఖ్య కాదు) | పద్మము | X 8 =నాడి |
| కోటి | X 8 =శంఖము | నాడి | X 8 =సముద్రము |
| శంఖము | X 8 =కుముదము | సముద్రము | X 8 =వెల్లువ |

అంటే =36691,71,39,200 సైన్యాన్ని వెల్లువ అంటారు.

గమనిక :-ఇలాంటి 70 వెల్లువలు సుగ్రీవుని దగ్గర ఉన్నట్లుగా కంబ రామాయణం చెపుతుంది. ఆ వెల్లువ అంటే 366917139200 X 70 = 2,5684239,97,44,000 మంది వానర వీరులు సుగ్రీవుని దగ్గర వుండేవారు.వీరికి నీలుడు అధిపతి.గమనిక – (వికిపీడియా నుండి గ్రహించడమైనది)

# వసుదేవుని భార్యలు

వసుదేవుని భార్యలు - కృష్ణుని తల్లులు

1-260 –వ

శ్రీకృష్ణుడు తల్లుల కేడ్వురకు మ్రొక్కెను. వారు వసుదేవుని భార్యలైన దేవకుని పుత్రికలు 7గురు.

10.2-1129వ.

అని యభ్యర్థించి యమ్మునీంద్రుల యాజకులంగా వరించి, యప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామితవైభవంబున, నష్టాదశ భార్యాసమేతుండై దీక్షఁ గైకొని, యమ్మహాధ్వరంబు

## వసుదేవుని భార్యలు 18మంది.

(10.2-1129-వ.)

1) భోజవంశమున పుట్టిన దేవకుని కుమార్తెలు 7గురు(కృష్ణుని తల్లులు)

(1) ధృతదేవి, (2) శాంతిదేవి, (3) ఉపదేవి, (4) శ్రీదేవి, (5) దేవరక్షిత, (6) సహదేవి, (7) దేవకీదేవి,

మరియు

2) పురువంశమున పుట్టిన 7గురు(బలరాముని తల్లులు)

(1) పౌరవి, (2) రోహిణి, (3) మధిరా, (4) రోచన, (5) ఆది (6) వైశాఖి (7)భద్ర

3) వీరుకాక వసుదేవునికి

(15) సునామ్నీ (16) కౌసల్య, (17) ఇళ అనే మరి ముగ్గురు భార్యలు కలరు.

### 4) మరొక భార్య (18) కూడ కలదు.

గమనిక -

5) దేవకీదేవి పుత్రుడు కృష్ణుడు

6) రోహిణి పుత్రుడు బలరాముడు

